To
my lovely better half.
Smt. R. Madhavi Latha

From
R. S. Murali with Reddy

Rs 40 P 00

యూరి అజారొవ్

# పిల్లల పెంపకంలో మెళకువలు



"ప్రగతి" ప్రచురణాలయం
మాస్కో

అనువాదం: నిడమర్తి ఉమారాజేశ్వరరావు

చిత్రాలు: వై. షబేల్నిక్

**Юрий Азаров**

ПЕДАГОГИКА СЕМЕЙНОГО ВОСПИТАНИЯ

*На языке телугу*

**Yuri Azarov**

A BOOK ABOUT BRINGING UP CHILDREN

*In Telugu*



సోవియట్ యూనియన్‌లో ముద్రింపబడింది

A $\frac{4312000000-040}{014(01)-90}$ 297—90

ISBN 5-01-002363-6

# వి ష య సూ చి క



1*

# వివిధ జాతుల పిల్లలు

సోవియట్ యూనియన్‌లో పిల్లల రిపబ్లిక్ ఒకటి వుంది. అది ఆర్తెక్‌లోని అఖిల యూనియన్ యువ పయనీర్ శిబిరం. నల్ల సముద్ర తీరంలో వున్న ఆ శిబిరం క్రైమియా దక్షిణ తీరాన ఐదు కిలోమీటర్ల పొడవున విస్తరించి వుంది. అక్కడకి సెలవలకి సోవియట్ యూనియన్‌లోని వివిధ జాతులకీ, అనేక యితర దేశాలకీ చెందిన పిల్లలు వస్తూ వుంటారు.

1977 వేసవిలో ఆర్తెక్‌లో అంతర్జాతీయ బాలబాలికల ఉత్సవం ఒకటి జరిగింది. అక్కడకి నేనొక అతిథిగా వెళ్లాను. అక్కడ నేను ఒక నెలపాటు ఐదు ఖండాలనుంచీ వచ్చిన అంతర్జాతీయ యువ పౌరుల మధ్య గడిపాను.

పిల్లలందరూ భిన్నభిన్నంగా వుంటారని ప్రత్యేకించి చెప్పనక్కర్లేదు. వాళ్లు తమ తల్లితండ్రుల, తమతమ దేశాల సంశ్లిష్ట వైరుధ్యాలను కలిగివుంటారు. పిల్లల అభివృద్ధిలో సమాజపు ప్రభావాన్ని ఎవరూ కాదనలేరు. పిల్లలు పిల్లలే. అయితే బాల్యంలో పిల్లలకి వాళ్ల సొంత నియమాలు, తార్కిక అభివృద్ధి, ఆటపాటలు, ఆసక్తులు వుంటాయి. అందుకే పిల్లలు పరస్పరం ఒకరితో మరొకరు అంత తొందరగా నేస్తులయ్యారు.

పాఠకుడికి ఆర్తెక్‌లోని కొందరు బాలమిత్రులతో పరిచయంచెయ్యాలని కోరుతున్నాను.

...కాలిఫోర్నియాకి చెందిన పధ్నాలుగేళ్ల మార్క్ మాక్‌ఫర్ట్ "యువ పయనీర్ సమితి అధ్యక్ష స్థానానికి నేను నా పేరు ప్రతిపాదించవచ్చునా?" అని ప్రశ్నించడం చాలమంది ఉపాధ్యాయులకి ఆశ్చర్యం కలిగించింది. మొదటి కొద్ది రోజులపాటు అతను "రైతుగా వుండేందుకు గర్విస్తున్నాను" అని రాసివున్న సాసరంత పెద్ద బాడ్జి తగిలించుకొని తిరిగే వాడట. పిల్లలని ఇంటర్వ్యూ చేసినప్పుడు, వాళ్లు రకరకాల జవాబులు చెప్పారు. ఆస్ట్రేలియానుంచి వచ్చిన ఒక అమ్మాయి "పుస్తకాలు చదవడం, సంగీతం వినడం అంటే నాకు ఇష్టం" అని చెప్పింది. "చీకటి రాత్రులన్నా, నా జుట్టు విరబోసుకోవడం అన్నా నాకు ఇష్టం" అంది ఒక ఫ్రెంచి అమ్మాయి. పధ్నాలుగేళ్ల రైతు బిడ్డ మార్క్ మాక్‌ఫర్ట్ "నాకు నా దేశం అంటే, నా తల్లితండ్రులంటే చాలా ప్రేమ" అని సగర్వంగా చెప్పాడు.

అమెరికన్ బృందానికి దుబాసీ, మాస్కోలోని అంతర్జాతీయ సంబంధాల ఇన్‌స్టిట్యూట్ విద్యార్థి అయిన సాష త్రెపెల్కోవ్ మార్క్‌ను గురించి యిలా చెప్పాడు: "అతను ఏకాగ్రత కలిగినవాడు, పరిశ్రమ చేసే స్వభావం గలవాడు, సమర్థుడు. భోజనాల హాలులో నేల ఊడ్వడం, కడగడం, మానిటరుగా వుండటం, ఏ రకమైన పని అయినా సరే చేసేందుకు అతను యిష్టపడతాడు. మాస్కోలో తిరిగినప్పుడు అమెరికన్ పిల్లల్లో చాలామంది అలిసిపోయారు, కాని మార్క్ మాత్రం అలుపూ సొలుపూ ఎరగడు. అతను నమ్మశక్యం కానంత శక్తి కలిగినవాడు."

మార్క్‌కి తన సొంత సేవింగ్స్ బాంకు అక్కౌంటులో దాదాపు మూడు వేల డాలర్లు వున్నాయి. మా సంభాషణ క్రమంలో అతను యిలా చెప్పాడు: "నేను వ్యవసాయ క్షేత్రంలో ఎనిమిదేళ్లుగా పనిచేస్తున్నాను. నాకు చిన్నతనంనుంచీ పనిచేసే అలవాటు వుంది. నేను ఏ మాదిరి పని చేస్తానంటారా? పదేళ్ల వయస్సునుంచీ నేను ట్రాక్టరు డ్రైవు చేస్తున్నాను. తోట సంరక్షణ చూస్తున్నాను. ఏడేళ్ల వయస్సప్పటినుంచి వ్యవసాయ క్షేత్రంలో నీరుపెట్టే పని నేనే చూస్తున్నాను. మాకు 75 హార్స్‌పవరు పంపు వుంది. దాన్ని ఆన్‌చేసి, హోస్ పైపుతో మొక్కలకి నీళ్లు పెడుతూ వుంటాను."

అతనికి తనమీద తనకి జాలి కలిగించాలన్న స్పష్టమైన ఉద్దేశంతో, "బహుశా నీకు నీ వయస్సు పిల్లలతో బయటకి పోయి, ఆడుకోవాలని వుంటుందేమో కదూ?" అన్నాను.

"ఓ.కే." అన్నాడు మార్క్ నా ఉద్దేశం తెలుసుకున్నానన్నట్లు చిరునవ్వు నవ్వుతూ. "ఈ వినోదాలు, ఆటపాటలు, క్రీడలు బడిలో చూసుకుంటాం."

"మరి బడి తర్వాత నువ్వేం చేస్తావు?"

"బడి తర్వాత ప్రతి రోజూ మూడు గంటలపాటు పనిచేస్తాను. గుర్రాల సాల శుభ్రం చేస్తాను. ట్రాక్టరు, తదితర యంత్ర పరికరాలు మరమ్మతు చేస్తాను. నేను మా నాన్నతో లాస్ ఏంజెల్స్‌కి పోయి, లోడింగులో సాయంచేస్తాను."

"నువ్వు తరచుగా సినిమాలకి వెళ్తూ వుంటావా?"

"ఏడాదికి మహా అయితే ఓ ఐదు సార్లు వెళ్తాను."

"మరి వేసవి కాలాల్లో ఏం చేస్తావ్?"

"వేసవిలో మేము రోజంతా పనిచేస్తాం" అని చెప్పి, యిలా జోడించాడు: "అయితేనేం, నేను నా ట్రొంబోన్ వాయించుకునేందుకు తీరిక చిక్కించుకుంటాను. రోజుకి ఒక గంటైనా వాయిస్తాను."

నేను జాక్ లండన్, హెమింగ్వే, స్టీన్‌బెక్, సాలింజెర్, ఫాక్నర్ అనే ఐదుగురు సుప్రసిద్ధ అమెరికన్ రచయితల పేర్లు చెప్పి, వాళ్లని గురించి నీకు ఏమి తెలుసునని అడిగాను.

మార్క్ యిలా జవాబిచ్చాడు: "జాక్ లండనూ, హెమింగ్వే గొప్ప రచయితలని నేను విన్నాను. కావచ్చు. నాకు వాళ్లని గురించి బొత్తిగా ఏమీ తెలియదు. ఇకపోతే, మిగిలినవాళ్ల పేర్లు సైతం నేను వినలేదు."

మా సంభాషణ హిప్పీలమీదకి మళ్లింది. మార్క్ నిస్సంకోచంగా అన్ని రకాల హిప్పీలకీ తను వ్యతిరేకినని ఢంకా బజాయించినట్లు చెప్పాడు.

"హిప్పీలు తమని తాము మిగిలిన ప్రపంచంనుంచీ, మన రోజువారీ బాదరబందీలనుంచీ వేరుచేసుకోవాలని ప్రయత్నిస్తారు. జీవితంపట్ల వాళ్ల వైఖరి నాకు గిట్టదు. మనిషికి ఒకే ఒక్క జీవితం వుంటుంది గనుక, మనిషి సుఖసంతోషాలకోసం బతకాలి అని వాళ్లు భావిస్తారు. చుట్ట, బీడీ, సిగరెట్లలో, సారాయిలు తాగడంలో, మత్తు మందు వాడకంలో వాళ్లు ఆనందంకోసం వెతుక్కుంటారు" అన్నాడు మార్క్.

మీ నాన్నగారిలో అన్నిటి కంటె ముఖ్యంగా ఏ గుణాలంటే నీకు ఇష్టం అని నేను మార్క్ని ప్రశ్నించాను.

మార్క్ ఒక క్షణం ఆలోచించి, "సరిపుచ్చుకోకపోయే స్వభావం. రైతులకు మరిన్ని హక్కులు సాధించడంకోసమే కాకుండా, ఆయన ఎప్పుడూ ఏదో ఒకదానికోసం పోరాడుతూ వుంటాడు" అని చెప్పాడు.

"మా సోవియట్ పిల్లలంటే నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాను.

"పిల్లలంటే పిల్లలే" అన్నాడు మార్క్ పెద్దవాడి లాగ.

నేను మార్క్కి ఇంటర్వ్యూ యిచ్చినందుకు కృతజ్ఞత చెప్పినప్పుడు, అతను యథాలాపంగా నా వీపు తట్టాడు.

అతని చకాపికీ వ్యవహార సరళినీ, కష్టపడి పనిచేసే లక్షణాన్నీ అభినందించకుండా ఎవరూ వుండలేరని నాకు అనిపించింది. అతని గాంభీర్యత, లోకజ్ఞానం నా మనస్సును ఆకట్టుకున్నాయి. మరైతే, అతని బాల్యం సంగతి ఏమిటి? అతి చిన్నతనంనుంచీ అతని నిరంతర జీవిత పోరాటంలో బాల్యానికి చోటెక్కడ వుంది? మార్క్ తండ్రి దివాళాతీసిన రైతు కుటుంబాలను సహకార సంఘంలో సమీకరించేందుకు ప్రయత్నిస్తున్నాడు. వాళ్ల కష్టాలను కడగళ్లను, భవితవ్యాన్ని యీ బాలుడు తనకి సహజసిద్ధమైన దృష్టితో గమనించాడు. "మనికి" కోసం పోరాటం అనేది అతని దృష్టిలో ఎంత భయంకరమైనది? మార్క్ చిన్నతనం నుంచీ పనిచేస్తూ వున్నాడన్న అంశం నాకు నచ్చింది. అయితే అతని శ్రమ పోటీకి సంబంధించిన కఠోర నియమాలకు సరిపుచ్చుకోవడానికి కాక, ఒక నైతిక ప్రమాణాన్ని నెలకొల్పేందుకు ఉపలక్షింపబడితే, నాకు మరింతగా నచ్చి వుండేది. అతని తండ్రి అతనికి "మంచివాడివిగా ఉండేందుకు శ్రమ చెయ్యి" అని చెప్పలేదు. దానికి బదులు, అతనికి రెండేళ్లప్పటినుంచీ "నువ్వు నీ వంతులో, యీ దురదృష్టవంతుల కర్మకి గురి కాకుండా వుండేందుకని, పని చెయ్యి" అని అతని తండ్రి గుర్తుచేశాడు.

...మేము నలుగురం — దుబాసీ ఈరా, ఇద్దరు ఫ్రెంచి ఉపాధ్యాయినులూ, నేనూ — మాట్లాడుకుంటున్నాం. పధ్నాలుగేళ్ల ఫ్రెంచి కుర్రాడు క్లాడ్ ఉపాధ్యాయిని దగ్గరకి వచ్చి, తన చేతుల్ని ఆమె మెడకి వాటేసి, ఆమె ఒళ్లో కూర్చున్నాడు. ఆ కుర్రాడి కొట్ట

వచ్చినట్లు కనిపించే సద్యోజనితమైన ప్రవర్తనని గమనించకుండా ఎవరూ ఉండలేరు. అతని ఉపాధ్యాయినులు చెప్పినదాన్ని బట్టి క్లాడ్ గుణాల్లో కెల్ల గొప్పది, అతని నిర్మొగమాటం. "అతను బహుశా ఏ ఉగ్రవాద బృందంలోనో చేరుతాడు" అని జోడించారు వాళ్ళు. క్లాడ్ ముచ్చటైన ముఖంలోకి చూసి, భావి "ఉగ్రవాది" లక్షణాలకోసం వెతికాను. కాని ఆ వా ప్రయత్నంలో నేను సఫలుణ్ణి కాలేదు.

క్లాడ్ సంపన్న కుటుంబంలో పుట్టాడు. అతను చాలా చక్కటి పెంపకంలో పెరిగి, చక్కగా విద్యను అభ్యసించాడు. అతని క్రాపు మంచి ఫేషనబుల్‌గా వుంది. అతని ధోరణి కొంచెం వ్యంగ్యంగా వుంది. అతని అభిమాన రచయిత సార్త్రె.

"సార్త్రెని గురించి నీకు నచ్చింది ఏమిటి?" అని ప్రశ్నించి, వెంటనే నాలుక కొరుక్కున్నాను. నేను ప్రశ్నించిన తీరు సరిగా లేదని గ్రహించాను.

క్లాడ్ జాలిపడుతున్నట్లు చిరునవ్వు నవ్వి, "మీ ప్రశ్న 'ఒక విమానం గురించి నీకు నచ్చేది ఏమిటి?' అన్నట్లుంది" అని జవాబిచ్చి యిలా వివరించాడు: "మానవుడి బాధ్యతని గురించిన ఆయన రచనలంటే నాకు ఇష్టం. మన సమాజాన్ని శాసిస్తున్న నైతిక విరుద్ధమైన చట్టాలను సార్త్రె ఖండిస్తాడు. ఈ ప్రపంచంలో మనిషికి యిబ్బందిగా, యిరుకుగా వున్నట్లు అనిపిస్తోంది."

"మరి యీ విషయం ఎలా వ్యక్తంచేయబడింది?" అని నేనడిగాను.

"డబ్బు మన సమాజాన్ని నాశనంచేసింది. యువజనులకి వెనకటి తరాలవాళ్ల కంటె భిన్నమైన బౌద్ధిక విలువలు వుండాలి."

"మరి నీ దృష్టిలో అత్యున్నతమైన విలువలు ఏమిటి?"

"మనుషుల మధ్య స్నేహం. ఒక బృందంలో సహజమైన జీవితం."

క్లాడ్ విశ్వాసాలు మిగిలిన పిల్లలతో అతని రోజువారీ సంబంధాల్లో ఏ మేరకు అమలు జరపబడుతున్నాయో చూడాలని నాకు ఆసక్తి కలిగింది. అదిగో అక్కడ ఒక వైరుధ్యం బయటపడింది. దాన్ని గ్రూపు నాయకులు, సోవియట్ పిల్లలు నాకు తెలియజేశారు. ఇదిగో వాస్తవాలు యివి. క్లాడ్‌ని అతని స్నేహితుడు జాన్‌తో పోలిస్తే, వాళ్ల దుస్తుల్లోని భేదం చూసీ చూడగానే కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. జాన్ ఒక కార్మికుడి కొడుకు. క్లాడ్ తన జీన్సునీ, జాకెట్లనీ (బాగా ఫేషనబుల్‌వేనని వేరే చెప్పనక్కర్లేదు) రోజుకి బోలెడు సార్లు మారుస్తూ వుంటాడు. అతనికి ఆ జతలు అయిదారుదాకా వున్నాయి. జాన్ ఎప్పుడూ బాల సంఘం యూనిఫారమే వేసుకుంటాడు. జాన్ వినయశీలుడు, బిడియస్తుడు, యితరులతో తన సంబంధాల్లో సాధువుగా, శ్రద్ధగా వుంటాడు. జాన్ శరీర ప్రమాణంలో క్లాడ్‌కి దాదాపు రెట్టింపు పొడవు, లావు వుంటాడు. కాని జాన్ క్లాడ్‌కి పక్క వేస్తూ వుంటాడు. ఇది సోవియట్ గ్రూపు నాయకుడైన వొలోద్య లేబెదెవ్ కంటపడింది. ఇతన్ని ఓ కంట కని పెట్టాలి అనుకున్నాడు. ఈ విషయం చూసిన కుర్రాళ్లకి కారం రాసినట్లైంది. వాళ్లి

విషయం క్లాడ్‌కి చెప్పారు కూడా. "నాకు ఒంట్లో బాగా లేదు" అని చెప్పాడు క్లాడ్ తాపీగా. అయితే, క్లాడ్ తన పక్క తాను వేసుకోలేనంత అనారోగ్యంగా లేడు. "బహుశా జాన్ తండ్రి క్లాడ్ తండ్రిమీద ఆధారపడి వుండివుంటాడు" అని వొలోద్య నాతో చెప్పాడు. ఇంకో కుర్రాడు యిలా జోడించాడు: "టీచరు తన కుటుంబానికి బాగా తెలుసునట. అందుకని అతను ఇష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తాడు..." అతను ఆపేక్షపరుడు, అతని నవ్వు ఎదరవాళ్లని సమ్మోహితం చేస్తుంది. సాయిలాపాయిలాగా ముచ్చటగా వ్యవహరిస్తాడు. కాని, "క్లాడ్ తన ఐశ్వర్యంతో యితర పిల్లల్ని గాభరా పెడతాడు" అని సోవియట్ పిల్లలు నిర్ధారణ చేశారు.

ఏమైతేనేం, క్లాడ్‌కి అతని గ్రూపు పిల్లలు గుణపాఠం చెప్పారు. అతని ప్రవర్తన మానవ యోగ్యం కాదని అతనికి చెప్పారు. బహుశా తనపట్ల యితరులు మరోలా వ్యవహరించడం చూడటం క్లాడ్‌కి యిదే మొదటి సారి అనుకుంటాను. అతను తనని తాను బహుశా మరో దృక్పథంనుంచి చూసుకొని వుండివుంటాడు. ఏమైతేనేం, క్లాడ్ తన ఉదయంపూట కసరత్తులకి అందరి కంటె ముందుగా లేవడం, తన పక్క తాను వేసుకోవడం మొదలెట్టాడు.

ఈ కథలో నేను కల్పించినది ఏమీ లేదు. నేను చూసింది చూసినట్లుగా, మిగిలిన పిల్లలు చెప్పినట్లుగా తు.చ. తప్పకుండా రాశాను. బహుశా క్లాడ్ నేను చిత్రించినదాని కంటె మెరుగైనవాడు కావచ్చు. వాస్తవానికి పయనీర్ దళం లీడరు తాన్యా చూచాయగా యీ విషయం నాతో చెప్పింది కూడా. ఆమె యిలా అంది: "అయినా మీరు క్లాడ్‌ని అంత కటువుగా ఎందుకు అంచనా వేస్తున్నారు? పక్క వేసుకోకపోవడం సమస్య వున్న మాట నిజమేనను కోండి... అతనికి నరాల బలహీనత వుంది. నిత్యం ఆస్పిరిన్ టాబ్లెట్లు వేసుకుంటూ వుంటాడు."

తాన్యాతో ఏకీభవించేందుకు నేను సిద్ధమే. నిజానికి ధనికుడవడంలో, తన స్నేహితులకి భిన్నంగా మరో సాంఘిక తరగతికి చెంది వుండటంలో ఆ కుర్రాడి దోషమేమీ లేదు కదా. క్లాడ్ "విశ్వసనీయ మిత్రులు" అనే ఒక ప్రగతిశీల బాల సంఘంలో సభ్యుడు. అయితేనేం, అతనికి తన మిత్రులు జాన్, జూల్యెన్‌లపట్ల కొంత ఏహ్యభావం వుందేమోనని నాకు అనిపించింది. ఒక సోవియట్ కుర్రాడు అతన్ని నీకు ఆర్తెక్‌నుంచి వెళ్లిపోవాలని ఉందా, అని అడిగినప్పుడు, "అబ్బే, నాకు వెళ్లిపోవాలని లేదు. ఎందుకంటే, నా అమెరికన్ స్నేహితులు క్లైడ్ మిల్లరూ, జిమ్ మాక్‌క్లీనూ యిక్కడున్నారు" అని జవాబిచ్చాడు. స్నేహితుల ఎంపిక యాదృచ్ఛికమైనదేమీ కాదు. ఈ అమెరికన్ కౌమార వయస్కులు అతని టీచరు చెప్పినదాన్ని బట్టి "ఉన్నత మధ్య తరగతికి" చెందినవాళ్లు. క్లాడ్ వాళ్ల మధ్య సమానుడు. ఉదాహరణకి, క్లైడ్‌కి భోజనం హోటలు వ్యాపారం తెలుసు. సాన్‌ఫ్రాన్సిస్కోలోని ఒక రెస్టారెంటులో హెడ్ కుక్‌కి అతను సహాయకుడుగా పనిచేశాడు కూడా. అసలు అతను యిలాంటి "సామాన్యమైన పని"లో పాల్గొనడమే గమనార్హమైన ఒక విశేషం. అయితే, యీ కుర్రాళ్ల పని చెయ్యడానికీ, రైతు బిడ్డ మార్క్ మాక్‌ఫర్ట్ పనిచెయ్యడానికీ మూలంలో వున్న ప్రేరణలు

భిన్నమైనవి. మార్క్ బతుకుతెరువుకోసం పనిచేస్తూ వుండగా, క్లైడ్ పనివాళ్లచేత ఎలా పనిచేయించాలో నేర్చుకునేందుకు పనిచేస్తున్నాడు. "క్లాడ్, క్లైడ్, మార్క్, జాన్‌లు ఆర్తెక్‌లో కలిసిమెలిసి ఆడుకోగలరు, కలిసికట్టుగా వంట పనిలో సాయం చెయ్యగలరు. అయితే అంత మాత్రాన సమానులు కాబోరు..." అన్న ఆలోచన నా మనస్సులో మళ్లీ మెదిలింది.

మన సోవియట్ పిల్లల్నీ, యితర సోషలిస్టు దేశాల పిల్లల్నీ చూసినప్పుడు, మన సాంఘిక వ్యవస్థ ధర్మమా అని, పిల్లల జీవితాల్లోని అత్యంత వైవిధ్యపూరిత పార్శ్వాలమీద తమ ప్రగాఢ ముద్ర వేసే వర్గవైరుధ్యాల బెడద యీ పిల్లలకి లేదు కదా అని నేను సంతోషించాను.

కౌమార వయస్కుడు గ్రిగరీ రైట్ ఒక నీగ్రో. అతను న్యూయార్క్‌లోని హార్లెమ్‌లో వుంటాడు.

"నువ్వు పెద్దవాడివయ్యాక సైంటిస్టువా, డాక్టరువా, అంతరిక్ష యాత్రికుడివా, ఏమి కావాలని అనుకుంటున్నావ్?" అని అడిగాను.

అతను జవాబివ్వలేదు, విచారంగా చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

బాల్య సహజంకాని ఆ చిరునవ్వు ఒక మాదిరి నిస్సంగత్వాన్ని, ఉపచేతనలోని ఒక మాదిరి నిస్సహాయతను, జన్మతహా తనకి సంక్రమించిన సరిదిద్దరాని నేరస్థ భావాన్ని వెల్లడిచేసింది.

ఆర్తెక్‌లో గడిపిన మొదటి రోజుల్లో పిల్లల రకరకాల పోటీల్లో ప్రథమ స్థానం పొందేందుకు తంటాలు పడుతూ, డాన్సు చేసినప్పుడు, పాటలు పాడినప్పుడు, పిల్లలతో ఆడేటప్పుడు సైతం గ్రిగరీ మనస్సు లోలోపల దిగులు వ్యక్తమవుతూ వుండేది. అతని ముఖంలో గాని, అతని ప్రవర్తనలో గాని, రైతు బిడ్డ మార్క్ మాక్‌ఫర్ట్‌లో కనిపించే సాయిలా పాయిలా ధోరణి కనిపించేది కాదు. మార్క్, తను ధనికుడు కాకపోయినా, తను తన మాతృదేశపు బిడ్డనని భావించేవాడు, కాని గ్రిగరీ అందుకు భిన్నంగా, తను సవతి బిడ్డనని అనుకునేవాడు. గ్రిగరీ సోవియట్ పిల్లలచేత ఆకర్షింపబడటం బహుశా అందుకేనేమో, "నీకు ఆర్తెక్‌లో అన్నిటి కంటె ఎక్కువగా నచ్చింది ఏమిటి?" అన్న నా ప్రశ్నకి, "సోవియట్ పిల్లలతో మాట్లాడటం" అని అతను జవాబిచ్చాడు. "మీరు దేన్ని గురించి మాట్లాడారు?" అని నేను ప్రశ్నించినప్పుడు "అన్నింటి గురించీ, దేన్ని గురించీ కాదు" అని అతను బదులు చెప్పాడు. అతనికి సమాన సాంఘిక హోదాలో సంభాషించడంలో కలిగిన సంతోషకర భావోద్విగ్న అనుభవంలో అంతగా, సంభాషణలో అంత ఆసక్తి వున్నట్లు లేదు.

సోవియట్ కుర్రాళ్లు గ్రిగరీలో యీ అప్రకటితమైన ఒంటరితనాన్ని అనుభూతం చేసుకోగలిగారా అన్నట్లు, వాళ్లు గ్రిగరీపట్ల మరింత ఎక్కువ శ్రద్ధ చూపారు.

పిల్లల రిపబ్లిక్ అయిన ఆర్తెక్‌లో నిండి వుండే అంతర్జాతీయ భావానికి గల మరో ఆర్ద్ర లక్షణం బహుశా యీ ప్రత్యేక శ్రద్ధలో వెల్లడైనట్టుంది.

భాషా సమస్య అతి ముఖ్యమైనది. ఈ భాషా సమస్య పిల్లలకే కాక, వివిధ దేశాల ఉపా

ధ్యాయులకి కూడా ఒక బెడదగా పరిణమించింది. పిల్లల పెంపకం గురించి అంతులేని వాదో పవాదాల్లో ఒకరిపట్ల మరొకరి ప్రవర్తన సమస్య కేంద్ర సమస్యగా తయారై కూర్చుంది. భేదాలు కేవలం సాపేక్షమైనవి మాత్రమే. ఫ్రెంచి, అమెరికన్ ఉపాధ్యయులు మిగిలినవాళ్ల కంటె ఎక్కువగా పిల్లల ప్రవర్తనలో స్వేచ్ఛనీ, యధేచ్ఛా ధోరణినీ ప్రోత్సహించారు. జర్మన్, జపనీజ్ ఉపాధ్యాయులు మరింత తీవ్ర క్రమశిక్షణకి – యిది పైకి కనిపించకపోయినప్పటికీ – ప్రాధాన్యం యిచ్చారు. హంగరీ, చెకోస్లొవేకియాల ఉపాధ్యాయుల్లో కొంత మెతక అయిన, బలాత్కారం లేని వైఖరి కనిపించింది, అయితే యిదంతా సాపేక్షమైనదే అనుకోండి. ప్రధాన లక్ష్యంపట్ల వీళ్లందరూ ఏకీభావమే కలిగివున్నారు. ఉపాధ్యాయులందరూ మైత్రికి, పర స్పర అవగాహనకి, భాగస్వామ్య, సహకారాలకి అనుకూలురుగానే వున్నారు.

ఉమ్మడి సమస్యలే కాక, ఉమ్మడి యిబ్బందులు సైతం క్రమేణా తలెత్తనారంభించాయి.

వివిధ దేశాల ఉపాధ్యాయుల్లో ఎవరితో నేను మాట్లాడినా, సమస్యలు దాదాపు ఒకే మాదిరిగా వున్నాయి. ఆ సమస్యల్ని యిలా పేర్కొనవచ్చు: బౌద్ధిక శక్తినీ, మానసిక సున్నితత్వాన్నీ, దయనీ, లోకజ్ఞానాన్నీ, శారీరక నిర్దుష్టతనీ, నైతిక పవిత్రతనీ సమరసంగా మేళవించేలా పిల్లల్ని ఎలా పెంచాలి? పిల్లలపట్ల ఏ మేరకు దయగా వుండాలి, కచ్చితంగా వుండాలి? ఏ మేరకు వాళ్లను రాపాడించాలి, వాళ్లపట్ల సాధువుగా వుండాలి? విశృంఖలత్వాన్ని నివారించేందుకు, తప్పులు చేయకుండా నిరోధించేందుకు, పిల్లల్ని సంతోషంగా పెరగనిచ్చేం దుకుగాను, ఎవరైనా పిల్లల స్వతంత్ర ప్రవర్తనని (ఇతురులమీద ఆధారపడకుండా, తన పనులు తాను చేసుకోవడాన్ని) పెద్దవాళ్ల వివేకవంతమైన మార్గదర్శకత్వంతో ఎలా మేళవించాలి?

విద్యాబోధనతో సంబంధం వున్నవాళ్లందర్నీ యీ సమస్యలు కలవరపెడుతున్నట్లు నేను గ్రహించాను. ఇవి ప్రపంచంలోని అన్ని దేశాలకీ సంబంధించిన తీవ్ర సమస్యలు. సోవి యట్ యూనియనులో ఈ సమస్యలు విద్యాబోధకులు, మనస్తత్వ శాస్త్రజ్ఞులు, తత్వ వేత్తలు, సాంఘిక శాస్త్రవేత్తలు, ఉపాధ్యాయులు, శిక్షకులు, తల్లితండ్రులు కూడా ఎదుర్కొనే కేంద్ర సమస్యలే.

ఈ పుస్తకంలో పిల్లల పెంపకంలో కుటుంబానికి వున్న పాత్ర ఏమిటన్న విషయాన్ని నేను పరిశీలిస్తాను అంటే, సోవియట్ తల్లితండ్రులకు, విద్యాబోధన శాస్త్రజ్ఞులకు, ఉపా ధ్యాయులకు, సాధారణంగా పిల్లలతో ఏ విధమైన సంబంధం అయినా వున్న పెద్దవాళ్లకు నిత్యం ఎదురయ్యే సమస్యల్ని వివరిస్తాను. సోవియట్ కుటుంబ జీవితం ఎలా వుంటుందో, సోవియట్ కుటుంబ జీవితంలో, పిల్లలతో దాని సంబంధాల్లో సోషలిస్టు సూత్రాలు అభి వృద్ధిచెందిన సుదీర్ఘ సంవత్సరాల్లో సోవియట్ యూనియన్‌లో రూపొందిన విద్యాబోధన శాస్త్రీయ పద్ధతి ప్రభావం ఏమిటో పాఠకుడికి యీ పుస్తకం స్థూలీపులాకంగా తెలియ జేస్తుంది. పిల్లల పెంపకంలో ముఖ్యమైన వైఖరి సోవియట్ వ్యవస్థలోని సమష్టి

తత్వంచేత నిర్ధరింపబడుతుంది. ఈ సమష్టితత్వాన్ని పిల్లలు ప్రథమంగా, ప్రధానంగా కుటుంబంలో నేర్చుకుంటారు. ఎందుకంటే, తల్లితండ్రులే తమ పిల్లలను జీవితానికీ, సమష్టి సంబంధాలకీ సన్నద్ధంచేస్తారు. బాల్యంనుంచీ పిల్లలకి మొదట ఇతరులందర్ని గురించీ ఆలోచించాకనే నిన్ను గురించి నువ్వు ఆలోచించుకో, నీ తోటివాళ్లకి సహాయంచెయ్యి, మీ తాతనీ, బామ్మనీ, తల్లినీ, తండ్రినీ శ్రద్ధగా చూడు, అటు తర్వాతనే నీ వ్యక్తిగత ప్రయోజనాలు చూసుకో అనే భావం అలవరచబడుతుంది.

సోవియట్ కుటుంబ జీవితపు పరమార్థం సమష్టి (కుటుంబం లేక బడి) ప్రయోజనాలు నీ (లేక నీ కొడుకు, లేక కూతురి) ప్రధాన బాధ్యతగా వుండాలి, అటు తర్వాత మాత్రమే నీ వ్యక్తిగత ప్రయోజనాలు చూసుకోవాలి, ఇతరులకు తోడ్పడినప్పుడే నీకు అత్యున్నతమైన సంతోషం కలుగుతుంది.

దీని పర్యవసానం ఏమిటంటే, పాఠశాలా, కుటుంబమూ ఒక సమష్టివాదిని తయారు చేయడమనే – పిల్లల్ని విద్యావంతుల్ని చేయడం ఉమ్మడి ఆనందం, ఉమ్మడి లక్ష్యం – ఉమ్మడి సూత్రంచేత సమైక్యం చేయబడతాయి. దీన్నుంచి కుటుంబంలో సోవియట్ పిల్లల పెంపకానికి సంబంధించిన మరో పార్శ్వం – దాని బహిరంగత, సమాజంతో దాని సంబంధాలు – వెల్లడవుతుంది. కుటుంబానికి, పాఠశాలకి, పరిశ్రమకి, పాఠశాలేతర కార్యకలాపాలకీ మధ్య సంబంధాలను అభివృద్ధి చేసే ధోరణి యిటీవలి సంవత్సరాల్లో పెంపొందింది. తల్లితండ్రులే నేరుగా పాఠశాలల్లో లేక పరిశ్రమల్లో పిల్లల కార్యకలాపాల్లో పాల్గొంటారు. అంటే, వాళ్లు వేర్వేరు బృందాలను, క్రీడా కార్యక్రమాలను నిర్వహిస్తారు, వాళ్లు పిల్లలతో కలిసి వినోద యాత్రలు సాగిస్తారు, రకరకాల పోటీలను, క్రీడలను నిర్వహిస్తారు.

తల్లితండ్రులు పిల్లల పాఠాలకు, పిల్లలు వేసిన చిత్రాలతో, చేసిన వస్తువులతో ప్రదర్శనలు ఏర్పాటుచేస్తారు, తరుణ పౌరులను తీర్చిదిద్దడంలో క్రియాశీలమైన పాత్ర వహిస్తారు. అందుకే, సోవియట్ కుటుంబాన్ని గురించి మాట్లాడేటప్పుడు ఇంటికి బయట – అంటే పాఠశాలల్లో, పాఠశాలేతర సంఘాల్లో, "వీధుల్లోని" పిల్లలతో – ఏర్పడే అర్థవంతమైన సంబంధాలను పేర్కొనకుండా ఎవరూ ఉండలేరు.

సరిగ్గా యీ కారణంగానే యీ పుస్తకంలో కుటుంబంలో పెంపకపు శైలినీ, పద్ధతుల్నీ నిర్ధరించే ప్రభావాల సముదాయాన్నంతనీ నేను పాఠకుడికి పరిచయంచేస్తాను.

ప్రకరణం 1

# వ్యక్తి ఎలా తీర్చిదిద్దబడతాడు

## (సమష్టితత్వ పెంపకపు మూలసూత్రాలు)

### మీ బిడ్డ సంతోషం

మనం మన పిల్లల సంతోషం గురించి మాట్లాడేటప్పుడు, అనివార్యంగా సంప్రదాయాలమీదా, పెద్దవాళ్లంగా మనలో నిలిచివున్న భావనలమీదా ఆధారపడతాం. సహజంగానే సంతోషం గురించిన మన వ్యక్తిగత దృష్టిని నిర్ధరించేవి అవే. విద్యాబోధన పద్ధతుల్లో భేదాలు ఉత్పన్నమయేది సరిగా యిందుకే.

తమ బిడ్డని సంతోషవంతుణ్ణి చేసేందుకుగాను కొందరు వాడి లేక ఆమె సమగ్రాభివృద్ధిమీద శ్రద్ధ చూపుతారు. తమ కొడుకు లేక కూతురు సంగీతమో, ఫిగర్ స్కేటింగో, ఒక విదేశీ భాషో నేర్చుకోగలిగేందుకు, మరింత మెరుగైన టీచర్లని వెతికేందుకు, ఏదైనా ఒక కళలో, లేక గ్రంథ పఠనంలో ఆసక్తుడయ్యేలా చూసేందుకు వాళ్లు కాలమూ, శక్తీ వినియోగిస్తారు. ఒక కుటుంబంలో ఒక కుర్రవాడు ఉన్నాడు... అతను మట్టూ మర్యాదా కలవాడు, సంస్కృతీపరుడు, ఆటల్లో నేర్పరి అనుకోండి అతన్ని మెచ్చుకోకుండా ఎవరూ ఉండలేరు. కాని తొమ్మిదో తరగతిలో (16 వయస్సులో) ఉన్నట్టుండి అతను కోపిష్టిగా, చిరాకుగా మారాడనుకోండి. వాడి యీ ప్రవర్తన తాత్కాలికమైనదనీ, అది మారుతుందనీ అనుకొని, తల్లితండ్రులు వాడిని వెనకేసుకొచ్చారు. ఏణ్ణర్ధం గడిచేసరికి ఆ కుర్రాడు తల్లితండ్రుల మనస్సులు బాగా గాయపరిచాడు... జరిగిందేమిటంటే, అతను సమరసంగా అభివృద్ధి చెందలేదు.

మరి కొందరు, తమ పిల్లలను సంతోషవంతుల్ని చేసేందుకు, వాళ్ల సంవేదనల్ని గురించి పట్టించుకుంటారు. ఈ తల్లితండ్రుల లక్ష్యం ప్రధానంగా యేమిటంటే, తమ కుర్రాడు మంచి వ్యక్తిగా మారాలనీ, అతను యితరుల్ని ప్రేమించాలనీ, యితరులచేత ప్రేమించబడాలనీను. ఈ కారణంగా, వాడికి ఇష్టంవచ్చినంత సేపు వాణ్ణి ఆడుకోనివ్వాలనీ, వాడి ఇష్టంవచ్చిన పద్ధతిలో వాడిని అభివృద్ధి చెందనివ్వాలనీ, వాడి చిత్తంవచ్చినట్లు వాణ్ణి ప్రవర్తించనివ్వాలనీ వాళ్లు నమ్ముతారు. మరి మొదటి సంవత్సరాల్లో ఆ మాదిరి పెంపకం ఆకర్షణీయంగానే కనిపిస్తుంది. పిల్లవాడు స్వేచ్ఛగా, నిర్భయంగా వుంటాడు,

తీక్ష్ణంగా మాట్లాడుతాడు, కార్యశీలిగా వుంటాడు. అయితే, కొంత కాలానికి యీ "యధేచ్ఛా ప్రవర్తన" చపల చిత్తానికి చోటిస్తుంది. హేతుబద్ధమైన మార్గదర్శకత్వంచేత గాని, దయతో కూడిన పనులు చెయ్యవలసిన అవసరంచేత గాని పటిష్ఠం చేయబడటం జరగనప్పుడు, యీ కౌమార వయస్కుడు అతి కాంక్షకి గురి అవుతాడు. వాడు ఏ లక్ష్యాన్నైనా ఏ పద్ధతిలోనైనా, కృషి చేయకుండా, ప్రయత్నం చేయకుండా, అలసట లేకుండా సాధించి తీరాలన్న కాంక్షకి దాసుడవుతాడు. "నాకు కావాలి", "నాకు ఇవ్వండి" అన్నవే వాడి జీవిత సూత్రాలు అవుతాయి. దీర్ఘ కాలక్రమేణా అలాంటి అభివృద్ధి క్రమం అటు తల్లితండ్రులకీ, యిటు ఆ కుర్రాడికీ కూడా దుఃఖకారణం అవుతుంది.

మీరు అడగబోయే ప్రశ్న అర్థమైంది: సరే, ఇదీ తప్పే, మరి అదీ తప్పేనా? సర్వతోముఖమైన అభివృద్ధికి సమరస అభివృద్ధితో పొసగదా? ఎంత మాత్రం కాదు. కాని, సమరస అభివృద్ధిని సమరస సాధనాలతో సాధించాలి.

ప్రథమంగా, ప్రధానంగా అభివృద్ధి చెందుతున్న మనిషిపట్ల జాగరూకతతో కూడిన వైఖరి వహించాలి. అంటే, పెద్దవాళ్ళు చిన్నవాళ్ల ఆలోచనా ధోరణికి "మారగలిగి" వుండాలి, చిన్న పిల్లల బుద్ధికి గల నికరమైన స్వభావాన్ని అందుకోవాలి. అంటే, అర్థం యేమిటి? చూడండి, చిన్న పిల్లాడికి మీరు "చూశావా పాపం, నువ్వు బొమ్మని కొట్టావు, అదేమో ఏడుస్తోంది" అని చెప్పాలి. చిన్న పిల్లాడు వెంటనే మీరు చెప్పిన కన్నీళ్లను ఆ చిన్న రబ్బరు బొమ్మ కళ్లలో "చూస్తాడు," బొమ్మ నేస్తం ఏడుపును "వింటాడు." అలాంటి "ఊహా జనిత" అవగాహన పిల్లల ప్రపంచాన్ని పాలించే శాసనం.

సరిగా, యీ శాసనాన్నే ఎవరూ "పట్టించుకోకుండా" ఉండలేరు. ఒక పిల్లవాడిని మందలించేటప్పుడు లేక వాడిని ఏమైనా చెయ్యమని ఆదేశించేటప్పుడు, తను ఎవరిని ఉద్దేశిస్తున్నాడన్న విషయాన్ని స్పష్టంగా గ్రహించి వుండాలి.

లోకజ్ఞానాన్ని, సంవేదన శక్తిని, కష్టాలను తట్టుకునే సామర్థ్యాన్ని, ఔదార్యాన్ని, సంకల్ప శక్తిని, మనుషులపట్ల దయతో కూడిన వైఖరిని అలవరచేటప్పుడు, పెంపొందించేటప్పుడు తరతమ అవగాహన లేనిదే సమష్టితత్వం, సృజనాత్మకత కలిగినవాడిని, ఒక దయాపరుడిని, నిజాయితీపరుడైన పౌరుడిని తీర్చిదిద్దడం అసాధ్యం.

ఈ సమస్యలు సంశ్లిష్టమైనవనడంలో సందేహంలేదు. వాటిని ఎలా ఎదుర్కోవాలి? దేనితో ప్రారంభించాలి? ఆరోగ్యంపట్ల లేక కళాత్మక కార్యకలాపాలపట్ల, చదువుపట్ల లేక స్వావలంబనపట్ల శ్రద్ధ వహించడం ద్వారానా? ఎవరు దేనితో ప్రారంభించినా (యిక్కడ మీరు వాస్తవ పరిస్థితిమీద ఆధారపడతారు) కృషికి నైతిక సూత్రం మూలాధారంగా వుండటం అవసరం. అప్పుడే పిల్లల కార్యకలాపాలన్నీ సత్‌పౌరత్వానికీ, దయాగుణానికీ దారితియ్యడం సాధ్యం.

తరచు తల్లితండ్రులు యిలా అంటూ వుంటారు:

"ఈ షరతులన్నీ ప్రతి తల్లికీ, ప్రతి తండ్రికీ మరీ సంశ్లిష్టమైనవి కావా? బాగా ప్రతిభావంతులైనవాళ్ళు, వృత్తి రీత్యా బోధన శాస్త్రజ్ఞులైనవాళ్లు మాత్రమే పిల్లల్ని అలా పెంచగలుగుతారేమో కదా?"

ఎంతమాత్రం కాదు! ప్రతి వ్యక్తిలోనూ విద్యా సంబంధమైన మహానందాలను అనుభూతి చెందే సామర్థ్యం, అత్యల్పమైన కర్తవ్యాల పాలనలో సైతం మానవానందపు అత్యుత్తమ క్షణాలను పొందగలిగే సామర్థ్యం వుంటాయి. ఈ పరివర్తన క్షణకాలంలోనే సంభవించవచ్చు, దాన్ని సాధించాలన్న సంకల్పం కలిగి వుండాలంతే. మన పిల్లల వయస్సే కలిగిన, పిల్లలకు అత్యంత ప్రేమపాత్రమైన సాహిత్య పాత్రల్లో ఒకడైన టామ్ సాయర్ ఆలోచనలను విశ్లేషించేందుకు ప్రయత్నిద్దాం. నిరాశా నిస్పృహల మధ్య అతనికి ఉత్సాహం పెల్లుబుకుతుంది! అందరూ ఈతలు కొట్టేందుకు వెళ్తూ వుంటారు, ఆ సమయంలో తను అంతూదరీలేని దడికి పెయింటు వెయ్యవలసివచ్చింది. అప్పుడు అతనికి ఎంత ఉజ్వలమైన బోధన శాస్త్రీయమైన భావం వచ్చిందో జ్ఞాపకంచేసుకోండి!

"హల్లో, పాపం నువ్వు పనిచెయ్యవలసివచ్చిందా?" అంటూ అతని స్నేహితుడు బెన్ టామ్‌పట్ల సానుభూతి ప్రదర్శించాడు. కాని ఉత్తేజకరమైన ఆనందంతో టామ్ ప్రపంచ సుఖాలన్నింటిపట్లా తన పూర్తి నిర్లిప్తతనీ, తనకి అప్పగించబడిన కర్తవ్యంపట్ల అసాధారణమైన సంతోషదాయకమైన ఉత్సాహాన్నీ ప్రదర్శించాడు. అతను చేతిలోని బ్రష్షును చిత్రకారుడిలా నిమిరి, వెనక్కి అడుగువేసి తన చేతులు చేసిన పనిని అభినందనపూర్వకంగా చూశాడు. ముందు అబ్బుర పడిన బెన్, తర్వాత కొత్తగా కనిపించిన నిపుణుడి రహస్యాల్లో పాలుపంచుకోవాలని తపనపడ్డాడు, పనికి సుముఖుడయ్యాడు. టామ్ భువినుంచి దివికి దిగివచ్చినట్లు చూసి, అయిష్టంగా బ్రష్షునీ, తెల్ల పెయింటు వున్న బకెట్టునీ బెన్‌కి యిచ్చి, బదులుగా ఒక యాపిల్ తీసుకున్నాడు.

మార్క్ ట్వెయిన్ నవలలోని యువ హీరో మాదిరిగా అలాంటి చతురమైన కళని అమల్లో పెట్టరాదనడం నిజమేననుకోండి. టామ్ చేసిన పనుల్లో, ఆధునిక సాంఘిక శాస్త్రవేత్త చెప్పివుండే మాదిరిగా, ఉపచేతనలో రూపొందీ రూపొందని ఒక ఊహ కనిపిస్తుంది. అదేమిటంటే, ఎవరినైనా ఒకరిని అనాసక్తికరమైనదిగా, పైకి నిరానందకరమైనదిగా కనిపించే కర్తవ్య నిర్వహణకు ఆకర్షించేందుకుగాను, అలాంటి పనిలో పొందగలిగిన ఆనందాన్ని చూపించాలి. కేవలం ఒక యాపిల్, సూర్యుడు లేక నది వంటి ప్రకృతిసిద్ధమైన వరాలను పొందినప్పుడు లభించేదానికంటె ఎంతో ఎక్కువ ఆనందాన్ని చూపాలి.

కనుక, మీ కొడుకో లేక కూతురో మిమ్మల్ని అనుకరించాలని మీరు కోరుకున్నప్పుడు, మీ బాల్యంలో అత్యుత్తమ క్షణాల స్మృతులు మీ కళ్ల ముందు తళుక్కున మెరిసి, మిమ్మల్నీ, మీ పిల్లల్నీ ఉత్తేజపరిచే మాదిరిగా మిమ్మల్ని మీరు సర్దుకోండి. మీరు మీ పిల్లవాడిలో పనిచేయవలసిన అప్రతిహతమైన అవసరానికి సంబంధించిన తొలి స్వల్ప ప్రేరణలను రేకె

త్తించగలిగితే, మిక్కిలి విలువైన మానవ ఆకాంక్షల్లో ఒకటైన యీ సంతోషకరమైన తపనకు మీరెలా దోహదంచేయగలరో ఆలోచించండి.

టామ్ సాయర్ పీపామీద కూర్చొని, యాపిల్‌ని కొరుక్కు తింటూ, బెన్ కష్టపడి పనిచేయడం పర్యవేక్షించినప్పుడు అతను కునికిపాట్లు పడలేదని గుర్తుంచుకోండి. అతను నిరంతరాయంగా ఆలోచిస్తూ కొత్త వలంటీర్లకోసం ఎత్తులు వేస్తూనే వున్నాడు. మధ్య మధ్య కుర్రాళ్లు వస్తూండేవారు, అతను పనిచేయడం చూసి ఎద్దేవా చేస్తూండేవారు. కాని చివరకు ఉండిపోయి, దడికి తెల్ల పెయింటు వేస్తూ వుండేవారు. వాళ్లకి పని ఆకర్షణీయమూ, ఆశావహమూ అయిన కార్యకలాపంగా మారసాగింది.

శిక్షకులకి లేక వాళ్ల శిష్యులకి విద్యాభ్యాసం సంతోషకరమైనది కాకపోతే, అది అనివార్యంగా విద్యాబోధకంగా ఉండటం నిలిచిపోతుంది. అంతే కాదు, పిల్లలతో సంబంధం సంతోషకరంగా, ఆనందదాయకంగా వుండాలి. వాళ్లతో మాట్లాడేటప్పుడు గర్భితమైన వ్యంగ్య ధోరణులు ఏమీ వుండకూడదు (ఉంటే పిల్లలు వాటిని పసికడతారు, అర్థంచేసుకుంటారు). అయితే, మాట్లాడేటప్పుడు విధిగా చమత్కారం పాలు వుండాలి. జలపాతం వంటి నవ్వులు వుండాలి, సార్వత్రికమైన హుషారు వుండాలి. మనుషుల సంభాషణలో యివన్నీ నికరమైన ఆనందానికి, ప్రతి పిల్లవాడ ఆనందానికి మూలాధారాలు కావూ? బాల్యానికి సంబంధించిన సుందరమైన యీ క్షణాలు సమరస వ్యక్తి అభివృద్ధికి మూలాధారం.

మనుషుల మనస్తత్వాన్ని అంచనావేయడంలో ఆరితేరిన దొస్తొయేవ్‌స్కీ అల్యోష కరమాజొవ్ అనే పాత్ర నోట యిలా చెప్పిస్తాడు: "ఏదైనా ఒక ప్రియమైన స్మృతి, ప్రత్యేకించి బాల్య స్మృతి, ఇంటి దగ్గర గడిపిన రోజులకు సంబంధించిన స్మృతి కంటె మరింత ఉన్నతమైనదీ, మరింత సౌష్ఠవమైనదీ, మరింత ఉపయోగకరమైనదీ మరొకటేదీ లేదని తెలుసుకో... బాల్యంనుంచీ పదిలపరచుకున్న ఏదైనా అందమైన, పవిత్రమైన స్మృతే బహుశా అత్యుత్తమమైన పెంపకం. ఒక మనిషి అలాంటి అనేక స్మృతులను కూడబెట్టుకుంటే, అతని భావి జీవితమంతట్లోనూ ఏ ధోకా వుండదు."*

పిల్లవాడి ఆనందంపట్ల శ్రద్ధ వున్నవాడు బాల్యంలో సాధ్యమైనన్ని అలాంటి ఆనందదాయకమైన స్మృతులను సమకూర్చాలి.

ఇదంతా అంత సరళమైనదేమీ కాదు. ఆచరణలో "జీవితం" తరచు సిద్ధాంతాన్ని కొట్టిపారేస్తుంది, శాస్త్రీయమైన హేతుజ్ఞానం కంటె, మానవ సంస్కృతి కంటె బలవత్తరమైనదిగా ఉంటుందని తేలుతోంది. కొందరు తల్లితండ్రులు "మా బాల్యం కష్టాల మధ్య గడిచింది. మేము అనుభవించిన ఆ కష్టాలను మా పిల్లలు అనుభవించకూడదు.

---

* F. Dostoevsky, *The Karamazov Brothers*, v. 2, Progress Publishers, Moscow, 1980, p. 657.

"ఎంతమాత్రం కాదు. నేను చెప్పవచ్చేదేమిటంటే, జీవితం కొన్ని బాధ్యతలతో కూడి వుంటుంది, అవి తనకు ఆసక్తికరంగా వున్నా, లేకపోయినా ఆనందపు పొంగులతో ప్రసక్తి లేకుండా మనిషి స్వతంత్రంగా యీ విధులను నిర్వహించాలని మాత్రమే."

"కాని మనం మాట్లాడే విషయం, పిల్లవాడి పెంపకాన్ని అనాసక్తికరమైన ప్రతిదాన్నీ ఆసక్తికరం, అపరూపం చేసే ఒక కర్తవ్యంగా ఎలా నిర్వర్తించాలి అని. ఏదైనా ఒక కర్తవ్యాన్ని యిష్టపూర్వకంగా నిర్వర్తించినప్పుడు మాత్రమే నికరమైన దృఢమైన నమ్మకాలు ఏర్పడతాయి, పిల్లవాడి శరీరాన్ని రాటుదేలిస్తాయి, పిల్లవాడి ఆత్మను సజీవ శక్తితో అన్ని పార్శ్వాలనుంచీ దృఢపరుస్తాయి, పిల్లవాడిని లక్ష్యాభిముఖుణ్ణిగా, శక్తిని వెచ్చించే సామర్థ్యం కలిగినవాడినిగా చేస్తాయి."

"మనిషిని రాటుదేలించేవి కష్టాలు కావా? కష్టాన్ని ఓర్చుకోగలిగే సామర్థ్యాన్ని పెంపొందించడం బహుశా అవసరమేమో కదూ?"

"కష్టాలు పిల్లవాణ్ణి విచారగ్రస్తుణ్ణి ఎందుకు చెయ్యాలి? ఏ కష్టాలు? మానసిక, శారీరక కార్యకలాపాలా? ఒక మిత్రుణ్ణి కోల్పోవడమా? దూషణలు, అవమానాలా?"

"అదే, అవి కూడా..."

"సరైన విద్య కష్టాలను, ఆటంకాలను హుందాగా అధిగమించడం ఎలాగో నేర్పేందుకు ఉపలక్షిస్తుంది. ఇక కష్టం సంగతి, ఉద్దేశపూర్వకంగా దాన్ని కలిగించడం సాధ్యం కాదు. బహుశా నేను చెప్పేది తప్పేమో గాని, యీకింది వైఖరిని తీసుకోవడానికి నేను సుముఖుణ్ణి: పిల్లల్ని పెంచేటప్పుడు, మనిషి ఆనందాన్ని భంగపరిచే ప్రతిదాన్నీ సాధ్యమైనంతగా తొలగించేందుకు ప్రయత్నించాలి."

"కాని, దీని ఫలితంగా దయ, సానుభూతి ఎరగని హుషారైన ఆశావాదుల్ని తయారు చేస్తామేమో? సానుభూతిని దయనుంచి వేరుచేయని వి. సుహోమ్లీన్‌స్కీ, యై. కోర్చక్‌ల వైఖరులు నా మనస్సుకు బాగా నచ్చాయి. సహేతుకమైన ఆనందం ఒక మాదిరి బడాయిగా మారేందుకు ఎవరైనా కాస్త పెడగా పోతే చాలునేమో అని నాకు అనిపిస్తోంది. ఎందుకంటే, జాలి అన్నది మరొకరి కష్టాన్ని తన సొంత కష్టంగా అనుభూతి చెందగల గొప్ప సామర్థ్యాన్ని మనిషికి కలిగిస్తుంది. మానవ సంస్కృతికి చెందిన యీ సద్గుణాన్ని ఎవరూ మలిపివేయకూడదు."

ఈ రెండూ రెండు దృక్పథాలు. ఈ చర్చ పూర్తిగా తాత్వికమైనదనీ, ఆచరణలో పెంపకంతో దీనికేమీ సంబంధం లేదనే అభిప్రాయం పాఠకుడికి కలగవచ్చు. అది సరికాదు. నికరమైన బోధకుడు ఎప్పుడూ తత్వశాస్త్రవేత్త అయివుంటాడు. ఎప్పుడైతే అతను అలా ఉండటం మానివేస్తాడో, అప్పుడు అతని చర్యలకు అజ్ఞాన దోషం అంటుతుంది. పిల్లవాడు పెంచబడడు, అతను జీవిస్తాడు. ఈ సూత్రంలో మానవుడి అభివృద్ధిని శాసించే ఒక గొప్ప నియమం దర్శనమిస్తుంది. పిల్లవాడి జీవితం ఎంత ఉజ్వలమైతే, అంత ఎక్కువ

వాళ్లని సుఖంగా బతకనివ్వండి'' అని అంటూ వుంటారు. ఈ మాదిరి వాదనల సారాంశం చాలా సరళమైనది: వాళ్లకి సుష్టుగా తిండిపెట్టండి, చక్కటి దుస్తులు యివ్వండి, వాళ్లు ఏది కోరినా కాదనకండి. అయితే దురదృష్టవశాత్తూ, చాలా తరచుగా అలాంటి పరిస్థితి పెద్దలకీ, పిల్లకీ కూడా చెడుగా పరిణమిస్తుంది.

పిల్లల పెంపకపు శాస్త్రం నూతన పౌరులను రూపొందించే క్రమాన్ని ఎలా ఆనంద దాయకం చేయాలి, మనిషికి ఆనందంగా వుండటాన్ని ఎలా నేర్పాలి అనేవాటికి సంబంధించిన శాస్త్రం.

''నేర్పడమా?'' అంటూ నా ప్రత్యర్థి విరుచుకుపడతాడు. ''ఒకరికి ఆనందంగా వుండటం ఎలాగో నేర్పడమా? అది అర్థంలేని పని'' అంటాడు.

''ఏం, ఎందుకు నేర్పకూడదు?'' అంటూ నేను నా వాదన ప్రారంభిస్తాను. ''ఆనం దంగా వుండటమంటే సంపూర్ణ జీవితం గడపటం, సృజనాత్మక శక్తి నిరంతరాయంగా పెంపొందడాన్ని అనుభూతి చెందడం అయితే, పిల్లవాడి బౌద్ధిక, శారీరక శక్తిని వెలికి తీయ డంతో యిది సంబంధించినదై వుంటే, అప్పుడిక సమరస సాధనాల సాయంతో సమరస మైన పెంపకం మనిషికి ఆనందంగా వుండటం ఎలాగో నేర్పగలుగుతుంది, నేర్పాలి.''

''అయితే, ఆనందం కేవలం భావోద్విగ్న పార్శ్వానికి మాత్రమే సంబంధించినదా? ఆనందం నైతిక భావన కాదా?''

''అది నైతికతకి నేరుగా సంబంధించినది. ఎందుకంటే, పిల్లవాడి శక్తి సజీవంగా వెల్లుబకడం తనంతట తాను సృజనాత్మక వాతావరణాన్ని ఉత్పన్నం చేస్తుంది.''

''దాని అర్థం ఏమిటి?''

''పిల్లవాడి కళ్లు తెలివితేటలతో, ప్రేమతో, దాతృత్వంతో మెరవడం. ప్రముఖ సోవియట్ బోధన శాస్త్రజ్ఞుడు ఎ. మకారెంకొ ఆనందాన్ని మనిషి అత్యున్నత నైతిక బాధ్యత అనడం, వ్యక్తి, సమష్టి అనే రెండు విలువల సంగమ స్థానంలో అది పండుతుందనడం యాదృచ్ఛిక విషయమేమీ కాదు.''

''అయితే, ఆనందం కూడా ఒక బాధ్యతేనా?''

''ఈ విషయాన్ని మరో పార్శ్వంనుంచి పరిశీలిద్దాం. ఒక పిల్లవాడు మన ఆదేశాలను కన్నీళ్లు పెట్టుకొంటూ అమలుజరిపితే, అలాంటి విధేయత వ్యక్తి విరూపం చెందేందుకు దారితీస్తుంది. విచారం, నిరుత్సాహం ఆనందానికి వ్యతిరేకమైనవి. ఆత్మ సంతోషంతో పొంగిపొరలకుండా జీవితం గడిచిపోతే, వ్యక్తి తన గమ్యాలను చేరుకొని, తన వ్యక్తిత్వాన్ని రూఢిపరచుకోనప్పుడు కలిగేవి విచారం, నిరుత్సాహం. ఇవి జనంతో మాట్లాడే సామర్థ్యాన్ని కుదిస్తాయి, అరక్షణీయతా భావాన్ని ఉత్పన్నం చేస్తాయి, మనిషి తన ఆకాంక్షలను తగ్గించు కునేలా చేస్తాయి, తన బండారం బయటపడుతుందేమోనన్న భయానికి, కలుపుగోతనాన్ని కోల్పోయేందుకు దారితీస్తాయి. మీరు ఆనందాన్ని ఒక్కదాన్నీ పెడదారిగా, పైవాటన్నిం టినీ సరైనవిగా పరిగణిస్తారా?''

విలువైన, సానుకూలమైన అనుభవాలు అతను పొందుతాడు, అతని పెంపకం అంత ఎక్కువ విలువైనదీ, ఆరోగ్యకరమైనదీ అవుతుంది. బాల్యం అనేది అనితర సాధ్యమైన ఒక మనస్తాత్త్విక స్థితి. దానిలో సంవేదనలు, హేతుజ్ఞానము సంలీనంచెయ్యబడతాయి. ఈ స్థితికి స్వాభావికమైన లక్షణాల్లో ఒకదాన్ని ఆత్మావిష్కార ధోరణులు — నిరంతర ఆవిష్కరణలు, అంతులేని శక్తి — అనవచ్చు. జిజ్ఞాసతో కూడిన మహోత్సాహం రెక్కలు కట్టుకొని ఎగురుతున్నదా అనిపిస్తుంది. నిర్ణయాలు క్షణంలో చేయబడతాయి. ఉద్వేగం, ఆసక్తులు తుపానులో అలల్లాగ ఉవ్వెత్తున లేస్తాయి. శక్తి కేంద్రీకరణ విభ్రాంతిగొలిపే మోతాదులో వుంటుంది.

కాగా నేనిక్కడ పిల్లవాడి సమరసత్వపు ఒక పార్శ్వాన్ని — ఉద్వేగసహిత క్రియాశీలం, వ్యక్తీకరణ సృజనాత్మకం, గ్రహణ ఆత్మవిస్మరణ పార్శ్వాన్ని — వివరించాను. దీని అభివృద్ధికి కొన్ని నియమాలను అనుసరించవలసి వుంటుంది: పిల్లవాడిని ఉపయోగకర కార్యకలాపాల నుంచి మినహాయించకపోవడమే కాక, అతన్ని వాటితో ముంచెత్తడం; మన ప్రమాణాలకు అనుగుణంగా తయారుచేసిన చట్రంలోకి అతన్ని నెట్టకపోవడం; పిల్లవాడి ఆసక్తుల పరిధిని సదా పెంచుతూపోవడం; పిల్లవాడు మన జీవితాన్ని కాక తన జీవితాన్ని జీవించాలన్న సంగతి గుర్తుంచుకోవడం.

అయితే, మనుషుల "నేను"కి మరో పార్శ్వం వుంది. అదే సంవేదనాత్మకమైన ఆత్మ. మిక్కిలి లోతైన పొరల్లో వుండి, మన బౌద్ధిక, నైతిక అభివృద్ధిని శాసించే యీ వ్యక్తి పార్శ్వం సంవేదనాత్మకమైన ఆత్మ. అది పిల్లవాడి సంస్కృతికి కొలమానం, అతని శ్రమ వినిమయాలమీద అదుపుకి కొలమానం. అది మానవ అవసరాల స్థాయిని తెలియజేస్తుంది. మరి దీర్ఘ కాల వ్యవధిలో యీ స్థాయి ఆనందపు నిజ స్వభావాన్ని నిర్ధరిస్తుంది. జన్మతహా సంక్రమించే యీ ఆదిమ గుణాన్ని మనిషి ఎలా అభివృద్ధిచేసుకోవాలి, మనిషి దాన్ని ఎలా అందుకుంటాడు? బలప్రయోగం చేయడం గాని, మొరటు పద్ధతులకు, దౌర్జన్యానికి పూనుకోవడం గాని సాధ్యం కాదు. మానవ ఆత్మ రూపొందడాన్ని చేరుకోగలిగేందుకు, పిల్లవాడు అభివృద్ధిచెంది, తన వ్యక్తిత్వాన్ని స్థిరపరచుకునేందుకు గల ద్వారాలను తెరిచేందుకు మనం ఏ తాళంచెవులను ఉపయోగించాలి? ఇది లేనిదే, ఆనందాన్ని గురించి మాట్లాడటం మొదలుపెట్టడం సైతం మొదలుపెట్టలేరు.

తత్వవేత్తలు, మనస్తత్వ శాస్త్రవేత్తలు, విద్యాబోధన శాస్త్రవేత్తలు, సాంఘిక శాస్త్రవేత్తలు ఏకీభవించే అంశం ఒకటి వుంది. అదేమిటంటే, మనిషి "నేను"కి మూలాధారం అభిరుచులు, అవసరాలతో, వాటి నిమ్న, మధ్య, ఉన్నత శ్రేణులు కలగాపులగం అవడంతో, వైరుధ్యాలతో కూడిన ఆకాంక్షల, ప్రతిఘటనలకు గల ప్రేరకాల, సంతోష, అసంతోషాల, ఆశాభంగం, ఆశల సంయోగంతో కూడివుంటుంది.

ఇవి పిల్లవాడు మన సహాయంతో, తన స్వప్రయత్నాలతో తనే కష్టపడి అభివృద్ధి చేసుకునే అవసరాలు. ఇవి వ్యక్తి రేఖా చిత్రానికి తుది మెరుగులు దిద్దే అవసరాలు, మనిషి

ప్రవర్తనకి సంబంధించిన ప్రధాన రేఖలను వక్కాణించే అవసరాలు, తనపట్లా, తనకి సన్ని హితులైన వాళ్లపట్లా, "యితరుల"పట్లా పిల్లవాడి వైఖరిని నిర్ణయించే అవసరాలు. ఇవి పిల్లవాడి కార్యకలాపాలను మనుషులపట్ల దయతో, శ్రమపట్ల మానవ ఆనందంతో, సాంఘిక సంబంధాల అభివృద్ధి చెందిన రూపాలతో తనని తాను సన్నిహితం చేసుకోవడంతో ముడిపెట్టే అవసరాలు.

మానవ అవసరాల యీ విద్యాబోధన శాస్త్రీయ త్రికోణపు వివిధ పార్శ్వాల మధ్య పరస్పర సంబంధాన్ని పరిశీలిద్దాం.

ఒక పిల్లవాడిలోని కార్యకలాపాల అవసరం యితరుల అవసరాన్ని తోసిరాజని దాని స్థానాన్ని ఆక్రమిస్తే, యిక స్వార్థపరత్వం తలెత్తడం అనివార్యం.

వేరొక వ్యక్తికోసం అవసరం, యితరులకోసం అవసరంచేత తన సొంత "నేను"కి సంబంధించిన సొంత ప్రయోజనాలను అణచివేస్తే, అప్పుడు వ్యక్తిత్వం కోల్పోవడం జరుగుతుంది. ప్రతిభా, సామర్థ్యాల అభివృద్ధికి దారితీసే విలువైన ముందంజ వ్యర్థమైపోతుంది.

తనపట్ల తన ఆసక్తి, స్వయంవ్యక్తిత్వం మన బిడ్డ ప్రవర్తనలో ప్రాబల్యం వహించ నారంభిస్తే, అప్పుడు అతను వైవిధ్యపూరితమైన, అసహ్యమైన బలహీనతలకు, అంటే స్వార్థపరత్వం, జీవితానికి సరిపెట్టుకోవడంలో అసమర్థత, నిష్క్రియాత్మకమైన పగటి కలలు, వగైరాలకు గురి అవుతాడు.

మరి యీ మూడు అవసరాలూ (కార్యాచరణకోసం, మానవ సహవాసంకోసం, మెరుగుదలకోసం) నిరంతరాయమైన పరస్పర సంబంధితాలైతే, ఒకదాన్ని మరొకటి ప్రేరేపించ గలుగుతాయి.

కాని ఓ కొత్త ప్రశ్నల పరంపర మనస్సుకి స్ఫురిస్తుంది.

సంతోషంగా వున్న కుటుంబం మాత్రమే సంతోషంగా వుండే పిల్లవాడిని పెంచగలుగుతుందనడం నిజం కాదా? అదే నిజమైతే, ఒకదాన్నుంచి మరొకటి విడదీయరాని విసుగెత్తించే యీకింది కొత్త ప్రశ్నలు ఉత్పన్నం అవుతాయి: తల్లితండ్రుల సంతోషం పిల్లవాడి సంతోషాన్ని ఏ మేరకు నిర్ధరిస్తుంది? తన తల్లితండ్రుల, తాతబామ్మల, తన చుట్టూ వున్నవాళ్ల జీవితాల్లోని క్లిష్ట క్షణాలను పిల్లలు అర్థంచేసుకునే మాదిరిగా వాళ్లకి నేర్పడం ఎలాగ? పిల్లవాడిలో యితరుడి జీవితం గురించి, యితరుడి కష్టం గురించి అవగాహన కలిగించడం ఎలాగ? ఒకరిపట్ల సానుభూతి చూపడం భారం కాక, ఆనందకర విషయమని పిల్లలు గ్రహించేలా చేయడం ఎలాగ?

ఇటీవల చిత్తక్షోభతో బాగా సతమతమవుతున్న ఒక తల్లి నాకు తారసిల్లింది. "నేను నా అవసరాలను కూడా పూర్తిగా మానుకొని, నా కూతురికి నేను యివ్వగలిగిన ప్రతీదీ యిచ్చాను. దానికి బదులుగా దాని పూర్తి కృతఘ్నత లభించింది నాకు. ఎందుకు? ఎందుకంట?" అంటూ ఆవిడ మొత్తుకుంది. తల్లితండ్రులనుంచి యిలాంటి మొత్తుకోళ్లు తరచుగా

వింటూ వుంటాం. ఆవిడకి నేనిలా జవాబిచ్చాను. పిల్లవాడు తనకి సన్నిహితులైనవాళ్లకి కాదని తన అవసరాలు తీర్చుకోకూడదు. అది అతని స్వభావంమీదా, అతని వ్యక్తిత్వంమీదా నష్టదాయకమైన ప్రభావం కలిగిస్తుంది. ఈ అంశంమీద ఎ. మకారెంకొ నిర్ద్వంద్వంగా తన అభిప్రాయం చెప్పాడు. తల్లితండ్రులు సినిమాకి వెళ్తే, ప్రధానంగా తమకి (అటు తర్వాత తమ పిల్లలకి) అందమైన దుస్తులు కుట్టిస్తే, ఆసక్తికరమైన పనిచేస్తే, ఒక్క మాటలో చెప్పాలంటే సంతోషంగా వుంటే, అప్పుడు వాళ్ల జీవితమే విధిగా పిల్లవాడి పెంపకంమీద సానుకూల ప్రభావం కలిగిస్తుంది. పైపెచ్చు, తల్లితండ్రుల సంవేదనలు పిల్లల సమరస పెంపకానికి గల సాధనాల్లో ఒకటి అని చెప్పాడు మకారెంకొ. "మీరు మంచి పిల్లలు కావాలని కోరుకుంటే, మీరు సంతోషంగా వుండండి. మీరు మీ ప్రతిభా సామర్థ్యాలన్నింటినీ ఉప యోగించండి, మీ మిత్రుల్నీ, పరిచితుల్నీ తీసుకురండి, అయితే నికరమైన మానవీయ సం తోషంతో ఆనందంగా వుండండి."*

నేనింతకు ముందు పేర్కొన్న ఆవిడ ఎప్పుడూ చిరాకుగా వుండడం, జీవితంపట్ల అసంతృప్తిగా వుండడం ఆమె అస్వస్థతకి దారితీసింది. ఆవిడ యీ స్థితినుంచి బయటపడ లేదు, బయటపడేందుకు ఏమీ చేయలేదు. ఇవన్నీ చాలనట్లు, ఆవిడ తన కూతురి ముందు గాభరా పడుతుంది. తనని కూతురు బుద్ధిపూర్వకంగా హేళన చేస్తోందని భావించింది. "నాకు ఒంట్లో బాగా లేనప్పుడు నా కూతురు పనిగట్టుకొని యింటికి ఆలస్యంగా వస్తుంది. నేను పడకమీద వుండటాన్ని అది సహించలేదు... ఒకసారి అదేమందో తెలుసాండి, 'నువ్వు వికృతంగా తయారయ్యావు...' అంది. అయితే, తనకొక కొత్త జాకెట్ కొనేందు కోసం నేను ఖరీదైన మందులు తీసుకోవడం కూడా మానుకున్నానని దానికి తెలుసు..."

అలాంటి సందర్భంలో చెప్పగలిగిందల్లా యిదే: పరభాగ్యోపజీవి అయిన ఒక నిర్దయు రాలిని పెంచాలని అనుకుంటే, మీరు మీ అవసరాలు వేటినీ తీర్చుకోకండి. మీకు అత్యవసర మైన మందులూ, వస్తువులూ సైతం కొనుక్కోకుండా, మీరు మీ పిల్లల చపలమైన కోర్కెలు తీరుస్తూ వుండండి.

ఇది చెప్పటం చాలా తేలికే గాని ఎవళ్లైనా ఆచరణలో ఏం చేస్తారు అంటూ జనం నాతో వాదిస్తూ వుంటారు. ఏముంది, మీరు దృఢంగా వుండండి. నేనేదైనా అందమైన వస్తువు నాకోసం కొనుక్కున్నప్పుడు నా కొడుకు కళ్లలో ఈర్ష్య మెరుస్తూ వుంటుంది. నిజమే గాని, అదే సమయంలో, తన తండ్రి యీ వస్తువును కలిగి వున్నందుకు వాడు సంతోషించడం కూడా నేను గమనిస్తాను. వాడి అంచనాలో "ఫేషను దుస్తులు" అంటే వాడికి గర్వ లేశం వుంది. ఈ గర్వం వాడి ఈర్ష్యా లేశాన్ని, నా విద్యార్థుల్లో ఒకడు చెప్పి

* ఎ. మకారెంకొ, "కలెక్టెడ్ వర్క్స్" (7 సంపుటాల్లో), సంపుటి 4, మాస్కో, 1958, పేజి 460 (రష్యన్‌లో).

నట్లు, "ఓడిస్తుంది". అయితే మనం ఎప్పుడూ తప్పకుండా వాడికి కూడా "ఫేషను దుస్తులు" కొనేందుకు ప్రయత్నిస్తామని నేను జోడించవలసి వుంది. మరి వాడు తన తల్లికి కూడా ఏదైనా కొనాలనీ (అలా కొనడంలో వాడు కూడా నాతో కలుస్తాడు), అటు తర్వాతనే తనకి కొనాలనీ వాడు నిరీక్షిస్తాడు. ఇదీ తార్కికంగా ఆరోగ్యకరమైన మానవీయ సంబంధాల తర్కం.

నిజమే, పిల్లవాడి నిర్దయాశీలం విచారకర విషయాల్లో మిక్కిలి తీవ్రమైనదనడంలో సందేహమేమీ లేదు. పిల్లవాడు వైయక్తికమైన "తెలియని" స్థితిలో వున్నప్పుడు, పెద్ద వాళ్ల విచారాన్ని గాని, ఒంటరితనాన్ని గాని, లేక మరే యితర సంశ్లిష్ట వేదనలను గాని గుర్తించ కోరనప్పుడు యిది సంభవిస్తుంది. పిల్లవాడి క్రూరత్వం తరచు "ఆరోగ్యకరమైన మనస్తత్వపు మిగులు"కి, మనుషుల బాధను గుర్తించ నిరాకరించడానికి ఫలితం. అయితే యీ పిల్లవాడి మనస్తత్వం మరొకరి కష్టసుఖాల్లో పాలు పంచుకోవడం ద్వారా ఆర్ద్ర మైనప్పుడు మాత్రమే నిజానికి ఆరోగ్యంగా వుంటుంది. అయితే, నీకు నేను కొత్త కోటు కొంటాను, నువ్వు నామీద మనఃపూర్వకమైన దయచూపు అని చెప్పే కొందరు తల్లులు అనుసరించే పద్ధతిలో యిది సాధ్యం కాదు.

"అంటే దీని అర్థం పిల్లలని ఒక్క ఆనందంమీద మాత్రమే ఆధారపడి లేక 'ఉన్నత' సంతోష రీతులమీదనే ఆధారపడి పెంచకూడదన్న మాట?" అనే ఇంకో కొత్త ప్రశ్న వింటూ వుంటాను.

నిస్సందేహంగా, ఆనందానికి మాత్రమే ఎవరూ పరిమితం కాకూడదు. అయితే విచారాన్ని ఎవరూ తమకి యిష్టం వచ్చినట్లు మలచలేరు. అయితేనేం, జీవితంలో అది సంభవిస్తుంది గనుక, క్లిష్ట పరిస్థితుల్లో హుందాగా బయటపడటం, అదే సమయంలో యితరులను గురించి మరచిపోకుండా వుండటం అవసరమని పిల్లవాడికి నేర్పవలసి వుంది. ఇతరులను గురించి అన్న మాటలను నేను వక్కాణిస్తున్నాను.

పిల్లవాడిలో దయ వంటి స్వభావసిద్ధమైన లక్షణాన్ని పెంపొందించవలసిన అవసరం గురించి నేను ఆలోచిస్తున్నాను. ఎందుకంటే దయలో విధి, తరచు ఆత్మత్యాగం రెండూ కూడా యిమిడి వుంటాయి. ఎప్పుడూ బాగా ఉండి, కొంత భాగాన్ని యితరులకు యిచ్చేసే వాళ్లు కాక, తమకి వున్న దాంట్లో చివరి పైసదాకా యిచ్చేందుకు సిద్ధపడే వాళ్లే దయాళువులు, ఔదార్యవంతులు. అయితే మనం యిక్కడ మాట్లాడుతున్నది త్యాగం గురించి కాదు! నికరంగా మంచివాడుగా ఉండటం ద్వారా తనని తాను పరీక్షించుకోవడం పిల్లవాడి ఆవిష్కరణల్లో కెల్ల మిక్కిలి గొప్పది. ఉన్నత కార్యం చేయడంలో లభించే ఆనందాన్ని, అసలు మొత్తంగా ఉదాత్తమైన ప్రవర్తన లభించే ఆనందాన్ని అర్థంచేసుకోవడమే మానవ ఆనందం — ఒక పౌరుడిగా, విడి వ్యక్తిగా ఒకడి ప్రవర్తనలో మానవ ఆత్మ వ్యక్తీకరణ అత్యున్నత కొలమానం.

మొత్తం జీవితానుభవం మనిషిని తీర్చిదిద్దుతుంది. చాలావరకు అది పరిస్థితులమీద ఆధారపడుతుంది. అయితే, అంతకంటె ఎక్కువ స్వయంగా మనిషిమీదనే ఆధారపడుతుంది. ఎందుకంటే, నైతిక ప్రారంభ అంశాలను అది పునస్సంఘటితం చేస్తుంది, ఎలాంటి పరిస్థితుల్లోనైనా, ఎలాంటి పరిసరాల్లోనైనా అది మనిషి హుందాతనాన్ని తెలియజేస్తుంది – కనుకనే ఆ వ్యక్తి ఒక వ్యక్తి.

...ఓ కౌమార వయస్కుడు దాదాపు పూర్తిగా రెండు వారాలపాటు సోమరిగా గడిపాడు. అతను యింటికి వచ్చి, కాలుకాలిన పిల్లిలా అటూయిటూ తిరుగుతాడు. తన స్కూలు హోమ్‌వర్కు తప్ప మిగతా పనులు ఏవేవో చేస్తూ వుంటాడు. అలా హోమ్‌వర్కు చెయ్యకపోవడానికి ఎన్నెన్నో కారణాలు, సహేతుకంగా కనిపించే కారణాలు ఏకరువు పెడతాడు. తనకి తల నొప్పిగా వుందంటాడు, కడుపు నొప్పిగా వుందంటాడు, అదీ కాకపోతే అసలు హోమ్ వర్కు యివ్వలేదంటాడు. చివరకి "నాకు మంచి మార్కులే వచ్చాయి" అని చెప్తాడు.

కొన్ని సందర్భాల్లో కుర్రాడు అలసిపోతాడు, అమితంగా హోమ్‌వర్కు యిచ్చినప్పుడు వాడికి ఉన్నట్లుండి చదివే సత్తా తగ్గుతుంది, అది తరచు వాడి సోమరితనానికి దారితీస్తుంది. ఇది దారుణమైన పరిస్థితి! సోమరితనానికి అలవాటుపడితే అది మరింత పెరుగుతుంది, క్రమేణా అది వాడి జీవితానికి ఒక శాపంగా పరిణమిస్తుంది. కొంచెం ముందు వెనకల్లో వాడికి కష్టపడి బాగా చదివే కుర్రాళ్లతో పరిచయం ఏర్పడుతుంది. అప్పుడు వాడు తన తల్లితండ్రుల్ని మీ పెంపకం యిలా అఘోరించింది అని దెప్పి పొడుస్తాడు. అందుచేత వాడికి యీ విషయం ముందు యిప్పుడే చెప్పాలి. అందులోనూ బాగా నిర్మొగమాటంగా కచ్చితంగా "ఇదిగో అబ్బాయ్, నీకు ముందే మేము చెప్పలేదని మమ్మల్ని నిందిస్తే యేమీ ప్రయోజనం లేదు. నీ సోమరితనంతో నువ్వు పాడైపోవడం, బాధపడటం నాకు యిష్టం లేదు. అందుకని, లేచి పనిచెయ్యి..." అని చెప్పాలి.

తల్లితండ్రులు యీ విషయంలో గట్టిగా పట్టుపట్టాలి. పిల్లవాడికి మీరు చెప్తున్న మాటలు సరైనవనే విషయంలో ఏ మాత్రం అనుమానం కలగని స్వరంలో మీరు చెప్పాలి. హేతుబద్ధమైన డిమాండ్లను పిల్లలు మనస్సులో ఎప్పుడూ స్వీకరిస్తారు. జీవితంలో నిర్ద్వంద్వంగా పాటించవలసిన కొన్ని నియమాలు ఉన్నాయని వాడు తెలుసుకోవాలి. వాటిలో రోజువారీ పని ఒకటి. తిండి, నిద్ర మాదిరిగానే పని కూడా మనిషి యీ ప్రపంచంలో సంతోషంగా జీవించేందుకూ, తనలో నిబిడంగా వున్న మానవ శక్తులను వెలికితీసేందుకూ అవసరం.

"అయితే కొందరు బోధనశాస్త్రజ్ఞులు పిల్లవాడి జీవితాన్ని, ప్రత్యేకించి వాడి పని జీవితాన్ని, సక్రమంగా ఏర్పాటుచేస్తే చాలుననీ, అప్పుడిక వాడి స్వభావంలో ప్రతీదీ దాని సక్రమ స్థానంలో సర్దుకుంటుందనీ చెప్తారు."

ఇది పూర్తిగా సరి కాదు. మానసిక ప్రపంచంలో ఏదీ దానంతట అది సంభవించదు.

హృదయం, మెదడు, లేక ఆత్మ పని, అధ్యయనం, మరే యితర పని అయినా ఎంత సంశ్లిష్టం, శ్రమైక సాధ్యమో యిది కూడా అంతే సంశ్లిష్టం, శ్రమైక సాధ్యం. అందుకని, "పిల్లవాడికి మీరు ప్రేమించడం నేర్పితే, మీరు వాడికి అన్నీ నేర్పగలుగుతారు!" అని చెప్తాను నేను.

అలాంటి సూత్రం అసందర్భంగా కనిపించవచ్చు. అయితే దాన్ని పరిశీలించి చూద్దాం. పని అన్నది మనిషితో సంబంధాలచేత ప్రేరేపించబడకపోతే, అలాంటి శ్రమకి విలువ ఏమిటి? పిల్లవాడు శ్రమలో మానవ సంతోషపు పరిధినంతనీ, మనిషిపట్ల అతని ప్రేమ అంతనీ దర్శించవచ్చు. అది ఎవరిపట్ల, తన తండ్రిపట్లా లేక తల్లిపట్లా, బామ్మపట్లా లేక పిన్నమ్మపట్లా, తన తోటివాడిపట్లా లేక సన్నిహిత నేస్తంపట్లా, ఉపాధ్యాయుడిపట్లా లేక మొత్తం పాఠశాల సమష్టిపట్లా అన్నది అంత ముఖ్యం కాదు. ఎందుకంటే, మనిషికి సంబంధించినంతవరకు, తనకోసం తాను జీవించే మానవ అస్తిత్వపు అర్థం యితరులకోసం కూడా జీవించాలన్నదే. మనిషి తనకోసం మాత్రమే తను జీవిస్తే (తన పని ద్వారానైనా సరే!), అప్పుడిక అలాంటి మనిషి సార్థకత ఏమిటి? — ఇదీ విశ్వవిఖ్యాత సోవియట్ రచయిత మక్సీమ్ గోర్కీ తన కాలంలో "నేను"కీ, "మనం"కీ మధ్య సంబంధాన్ని వ్యక్తం చేసిన తీరు.

ఒక వ్యక్తిలో ఆత్మ స్థైర్యాన్నీ, ఓర్మినీ సున్నితమైన భావోద్వేగంతో, మరొకరి విచారాన్ని అనుకంపతో, దయతో మేళవించేందుకు తయారై సిద్ధంగా వున్న చిట్కా లేమీ లేవని నేను యింతకు ముందే పేర్కొన్నాను. అయితే, సంతోషంగా వుండే పిల్లవాడిని పెంచేందుకు మౌలికమైన సూత్రం ఒకటి వుంది. నేనొక ప్రశ్నని రెట్టిస్తున్నాను: ఎవరైనా దేని పేరిట శ్రమ చెయ్యాలి లేక ఏదైనా ఒక నైతిక లేక సాంఘిక చర్యని నిర్వర్తించాలి? కేవలం మనిషి పేరిట చెయ్యాలి. కుటుంబం పేరిట, తోటివాళ్ల పేరిట, సమష్టి పేరిట, సమాజం పేరిట చెయ్యాలి. ప్రతి ఒక వ్యక్తి ప్రతిభా సామర్థ్యాలను అందరి క్షేమంకోసం పూర్తిగా పైకి తేవడం పేరిట చెయ్యాలి.

## తమ పెంపకానికి తామే కర్తలుగా పిల్లలు

ఒక పిల్లవాడిలో వ్యక్తిత్వం రూపొందడమన్నది నాకు వసంత కాలంలో పక్షి ఆకాశంలో విహరించడాన్ని జ్ఞప్తికి తెస్తుంది: ఒకసారి తను ఎక్కడికి ఎగురుతున్నదీ ఆ పక్షికి తెలుసుననిపిస్తుంది, మరొకసారి దానికి తెలియదనిపిస్తుంది. అది కొంత ఎత్తుకి ఎగిరాక, చటుక్కున కిందకి దిగుతుంది, లేకపోతే వేగంగా మబ్బుల్లోకి దూసుకుపోతుంది. స్వేచ్ఛా, బలం, శక్తుల ఎంత అబ్బురమైన కేంద్రీకరణో యిది!

ఒక చిన్న పిల్లవాడిని చూసినప్పుడు, వాడి కళ్లలో ఆత్మావిష్కారానికి సంబంధించిన సంతోషమయమైన వెలుగు కనిపిస్తుంది. ఆత్మావిష్కారం ఉన్ననాడు అసామాన్యమైన వ్యక్తిత్వం అవ్యక్తమైన సుందర వర్ణాల్లో ప్రకాశిస్తుంది...

బహుశా యిది వాస్తవంపైన కాక మన ఆశలపైన ఆధారపడిన ఆలోచనేమో? మనల్ని మనం మోసగించుకుంటున్నామేమో?

మనం వేచి చూస్తాం. మనం పాక్షిక దృష్టితో గమనిస్తాం. మనం ప్రతిదాన్నీ త్వరితం చెయ్యాలని కోరుకుంటాం. ప్రతిభా సామర్థ్యాలు వెల్లడి కావాలనీ, ఆరోగ్యం కొరవడకుండా వుండాలనీ మనం ఆశిస్తాం.

మనకి మన పిల్లలు తెలుసునన్న దృఢ విశ్వాసంతో, మనం వాళ్లకి చక్కటి, సరైన, కఠినమైన, దయతో కూడిన బోలెడు మాటలు చెప్తాం. అయితే, ఆవశ్యకమైన ఆ మాటలతో ఎంత తరచుగా మనం మన ఆకాంక్షని, అహంభావాన్ని, ధాష్ట్యాన్ని "రంగరించి" చెప్తామో. పిల్లల విషయంలో పెద్దవాళ్ల మనస్తత్వం నిరంతరం ఆ పిల్లలకి ఏదో ఒకటి నేర్పాలన్న ఒక మాదిరి ధోరణితో కూడివుంటుంది. పెంపకం విషయంలో మనం యింత ఒత్తిడి తెచ్చేందుకు కారణం కచ్చితంగా ఏమిటంటే, ఆ క్రమంలో సాపేక్షమైన మన సొంత మనశ్శాంతిని సంపాదించుకోవడమే. బట్టలు ఉతకడం, వంటచేయడం, తదితర వందలాది వివిధ రోజువారీ బాదర బందీలదాకా, మనం ఎలా చూస్తామో పిల్లల పెంపకం గురించి కూడా మనం అలాగే చూస్తాం. మనం ఎంత హడావిడి పనుల్లో వున్నామో మనం మన పిల్లలకి నిరంతరం జ్ఞాపకం చేస్తూ వుంటాం.

అయితే, పిల్లలకి కూడా బోలెడు పనులు వుంటాయి. బడికి పోయే ఒక కుర్రాడు తన కాలాన్ని ఎలా ప్లాన్ చేసుకుంటాడో సినీ ఫిల్ముమీద రికార్డుచేయగలిగి, దాన్ని సమీక్షించుకున్నప్పుడు రోజువారీ క్రమంలో వాడికి ఎదురయ్యే తీవ్ర ఆటంకాలపట్ల మనం సానుభూతి చూపిస్తాం...

వాడికి ఐదు పాఠాలు వుంటే, వాటిలో ప్రతి ఒక్కదానిలోనూ వాడు సన్నద్ధం కావాలి. విరామ కాలంలో వాడు లాభసాటిగా రెండు మేకులను ఒక గాజు గోళీకి, రెండు స్టాంపులను పగిలిన ఒక స్విచ్చికీ మారకం చేసుకోవాలి. ఆ తర్వాత వాడీ పగిలిన స్విచ్చిని టెలిఫోన్ రిసీవరు ముక్కకి మార్పిడిచేసుకోవాలి. బడి తర్వాత వాడికి క్లబ్బు కార్యకలాపాలు, సంగీతం పాఠాలు వుంటాయి. వీటికితోడు వాడు స్కీలమీద దూకేందుకుగాను బాగా ఎత్తైన చోటుకి ఆదరా బాదరా పరుగెత్తాలి. అయితే యిదంతా రహస్యంగా గప్‌చిప్‌గా జరగాలి. ఆటు తర్వాత వాడు తన హోమ్‌వర్కును ఏ ఇరవై నిముషాల్లోనో – తన తల్లి తనిఖీ చెయ్యబూనుకోకుండా వుండేలా – చేసిపారెయ్యాలి. తండ్రితో వాడికి కొంచెం తేలిక. "నేను అన్నీ నేర్చేసుకున్నాను" అని చెప్తే చాలు, తండ్రి "మంచిది: ఇప్పుడింక ఏదైనా పుస్తకం చదువుకో" అని, నువ్వింక సీరియస్ పుస్తకాలు చదవాలి అంటూ చిన్న అచ్చులో వున్న ఓ పుస్తకం యిస్తాడు. అయితే,

యిక్కడొక చిక్కు వున్నమాట నిజమేననుకోండి. పుస్తకం చదువుతూ ఏక కాలంలో టి.వి. చూడటం అల్లాటప్పా పనేమీ కాదు. కాని కుర్రాడు నేర్పు సంపాదిస్తే, అసలు పుస్తకం కేసి చూడకుండానే సరిపోతుంది. ముఖ్య విషయం యేమిటంటే, పుస్తకాన్ని కళ్లకి బరాబరి ఎత్తున పట్టుకోవడం, మధ్య మధ్య తండ్రిని తెలివైన ప్రశ్నలు "సెమీ కండక్టర్" అంటే ఏమిటనో, లేకపోతే "మార్మికత" అంటే ఏమిటనో – అడుగుతూ వుండటం.

అన్నింటికన్న విచిత్రమైన విషయం యేమిటంటే, ఒక కుటుంబంలో అందరూ కలిసి జీవిస్తూ వంటారు, అయితే ప్రతి ఒక్కరూ తన సొంత ప్రపంచంలో జీవిస్తారు. ప్రతి ఒక్కరికీ తన సొంత చిన్న, పెద్ద రహస్యాలు వుంటాయి. మరైతే ఒక వ్యక్తి సొంత ప్రపంచం అంటే – మనం మనస్తత్వం లేక వ్యక్తిత్వం అంటామే అది – ఏమిటి?



ఒక వ్యక్తి నిర్మాణరూపాన్ని రూళ్లకర్ర, ఓ రెండు కంపాసులూ తీసుకొని చిత్రించడం సాధ్యమే అనుకోండి. కాని యీ చిత్రం చిన్న సజీవ వ్యక్తికి ఎంత దూరంగా వుంటుందో! అంతే కాదు, యీ చిత్రం మూల వ్యక్తి అచల లక్షణాన్ని మాత్రమే తెలుపుతుంది. అది రక్త మాంసాలు లేకుండా, రహస్యాలు, ఆశలు లేకుండా, విచారపూరిత స్వరాలు, హుషారైన నవ్వులు లేకుండా వుంటుందని వేరే చెప్పనక్కర్లేదు.

దీని అర్థం పిల్లవాడి వ్యక్తిగత మనస్తాత్విక నిర్మాణంలో స్థిర అంశాలు వుండవనా? అదెంత మాత్రం కాదు. అసలు వ్యక్తే స్థిరమైన ఒక మొత్తం. ఈ మొత్తం సారం అది చలనంలో మాత్రమే పదిలపరచబడి వుండటంలో యిమిడివుంటుంది.

చలనం, కార్యాచరణ లేనిదే వ్యక్తి ప్రకృతి, సామర్థ్యాలు, స్వభావం, ఆత్మచైతన్యం,

విలువదిక్సూచికలు వుండవు. ఈవిధంగా, వ్యక్తిత్వ నిర్మాణపు ప్రాతిపదిక అంశాలను మనం చెప్పుకున్నాం. ఈ లక్షణాలు ఒకదాన్నుంచి మరొకటి విడదీయరానివి, అవి పరస్పరం ఒక దాన్ని మరొకటి అభివృద్ధి చేయడంమీద ఆధారపడి వుంటాయి, పరిసరాలు, పెంపకాల ప్రభావంలో వ్యక్తిత్వంతోబాటు అవి మారుతాయి.

బోధన శాస్త్రమూ, మనస్తత్వ శాస్త్రమూ స్వయంగా పిల్లవాడు, అంతేగాక పరిస్థితులు, అతని పెంపకమూ వ్యక్తి రూపొందడంలో పాత్ర వహిస్తాయి. కాగా, వ్యక్తి అభివృద్ధి క్రమం వివిధ కార్యకలాపాల రంగంలో సాగుతుంది.

పెరుగుతున్న వ్యక్తి తన ముందు నిరంతరాయంగా ఆవిష్కృతమవుతున్న ప్రపంచాన్ని పరికించి, స్వాయత్తంచేసుకోవలసిన సర్వశక్తివంతమైన అవసరం బొత్తిగా ఊహించని ఫలి



తాలకు దారితీస్తుంది. అతని శరీరం, సంవేదనలు, మనస్తత్వం యిష్టమైన జీవిత కార్య కలాపాలపట్ల తిరుగులేని విధంగా ఆకర్షింపబడటమే గాక, అవి వాటితో సంలీనమవుతాయి. వస్తువులు, కోర్కెలు, ఆకాంక్షలు, డంబాల యీ సజీవమైన, అనూహ్యమైన, శక్తివంత మైన, విపుల ప్రపంచంలో పిల్లలు విడదీయరాని ఒక భాగం అవుతారు. చుట్టూ వున్న వాస్తవికతతో అసదృశమైన సజీవ సంబంధాలు ఉత్పన్నమవుతాయి. కచ్చితంగా సజీవ సంబంధాలు. ఎందుకంటే, యీ సంబంధాలు వ్యక్తి శారీరక, నైతిక పెరుగుదలకు దోహదం చేస్తాయి.

పిల్లల దృష్టిలో ఒక నది, అడవి, పెరడు, స్నేహితులు, ఒక ఫుట్‌బాల్ ఆట స్థలం, లేక వీధుల్లో నడకకి సంబంధించిన ప్రాముఖ్యం ఏమిటి? అవేవో ద్వితీయ ప్రాధాన్యం కలిగి

నవి కావు. అవన్నీ నైతిక, సౌందర్య శాస్త్రీయ, భౌతిక మహానందపు జీవితం, లక్ష్యం, మూలాధారం. అది అనుభవానికి సంబంధించిన ఒక మొత్తం ప్రపంచం, స్వభావ యిచ్ఛల మధ్య ఘర్షణ.

మీ సొంత బాల్యపు దృష్టితో చుట్టూ చూడండి. బాల్యంలో మీరు నివసించిన స్థలాలను చూసిరండి. అతి సాదా వస్తువులు, స్వల్ప వివరాలు, ప్రకృతి "చిన్న తావులు" మిమ్మల్ని ఎలా ఉత్తేజితం చేస్తాయో మీరు అనుభూతి చెందుతారు. ఆ తావులు సుందరమైనవి గనుక కాక, అవి మీ దృష్టిలో అపూర్వమైనవి గనుక, వాస్తవ ప్రపంచపు యీ వివరాలు మీ స్మృతిలోకి మీ బాల్యపు అనుభవాలతో కలిసి చొరుచుకు వెళ్లాయి గనుక.

మీ కళ్లతో మీరు నది నున్నటి, అద్దం వంటి ఉపరితలంకోసం మాత్రమే కాక, ఏవో కొన్ని పరిచితమైన తావులకోసం గాలిస్తారు. ఇదిగో యీ ఒడ్డారకపు గట్టుమీదనుంచే, పిరికివాడిని కానని నిరూపించేందుకు మీరు మొట్టమొదట దూకారు. ఈ ఒడ్డారకపు గట్టు చాలా కాలంపాటు మీకు మనశ్శాంతిని దూరంచేసింది. మీరు దాన్ని కలల్లో ఎన్నో సార్లు దర్శించారు. ఇప్పటికీ మీరు కుంటుళ్లు ఆడుతూ ఒంటి కాలిమీద గెంతుతున్న, పక్కవాళ్లందరి కంటె బిగ్గరగా అరిచేందుకు ప్రయత్నిస్తున్న యితర పిల్లల్ని చూస్తూ వుంటారు. వాళ్ల చుట్టూ పూర్తి నిశ్శబ్దం అలుముకొని వుంటుంది. మీరు వాళ్ల కేసి చూసినప్పుడు, తిరిగి రాకుండా మీ బాల్యం గతంలోకి వెళ్లిపోయినందుకు మీ మనస్సు విచారంతో కూడిన ఉద్రేకం పొందుతుంది.

ఒక కుర్రాడు యింటికి వచ్చి హోమ్‌వర్కు చేసేందుకు కూర్చున్నప్పుడు చాలా తరచుగా అతని మనస్సులో ఒకే ఒక్క లక్ష్యం వుంటుంది. అదేమిటంటే, దాన్ని గురించి సాధ్యమైనంత త్వరగా మరచిపోవడం, పోయి తన యీడు పిల్లలతో కలవడం. చాలా మంది తల్లిదండ్రులు పిల్లలచేత చదివించేందుకు యీ "వీధి"ని ప్రధానాయుధాల్లో ఒకటిగా వాడుతూ వుంటారు. "నువ్వు హోమ్‌వర్కు చేసేస్తే ఆడుకునేందుకు వీధిలోకి పోవచ్చు" అంటూ వుంటారు. అయితే యీ "ఆట" పిల్లవాడి ప్రధాన ఉపాధ్యాయుడు కాగలదని వాళ్లు గ్రహించరు. తాము తమ పిల్లల్ని సక్రమంగా పెంచుతున్నామన్న కచ్చితమైన అభిప్రాయంతో వాళ్లీ మాటలు చెప్తారు. వాళ్లు "పెంపకం" గురించి ఆలోచిస్తారు గాని, తాము ఏ సంతోషంకోసం కృషిచేస్తున్నారో ఆ సంతోషాన్ని పిల్లల జీవితమే తమకి యిస్తుందనీ, వాళ్ల అభివృద్ధికి ప్రధాన వ్యవస్థీకరణ షరతూ, వాళ్ల పెంపకానికి ప్రాతిపదికా అదేనన్న విషయం మరచిపోతారు.

ఏదైనా ఒక సినిమా ఆకస్మికంగా మధ్యలో ఆగిపోతే, వికృతమైన, కన్నీళ్లతో తడిసిన పిల్లల ముఖాలను మీరెప్పుడైనా చూశారా? ఆ క్షణంలో సినిమాలో చిత్రింపబడిన మానసిక ముద్రకీ, పిల్లల ముఖాల్లో కానవచ్చే మనోస్థితికీ మధ్య ఎంతటి సజీవ సంబంధం వుందో మీరు గమనించాలి. వెండితెరమీద సృజింపబడిన ప్రపంచంచేత వాళ్లెంతగా ఆకృష్టం

చేయబడతారంటే, వాళ్ళు తమని తాము విస్మరించి, ఆ శబ్దాల్లో, బొమ్మల్లో కార్యాచరణలో అంతర్భాగం అయిపోతారు. ఇదంతా వాళ్ల మనస్సులమీద నిర్దిష్టమైన ముద్ర వేస్తుంది. అలా మరల మరల వాళ్ళు కనుగొన్న యీ సంవేదనలన్నీ పిల్లవాడి స్వభావాన్నీ, వ్యక్తిత్వాన్నీ మెరుగులు దిద్దుతాయి.

పెద్దవాళ్ల విధి ఏమిటంటే, పిల్లవాడు తన శక్తి సామర్థ్యాలను పూర్తిగా అభివృద్ధి చేసుకునేందుకు తోడ్పడటం. అయితే యీ తోడ్పాటు పిల్లవాడి ప్రవర్తనని తీర్చిదిద్దే విషయంలో నిర్దుష్టం చేసేందుకు లొంగుబాటుగా ఎంతమాత్రం ఉండకూడదు. పెద్దవాడు పిల్లవాడిని తీర్చిదిద్దేందుకు అనుకూలమైన పరిస్థితులను కల్పించగలిగి వుండాలి. పిల్లవాడి జీవితాన్ని సహేతుకంగా వ్యవస్థీకరించి, వాడి సహజ ప్రతిభలను సంపూర్ణంగా అభివృద్ధి చేసే కార్యకలాపాలతో వాడి మనస్సును వశంచేసుకోగల సామర్థ్యం కలిగివుండాలి.

తల్లితండ్రులు తమ పిల్లల పెంపకంపట్ల అనుసరించే భిన్న భిన్న పద్ధతులను, ప్రధానంగా నేను చేసిన కొన్ని సాధారణీకరణలమీద ఆధారపడి, నిర్దిష్టమైన ఉదాహరణల సహాయంతో విపులీకరిస్తాను.

పాఠకుడికి వోవ్కా జరూబిన్, అతని సహపాఠుల జీవితాన్ని పరిచయంచేసే క్రమంలో ఒక పిల్లవాడి ఆంతరిక ప్రపంచం, అతని సంవేదనలు, ఆసక్తులు ఏ తెరవెనుక దాగివున్నాయో ఆ తెరను తొలగించాలని ఆశిస్తున్నాను. మన పిల్లలకి చాలా ముఖ్యమైనది, వాళ్ల అభివృద్ధిలో నిర్ణాయక అంశం కాగలది ఏ క్షణాన అయినా సంభవించగలదన్న విషయాన్ని మరోసారి మీ దృష్టికి తేవాలని నేను ఆశిస్తున్నాను...

...5వ క్లాసు విద్యార్థి అయిన వోవ్కా తన హోమ్‌వర్కు చేసుకుంటున్నాడు. మధ్య మధ్య వంటింటినుంచి "బిగ్గరగా చదువు" అంటూ వాడి తల్లి స్వరం వినవస్తోంది. ఈ రోజున వాడికి ప్రకృతి శాస్త్రంలో ఫెయిల్ మార్కు వచ్చింది. అందుకని వాళ్ల అమ్మ వాడిని బయటకి వెళ్లేందుకు అనుమతించలేదు. వాడు కిటికీలోంచి బయటకి చూస్తూ, "ఉత్తరాదిన పాచి, నాచు పెరుగుతాయి" అంటూ యాంత్రికంగా చదువుతున్నాడు. కిటికీ బయట వాడి సహచరులు వున్నారు. వోవ్కా వెళ్లకపోతే ఫుట్‌బాల్ ఆట సాగదు, అందుకని వాళ్లకి వోవ్కా బయటకి రావడం అవసరం.

"అమ్మా, నాకు పాఠం అంతా వచ్చేసిందిగా, నన్ను బయటకి పోనియ్యి" అంటూ వాడు బతిమాలుతూ అడిగాడు. "వల్ల కాదంటే వల్ల కాదు. ఈ శిక్ష నువ్వు నెత్తిమీదకి తెచ్చుకున్నదే" అంది వాళ్ల అమ్మ.

వోవ్కా కిటికీ కొంచెం తెరిచాడు. "తొందరగా రా" అంటూ కుర్రాళ్లు అరిచారు. మానసికంగా వాడు ఎప్పుడో వాళ్లతో వున్నాడు. కిటికీలోంచి బయటకి దూకడానికి ఒక్క క్షణం చాలు! కాని అమ్మ! తర్వాత ఆవిడ "నేను నీకోసం అన్నీ చేస్తూంటే, నువ్వేమో..."

అంటూ సాధింపు మొదలెడుతుంది. అవతల కుర్రాళ్లేమో పసుపు పచ్చగా మిలమిల మెరిసే కొత్త బంతి చూపిస్తున్నారు. వోవ్కా తనలో తను అనుకుంటాడు: "ఆవిడగారు నన్నేం చేస్తుందేమిటి" తర్వాత అమ్మ దగ్గరకి వెళ్లాలని వాడు నిర్ణయించుకుంటాడు. ఆవిడ ఎప్పటిలాగే మళ్లీ "నేరుగా నాతో మాట్లాడి, స్పష్టంగా అడగడం మంచిది" అని రెట్టిస్తుంది. "అమ్మ నన్నీ ఒక్కసారి అర్థంచేసుకుంటే ఆవిడకోసం నేనేదైనాసరే చేస్తాను" అనుకుంటాడు వోవ్కా.

ఆ తల్లి తన కొడుకు వైపు చూస్తుంది. "ఏమిటి, నీకేం కావాలి యిప్పుడు?" "అమ్మా, నన్నిప్పుడు ఆడుకోడానికి పోనిస్తే నేనింకెప్పుడూ ఫెయిల్ మార్కులు తెచ్చుకోను" అన్నాడు వోవ్కా.

వాడికి యింకేమి చెప్పేందుకూ టైము లేకపోయింది. "ఓరి దౌర్భాగ్యుడా, అయితే నువ్వు బేరమాడేందుకు వచ్చావన్న మాట! నీ కెంత సాహసం!" అంటూ తల్లి తువ్వాలు విసిరి తన కొడుకును బెదిరించింది. వోవ్కా వంటింట్లోంచి పరిగెత్తుకుపోయాడు. వాడు తన పాఠం పుస్తకాన్ని టేబిలుమీద గిరవటేశాడు. ఇప్పుడిక వాడికి తల్లి అనుమతిని అడగకుండా పారిపోయేందుకు సాకు దొరికింది. "పాచి, నాచు ఉత్తరాదిన పెరుగుతాయి" అంటూనే వోవ్కా కిటికీలోంచి బయటకి దూకేశాడు.

అయితే, ఫుట్‌బాల్ ఆడటంలో మామూలుగా కలిగే సంతోషం యిప్పుడు కలగలేదు. వాడు బెదురుతూ బెదురుతూ వున్నాడు. తోటివాళ్లతో వాదించి, రెండు సార్లు అలిగి ఆటలోంచి తప్పుకున్నాడు. చివరకి వాడు ల్యోష్కతో దెబ్బలాటకి దిగాడు. బాగా చీకటి పడింది, అయినా వాడికి ఇంటికి తిరిగి వెళ్లబుద్ధి కాలేదు. కొన్ని సార్లు వాడు పొదలమీదుగా కిటికీలోకి తొంగిచూశాడు. ఒక పొరుగు ఆమె తన తల్లికి ఏదో చూపిస్తోంది. వాళ్లిద్దరూ నవ్వుతున్నారు. వాడు యిలా జరుగుతుందని ఎన్నడూ అనుకోలేదు. "తన కొడుకు యింట్లో లేకపోయినా ఆవిడగారికి ఏమీ పట్టలేదన్న మాట" అనుకున్నాడు వాడు బాధగా. "అంటే ఆవిడకి నేనక్కర్లేదన్న మాట. అయితే సరే" అనుకుని, వాడు పొదల్లో చదికిలబడ్డాడు. తన తల్లి తనకోసం ఎలా గట్టిగా కేకేసి అడిగిందో, "ఔను, వాడు యిందాక యిక్కడున్నాడు" అంటూ కుర్రాళ్లు ఎలా జవాబిచ్చారో వాడు విన్నాడు. ఇప్పుడిక తన తల్లి ఎదురుచూస్తుందనీ, ఆదుర్దాపడుతుందనీ వాడికి తెలుసు. వాడు వాకిట్లోంచి గప్‌చిప్‌గా వెళ్లిపోయి, వీధిలో తిరగడం మొదలెట్టాడు. వాడు ఇంటికి ఆలస్యంగా తిరిగివచ్చాడు.

వోవ్కా జరూబిన్ జీవితంలో యివి ఒక రోజు దురదృష్టాలు. అయితే వాడి జీవితంలో చిన్న సంతోషాలు కూడా ఉన్నాయి. వాడు టెస్టు పరీక్షలో ఒక లెక్క సరిగా చెయ్యడమే గాక, పక్క బెంచిమీద కూర్చున్న ల్యోష్కకి నేర్పుగా లెక్క కాపీ కూడా అందజేశాడు. వాడి ఘన కార్యాల్లో కెల్ల పెద్దది కోస్త్యని వెనకేసుకురావడం. కోస్త్య క్లాసులో అందరికంటె చిన్నవాడు. కుర్రాళ్లు వాడిని "కుంటాడు, కుంటాడు" అంటూ ఏడిపిస్తూండేవాళ్లు

(నిజంగానే వాడికి ఒక కాలు కుంటి). ఈ రోజున వాడి క్లాస్‌మేటు వీక్టార్ కోస్త్యని ఏడిపించడం మొదలెట్టే సరికి, వోవ్కా "జాగ్రత్త నీ బుర్ర రామకీర్తన పాడుతుంది" అంటూ వాడిని బెదిరించాడు. "ఓస్, నువ్వా?" అంటూ వెడగ నవ్వు నవ్వాడు కోస్త్య. "నేనే, వాడిని యింకో సారి కుంటాడు అను, అప్పుడు చెప్తా నీ పని" అన్నాడు వోవ్కా. "అంటాను రా, ఒక సారి కాదు, పది సార్లు అంటాను" అంటూ కోస్త్య సాగదీసుకుంటూ "కుంటాడు, కుంటాడు" అంటూ పది సార్లు రెట్టించాడు. అదిగో ఆ ఘట్టంలో యీడ్చి కొట్టాడు వోవ్కా కోస్త్యని.

ఈ రోజున కోస్త్య "టిల్ ఉలెన్‌ష్పీగెల్ గాథ" అనే ఓ కొత్త పుస్తకం తెచ్చాడు. మొత్తం విరామ కాలం అంతట్లోనూ కోస్త్య ఆ పుస్తకంలోని కథ చెప్తూనే వున్నాడు. ఎంత ఆసక్తికరంగా వుంది! "ఏమిటి, నీ అంతట నువ్వే పుస్తకాలు చదివేస్తావా? ఎవరూ నీచేత చదివించరా? నువ్వు పైకి బిగ్గరగా చదువుతావా?" అని అడిగాడు వోవ్కా. బయటకి ఆడు కోడానికి వెళ్లకుండా, ఒక వేళ యింట్లోంచి బయటకి పోనివ్వకపోతే ఏదో ఒకటి చేస్తూ యింటి దగ్గర కూర్చోకుండా ఎవరైనా కూర్చుని తనంతట తను ఒక పుస్తకం ఎలా చదువుతారో వోవ్కా ఊహించుకోలేకపోయాడు.

ఈ రోజున వాడు తను కూడా ఓ పుస్తకం చదివేందుకు ప్రయత్నించాలని అనుకున్నాడు. ప్రకృతి శాస్త్రంలో తనకి ఆ ఫెయిల్ మార్కు రాకపోయి వుంటే, వాడు బహుశా చాలానే చదివివుండేవాడు.

...గదిలో చీకటిగా వుంది. వీధి దీపపు కాంతి వాడి తల్లి గోడ వైపు పడుకున్న మంచంమీద పడింది. ఆ కుర్రాడు చెవులు రిక్కించి విన్నాడు. వాడు ఆవిడని ఏదో అడగాలని అనుకున్నాడు. కాని "నీతో నేను మాట్లాడను" అంటూ ఆవిడ చెప్పబోయే సమాధానం తలుచుకుని వాడు జంకాడు. ఆ రోజున జరిగిన ఘటనలన్నీ వాడి బుర్రలో సినిమా రీలులా తిరిగాయి. పాఠాల తరువాత కోస్త్యా, తనూ పోస్టాఫీసుకి వెళ్లి కొన్ని స్టాంపులు కొనాలని అనుకున్నారు. కాని టీచరు వాడిని వెనక్కి ఆపేసింది. "నీ ప్రవర్తనకి ఏం సమాధానం చెప్తావ్?" అంటూ ఆవిడ కఠినంగా అడిగింది. తర్వాత ఆవిడ, నువ్వు పాఠాలు శ్రద్ధగా వినడం లేదనీ, వెనక్కి వాలి కూర్చుంటున్నావనీ, యింకేమేమో అంది. అప్పుడు వాళ్ల క్లాసుపట్ల శ్రద్ధ వహించే సీనియర్ తరగతుల విద్యార్థులు లోపలకి వచ్చారు. టీచరు అందరి ముందూ "జరూబిన్‌తో మాట్లాడండి. ఇతని ప్రవర్తన ఘోరంగా వుంది" అని చెప్పింది. ఇక వాళ్లు "నీకు దేనిలో ఆసక్తి వుంది? నీ స్నేహితులు ఎవరు? నీకేం అర్థం కాలేదు?" అంటూ తనమీద ప్రశ్నల వర్షం కురిపించడం మొదలెట్టారు. వోవ్కా గమ్మున ఉండిపోయాడు. వాళ్లు అంతటితో వదిలిపెడితే యిప్పడైనా తను పోయి కోస్త్యతో కలవవచ్చుననీ, తామిద్దరూ కలిసి మంచి స్టాంపులు ఎంచుకోవచ్చుననీ వోవ్కా అనుకోసాగాడు. చివరకి ఎలాగైతేనేం అంతా ముగిసి, వాడు పోస్టాఫీసుకి పరుగున చేరుకునే సరికి కోస్త్య అక్కడ లేడు.

"నేను పెద్దవాడినైపోతే బాగుండును" అనుకున్నాడు వోవ్క.

అనూహ్యమైన దృశ్యాలు వాడి మనస్సులో ప్రవేశించాయి. వాడు పెద్దవాడైపోయాడు. వాడికి పిల్లలు కూడా వున్నారు. వాళ్ళు ఏం కోరుకుంటే అది చేసేందుకు తను అనుమతిస్తాడు. ఫెయిల్ మార్కులు వచ్చిన తన కొడుకుని "ఇదెలా జరిగిందిరా. సరేలే, దిగులు పడకు. దీని సంగతేమిటో ఆలోచిద్దాం, రా" అని అంటాడు తను. కొడుకు "నాకు స్టాంపులు కావాలి నాన్నా, అంగట్లో ఎంత బలే బలే కొత్త స్టాంపులు వచ్చాయనుకున్నావ్?" అంటాడు. "సర్లే, రా, పోయి కొన్ని స్టాంపులు తెచ్చుకుందాం" అంటాడు తను. వాళ్ళు అంగడికి చేరుకుంటారు. అందరూ తన కేసీ, తన కొడుకు కేసీ చూసి చిరునవ్వులు నవ్వుతారు. తాము కొన్ని స్టాంపులు తీసుకుంటారు. "ఎంత దయగల తండ్రి" అంటారెవరో. కొడుకు తన తండ్రితో "సరే నాన్నా, యిక్కణ్ణుంచి నేను మరింత కష్టపడి చదువుతాను" అంటాడు. అటు తర్వాత వోవ్కకి ఏదో భయంకరమైన పీడ కల వచ్చింది. వాడు నిద్రలో ఏడ్చాడు. వాడు కళ్ళు తెరిచేసరికి వాళ్ల అమ్మ వాడిమీదకి వంగి చూస్తోంది.

తల్లి తన కొడుకుమీదకి వంగి చూస్తోంది. ఆవిడ ఆదుర్దాని అర్థంచేసుకోవచ్చు. కొడుకు పెద్దవాడయే సరికి ఎలా తయారవుతాడో? ఆవిడ తన బాల్యాన్ని జ్ఞాపకం చేసుకుంది. యుద్ధం, క్షుద్బాధ, వినాశం. అటు తర్వాత చదవాలన్న, ఎన్ని కష్టాలు ఎదురైనా సరే కాలేజిలో చేరాలన్న తన తపన. తన కొడుకో, వాడికి అన్ని అవకాశాలూ కల్పించింది తను. అయితేనేం, బలవంతాన చదివిస్తే గాని వాడు చదవడం లేదు. వాడి బుర్రలో ఎప్పుడూ ఆటల రంధే తప్ప మరొకటి లేదు. తనచేత ఎవరూ చదివించలేదే అనుకుంది ఆన్నా ఇవానొవ్నా. స్నేహితుల, బంధువుల కుటుంబాల సంగతి మెదిలింది ఆవిడ మనస్సులో. వాళ్లలో చాలా మంది తమ బిడ్డల పెంపకంపట్ల తను చూపినదానితో పోలిస్తే చాలా తక్కువ శ్రద్ధ చూపుతున్నారు. తను అనేక విధాల తన అవసరాలను కూడా తీర్చుకోకుండా తన కొడుక్కి అన్నీ అమర్చిపెడుతోంది. అయితేనేం, ఫలితం యిదీ. ఇక ముందెలా వుంటుందో, తను చేసిన పొరపాటు ఎక్కడబ్బా? బహుశా తను తన కొడుకు అల్లరి చేష్టల్ని అంతగా పట్టించుకోకూడదేమో? అయినా వాడింకా కుర్రసన్నాసి కదా.

కొద్ది రోజుల పాటు తన ఇంట్లో గడిపిన తన తమ్ముడు "అక్కా యీ రోజున నువ్వు వోవ్కతో 'ఒరే తొందరగా తెమలరా, లేకపోతే ఆలస్యం అవుతావు' అంటూ ఓ డజను సార్లైనా అన్నావు పొద్దున్న" అన్నాడు. ఆవిడ తమ్ముడు ఆవిడ ఒక రోజు ఉదయంపూట గడిపిన తీరును సవివరంగా వర్ణించాడు.

తల్లి హడావిడిగా పనికి సిద్ధం అవుతూ "ఒరేయ్ లే, లేకపోతే లేటవుతావు" అంటూ లేపుతుంది వోవ్కని. వోవ్క రెండో పక్కకి తిరిగి పడుకుంటాడు. తర్వాత మరింత బిగ్గరగా "ఒరేయ్ నిన్నే! అప్పుడే ఎనిమిదైపోయింది తెలుసా!" అంటుంది. ఎనిమిది గంటలని అమ్మ

అంటే, ఏడు దాటి కొద్ది నిముషాలు అయి వుంటుందని వోవ్కకి తెలుసు. వాడు బద్ధకంగా కాళ్లు జాపి పడుకొని, చివరకి లేస్తాడు. వాడు బాత్‌రూముకి వెళ్తాడు. లోపల గట్టిగా గడియ బిగిస్తాడు. "వీడు తలుపు బిడాయించుకుని బాత్‌రూమ్‌లోనే నిద్రపోతున్నాడేమిటి కర్మ!" అంటాడు ఆవిడ తమ్ముడు. తర్వాత మళ్లీ హెచ్చరికల పరంపర మొదలవుతుంది: "తొందరగా తెములు బాబూ" అంటూ మొదలై, "ఒరేయ్, యింకా ఆలస్యం చేస్తే, ఏం చేస్తానో చూడు!.." అంటూ బెదిరింపులు సాగుతాయి.

"వీడితో ఎలా వేగాలంటావురా" అని ఆవిడ తన తమ్ముణ్ణి సలహా అడిగింది. "వీడు బడికి ఆలస్యం కాకూడదు కదా" అంది. "దానికి అలవాటుపడటం కంటె వాడు లేటవడమే మేలు. వాడంతట వాణ్ణి అంతకు ముందు రాత్రి అలారం పెట్టుకోనియ్యి. తనంతట తనని లేవనియ్యి, బట్టలు వేసుకోనియ్యి, టిఫిన్ తిననియ్యి. వాడు బడికి లేటవవచ్చునన్న మాట నిజమే. అయితే మొదట మాత్రమే లేటవుతాడు. బళ్లో ఆలస్యంగా వచ్చేవాళ్లకి మిగతా పిల్లలు ఎలా స్వాగతం చెప్తారో నీకు తెలుసా? మొత్తం క్లాసులో అందరూ 'నిద్రపోతు! నిద్రపోతు!' అంటూ అరుస్తారు. టీచరు వాణ్ణి చివాట్లు పెడుతుంది. ఆలస్యంగా వెళ్లేవాళ్లకి యివన్నీ తట్టుకోవడం ఏమంత సరదాగా వుండవు. వాడంతట వాడే లేటుగా వెళ్లకూడదని గ్రహిస్తాడు. నువ్విలా వాడి వెనకపడి లేపుతూ వుండటం వల్ల వాడికి హానిచెయ్యడమే తప్ప మరేం కాదు. నువ్వు మరింత స్ట్రిక్టుగా వుండు, లేకపోతే నువ్వు చేజేతులా వాణ్ణి చెడగొట్టినదానివి అవుతావు."

అప్పుడు ఆన్నా ఇవానొవ్నా తన తమ్ముడితో వాదించింది. వోవ్క అయిష్టంగా "బతికాంరా దేవుడా, ఈయన వెళ్లిపోయాడు. ఈయనగారు మరో టీచరు." "వాడిని గురించి అలా నోటికొచ్చినట్లు మాట్లాడకు, జాగ్రత్త" అంటూ తల్లి తన కొడుకును మందలించింది. కాని మనస్సులో మాత్రం ఆవిడ వోవ్క అభిప్రాయంతో ఏకీభవించింది.

ఆన్నా ఇవానొవ్నా హృదయపూర్వకంగా ప్రేమించడం, పిల్లల్ని అంకిత భావంతో సాకడమే పిల్లల పెంపకంలో ప్రధానమైనదని తలచింది. ఆవిడ తన తమ్ముణ్ణి ఎప్పుడూ పరమ వాస్తవిక దృష్టి కలిగినవాడుగా పరిగణించేది. కాని యిప్పుడు అతని మాటలు ఆమెకి నేర్పు లేనివిగా, కఠినమైనవిగా అనిపించాయి. మంచితనం మాత్రమే మంచితనాన్ని పెంచుతుందనీ, క్రూరత్వం క్రూరత్వాన్ని మాత్రమే పెంచుతుందనీ ఆవిడ విశ్వసించింది. ఆ రాత్రి తన కొడుకు కళ్లలో ఆమె నేరస్థ భావాన్ని చూసింది. వాడు క్షమార్పణ కోరుకుంటున్నాడని తలచింది. ఏదేమైనా, ఆవిడకి అనిపించింది అదీ. "మరైతే, నా మనస్సును కావాలని బుద్ధిపూర్వకంగా గాయపరచాలన్న తలపు వీడికి ఎలా వచ్చింది?" అన్న ప్రశ్న ఆమె మనస్సులో సుడులు తిరిగింది. బహుశా తనలో తగినంత ఓర్పూ, కచ్చితత్వం లేకపోవడమే యిందుకు కారణమేమో అనుకుంది.

ఇతర తల్లులు తమ పిల్లల్ని ఎలా పెంచుతున్నారబ్బా అంటూ ఆన్నా ఇవానొవ్నా ఆలో

చించింది. తల్లితండ్రులతో జరిపే సమావేశంలో టీచరు ఎప్పుడూ యూర వీన్నిక్‌ని ఆదర్శ ప్రాయుడుగా పేర్కొంటూ వుంటుంది. అలాంటి ఒక సమావేశంలో వాడి తల్లి మరీయా అలెక్సేయెవ్నా తన అనుభవాలను సైతం ఏకరువుపెట్టింది. అన్నా ఇవానొవ్నాకి తెలిసిన విష యాలనే, తరచు ఆమె ఆచరించే విషయాలనే ఆవిడ చెప్పింది. అయితేనేం, తన కొడుకు తను కోరుకున్నట్లు పెరగడం లేదు. మరీయా అలెక్సేయెవ్నాలో వున్న నిబ్బరమైన ఆత్మ విశ్వాసం, ఆత్మసంయమనం మాత్రమే అన్నా ఇవానొవ్నాకి ఈర్ష్య కలిగించిన విషయాలు. అంతే కాదు, తన లక్ష్య సాధనకు తనకి కావలసింది ఏమిటో ఆవిడకి తెలుసు. ఆవిడ సామర్థ్య రహస్యం ఏమిటో తను గ్రహించలేకపోయినా, అన్నా ఇవానొవ్నా ఆవిణ్ణి నమ్మింది.

మరీయా అలెక్సేయెవ్నా తన కొడుకును ఎలా పెంచిందో, వాడి అభిరుచులకు ఆమె ఎలా దోహదంచేసిందో, వాడిని ఆవిడ విద్యా సంవత్సరానికి ఎలా సన్నద్ధం చేసిందో, వాడు ఏమేమి చేసితీరాలని ఆవిడ పట్టుపట్టేదో, ఆ డిమాండ్లు పిల్లవాడి అభిరుచులకు అనుగుణంగా వుండేలా చూసేదో వివరించడం ప్రయోజనకరం. ఆ తల్లీ కొడుకుల సంబంధాల చరిత్రను తరచి చూడటం ఉపయోగకరం. యూర యింకా బడికి వెళ్లక ముందు వాడి జీవితంలో కొన్ని గంటల కాలం ఎలా గడిచేదో ఉదాహరణ ప్రాయంగా చూద్దాం.

సాయంత్రం పూటల్లో మరీయా అలెక్సేయెవ్నా తన కొడుక్కి పుస్తకాలు చదివి వినిపించేది. ఆవిడ వాడిని పరికించి చూసేది. ఆ పుస్తకాల్లోని కథానాయకుల భవితవ్యాల విషయంలో యూర మనస్సు లగ్నమయ్యేలా చూసేది. ఒకసారి యూర తల్లి వాడిని "నేను చదివి నీకు వినిపించింది ఏమిటో చెప్పు" అని అడిగేది. "నేను మరచిపోయానమ్మా" అని వాడు జవాబిచ్చేవాడు. చదివి వినిపించిందేమిటో తిరిగి చెప్పమని అడిగినప్పుడల్లా యూర అదే జవాబు చెప్పేవాడు. "అయితే, నీకు ఏమీ జ్ఞాపకం వుండదంటావా?" అని తల్లి రెట్టించేది. "నేనంతా మరచిపోయానమ్మా" అని రెట్టించి, మళ్లీ అంతలోనే "సరే, తర్వాత చదువు" అనో, "మళ్లీ యింకో సారి చదువు" అనో అడిగేవాడు.

ఆవిడ యిలా ఆలోచించసాగింది: "కుర్రాడికి జ్ఞాపక శక్తి బాగానే వుంది. వాడు తనకి తాను చదవడం నేర్చుకున్నాడు. రెండు వందలదాకా అంకెలు చెప్పగలడు. మూడు నాలు గేళ్లప్పుడు సుదీర్ఘమైన గేయం కంఠతా నేర్చుకున్నాడు. కాని యిప్పుడు పట్టుమని పది పంక్తుల పాట కూడా కంఠతా పట్టలేకపోతున్నాడు." అప్పుడిక ఆవిడ "నేనింక యేమీ చదవను, ఒక్క పంక్తి కూడా చదవను" అన్న నిర్ధారణకు వచ్చింది. ఆవిడ "మ్యూన్స్ హౌసెన్"లోని బాగా మనస్సును అకట్టుకునే ఘట్టంలో చదవడం ఆపేసింది. కొడుకు ఆవిణ్ణి చదవమని బతిమాలడం మొదలుపెట్టాడు. కాని మరీయా అలెక్సేయెవ్నా "నీకు అన్నీ జ్ఞాపకం వున్నాయి. నువ్వు దాంట్లో కొంచెమైనా – ఎంత కొంచెమైనా సరే – నాకు తిరిగి చెప్తే గాని నేనింక ఒక్క పంక్తి కూడా చదవను!" అంటూ ఖరాఖండీగా చెప్పింది.

కొడుకు తల్లి కేసి ధ్యానంగా చూశాడు. వాడి చూపు "సరే, నువ్వు నా సంగతి కని పెట్టేశావు. నాకు అంతా తిరిగి చెప్పడం నచ్చదు. పైగా, బోరు. నువ్వు నా కంటె శక్తివం తురాలివి. అందుకే నీ యిష్టం వచ్చినట్లు చెయ్యాలని చూస్తున్నావు" అన్నట్లు వుంది.

సరిగ్గా యిలాగే అనిపించింది మరీయా అలెక్సేయెవ్నాకి. ఆవిడ కళ్లు యిలా సమాధా నమిచ్చాయి: "అదేం లాభం లేదు. నువ్వు జాలిగా ముఖం పెట్టి నా మనస్సు కరిగించాలని అనుకుంటున్నావేమో, నా దగ్గర నీ పప్పులేం ఉడకవు." కాని ఆవిడ పైకి "ఒరేయ్, కథ చదవడం కంటె, పైకి చెప్తే మరింత మజాగా వుంటుంది తెలుసా" అంది. ఆవిడ కొడుకు ఒప్పుకున్నాడు. అయితే వాడు సహజంగానే ముందు "నువ్వీ పుస్తకం చివరిదాకా చదివి విని పించాలి, ఇంకో పుస్తకం కూడా చదవాలి, సరేనా" అంటూ బేరం పెట్టాడు.

యూర అంతలో మనస్సు కేంద్రీకరించి, పుస్తకంలో ఫలానా భాగం మరో సారి చదివి వినిపించమని తల్లిని అడిగాడు. తల్లి చదివింది. "'సార్వభౌమ' అంటే ఏమిటి? 'కోశాధి కారి' అంటే ఏమిటి? 'క్రోధం' అంటే ఏమిటి?" అంటూ వాళ్ల అమ్మమీద ప్రశ్నల వర్షం కురిపించాడు. ఇదంతా కొత్తగా వుంది. ఇంతకు ముందెప్పుడూ యిలా లేదు. తల్లి ఆ మాటల అర్థాలు వివరించి చెప్పసాగింది.

తను మరో సారి చదివి వినిపించిన ఘట్టాన్ని యూర దాదాపు తు.చ. తప్పకుండా తిరిగి చెప్పడం మరీయా అలెక్సేయెవ్నాకి ఎక్కడలేని ఆశ్చర్యం కలిగించింది. అంతే కాదు, తన తల్లి వాడిన విశేషణాలనీ, పర్యాయ పదాలనీ కూడా వాడు తన కథనంలో జోడించాడు. ఉదాహరణకు "పాలకుడు" అన్న పదానికి "దారుణమైన" అనే విశేషణం తగిలించాడు. "క్రోధం" అనే పదం స్థానంలో ఆయన "చాలా కోపం చెందాడు" అని చెప్పాడు.

తల్లి యీ ప్రయోగాన్ని రెట్టించింది. చిన్న మినహాయింపులతో, తన కొడుకు నూరు మాటలకి పైగా వున్న వాచక పాఠాన్ని అవలీలగా అప్పజెప్పడాన్ని ఆమె గమనించింది. దీనికితోడు వాడు ఆలోచిస్తున్నట్లు, మనస్సును ఏకాగ్రంగా కేంద్రీకరిస్తున్నట్లు గమనించింది.

ఇదీ సంగతి. బహుశా అన్నీ సజావుగానే వున్నట్లున్నాయి. అయితే, యీ ఉపాఖ్యానాన్ని యింత వివరంగా నేనిక్కడ పేర్కొన్న కారణం యిది కాదు. ఈ వ్యవహారపు సారాంశం యింతకంటె బాగా ప్రగాఢమైనది, గంభీరమైనది. అన్నిటి మాదిరిగానే యిది కూడా వివా దాస్పదమైనది. ఈ "నేను మరచిపోయాను" అన్న మాటలు కొంత మేరకు స్కూలుకి పోయేందుకు ముందరి దశ పిల్లవాడి అభివృద్ధిలోని సంశ్లిష్టతని ప్రతిబింబిస్తుంది.

ఒకవైపున పిల్లవాడికి గ్రహణ శక్తి వుంది, వాడు భావోద్వేగాలు అనుభూతి చెందు తున్నాడు, భావ ప్రతిబింబాలను మనస్సులో దర్శించగలుగుతున్నాడు. సముజ్జ్వలమైన ఆ భావ ప్రపంచం వాడిని పూర్తిగా ఆకృష్టం చేసుకుంటోంది. దానితో వాడు ఆలోచించేందుకు అయిష్టత చూపుతున్నాడు. పిల్లవాడు పెద్దవాళ్ల జోక్యం లేకుండానే ఆలోచిస్తాడని ప్రత్యే కించి చెప్పనక్కర్లేదు. అయితే, నేనిక్కడ చెప్తున్నది బోధకుడి పాత్ర గురించి మాత్రమే.

పిల్లవాడు మరింత సృజనాత్మకంగా అభివృద్ధి చెందేందుకు అవసరమైన పరిస్థితులను బోధకుడు కల్పించగలడు, కల్పించాలి.

ఇందుకు భిన్నంగా జరిగితే కలిగే పర్యవసానం ఏమిటి? ఈ "నేను మరచిపోయాను" అన్నది బహుశా ఆలోచించకుండా వుండే ఒక అలవాటుగా పరిణమించవచ్చు. ఇది మహా ప్రమాదకరమైన పరిణామం, ఆలోచించే విషయంలో సోమరితనం. స్కూలు చదువు పరిస్థితుల్లో యీ పరిస్థితిని యిలా వర్ణిస్తూ వుంటారు: అవడానికి పిల్లవాడు మంచి తెలివైనవాడే, అయితే, లొసుగల్లా ప్రయత్న లోపమే. కాస్త ప్రయత్నిస్తే, వీడు సిసింద్రీలా తయారవుతాడు.

మరో పరిస్థితి చూద్దాం.

యూర పిల్లలతో ఆడుకొంటూ వుంటాడు. వాడికి ఆకలి వేస్తుంది. కాని, వాడికి ఆకలి పీకుతున్నా, ఆట మధ్యలో విడిచి వెళ్లిపోవడం సుతరామూ యిష్టం వుండదు. తనకి పరమానందదాయకమైన ఆ ఆట క్రమంలో చిన్న విరామాన్నైనా వాడు సహించడు. అంతలో వాడి తల్లి వాడిని బలవంతాన తిండి తిందువు గాని రమ్మంటూ బరబరా యింట్లోకి లాక్కెళ్తుంది. "నేను రాను! నాకు తినాలని లేదు! సూపు నాకు సయించదు! నేను చస్తే ఆడనింక!.. ఓ మూల కూర్చుంటాను! నన్ను ఒదులు!" అంటాడు వాడు. వాడి యీ మాటల్లో అయిష్టమే కాదు, ఒక రకమైన "కర్మవాదం" కూడా వ్యక్తమవుతుంది. తన తల్లి మాటల పట్ల వాడిలో ఎక్కడలేని అయిష్టతే కాదు, ద్వేషం కూడా పెల్లుబుకుతుంది.

తనపట్ల పెద్దవాళ్ల అన్యాయ ప్రవర్తనపట్ల వాడి మనస్సు కుతకుతలాడిపోతుంది. వాడి యీ బాధ "నేను చచ్చిపోతానులే" అన్న మాటల్లో వెలువడుతుంది. "మంచి రుచికరమైన మాంసపు బూరె నీకోసం వండితే, నువ్వేమో చస్తాను, గిస్తాను అంటావేమిట్రా అఘాయిత్యం!" అంటుంది తల్లి.

అయితే కుర్రాడు చాలా సీరియస్‌గా మాట్లాడుతున్నాడు. తను మరణ శయ్యమీద ఉన్నట్లు, తన ఆప్తులందరూ తన మంచం చుట్టూ మూగినట్లూ, "ఒరేయ్ నీ ఆరోగ్యం బాగుచేసుకో, నీ యిష్టం వచ్చినంత ఆడుకుందువు గానిలే..." అంటున్నట్లూ వాడు ఊహించుకుంటాడు. అయితే యిక్కడ ఆసక్తి గొలిపే విషయం ఏమిటంటే, ఓ పది పదిహేను నిమిషాల్లో సూపు, మాంసపు బూరెలు, వగైరా వంటకాల నోరూరించే ఘుమఘుమలు పీడకల లాంటి వాడి అకాల మృత్యు భావనలను చెల్లాచెదరు చేస్తాయి.

"శుభ్రంగా చేతులు కడుక్కుని కమ్మగా భోజనం చేస్తే మంచిది, చావు మాటలు పక్కకి పెట్టి" అంటూ వాడి తల్లి ముసిముసి నవ్వులు నవ్వుతుంది. భోజనం పూర్తయాక వాడు మళ్లీ తన నేస్తాల దగ్గరకి రివ్వున దూసుకుపోతాడు.

కొడుక్కీ అతని తల్లికీ మధ్య విభిన్న ప్రయోజనాలు ఘర్షణలోకి వచ్చే మూడవ పరిస్థితిలో యిలాంటి సంబంధాలే అభివృద్ధి చెందుతాయి. యూర ఆడుకుంటున్నాడు.

వాళ్ల అమ్మ వచ్చి, ''రా, పోయి ఓ పుస్తకం చదువుదాం'' అంటుంది. ఆటలో తల్లీనుడై వున్న కొడుకు తనకి ఏ పుస్తకాలూ చదవాలని లేదని చెప్పాడు. ''ఇంతకీ అదేం పుస్తకమో నీకు తెలియదు కదా? పెద్దపులులు, నీటి గుర్రాలు, నాలుగు గండు పిల్లులు... ముందీ పుస్తకం చదువుదాం, ఆ తర్వాత ఒక సరదా అయిన పని చేద్దాం. అదేలే, నీకు యిష్టం వుంటేనే, అనుకో...''

కొడుకు తన తల్లి వెంట పరుగెత్తాడు: ''అమ్మా, ఏమిటో చెప్పవూ ఆ సరదా అయిన పనేమిటో? చెప్పమ్మా! అంతా వర్తిది, ఔనా?'' ''నేనెప్పుడైనా అబద్ధం చెప్పానా?'' కొడుకు ఆగాడు. మొదట వాడు పుస్తకం చదివాడు. తర్వాత వాడు ఆ సరదా అయిన పనిలో మునిగి పోయాడు: తల్లీ కొడుకులు మాంసపు బూరెలు వండి, భోజనాల బల్లమీద అన్నీ అమర్చారు. ఆ రోజు వాడి నాన్న పుట్టినరోజు!

ఇదుగో యిక్కడ బోధన శాస్త్ర నైపుణ్యాల ప్రధాన సమస్యల్లో ఒకదాన్ని పరిశీలి స్తున్నాం. పిల్లల విషయంలో దయతో కూడినవి తప్ప మరే ''పద్ధతులూ'' పనికిరావన్నట్లు కనిపిస్తోంది. పిల్లలపట్ల మానవత్వంతో కూడిన వైఖరి బోధన శాస్త్ర ప్రధాన సూత్రాల్లో ఒకటనే విషయాన్ని ఎవరూ కాదనలేరు. అయితే యిక్కడొక ప్రశ్న ఉత్పన్నమవుతుంది. బోధన, సాంఘిక, మనస్తాత్విక శాస్త్రాల సహాయంతో రూపొందించబడిన పద్ధతుల, సాధనాల పరిజ్ఞానం మానవత్వానికి ఆటంకమవుతుందా? మానవత్వం కొన్ని పద్ధతుల వ్యవస్థతో సుసజ్జితమైనప్పుడు, అది మరింత బలవత్తరమూ, మరింత సమర్థమూ అవుతుందని ప్రత్యే కించి రుజువుచేయవలసిన అవసరం వుందా?

బోధన శాస్త్ర నైపుణ్యాల విషయంలో తరచు మౌలికమైన ఒక పొరపాటు తల్లితం డ్రులు చేస్తారు. అదేమిటంటే, విద్యాబోధన సాధనాలన్నింటినీ మనస్సు విప్పి ఆత్మీయంగా మాట్లాడటం లేక అది చెయ్యి, యిది చెయ్యి అంటూ ఆదేశించడం, ప్రోత్సహించడం లేక శిక్షించడం వంటి వేర్వేరు సాధనాలను అవేవో సాటిలేనివన్నట్లు వేరుచేసి ప్రత్యేకంగా చూపడం.

పిల్లల పనులను వాళ్ల ప్రవర్తన చరిత్రగా అర్థం చేసుకోవచ్చునని మనస్తత్వ శాస్త్ర జ్ఞులు చెప్తూ వుంటారు. పిల్లల పెంపకపు నైపుణ్యాన్ని ఏవో కొన్ని ప్రత్యేక సాధనాలు, పద్ధతుల — అవి అత్యంత విజయవంతమైనవీ, ఆమోదితమైనవీ అయిన పద్ధతులైనా కూడా — సమాహారంగా కాక, పెద్దలకీ పిల్లలకీ మధ్య పరస్పర ప్రతివర్తనాత్మక సంబం ధాల వ్యవస్థగా, అత్యంత అప్రముఖ ఘర్షణలనుంచి అత్యంత సంశ్లిష్ట సమస్యలదాకా సంయుక్త భాగస్వామ్యంగా పరిగణించవలసి వుంటుంది.

తాము తమ పిల్లలతో ఎలాంటి స్వరంలో మాట్లాడుతారో, మొత్తంగా స్కూలు వ్యవహారాలను గురించి, ప్రత్యేకించి పిల్లల మార్కులను గురించి పిల్లల్నీ ఎలా ప్రశ్నిస్తారో,

తమ పిల్లలకి ఎలా ఆదేశిస్తారో, మంచి మార్కులు వచ్చినప్పుడు ఎలా ఉబ్బితబ్బిబ్బవుతారో, రానప్పుడు ఎలా తమ అసంతృప్తి ప్రదర్శిస్తారో తల్లితండ్రులు చాలా తరచు గమనించరు. ఆయా సందర్భాల్లో "ఎలా" మాట్లాడతారు, పిల్లలతో పరస్పర సంబంధాల్లో వాళ్ళ ఎలాంటి ధోరణిని అనుసరిస్తారు అన్నది బోధన కళలో అంతర్భాగం. ఈ ధోరణి రూపానికీ విషయాంశానికీ మధ్య వ్యత్యాసాన్ని మనం గమనంలోకి తీసుకోవలసి వుంటుంది. ఈ రూపంలో ధోరణి సరళమైన, మొరటైనదాన్నుంచి సున్నితమైన, ఆత్మీయమైనదానిదాకా అత్యంత వైవిధ్యపూరితమైన సూక్ష్మ భేదాలు కలిగివుండవచ్చు. కొన్ని కుటుంబాల్లో ముద్దులూ, కౌగిలింతలూ సర్వసామాన్య విషయాలు కాగా, మరి కొన్నింటిలో యీ భావోద్వేగాలపట్ల బిడియపడవచ్చు. కొన్ని కుటుంబాల్లో ముద్దు పేర్లు వాడుకలో వుండగా, మరి కొన్నింటిలో కాఠిన్యంమీదా, ఉద్దేశపూర్వకమైన కచ్చితత్వంమీదా వక్కాణింపు వుంటుంది. కొన్ని కుటుంబాల్లో సున్నితమైన మాటలు ఉపయోగంలో వుండగా, మరి కొన్నింటిలో కట్టె కొట్టె తెచ్చె అనే మాదిరి నిర్మొగమాటం అమల్లో వుంటుంది, వగైరా.

ఇవన్నీ సంబంధాల్లో రూపాలు. వీటి సారాంశం పరస్పర గౌరవ, పరస్పర అవగాహనలతో కూడిన నికరమైన మానవత్వం మాత్రమే కాగలదు.

అయితే పిల్లలకి అసాధారణమైన ఒక సామర్థ్యం వుంటుంది. సాంఘిక సంబంధపు అన్ని రూపాలకీ వెనక వున్న సారాంశాన్ని, అంటే తమపట్ల ప్రదర్శించే నిజాయితీ అయిన వైఖరిని యిట్టే పసిపట్టే సహజ సామర్థ్యం వాళ్ళకి వుంటుంది.

యూర తల్లి ఆటలు, సరిగా సూత్రీకరించిన ఆదేశాలు, మొదలైన రకరకాల పద్ధతులను వినియోగించడం ద్వారా తన కొడుకును ఒకానొక క్రమానికి అలవాటుచేసి, కొన్ని కార్యకలాపాల ఆవశ్యకతను అర్థంచేసుకునే సామర్థ్యాన్ని వాడికి కలిగించింది. ఆవిడ ఉద్దేశపూర్వకంగా తన కొడుకు శ్రద్ధనూ, శక్తినీ వాడికి ఉపయోగకరమైన అలవాట్లనూ, బాధ్యతా భావాన్నీ నేర్పే మాదిరి కార్యకలాపాలమీదకి మళ్లించింది. పిల్లవాడి పెంపకం తనంతట తనే జరిగిపోతుందని గాని, కొడుకుపట్ల తను ప్రేమ కలిగివున్నంత మాత్రాన సరిపోతుందని గాని ఆమె భ్రమలు పెట్టుకోలేదు. వోవ్కా తల్లి తన కొడుక్కి అన్నీ అనుమతించి, వాడినుంచి కచ్చితమైన నిర్ణీత ప్రవర్తనా రీతిని నిర్దేశించలేక, ఆదేశాలు యివ్వకపోవడాన్ని దయచూపడంగా పరిగణించగా, యూర తల్లి అందుకు భిన్నంగా, తనచేత కచ్చితంగా నిర్ణయింపబడిన పెంపకపు విధానాన్ని తన కొడుకు పాటించే విషయాల్లో ఎంతమాత్రం మెతకతనం చూపలేదు.

పైన పేర్కొన్న మూడు సందర్భాల్లోనూ వోవ్కా తల్లి యీకింది సూత్రం మేరకు వ్యవహరించి వుండేది: సరే నువ్వు కథను నీ సొంత మాటల్లో తిరిగి చెప్పకపోతే, అలాగే కానియ్యి. బయటకి పోయి, మరి కాసేపు ఆడుకో, క్లుప్తంగా చెప్పాలంటే, నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి. ఈ సూత్రాన్ని అనుసరిస్తే కలిగే ఫలితాలను మనం అర్థంచేసుకోవచ్చు.

ఇప్పుడు వోవ్కా యిలా ప్రవర్తిస్తున్నాడంటే కారణం, వాడి జీవితం పొడుగూతా వాడి తల్లి "సర్వం అనుమతించడాన్ని" తిరుగులేని ఒక పవిత్ర నియమంగా అమలుజరపడమే కారణం.

ఆవిడ తన చిరాకు ఒక్కటే పొరపాటని అనుకొంటుంది. ఇది కాదు అసలు సంగతి. అసలు తను చిరాకు పడకపోయి వుంటే? అప్పుడైనా మార్పేమీ ఉండేది కాదు. వోవ్కా కిటికీ లోంచి బయటకి దూకెయ్యడం ఒక్కటే తల్లీ కొడుకుల మధ్య సంబంధాల్లో సంభవించ గల అవకతవక కాదు. ఆందోళనకరమైన విషయం మరొకటి వుంది. ఆవిడ కొడుకులో ఆవిడపట్ల మధ్యమధ్య ప్రతికూల భావమే అది, తనమీదనే ఆశలన్నీ నిలుపుకొని, తనని ప్రాణాధికంగా ప్రేమించే తన తల్లిపట్ల తూష్ణీంభావమే అది. చిత్రమేమిటంటే, గుడ్డి ప్రేమ విధిగా ఆత్మాతిశయాన్ని పెంచి, ఘర్షణకి దారితీస్తుంది. ఇది దాదాపు తిరుగులేని నియమం అని చెప్పవచ్చు. నిజానికి గుడ్డి ప్రేమ అనేది బలప్రయోగంమీద (యిది పరమ విరోధాభాసగా కనిపించవచ్చు, పిల్లలు ఈమాదిరి స్వామ్య స్వభావానికి వ్యతిరేకంగా ఎప్పుడూ తిరగబడుతూ వుంటారు) ఆధారపడి వుంటుంది. "ఇదుగో వీడు నా బిడ్డ! వీడు విధిగా మంచివాడుగా వుంటాడు. వీడిలో చెడ్డ ఏమున్నా నేను దాన్ని నిర్మూలిస్తాను. నేను వాడికి అత్యుత్తమమైనవన్నీ యిస్తాను!" – యిలా వుంటుంది యీ ధోరణి. ఇవన్నీ పైకి సద్భావాల వెల్లువలా కనిపిస్తాయి. కాని, హద్దులు లేని ప్రేమ పీడనకి నాంది పలుకుతుంది.

ఈ సందర్భంలో తల్లి అసలు సంగతిని పరిగణనలోకి తీసుకోలేదు. అదేమిటంటే, పిల్లలకి యివ్వబడే ఆదేశాలు, వాటిని వాళ్ళ మనసారా ఆమోదించనప్పుడు, అవి విధిగా వాళ్ల వ్యక్తిత్వాన్ని అణచివేస్తాయి. వోవ్కా వాటికవిగా ఆదేశాలపట్ల అభ్యంతరం చెప్పలేదు. తన యిష్టాయిష్టాలు పరిగణనలోకి తీసుకోబడనందుకు – వాడి దృష్టిలో – వాడు కష్టం పెట్టుకున్నాడు. బలప్రయోగానికీ వాడికీ సగం ఎరుక అని కూడా చెప్పవచ్చు. బలప్రయోగం పట్ల వాడికి గల వ్యతిరేకతే రక్షణలేని కోస్త్యపట్ల వాడి ఆకర్షణకి మూలం. వోవ్కా కోస్త్యని వెనకేసుకు వచ్చేందుకు పూనుకొన్నది బహుశా యీ కారణంగానే.

ప్రసంగవశాత్తూ మనం యిక్కడొక విషయం చెప్పకోవాలి. వోవ్కామీద మౌలికమైన ప్రభావం బరపగలిగినవాడు ఒక్క కోస్త్య మాత్రమే. కోస్త్య వోవ్కాకి పుస్తకాలు చదవడం, పోస్టల్ స్టాంపులు సేకరించడం మాత్రమే కాకుండా, సంశ్లిష్ట జీవిత సంఘటనలను గురించి ఆలోచించడం, వాటిని విశ్లేషించడం కూడా నేర్పుతాడు. కోస్త్య వోవ్కా చెప్పే విషయాలు విని, వాటిలో చాలా మటుకు పరిష్కరించుకోవడంలో తోడ్పడతాడు కూడా. అంటే, వాళ్ల అమ్మ చెయ్యలేని పని కూడా చేస్తాడన్న మాట. ఈ బక్క సన్నాసికి వున్న ఏకాగ్రతని వోవ్కా జరూబిన్ తల్లి తెలుసుకోగలిగితే, తన కొడుకు పెంపకంలో తను పెట్టుకున్న లక్ష్యాల సాధనలో కోస్త్య పలుకుబడినీ, ప్రభావాన్నీ ఆవిడ తప్పక వినియోగించుకొనివుండేదే.

ఇక్కడ మనం చెయ్యగలిగిన నిర్ధారణ ఏమిటంటే, ఎవరూ తన ప్రేమమీద మాత్రమే

ఆధారపడకూడదు. పిల్లలమీద వున్న మొత్తం ప్రభావాలన్నింటినీ విధిగా పరిగణనలోకి తీసుకోవాలి.

వోవ్కతో బాటు యూర కూడా 3వ క్లాసులో వున్నాడు. యూరని గురించి నేనింతకు ముందే ప్రస్తావించాను. వాడు చాలా మంచి విద్యార్థి. వాడు చాలా నెమ్మదస్తుడు. వాడికి ఆటలన్నా, అల్లరి పనులన్నా గిట్టవు. వాడెప్పుడూ నీటుగా వుంటాడు. జుట్టు నున్నగా దువ్వుకుంటాడు. వాడు సంగీతం స్కూల్లో చదువుతున్నాడు. పిల్లలు "అమ్మచాటు బిడ్డ" అంటూ వాణ్ణి అల్లరిగా ఆటపట్టించినప్పుడు, వాడు ఒక్క రవ్వ చలించినా, వెనక్కి ఎన్నడూ తిరగడు. యూరపట్ల ఆకర్షింపబడ్డవాళ్లలో కోస్త్యయే మొదటివాడు. "ఒరేయ్



నీకు తెలుసా, యూరగాడి దగ్గర ఎన్ని పుస్తకాలు వున్నాయో?" అన్నాడు వోవ్కతో కోస్త్య. "ఒరేయ్, ఎన్ని బొమ్మలూ, రేడియో పార్టులూ వున్నాయనుకున్నావ్? ఓసారి వాళ్లింటికి పోయొద్దామా?" వోవ్క జవాబుగా భుజాలు ఎగరేసి ఊరుకున్నాడు. వీన్నిక్‌ల యింటికి కోస్త్య, ల్యోష్క, వోవ్కలు ముగ్గురూ వెళ్లారు. యూర మంచి ఆసక్తికరమైన పనిలో మునిగివుండటం చూశారు వాళ్లు. వాడు కాల్పులు కాల్చేందుకు కంతలతో, సొరంగ మార్గంతో, టెలిఫోను, ఆయుధ గిడ్డంగులతో కూడిన ఒక కోట కడుతున్నాడు. వాడు ఆ కోటని తోటలో కడుతున్నాడు — అందుకు అదే మంచి చోటు. వాళ్లు ఇంకో కోటను కట్టనారంభించారు. యుద్ధం జరగాలి కదా? యూర తండ్రి బయటకి వచ్చాడు. కనీసం శాపరుగానైనా తనని చేర్చుకొమ్మని అర్థించాడు. కుర్రాళ్లకి యిది అనూహ్యమైన విషయం. వాడి తల్లి కూడా బయటకి రావడం

కుర్రాళ్లకి మరింత అబ్బురం కలిగించింది. తను ప్రాథమిక చికిత్సా కేంద్రం పని చూస్తాననీ, అది గదిలో వుంటుందనీ ఆవిడ చెప్పింది. "ఖైదీలని" కూడా అక్కడే వుంచుతానని చెప్పింది. తను ఖైదీలపట్ల చాలా జాలిగా వ్యవహరిస్తాననీ, వాళ్లకి జామ్ సైతం యిస్తాననీ ఆవిడ చెప్పింది.

యుద్ధ సన్నాహాలు కొంత కష్టంతో కూడుకున్నవే అయినా, అవి మంచి హుషారుగా సాగాయి. వాళ్లు చెమటోడ్చి కష్టపడ్డారు. వాళ్లు కొత్త కందకాలు తవ్వి, సైన్యం వెనక తట్టున వుండే స్థావరాలు ఏర్పాటు చేశారు. యుద్ధానికి అన్నీ సిద్ధం కాగానే, అప్పుడిక వాళ్ళు "యుద్ధపు" ఎత్తుగడలనీ, నియమాలనీ నిర్ధారణ చెయ్యనారంభించారు. యూర, కోస్త్యలు వొక్క జట్టులో పడ్డారు. తన సైనికుల మందకొడితనంపట్ల వొక్క మండి



పడ్డాడు. వాళ్ల పిరికితనాన్ని ఎద్దేవా చేశాడు. మధ్యమధ్య "ఊఁ జోరుగా! కాల్చు! గుండ్లు తెచ్చుకో! వాళ్లని దాటిపో! వెనకతట్టు జాగ్రత్తగా చూసుకో!" అంటూ అరిచాడు. కుర్రాళ్లు కోపగించుకోలేదు. శత్రువుల కోటమీద జండా పాతగలిగినప్పుడు, వాళ్ల ఆనందానికి అవధులు లేకపోయాయి.

తర్వాత వాళ్లు టీ తీసుకున్నారు. అప్పుడు కోస్త్య బొమ్మలు చూపించమని యూరని అడిగాడు. యూర ఓ పెద్ద ఆల్బమ్ పైకి తీశాడు. ఒక్కొక్క పేజీయే తాపీగా తిప్పుతూ, వాడు ప్రతి చిత్రకారుణ్ణి గురించీ వాళ్లకి చెప్పాడు. తర్వాత వాళ్ల సంభాషణ పుస్తకాలమీదకి మళ్లింది. ముఖ్యంగా కోస్త్య, యూరలు పుస్తకాలు చదివారు. "నేను చదివేందుకు నీకేమైనా పుస్తకాలు యివ్వగలను" అన్నాడు యూర వొక్కతో. యూర అలా సీరియస్‌గా అన్న తీరు వొక్కకి

కొంచెం ఆశ్చర్యమే కలిగించింది. కాని, కాదనకూడదని వాడు అనుకున్నాడు.

ఇంటికి వెళ్లాక వాడు తన తల్లితో ఆనంద తన్మయత్వంతో అన్నాడు: "అమ్మా, వాళ్లింటి దగ్గర ఎంత సరదాగా గడిచిందనుకున్నావ్? బోలెడు పుస్తకాలు, బొమ్మలు ఉన్నాయి. వాళ్ల అమ్మ ఎంత భలే మనిషనుకున్నావ్..."

కుర్రాళ్లు వెళ్లిపోయాక, యూర తల్లి యథాలాపంగా అన్నట్లు, "నేనే కనక అబ్బాయినైతే, వోవ్కాతో తప్పకుండా స్నేహంచేసేదాన్ని. అతను మంచి నేస్తం అనిపిస్తోంది. అలాంటివాడిని ఎవరైనా నమ్మవచ్చు" అంది.

"ఔను" అంటూ యూర తండ్రి వంత కలిపాడు. "కుర్రాడు గట్టి పిండం. ఇంతకీ అతను చదువులో ఎలా వుంటాడు యూరా?" "ఏమంత బాగా చదవడు. మా టీచరు కుర్రాడు తెలివైనవాడే గాని, సోమరి అంటుంది. పైగా వాడు అల్లరి చేస్తాడు. వాడు బ్లాక్ బోర్డు దగ్గర నిలబడ్డప్పుడల్లా అందర్నీ నవ్విస్తాడు. పైగా వెకిలి చేష్టలు కూడా చేస్తాడు."

"ఏమోనబ్బా, నాకు మటుకు నచ్చాడు. కుర్రాడు మంచి ఆసక్తికరమైనవాడు. మంచి లాఘవం కలిగినవాడు, చురుకైనవాడు. బహుశా బాగా సాహసికుడు కూడా అనిపించింది. మంచి సమయస్ఫూర్తి కూడా వుంది. గుర్తుందా యూరా, నువ్వు వెనకనుంచి వచ్చినప్పుడు చటుక్కున ఎలా కనిపెట్టేశాడో? అంతే కాదు, మంచి నిర్భీకుడు. ఏమైనా, అతను మంచి కుర్రాడు" అంటూ యూర తల్లి వోవ్కాని మెచ్చుకుంది.

మన పిల్లల లక్షణాల విషయంలో మనం తరచు అసంతృప్తి చెందుతూ వుంటాం. "వీళ్లకీ లక్షణం ఎక్కణ్ణుంచి వచ్చిందబ్బా?" అనుకొంటూ వుంటాం. అయితే మనం మనలోకి మరింత లోతుగా చూసుకుంటే, మన పిల్లల్లోని "అవాంఛిత లక్షణానికి" కారణం ఏమిటో మనం చూడగలుగుతాం. "ఆ తానులో గుడ్డే" అన్నది బాధాకరమైన నానుడి. అయితేనేం, దానిలో సాధారణ ప్రజానీకపు వివేకం నిండి వుంది. మన స్వభావం, శీలం, మన సంస్కృతి, మన విశ్వాసాలు, మన మానసిక ప్రవృత్తి అనివార్యంగా మన పిల్లలమీద ప్రభావం కలిగివుంటాయి.

మన అత్యుత్తమ లక్షణాలను మన పిల్లలు అలవరచుకోవాలని మనం కోరుకుంటాం. మరి యిది సహజమే కూడా. అయితే సంగతేమిటంటే, పిల్లవాడి స్వభావం అతని మొత్తం జీవితానుభవ ఫలితం. పిల్లవాడు తను చూసినవాటన్నిటినీ, తనకి తటస్థపడినవాటన్నింటినీ జీర్ణించుకుంటాడు. వాడి కార్యకలాపాల క్రమంలో వాడు పొందిన సమాచార వివరాలను వాడు వింగడించుకుంటాడు. వాటిలో కొన్నింటిని స్వీకరిస్తాడు, మిగిలినవాటిని పరిత్యజి

స్తాడు. అంతే కాదు, వాడు వాటిలో మంచివాటినీ, చెడ్డవాటినీ కూడా స్వీకరించే అవకాశం వుంది.

మన సద్గుణాలూ, లోపాలూ, అంటే మన స్వాభావిక లక్షణాలు పిల్లల పెంపకంలో సాధనాలుగా వినియోగపడతాయని మనం గట్టిగా విశ్వసించే మాటైతే, తమ సద్గుణ సామర్థ్యాలన్నింటికీ సంబంధించిన పరిజ్ఞానం తండ్రి లేక తల్లి తన బిడ్డని మరింత అర్థవంతంగా, మరింత వ్యవస్థీకృత పద్ధతిలో ప్రభావితం చేసేందుకు తోడ్పడుతుందనడంలో భిన్నాభిప్రాయం ఏమీ వుండదు.

యూర తల్లి మరీయా అలెక్సేయెవ్నా తన కొడుక్కి తను ఏమి యివ్వగలదో, తమ బిడ్డ మరింత మెరుగ్గా అభివృద్ధిచెందడంలో తన భర్త ప్రభావం యేమిటో గ్రహించగలిగింది. యూర జీవించే కుటుంబ వాతావరణం అధ్యయనం, సాధారణ అభివృద్ధి, అలవాట్లను పెంపొందించుకోవడం, తాజా గాలిలో విరామ కాలం గడపడం, ఆటలు, మొదలైన అత్యంత వైవిధ్యపూరితమైన అంశాలతో నిండివుంది. ఆ తల్లి తన కొడుకు మనస్సులో కళపట్లా, సంగీతంపట్లా అభిరుచిని నాటగలిగింది. నైతిక సమస్యల పరిష్కారంపట్ల తన కొడుకు దృష్టిని ఆమె ఆకర్షిస్తుంది, మనుషుల మధ్య విచక్షణ చూపడాన్ని తన కొడుక్కి ఆమె నేర్పుతుంది. యూర తండ్రి రేడియో ఔత్సాహికుడు. తన తండ్రికి రేడియోపట్ల వున్న అభిరుచిని యూర అనుసరిస్తాడో లేదో చెప్పడం కష్టమే అయినప్పటికీ, ఒక విషయం మటుకు కచ్చితంగా చెప్పవచ్చు. సంయుక్త కార్యకలాపాల క్రమంలో యూరకి నిర్దిష్టమైన పని అలవాట్లూ, కొంతమేరకు భౌతికశాస్త్ర పరిజ్ఞానమూ అబ్బడమే అది. యూర వుండే యింటి గదిని చూస్తే అదో కార్ఖానా కాదుకదా అనిపిస్తుంది. కిటికీ పక్కన వడ్రంగం బల్ల వుంది. దాని పక్కన రేడియో విడి భాగాలున్న టేబిలు, పనిముట్ల షెల్ఫు, చిల్లరమల్లర సామాన్లు, నమూనాలు వున్నాయి.

పిల్లవాడి సర్వతోముఖ అభివృద్ధికి అవసరమైన పరిస్థితులన్నీ కుటుంబంలో కల్పించబడినట్లు తల్లితండ్రులు అనుకుంటున్నారు. కాని మరీయా అలెక్సేయెవ్నా మాత్రం తన పెంపకపు క్రమంలో అనుకోని ఒక లోపం వున్నట్లు అనుమానించసాగింది. తన కొడుకు జీవితమంతా మరీ కార్యక్రమ బద్ధం చేయడమే యీ లోపం అనుకుంది ఆమె. వాడి కార్యకలాపాలు ప్రధానంగా కచ్చితంగా ప్లానుచేసిన సన్నివేశాల పర్యవసానాలు. వాటిలో చొరవ అంతా వాస్తవానికి తల్లితండ్రులది. తన తల్లితండ్రులు ఎంపికచేసిన పనుల్లో వాడికి ఆసక్తి వుందని అందరికీ అనిపించవచ్చు గాని, నిజానికి ఆ కుర్రాడు వాటిలో నికరమైన ఆసక్తి చూపడు. కాగా యేదో ఒక రోజున యూర "నా విషయాలన్నీ మీరే ఆలోచించారు. నా ప్రతి అడుగునీ, కదలికనీ మీరే ప్లాన్‌చేశారు. ఇంక చాలు! కనీసం జీవితంలో ఒక్క సారైనా నన్ను నా యిష్టం వచ్చినట్లు చెయ్యనివ్వండి. నేను పొరపాటు చెయ్యవచ్చుగాక. కాని ఆ పొరపాటు

నా సొంత పొరపాటు అవుతుంది. నేనే దాన్ని సరిదిద్దుకుంటాను'' అని తన తల్లితండ్రులతో చెప్తాడు.

ఆ పొరపాటు ఎలాంటిది కావచ్చో తెలుసుకోవడం కష్టం. కర్మకాలి అది వినాశకరమైనదైతే?

యూరా సమయ పాలనం కలిగినవాడనడం, స్కూలు పాఠాలు శ్రద్ధగా వింటాడనడం, హోమ్‌వర్కు శ్రద్ధగా చేస్తాడనడం, పెద్దల మాట జవదాటడనడం నిజమే – కాని చొరవ, కచ్చితమైన నిర్ణయం అవసరమైన సందర్భాల్లోనూ, సాహసంగా రిస్కు తీసుకోవలసిన సమయాల్లోనూ వాడు నిస్సహాయత ప్రదర్శిస్తాడు. వాణ్ణి "తల్లిచాటు బిడ్డ" అని పిల్లలందరూ ఎందుకు ఏడిపిస్తారో మరీయా అలెక్సేయెవ్నా అర్థంచేసుకుంది. దీనంతలో తన దోషమేమిటో కూడా ఆవిడ గుర్తించింది.

ఇప్పుడామె తన కొడుకును వోవ్కాతో పోల్చిచూసినప్పుడు వోవ్కా మరింత చురుకైనవాడనీ, వాడి జీవితం మరెంతో ఉత్సాహభరితం, వైవిధ్యపూరితం అనీ, వాడిలో ఒక రకమైన వ్యుత్పన్నత వుందనీ, వాడిలో శక్తి చిప్పిల్లుతూ వుందనీ ఆవిడ గుర్తించింది. వోవ్కా తన కొడుకు కంటె శిక్షణలో తీసికట్టనీ, తన కొడుకంతగా వాడిది వ్యవస్థీకృతమైన జీవితం కాదనీ ఆవిడ గ్రహించింది. బట్టలెక్కడ నలిగిపోతాయో, మాసిపోతాయో అని సంకోచించకుండా వోవ్కా తనకి యిష్టమైన చోట, వీలైన చోట కూర్చోగలడు. ఏ కంచెమీంచో, గుంటమీదుగానో దూకేందుకు వాడు సంకోచించడు.

మరీయా అలెక్సేయెవ్నా యిప్పుడు మొట్టమొదటిసారిగా తన కొడుకు శిక్షణ క్రమాన్ని మార్చవలసిన అవసరం వుందనీ, మరింత చురుకుగా వుండేలా వాడిని ప్రోత్సహించాలనీ గుర్తించింది. తన కొడుకు జీవితంలో అలాంటి సర్దుబాటు చెయ్యడం చాలా కష్టమనీ, యీ పని చేసేందుకు మిక్కిలి తగినవాడు బహుశా వోవ్కా జరూబినే అనీ కూడా ఆవిడ అర్థంచేసుకుంది. తన కొడుకుతో ఆడుకోవడం ద్వారా వోవ్కా కూడా లబ్ధిపొందుతాడనే విషయంలో కూడా ఆవిడకి సందేహం లేకపోయింది. వాస్తవానికి, ఆచరణలో యిది అప్పుడే నిరూపితమైంది కూడా. వోవ్కా పుస్తకాలు చదవడం మొదలెట్టాడు. ఫుట్‌బాల్‌ని గురించీ, పంగల కర్రలు, పిస్తోళ్లని గురించీ కాక పుస్తకాలని గురించీ, చిత్రాలని గురించీ మాట్లాడటం మొదలెట్టాడు.

తన కొడుకు అభివృద్ధిలో "సర్దుబాట్లు చెయ్యడం" కష్టంతో కూడిన పని కావచ్చునని మరీయా అలెక్సేయెవ్నా పూర్తిగా గ్రహించింది. నిజానికి ఆవిడ సంకోచాలు త్వరలోనే అనుభవంలోకి వచ్చాయి కూడా.

ఓ ఆదివారంనాడు యూరా ఏడ్చిన చిన్నెలతో యింటికి తిరిగివచ్చాడు. వోవ్కా తప్పు చేసినవాడి సంకోచభావంతో వాడి వెనక వస్తున్నాడు.

వాళ్లిద్దరూ స్కీయింగ్ చేస్తూ బాగా ఎత్తైన ఓ దిబ్బమీదకి చేరుకున్నారు. కిందకి

స్కీలమీద దూకే చోటు అది. వోవ్కా యూరతో అక్కణ్ణుంచి దూకుదాం రమ్మన్నాడు. కాని యూర భయపడి, కదల్లేదు. వోవ్కా యూరని ప్రోత్సహించడం మొదలెట్టాడు. కాని యూర తటపటాయించాడు. వోవ్కా యూరని నెమ్మదిగా గెంటి, తను కూడా వాడి వెంట దూకాడు. వాళ్లిద్దరూ కట్ట కట్టుకుని పడ్డారు. వోవ్కా నవ్వేశాడు. కాని యూర ముఖం మాడ్చుకున్నాడు, నెమ్మదిగా యింటి దోవపట్టాడు. వోవ్కా "పోతే పో" అని అరిచాడు. కాని ఒక క్షణం ఆలోచించి, తను స్వయంగా పోయి, యూర తల్లికి విషయం వివరిద్దామని నిర్ణయించుకున్నాడు. "అసలేం జరిగిందంటే, భయపడాల్సిందేమీ లేదు. ఆ విషయం నేను వీడికి చెప్పాను. కాని వీడు కదలడే. మీరు రండి, నేను చూపిస్తాను. స్కీయింగు దిబ్బ ఏమంత ఎత్తు లేదు..." – "ఔను చూస్తే బాగానే వుంటుంది. రండి, పోయి చూద్దాం" అంది యూర తల్లి. యూర తన తల్లి కేసి ఆశ్చర్యంగా చూశాడు. ఆ పాపిష్టి దిబ్బ దగ్గరకి మళ్లీ వెళ్లడం వాడికి బొత్తిగా యిష్టం లేదు. "అన్నట్లు నేనిప్పుడే కొట్టుకి వెళ్లాలని లేవబోతున్నాను. పద పోదాం, యూర" అందావిడ తన కొడుకుతో హుషారుగా. కొడుకు అయిష్టంగా బయల్దేరాడు. ఆ దిబ్బ దోవలో దగ్గర్లోనే వుంది. "చూడండి!" అంటూ వోవ్కా చటుక్కున, ఈసారి వాటంగా దూకాడు. యూర తన నేస్తం కేసి ఈర్ష్యగా చూశాడు. "ఇప్పుడు నువ్వు ప్రయత్నించు యూరా, యిందులో భయపడాల్సిందేమీ లేదు" అంటూ వాళ్ల అమ్మ మెల్లగా యూర చెవిలో చెప్పింది. "నేనీ సారి యింకా బాగా దూకగలను" అంటూ వోవ్కా మళ్లీ దిబ్బ ఎక్కాడు. వోవ్కా తన నైపుణ్యం ప్రదర్శిస్తూ, "రా యూరా, భయపడకు!" అంటూ రెట్టించాడు. యూర కదల మెదలకుండా నిలబడ్డాడు. "మీరిక్కడే వుండండి, నేను అంగడికి పోయి వస్తాను" అంటూ వాళ్ల అమ్మ చెప్పింది.

మరీయా అలెక్సేయెవ్నా తిరిగివచ్చేసరికి తన కొడుకు దిబ్బమీంచి కిందకి స్కీయింగు చేస్తూ వుండటం చూసింది. "అమ్మా, అసలు భయమే వెయ్యలేదనుకో!" అంటూ యూర అరచాడు. తన కొడుకు స్వరంలోనూ, వాడి కదలికల్లోనూ కూడా మరీయా అలెక్సేయెవ్నాకి ఓ రకం కొత్త స్వేచ్ఛ, వాడి ముఖంలో ఓ కొత్త ఆనందం కనిపించాయి.

పెద్దవాళ్లు తమ పిల్లలకి సన్నిహితంగా వుండాలని అంటూ వుంటారు. అయితే, యీ సాన్నిహిత్యం అంటే యేమిటి? దాన్ని సాధించడం ఎలా? దాని హద్దులు ఏమిటి? ఉదాహరణకి, మకారెంకొ అలాంటి సాన్నిహిత్యంతో బాటు మనం కొంచెం దూరంగా కూడా ఉండాలంటాడు.

అన్నింటి కంటె ముఖ్యంగా, పిల్లలు ఆంతరిక సంఘర్షణలో పడే క్లిష్ట పరిస్థితుల్లో తోడ్పడటం ద్వారా సాన్నిహిత్యం సాధింపబడుతుంది.

దిబ్బమీంచి స్కీయింగ్ చేయడం స్వల్పమైన విషయం, కనీసం పెద్దవాళ్ల దృష్టిలో.

కాని పిల్లవాడికి అలాంటి సంఘటన నిర్ణయాత్మకమైనది కావచ్చు. భయం ఒక కుర్రవాడి అంతరంగాన్ని ఆవహించినప్పుడు, అది వేళ్ళూనుకొని, వాడి ఆత్మని స్తంభింపజేయవచ్చు. అందుకని, భయాన్ని అధిగమించడం ఎలాగో పిల్లవాడికి నేర్పడం ముఖ్యం.

మరి పెద్దవాళ్ళు యీ విషయంలో తమ పిల్లలకి సహాయపడగలరు. వాళ్ళు తప్పక సహాయపడాలి. వాళ్లీ పని చేయడం ద్వారా తమ పిల్లలని అనవసరమైన, బాధాకరమైన వేదననుంచి విముక్తులను చేస్తారు. ఆత్మ విశ్వాస లోపం, పిరికితనం వంటి ధోరణులు చోటు చేసుకోవడాన్ని నివారించవచ్చు. మరింత జ్ఞానం, మరింత అనుభవం కలిగినవాళ్లనుంచి సహాయం రావడం అన్నది పరమ సహజమైన విషయం. పిల్లల విషయంలో యీ ప్రధాన అవకాశాలు కలిగిన పెద్దవాళ్ళు తాము ఏ మేరకు జోక్యం చేసుకోవాలో తమకి తాము నిర్ణయించుకోవాలి.



పిల్లల పెంపకంలో నిమగ్నులై వున్న పెద్దవాళ్ళు తమ పిల్లలకి "పైగా" కాక, ఎప్పుడూ వాళ్లతో "కలిసి" వుండాలని నేనొకప్పుడు అనుకొంటూ వుండేవాణ్ణి. దరిమిలా యీ "కలిసి" అనే మాట అన్నిటికంటె ముఖ్యంగా ఒక భ్రమ అనీ, పిల్లలతో సాన్నిహిత్యం సాధింపబడిందనీ, అసలు ఎడమే మిగల్లేదనీ చెప్పే సందర్భాల్లో సైతం మనుషులు తమని తాము మోసగించుకుంటున్నారే తప్ప మరేమీ కాదనే నిర్ణయానికి వచ్చాను. రెండో సంగతి, పెద్దవాళ్ళూ పిల్లలూ అన్నప్పుడూ కలిసి వ్యవహరించడం సాధ్యం కాదు. ఎందుకంటే, వాళ్ల మధ్య కొన్ని ఉమ్మడి అంశాలకు తోడు, వాళ్ల అభివృద్ధి, అనుభవాల్లో వున్న వ్యత్యాసం మూలంగా, వాళ్ల కార్యకలాప రంగాల్లో భిన్నమైనవి కూడా అనివార్యంగా వుంటాయి.

ఇవి సహజంగానే భిన్నమైన స్థాయిల్లో వుంటాయి. ఈ "వ్యత్యాసం" హేతుబద్ధమైనదీ, సహజమైనదీ కూడా. అంతేకాదు, పిల్లలు యీ భిన్న రంగాలను గురించి విధిగా తెలుసుకొని వుండాలి. ఇలా తెలుసుకొని వుండటం వాళ్ళ తమ తల్లితండ్రుల జీవితాన్నీ, ఆసక్తుల్నీ గౌరవించడం ఎలాగో వాళ్ళకి నేర్పుతుంది.

పిల్లలకి తమ తల్లితండ్రులనుంచి దాచవలసిన రహస్యాలేవీ వుండకూడదనీ, వాళ్ళు తమ తల్లితండ్రుల్ని పూర్తిగా విశ్వసించాలనీ ఎవళ్ళైనా అన్నప్పుడు, వాళ్ల సూత్రానికి కొన్ని మినహాయింపులు వుంటాయని ప్రత్యేకించి చెప్పనక్కర్లేదు.

వ్యక్తి ఆంతరిక జీవితంలో ఎన్నో పొరలు వుంటాయి. అలాంటి మిక్కిలి లోతైన పొరల్లో అతని ఆంతరిక జీవితం ఒకటి. ఈ మిక్కిలి లోతైన పొర స్థాయిలో పెద్దలూ, పిల్లలూ పరస్పరం ఆంతరంగికంగా వ్యవహరించడం సాధ్యం కాదు, అలాంటి అవసరమూ లేదు.



పిల్లవాడికి శిక్షణ యిస్తున్నవాడి వైఖరి పట్టువిడుపులతో కూడివుండక తప్పదు. కొన్ని సందర్భాల్లో అతను పిల్లలతో "కలిసి" వ్యవహరించాలి. మరి కొన్నింటిలో అతను వాళ్లకి "పైగా" నిలిచి మాట్లాడాలి. అయితే యిక్కడ ఒకే ఒక్క విషయం విధిగా గుర్తుంచుకోవాలి: వ్యతిరేక పార్శ్వాల్లో ఏదో ఒక్కదానిమీదనే ప్రత్యేక వక్కాణింపు సంబంధాలను భగ్నంచేసి, అన్యధాకరణకీ, అసహజమైన సంబంధాలకీ దారితీస్తుంది. "కలిసి" వ్యవహరించడం ఎక్కువైతే పిల్లల్లో గౌరవ లోపానికీ, స్వాతిశయపూరిత వైఖరులు అభివృద్ధిచెందేందుకూ అది కారణమవుతుంది. పిల్లలతో "పైనుంచి" మాట్లాడే వైఖరి ఎక్కువగా వుంటే పిల్లవాడి వ్యక్తిత్వాన్ని పాశవికంగా నులిమివేయడానికే నేరుగా దారితీస్తుంది.

శ్రమైక స్వభావం తనకి అతీతమైనది అనుకోవడమే వోవ్కా దాన్ని అలవరచుకోక పోవడానికి కారణం. వోవ్కా తల్లితో సంప్రతించాక మరీయా అలెక్సేయెవ్నా ఆత్మవిశ్వాస లోపంనుంచి ఆ కుర్రాడు బయటపడేందుకు వాడికి తోడ్పడాలని నిర్ణయించుకుంది. ఓ రోజున ఆవిడ వోవ్కాతో "నువ్వో సారి నువ్వు చెయ్యాలనుకుంటే ఏ పనైనా చెయ్యగలనని చెప్పావు జ్ఞాపకం వుందా. నాకు నీ మాటమీద పూర్తి నమ్మకం వుంది. నువ్వు గట్టివాడివి. నువ్వు నాకొక బహుమతి యివ్వాలి. ఒక్క కొట్టి వేత కూడా లేకుండా ఓ లెక్కల నోట్‌బుక్ యివ్వాలి." వోవ్కా ఆశ్చర్యంగా "నాకు అలాంటి నోట్‌బుక్ లేదు" అన్నాడు. మరీయా అలెక్సేయెవ్నా చిరునవ్వు నవ్వుతూ "నాకీ సంగతి తెలుసోయ్. కాని ఒక నెలలో నువ్వలాంటి నోట్‌బుక్ చూపించగలవు కదా" అంది ఆవిడ.

యూర తల్లి యిటీవల తనమీద సంపాదించుకున్న పలుకుబడి సంగతి వోవ్కాకి తెలియదన్న మాట నిజమేననుకోండి. ఆవిడ ఎదుట వున్నప్పుడు తను మరింత మెరుగ్గా వుండాలనీ, అన్నీ మరింత సలక్షణంగా చెయ్యాలనీ వాడు ఆరాటపడతాడు. ఈ విషయంలో వాడికి అదృష్టం కలిసివస్తూవుంటుంది కూడా. అన్నింట్లోకీ మంచి పుచ్చకాయ ఏరడంలోనేమి, తిండి పదార్థాల ఏ టిన్నునైనా సరే అవలీలగా చక్కగా తెరవడంలోనేమి వాడు తన నేర్పు చూపిస్తూ వుంటాడు. అంతెందుకు వాడు జోళ్లని కూడా మరమ్మతు చెయ్యగలడు. అలాంటి ప్రతి సారీ మరీయా అలెక్సేయెవ్నా "చూశావురా యూరా, వోవ్కా అన్ని పనులూ ఎంత బాగా చేస్తాడో!" అంటూ ఆశ్చర్యం ప్రకటించేది. వోవ్కా వీన్నిక్‌ల కుటుంబంతో, అంటే యూర కుటుంబ సభ్యులతో రాత్రిపూట మకాంచేసి చేపల్ని వేటాడేందుకూ, రెండు రోజుల పాటు వాళ్ల గ్రామానికీ కూడా వెళ్లాడు. వాడు యిటీవల మరో విషయం గమనించాడు. వాడు వీన్నిక్‌లనందర్నీ మెచ్చుకున్నప్పుడల్లా వాళ్లమ్మ చిరాకు పడుతోంది. ఆవిడ యేదో ఒక రోజున "ఇంక చాల్లే వీన్నిక్‌ల సొద. నువ్వింక వాళ్లింటికి వెళ్లడం కట్టిపెట్టు!" అని ఎక్కడ అంటుందో అని వాడికి ఎక్కడ లేని భయం పట్టుకుంది.

నిజానికి, తుడుపులు లేకుండా నోట్‌బుక్ రాయడమే కాదు, యూర తల్లికోసం వాడు ఏమి చేసేందుకైనా సరే సిద్ధమే. కాని తీరాచేసి ఆ పనిలోకి దిగేసరికి అదెంత కష్టమో తేలింది! ఓయ్, దాన్ని రాసి, చింపి, ఎన్ని సార్లు రాయవలసివచ్చిందో! మొత్తంమీద ఎలాగైతేనేం ఒక రోజున అది పూర్తయింది. పుస్తకం మొత్తంలో మూడేమూడు తుడుపులు వున్నాయి. మరీయా అలెక్సేయెవ్నా ఆ నోట్‌బుక్ తీసుకుని యూర నోట్‌బుక్ పక్కన పెట్టింది. యూర నోట్‌బుక్ మరింత శుభ్రంగా వుందనడంలో సందేహం లేదనుకోండి. వోవ్కా ఎంతగా తంటాలుపడ్డా, వాడి నోట్‌బుక్ కొనలు యింకా ముడతలుపడే వున్నాయి, యింకా నల్లబడే వున్నాయి. కొన్ని చోట్ల వాడి వేలిముద్రలు కనిపిస్తున్నాయి. అయితే మరీయా అలెక్సేయెవ్నా యీ చిల్లరమల్లర వివరాలేవీ పట్టించుకోలేదు. "వోవ్కా, నువ్వు నిజంగానే బలే దిట్టమైనవాడివి! థాంక్యూ" అంది.

దీని తర్వాత వోవ్కాలో శ్రమైక దృష్టీ, శుభ్రతా వచ్చేశాయని చెప్పలేము గాని, పని పట్ల వాడి వైఖరిలో మాత్రం పూర్తిగా ఓ కొత్త ధోరణి ప్రవేశించింది. ఈ ధోరణిని వాడి టీచర్లు కూడా గమనించారు.

వ్యక్తులు వాళ్లని ప్రభావితం చేసే పరిస్థితులు వెరసిమొత్తంనుంచీ, వాటిని మార్చడంలో తాము స్వయంగా ఏ మేరకు పాల్గొంటారన్నదాన్నుంచీ శిక్షణ పొందుతారు. శిక్షణ క్రమాన్నీ, ఆయా నిర్దిష్ట పరిస్థితుల్లో పిల్లలను ప్రభావితంచేసేందుకు వినియోగించవలసిన సాధనాల స్వభావాన్నీ అర్థంచేసుకునేందుకు యిది కచ్చితమైన కొలబద్దను సమకూరుస్తుంది.

ఈ శాస్త్రీయ సూత్రీకరణ ప్రాతిపదికమీదనే సమగ్ర విద్యా, శిక్షణా వ్యవస్థని మనం అభివృద్ధిచేసుకోవలసి వుంటుంది.

తన కొడుకుని చుట్టూతా వున్న వాతావరణంనుంచి అతిగా వేరుచేయడంలో తను చేసిన తప్పిదాన్ని మరీయా అలెక్సేయెవ్నా అర్థంచేసుకుంది. తన కొడుకు "చెడ్డ పిల్లలతో" ఎక్కడ స్నేహంచేసి చెడిపోతాడో అని ఎప్పుడూ భయపడుతూ వుండే అన్నా ఇవానొవ్నాకి భిన్నంగా, మంచి పిల్లవాడుగా ఎంత మాత్రం పరిగణింపబడని వోవ్కాని ఆవిడ ఆహ్వానించింది.

ఒక కుర్రాడు నాసి విద్యార్థి అనే ఒకే ఒక్క కారణంతో తల్లితండ్రులు పరస్పరం ఒకరంటే ఒకరు యిష్టపడే పిల్లల సంబంధాలను అప్పుడప్పుడు తెంచేస్తూ వుంటారు. అయితే కొందరు కుర్రాళ్ల విషయంలో సాంఘిక సంబంధాలపట్ల ఆకర్షణ చాలా బలీయంగా వుండి, అదొక సజీవ అవసరంగా పరిణమించి, యితర కార్యకలాపాలన్నింట్లోనూ ప్రముఖ పాత్ర వహిస్తుంది. వోవ్కా జరూబిన్ స్నేహితులు లేకుండా ఒక్క గంట కూడా గడవలేడు. ప్రతి రోజూ వాడు స్నేహితుల్ని కలుసుకోవచ్చునన్న తమకంతో స్కూలుకి పరుగెత్తుతాడు. స్కూలునుంచి అందరి కంటె ఆఖర్న తిరిగివస్తాడు. వాళ్ల అమ్మ "మా అబ్బాయికి సీరియస్ ఆసక్తులంటూ ఏమీ లేవు. వాడికి కావలసిందల్లా ఒక్కటే: స్నేహితులు, వాళ్లతో సరదాగా గడిపెయ్యడం."

ఇతరులపట్ల ఆసక్తి కలిగివుండటం కంటె మెరుగైనది మరేం వుండగలదు! మరి కొన్ని ఆసక్తులు కూడా వుంటే మంచిదే అనుకోండి. వోవ్కా స్నేహితుల్లో ప్రతి ఒక్కడి నిర్మాణాత్మక ప్రభావమూ వాడిమీద ఎంతో కొంత వున్న సంగతి మనం యింతకు ముందు చూశాం! కోస్త్య వాడిలో పుస్తకాలు చదవడంపట్ల ఆసక్తి కలిగించాడు. యూరా, వాడి తల్లీ మరి కొన్ని కార్యకలాపాలపట్ల వాడికి యిష్టం కలిగించారు. ఎందరు తల్లితండ్రులు తమ పిల్లలమీద అనవసరమూ, అనుచితమూ అయిన విధి నిషేధాలు పెడుతూ వుంటారు...

పిల్లవాడి వ్యక్తిత్వం రూపొందడంమీద ఎన్నెన్ని ప్రభావాలు ఎంతెంతగా ప్రసరిస్తాయో కచ్చితంగా గమనించే సామర్థ్యం పిల్లల పెంపకానికి ప్రాతిపదికగా వినియోగపడుతుంది.

# బోధకుడి "అంతర్ దృష్టి"

తల్లో, తండ్రో అయినా లేక టీచరైనా, అనుభవజ్ఞుడైన బోధకుడికి బోధన శాస్త్రీయ అంతర్ దృష్టి వుంటుంది. "నేను వాడి కళ్లు చూస్తే చాలు, వాడి ఆంతర్యం పసిగట్టే స్తాను," "వాడి అంతరంగమేమిటో వాడి ముఖంమీదే తెలిసిపోతుంది," "వాడిలో ఏదో మార్పు వచ్చింది" అనే మాటలు మనం తరచు వింటూ వుంటాం.

పిల్లలు ఎంత చిన్నవాళ్లైతే వాళ్ల ముఖాలు అంత ఎక్కువ స్పష్టంగా వాళ్ల కోర్కెలను ప్రతిఫలిస్తాయి. వాళ్ల ముఖంమీద వాళ్ల మనస్సులో సాగుతున్న ఆంతరిక క్రమాలను "చదవడం" అంత తేలిక అవుతుంది. పిల్లలు పెరిగే కొద్దీ వాళ్లు తమ ఆవేశాలను అదుపులో వుంచుకోవాలనీ, తమ కోర్కెలను అణుచుకోవాలనీ, తమని తాము హద్దుల్లో పెట్టుకోవాలనీ పెద్దవాళ్లు నిరంతరం పట్టుపడ్తారు. గట్టిగా నవ్వడం, అరవడం, చిరాకుపడటం (యిది ముఖంమీద ముడతలు పడేలా చేస్తుంది) సభ్యత కాదని చెప్తారు వాళ్లు. మీరు చిరునవ్వు నవ్వుతూ వుండాలి — అప్పుడు అందరికీ మీరు మరింత నచ్చుతారు. నొప్పి గాని, చలి గాని, వేడి గాని కిక్కురుమనకుండా సహించాలి. పిల్లలు పెరిగి, పెద్దవాళ్లని గమనించే కొద్దీ, ఆత్మ సంయమనానికీ, తమ ముఖ కవళికలనూ, కదలికలనూ అదుపులో వుంచుకొనే సామర్థ్యానికీ ఆచరణలో వుండే ప్రాముఖ్యాన్ని స్వయంగా గ్రహిస్తారు.

పిల్లలకి ఎవరిని బోల్తా కొట్టించవచ్చునో, ఎవరి దగ్గర తమ పప్పులు ఉడకవో చాలా బాగా తెలుసు. "ఆయన్ని మోసగించలేము. ఆయన మీకేసి చూశాడా, అంతే మీ పని అయిపోయినట్లే, మీరు వెంటనే పూర్తిగా నిజం కక్కవలసిందే. కాని ఆ రెండో ఆయన వున్నాడే, ఆయనతో మీరేం చెప్పినా చలామణీ అయిపోతుంది, ఆయన మిమ్మల్ని పూర్తిగా నమ్మేస్తాడు" అని చెప్పుకుంటారు వాళ్లు.

"అంతర్ దృష్టి" అనే మనస్తత్వ శాస్త్ర పదాన్ని యీకింది ఉదాహరణ ద్వారా అర్థంచేసుకోవచ్చు. విమాన చోదకుడు తన పనిముట్లు చూసుకుంటాడు. ఒక గేజినుంచి మరో గేజికి తన దృష్టిని చటుక్కున మారుస్తాడు. అతనికి నిశితమైన బహుముఖమైన దృష్టి వుంటుంది. అంతే కాకుండా, పరికరాల ద్వారా లభించిన సమాచారంమీద ఆధారపడి తన విమానపు ఫ్లైట్ ట్రాజెక్టరీని అతను చటుక్కున "పునర్నిర్మించుకొనే" సామర్థ్యం కూడా కలిగివుంటాడు.

అలాగే, టీచరుకి కూడా "అంతర్ దృష్టి" వుంటుంది. ప్రస్తుతం, భవిష్యత్తులో కూడా అత్యంత వైవిధ్యపూరితమైన పరిస్థితుల్లో జరగని సన్నివేశాలతో బాటు అత్యంత సంభావ్యమైన సన్నివేశాల్లో — పిల్లలు ఎలా వుంటారో అతను చూడగలడు.

నిశితమైన చూపు కలిగివుండి, యితరుల దృష్టిని ఆకట్టుకోని విషయాలను గమనించగలిగిన టీచర్లు వున్నారు. ఈ లక్షణాలు లేని టీచర్లూ వున్నారు. పిల్లల ఆంతరిక

స్థితిని అనుభూతి చెంది, అంచనా వేయగలిగిన వాళ్లకి అలాంటి సామర్థ్యం లేని వాళ్లమీద సహజంగానే ఆధిక్యత వుంటుంది. నా ఉద్దేశంలో అలాంటి అంతర్ దృష్టి సామర్థ్యం బోధనా శాస్త్ర ప్రధాన నైపుణ్యాల్లో ఒకటి. ఈ అంతర్ దృష్టి పిల్లల ఆంతరిక స్థితినీ, వాళ్ల భయాలనీ, ఆశలనీ, ఆకాంక్షలనీ పైకి స్పష్టస్పష్టంగా వెల్లడయ్యే మిమిక్రీ, స్వరం, కదలికల వంటి బాహ్య సూచనల ఆధారంగా కనిపెట్టేందుకు తోడ్పడుతుంది.

అలాంటి అంతర్ దృష్టిని దాని రెండు పార్శ్వాల దృష్ట్యా చూడవచ్చు. మొదటి పార్శ్వం మనస్సు "చదవగల" సామర్థ్యం. ఇది ఏదైనా ఒక విషయపు అర్థాన్ని కనుగొనే ఒక ఆంతరిక క్రమం. అనుభవం, సాదృశ్యాల, పోలికల సాయంతో సమాచారాన్ని తక్షణమే వింగడించడం.

అంతర్ దృష్టి రెండవ పార్శ్వంలో అర్థంచేసుకోవడమే కాకుండా ప్రవర్తనని గురించిన అంచనా కూడా యిమిడి వుంటుంది. పిల్లల దృష్టి మన దృష్టిని కలిసినప్పుడు వాళ్లు తరచు వాళ్లపట్ల మన వైఖరిని కూడా అనుభూతి చెందుతారు. మనం వాళ్ల ప్రవర్తనని అంచనా వేస్తున్నప్పుడు, మన ముఖ కవళికను చూసి, పిల్లలు మన మానసిక ప్రతిస్పందనలను తెలుసుకుంటారు. ఈ స్పందనలు రకరకాలుగా వుంటాయి: అవి విచారం కావచ్చు, బాధ, కోపం, సంతోషం, ప్రేమ, ద్వేషం, ఆమోదం, ప్రోత్సాహం, ఆదేశం, వగైరా ఏదైనా కావచ్చు.

"కళ్లు ఆత్మకి దర్పణం" అనే నానుడి పిల్లలకీ, పెద్దలకీ కూడా ఒకే మాదిరిగా వర్తిస్తుంది. బోధన శాస్త్రీయ అంతర్ దృష్టిని మనం పరస్పర ప్రతిచర్యగా, పరస్పర సంబంధంగా, రెండు దిక్కుల క్రమంగా చూస్తాం గనుక మనం యీ ప్రకరణంలో కొంచెం ఆగి, "పిల్లల దృష్టిలో పెద్దలు," "పెద్దల దృష్టిలో పిల్లలు" అనే రెండు విషయాంశాలను పరిశీలించవలసి వుంది.

అందుకని, మన అవగాహన మేరకు బోధన శాస్త్రీయ అంతర్ దృష్టి క్రియారహితమైన ధ్యానం కాదు, అది క్రియాశీలమైనది, ఆచరణాత్మకమైనది.

బోధన శాస్త్రీయ అంతర్ దృష్టి కళ సుదీర్ఘమైన అనుభవం, తన మనస్సును తాను జాగ్రత్తగా ప్రశ్నించుకోవడం, సమాచారాన్ని విశ్లేషించడం ఫలితంగా అభివృద్ధిచెందుతుంది. అలాంటి కర్తవ్యాన్ని చైతన్యపూరితంగా తన ముందు పెట్టుకునే ప్రతి వ్యక్తికీ యీ కళ అందుబాటులో వుంటుంది.

తమ సొంత బాదరబందీల్లో, యిబ్బందుల్లో మునిగిపోయిన పెద్దవాళ్ల దౌర్భాగ్యం ఏమిటంటే, ఏదో ఒక దశలో వాళ్లు "చూడటం" మానేస్తారు, లేకపోతే "చూసే" సామర్థ్యం కోల్పోతారు. వాళ్ల పని, వాళ్ల వ్యక్తిగత జీవితంలోని బాదరబందీలూ పెద్దవాళ్లు తమ పిల్లల విషయంలో దృష్టిని కేంద్రీకరించి, విశాల దృష్టితో చూసి, వాళ్ల ప్రవర్తనని గురించి వివేచించేందుకు ఆటంకాలు అవుతాయి.

పిల్లల పెంపకానికి సరైన అంతర్ దృష్టి కలిగివుండటం నిర్ణయాత్మకమైన ఒక షరతు. మామూలుగా ఏమి జరుగుతూ వుంటుందో గుర్తుచేసుకోండి. ప్రతి రోజూ తల్లి తన కొడుకుతో "అది చెయ్యకు, ఇది చెయ్యకు. నీకింకా తెలియదు, నువ్వింకా చిన్నవాడివి" అంటూ రాపాడిస్తూ వుంటుంది. వోవ్కా తన మనస్సులో ఒక మారుమూల అలాంటి అంచనాకి అలవాటుపడిపోయాడు. వాడు కూడా "అయినా నేనెందుకు ప్రయత్నించాలి? నేనెంత ప్రయత్నించినా, ఎటుతిరిగీ నా ప్రయత్నం సఫలం కాదు కదా" అనుకునేవాడు. అన్నా ఇవానొవ్నా తన కొడుకు అశాంత స్థితినీ, వాడి అదుపులేని శక్తినీ ఒక లోపంగా పరిగణించగా, మరీయా అలెక్సేయెవ్నా సరిగ్గా వాటినే మరో పార్శ్వంనుంచి చూసింది. ఆవిడ దృష్టిలో యీ లోపమే ఒక బలమైన అంశంగా కనిపించింది. ఓ రోజున వోవ్కా వీన్నిక్‌ల యింటికి వెళ్ళినప్పుడు, మరీయా అలెక్సేయెవ్నా తన కొడుకుతో "చూడు, వోవ్కా ఎంత తొందరగా, సరిగ్గా గ్రహించగలడో" అంది. వోవ్కా అబ్బురపడ్డాడు. క్లాసులో ఫస్టుగా వుండే యూరవీన్నిక్ బుర్ర కంటే తన బుర్ర నిజంగానే చురుకైనదవడం నిజంగానే సాధ్యమా? అంతకు ముందుదాకా యూర చెప్పిందల్లా కిమ్మనకుండా ఒప్పుకొంటూ వచ్చాడు వోవ్కా. మంచి విద్యార్థిగా వాడి ఆధిక్యతని పూర్తిగా మన్నిస్తూ వచ్చాడు. కాని, మరీయా అలెక్సేయెవ్నా యథాలాపంగా చేసిన వ్యాఖ్య దరిమిలా, యిప్పుడు వాడు యూరని ఖండించడం, లెక్కలకి తన సొంత పరిష్కారాలు ప్రతిపాదించడం, "ఈ లెక్కని యింకోలా చేసి చూద్దాం. చూడు యిలా అయితే మరింత తేలిగ్గా, తొందరగా చెయ్యవచ్చు" అనడం మొదలుపెట్టాడు.

జీవితంలో మొట్టమొదటిసారి వోవ్కాకి తన శక్తి సామర్థ్యాల్లో విశ్వాసం కలిగింది. వాడు తన తల్లితో ఒకసారి "నేను క్లాసులో అందరి కంటె ముందస్తుగా లెక్కలు చెయ్యగలను తెలుసా" అన్నాడు గర్వంగా. "కోతలు కొయ్యకు. అంతా వట్టిది. నీ మార్కులు చూస్తే తెలియడం లేదూ" అంటూ నిట్టూర్చింది వాళ్ళ అమ్మ. "పట్టుదలా, పరిశ్రమా లేనిదే శక్తి సామర్థ్యాల వల్ల జరిగేదేమీ వుండదు" అని జోడించింది. ఏమనుకుంటే ఏం లాభం, వోవ్కాకి యీ లక్షణాలు లేవు. వాస్తవానికి తన యావజ్జీవితం యీ లక్షణాలు లేకపోవడంతో సరిపెట్టుకునేందుకు వాడెన్నడో మానసికంగా తయారయ్యాడు. వాడు రాసింది నీటుగా వుండకపోవడం మూలంగా, తుడుపులు, దిద్దుబాట్లు, మరకలు, వేలిముద్రలు వుండటం మూలంగా వాడికి నాసి మార్కులు వస్తూండేవి. కొన్ని సమయాల్లో నీటుగా రాసేందుకు మళ్లీ మళ్లీ ప్రయత్నించడం, ఆలోచించడం విసుగ్గా కూడా వుంటుంది. టీచరు చెప్పిన ఏ లెక్కైనాసరే చేసేందుకు సర్వదా సిద్ధంగా వుండే యూర వీన్నిక్ అంటే, వాడికి మనస్ఫూర్తిగానే ఈర్ష్య వుండేది. యూర అంకెలు లెక్కినట్లు అందంగా ఎలా వేస్తాడో, వంకరటింకర్లు లేకుండా పాపిడి తిన్నగా ఎలా తీసుకుంటాడో, వాడి కాలరు, చేతులు ఎలా

శుభ్రంగా వుంటాయో వోవ్కా జాగ్రత్తగా గమనించేవాడు. పెద్దవాళ్లు దీన్నంతనీ శ్రద్ధ, తీరువ అంటారు. తను ఎంత శ్రద్ధ తీసుకున్నా తనకి యీ తీరువ అనేది అబ్బి చావదని అనుకున్నాడు వోవ్కా.

ప్రతివాడికీ ఆత్మావలోకనం, స్వీయ శక్తి సామర్థ్యాలను తెలుసుకోవడం ముఖ్యం. ఆ ఆత్మావలోకనం వికలమైతే, ఆ జ్ఞానం పొరపాటు, తప్పు అయి కూడా, అదే అతని కార్య కలాపాలకి మార్గదర్శి అయితే, అప్పుడిక వైఫల్యం అనివార్యమవుతుంది.

అయితే, మొదలైన ప్రతిదానికీ అంతమంటూ ఒకటి ఉండక తప్పదు కదా. వీన్నిక్ కుటుంబంతో తన స్నేహానికి స్వస్తి జరగబోతోందని వోవ్కాకి అనిపించింది. ఇంతకీ జరిగిన దానంతకీ వాడిదే దోషం అనుకోండి. జరిగింది యిదీ. వేసవిలో వోవ్కా, వాడి స్నేహితులూ త్వరలో కూల్చివేయబడబోతున్న ఒక శిథిల గృహంలో అటకమీదకి తరచు ఎక్కి కూర్చొంటూ వుండేవాళ్లు. వాళ్లు చుట్టూ జాగా శుభ్రంచేశారు. సాలెగూడులు తుడిచేశారు, చిన్న కిటికీల అద్దాలు కడిగి శుభ్రంచేశారు. కొన్ని గోడలకి వెల్ల కూడా వేశారు. వాళ్లు కొన్ని పలకలు ఉపయోగించి ఓ టేబిలూ, రెండు బెంచీలూ తయారుచేశారు. ఓ మూల పొడి బ్రెడ్డు, పంచదార, ఉల్లిపాయలు, ఉప్పు, వగైరా తినుబండారాలు చేర్చి, అలమారుకి తాళం వేశారు. కుర్రాళ్లు ఖాళీ వున్నప్పుడు అక్కడికొచ్చి, ఆటలు ఆడుకునేవాళ్లు. కోస్త్యా తను చదివిన పుస్తకాల్లోని కథలు చెప్తూండేవాడు. వాళ్లు వేర్వేరు కన్నాల్లోంచి కింద వీధిని చూస్తూండేవాళ్లు. ఓ రోజున వోవ్కా తాము ఆ రాత్రి అక్కడ వుండిపోతే బాగుంటుందని ప్రతిపాదించాడు. తమ తమ తల్లితండ్రుల్లో ఏ ఒక్కరూ దీనికి ఒప్పుకునే అవకాశం లేదు గనుక, వాళ్లని బురిడీ కొట్టించేందుకు బ్రహ్మాండమైన పథకాలు వేశారు. కోస్త్యా, వోవ్కాలు వీన్నిక్‌ల యింటి దగ్గర తాము గడపుతామని చెప్తామన్నారు. యూర చాలాసేపు నసిగినప్పటికీ, చివరకి తన తల్లితండ్రులకి ఆ రోజున వోవ్కా తల్లి నైట్‌డ్యూటీకి వెళ్తోంది గనుక, జరూబిన్ల యింట్లో పడుకుంటానని చెప్తానన్నాడు. ఆ రోజు సాయంత్రం మరీయా అలెక్సేయెవ్నా ఒక షాపులో అన్నా ఇవానొవ్నాని కలుసుకోవడం తటస్థించింది. అప్పుడు ఆవిడ సాశ్చర్యంగా "ఇదేమిటి, మీరు యింటి దగ్గరే వున్నారా? నైట్‌డ్యూటీకి వెళ్లలేదా?" అని ప్రశ్నించింది. మోసం బయటపడింది. అప్పుడా తల్లులిద్దరూ బోయెవ్‌ల యింటికి వెళ్లారు. కోస్త్యా కూడా యింటి దగ్గర లేడు. దానితో ఆ పిల్లల తల్లితండ్రులు కంగారుపడి, స్కూలుకీ, తర్వాత స్థానిక మిలీషియాకీ ఫోనుచేశారు. సోదా మొదలైంది.

ఈలోగా కుర్రాళ్ల సంగతి ఎలాగుందో చూద్దాం. కుర్రాళ్లు తాపీగా కబుర్లు చెప్పుకుంటున్నారు. ఒకళ్లకొకళ్లు కథలు చెప్పుకొంటూ, చలికి ఒణుకుతున్నారు. తమ తల్లితండ్రుల్ని విజయవంతంగా బుట్టలో పెట్టినందుకూ, తమకి స్వేచ్ఛ లభించినందుకూ, తాము పెద్దవాళ్లు అయిపోయామన్న భావానికీ వాళ్లు బాగా మురిసిపోయారు. అర్ధరాత్రి అయేసరికి వాతావరణం బాగా చల్లబడిపోయి చలి దంచసాగింది. "ఒరేయ్, యింక ఇళ్లకి పోతే బాగుంటుందేమోరా?" అన్నాడు యూర. ఇంతలో బయట మనుషుల స్వరాలు,

అడుగుల చప్పుళ్ళు వినవచ్చాయి. ఫ్లాష్ లైట్లు మెరిశాయి. "వాళ్ళు పగటి పూట కూడా యిక్కడకి వస్తూంటారు" అన్న మాటలు వాళ్లకి వినిపించాయి. అంతలో ఒక స్త్రీ స్వరం "వాళ్ళు అటకమీద ఉన్నార్రా" అనడం వినవచ్చింది. తర్వాత "ఏయ్, కిందకి రండ్రా!" అన్న కేకలు వినిపించాయి. ఎవళ్ళో అప్పుడే మెట్లు ఎక్కి పైకి వచ్చేస్తున్నారు.

"ఏం జరిగిందో ముందునుంచీ పూసగుచ్చినట్టు చెప్పండి" అంటూ మిలీషియావాడు కఠిన స్వరంలో అడిగాడు.

"నీకు మమ్మల్ని అరెస్టుచేసే హక్కు లేదు" అని హుందాగా అనబోయాడు వోవ్కా. కాని వాడి స్వరంలో స్థైర్యం లేకపోయింది.

ఆ కుర్రాళ్లని కాపలా కాస్తున్న మిలీషియావాడు వాళ్లని కదలకుండా అక్కడే వుండమని ఆజ్ఞాపించి, కొద్ది నిమిషాల పాటు పక్కకి వెళ్లాడు. ఆ స్వల్ప విరామం వినియోగించుకొని వోవ్కా అందర్నీ "ఎవళ్ళూ నోరు మెదపొద్దు, వాళ్ళు మనల్నేమీ తలదీసి మొలెయ్యరు" అని హెచ్చరించాడు. తర్వాత వాళ్లని చాలా సేపు ప్రశ్నలు అడిగి, చివాట్లు పెట్టారు. ఈ కుర్రాళ్లమీద తగిన చర్యలు తీసుకొమ్మంటూ వాళ్ల స్కూలుకి ఒక ఉత్తరం రాశారు.

అన్నా ఇవానొవ్నా, మరియా అలెక్సేయెవ్నా, ఆవిడ భర్త, కోస్త్య బోయెవ్ తండ్రి గుమ్మంలో కనిపించేసరికి కోస్త్య ఏడవడం మొదలెట్టాడు.

చాలా మంది ఉపాధ్యాయులు ఘర్షణ పరిస్థితులనే బోధనలో "ప్రధాన సాధనం"గా పరిగణిస్తూ వుంటారు. సరిగ్గా అలాంటి పరిస్థితుల్లోనే పటిష్ఠమైన నిర్ణయాలు తీసుకొనే అవకాశాలు ఉత్పన్నమవుతాయి. ఇప్పుడు మనం చూసిన ఘర్షణను, తల్లితండ్రుల ప్రతిస్పందనలను, వాళ్ల నిర్ధారణలను పరిశీలిద్దాం.

...కోస్త్య బోయెవ్ తండ్రి మాటామంతీ లేకుండా కోస్త్యని తీసుకుపోయాడు. వాళ్ళు అడుగుపెట్టి తలుపులు మూసుకోగానే "నన్ను కొట్టకు నాన్నా, ఇంకెప్పుడూ యిలా చెయ్యను!" అంటూ ఏడ్పులు వినవచ్చాయి. వాడి తండ్రి కోటు విప్పి, పాంట్ల మంచి బెల్టు ఊడదీశాడు. వాళ్ల అమ్మని పక్కకి నెట్టి, "ఇలా రా!" అన్నాడు తాపీగా. కోస్త్య ఏడుపు లంకించుకున్నాడు. "అరవకు! సరిగ్గా ఏం జరిగిందో ఉన్నదున్నట్లు చెప్పు" అని వాళ్ల నాన్న ఆజ్ఞాపించాడు. కోస్త్య యిలా గొణగడం మొదలెట్టాడు: "మేమందరం కలిసి వెళ్లాం... మేము కూడబలుక్కుని... అటకమీదకి ఎక్కాం..."

వాడి తండ్రి మంచి బలంగా, ఆరోగ్యంగా వుంటాడు. కోస్త్య వంక తదేకంగా చూస్తూ, అతను కోస్త్య ఏదో దాటవేస్తున్నాడని అనుకున్నాడు. "వీడికి యీ దురలవాటు ఎక్కణ్ణుంచి వచ్చిందో" అనుకున్నాడు. ఆ క్షణంలో అతనికి తన కొడుకులో బోయెవ్ వంశానికే అప్రతిష్ఠాకరమైన నిజాయితీలోపం ప్రవేశించినట్లు తోచింది. అతనిలో వాడంటే

ద్వేషం రేకెత్తింది. ఒక్క దెబ్బతో యీ చెడుగునంతనీ వదలగొట్టాలని నిర్ణయించుకున్నాడు.

అప్పుడింక కన్నీళ్లకి గాని, అరుపులకి గాని తావు లేకపోయింది. ఊపిరి అందుకునేందుకు ఎగరొప్పు మాత్రమే వినవచ్చింది. కోస్త్య తమ్ముడు వాడి పక్కన పడుకున్నాడు. వాడు కోస్త్యని "బాగా నొప్పెడుతోందా?" అని అడిగాడు. ఉన్నట్టుండి కోస్త్య మళ్లీ అరవడం మొదలెట్టాడు. ఆ అరుపుల మధ్య "నేనీయన్ని చంపేస్తాను, చంపిపారేస్తాను, ఏదో ఒక రోజున..." అన్న మాటలు వాడి తమ్ముడి చెవిలో పడ్డాయి.

అలాంటి క్షణాల్లో కోస్త్యకి తన తండ్రిపట్ల ద్వేషం కలిగేది. తన తండ్రి భయంకరమైన రోమశమైన చేతులు అప్పటికి ఎన్ని సార్లో వాడి పీడకలల్లో కనపడ్డాయి, అలాగే అతని రోసిపోయిన మెరిసే బెల్టూను. కోస్త్య ఉలిక్కిపడి అరుస్తూ నిద్రలేచేవాడు.

క్రమశిక్షణకి హద్దులు లేకపోతే, అది క్రౌర్యంలోకి దిగుతుంది. తల్లితండ్రుల క్రౌర్యం తిరిగి తన వంతులో వాళ్ల పిల్లల్లో క్రౌర్యాన్నీ, శత్రు భావాన్నీ ఉత్పన్నంచేస్తుంది. తల్లి తండ్రులు తమ కచ్చితత్వాన్ని అదుపులో పెట్టుకోలేకపోతే, వాళ్లు పిల్లలపైన పెట్టు కున్న ఆశలు బల ప్రయోగానికీ, అవమానాలకీ దారితీస్తే, అప్పుడిక ముందువెనకల్లో ఎప్పుడో ఒకప్పుడు ఆ క్రౌర్యం వాళ్లకి వ్యతిరేకంగా తిరుగుతుంది.

యూర వీస్నిక్ తండ్రి పావెల్ ఫ్యొదొరొవిచ్ "యూరని చెడ్డ పిల్లల్నుంచి దూరంగా వుంచాలి. వోవ్కా చెడ్డ పిల్లాడు. తనకి తోచినట్లల్లా చేసే బాపతు మనిషి. వాడితో యూర స్నేహం చెయ్యకూడదు" అంటూ తన కోపాన్ని వెళ్లగక్కాడు.

మరీయా అలెక్సేయెవ్నా గమ్మున ఉండిపోయింది. మధ్యమధ్య మాత్రం "సర్లే ఊరుకో, యీ విషయం యింటికెళ్లాక మాట్లాడుకోవచ్చులే" అంటూ అడ్డువచ్చింది. పావెల్ ఫ్యొదొరొవిచ్ "వాడు మళ్లీ మన గడప తొక్కాడంటే నేను సహించను" అని నిర్ద్వంద్వంగా చెప్పి, కొడుకుకేసి తిరిగి, "ఒరేయ్, నువ్వింక వాడితో ఎలాంటి సంబంధం పెట్టు కోకు" అని ఆదేశించాడు. యూర అంగీకారపూర్వకంగా తల ఊపాడు. ఈ బెడదంతా తన తల్లి మూలంగా వచ్చింది. ఆవిడే యీ స్నేహాన్ని బలవంతాన తనమీద రుద్దింది అను కున్నాడు. ఇంటి దగ్గర దీనంతకీ మూలం వోవ్కాయేననీ, తనింక వాడితో జట్టు కలవననీ చెప్పాడు.

వాడు పక్కమీద పడుకుని అంతా తన మంచికే వచ్చిందనీ, తను దూరంగా వుంచ వలసిన ఆట జట్టువాళ్ల బెడద తనకింక తప్పిపోతుందనీ అనుకున్నాడు. తన తండ్రి లాగే తనూ మంచివాడిననీ, తెలివైనవాడిననీ ఊహించుకున్నాడు. ఒక్క మరీయా అలెక్సే యెవ్నాకి మాత్రమే యీ వ్యవహారం పరిణమించిన తీరు గాని, తన కొడుకు ముఖంమీద ప్రతిఫలించిన భావం గాని నచ్చలేదు. ఆవిడ వాడి ప్రవర్తన అంతనీ సవివరంగా జ్ఞాపకం చేసుకుంది. దానితో ఆవిడకి ఆదుర్దా కలిగింది. "ఏ స్నేహితుడి సాంగత్యాన్ని తను ఎంత

గానో యిష్టపడ్డాడో వాడికి యింత తేలిగ్గా డిల్లా పెట్టెయ్యడమా! తనదేమీ తప్పు లేద న్నట్లు, తన బాధ్యతనంతనీ వదులుకోవడమా? వీడింకా వెనకటి మాదిరిగానే పెడదారిలోనే వున్నాడు'' అనుకుంది ఆవిడ.

మరీయా అలెక్సేయెవ్నా తన ఆలోచనలను తన భర్తతో పంచుకుంది. కాని అతను వాటిని పట్టించుకోకుండా ''కుర్రాణ్ణి వాడి మానాన వాణ్ణి వదిలిపెట్టు'' అన్నాడు.

తమ పిల్లల పెంపకం విషయంలో తల్లికీ, తండ్రికీ భిన్నభిన్న దృక్పథాలు వుంటాయి.

పావెల్ ఫ్యోదొరొవిచ్‌కి తన కొడుకునుంచి తను ఏమి కోరుకుంటున్నాడో కచ్చితంగా తెలుసు. వాడు ఫస్ట్‌క్లాసు విద్యార్థిగా వుండాలి. గోల్డ్ మెడల్ సంపాదించుకోవాలి. యూని వర్సిటీ చదువు ముగించుకొని, పోస్ట్‌గ్రాడ్యుయేట్ చదువులకి వెళ్లాలి. వాస్తవానికి, తమ కొడుకులో ''మరింత శక్త్యుత్సాహాలను చొప్పించడం''లో వోవ్కా సహాయం పొందాలన్న తన భార్య పథకం అతనికి నచ్చింది. ''కుండీమొక్క'' బాపతు పెంపకం అతనికీ నచ్చదు. తన కొడుకు యితరుల సమక్షంలో సాయిలాపాయిలాగా వుండాలనీ, ఆత్మవిశ్వాసంతో మెలగాలనీ, ఆరోగ్యంగా ఉండాలనీ అతనూ అనుకున్నాడు.

మిలీషియా స్టేషన్లో తన కొడుకు ప్రవర్తించిన తీరు అతనికి నచ్చింది. యూర మంచి హుందాగా వ్యవహరించాడని అతను అనుకున్నాడు. వాడు మంచి పెంపకం పొందా డన్న విషయం వాణ్ణి చూసీచూడగానే అందరికీ అవగతమై వుంటుంది. వాడు మిలీషియా వాడి దగ్గర ఎంత మర్యాదగా, అయితే అదే సమయంలో కించపడుతున్నట్లు కాకుండా, సెలవు తీసుకున్నాడో వాడి తండ్రి గుర్తుచేసుకున్నాడు. వాడు అప్పుడే మనిషి. తన భార్య యేమేమిటో చెప్తోంది. అదంతా యేమిటో అతనికి అర్థంకాలేదు. లేక అతను అర్థంచేసు కోవాలని అనుకోలేదో!

పోతే బోయెవ్‌కి తన కొడుకు ప్రవర్తనలో కనిపించింది ఏమిటి? ''నా చిన్నతనంలో నా తల్లితండ్రులు నన్ను చితక్కొట్టారు. అందుకు వాళ్లకి నేనిప్పుడు కృతజ్ఞుడనై వుండటం లేదూ?'' అని తన మనస్సులో అతను తర్కించుకున్నాడు. తను ''గొడ్డులా చాకిరీ చేశాడు.'' దాన్నే తన ప్రధాన సల్లక్షణంగా అతను పరిగణించాడు. అంతే కాదు. తను పొదుపరి, తను ఒకరి దగ్గర్నుంచి ఏదీ తీసుకోడు, తను ఒకరికి ఏదీ యివ్వడు. నిజాయితీని అతను అర్థంచేసుకున్న తీరు యిదీ. తనలోని మరో ముఖ్య లక్షణం యేమిటంటే, తను మంచి సంసారి. తను తన కోర్కెలను పరిమితంచేసుకుని, తను తన యింటికే అన్నీ తీసు కెళ్తాడు. తన కొడుకు కూడా యిదే విధంగా ఉండాలని అతను కోరుకున్నాడు. కోస్త్య బాధ్యతారహితంగా, సోమరిగా వుండకూడదన్న కోర్కెతోనే వాణ్ణి అతను బాదాడు. అతను వాణ్ణి తక్కువ మార్కులు వచ్చినందుకు కొట్టాడు, సోమరిగా వున్నందుకు, మర్యాదగా ప్రవర్తించనందుకు కొట్టాడు. ఒక రోజున తన కొడుకుతో అతను యిలా అన్నాడు:

"నీ బుర్ర సరైన గాడిలో పనిచేస్తున్నట్లు లేదు. నువ్వు అతి తెలివి ప్రదర్శించాలని ప్రయత్నిస్తున్నావు. నువ్వు తెగ చదువుతున్నావు గాని, చదివినదాన్ని జీర్ణంచేసుకుని, దాన్ని ఉపయోగించుకోలేకపోతున్నావు. పుస్తకంలో వున్నట్లుండదు జీవితం. జీవితానికీ శుష్కమైన మాటలకీ సగమెరుక." కోస్త్య తన తండ్రి తత్వాన్ని దిగమింగలేకపోయాడు. వాడు మరింత ఆబగా చదవడం మొదలెట్టాడు. తను అన్ని విషయాలూ చర్చించగలిగిన మనిషికోసం తహతహలాడాడు. వాడు కవిత్వం రాయాలని ప్రయత్నించాడు. అయితే అందులో వాడు రాణించలేదు. ఆ తర్వాత వాడు వచనం రాయడంలో గుర్తింపు పొందాడు. వాడి వ్యాసానికి స్కూల్లో జరిగిన వ్యాసరచన పోటీలో బహుమతి కూడా వచ్చింది.

మొదట్లో వాళ్ల నాన్న యీ వ్యాసంగాలను హేళన చేశాడు. కాని దరిమిలా వాటిని ఆమోదించాడు.

వోవ్క ఆ రాత్రిని చాలా కాలం పాటు గుర్తుంచుకున్నాడు. వాడి తల్లి వాణ్ణి కనిపెట్టి చూడటానికి బదులు వాడే రాత్రులు మేల్కొని, వాళ్ల అమ్మ ఉచ్ఛ్వాసనిశ్వాసాలు గమనిస్తూండేవాడు.

...వోవ్క నీళ్లగ్లాసులో కలిపి యిచ్చిన గుండె మందు తాగినా, ఆవిడకి నయం కాలేదు. అంబ్యులెన్సును పిలవవలసివచ్చింది. వాళ్లు వచ్చి ఇంజెక్షను యిచ్చాక ఆవిడకి నిద్రపట్టింది.

ఆవిడ కళ్లు తెరిచేసరికి, వోవ్క ఆవిడ పక్కన కూర్చొని వున్నాడు. వాడు చటుక్కున ఆవిడ చేతిని తన చేతుల్లోకి తీసుకొని, "అమ్మా, నేను చస్తే మళ్లీ యిలా ఎప్పుడూ చెయ్యను. ఎందుకు, నువ్వే చూస్తావు కదా. నేను పర్సులోంచి కొన్ని డబ్బులు కూడా తీశాను. పోయిన వేసవిలో రెండు రూబుళ్లు కూడా తీశాను. నేనిలా మళ్లీ ఎప్పుడూ చెయ్యనమ్మా. నీ ఆరోగ్యం నయం చేసుకో అమ్మా" అన్నాడు. వాళ్ల అమ్మ ప్రేమగా వాడి జుట్టు నవరించింది... వోవ్క కళ్ల వెంట నీళ్లు తిరిగాయి.

వాడికి తనమీద తనకి ఎక్కడలేని జాలీ పుట్టుకొచ్చింది. తను అలాంటి చెడ్డ పిల్లవాడూ, కృతఘ్నుడూ అయినందుకు వాడికి బాధ కలిగింది.

అన్నా ఇవానొవ్నా తన కొడుకును పరిశీలిస్తూ వచ్చింది. తన కొడుకు అంతరంగ మథనాన్ని అర్థంచేసుకుంది. పైవాళ్లు ఏమన్నా అనుకోనీ గాక, వీడు మంచివాడే అనుకుంది. ఇలాంటి క్షణాల్లో తన కొడుకు అచ్ఛోడీ మనిషిలా పెరుగుతాడనీ, దయాళువుగా, నిజాయితీపరుడుగా, యితరుల సంవేదనలపట్ల ప్రతిస్పందించేవాడుగా తయారవుతాడనీ ఆవిడకి మహా అనిపించేది.

అయ్యా, మనం యింతవరకు వివిధ బోధనాత్మక వైఖరులను పరిశీలించాం. పిల్లవాడి అంతరంగాన్ని తరచిచూడకుండా, వాడి ఆంతరిక భావోద్వేగాలను దర్శించగలిగిన

సామర్థ్యం లేకుండా, వాడి జీవితానుభవ లేశాలను సైతం గమనించకుండా, పిల్లవాడిని ప్రభావితంచేసేందుకు జరిపే ఏ ప్రయత్నమైనా విఫలం కాక మానదు.

బహుశా బోయెవ్ తన కొడుకును కొన్ని విషయాల్లో అర్థంచేసుకున్నాడేమో. అయితే కొడుకు అంతరంగంలో చొరబడేందుకు తండ్రి చేసిన ప్రయత్నాలు కోస్త్యలో ఏహ్యభావాన్నీ, ద్వేషాన్నీ ఉత్పన్నంచేశాయి. ఇది కొడుకు మానసిక ప్రపంచంలో మొరటు జోక్యం. కోస్త్య తండ్రి వాడి అంతరంగాన్ని పట్టించుకోడు. అతనికి కావలసిందల్లా కొడుకు నేరాన్ని ధ్రువపరచడం, తర్వాత వాడి యిచ్ఛని భగ్నంచెయ్యడం. అంటే తన కొడుకుని తన అభిప్రాయాలకి అనుగుణంగా తీర్చిదిద్దడం.

పిల్లల మానసిక ప్రపంచంలో జోక్యం చేసుకోవడం వాంఛనీయం కానేకాదని దీని అర్థం కాదు. పిల్లవాడి వ్యక్తిత్వాన్ని గుర్తించడం, వాడి అభివృద్ధిని ప్రభావితం చేయడం, అయితే అదే సమయంలో ప్రాథమికమైన ప్రవర్తన నీతి నియమ నిబంధనలను అతిక్రమించకపోవడం ముఖ్యం.

ఇంకో విషయం గుర్తించడం కూడా ముఖ్యం. అత్యంత భావోద్విగ్న తరుణాల్లో — వీటినే "ప్రజ్వలనలు" అని కూడా అంటూ వుంటారు — మన ఇంద్రియావబోధ ప్రత్యేకించి తీక్ష్ణమవుతుంది. మనం అంతకు ముందు కేవలం ఊహించుకోగలవాటిని అప్పుడు అకస్మాత్తుగా స్పష్టంగా చూడగలుగుతాం.

తుపాను సదృశమైన ప్రతిచర్య ఎదురైనప్పుడు మీ స్వీయ మానసిక స్థితిని విశ్లేషించుకునేందుకు ప్రయత్నించండి. ఒక వైపున, మీరు ఒకే ఒక్క క్షణంలో అంతకు ముందు మరుగునపడి వున్న విషయాలను దర్శిస్తారు. దానిమీద మీ అంతర్ దృష్టి ఎంత తీవ్రంగా, ఎంత విజయవంతంగా కేంద్రీకృతమవుతుందంటే, యితర ప్రతి అంశమూ పూర్వరంగంలోకి పోతుంది. అయితే అలాంటి ప్రగాఢ అంతర్ దృష్టితో బాటు, పూర్తి అంధత్వం కూడా ఆవహిస్తుంది. అలాంటి సందర్భాల్లో యీ అంధత్వాన్ని అధిగమించలేకపోతే, ఆకస్మికంగా దర్శించిన సత్యం కంటె ఏమాత్రం తక్కువ ముఖ్యం కాని పూర్తి పూర్వరంగాన్ని దర్శించడంలో వైఫల్యం మూలంగా అలాంటి వ్యక్తి యీ కొత్త సమాచారాన్ని వినియోగించుకోలేకపోవడమే కాకుండా, దాన్ని నిలుపుకోలేడు, దాని అర్థాన్ని గ్రహించలేడు.

ఆకస్మిక భావోద్వేగ ప్రజ్వలనల పద్ధతిమీద ఆధారపడి, దాన్ని పిల్లలమీద ప్రయోగించినప్పుడు, అవి తనకు నికరమైన వేదనను కలిగించాయని ఎ. మకారెంకొ పేర్కొన్నాడు. తనవి ఉక్కు నరాలని కూడా ఆయన జోడించాడు. అసలు మానసిక క్షోభను విద్యాబోధనాంశంగా వినియోగించుకొనే విషయంలో తన అసందిగ్ధ వ్యతిరేకత మూలంగా, సద్యోజనితంగా అభివృద్ధిచెందే సంవేదనల స్థానంలో అదుపులో వుండి, చైతన్యపూరితంగా మార్గనిర్దేశంచేసే భావోద్వేగాల స్రవంతిని ప్రవేశపెట్టాలని మకారెంకొ ప్రయత్నించాడు. దర్శిం

చినవాటిని విశ్లేషించడం, అలా లభించిన సమాచారం ఆధారపడదగినదీ, అర్థంచేసుకో బడేదీ అయినప్పుడూ, ఉద్దేశింపబడిన చర్యలు అవసరమైన ప్రతిస్పందనను ఉత్పన్నంచేసేట ప్పుడూ మాత్రమే చర్యకు పూనుకోవడం ముఖ్యం.

ఇది చాలా సులభంగా కనిపించవచ్చు. అంటే యిందుకు పిల్లవాడి ఆంతరిక మనో స్థితిని బాహ్య వ్యక్తీకరణలతో, మనస్సు లోతుల్లో వున్నదాన్ని పైపైన వున్నదానితో, పైకి వాడు ప్రవర్తించే తీరుతో, మాట్లాడే, నవ్వే తీరుతో జోడించి చూడటం అవసరం. ఆచర ణలో ప్రతీదీ చాలా సంశ్లిష్టమైనది. పిల్లవాడి బాహ్య ప్రవర్తన మనకి బాగా తెలుసు గనుక మనకి పిల్లవాడు బాగా తెలుసునని మనం అనుకొంటూ వుంటాం. అయితే పిల్ల వాడిని గురించిన మన జ్ఞానం పొరపాటైనదనీ, మనం అనుకున్నదానికి పిల్లవాడు పూర్తి భిన్నంగా వున్నాడనీ మధ్యమధ్య ఆకస్మికంగా మనం తెలుసుకొంటూ వుంటాం.

పెద్దవాళ్ల ప్రతిస్పందనలకు సర్దుకునే, వాళ్ల ఆకాంక్షలను, వాళ్ళు కావాలని అను కునేవాటిని చటుక్కున అవగతంచేసుకునే మెళకువ పిల్లలకి దండిగా వుంటుంది. అలా సర్దుకునే సందర్భంగా పెద్దవాళ్లు తమని ఎలా చూడాలని కోరుకుంటారో పిల్లలు అలా కనిపిస్తారు. ఇక్కడ విరోధాభాసప్రాయమైనది యేమిటంటే, యిలా సర్దుకునే లక్షణం ద్వారానే వాళ్లు తమ నిజాంతరంగాలను పదిలపరచగలుగుతారు.

తన తండ్రి సమక్షంలో వున్నప్పుడు కోస్త్య బోయెవ్ సావధానానికి ప్రతిరూపంగా కనిపిస్తాడు. తన తండ్రి కనుసన్నల్లో మెలిగి, అతను ప్రతి పనినీ నిర్వర్తించేందుకు సర్వ సంసిద్ధంగా వుంటాడు. అయితే వాడు నిజంగానే అలా వున్నాడా? తనలోని మానవుడిపట్ల తన తండ్రి ప్రదర్శించిన గౌరవ లోపాన్ని వాడెన్నడైనా మన్నించగలడా? చిన్నతనంలో అభి వృద్ధిచెందిన ద్వేషపు గుర్తులు మనిషి చచ్చిపోయేదాకా చెరిగిపోవు. అలాంటి భావాలను ఉత్పన్నంచేసినవాడు ఎంత ఎక్కువ సన్నిహితుడైతే, ఆ గుర్తులు అంత గాఢంగా పడతాయి. దెబ్బ తిన్న అహం నైతిక వికృతికి కారణభూతమవుతుంది, అధిగమించడం మహా కష్ట సాధ్యమైన భయంకరమైన న్యూనతాభావాన్ని రేకెత్తిస్తుంది.

పిల్లవాడు ఉపయోగకరమైన అలవాట్లు, సానుకూల లక్షణాలతో బాటు, అదే సమయంలో క్రమంగా ప్రతికూల నైతిక అనుభవాలను సైతం కొన్ని సందర్భాల్లో సంతరించుకుంటాడు. "నమ్మకం కలిగేలా" అబద్ధాలు చెప్పడం, "నిజాయితీగా" తన భావాలను మరుగుపరచడం, "జాలిగా" గుంజడం వాడు నేర్చుకుంటాడు. మన బోధన శాస్త్రీయ అంధత్వం మూలంగా వాస్తవాల రెండో పొరను చూడటంలో మనం విఫలమై, "యిదెలా సంభవించగలిగిందబ్బా?" అంటూ ఆశ్చర్యపోతాం.

బోయెవ్ క్రౌర్యం మూలంగా అతని కొడుకు వంచకుడుగా తయారయాడు. ఈ లక్షణం ఆ కుర్రాడి ప్రవర్తనలో సహజమైన అంశంగా పరిణమించింది. వాడు తన తండ్రి

ముందూ, నేస్తాల ముందూ కూడా ఇచ్చకాలాడడం మొదలెట్టాడు. వాడు దయగా, జాలిగా నవ్వడం కూడా అలవరచుకున్నాడు. అయితే ఆచరణలో ఆ నవ్వు వాడి కోపాన్నీ, ద్వేషాన్నీ మరుగుపరచేందుకు ఉపయోగపడింది.

ఆ పీడాకరమైన రాత్రి మరుసటి ఉదయం కోస్త్యా తండ్రి వాణ్ణి నిద్ర లేపాడు. కోస్త్యా చటుక్కున లేచి నిలబడి, తన తండ్రి కళ్లలోకి చూశాడు. తన పిల్లలు నేరుగా తన కళ్లలోకి చూడకపోవడాన్ని కోస్త్యా తండ్రి సహించలేకపోయేవాడు. అలాంటప్పుడెప్పుడూ అతను "అంటే, నీ అంతరంగం నిర్మలినంగా లేదన్నమాట" అంటూండేవాడు. కోస్త్యా యిప్పుడు తన తండ్రి ఆమోదం పొందే ముఖకవళిక పెట్టాడు. వాడి ముఖంలో నమ్రత, గౌరవం, చిత్తశుద్ధి, పెద్దల ఆదేశాలు పాటించేందుకు సంసిద్ధత ద్యోతకమయ్యాయి.



కుర్రాడి కళ్లలో యీ లక్షణాలన్నీ కనిపించేసరికి తండ్రికి సంతోషం, సంతృప్తి కలిగాయి. కాని, కొడుకు తన సొంత పద్ధతిలో ఆత్మసంరక్షణ చేసుకొంటూ, వాస్తవంలో మరో వైపున తనని బురిడీ కొట్టిస్తున్నాడని పాపం అతనికేం తెలుసు? కోస్త్యా తన తండ్రిని చూసే తీరును సరిగా అర్థంచేసుకునేందుకు బహుశా యీ "బురిడీ కొట్టించడం" అనే పదం పూర్తిగా సరిపోదేమో. వాడికి తన తండ్రి అంటే భయం కనుక, వాడు "నిజాయితీగా" తన తండ్రి మెప్పు పొందాలని అనుకున్నాడు. పిల్లవాడిలో భయం అన్నది ఎప్పుడు ప్రాబల్యం వహిస్తుందో, అప్పుడు వాడి మనోంతరాళంలో అనివార్యంగా ప్రతికూల అనుభవాలు పెంపొందుతాయి.

జరూబిన్ కుటుంబంలో సంబంధాలు మరోలా పరిణమించాయి. వోవ్కా త్వరలోనే

తన తల్లి బలహీనతను పసిగట్టాడు. ఏదో ఒక ఘట్టంలో తన తల్లి తనని శిక్షించలేదని గ్రహించి, ఆవిడ యీ నిస్సహాయతని వినియోగించుకోనారంభించాడు. వాడి తల్లి వాడిని మాటల ద్వారా, కూకలెయ్యడం ద్వారా, కన్నీళ్ల ద్వారా ప్రభావితంచెయ్యాలని ప్రయత్నించింది. వాడి అంతరంగాన్ని, వాడి సత్యసంధతని, నిజాయితీని జాగృతంచెయ్యాలని ఆవిడ కోరుకుంది. వాడి స్వేచ్ఛా ప్రవృత్తి ఆవిడకి ప్రోద్బలకం అయింది. తన కొడుకు ప్రవర్తనలో వ్యక్తం కానారంభించిన పురుషత్వాన్ని గమనించి ఆవిడ సంతోషం చెందింది. అయితే కొడుకు త్వరలోనే తన చేయిదాటిపోవచ్చుననీ, చెడు ప్రభావాలకు లోనుకావచ్చుననీ కూడా ఆవిడ గ్రహించింది. తన పెంపకంలో ఏదో లోపం వుందని ఆవిడకి అనిపించింది. అయితే కచ్చితంగా ఆ లోపం ఏమిటో మాత్రం ఆవిడకి అవగతం కాలేదు.




తన కొడుకు స్వతంత్ర ప్రతిపత్తిని ఎలా సాధించుకున్నదీ ఆవిడ జ్ఞాపకం చేసుకుంది. మొదట్లో వాడు చిన్నగా వున్నప్పుడు వాడు అడిగిందేదైనా యివ్వకపోతే, వాడు యిల్లెగిరిపోయేలా ఏడ్చేవాడు, కిందపడి దొర్లేవాడు. కాళ్లతో నేలని దబదబా బాదేవాడు. తల్లి లొంగివచ్చేదాకా వాడు అలా అరుస్తూనే వుండేవాడు. "వీడికి ఏదో జరిగింది" అని తల్లి అన్నప్పుడు, యిదీ మంచి వీలుగానే వుంది అనుకునేవాడు.

అయితే వోవ్క పెరిగేకొద్దీ, అలాంటి అమితావేశపూరితమైన సన్నివేశాలు క్రమంగా తగ్గుతూవచ్చాయి. దానికి కారణం ఏమిటి? వోవ్క గర్విష్ఠి. వాడికి ఆదేశాలు యివ్వడమే గాని, యితరుల ఆదేశాలకు తలొగ్గే అలవాటు తప్పింది. వీధిలో తన స్నేహితుల మధ్య కన్నీళ్లు, పేచీలతో తన ప్రతిష్ఠ పెరగదని వాడు త్వరలోనే గ్రహించాడు. ఒక రోజున

వాడు యిలాంటి ఎత్తులకి పూనుకొనేసరికి కుర్రాళ్లందరూ ఎగతాళి చేశారు: ఏదో విధంగా తమ ధైర్యాన్ని నిరూపించుకొన సిద్ధపడే నిర్భీకులు మాత్రమే నాయకులు అవుతారని వాడు అర్థంచేసుకున్నాడు. వాడొక మాదిరి స్వతంత్ర ధోరణినీ, శిశు సహజమైన మంకు పట్టునీ అలవరచుకున్నాడు. అది వాడిని "నేను నా యిష్టం వచ్చినదల్లా చేస్తాను" అనుకునేందుకు దారితీసింది. తర్వాత వాడు యీ ధోరణిని తన తల్లితో తన సంబంధాలకు బదిలీచేశాడు. ఆవిడ వాడిని ఫుట్‌బాల్ ఆడేందుకు బయటకి వెళ్లేందుకు అనుమతించనప్పుడు, వాడు కిటికీలోంచి దూరి పారిపోయాడు. ఇది ఆవిడని మరింత బాధపెట్టడమే తప్ప మరేమీ కాదన్న విషయాన్ని వోవ్కా చాలా బాగా అర్థంచేసుకున్నాడు.

వాడు త్వరలోనే మరో విషయం కూడా గ్రహించాడు: సిసలైన నాయకుడు ఉదారంగా వుంటాడు. కింద పడిపోయినవాళ్లని వాడు కొట్టడు. బలహీనుల్ని కాపాడే వాడి గుణం వాడి స్నేహితులకి నచ్చింది. వాళ్లు వోవ్కా దగ్గరకి రక్షణ కోరేందుకు వస్తూండేవాళ్లు. వాడికి చాక్లెట్లు యిస్తూండేవాళ్లు, సినిమాలకి ఆహ్వానిస్తూండేవాళ్లు, వాడికి ఆట వస్తువులు యిస్తూండేవాళ్లు. వాడు వాళ్లకి రక్షణ యిస్తూండేవాడు. అయితే యిది కేవలం దుర్బలులకి రక్షణ యివ్వాలన్న తాపత్రయం మాత్రమే కాదు. ఇందులో వాడి సొంత బలాన్ని వక్కాణించి తన పలుకుబడి పరిధిని విస్తృతంచేసుకునే తాపత్రయం కూడా వుంది. తర్వాత వాడు యితరుల సాయంతో "రక్షణ" కల్పించడం నేర్చుకున్నాడు. "సర్లే, యీ సారి వాణ్ణి చూసుకోనియ్యి" అనుకొని, పక్కన సాక్షిమాత్రుడుగా నిలబడేవాడు. "శత్రువు" పట్ల ప్రవర్తన అన్యాయంగా వున్నప్పుడు, వాడు కూడా జోక్యం కల్పించుకొని అవతలివాడికి రక్షణ కల్పించేవాడు. తన ప్రత్యర్థి లొంగిపోగానే తనకు చేసిన అవమానాలను వాడు తేలిగ్గా విస్మరించేవాడు.

స్వతహాగా వోవ్కా దయాపరుడని వాళ్ల అమ్మ నమ్మకం. మనం యీ మాట కాదనం. కాని వాడి యీ దయా గుణం వెనక ఎంత గుంట లెక్క, కుహనా ఔదార్యం, తూష్ణీంభావం దాగివున్నాయో? వాడి యీ గుణాలు దరిమిలా సరిగ్గా ఎలా అభివృద్ధిచెందుతాయన్నది చాలవరకు వాళ్ల అమ్మమీద ఆధారపడివుంటుంది. తన కొడుకుతో "నువ్విప్పుడు పెద్దవాడివయ్యావు. నీకు యితరులకి బాధ కలిగించడంలో సంతోషం కలుగుతున్నట్లు కనిపిస్తోంది. ఇది వెంటనే కట్టిపెట్టు, లేకపోతే నిన్ను బోర్డింగ్ స్కూలుకి పంపేస్తాను" అని నిశ్చితంగా చెప్పేపాటి ధైర్యం అన్నా ఇవానొవ్నాకి లేదు. నిక్కచ్చి అయిన స్వరం అవసరం. అయితే అది కుర్రాణ్ణి భయపెట్టేందుకు కాక, యీ ప్రపంచంలో వున్నది తనొక్కడే కాదనీ, యితరులకి కూడా సంతోషానందాలు పొందేందుకు తన కంటె ఎక్కువ కాకపోయినా, తనతో సమానంగా హక్కు వుందనీ, తను వాళ్ల యీ హక్కుల్ని మన్నించాలనీ వాడు అవగతంచేసుకునేందుకు అవసరం. వాస్తవానికి అన్నా ఇవానొవ్నా అలాంటి మాటలను చాల సార్లే ఉపయోగించింది. కాని ఆవిడ చెప్పిన తీరు యిది మరో ఉపన్యాసమేలే అని ఆవిడ

కొడుకు అనుకునేలా వుంది. బోర్డింగ్ స్కూలూ లేదు, గీర్డింగ్ స్కూలూ లేదు. "బోర్డింగ్ స్కూలుట. నేను లేకపోతే అమ్మ ఒక్క రోజైనా బతకగలదా?" అని వాడు అక్షరాలా అనుకోకపోయినా, అలా అనిపించింది.

అన్నా ఇవానొవ్నాలా కాకుండా, కోస్త్య తండ్రి ఎప్పుడూ కఠినంగా వ్యవహరించేవాడు. ఆయన మాట శాసనమే. ఆయన ఎన్నడూ దిగిరాడు. ఆయన ముక్తసరిగా మాట్లాడే వాడు, తను చేస్తానన్నది అక్షరాలా చేసేవాడు. అన్నా ఇవానొవ్నా యిందుకు భిన్నంగా డొంక తిరుగుడుగా ఎన్నో మాట్లాడేది.

తన తల్లికి తనమీద అదుపు తప్పిపోతున్న సంగతి రోజు రోజుకీ వోవ్కకి మరింత స్పష్టమవుతూ వచ్చింది. వాడి తల్లి కూడా తను వాడు నిర్వర్తించాలని కోరుకునేవి ఏమిటో తెల్చుకోలేకపోతున్నాననీ, తన కొడుకు వాటికి అంటిపెట్టుకొని వుండేలా తానింక ఎంత మాత్రం చేయలేకపోతున్నాననీ గ్రహించింది.

నా బోధనా వృత్తి క్రమంలో పిల్లలమీద యిలా అదుపు తప్పిపోయినట్లు అనుకునే తల్లితండ్రుల్ని చాలామందిని నేను చూశాను. ఇలాంటి సమస్యలతో సతమతమయ్యే కుటుం బాలకు చెందిన పెంకె పిల్లలతో నేను తరచు వ్యవహరించవలసివస్తూండేది. నాకు పూర్తి నమ్మకం వున్న ఒక విషయాన్ని నేనిక్కడ మీకు చెప్పవలసి వుంది. అలాంటి కుటుంబాలకు చెందిన పిల్లల్లో అత్యధిక సంఖ్యాకులకి ఇచ్ఛాశక్తి, చొరవ, స్వతంత్ర ప్రవృత్తి, సాహసం వంటి ఎన్నో మంచి లక్షణాలు వుంటాయి. అయితే, తరచు యీ సానుకూల లక్షణాలు చెడ్డగా పరిణమించాయి. సాహసం, దృఢ సంకల్పం, చొరవ, స్వతంత్ర ప్రవృత్తి తరచు కౌమారవయస్కుల్ని నేరుగా మిలీషియా స్టేషన్లకీ, నేరస్థుల బోర్‌స్టల్ శిబిరాలకీ, కోర్టులకీ నడిపించాయి. క్రియాశీల అంతర్లక్షణాలు అవినీతికర ప్రవర్తన రూపాల్లో వెల్లడవుతూ వున్నాయి.

సరిగ్గా యీ సంపూర్ణ స్వేచ్ఛ ప్రవృత్తి, సంపూర్ణ బాధ్యతారాహిత్యాలే పిల్లలు అవినీతికరమైన పనులకు పూనుకొనేందుకు దారితీసి, వాళ్లలో క్రౌర్యాన్ని పెంపొందిస్తాయి.

కోస్త్య బోయెవ్ తండ్రిలో వ్యక్తమైనది మరో అతిశాయిత. ఇదీ పైన పేర్కొన బడిన దానంతటి ప్రమాదకరమైనదే. ఇది స్వేచ్ఛను నులిమివేయడం, పిల్లవాడి ఆత్మ గౌరవాన్ని పరిగణనలోకి తీసుకోకపోవడం, అత్యంత కఠోరమైన శిక్షాపద్ధతులు సత్ఫలితాస్తాయని విశ్వసించడం. అప్పుడు పిల్లవాడు బలప్రయోగాన్ని ఎదిరిస్తాడు. వాడి లోలోపల ఒకవిధ మైన శత్రు భావం పెంపొందుతుంది. ముందువెనకల్లో ఆ శత్రు భావం తనంతట తనే బయటపడుతుంది. పిల్లవాడు పెరిగి, నిరంకుశ ధోరణులను యికనెంతమాత్రమూ ఓర్చు కోలేనప్పుడు, పగతీర్చుకోవాలన్న వాడి గాఢ కాంక్ష మరొకరిమీదకి (తనకి అత్యంత సన్ని హితులైనవాళ్లమీదకి, వాడు మిక్కిలి ప్రేమించేవాళ్లమీదకి సైతం) మళ్లి, అదొక స్థిర భావంగా జీవిత పరమార్థంగా పరిణమిస్తుంది.

అందుకనే తల్లితండ్రులు తమ పిల్లల అంతరంగాల్లో సంభవించే ప్రగాఢమైన క్రమాలను గమనించడం నేర్చుకోవడం అవసరం. తమ పిల్లల్లో నీతివిరుద్ధ భావ బీజాలు నాటకుండా వుండేందుకుగాను వాళ్లీ పని చెయ్యాలి.

పిల్లలు వేగంగా పెరుగుతూ వుంటారు. కాని వాళ్లని గురించిన మన అంతర్ దృష్టి వెనకపడుతూ వుంటుంది. ఈ రోజున మనం వాణ్ణి ఒక విధంగా ఊహించుకొంటూ వుంటాం. కాని వాడు "అంతకు ముందే" మారిపోయి వుంటాడు. కాగా పిల్లల్ని గురించిన మన వెనకటి భావనలను మార్చుకోకపోతే ఘర్షణలు, పొరపొచ్చాలు తప్పనిసరిగా పొడ చూపుతాయి.

"నేను పెద్దవాణ్ణయ్యాను, నన్ను చిన్న పిల్లాడిలా చూస్తే ఎలా" అని పిల్లలు అనడం మనం తరచు వింటూ వుంటాం. పెద్దవాళ్లు తమని గోముగా చూడటం, తమ కొంగుకి కట్టుకుని తిప్పడం వంటి వాటిపట్ల పిల్లలు ఎంత సిగ్గుపడుతూ వుంటారో మనలో ఎవరికి తెలియదు? తల్లితండ్రులు పిల్లల్ని గురించి "వాడికేం తెలుసు, వాడు కుర్రకుంక!" అని తరచు అంటూ వుంటారు. అయితే పిల్లలు దీన్ని ఆసరాగా తీసుకుని, తాము శిక్షింపబడము కదా అన్న ధీమాతో దుష్ప్రవర్తనకి పూనుకొంటూ వుంటారు.

అంతర్ దృష్టిని పెంపొందించుకోవడమంటే కేవలం పిల్లల్లో వచ్చిన మార్పులను గుర్తించే సామర్థ్యం మాత్రమే కాదు. అది వాళ్లలో వచ్చిన గణనీయమైన మార్పుల గుర్తింపు ప్రాతిపదికమీద పిల్లలపట్ల మన వైఖరులను తిరిగి సరిదిద్దుకోవడం కూడా.

బాహ్య దృష్టి ప్రమాణపు అభివృద్ధి పిల్లలను తీర్చిదిద్దడంలోని, వాళ్ల మొత్తం పరిసరాల్లోని అత్యంత ప్రముఖమైన అంశాలను నమోదుచేసేందుకు ప్రయత్నిస్తుంది.

పావెల్ ఫ్యోదొరొవిచ్ వీస్నిక్ తన అభిప్రాయాలను యీకింది విశ్వాసాల ప్రాతిపదిక మీద ఏర్పరచుకుంటాడు: విద్య అన్నది ప్రధానం. అది వుంటే నైతిక ప్రవృత్తి దానంతట అదే అలవడుతుంది. ప్రధానంగా అతని దృష్టిలో ప్రతీదీ పరమ సులభం: యీరు తెలివైనవాడు, విస్తారంగా చదివినవాడు. మిగిలినవన్నీ వాటికవే వస్తాయి. అందుకే అతను మరీయా అలెక్సేయెవ్నా కొడుకు విషయంలో గుర్తించిన అంశాలను గురించి ఆలోచించనే ఆలోచించడు.

తన కొడుకు తన సన్నిహిత మిత్రుణ్ణి అంత తేలిగ్గా విసర్జించడం, ఆ మొత్తం గొడవలో తన నేరం యేమీ లేదన్న, తను స్నేహం చేసివుండకూడని పోకిరి కుర్రాళ్లచేత తను తప్పుదారి పట్టించబడ్డానన్న దృక్పథాన్ని స్వీకరించడం మరీయా అలెక్సేయెవ్నాని కలవరపరచింది. "ఇదంతా ఏమీ బాగా లేదు, ఇది యిలాగే కొనసాగితే పర్యవసానం దరిద్రంగా తయారవుతుంది. యీరు ఆర్ద్ర భావాలు లేకుండా, పిరికివాడుగా తయారవుతాడు. బాధ్య

స్థితా భావలోపం వాణ్ణి క్రౌర్యానికి నడుపుతుంది'' అనుకుంది మరీయా అలెక్సేయెవ్నా.

దరిమిలా జరిగిన ఘటనలు ఆవిడకి మరింత ఆదుర్దాని కలిగించాయి. రెండు రోజుల తర్వాత యూర యింటికి తిరిగివచ్చినప్పుడు వాడి దుస్తులు చిరిగి వున్నాయి, వాడి ఒళ్లంతా బురద కొట్టుకుని వుంది. వాడి పుస్తకాల సంచి చిరిగి వుంది. వాడు ఏడుస్తున్నాడు. ''వాళ్లు... నన్ను కొట్టారు'' అంటూ వెక్కుతూ యూర తన తల్లికి చెప్పాడు. ''వోవ్క, కోస్త్య, మిరోనొవ్... ఎందుకో తెలుసా, నాన్న సలహా ప్రకారం నేను జరిగిందంతా ఉన్న దున్నట్లు చెప్పాను...'' ''నువ్వీ విషయం ఎవరికి చెప్పావురా?'' అని ప్రశ్నించింది వాడి తల్లి. ''ముందేమో స్కూలు డైరెక్టరుకి చెప్పాను, తర్వాత టీచర్ల గదిలో చెప్పాను. ఆ తర్వాతేమో మా యువ పయనీర్ల సమితిలో చెప్పాను...''

వెనకైతే మరీయా అలెక్సేయెవ్నా మంచి కారణం లేనిదే పిల్లలు యితరుల్ని కొట్ట రనీ, పిల్లలకి వాళ్ల సొంత తర్కం వుంటుందనీ, దాని ప్రకారం వాళ్లు పిరికితనాన్నీ, యిత రులమీద కొండాలు చెప్పడాన్నీ సహించరనీ చెప్పి వుండేది. ఈ నియమాల అనుసరణ కొన్ని సమయాల్లో పిల్లల్ని క్రూరమైన పనులకు నడిపించిన విషయం కూడా ఆవిడకి తెలుసు. అది దారుణమైనదనడంలో సందేహం లేదు. కాని యిప్పుడు దెబ్బలు తిన్నది తన కొడుకు. ఆవిడ కలత చెందింది. బహుశా ఆ కారణంగా తను ఒకప్పుడు చెప్పిన మాటలు మరచి పోయింది. అన్ని వివరాలనూ అడిగి తెలుసుకున్నాక, ఆవిడ స్కూలుకి వెళ్లింది.

అక్కడ ఆవిణ్ణి శాంతపరచేందుకు ప్రయత్నాలు జరిగాయి. ఏమీ కంగారు పడవద్దని చెప్పి, బాధ్యులైన వాళ్లని శిక్షిస్తామని అందరూ ఆవిడకి హామీ యిచ్చారు. ఆవిడ కొడుకు రత్నం లాంటివాడనీ, మిగిలినవాళ్లదే యిందులో దోషమనీ వాళ్లు జోడించారు. యూరని ఆ పనిలో దింపినది ఆ పిల్లలేననీ, వాళ్లతో తన కొడుకుని ఆడనివ్వవద్దనీ ఆవిడకి సలహా యిచ్చారు. అయితే టీచర్ల మాటలు విన్నకొద్దీ ఆవిడ ఆదుర్దా పెరిగింది. ఎవరిమీదనైతే చర్యలు తీసుకోబడతాయో, ఆ ''యితర పిల్లలు'' కొన్ని విషయాల్లో తన కొడుకు కంటె మెరుగైనవాళ్లవడం ఆవిడ ఆదుర్దాని మరింత పెంచింది.

ఆ తల్లి ఆదుర్దా సహేతుకమైనదే అనేందుకు రోజురోజుకీ కొత్తకొత్త అనాహ్లాదకర పరిణామాలు సంభవించి, కొత్త రుజువులను చేకూర్చాయి. ఆవిడ కొడుకు నోట్‌బుక్‌మీద పెద్దపెద్ద అక్షరాల్లో ''ద్రోహి'' అన్న మాట ప్రత్యక్షమైంది. వాడు కూర్చునే బల్లమీద కూర్చునేందుకు ఎవరూ ఒప్పుకోలేదు. అంతకంటె మరీ ఆదుర్దా కలిగించే విషయం ఏమిటంటే, యూర అన్నింట్లోనూ తనే రైటనుకోవడం, వోవ్క, కోస్త్యలు శిక్షింపబడ తారని చంకలు కొట్టుకోవడం.

ఏమి చెయ్యాలా అని ఆవిడ చాలా రోజుల బాటు సతమతమైంది. వాడెలా వుండాలని తనెప్పుడూ ఆశిస్తూ వచ్చిందో, చివరకు వాడెలా తయారయ్యాడో ఆవిడ సరిపోల్చుకుంది.

తనిప్పుడు ఏం చెయ్యాలి? వాళ్లలో ఎవరు రైటు? ఎంత అప్రియమైనదైనా సరే, నిజం చెప్పమనే తన కొడుక్కి తను నొక్కిచెప్పేది. ఆ దృష్ట్యా చూస్తే, అన్నీ సజావుగానే వున్నాయి. తన కొడుకు ఒక్కడే శిక్షా భయం లేకుండా నిజం చెప్పాడు. మరీయా అలెక్సే యెవ్నా తన కొడుక్కి కుహనా ధైర్యం చూపి, యితరులచేత అబ్బా అనిపించుకోవడం మంచిది కాదని తరచు చెప్తూ వుండేది. ఇంతకీ, తన చర్యను తన స్నేహితులు ఎలా అం చనా కడతారో వాడికి బహుశా తెలిసే వుండాలి. వాడు తన స్నేహితుల ఖండనపట్ల భయ పడలేదు. తను అన్నీ చెప్పబోతున్నాడన్న సంగతిని తన స్నేహితులనుంచి మరుగుపరచేందుకు ప్రయత్నించలేదు. బహుశా యిది తను వాడికి బోధించిన సూత్రాలకు కట్టుబడి వుండట మేనేమో? అయినా కూడా, డైరెక్టరు కార్యాలయంలో వోవ్కా బెదిరింపులను గురించి తను చెప్పిన విషయాలను టీచర్లకి యూర చెప్పివుండకూడదు. ఇది జరిగివుండకపోతే ఆవిడ తన కొడుకు ప్రవర్తన సమంజసమైనదే అని సరిపెట్టుకోగలిగివుండేది.

తన కొడుకుతో మాట్లాడాలని ఆవిడ నిర్ణయించుకుంది. అయితే, సంభాషణ ఎలా ప్రారంభించాలో ఆవిడకి తోచలేదు... అనుకోకుండా అందుకొక సందర్భం తటస్థపడింది.

ఒక రోజు సాయంత్రం పూట ఎప్పటిలాగే ఆవిడ పుస్తకం పైకి చదువుతోంది. అంతలో పుస్తకం పక్కనపెట్టి, "ఇప్పుడేం చెయ్యాలనుకుంటున్నానో నీకు తెలుసా యూరా? నేను వోవ్కా వాళ్లింటికి వెళ్లి, నీ తరపున నేను వాడికి క్షమాపణ చెప్పివస్తాను."

యూరకి తన తల్లి ఆకస్మిక నిర్ణయాలు ఎప్పుడూ ఆశ్చర్యం కొలుపుతూ వుంటాయి. "నేనేం తప్పు చేశానని?" అంటూ వాడు మనస్సు కష్టపెట్టుకున్నవాడిలా అడిగాడు. "అయితే నీకు అర్థం కాలేదన్నమాట? నువ్వు క్లాసు ఫస్టు విద్యార్థివి, యువ పయనీర్ సమితి సభ్యుడివి. అంచేత, నీ పొరపాట్లకి యితరులమీద ఆరోపణ చెయ్యడం కాక నువ్వే పెద్దవాడిలా వ్యవహరించడం నీ విధి. నిన్ను కొట్టడంలో కూడా ఒక విధంగా ఆ కుర్రాళ్ల రైటే... డైరెక్టరు కార్యాలయంలోనూ, టీచర్ల గదిలోనూ, పయనీర్ సమితి సమావేశం లోనూ నువ్వు 'అన్నింటికీ నాదే తప్పు' అని చెప్పి వుండవలసింది. అలా చేసి వుంటే, నీకూ, ఆ కుర్రాళ్లకీ కూడా ఎంతో బాగుండ వుండేది."

తన కొడుకు బుగ్గలు సిగ్గుతో నెమ్మదిగా ఎరుపెక్కడం ఆవిడ చూసి, వాడి మానాన వాణ్ణి వదిలేసింది. వాడి తండ్రి ఇంటి దగ్గర లేడు. ఆవిడ వంటగదిలో కూర్చొని, పక్క గదిలోంచి వచ్చే చిన్న శబ్దాన్ని కూడా ధ్యానంగా వినసాగింది. ఆవిడకి తన కొడుకుపట్ల జాలి కలిగింది... కొద్ది క్షణాల తర్వాత యూర తన తల్లి దగ్గరకి వచ్చాడు. వాడు ఆవిడ వెచ్చటి భుజంమీద తన తలని ఆన్చాడు. వెక్కులు కష్టంమీద ఆపుకొంటూ "నేనంద రికీ — డైరెక్టరుగారికీ, టీచర్లకీ, అబ్బాయిలకీ — రేపే చెప్పేస్తాను అమ్మా..." అన్నాడు.

"బంగారు తండ్రి, నువ్వు మంచి నిర్ణయం తీసుకున్నావు. సరే యిప్పుడింక యీ విషయం యిద్దరం కలిసి ఆలోచిద్దాం..." అంది ఆవిడ.

మరీయా అలెక్సేయెవ్నా సన్నివేశాన్ని చాలా వివరంగా పరిశీలించి, పరిస్థితులు అన్నింటినీ జాగ్రత్తగా విశ్లేషించింది. అందుకే ఆవిడ సరైన నిర్ణయానికి వచ్చింది. తన కొడుకు బాహ్య ప్రవర్తన వెనక వున్న వాడి నైతిక సంవేదనల అంతస్సారాన్ని కూడా ఆవిడ గమనించగలిగింది. తన కొడుకు, వాడి స్నేహితుల సంవేదనలను ఆవిడ అర్థంచేసుకోగలిగింది. ఇది తన కొడుకును ప్రభావితంచేసి, సరైన నిర్ణయం తీసుకునేలా సన్నద్ధంచేసేందుకు ఆవిడకి తోడ్పడింది.

ఏదెలా వున్నా, ఎదుటి వ్యక్తిని అతని సొంత వాదనలనే వినియోగించడం ద్వారా ఒప్పించడం తేలిక అన్న విషయం అందరికీ తెలిసిందే. నిజమే, యిందుకు తన పిల్లవాడిని గురించి తెలుసుకొని వుండాలి. వివిధ పరిస్థితుల్లో వాడి ఆలోచనా క్రమాన్ని ఊహించుకోగలిగిన సామర్థ్యం కలిగివుండాలి. ఆయా నిర్దిష్ట పరిస్థితుల్లో తన కొడుకు సంభావ్య ప్రవర్తనను గురించిన మిక్కిలి కచ్చితమైన చిత్రాన్ని పిల్లవాడికి యిచ్చేందుకు ప్రయత్నించండి. పిల్లవాడి ఆలోచనలను, చర్యలను, కోర్కెలను, ప్రయత్నాలను ప్రకాశంగా విశ్లేషించేందుకు ప్రయత్నించండి. ఈ విశ్లేషణ వాడు తనని తాను గుర్తించేలాగ వుండాలి. ఈ "గుర్తింపు" జరిగితే, తనకోసం గీయబడిన ఆ చిత్రాన్ని పరిశీలించేందుకు వాడు ఆగుతాడు. తన సొంత ప్రవర్తనను గురించిన ఆలోచనలు తదుపరి చర్యలను నిర్ణయాత్మకంగా ప్రభావితం చేస్తాయి.

పిల్లవాడు స్వయంవ్యక్తిత్వాన్ని మాత్రమే దర్శించి, మిగిలిన అన్నింటినీ నిర్లక్ష్యం చేసినప్పుడే సరిగ్గా పిల్లల అహంభావం ప్రారంభమవుతుంది. తన కొడుకుతో మాట్లాడేటప్పుడు మరీయా అలెక్సేయెవ్నా వోవ్కా, కోస్త్యాల మానసిక స్థితిని విపులంగా చిత్రించేందుకు సంకోచించలేదు. "నువ్వే వోవ్కా స్థితిలో వున్నావనుకుని ఆలోచించేందుకు ప్రయత్నించు", "తన మాట నిలుపుకోని స్నేహితుడి విషయంలో నువ్వెలా ప్రవర్తించేవాడివి?" అంటూ ఆవిడ డజన్లకొలది వాదనలు చేసింది. చివరకు వాడికి తను చేసింది తప్పన్న నమ్మకం కుదిరింది.

పిల్లవాడి జీవితంలో ఎక్కువ భాగం స్కూలుతో ముడిపడి వుంటుంది. ఈనాటి స్కూలు పిల్లల పని ఎంత సంశ్లిష్టమైనదో ఊహించుకోవడం కూడా కష్టమే. విద్యాబోధనకి సంబంధించిన వ్యవస్థాత్మక పార్శ్వంలో ప్రధానంగా నిమగ్నులైన టీచర్లు పిల్లల్ని స్కూలు పని అనే పారదర్శక పట్టకం గుండా చూస్తారు. టీచర్లమీద ఎన్ని ఫిర్యాదులు సంధించబడతాయో! కొందరు తల్లితండ్రులు తమ పిల్లల్ని తీర్చిదిద్దే విషయంలో సమస్త బాధ్యతలనీ పరిత్యజిస్తారు.

అయితే, పిల్లల జీవితంలో స్కూలుకి ఎంత ముఖ్య పాత్ర వున్నప్పటికీ, పిల్లలను తీర్చిదిద్దడంలో ప్రధాన బాధ్యత తల్లితండ్రులమీదనే వుంటుంది. పిల్లల నిర్దిష్ట విశిష్ట లక్షణాలు తల్లితండ్రులకే మిక్కిలి బాగా తెలుస్తాయి. వాళ్లని ప్రభావితంచేసే విషయంలో

వాళ్లకే అత్యధిక అవకాశాలు వుంటాయి. దురదృష్టవశాత్తూ వాళ్లు తమ పిల్లల్ని కొంత మేరకు వేరే విధంగా చూస్తున్నారు. వాళ్ల వైఖరిలో స్వీయాత్మకత అధికంగా వుంటుంది. అందుకే స్కూలు పిల్లల విషయంలో ఉమ్మడి వైఖరి వహించడంలోనూ, తమ ఆకాంక్షలను సఫలీకృతం చేసుకోవడంలోనూ టీచర్లూ, తల్లితండ్రులూ అన్నప్పుడూ సఫలురు కారు. ఈ అంశాన్ని మరింత విపులంగా పరిశీలిద్దాం.

చదువు అన్నది ఒక పని రూపం అయితే, అప్పుడు ఆ పనికి టీచరుగా నేను బాధ్యుణ్ణి. అప్పుడు పిల్లవాణ్ణి నేను పనిపట్ల వాడి వైఖరి దృష్ట్యా చూస్తాను. పెద్దవాళ్లు పని విషయంలో తమ ఆచరణ దృష్ట్యా, అటు తర్వాతనే తమ వ్యక్తిత్వం దృష్ట్యా ఎలాగైతే అంచనా కట్టబడతారో, అలాగే పిల్లలు కూడా తమ పని దృష్ట్యా అంచనా వేయబడతారు. అయితే తల్లితండ్రులకి సాధారణంగా తమ పిల్లలకి సంబంధించిన అన్ని పార్శ్వాలూ తెలుస్తాయి. అందుకని ఆయా విషయాల్లో పిల్లలపట్ల వాళ్ల వస్తుపరమైన అవగాహనలో, తరతమ భేదాలు వుంటాయి.

20–30 మంది విద్యార్థుల కృషిని ఏక కాలంలో వ్యవస్థితంచేసే టీచరుకి వాళ్ల సమస్త వ్యక్తిత్వాలనూ ఆకృష్టంచేసే సామర్థ్యం ఉండదు. టీచర్ల శ్రద్ధలో అత్యధిక భాగం పిల్లల ఒకేఒక గుణాన్ని, అనగా చదువుపట్ల పిల్లల వైఖరిని అభివృద్ధిచేసేందుకు ఉన్ముఖంచేయబడుతుంది. ఎందుకంటే, ఆ గుణాన్ని అభివృద్ధిచేయడమే తమ శ్రమోత్పాదకతను ఖాయపరచి, తమ విద్యా లక్ష్యాలను సాధించుకునేందుకు వాళ్లకి తోడ్పడుతుంది. సరిగ్గా యిందుకే టీచర్లు సాధారణంగా పిల్లల మనస్సుపట్ల కాక, "స్కూలుకు సంబంధించిన పార్శ్వాల్లో వాళ్ల మనస్సు"పట్ల ఆసక్తి కలిగివుంటారు.

అయితే పిల్లలపట్ల యిలాంటి పరిమిత దృక్పథాన్ని అధిగమించగలిగినవాళ్ళు మాత్రమే ఉత్తమ ఉపాధ్యాయులు అవుతారు. ఈ విషయంలో తల్లితండ్రులు మాత్రమే సహాయపడగలుగుతారు.

...యూర వీస్నిక్ పుట్టుకతోనే ఉత్తమ విద్యార్థి కాదు. వాస్తవానికి వాడు వోవ్కా జరూబిన్ అంత సమర్థుడు కాదు. కాని ఆదినుంచీ వాళ్ల అమ్మ వాడికి శుభ్రంగా, తీరువగా వుండటం, క్రమబద్ధమైన టైమ్‌టేబిలు ప్రకారం పనులు చేసుకోవడం అలవాటుచేసింది. వోవ్కా జరూబిన్ లాగే యూరకి కూడా పిల్లల ఆటలన్నా, కొంటె చేష్టలన్నా, నలుగురు పిల్లలతో కలిసిమెలిసి వుండటమన్నా వల్లమాలిన యిష్టం. పిల్లవాడి నానాటికీ పెరుగుతున్న అవసరాలను తను ఒంటరిగా తీర్చలేనన్న విషయాన్ని ఆవిడ తొందర్లోనే గ్రహించింది. అదిగో అప్పుడే ఆమె తన కొడుకు ప్రపంచంలోకి ఏకాగ్రతా, సమయం, శక్తీ అవసరమయ్యే కొత్త కార్యకలాపాలను ప్రవేశపెట్టింది. వారానికి రెండు సార్లు వాడికి సంగీతం

పాఠాలు వుంటాయి, వారానికి రెండు సార్లు వాడు సాంకేతిక క్లబ్బుకి వెళ్తాడు. వారానికి ఒక సారి వాడు డ్రాయింగు, మోడలింగు క్లాసుకి వెళ్లాలి. సోమవారంనాడు యింటి దగ్గర మొదట తిండితిని, తర్వాత సంగీత పాఠశాలకు వెళ్లేందుకుగాను స్కూలునుంచి తను తొందరగా యింటికి వెళ్లాలని యూరకి తెలుసు. వాడి సంగీతం టీచరు మహా స్ట్రిక్టు. క్షణం కూడా ఆలస్యమయ్యే ప్రసక్తే లేదు.

మొదట్లో యూర తల్లి ఎంతో శ్రద్ధగా రూపొందించిన యీ వరుసవారీ కార్యక్రమం దరిమిలా సామాన్యమైన అలవాటు అయిపోయింది. వోవ్కా జరూబిన్ లాగే, మొదట్లో యూర కూడా అంత బాగా రాయలేకపోయేవాడు. వాడి తల్లి తన కొడుకు ఈ యిబ్బందులను తనకి తనే అధిగమించేలా చూసింది. త్వరలోనే వాడికి చక్కటి దస్తూరీ, హోమ్‌వర్కు పాఠాలను శ్రద్ధగా రాసే సామర్థ్యం అలవడ్డాయి. అయితే, తల్లితండ్రులు తమ పిల్లల పక్కన కూర్చొని, వాళ్ల చదువులో తోడ్పడి, నాసి మార్కులకి కారణాలేమిటో, వాటిని సరిదిద్దడమెలాగో తెలుసుకునేందుకు బదులు తమ పిల్లలను నాసి మార్కులు వచ్చినందుకు కఠినంగా మందలించడం మనం తరచు చూస్తూ వుంటాం.

పెద్దవాళ్ల సరసన కూర్చుని చదవడం పిల్లలకి చాలా ఆసక్తికరంగా వుంటుంది. పెద్దవాళ్ళు వుండటం కేవలం తనిఖీకోసం మాత్రమే కాదు. అన్నింటి కంటె ముఖ్యంగా అది సజీవమైన పరస్పర ప్రతిచర్య. అందుకే పిల్లలకి దానిపట్ల అంత యిష్టం. అయితే యిలా కొంత కాలం జరిగాక, తన కొడుకు హోమ్‌వర్కు చేసేప్పుడు తను పక్కన వుండటానికి అలవాటు పడిపోయినట్లు మరీయా అలెక్సేయెవ్నా గమనించింది. "అమ్మా హోమ్ వర్కు చేద్దాం, రావా" అనేదాకా వెళ్లాడు వాడు. వాడి తల్లి అలాంటి పరిస్థితిలో యిమిడి వున్న ప్రమాదాన్ని సకాలంలో గుర్తించి, యీ అలవాటునుంచి తన కొడుకును తప్పించేందుకు ప్రయత్నించింది. అయితే, "అదేం కుదరదు, నీ అంతట నువ్వు చేసుకో!" అని ఎన్నడూ చెప్పలేదు. అందుకు బదులు ఆవిడ పరోక్షంగా ప్రభావితంచేసే పద్ధతులను ఉపయోగించుకుంది. "అర్జెంటు పనుల"కోసం ఆవిడ తన కొడుకునుంచి తప్పించుకు వెళ్లేది. తనకి తొందర పనులు వున్నాయని, వగైరా సాకులు చెప్పేది. ఈవిధంగా యూర క్రమంగా తన హోమ్‌వర్కు ఒంటరిగా చేసుకునేందుకు అలవాటుపడ్డాడు.

వోవ్కా జరూబిన్ అధ్యయనపు అలవాట్లు యిందుకు భిన్నంగా వుండేవి. "ఒరేయ్, హోమ్‌వర్కు చేసుకోరా" అంటూ పది సార్లు పాట పాడేదాకా వాడికి అసలు తను హోమ్‌వర్కు చేసుకోవాలన్న ధ్యాసే వుండేది కాదు.

కాగా, ప్రతికూల ధోరణిని అలవరచుకొని, అలాంటి ప్రమాదకరమైన అలవాట్లు యిప్పటికే పాతుకుపోయిన సందర్భాల్లో ఏం చెయ్యాలి? ఒక ధోరణిని నిర్మూలించే పని చాలా బాధాకరంగా వుండవచ్చు. కాని అది మంచి సంతోషకరమైన ఫలితం కూడా యివ్వ

వచ్చు. తన ప్రవర్తనను మార్చుకోవాలని పిల్లవాడు గ్రహించి, తనలో తనే ఆ నిర్ణయం చేసుకున్నప్పుడు, చాల సందర్భాల్లో ఆ పిల్లవాడు సంతోషం పొందుతాడు.

## ప్రత్యక్ష, ప్రతిచర్యాత్మక ప్రభావాలు

ఏ కార్యకలాపానికైనా దాని సొంత విశిష్ట లక్షణాలు వుంటాయి. బోధన కార్యకలాపాలకు సంబంధించిన విశిష్ట లక్షణాలకి కేంద్రం ఉపాధ్యాయుడు వ్యవహరిస్తున్నది సజీవ వ్యక్తులతో అన్న వాస్తవం. మనం యింతకు ముందే చూసినట్లు, యీ వ్యక్తులు తమ చుట్టూ వున్న ప్రపంచాన్నీ, సమస్త బాహ్య కార్యకలాపాలనీ, ప్రభావాలనీ సవిమర్శకంగా చూస్తూ తమ వ్యక్తిత్వాలను రూపొందించుకుంటారు. పిల్లలు అంతకు ముందే నెలకొల్పబడి వున్న పాదార్థిక, ఆత్మిక విలువల ప్రపంచంలో ప్రవేశిస్తారు. వాళ్ల తల్లితండ్రులు ఒకప్పుడు అనూహ్యమూ, ఊహాజనితమూ లేక అసాధారణమూ అనుకున్న విషయాలను అవేవో మామూలువీ, స్వయంస్పష్టమైనవీ అన్నట్లు వాళ్లు స్వీకరిస్తారు.

ప్రత్యేక బోధన జ్ఞానాన్ని వినియోగించరన్నట్లు తల్లితండ్రులు తమ సొంత పద్ధతుల్లో పిల్లలను పెంచే కుటుంబాల ఉదాహరణలు మనకి చాలా వున్నాయి. దాదాపు అందరు పెద్దవాళ్లూ ఎంతో కొంత సహజమైన బోధన శాస్త్రీయ సామర్థ్యాలను కలిగివుంటారన్న వాస్తవాన్ని ఎవరూ తిరస్కరించకూడదు. అద్భుతమైన బోధన శాస్త్రీయ సామర్థ్యాలూ, ఏ ప్రత్యేక బోధన శాస్త్రీయ జ్ఞానమూ లేకున్నా తమ పిల్లలను ప్రభావితం చేసే ప్రతిభను కలిగివున్న తల్లితండ్రులు నిజంగానే వున్నారు. యుక్తియుక్త ప్రవర్తన, సృజనశీల ఊహాశక్తి, హాస్య ప్రవృత్తి, ప్రపంచంపట్ల క్రియాశీల వైఖరి, శీఘ్ర ఆలోచనా పాటవం వంటి కొన్ని సహజసిద్ధమైన ప్రతిభలనుంచి వాళ్లు లబ్ధి పొందవచ్చు. అయితే, అలాంటి సామర్థ్యాలు వాటంతట అవే చేకూరవు.

అన్ని యితర సామర్థ్యాల మాదిరిగానే బోధనా సామర్థ్యాలు కూడా, వాటిని ఆచరణలో అన్వయించేటప్పుడు, సంచిత అనుభవం వినియోగింపబడే కారణంగా మరింత అభివృద్ధి చెందుతూ వుంటాయి. బోధన శాస్త్రీయ పరిజ్ఞానం తల్లితండ్రులకి బాగా ఉపయోగపడేది అదిగో అక్కడే. బోధన శాస్త్రీయ జ్ఞానం వాళ్లకి తమ సొంత చర్యలను విశ్లేషించుకొని, వాటి ఫలదాయకతను స్థిరపరచుకునేందుకు తోడ్పడే అవకాశం వుంది.

ప్రత్యక్షం, పరోక్షం, ప్రతిచర్యాత్మకం అనే మూడు తరహా చర్యలు వున్నాయి. వాటిని మనం పరిశీలిద్దాం. అవిభాజ్య గతితార్కిక ఏకత్వం కలిగిన యీ మూడు తరహాల చర్యల మీదనే బోధన శాస్త్ర ప్రభావ యంత్రాంగం ఆధారపడివుంది. ఈ బోధన శాస్త్రీయ చర్యల ఐక్యతా, పరస్పర వ్యతిరేకతలను విశ్లేషించడం ద్వారా ఉపాధ్యాయుడు తన మొత్తం

బోధనా పద్ధతిని గురించి గాఢంగా ఆలోచిస్తాడు, తన పొరపాట్లను పరిశీలించుకుంటాడు, పిల్లలతో పరస్పర ప్రతిచర్యకి సంబంధించిన పద్ధతులను ఏర్పరచుకుంటాడు.

ప్రత్యక్ష బోధన శాస్త్రీయ చర్య అన్నది ఒక పిల్లవాడి లేక పిల్లల బృందపు ప్రవర్తన పట్ల ఉపాధ్యాయుడి ప్రత్యక్ష ప్రతిచర్య. ఈ నిర్వచనం సరైనదనే విషయంలో కొందరికి కొన్ని భిన్నాభిప్రాయాలు వుండవచ్చు. కాని పిల్లలతో ప్రత్యక్ష పరస్పర ప్రతిచర్యలు వాళ్ళతో మానసిక సాన్నిహిత్యాన్ని సాధిస్తాయనడాన్నీ, యీ సాన్నిహిత్యం వాళ్ల భావోద్వేగాల ప్రపంచాన్ని దర్శించడంలో తోడ్పడుతుందనడాన్నీ, సరైన ప్రతిచర్యకు దారితీస్తుందనడాన్నీ ఎవరూ కాదనలేరు. బోధన శాస్త్రీయ ఆచరణలో యీ ప్రత్యక్ష చర్య మిగిలిన అన్నింటి కంటె తరచుగా వినియోగించబడుతుంది. దాని ప్రధాన వ్యక్తీకరణ సాధనాలు సదా అందుబాటులో వుండటమే యిందుకు కారణం. చాలా తరచుగా యీ ప్రత్యక్ష చర్య తన మనస్తాత్విక అంతస్సారంలో, అవాంఛిత ప్రవర్తనగా పరిగణింపబడేదానికి ప్రతిచర్యగా వినియోగపడుతుంది. పిల్లలు అలాంటి వైఖరికి మానసికంగా సన్నద్ధులై వుంటారు.

పిల్లవాడి జీవితంలో ప్రతి ఒక్క సంఘటనకీ తాము ప్రతిస్పందించాలనీ, అంతేగాక చాల శీఘ్రంగా ప్రతిస్పందించాలనీ చాలా మంది ఉపాధ్యాయులు గాఢంగా విశ్వసిస్తున్నారు. ఒకసారి ఒక తప్పును చూసీ చూడనట్లు ఊరుకుంటే, తర్వాత చెడ్డ పనులు వరుసగా ఒక దాని వెంట మరొకటి జరుగుతాయి. ఈ మాదిరి వాదన హేతుబద్ధంగా కనిపించవచ్చు: తక్షణ ప్రతివర్తన లాభసాటే. కాని ఆచరణలో ఎంతో తరచుగా యివి దుష్ఫలితాలుగా పరిణమించగలవు.

ఉపాధ్యాయుడు తన ప్రథమ ప్రతిస్పందనమీద ఆధారపడి, కూకలేసేందుకూ, శిక్షించేందుకూ పూనుకొంటే, పిల్లల మనస్తత్వాన్ని గ్రహించడంలో వైఫల్యంనుంచీ, వాళ్ల సొంత ప్రపంచాన్ని గుర్తించేందుకు అయిష్టతనుంచీ ఉత్పన్నమయే అలాంటి ప్రతిస్పందనలు అవి ఎంత చిత్తశుద్ధితో కూడినవైనా కూడా ఎలాంటి సానుకూల ఫలితాలను యివ్వగలవు?

వెంటనే అవసరమైన, దయార్ద్రమైన మాటలను ఎంచుకోగలిగిన సామర్థ్యం ఉపాధ్యాయుడికి వుండి, అతను సరైన పరిష్కారాన్ని మాత్రమే అసందిగ్ధంగా ఎంచుకోగలిగితే తక్షణ ప్రతిస్పందనలను సమర్థించవచ్చు.

కాని, ఆచరణలో జరుగుతున్నది ఏమిటి? మిలీషియా స్టేషనులో తన కొడుకును యింకా చూడక ముందే, వాడి ప్రవర్తనకి సంబంధించిన పరిస్థితులను యింకా ధృవీకరించుకోక ముందే కోస్త్యా బోయెవ్ తండ్రి ఒక నిర్ణయానికి వచ్చేశాడు. తన కొడుక్కి నాలుగు అంటించాలన్నదే ఆ నిర్ణయం. తన కొడుకు చేసిన పనిని గురించి ఆలోచించేందుకు ఆయనకి తగినంత సమయం వుంది. కాని దురదృష్టవశాత్తూ, తన కొడుకు ప్రవర్తనను విశ్లేషించ

వలసిన అవసరం వుందని అతను అనుకోలేదు. అతని దృష్టిలో కోస్త్య యింకా ఒక వ్యక్తి కాదు. ఏమీ ఆలోచించకుండా వాడితో ఎలా పడితే అలా వ్యవహరించవచ్చు.

మానసిక ఒత్తిడిలో వున్నప్పుడు అనాలోచిత ప్రతివర్తనలు ప్రభావితంచేసే సాధనాల్లో కెల్ల మిక్కిలి మొరటైనవిగా వుంటాయి. ఈ సాధనాలను మరే యితర మార్గమూ తెలియని లేక అవసరమైన మానసిక, ఆత్మిక ప్రయత్నం చేయగోరని వాళ్లు ఉపయోగిస్తారు.

వోవ్క, కోస్త్యలు మిలీషియా స్టేషన్లో వున్నప్పుడు, తమ ప్రవర్తనపట్ల తమ తల్లితండ్రులు ఎలా వ్యవహరిస్తారో వాళ్లకి తెలుసు. పిల్లలు తమ మనస్సులో అప్పటికే అనుభూతంచేసుకున్నదాన్నే శిక్షకుడు "తిరిగి చేస్తే," దాని శిక్షణాత్మక విలువ చాలా తగ్గిపోతుంది. పిల్లలు "తల్లితండ్రుల నమూనాలకు" అలవాటుపడిపోయి, తదనుగుణమైన "నమూనా ప్రతిచర్యలను" అభివృద్ధిచేసుకుంటారు. ఒక ప్రత్యేకమైన అల్లరికి మీ మీ తల్లితండ్రులు ఎలా ప్రతివర్తిస్తారని మీరు అడిగితే, పిల్లల్లో అత్యధిక సంఖ్యాకులు తమ తల్లితండ్రుల ప్రతిచర్యలలోని అతి సూక్ష్మమైన భేదాలనూ, మాటలనూ కచ్చితంగా చెప్తారు. ఇద రు ముగ్గురు విద్యార్థులు మాత్రమే సంభావ్య ప్రతిచర్యను ఊహించలేరు. తమ మానసిక స్థితి ఆధారంగా ప్రతిస్పందించని తల్లితండ్రులు తమ ఆలోచనలనూ, భావాలనూ ఎలా వ్యక్తంచెయ్యాలో ఆ పద్ధతిని గురించి సీరియస్‌గా ఆలోచిస్తారు. తన ప్రపర్తనపట్ల తన తల్లి వైఖరిని ఎలా వ్యక్తంచేస్తుందో యూర వీన్నిక్‌కి ఎన్నడూ తెలియదు. ఎందుకంటే, ఆవిడ ప్రతిస్పందన తీరు ఎప్పుడూ ఒక కొత్త, తరచు అనూహ్య రూపాన్ని తీసుకొంటుంది. మరీయా అలెక్సేయెవ్నా ఉద్దేశపూర్వకంగానే అలా చేస్తుంది. తన ఆకాంక్షలను వ్యక్తంచేయడంలో నవ్యత ఆ ఆకాంక్షలను అమల్లో పెట్టేందుకు తోడ్పడుతుంది. ఆవిడ యీ విషయాన్ని యిలా వ్యక్తంచేస్తుంది: "దుష్ప్రవర్తనపట్ల తక్షణమే ప్రతివర్తించకుండా ఉండటం చాలా కష్టం. నా కొడుకు తప్పుగా ప్రవర్తిస్తాడని గమనించిన కొన్ని సందర్భాల్లో వాడిని ఆపి, కేకలేయాలన్న ఆకస్మికమైన ప్రబలమైన కోర్కె కలుగుతుంది. నన్ను నేను అదుపులో పెట్టుకోవడాన్ని అభ్యసించాను. పిల్లవాడిపట్ల నా వైఖరిని మరింత మెరుగ్గా నిర్ణయించుకునేందుకూ, నా ఆకాంక్షలను వ్యక్తంచేసేందుకూ అత్యంత సముచిత రూపాన్ని ఎంపికచేసుకోగలిగేందుకే నేనిలా నన్ను నేను అదుపులో పెట్టుకొంటాను."

తమ పిల్లలు యిప్పటికే "పూర్తిగా చెడిపోయారు" అని తల్లితండ్రులు ఫిర్యాదు చేసినప్పుడు, అలాంటి కుటుంబాల్లో కేకలెయ్యడమే మామూలుగా పరస్పర ప్రతివర్తన రూపంగా వుంటుందని మనం రూఢిగా చెప్పవచ్చు. ఈ కేకలెయ్యడం అటు తల్లితండ్రులకీ, ఇటు పిల్లలకీ విసుగు పుట్టించి, ఉద్రిక్తులను చేస్తుంది.

కేకలెయ్యడాన్ని మత్తుమందులతో పోల్చవచ్చు. కేకలెయ్యడం ద్వారా యితరులను ప్రభావితంచెయ్యాలని ప్రయత్నించిన మీదట, యింక ఆగడం కష్టసాధ్యంగా కనిపిస్తుంది. ఎందుకంటే, కేకలెయ్యడం కృత్రిమమైన ఉపశమనం కలిగిస్తుంది, నిస్సహాయతని మరుగు

పరుస్తుంది. పిల్లల్ని ప్రభావితం చేస్తున్నామన్న భ్రమను కల్పిస్తుంది. కాని, కేక లెయ్యడంలోని చిరాకు, మొరటుతనం, క్రౌర్యం వంటి చెడు లక్షణాలన్నీ పిల్లల్లో ప్రతికూల ప్రతివర్తనను కలిగిస్తాయి. కాగా క్రమేణా పిల్లలు కేకలను అనివార్యమైన చెడుగుగా పరిగ ణించనారంభిస్తారు.

నేను యింతవరకు ప్రత్యక్ష బోధన శాస్త్రీయ చర్య ప్రతికూల పార్శ్వాలను క్లుప్తంగా పరిశీలించాను. అయితే, అంతమాత్రాన ఆ మాదిరి ఆచరణ రూపానికి నేను వ్యతిరేకిని కాను. పిల్లవాడి జీవితంలోని అనేక ముఖ్య పరిస్థితులను, అంతేగాక వాడి ఆలోచనలను, వాడి మనఃస్థితిని, వాడి అభిప్రాయాలను సమగ్రంగా ముందు విశ్లేషించి వుంటే, అప్పుడు ప్రత్యక్ష చర్య ఫలవంతమవుతుంది.

...ఏ ఒక్క సబ్జెక్టులోనూ ఫెయిల్ మార్కు రాకుండా పాసై ఏడవ క్లాసులోకి వెళ్తే, తన కొడుక్కి సైకిలు కొనిపెడతానని వాళ్ల అమ్మ వాగ్దానం చేసింది. జీతం రోజున తల్లి రాకకోసం వాడు అసహనంగా నిరీక్షిస్తున్నాడు. నాకు సైకిలొస్తుంది, నేను దానిమీద సముద్ర తీరానికి వెళ్తాను అని కలలు కంటున్నాడు. ఈ యాత్రతో వాడి ఎన్నెన్నో తియ్యటి కలలు ముడిపడి వున్నాయి. అసలు యీ మధ్య వాడి బుర్రలో ఈ యాత్రను గురించిన ఆలోచనలకు తప్ప మరి దేనికీ చోటు వుండటం లేదు.

తన తల్లి ఇంట్లోకి రాగానే వోవ్కకి వెంటనే ఏదో బెడిసి కొట్టిందనీ, తనకింక ఏ సైకిలూ గియికిలూ వుండదనీ అనిపించింది. వాడి తల్లి రాత్రి భోజనం తయారీకి సన్నా హాలు మొదలుపెట్టింది. వోవ్క ఆవిణ్ణే గమనించసాగాడు. సైకిలు సంగతి ఏమైందో అడగాలని వాడు తహతహలాడుతున్నాడు. కాని అందుకు తగిన అవకాశం వాడికి చిక్కలేదు. వాడి తల్లి గదిలోంచి వంటగదిలోకీ, అక్కడినుంచి గదిలోకీ హడావిడిగా నిర్విరామంగా తిరుగుతోంది. వోవ్క సైకిలు సంగతిని రాత్రి భోజనం వేళ ఎత్తుదాంలే అనుకున్నాడు. కాని వాడింక ఉగ్గబట్టలేకపోయాడు. "నేను ఫెయిల్ కాకుండా పాసయ్యాను కదా..." అంటూ మొదలుపెట్టి, గాభరాగా వున్న తన తల్లి ముఖం చూసి ఆగిపోయాడు. వాడి తల్లి నీరసంగా కూర్చుని "వచ్చి యిలా కూర్చోరా, నీతో మాట్లాడాలి" అంది. వోవ్క కూర్చు న్నాడు. "నువ్వు అర్థంచేసుకోగలవో లేదో నాకు తెలియదు గాని, నా జీతంలో మిగిలిందల్లా యిదేరా" అంటూ తల్లి మొదలుపెట్టింది. ఆవిడ ఎనిమిది రూబుళ్లు టేబిలుమీద పెట్టింది. ఆవిడ తన స్నేహితురాలికి అప్పిచ్చాననీ, ఆమె భర్త తీవ్రంగా జబ్బుపడ్డాడనీ, ఆవిడ సహాయంకోసం అడిగిందనీ చెప్పింది. అన్నా ఇవానొవ్నా ఆమెకి దాదాపు జీతం డబ్బంతా యిచ్చేసింది. "నేను కాదనలేకపోయానురా" అంటూ వోవ్క తల్లి కొనసాగించింది. "నువ్వు అడ్డాల్లో బిడ్డగా వుండగా నేను ఒంటరిదాన్ని అయినప్పుడు ఆమె మూణ్ణెల్ల పాటు నీ ఉయ్యాల పక్కనే వుంది నిన్ను వదలకుండా. ఆమె తన అవసరాలెన్నో వదులుకొని మరీ మనకి

సాయం చేసింది... నేను నా మాట నిలుపుకోలేకపోయానురా... నీకు చేసిన వాగ్దానం నెర వేర్చలేకపోయానురా...'' అంది. వోవ్కా గమ్మున ఉండిపోయాడు. నీ స్నేహితురాలు అప్పు తీసుకున్న డబ్బు ఎప్పుడు తిరిగి యిస్తుందని అడగాలనిపించింది వాడికి. కాని అడగడం మంచిది కాదని అర్థంచేసుకుని ఊరుకున్నాడు. వాడి తల్లి వాడి మనస్సులోని మాట గ్రహించి నట్లు, యిలా చెప్పింది: "బాకీ డబ్బు తొందర్లో తిరిగి యివ్వవలసిన అవసరం లేదులే అని చెప్పాను నేను ఆవిడతో. నువ్వూ, నేనూ బాగా సుఖంగానే బతుకుతున్నామనీ, మనకి ఏ కొరతా లేదనీ చెప్పాను.'' తర్వాత వాడి తల్లి తను అదనపు పని చేస్తాననీ, తప్పకుండా సైకిలు కొనిపెడతాననీ, కాని వాడు మరికొంత కాలం ఓపికపట్టాలనీ చెప్పింది. సైకిలే కాకుండా, బూట్లూ, ఓ కొత్త యూనిఫారమూ కూడా తను కొంటానంది. ఆవిడ అలా అదే పనిగా మాట్లాడుతూనే వుంది, వోవ్కా మౌనంగా ఉండిపోయాడు. తర్వాత వాడు ముక్తసరిగా "ఇంక చాల్లే. లేదంటే లేదు, అంతే'' అన్నాడు.

ఆ మరుసటి రోజున వోవ్కా తన క్లాస్ టీచరు వ్లదీమిర్ పెత్రోవిచ్ దగ్గరకి వెళ్ళి, తను క్లాసు పిల్లలతో పాటు యాత్రకి రాలేనని చెప్పాడు. వాడు అన్ని విషయాలూ ఉన్నవి ఉన్నట్లు వివరించి చెప్పాడు. అయితే, టీచరు యీ పరిస్థితినుంచి బయటపడే మార్గం సూచించినప్పుడు, అది వాడికి నూటికి నూరు పాళ్ళూ అనువుగా వుండటంతో, వోవ్కా సంతోషానికి అవధి లేకపోయింది. "ఈ యిబ్బందిలో వున్నది నువ్వొక్కడివే కాదు. ఇలాంటి యిబ్బంది రావచ్చునని నేను ముందే ఊహించాను. అందుకే నేను స్పోర్ట్స్ క్లబ్బుతో 20 సైకిళ్ళు బదులుగా యిచ్చేలా ఏర్పాటు చేశాను. అయితే, నాది యింకో ఊహ వుంది. బెర్రీలు పోగుచేసేందుకు ఒక బృందాన్ని సమకూర్చవలసిందిగా అడిగారు. నేను లెక్కవేసి చూశాను, మనం పది రోజులపాటు గట్టిగా పనిచేస్తే సైకిళ్ళకే కాకుండా, మన దారి ఖర్చులకు కూడా సరిపడేటంత డబ్బు సంపాదించుకోవచ్చు...'' వోవ్కాకి యీ ఊహనుంచి అసాధారణమైన శక్తి ప్రసరిస్తున్నట్లైంది. ఈ వ్యవహారాన్ని పిల్లలతో చర్చిస్తే ప్రయోజనముంటుందా అని టీచరు సంశయం వ్యక్తంచేశాడు. తను స్నేహితులందర్నీ పోగుచేస్తాననీ, ఆ మరుసటి రోజే ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రానికి ప్రయాణానికి వాళ్ళని సన్నద్ధులను చేస్తాననీ వోవ్కా వెంటనే ముందుకొచ్చాడు.

వాడు టీచరు దగ్గర్నుంచి కోస్త్యా యింటికి పరుగున బయల్దేరాడు. కాని మార్గ మధ్యంలో వాడి మనస్సులో చటుక్కున ఒక వేళ పిల్లలు బెర్రీలు పోగుచేసేందుకు ఒప్పు కోకపోతే అన్న శంక కలిగింది. ల్యోష మిరోనొవ్ తప్పకుండా వస్తాడని వాడికి నమ్మకంగా అనిపించింది. అంచేత వాడితో మొదలుపెడదాం అనుకున్నాడు వోవ్కా. వాడు ల్యోష గదిలోకి దూసుకుని వెళ్ళడంలో, దాదాపు ల్యోష తల్లిని ఢీకొన్నంత పనిచేశాడు. "ల్యోష్కా, బయల్దేరరా, జల్దీ!'' అన్నాడు. వాళ్ళు బయటకి వస్తూ, "మేము స్కూలుకు వెళ్తు న్నాం!'' అని చెప్పి, ఇంటినుంచి బయటపడ్డారు. చాలా సేపటిదాకా వోవ్కా చెప్తు

న్నదేమిటో ల్యోష్కకి అర్థం కాలేదు. వోవ్కా పరుగు ఆపకుండా, భావావేశం మూలంగా రొప్పుతూ, సరస్సు ఒడ్డున మకాం ఎంత మజాగా వుంటుందో వర్ణిస్తూ, రాత్రివేళ అక్కడ చలిమంట ఎలా వేస్తారో, చేపలు ఎలా పడతారో అన్నీ వర్ణించి చెప్పాడు. అన్నింటి కంటె ముఖ్యంగా తాము ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంనుంచి తిరిగి వచ్చేటప్పుడు సొంత సైకిళ్లమీద తిరిగివస్తామని చెప్పాడు. ల్యోష్కా కూడా తనంతగా ఉత్సాహితుడైనట్లు నమ్మకం కలిగేదాకా వోవ్కా మాట్లాడుతూనే వున్నాడు. తర్వాత వోవ్కా అసలు విషయానికి వచ్చి, క్లుప్తంగా "కుర్రాళ్లు యిష్టపడకపోతే ఏమవుతుందో తెలుసా, యిదంతా భగ్నమై పోతుంది" అన్నాడు. "ఒస్తార్లేరా" అంటూ ల్యోష్కా మధ్యలో అడ్డం వచ్చి అన్నాడు. "ఏమిట్రా, నువ్వనేది?.." అయితే వోవ్కా విషయాలను మరింత వాస్తవిక దృష్టితో చూశాడు. తన అనుమానాలను వాడు తన స్నేహితుడి దగ్గర దాచలేదు. వాళ్లిద్దరూ ప్రణాళికా బద్ధంగా, జాగ్రత్తగా వ్యవహరించాలని నిర్ణయించుకున్నారు...

ఈ ఘట్టంలో మనం ఆ కుర్రాళ్లని కాసేపు అలా వదలి యింతకు ముందరి రెండు ఘటనలను విశ్లేషిద్దాం. అన్నా ఇవానొవ్నాకీ వోవ్కాకీ మధ్యా, క్లాస్ టీచరు వ్లదీమిర్ పెత్రోవిచ్‌కీ వోవ్కాకీ మధ్యా జరిగిన సంభాషణలను విశ్లేషించేందుకు ప్రయత్నిద్దాం.

ఈ చర్యల విద్యాబోధన శాస్త్రీయ అర్థాన్ని విశ్లేషిద్దాం. మనిషి తన తక్షణ లక్ష్యాల కోసం జీవిస్తాడు. సైకిలూ, ఈ యాత్రా వోవ్కాకి సరిగా అలాంటి లక్ష్యం. రేపటి సంతోషం, అందునా పూర్తిగా అర్హమైన సంతోషం కోల్పోవడం క్లేశ కారణం కాకపోయినా మహా ఆహితంగా వుంటుంది. వోవ్కా యీ సంతోషాన్ని మనసారా గాఢంగా కాంక్షించాడు, అంతలో అకస్మాత్తుగా అదంతా కుప్పకూలిపోయింది. అయితే, మన పిల్లాడు శక్తిమంతుడుగా, తెలివైనవాడుగా, దయాపరుడుగా పెరగాలని మనం కోరుకుంటే, వాడికి మనం సంతోషంకోసం వాడి కోర్కెల పరిపూర్తికోసం ఎదురుచూడగలగడమే కాకుండా, జీవితం సంశ్లిష్టమైనదనీ, వైరుధ్యపూరితమైనదనీ, ఒక స్నేహితురాలికి తోడ్పడేందుకుగాను తరచు తన స్వప్నాలనీ, కోర్కెలనీ వదులుకోగలిగి వుండాలనీ కూడా బోధించడం మన విధి. అలాంటి త్యాగాల ఆవశ్యకతని అర్థంచేసుకోవడం ఎలాగో కూడా మనం వాడికి నేర్పాలి.

అన్నా ఇవానొవ్నా మొత్తంమీద ఎలాగో ఒకలాగ తన కొడుక్కి మనుషుల దురదృష్టం గురించి చాలా సీరియస్‌గానూ, నమ్మకంగానూ చెప్పగలిగింది. తన కొడుకు బాగా నిరాశ పడతాడని తనకి తెలిసినప్పటికీ, తను మరో విధంగా ప్రవర్తించి వుండగలిగేదాన్ని కానని వివరించగలిగింది. తన కొడుక్కి ఆవిడ "నీతిబోధ" చెయ్యలేదు. ఆవిడ అన్ని విషయాలూ పెద్దవాడితో మాదిరిగా చిత్తశుద్ధితో, నిజాయితీగా వాడికి చెప్పింది. అతిశయోక్తులు చెప్పకుండా, తన కొడుక్కి క్షమాపణ చెప్తున్నట్లు గాని, తనపట్ల దయని అర్థిస్తున్నట్లు

గాని కాకుండా చెప్పింది. తనని వాడు అర్థంచేసుకునేలా చెయ్యాలన్న గాఢ కాంక్షతో ఆవిడ యిందుకు పూనుకొంది.

ప్రత్యక్ష బోధనాత్మక చర్యలు ధోరణిలోనూ, ప్రాముఖ్యంలోనూ భిన్నంగా ఉండవచ్చు. అవి బాధనో లేక సంతోషాన్నో, కోపాన్నో లేక చిరునవ్వులనో రేకెత్తించవచ్చు. లేకపోతే అందుకు భిన్నంగా, అవి పిల్లలను తనుమనోసహితంగా కార్యాచరణలోకి తీసుకురావచ్చు. ఒక విషయం ముఖ్యం. అదేమిటంటే, మన మాటలూ, చేతలూ పిల్లల యోగ్యతలను కించపరచకూడదు. అవి అలా వాళ్లలోని వ్యక్తిపట్ల గౌరవం చూపేలా చేసేవిగా వుండాలి. తమ సంగతిని గురించి మాత్రమే ఆలోచించేలా కాకుండా, యితరుల భావాలపట్ల ప్రతిస్పందించేలా, ఆర్ద్రంగా ఉండేలా చేసేవిగా వుండాలి.

అన్నా ఇవానొవ్నాతో సంభాషణ మూలంగా వోవ్కా బాగా కృంగిపోయాడు. క్లాస్ టీచరుతో సంభాషణ వాడి వెనకటి ఉత్సాహాన్ని పునరుద్ధరించింది. వాడి టీచరు ఆ కుర్రాడి మాటలు వినగలగడమే కాకుండా, వాడి మనోస్థితిని గ్రహించి, వాడికొక నిర్మాణాత్మకమైన పరిష్కారాన్ని సూచించగలిగాడు.

దీన్ని బట్టి కొన్ని నిర్ధారణలు చేద్దాం. ప్రత్యక్ష బోధనాత్మక చర్య చివరకు పిల్లల్ని ప్రయోజనకరమైన కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొనేలా ప్రేరేపించి, అదే సమయంలో వాళ్లలో ఆశాభావాన్ని పునరుద్ధరిస్తే, కాంక్షించే లక్ష్య సాధనలో స్వయంకృషిపై ఆధారపడటం నేర్పితే, అప్పుడు దాన్ని ఫలవంతమైనదని చెప్పవచ్చు.

పిల్లలకి ఎంత బ్రహ్మాండమైన శక్త్యుత్సాహాలు వుంటాయో ఊహించుకోవడం కష్టం. అందులో ఎంతో శక్తి తరచు రకరకాల పనికిమాలిన పనుల్లోనూ, పెద్దవాళ్లని ప్రతిఘటించడంలోనూ, రకరకాల వృథా కాలక్షేపాల్లోనూ, అవకతవక వినోదాల్లోనూ వ్యయమవుతూ వుంటుంది. శిక్షకుడి ప్రతిభ ఆ శక్తి వాహినిని కావలసిన కాలువల్లోకి మళ్లించడంలో వుంటుంది.

అతి తరచుగా పిల్లలే టీచర్లలా వ్యవహరించడం, అందునా ఆరితేరిన, తెలివైన టీచర్లలా వ్యవహరించడం మీరెప్పుడైనా గమనించారా? మధ్యమధ్య పెద్దవాళ్ల సామర్థ్యాలకే అలవికాని పరిస్థితుల్లో వాళ్లు సాఫల్యం పొందుతూ వుంటారు.

సిసలైన సంకల్పం కలిగివున్నప్పుడు పిల్లలు అపారమైన శక్తి సామర్థ్యాలను ప్రదర్శించడం, దాదాపు అనాలోచితంగా అత్యంత అనూహ్యమైనవే గాని, కచ్చితమైన పరిష్కారాలను కనుగొంటూ వుండటం బహుశా మీరు గమనించి వుంటారు.

వోవ్కా జరూబిన్ ఎంత ఉత్సాహం, ఊహా శక్తి, స్వయం ప్రతిభా ప్రదర్శించాడో చూడండి! వాడెంత ఆవేశపరుడు! అయితే, వాడిలో యీ ఉత్సాహాన్నీ, కార్యాచరణకోసం తపననూ రేకెత్తించినది పెద్దవాళ్లు.

సరే మళ్లీ ముందుకు వెళ్దాం...

"వీధి పిల్లలు" మన పిల్లల్ని పాడుచేస్తారని మనం తరచు ఫిర్యాదుచేస్తూ వుంటాం. అయితే వాళ్లనుంచి మన పిల్లలు ప్రయోజనకరమైనదాన్ని ఎంత ఎక్కువగా పొందుతూ వుంటారో మనం గుర్తించం. పిల్లల్ని బాహ్య ప్రభావంనుంచి పూర్తిగా వేరుచేస్తే హాని మాత్రమే కలుగుతుందని మనం నిస్సందేహంగా చెప్పవచ్చు. మరీయా అలెక్సేయెవ్నాకి యీ విషయం బాగా తెలుసు. అందుకని వోవ్కా, వాడి స్నేహితులూ ఆవిడ కొడుకు దగ్గరకి కాక, ఆవిడ దగ్గరకే వెళ్లారు. వాళ్లు యిలా తర్కించుకున్నారు: మొదటి సంగతి, మరీయా అలెక్సేయెవ్నా స్కూలు పిల్లల పేరెంట్స్ కమిటీ అధ్యక్షురాలు. ఆవిణ్ణి మనం ఒప్పించగలిగితే, ఆవిడ మనకి బోలెడంత సాయంచేయవచ్చు. ఆవిడ మనతో బాటు కాంపుకి వచ్చేందుకు సైతం యిష్టపడవచ్చు. ఆవిడ మనకి మద్దతు యిస్తే తల్లితండ్రుల్లో అత్యధిక సంఖ్యాకులు తమ పిల్లల్ని కూడా కాంపుకి పంపుతారు.

ఎక్కడ, ఎలా ప్రారంభించాలో వోవ్కాకి తెలుసు. యూర ఇంటికి వెళ్లీ వెళ్లగానే ల్యోష్కా ఏదో సణగడం మొదలెట్టే సరికి వోవ్కా వాణ్ణి వెంటనే ఆపుచేసి, లప్పుగా ఆవిడతో "సంగతేమిటంటే, మేము మీ దగ్గర సలహా తీసుకునేందుకు వచ్చాం" అన్నాడు. తర్వాత వాడు విషయమంతా సవివరంగా ఏకరవుపెట్టాడు. "కాని మీరక్కడ ఎక్కడుంటారు, ఎక్కడ పడుకుంటారు, ఏం తింటారు?.." అని మరీయా అలెక్సేయెవ్నా అడిగినప్పుడు, వాడు మహా సంతోషించాడు. దీని అర్థం ఆవిడ యీ విషయం అప్పుడే సీరియస్‌గా ఆలోచిస్తోందన్న మాట అనుకున్నాడు. వోవ్కా వెంటనే "వ్యవసాయ క్షేత్ర డైరెక్టరుతో మాట్లాడి మన స్కూలు టీచరు అప్పుడే అన్ని ఏర్పాట్లూ చేశారండి" అన్నప్పుడు ల్యోష్కా ఉబ్బితబ్బిబ్బైపోయాడు.

మరీయా అలెక్సేయెవ్నా కుర్రాళ్లకి తన తోడ్పాటు యిచ్చింది గాని, అంతిమ నిర్ణయాన్ని స్కూలు టీచరుతో మాట్లాడేదాకా వాయిదావేసింది.

అప్పుడిక కుర్రాళ్లు ఏదేమైనాసరే ఆవిడ కంటె తామే ముందు వెళ్లి ఆయన్ని కలుసుకోవాలని నిర్ణయించుకున్నారు. వాళ్లకి తమ టీచరు స్కూల్లో ఏదో మీటింగులో వున్నట్లు తెలిసింది. అయితే, వోవ్కాకి యిదో పెద్ద అవరోధంగా కనిపించలేదు. ఆయన్ని ఏదో అర్జెంటు పని వుందని బయటకి పిలవవలసివచ్చిందనుకోండి. టీచరు తమనెలాగూ బలపరుస్తాడని వాళ్లకి రూఢే గనుక, వాళ్లు వెంటనే "మేము ఎక్కడుంటామని ఆవిడ అడిగారండి" అని వెంటనే అసలు విషయంలోకి వెళ్లారు. "ఆవిడ ఎవరు? ఎవరు ఎక్కడ వుంటారు? ఏమిటర్రా, యిదంతా?" అని టీచరు సాశ్చర్యంగా ప్రశ్నించాడు. వాళ్లు మళ్లీ మొదట్నుంచీ విషయమంతా చెప్పకురావలసివచ్చింది. ఇప్పటికే అన్ని ఏర్పాట్లూ జరిగిపోయాయని మరీయా అలెక్సేయెవ్నాగారికి నమ్మకంగా చెప్పినట్లు వాళ్లు ఒప్పుకున్నారు.

టీచరు వాళ్లకి అభయమిచ్చాడు. ఆయన నిజంగానే వ్యవసాయ క్షేత్ర యాజమాన్యంతో మాట్లాడి ఏర్పాట్లు చేశాడు. వాళ్లకి భోజన, వసతి ఏర్పాట్లు జరిగాయి. వాళ్లు

క్షేత్రానికి వెళ్ళేందుకు బస్సు వస్తుంది. తర్వాత ఆయన ఆ పిల్లలకి "వేసవి శిబిరంలో పనిచేసే పిల్లల జాబితా" అని తను స్వయంగా రాసిన నోట్‌బుక్ ఒకటి యిచ్చాడు. అప్పుడింక ముందుకి వెళ్ళేందుకు ఒక అధికారిక పత్రం పిల్లల చేతికి చిక్కినట్లయింది.

సాయంత్రానికల్లా వోవ్కా పిల్లల పెద్ద బృందంతో పోయి, వ్యవసాయ క్షేత్రానికి వెళ్ళేందుకు సిద్ధపడిన 23 మంది విద్యార్థుల పేర్లు టీచరుకి యిచ్చాడు.

అయితే పిల్లవాడితో ముఖంమీద నేరుగా మాట్లాడేందుకు అన్నప్పుడూ వీలుండదు. టీచరు దృష్టిలో పిల్లవాడి మనస్సును గాయపరచి, వట్టినే అవాంఛిత ఫలితాలను కలిగించే పరిస్థితులు కొన్ని వుంటాయి. అలాంటి సందర్భాల్లో ముఖాముఖీ చర్చను తప్పించుకోవడం మంచిది. అలాంటి సన్నివేశాల్లో పరోక్ష బోధనాత్మక చర్యమీద ఆధారపడటం అత్యుత్తమం.

ఉదాహరణకు, భోజనాల బల్ల దగ్గర "చప్పుడు చెయ్యకుండా తినలేవూ!", "స్పూను ఎంత సౌడిబ్బెంగా పట్టుకున్నావో చూసుకో!", "కదలకుండా కూర్చో!" అనే మాటలు మనం చాలా తరచుగా వింటూ వుంటాం. ఈ విధినిషేధాలు ఎంత అతిగా, ఒళ్లు మండేవిగా ఉంటాయో! ఇవన్నీ ప్రతికూల రూపంలో వినియోగింపబడే ప్రత్యక్ష చర్యలు. మరి పరోక్షమైనవాటి మాట యేమిటి? మరీయా అలెక్సేయెవ్నా ఎవరో ఒక పరిచితుడు భోజనాల బల్ల దగ్గర ఎంత చక్కగా, కుదురుగా, ముచ్చటగా కూర్చుంటాడో (ఉద్దేశపూర్వకంగానే) పిల్లలకి చెప్పడం నేను విన్నాను. ఆమె తన పరిచితుల్లో ఒకరి చక్కని అలవాట్లను తన కొడుకు గాని, వాడి స్నేహితులు గాని అనుకరించడంలో జయప్రదం కాలేని అలవాట్లను వర్ణించి చెప్పింది. ఆ తర్వాతనుంచి భోజనాల బల్ల దగ్గర పిల్లల ప్రవర్తన తీరులో పైకి ఎవరూ వాళ్లతో ప్రత్యక్షంగా చెప్పకపోయినప్పటికీ మార్పు వచ్చింది. పరోక్ష చర్య దాని అంతిమ లక్ష్యంనుంచి కొంత ఎడంగా వున్నట్లు కనిపిస్తుంది. కాని పిల్లలు చతురత్వాన్ని యిష్టపడతారు. పరోక్ష చర్యల ద్వారా పిల్లవాడి ఆత్మగౌరవాన్ని గాయపరచకుండా వుండటం సాధ్యమవుతుంది. అలాంటి వైఖరి వ్యక్తుల మధ్య సంబంధాల స్వభావంనుంచే ఉత్పన్నమవుతుంది.

నాకు కౌమారవయస్కుడైన కొడుకు వుంటే, యితరులతో వాడి సంబంధాలన్నింట్లోనూ, వాడు రోజూ సాంగత్యంలోకి వచ్చేవాళ్ల ప్రభావం వుంటుందని నాకు తెలుసు. పిల్లలు సహజంగానే యీ వ్యక్తుల్లో కొందరిపట్ల అంటీ ముట్టనట్లు ఉదాసీనంగా వుంటారు. అయితే మరి కొందరు వ్యక్తుల అభిప్రాయానికి వాళ్ళు కొన్ని సందర్భాల్లో తమ సొంత తల్లితండ్రుల అభిప్రాయానికి కంటె ఎక్కువ విలువ యిస్తారు. పిల్లవాడిని నేరుగా ప్రభావితం చేయడం సాధ్యమే. అయితే వాళ్లని యిలాంటి "పలుకుబడి" కలిగిన వ్యక్తుల ద్వారా

ప్రభావితం చేయడం కూడా సాధ్యమే. ఒక తండ్రి టీచరు దగ్గరకి వచ్చి "మా అబ్బాయి సంగతి మీకు తెలుసు... మీరు వాడితో కొంచెం మాట్లాడి చూడండి..." అన్నాడంటే, ఆయన పరోక్ష ప్రభావాన్ని ఉపయోగించుకొనేందుకు ప్రయత్నిస్తున్నాడన్న మాట. మనం మన చిన్నతనాల్లో మన స్నేహితుల తల్లితండ్రులు "నువ్వు మా అబ్బాయి (అమ్మాయి)తో కొంచెం మాట్లాడు, వాడు (ఆమె) నీ మాట తప్పకుండా వింటాడు" అని కోరడం మనం జ్ఞాపకం చేసుకోలేమూ. పరోక్ష సాధనాలమీద యిలా ఆధారపడటానికి తల్లో, తండ్రో విధిగా నిస్సహాయులని అర్థం కాదు. సాంఘిక సంబంధాల అభివృద్ధిలో మరింత ఉన్నత స్థాయిని, బోధనలో అధికతర సామర్థ్యాన్ని కూడా అది ప్రతిబింబించవచ్చు. ఇది ఒకరు తన లక్ష్యాన్ని మరింత పాదుపైన, మరింత ఫలవంతమైన, మరింత యుక్తియుక్తమైన పద్ధతుల ద్వారా సాధించుకోడాన్ని సంభవం చేస్తుంది. ఇందులో మరో ముఖ్యాంశం కూడా వుంది. పరోక్ష చర్యమీద ఆధారపడటం పిల్లలు చొరవనూ, స్వతంత్ర స్వభావాన్నీ పెంపొందించు కొనేందుకు తోడ్పడుతుంది.

వోవ్కకి పనితో మేళవింపబడిన ఈ యాత్ర నచ్చింది. వాడి టీచరు వాడి మనోస్థితిని సరిగ్గా అర్థంచేసుకున్నాడు. ఈ యాత్రా నిర్వహణలో తనకి సహాయపడవలసిందిగా ఆయన వోవ్కని అడగడం యాదృచ్ఛిక విషయం కాదు. వాడి టీచరు వోవ్కా తన స్నేహితులతోనూ, తల్లితండ్రులతోనూ జరిపే సంభాషణలను పరోక్ష ప్రభావంగా పరిగణించాడు. ఈ ప్రత్యేక సందర్భంలో వోవ్కా ఆర్గనైజరుగా వ్యవహరించాడు.

కాని టీచరు కోరుకున్నది యింత మాత్రమే కాదు. అదేమిటంటే, వోవ్కా ఉత్సాహం యితర పిల్లలకి కూడా సంక్రమించాలనీ, వాళ్లందరూ ప్రయోజనకరమైన లక్ష్యానికి దోహదం చేయాలనీ కూడా ఆయన కోరుకున్నాడు. అందుకే ఆయన వోవ్కా శక్తిని పిల్లల సమష్టి మధ్యకి మళ్లించాడు. ఈ సందర్భంలో ఆ టీచరు భావమూ, ఆ కుర్రాడి సొంత కోరికలూ సమవసించి, వాడి శక్తిని క్రియాశీలం, సంఘటితంచేసేందుకు తోడ్పడ్డాయి. సందర్భవశాత్తూ యిక్కడొక గమనార్హమైన విషయం వుంది. పరోక్ష ప్రభావాలనుంచి సత్ఫలిత సాధనకి యిదొక ప్రధాన షరతు అన్నదే అది.

మనం యీవిధంగా ఒకే చర్యను రెండు దృక్పథాలనుంచి పరిశీలించి ఒక నిర్ధారణ చేశాం. అదేమిటంటే, వివిధ పరోక్ష ప్రభావాల పద్ధతుల్లో ఏదో ఒక ప్రత్యక్ష బోధన చర్య పనిచేస్తూనే వుంటుంది. ఆ ప్రభావ పద్ధతులను నిర్లక్ష్యంచేసే హక్కు టీచరుకి లేదు. అవి తరచు అతని యిచ్ఛకు అతీతంగా, వాస్తవంగా ఉండటమే యిందుకు కారణం.

...ఆ రోజు రాత్రి వోవ్కకి చాలా సేపు నిద్ర పట్టలేదు. అలాగే, అన్నా ఇవానొవ్నాకి కూడాను. తన కొడుకు చాలా ఆలస్యంగా యింటికి వచ్చి, ఆవిడతో అన్న యీకింది మాటలు

ఆవిడకి ఆశ్చర్యంతో బాటు ఆనందం కూడా కలిగించాయి: "అమ్మా, నాకు సైకిలు వస్తుంది. నేను నా స్నేహితులందరితో బాటు ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలో పనిచెయ్య బోతున్నాను. ఇదిగో చూడు..." అంటూ పని శిబిరానికి వెళ్లబోతున్న పిల్లల జాబితా తన తల్లికి చూపించాడు వోవ్కా. ఒక వేళ తను సైకిలు కొనేందుకు తగినంత డబ్బు సంపాదించలేకపోతే, వేసవి సెలవల్లో మొదటి నెలకు తన తల్లి తన తిండికి కేటాయించిన డబ్బుతో సైకిలు కొనేందుకు తను నిశ్చయించుకున్నట్లు కూడా చెప్పాడు. "అదేలే, ఒక వేళ నేను సైకిలుకి సరిపడేటంత సంపాదించలేకపోతేనే, అనుకో" అని జోడించాడు.

అన్నా ఇవానొవ్నా తన కొడుకు తర్కానికి చకితురాలైంది. "అంతే కాదమ్మా, మొత్తం మీద, మనం పొదుపుగా గడపడం లేదు. ఉదాహరణకి, బోయెవ్ వాళ్ల కుటుంబం మన కుటుంబం కంటె పెద్దది, మనింట్లో వున్నది మనిద్దరమే, అయినా, నెలకి వాళ్ల కుటుంబంతో సమానంగా మనం ఖర్చుపెడుతున్నాం." తర్వాత వోవ్కా తన తల్లి స్వీట్సు తక్కువ కొనాలని సూచించాడు. ఇటీవల స్టాంపుల సేకరణమీద వాడి ఆసక్తి బాగా పెరిగింది. అయినా, స్టాంపులకోసం పెట్టే ఖర్చు కూడా కొంత తగ్గించవచ్చునని వాడు సూచించాడు.

డబ్బును గురించిన వాడి యీ మాటలేవీ అన్నా ఇవానొవ్నాకి నచ్చలేదు. తన కొడుకు ఒక మాదిరి పిసినారిగా తయారవుతాడేమోననీ, దానితో ప్రపంచంలోని మిగిలిన విషయాలకు వాడు దూరమవుతాడేమోననీ ఆవిడ భయపడింది. ఆవిడ యీ మాటే పైకి అనేసరికి వోవ్కా మండిపడ్డాడు: "దీనికీ పిసినిగొట్టుతనానికీ సంబంధం యేమీ లేదు. నేను చెప్పేదల్లా మనం మరింత పొదుపుగా వుండాలని మాత్రమే... నువ్వేం బెంగపెట్టుకోనక్కర్లేదు, నేనెన్నడూ పిసినిగొట్టుని కాను, సరేనా..." అన్నాడు.

...తన బతుకు ఏదో ఒక ముఖ్యమైన విషయంలో విఫలమైందని అన్నా ఇవానొవ్నా గ్రహించింది. వోవ్కాయే ఆవిడకి వున్న ఏకైక ఆనందం. తన భర్తని ఆవిడ విడిచి పదేళ్లు గడిచాయి. ఇప్పుడు తన కొడుకును ఎక్కడ కోల్పోతానో అని ఆవిడ భయపడింది. తన పని ముగిసి ఎప్పుడు యింటికి వెళ్తానా అని ఆవిడ రోజూ ఎంతో ఆత్రంగా నిరీక్షించేది. వోవ్కాని ఎప్పుడెప్పుడు చూద్దామా అని ఆవిడ యింటికి ఉరకలు పరుగులమీద వెళ్లేది. తన తల్లి అతి ఆపేక్ష వోవ్కాకి మహా యిబ్బందికరంగా వుండేది. వాడు ఆవిడ కౌగిలినుంచి విడిపించుకునేందుకు గింజుకునేవాడు. తన బుగ్గలమీద తల్లి ముద్దుల తడిని చేత్తో తుడిచేసుకునేవాడు. ఓరోజున వాడు ఉన్నట్లుండి "మనం యీ పిచ్చి ప్రేమ ప్రదర్శనలకి యింక స్వస్తిచెప్తే బాగుంటుందేమో?.." అన్నాడు. వాడి తల్లికి ప్రాణం చివుక్కుమంది. కొన్ని రోజులపాటు వాళ్లిద్దరూ ఒకరితో మరొకరు మాట్లాడుకోలేదు. వోవ్కాకి తను తప్పు చేశాననీ, క్షమార్పణ కోరాలనీ అనిపించింది. అంతకంటె కూడా, ఏ క్షమార్పణలూ గట్రా లేకుండా, వెనకటి మాదిరిగా అమ్మ ఒడిలో కూర్చుని ఆవిణ్ణి కౌగలించుకొని ముద్దు పెట్టుకుంటే మరింత మెరుగని కూడా అనిపించింది.

వాడికింకా బాగా చిన్నతనంలో అన్నా ఇవానొవ్నా "మీ అమ్మ అంటే నీ కెంత ప్రేమో చూపించరా" అంటూండేది. వోవ్కా ఆవిణ్ణి తన శక్తికొద్దీ గట్టిగా కౌగలించుకునేవాడు. దరిమిలా వాడీ "కౌగిలింతల" తంతును లాంఛనప్రాయంగా సాగించేవాడు. లేకపోతే తన సొంత అవసరాలకోసం, అంటే ఏ స్టాంపులో లేక ఐస్‌క్రీమో కొనుక్కునేందుకు పైసలు అడగవలసివచ్చినప్పుడు పైపైన కౌగలించుకునేవాడు. ఇప్పుడిక వాడీ "మమతలకు" పూర్తిగా స్వస్తిచెప్పాడు... వోవ్కా తన తల్లిని తప్పించుకు తిరగడం అంతకంతకు ఎక్కువైంది. తన తల్లి తన పుట్టిన రోజు బహుమతిగా యిచ్చిన ట్రాన్సిస్టర్ని వాడు తన స్నేహితుడికి ఇచ్చి బదులుగా ఒక స్టాంపుల ఆల్బమ్‌ని తీసుకున్న రోజున తల్లీ కొడుకుల మధ్య సంబంధాలు ప్రత్యేకించి మరింత బెడిసికొట్టాయి. అన్నా ఇవానొవ్నా "ట్రాన్సిస్టర్ ఏదిరా?" అని అడిగింది. వోవ్కా తన మార్పిడి సంగతి చెప్పాడు. ఇది ఆవిడకి కష్టం కలిగించింది. "ఇది నా సొంత వస్తువు... అసలు నువ్వు బహుమతిగా యివ్వకుండా వుండాల్సింది..." అంటూ వోవ్కా మండిపడ్డాడు. వాళ్లమ్మ కోపం అదుపులో పెట్టుకోలేక, వాణ్ణి చెంపమీద కొట్టింది...

వోవ్కాని వాళ్లమ్మ అలా చెంపకాయలు కొట్టడం యిది మొదటి సారి కాదు. ఇది వరకల్లా దెబ్బల్ని వాడు పట్టించుకునేవాడు కాడు. తను తప్పు చేశాడు, అమ్మ కొట్టింది. రెండింటికీ చెల్లు అని సరిపెట్టుకునేవాడు. కాని యీసారి వాడు చివ్వున లేచాడు. ఒకప్పుడు తన తల్లి తనకి యిచ్చిన వస్తువులన్నీ ఆవిడమీదకి విసిరేశాడు. తర్వాత తన బట్టలు ఆవిడమీదకి విసిరేశాడు. ఉడుకుబోతుతనంతోనే కాకుండా కోపంతో కంపిస్తున్న స్వరంతో "ఇదిగో తీసుకో, అన్నీ తీసేసుకో, ఇంక నువ్విచ్చేది నాకేమీ అఖ్ఖర్లేదు! అంతేకాదు, ఇంక నీకసలు కొడుకే లేడునుకో! నీ యిష్టం వచ్చిన అనాధ శరణాలయంలో నన్ను పడెయ్యి!" అన్నాడు. అంతటితో ఆగకుండా, అకస్మాత్తుగా వాడు అన్న "నేను పోయి నాన్న దగ్గర వుంటాను..." అనే మాటలు వాడి తల్లిని పూర్తిగా కదిల్చివేశాయి. తర్వాత చాలా సేపు మాటలు స్తంభించిపోయాయి. తన మాటలు గురికి సూటిగా తగిలినట్లు వోవ్కా అకస్మాత్తుగా గ్రహించాడు. వాళ్ల అమ్మ తల వాలిపోయింది. తర్వాత ఆమె తలగడమీదకి వాలి తన ముఖం కప్పుకుంది. తను తన తల్లి మనస్సును బాగా గాయపరచానని అప్పటికి వాడి బుర్రకి తట్టింది. నిజానికి వాడికి యిల్లు వదిలి వెళ్లాలన్న సంకల్పం లేదు. తన తల్లిని క్షమార్పణ కోరాలన్నదే వాడి మనస్సులో వెంటనే మెదిలిన ఆలోచన. కాని అలా చేస్తే తను యిప్పుడు సాధించుకున్నదాన్ని చేతులారా వదులుకున్నట్లు అవుతుంది. అందుకని వాడు తన తల్లి దగ్గరకు వెళ్లలేదు. ఆవిడతో మాట్లాడలేదు. క్షమార్పణ కోరలేదు. దరిమిలా అన్నీ సర్దుకున్నాయి. కాని, తన కొడుకుతో తన సంబంధాల్లో మార్పు వచ్చినట్లు అన్నా ఇవానొవ్నా గ్రహించింది. వెనక వాడు తన స్వేచ్ఛను ఉద్ఘాటించేందుకు ప్రయత్నించగా, యిప్పుడు వాడి స్వేచ్ఛా పరిధి కొన్ని సందర్భాల్లో వాడి తల్లి ప్రయోజనాలను ఢీకొనేటంతగా పెరిగింది.

తన కొడుకుతో తన సంబంధాలు ఎంతమాత్రం సరిగా లేవనీ, వాటిని చక్కదిద్దేం దుకు ఏదైనా చెయ్యాలనీ నిజానికి అన్నా ఇవానొవ్నా గ్రహించింది. అయితే అందుకు అవ సరమైన శక్తి ఆవిడకి లేకపోయింది. ఆవిడ బలహీనతలు తెలిసిన వోవ్కా వాటిని తనకి అనువుగా వినియోగించుకున్నాడు. కాల క్రమేణా వాడే అర్థంచేసుకుంటాడనీ, తన త్యాగా లను గ్రహిస్తాడనీ, తను వాడికోసమే తన జీవితం మీదుకట్టానన్న వాస్తవాన్ని వాడు తెలుసు కోకపోడనీ వాడి తల్లి సర్దిపెట్టుకుంది. వోవ్కా చదువు సంధ్యల్లో వచ్చిన మెరుగుదల కూడా ఆవిడ సంతృప్తికి కొంత కారణమైంది.

ఐదో క్లాసునాటినుంచీ వోవ్కా డ్రాయింగు అంటే ఇష్టం చూపేవాడు. వాడు ఊళ్ళోని డ్రాయింగు స్టూడియోలో చేరాడు. తమలో నిగూఢంగా వున్న ప్రతిభలను అభివృద్ధి చేసుకోవడంలో పిల్లలకి తోడ్పడే టీచరుతో తన కొడుకు స్నేహంచెయ్యడం కూడా అన్నా ఇవా నొవ్నాకి నచ్చింది. వొలోద్య జరూబిన్ మంచి స్నేహపాత్రుడనీ, అన్ని విషయాల్లోనూ ఆసక్తి చూపుతాడనీ, కొన్ని విషయాల్లో అతనికి ప్రతిభ కూడా వుందనీ వ్లదీమిర్ పెత్రో విచ్ మీటింగుల్లో పదేపదే పేర్కొన్నాడు.

ఇక్కడ మనం ఒక విషయం చెప్పుకోవాలి. వోవ్కా ఐదో క్లాసులోకి వచ్చేందుకు ముందు స్కూల్లో జరిగే పేరెంట్స్ సమావేశాలు అన్నా ఇవానొవ్నాకి ఒక మాదిరి మానసిక క్షోభకి కారణంగా వుంటూండేవి. వోవ్కాకి కాల నియతి దృష్టి, క్రమశిక్షణ, పెద్దలపట్ల గౌరవ భావం లేవని టీచరు చెప్పేందుకు మాత్రమే ఆ సమావేశాలు ఉద్దేశింపబడ్డాయేమోనని ఆవిడకి అనిపిస్తూండేది. అలాంటి సమావేశాలు జరిగినప్పుడల్లా, అన్నా ఇవానొవ్నా చివరి వరస బెంచిమీద అత్యంత అప్రియమైన వ్యాఖ్యలు వినేందుకు సిద్ధంగా యిరకాటంగా కూర్చునేది... అలాంటిది ఒక రోజున పేరెంట్స్ కమిటీ అధ్యక్షురాలుగా మరీయా అలె క్సేయెవ్నా సమావేశంలో టీచరు మాటలకి అడ్డువచ్చి, జరూబిన్ ప్రతిభావంతుడనీ, తనకి తెలిసినంతవరకు మంచి కుర్రాడనీ వ్యాఖ్యానించినప్పుడు, ఆవిడ సంతోషానికి అవధులు లేకపోయాయి. అయితే, యిది టీచరు కోపానికి మాత్రమే దారితీసింది. "నేను అతన్ని సరిదిద్దేందుకు శతవిధాల ప్రయత్నించాను. నేను మీ వాడికి నచ్చచెప్పేందుకు ప్రయత్నిం చాను. వాడి బుర్రలో ఏదో సైతాను తిష్ఠవేసినట్లుంది..." అని వోవ్కా తల్లికి వివరిం చేందుకు ప్రయత్నించింది టీచరు. అన్నా ఇవానొవ్నా మనస్సు లోలోపల టీచరు వాదనతో ఏకీభవించలేకపోయింది. ఆవిడ టీచరుకి అడ్డుతగిలి "మీరు వాణ్ణి మరింత సన్నిహితంగా ఎందుకు పరిశీలించి చూడరు? వాడి దస్తూరీ బాగుండక పోయినంత మాత్రాన కొంపలే మన్నా మునిగిపోతాయా! మీరేమీ దస్తూరీ నిపుణుడిని కాదు కదా తయారుచేస్తున్నది? వాడికి గణిత శాస్త్రంలో అభిరుచి వుందని మీరు అంటున్నారు. కాని లెక్కల్లో మీరు వాడికి యిస్తున్న మార్కులేమిటి, అన్నీ ఫేయిలు మార్కులే! మీరు చేసే యీ పని సరైనదేనా?" అంటూ తన కోపం వ్యక్తంచేయాలని ఆవిడ అనుకుంది. కాని ప్రతి సారీ ఆవిడ తనని

తాను అదుపులో పెట్టుకుంటూ వచ్చింది. చదువులో తన కొడుకు ఆసక్తి మందగించడాన్ని ఆవిడ విచారంగా గమనిస్తూ వచ్చింది. వోవ్కా తన టీచరుమీద మండిపడుతూ, ఆవిణ్ణి గురించి అసమ్మతి తెలుపుతూ, అందుకుగాను తన తల్లినుంచి అదనపు శిక్ష పొందుతూండేవాడు.

ఒక రోజున వోవ్కా కొత్త టీచరు వాళ్ల యింటికి వచ్చినప్పుడు, మళ్లీ ఏదో ములిగిందనే ఆవిడ అనుకుంది. అలాంటిది, వ్లదీమిర్ పెత్రోవిచ్ "మీకొక శుభ వార్త. మీకు అభ్యంతరం లేకపోతే, మీ అబ్బాయి సమక్షంలో మాట్లాడుతాను" అన్నప్పుడు ఆవిడ ఆశ్చర్యపోయింది. వోవ్కా గతుక్కుమన్నాడు. మొట్టమొదటి కొద్ది రోజుల్లోనే కొత్త టీచరుతో వాడు ఘర్షణ పడ్డాడు. టీచరు వచ్చీ రాగానే "మన క్లాసులో నేను కోరుకునేది నూటికి నూరు పాళ్ల క్రమశిక్షణ, తిరుగులేని క్రమ పద్ధతిని!" అని ప్రకటించాడు. ఉక్కు క్రమశిక్షణలో వోవ్కాకి నమ్మకం లేదు. అంతే కాదు, అదంటే వాడికి అసహ్యం కూడా. వాడు దీన్ని గురించి వెటకారపు వ్యాఖ్యలు చెయ్యడం మొదలుపెట్టాడు. కాని టీచరు చలించలేదు, మిగిలిన పిల్లలు వోవ్కా ధోరణిని గ్రహించి అవకతవక ప్రశ్నలు వెయ్యడం ప్రారంభించారు. వోవ్కా ఒకసారి "నాకు దృఢ సంకల్పం లేదు. నేనేదైనా పొరపాటు చెయ్యవచ్చు. నేను విశ్వసించదగినవాణ్ణి కాదనుకోండి. అదేం కర్మమో, నాకెప్పుడూ అబద్ధాలాడాలనే వుంటుంది... అలాంటప్పుడు నేనేం చెయ్యాలంటారు!" అన్నాడు. టీచరు కూడా వెటకారంగా, వోవ్కా ధోరణిని అనుసరిస్తూ "అహాఁ. అలాగటోయ్, నీకు అబద్ధాలాడటం సరదా అన్నమాట! నేనేం చేస్తానో తెలుసా, నేను మరింత పెద్ద అబద్ధాలు చెప్తాను. దానితో నీ చిన్న చిన్న అబద్ధాలు నా పెద్ద కోతల ముందు అతి సహజమైన నిజాలుగా కనిపిస్తాయి..." అన్నాడు. క్లాసులో పిల్లలందరూ గొల్లున నవ్వేశారు. టీచరు పిల్లల్ని తన వైపుకి తిప్పేసుకోగలిగాడన్న సంగతిని వోవ్కా గ్రహించాడు. వాడు గమ్మున ఉండిపోయాడు. ఈ సమస్యని మరింత సన్నిహితంగా పరిశీలిద్దామని నిర్ణయించుకున్నాడు.

సహజంగానే, టీచర్ని తన యింటి దగ్గర చూసేసరికి వోవ్కా కొంచెం కంగుతిన్నాడు. టీచరు వోవ్కా మంచి లక్షణాలను వర్ణించినప్పుడు, వాడు లోలోపల నవ్వుకున్నాడు. ఇదంతా "ఇప్పుడింక వాడి లోపాల సంగతి చూద్దాం" అనబోయే ఆయన మాటలకి భూమిక అనీ, యిదేదో బోధన శాస్త్రపరమైన కిటుకు అయివుంటుందనీ అనుకున్నాడు వోవ్కా.

వాడి నిరీక్షణ వృథాయే అయింది. క్లాసులో వోవ్కా తనతో పడ్డ ఘర్షణ గురించి సూచనప్రాయంగా సైతం పేర్కొనకుండా టీచరు తల్లి దగ్గర సెలవు తీసుకుని వెళ్లిపోవడం వాడికి కొంచెం కోపం కూడా కలిగించింది. ఆయన వెనక పరుగెత్తుకు వెళ్లి, యీ విషయం తన తల్లికి ఎందుకు చెప్పలేదని ఆయన్ని అడిగాలని సైతం వాడికి అనిపించింది. అయితే వాడు తత్తరపడి ఊరుకుండిపోయాడు.

పిల్లలను ప్రభావితం చేసే ప్రయత్నంలో వాళ్లలో మనకు కావలసిన ప్రతిచర్యను ప్రేరేపించడం మన లక్ష్యంగా వుంటుంది. మనం పిల్లలమీద మన ప్రభావ ఫలితాలను చూసేందుకు ఆత్రంగా ఎదురుచూస్తాం. వాళ్లనుంచి ఆశించే విధి నిర్వహణ విషయంలో పిల్లల ప్రతివర్తన ఎలా వుంటుందో తెలుసుకోవాలని మనం సహజంగానే అనుకుంటాం. అంతే కాదు, వాళ్ల ప్రతివర్తనల స్వభావాన్ని ముందే గ్రహించాలని కూడా మనం ఎప్పుడూ కోరుకుంటాం.

ఇందుకు పిల్లల ప్రతివర్తన ప్రతిచర్యాత్మకమైన చర్యగా వుంటుంది. ఇది చర్యే గాని సంబంధం కాదన్న విషయాన్ని నేనిక్కడ నొక్కిచెప్పదలుచుకున్నాను. ఒకానొక నిర్దిష్ట సమయంలో పిల్లల మనోస్థితికి, వైఖరులకి, సంవేదనలకి సంబంధించిన సమాచారాన్ని యిది తెలియజెయ్యడమే కాకుండా, ఈ ప్రతివర్తన ప్రభావం పెద్దలమీద కూడా వుంటుంది. అంతే కాదు, తమ టీచర్లమీద పిల్లల ప్రభావం పెద్దవాళ్ల తదుపరి ప్రత్యక్ష, పరోక్ష చర్యలకి మూలాధారంగా వుంటుంది.

పిల్లలు పెరుగుతూ, పరిణతులవుతూ వుంటారు. వాళ్ల అభివృద్ధిలో యిదొక సహజ క్రమం. మనం యీ అభివృద్ధిని ప్రభావితం చెయ్యగలమే గాని, దాన్ని ఆపుచెయ్యలేము. అందుకే యీ ప్రతిచర్యాత్మక చర్యల పరిజ్ఞానం ప్రతి టీచరుకీ కీలకమైన అవసరం. పిల్లవాడు పెరిగే కొద్దీ, మనమీద వాడి ప్రభావం కూడా నానాటికీ పెరుగుతూ వుంటుంది.

మీ పిల్లల్లో మార్పులు సంభవించినప్పుడు, అది మీ ప్రభావ ఫలితం మాత్రమే కాదు, వాళ్ళు మీ ప్రభావానికి ఏదో ఒక విధంగా ప్రతిస్పందించడం కూడా యిందుకు కారణమే. వాళ్లలో మార్పుకి మనం కాక, తమ అభివృద్ధిలో తగిన సర్దుబాట్లు చేసుకున్న వాళ్లే స్వయంగా అందుకు కారణం. ఈ అంశాన్ని దృష్టిలోకి తీసుకోకపోతే, విద్యాబోధన కేవలం శిక్షణా, సారాంశంలో దాష్టీకమూ అవుతుంది. పిల్లల ప్రవర్తన కేవలం బాహ్యమైనదై, పిల్లల అసలైన అభిప్రాయాలనూ, విశ్వాసాలనూ ప్రతిబింబించదు.

సర్వసాధారణంగా తల్లిదండ్రుల నైతిక స్వభావానికీ వాళ్ల పిల్లల స్వభావానికీ మధ్య ప్రత్యక్ష సంబంధం వుంటుందని తలచబడుతూ వుంటుంది. తల్లిదండ్రులు దురాశాపరులో లేక దుబారాచేసేవాళ్లో, క్రూరులో లేక దయాపరులో, చిత్తశుద్ధి కలవాళ్లో లేక కృత్రిములో అయినప్పుడు, వాళ్ల యీ గుణాలే వాళ్ల పిల్లల్లో వృద్ధిచెందుతాయి. అయితే, యిందుకు సరిగా తలకిందులుగా కూడా సంభవించవచ్చు. అకస్మాత్తుగా పిల్లలు తమ తల్లిదండ్రులకి భిన్నంగా మారి, సరిగ్గా వ్యతిరేకమైన గుణాలు పెంపొందించుకోవచ్చు.

తల్లిదండ్రులు ప్రత్యేకమైన కొన్ని ధోరణులనూ, అలవాట్లనూ విశేషంగా ప్రోత్సహించే కుటుంబాల్లో ఇది అతి తరచుగా సంభవిస్తూ వుంటుంది. ఈ ప్రయత్నాలు పిల్లల ఇష్టాలకు భిన్నంగా వుండే సందర్భాల్లో ఆవి సామాన్యంగా వ్యతిరేక ఫలితాలను యిస్తాం

టాయి. పిల్లలు తమ తల్లితండ్రుల తక్షణ డిమాండ్లను తప్పించుకునేందుకు తాము చెయ్యగలిగినదంతా చేస్తారు. అలాంటి డిమాండ్లు వాళ్లలో ఒకరకమైన అసహ్యాన్ని సైతం కలిగించవచ్చు. అప్పుడిక వాళ్లు తమ తల్లితండ్రులు తమనుంచి ఆశించే ఆచరణ క్రమానికి పూర్తి తలకిందులైనదాన్ని అనుసరించ ప్రయత్నిస్తారు. కోస్త్య బోయెవ్ విషయంలో సరిగ్గా యిదే జరిగింది. వాడు తన తండ్రి యిచ్ఛలను ప్రత్యక్షంగా, బాహాటంగా వ్యతిరేకించలేదు, కాని వాడు లోలోపల తను తన తండ్రిలా ఉండబోనని ఎన్నడో నిర్ణయించుకున్నాడు. తను తన కుటుంబపు జీవిత విధానాన్ని పునఃపరిశీలించి, తన సొంత జీవితపు ఆదర్శాలకు భిన్నమైనదాన్నింతనీ తిరస్కరించాలని వాడు తీర్మానించుకున్నాడు. వాడి యీ ఆదర్శాలు యింకా అస్పష్టంగా వుండవచ్చు. అయితేనేం, వాటిలో ఆస్తి సంపాదన కేంద్రితమైన నైతిక సూత్రాల గట్టి తిరస్కారణ యిమిడి వుంది.

ఒకసారి పిల్లలు ఒక ప్రశ్నావళికి సమాధానాలు రాయవలసివచ్చింది. "నీ తల్లితండ్రుల దృక్పథంతో నువ్వు ఏకీభవించలేని అంశాలు ఏమిటి?", "నీ తల్లితండ్రులను ఏయే విషయాల్లో అనుకరించాలని నువ్వు కోరుతావు?" అన్న ప్రశ్నలకు కోస్త్య యిలా సమాధానం యిచ్చాడు: "నా తండ్రికి అపరిమితమైన ఆస్తి సంపాదన కాంక్ష వుంది. ఆయనకి డబ్బు సంపాదనే సర్వస్వం. ఆయన పైసాపైసా లెక్క పెడతాడు. డబ్బంటే అసహ్యపడే వాళ్లతో ఆయన తీవ్రంగా వాదిస్తాడు. నాకు డబ్బంటే అసహ్యం. ఆస్తి మనుషుల మధ్య అడ్డుగోడలు సృష్టిస్తుందని నా ఉద్దేశం." తన తండ్రి కోరినట్లు వాడు ఎన్నడూ ఆశపరుడు, "వ్యాపారి" కాడనడం స్పష్టం. భౌతిక వస్తువులమీద బోయెవ్ కుటుంబంలో వున్న ఆరాధనా భావం కోస్త్యలో డబ్బు ధారాళంగా ఖర్చుపెట్టాలన్న తిరుగుబాటు భావాన్ని పెంపొందించింది.

ఇందుకు భిన్నంగా అన్నా ఇవానొవ్నా జరూబినా స్వభావరీత్యా ధారాళంగా ఖర్చుపెట్టే వ్యక్తి. ఆవిడ ముందువెనకలు ఆలోచించకుండా డబ్బు ఖర్చుపెడుతుంది. ఆవిడ తన కొడుకును కూడా అదే మాదిరిగా పెంచాలని కోరుకుంది. కాని వాడు ఉన్నట్లుండి పొదుపరిగా తయారయ్యాడు. వాడెక్కడ పిసినిగొట్టూ, ఆశపోతూ అవుతాడో అని ఆవిడ భయపడింది. వాడికి యీ లక్షణం ఎక్కణ్ణుంచి వచ్చిందో ఆవిడ ఊహించుకోలేకపోయింది.

వీన్నిక్‌ల కుటుంబంలో పిల్లల పెంపకం పద్ధతి తమ కొడుకును చక్కటి హేతుబద్ధమైన వ్యక్తిగా తయారుచేసేలా రూపొందించబడింది. ఏడో క్లాసుదాకా యీర జీవితం రైలు పట్టాలమీద లాగ సాఫీగా సాగిపోయింది. మనం యింతకు ముందే చూసినట్లు, తన కొడుకు పరిచిత మార్గంనుంచి తప్పుకోగానే, ఎక్కడ నిస్సహాయుడవుతాడోనని వాడి తల్లి భయపడుతూ వచ్చింది. అయితే, ఏడో క్లాసులోకి వచ్చేసరికే తన కొడుకు తను ఎంపిక చేసిన మార్గాన్ని తిరస్కరించి, తన సొంత పంథాను రూపొందించుకొంటున్నట్లు ఆవిడ గమనించింది.

వాడు వెనకటి లాగే శుభ్రంగా, కార్యతత్పరుడుగా, నియతంగానే వుంటున్నాడు, కాని వెనకటి లాగ తన తల్లి మాటలను గుడ్డిగా అనుసరించడం మానేశాడు. అందుకు బదులు తను ఏది మరింత ముఖ్యం, ఉపయోగకరం అనుకుంటే అది చేస్తున్నాడు. తన తల్లి కోరుకున్నట్లు శాస్త్రీయ సంగీతంపట్ల కాక సుగమ సంగీతంమీద, సీరియస్ సాహిత్యం పట్ల కాక సరళ వైజ్ఞానిక సాహిత్యంపట్ల, టెన్నిస్‌మీదా, వాలీబాల్‌మీదా కాక బాక్సింగ్ మీద వాడు యిష్టం చూపసాగాడు. వాడు తన తల్లి సలహాను పాటించడం యిప్పుడు ఆవిడకేదో మెహర్బానీ చేస్తున్నట్లు పాటిస్తున్నాడు.

ఇదంతా మరీయా అలెక్సేయెవ్నాకి సంతోషం కలిగించి వుంటుందన్నట్లు కనిపించవచ్చు. తన కొడుకు వోవ్కా జరూబిన్‌తో స్నేహం చెయ్యాలని కోరుకున్నప్పుడు ఆవిడ మనస్సులో కోరుకున్నది యిదే కదా? అయితే విద్యా క్రమంలో స్వేచ్ఛను సంతరించుకున్న



పిల్లలు తమ సొంత పంథాను అనుసరించడం తరచు జరుగుతుంది. మనకి నచ్చినా నచ్చక పోయినా వాళ్ళు మన బోధన ప్రభావాలకు దోహదం చేస్తారు. వాళ్ళు పెరిగే కొద్దీ, వాళ్ల పట్ల మన వైఖరిని సరిదిద్దుకోక తప్పని అనివార్య పరిస్థితిని వాళ్ళు మనకి కల్పిస్తారు.

పిల్లలు పెద్దవాళ్లని యిలా ప్రభావితం చెయ్యడమన్నది ఒక సాధారణ సూత్రం. ఆ సాధారణ సూత్రాన్ని నిర్లక్ష్యం చెయ్యడం, దాని వస్తుపర స్వభావాన్ని గుర్తించడంలో విఫలమవడం సామాన్యంగా ఘర్షణలకు, తల్లితండ్రుల పెత్తనం తగ్గేందుకు దారి తీస్తుంది. దీనికి ఒకే ఒక పరిష్కార మార్గం వుండగలదు. పిల్లలకు వాళ్ల యిష్టాయిష్టలకు, వాళ్ల సామర్థ్యాలకు అనుగుణంగా వాళ్ల మార్గాన్ని వాళ్ళు ఎంచుకునే హక్కు కల్పించడమే అది.

తల్లితండ్రులు తమ పిల్లల ప్రయత్నాలను, యిష్టాయిష్టాలను పరిగణనలోకి తీసుకోకుండా, వాళ్ల మానసిక స్థితులను నిర్లక్ష్యం చేస్తే కలగగల పరిణామాలను యీకింది రెండు సన్నివేశాలు స్పష్టంచేస్తాయి.

మరీయా అలెక్సేయెవ్నా తన కొడుకు గాలిలో ఆచి తూచి చటుక్కున కొడుతున్న ముష్టి ఘాతాలను చూసి కంపించింది. బాక్సర్లు యీ దెబ్బలను "నీడతో కుస్తీ" అంటారని ఆవిడ జ్ఞాపకం చేసుకుంది. చెమటతో నిండిన యూర ముఖంమీద అలా దెబ్బ కొట్టిన ప్రతిసారీ విషపూరిత దరహాసం మెదులుతున్నట్లు ఆవిడకి అనిపించింది. వాడి నడక తీరే భిన్నంగా తయారైంది. వాడి చేతులు యిప్పుడు కొంచెం పైకి లేచి వుంటున్నాయి. వాడి భుజాలు నిరంతరం కదులుతున్నాయి. వాడి తల మొండెంలోకి కుదింపబడినట్లు వుంది. ఒక రోజున ఆవిడ "యూరా, నీ బాక్సింగుతో సంగీతం, రేడియో క్లబ్బు వంటి ఇతర వ్యాపకాలన్నీ మూలపడ్డాయి. నువ్వు పొరపాటు చేస్తున్నావేమో అనిపించడం లేదూ నీకు?.." అంది. ఆవిడ కొడుకు తల జాడించి "అమ్మా, నాకు బాక్సింగు యిప్పుడు ఎంత ముఖ్యమైనదో నువ్వు ఊహించుకోలేవు..." అన్నాడు. వాడీ సంగతి ఎంతో ఉత్సాహంగా చెప్పాడు. "అమ్మా, నీకు తెలుసా, నేను చేసే అన్ని పనుల్లోనూ నేను బలంగా, స్వతంత్రంగా ఉండాలనీ, ఎవరన్నా భయపడకూడదనీ కోరుకుంటున్నాను. బాక్సింగు నాకు చేసే మేలు యిదే. స్కూల్లో ప్రతి ఒక్కడూ నామీద కాలు దువ్వడంతో నా ప్రాణం విసుగెత్తి పోయింది. నేనింక యిది ఎంతమాత్రం సహించలేను. వాళ్ల కంటె నేను బలమైనవాడినన్న సంగతి వాళ్లకి నేను నిరూపిస్తాను..." అన్న వాడి మాటలు ఆవిణ్ణి చకితురాలిని చేశాయి.



బల్రప్రయోగంతో ఎవరినీ ఒప్పించలేరని వివరించేందుకు యూర తల్లి ప్రయత్నించింది. కాని వాడు, నాకు తెలుసులే అన్నట్లు నవ్వి, "ఒప్పించకపోవడమేమిటి, మహా చక్కగా ఒప్పిస్తాను!" అని జవాబిచ్చాడు.

సంగీతం టీచరు యింటికి వచ్చి యూరని గురించి ఫిర్యాదు చేసిన రోజున గొడవ జరిగింది. యూర సంగీతం క్లాసులు మధ్య మధ్య ఎగగొట్టడమే కాకుండా, కచ్చేరీని కూడా విచ్ఛిన్నం చేశాడని బయటపడింది. బాక్సింగులో వేలు విరుచుకుని, వాడు వాయిద్యం వాయించలేకపోయాడు. సంగీతానికి మిగతావాటితో పొసగదనీ, ముఖ్యంగా తమని తామూ, యితరులనీ కాళ్ళూ వేళ్ళూ విరగ్గొట్టుకునే బాక్సింగుతో అసలే పొసగదనీ, తల్లితండ్రులు వీటిలో తమకి ఏది కావాలో నిర్ణయించుకోవాలనీ సంగీతం టీచరు నిక్కచ్చిగా తేల్చిచెప్పింది.

యూర తండ్రి సంగీతం టీచరుతో యూర క్రీడల శిక్షణాలయానికి యింక హాజరు కాడని చెప్పాడు. తను మహా మేలు చేసినట్లు ఉప్పొంగిపోతూ సంగీతం టీచరు వెళ్ళిపోయింది. యూర తండ్రి తన కొడుకుమీద విరుచుకు పడ్డాడు. అయితే యూర, తను బాక్సింగు వదిలే ప్రసక్తే లేదనీ, తను త్వరలోనే బాక్సింగు పోటీలో పాల్గొనబోతున్నాననీ, ఎనిమిదేళ్ల తర్వాత తనకి యిప్పుడు సంగీతమంటే తీవ్రమైన అసహ్యం పుట్టిందనీ తాపీగా చెప్పాడు. వాడి తండ్రి కిటికీ తెరిచి, వాడి గ్లౌవ్‌లనూ, బాక్సింగుకి సంబంధించిన యితర సామాన్లనూ, బాక్సింగును గురించిన పుస్తకాలనూ అవతలకి విసిరేశాడు.

తండ్రి బయటకి వెళ్ళాక తల్లి తన కొడుకుతో "నేను నీ స్థానంలో వుంటే, మీ నాన్నని యీ స్థితికి తెచ్చి వుండేదాన్ని కాను" అంది. యూర ఆవిడ మాటలు పట్టించుకోలేదు. వాడు పెరట్లోకి పరుగెత్తుకెళ్ళి తన బాక్సింగు సామగ్రిని ఏరుకుని, తిరిగి వాటిని యథా స్థానంలో పెట్టాడు. అదుగో అప్పుడు అర్థంచేసుకుంది వాళ్ల అమ్మ, తన కొడుకు ఆరు నూరైనా, నూరు ఆరైనా బాక్సింగు మానబోడని.

మరో సందర్భం. ల్యోష్క తల్లి తను మళ్లీ స్కూలుకి వస్తానంది. అప్పుడు వాడు "నువ్విలా నన్ను యిబ్బందిలో పెడితే, నేను చదువు మానేస్తాను" అని దృఢంగా చెప్పాడు. దానికి పూర్వరంగం ఏమిటో చూద్దాం.

ల్యోష్క మిరోనొవ్ తల్లితండ్రుల్ని ఒక క్లాసు సమావేశానికి పిలవనంపారు. ల్యోష్క వాడి స్నేహితుల్లో ఒకడితో దెబ్బలాడుతున్నాడు. ల్యోష్క తండ్రి వచ్చీ రాగానే "ఈ గొడవ మీరెలా సాగనిచ్చారు?.." అంటూ దాడి మొదలుపెట్టాడు. సరిగా ఆ ఘట్టంలో వాళ్లమ్మ లోపలకి వచ్చి "ఏం జరిగిందిరా ల్యోషా? పోట్లాట నువ్వు మొదలెట్టలేదు కదా?" అంది. (క్లాసులో అందరూ ఘొల్లున నవ్వారు.) ల్యోష్క "నేనే మొదలెట్టాను..." అన్నాడు. వాడి తల్లి పిల్లలకేసి తిరిగి "ఎందుకు, మీరు పళ్లికిలిస్తున్నారు? ముందుంది చాలా జీవితం. జీవితంలో ఎవళ్లు ప్రయోజకులవుతారో యిప్పుడు చెప్పలేరు. ఒరే ల్యోషా, నువ్వు పెద్దాడివయ్యాక వీళ్లెవళ్లతోనూ మాట్లాడనైనా మాట్లాడకురా" అంది.

స్కూలు పిల్లలకి యీ తమాషా మంచి రంజుగా అనిపించింది. టీచరు తల్లితండ్రుల్ని పిలిచినందుకు విచారపడ్డాడు. ల్యోష్క తల్లిని బయటకి పంపేందుకు ఆయన చేసిన ప్రయత్నం విఫలమైంది. ల్యోష్కకి యిబ్బందిగా అనిపించి, క్లాసు గదిలోంచి బయటకి దూసుకు పోయాడు.

పిల్లలనుంచి పెద్దలు డిమాండుచేసే విషయాల్లో సుసంగతత్వం వుండాలనీ, ఫలవంతమైన పెంపకానికి అదొక ముఖ్య షరతు అనీ అనుకొంటూ వుంటారు. తల్లితండ్రులూ, టీచర్లూ తమ నిర్ణీత ప్రమాణాలు అమలు జరిగేలా పట్టుపట్టాలనీ, దాంట్లో ఏ మాత్రం సడలింపు వున్నా నష్టం వాటిల్లుతుందనీ నొక్కి చెప్తూ వుంటారు. ఇది పూర్తి నిజం కాదు. విద్యా క్రమం గతిబద్ధమైనది. దాంట్లో పట్టువిడుపులు వుండాలి, ఈ క్రమంలో ముందుకి పోవడమే గాక మధ్యమధ్య వెనక్కి తగ్గడం అనివార్యం. తమ పిల్లలను ప్రభావితంచేసే పద్ధతిని మార్చడం వల్ల గాని, పిల్లల ముందు తమ పొరపాట్లను ఒప్పుకోవడం వల్ల గాని పెద్దవాళ్లు తమ ప్రతిష్ఠను కోల్పోరు. అయితే యిది అంత తేలికైన విషయం కాదనుకోండి. ఎందుకంటే, అప్పుడప్పుడు మనం పిల్లల్లో లేని పొరపాట్లనూ, లోపాలనూ వెతికేందుకు ప్రయత్నిస్తూ వుంటాం. మధ్యమధ్య మనం మన పిల్లల్లోని సద్గుణాలను సైతం లోపాలుగా వ్యాఖ్యానించి, వాటిని ఖండిస్తూ వుంటాం.

రెండు కుటుంబాల — వీస్నిక్‌లు, బోయెవ్‌లు — తీసుకుందాం. ఈ రెండు కుటుంబాలూ తమతమ పిల్లల పెంపకంలో రెండు భిన్న పద్ధతులు అవలంబించాయి. అయితే యీ రెండు కుటుంబాల్లోనూ తల్లితండ్రులు కార్యదీక్షకి, చదువుపట్ల సీరియస్ దృక్పథానికీ ప్రాధాన్యత ఇచ్చారు. ఈ రెండు కుటుంబాలూ పిల్లల పెంపకంలో జయప్రదమయ్యాయి. వాళ్ల పిల్లలు పట్టుదల కలిగినవాళ్లుగా, చురుకైనవాళ్లుగా, పరిశ్రమశీలురుగా తయారయ్యారు. అయితే, ఆ పిల్లల శక్త్యుత్సాహాలు వాళ్ల తల్లితండ్రుల యిష్టాయిష్టాలకు కాక, వాళ్ల సొంత యిష్టాయిష్టాలకు అనువుగా మళ్లింపబడ్డప్పుడే ఘర్షణలు వృద్ధి చెందాయి.

వీస్నిక్ కుటుంబం సాధించిన ఫలితాలు మరో సారి చూద్దాం.

యూర రోజురోజుకీ ప్రగతి సాధిస్తున్నాడు. ఇది వాడి తల్లితండ్రులకి సంతోషదాయకం అయింది. వోవ్క జరూబిన్ స్వతంత్ర ప్రవృత్తిని తన తల్లి ఎంతగా మెచ్చుకున్నప్పటికీ తనంటేనే తన తల్లికి ఎక్కువ ఇష్టమని వాడు గ్రహించాడు. మొత్తంమీద వాడి టీచర్లేమిటి, ఇరుగుపొరుగు వాళ్లేమిటి, కుటుంబ మిత్రులేమిటి అందరూ వాణ్ణి మెచ్చుకుంటున్నారు. కాని యితర పిల్లల మధ్య వున్నప్పుడు పరిస్థితులు కొన్ని సందర్భాల్లో కష్టంగా వుంటున్నాయి. అక్కడ ఎంత బలంగా వున్నావన్నదానికి ప్రాముఖ్యం వుంటోంది. నీ వాదం సరైనదని నిరూపించేందుకు బలప్రయోగాన్ని సాధనంగా చేసుకోవడం పరమ

దౌర్భాగ్యమని యూర తల్లి ఎన్నో సార్లు చెప్పినప్పటికీ, వాడికి మాత్రం తన బలహీనత ఒక గుదిబండగా కనిపిస్తూనే వుంది. ఏదో ఒక రోజున తను బలవంతుడు కావాలని వాడు కలలు కంటూనే వున్నాడు. వాడు పై క్లాసుల్లోని పిల్లలను పరిశీలనగా గమనిస్తూండేవాడు. అక్కడా వున్నారు మెరికల్లాంటి విద్యార్థులు. వీత్య జీల్చికొవ్ అంటే యూరకి ప్రత్యేకమైన ఇష్టం ఏర్పడింది. వాడి ఫొటోలు క్రీడల స్టాండుమీదా, కొమ్సొమోల్ ప్రకటన స్టాండుమీదా కనిపిస్తూండేవి. వీటన్నింటి కంటె ముఖ్యం ఏమిటంటే, ఎవళ్ళూ, చివరకి "అధికారికంగా" రౌడీలుగా పరిగణింపబడేవాళ్ళు సైతం అతని జోలికి పోయేందుకు సాహసించేవాళ్ళు కారు. మంచి ఆరోగ్యంగా, బలంగా, సదా సంతోషంగా వుండే ఆ కుర్రాడంటే చిన్న పిల్లలు కూడా యిష్టపడుతూండేవాళ్ళు. అతను వాళ్ళకెప్పుడూ అండగా వుండి వాళ్ళకి రక్షణ కల్పిస్తూండేవాడు. యూర వీన్నిక్ అదిగో ఆ జీల్చికొవ్‌లా వుండాలని కలలు కంటూండేవాడు. ఈ కోరిక సహజమైనదే కాక సహేతుకమైనది కూడా. మరైతే తల్లితండ్రులకి తమ యిచ్ఛనే కొడుకుమీద రుద్దే హక్కు వుండాలా? బహుశా వుండకూడదు. కొద్ది కాలం పాటు దీని మూలంగా కుర్రాడు పెద్దవాళ్ళు నిర్ణయించిన కర్తవ్యాలనుంచి కొంచెం పక్కకి మళ్ళినప్పటికీ, యివి వాళ్ళ అభిరుచులకీ, అభిప్రాయాలకీ భిన్నమైనప్పటికీ యీ హక్కు వాళ్ళకి వుండకూడదని అనుకుంటాను. పిల్లల ఆసక్తులు, అభిప్రాయాలు సాంఘిక వ్యతిరేకమైనవి కాకపోతే, వాటిని పరిగణనలోకి తీసుకోవాలి.

యూర కొన్ని స్కూలు పాఠ్యాంశాలపట్ల కూడా యింత శ్రద్ధా చూపించి వుంటే, బహుశా యీ ఘర్షణ తలెత్తి వుండకపోనేమో. కాని పిల్లల జీవితంలో స్కూలు పాఠ్యాంశాలు ఒక్కటే కాదు ముఖ్యం. వాళ్ళ అభివృద్ధి బహుముఖమైనది. మానసికంగా మాత్రమే కాకుండా, నైతికంగా, శారీరకంగా కూడా అవిభాజ్య వ్యక్తులుగా వాళ్ళు అభివృద్ధిచెందుతూ వుంటారు. మనిషిని వ్యక్తిగా నిర్వచించేదీ, తీర్చిదిద్దేదీ సరిగ్గా యిదే.

తల్లితండ్రులు యీ విషయాన్ని అర్థంచేసుకోక, జీవితంపట్ల తమ అభిప్రాయాలకే కట్టుబడి వ్యవహరిస్తే, వాళ్ళ పిల్లలతో ఘర్షణ అనివార్యమవుతుంది. అలాంటి కుటుంబాల్లోని పిల్లలు తామెప్పుడు పెద్దవాళ్ళమవుతామా, తమ తల్లితండ్రుల ఇల్లు విడిచి ఎప్పుడు బయటకి పోయి, తాము కోరుకున్నట్లు స్వేచ్ఛగా ఎప్పుడు బతుకుతామా అని ఆతృతగా ఎదురుతెన్నులు చూస్తూ వుంటారు.

కౌమార వయస్కుల్లో ఇష్టాలు ఎంత త్వరత్వరగా మారిపోతూ వుంటాయో కూడా జ్ఞాపకంవుంచుకొంటే, వాళ్ళ తల్లితండ్రుల ఆదుర్దా ఎంత అనుచితమైనదో బోధపడుతుంది. పిల్లలు తాము చాలా ఏళ్ళ పాటు అభ్యసించినవాటిని అంత తేలిగ్గా వదలలేరు కనుక తల్లితండ్రుల యీ ఆదుర్దా ప్రత్యేకించి అనుచితమైనది. కుర్రాడికి సంగీతం ఒకప్పుడు సంతోషం కలిగించి వుంటే, వాడు తిరిగి సంగీతానికి ఎప్పుడో ఒకప్పుడు వచ్చేతీరుతాడు. ఇందుకు భిన్నంగా, సంగీతం వాడికి భారప్రాయమే అయితే, వాడిని యీ విషయంలో

ఒత్తిడి చేయడం సమంజసమేనా అని కొంచెం ప్రస్తావించాల్సి వుంటుంది.

ఈ సందర్భంలో యూర వీన్నిక్ తల్లితండ్రులు తమ అభిరుచులచేతనే గాక, బాహ్య ప్రభావాలచేత కూడా ప్రభావితులై పొరపాటు, తొందరపాటు నిర్ణయం తీసుకున్నారు. అయితే, మరీయా అలెక్సేయెవ్నా త్వరలోనే తన పొరపాటును అర్థంచేసుకుంది.

కౌమార వయస్కులను గురించి బోలెడు రచనలు వెలువడ్డాయి. ఈ వయస్సు క్లిష్టమైనదిగా పరిగణింపబడుతూ వుంటుంది. పిల్లవాడి స్వల్ప జీవిత కాలంలో సంచితమైనది సమస్తం యీ వయస్సులో ఒక్క మారుగా సజీవమై, వాడి కార్యకలాపాల్లోనూ, బాహ్య ప్రపంచంతో వాడి సంబంధాల్లోనూ తీవ్రంగా వ్యక్తమవుతుంది. ఎ. మకారెంకొ "భావోద్వేగం రీత్యా, ప్రగాఢమైన భావ ముద్రలకు అభిముఖ్యం రీత్యా, తన యిచ్ఛా స్వచ్ఛతా సౌందర్యాల రీత్యా పిల్లల జీవితం పెద్దవాళ్ల జీవితం కంటె సాటిలేనంత సంపన్నమైనది. కాగా, దాని వైవిధ్యాలు ఎంత మహత్తరమైనవో అంత ప్రమాదకరమైనవి"* అని అన్నప్పుడు, ఆయన మనస్సులో వున్నది బహుశా కౌమార వయస్సుని గురించే అయివుంటుంది. చిన్న పిల్లలు సామాన్యంగా తమ భావాలను, ఆదుర్దాలను తమ బాహ్య ప్రవర్తనలో వ్యక్తంచేసి, చాలా విషయాలను కిమ్మనకుండా ఆమోదిస్తూ, తేలిగ్గా పెద్దల ఆదేశాలను మన్నిస్తూ వుంటారు. కాగా కౌమార వయస్కులు పరమ నిక్కచ్చిగా, ఇతరులు తమ మాట చెల్లించాలని పట్టుపట్టుతూ, స్వేచ్ఛకోసం అన్వేషిస్తూ వుంటారు. తుపానుప్రాయమైన యీ వయస్సు కొద్ది సంవత్సరాల పాటు వుండి, భావోద్వేగాలమీద హేతుజ్ఞానం ప్రబలం కాసాగే తరుణ వయస్సులో మాత్రమే సర్దుకోనారంభిస్తుంది. తరుణ వయస్కులు కౌమార వయస్కుల కంటె మరింత శాంతంగా వుంటారని తరచు వింటూ వుంటాం. బహుశా యిది బాహ్య ప్రశాంతి కావచ్చు. తరుణ వయస్కులు బాగా అంతర్ముఖులు అవుతారు. మనసు లోతుల్లో వాళ్ళ సంక్షుభితులై వుంటారు.

కౌమార వయస్సు తొలి సంవత్సరాల్లో పిల్లలు తమ సత్తాను పరీక్షించుకోవాలని తహతహలాడుతూ వుంటారు. స్వతంత్రమైన యీ తొలి అడుగుల వల్ల వాళ్లకి చేకూరే ఆనం దాన్ని వాళ్లకి కొరవడకుండా చూడటం అతి ముఖ్యం. జీవిత సమస్యల ముందు వాళ్ళ తమని తాము పరీక్షించుకోవడంలో తోడ్పడటం, తమ ప్రతిఘటనను అధిగమించడం, తమ జ్ఞానాన్నీ, అనుభవాన్నీ అన్వయించడం ముఖ్యం.

ఆ వయస్సులో వాళ్ల అభివృద్ధి ఆకస్మికంగా చాలా వేగం పుంజుకొంటుందేమో, మన పెద్దవాళ్లం వాళ్లని గురించిన అంచనాలో నిరంతరాయంగా వెనకపడుతూ వుంటాం.

---

* A. Makarenko, *A Book for Parents*, Foreign Languages Publishing House, Moscow, 1955, p. 258.

పిల్లలు తమపట్ల తమ పెద్దల వైఖరి పూర్తి భిన్నంగా వుండాలని కోరుతూ వుండగా తల్లితండ్రులు వాళ్లని అలవాటు ప్రకారం యింకా పిల్ల ల్లాగే చూస్తూ వుంటారు. కొద్ది నెలల క్రితం వాళ్లకి సరిగ్గా సరిపోయిన దుస్తులు యీనాడు వాళ్లకి బిగుతై ఉతు కుష్టంగా వుంటాయి.

పెద్దవాళ్లకీ పిల్లలకీ మధ్య సంబంధాల స్వభావం కొంతమేరకు ఆ వయస్సులోనే స్థిరపడతాయి. పిల్లలకీ తల్లితండ్రులకీ మధ్య సంబంధాలు మైత్రీపూర్వకంగా ఉంటాయా లేక వాళ్ల మధ్య ఉభయత్రా బాధాకరమైన ఒక మాదిరి ఎడబాటు పొడచూపుతుందా అన్నది ఆ వయస్సులోనే స్పష్టపడుతుంది.

వాస్తవానికి కౌమార వయస్కుడు తనపట్ల ఒక భిన్నమైన వైఖరిని ఆశిస్తాడు. తనకి సాధ్యమైనంత ఎక్కువ స్వేచ్ఛ యివ్వాలనీ, తన యిష్టంవచ్చినట్లు తనని వ్యవహరించనివ్వాలనీ వాడు జిద్దుచేస్తాడు. ప్రతి ఒక్క సందర్భంలోనూ తన వ్యక్తిత్వాన్ని ఖాయపరచుకోవాలని ప్రయత్నిస్తాడు. వాడు ఉద్దేశపూర్వకంగానో అనుద్దేశపూర్వకంగానో చిన్నచిన్న స్వేచ్ఛా ప్రాంతాలను జయిస్తూ వుంటాడు. తన అభిప్రాయాలను యితరులు పరిగణనలోకి తీసుకుంటారనీ, వాళ్లు తన ఆంతరిక ప్రపంచాన్ని సగౌరవంగా చూస్తారనీ అనుకోగలగడం వాడికి అవసరం.

ఈ వయస్సులో వాడి ఆత్మాభిమానం దానికి ఏమాత్రం దెబ్బతగిలినా వాడు సహించుకోలేనంత తీక్ష్ణంగా వుంటుంది. ఒకటి రెండేళ్ల క్రితం మనస్సుకి ఏవైనా గాయాలు తగిలినా అవి త్వరలో విస్మరింపబడుతూ వుండగా, యిప్పుడవి ప్రగాఢమైన ముద్రలు వేస్తాయి. ఆత్మరక్షణ విషయంలో యిప్పుడు వాడు ఎంతకైనా తెగించేందుకు సిద్ధంగా వుంటాడు.

అయితే మన పెద్దవాళ్లం కూడా యిలాంటి తాత్కాలిక ధోరణులను ఏవో లోపాలుగా కాక, సానుకూల అంశంగా చూసేందుకు సిద్ధంగానే వుంటాం. కాని వాస్తవంలో ఏం జరుగుతుంది? కౌమార వయస్కులు తమ దృక్పథాలను సమర్థించుకోవడంలో చూపే తీవ్రమైన పట్టుదలా, తమ ఆవేశాన్ని అదుపులో పెట్టుకోలేకపోవడమూ తరచు అప్రియ సన్నివేశాలకు దారితీస్తూ వుంటుంది. ఆ వయస్సులో భావోద్వేగాలు సాధారణంగా హేతుజ్ఞానంమీద పైచెయ్యి కలిగివుంటాయని మనం యింతకు ముందు చూశాం. తమ అవసరాలను శాంతంగా, స్పష్టంగా వ్యక్తంచేయగలిగిన శక్తి తరుణ కౌమార వయస్కులకి యింకా వుండదు. వాళ్లు ఉద్రేకాల తుపానులో కొట్టుకుపోతూ వుంటారు. వాళ్లు ఉన్న విషయాన్ని ఉన్నట్లు చెప్పాలని అనుకుంటారు గాని అందుకు బదులు వాళ్ల మాటలు మొరటుగా తయారవుతాయి. లేకపోతే వాళ్లు చేసే జిద్దు పెంకెతనంగా, ఔచిత్యరహితంగా పరిణమిస్తుంది. అతి సామాన్యమైన అభిప్రాయభేదం సైతం వాళ్లు "భగ్గున మండి పడేందుకు" దారితీయగలుగుతుంది. ఇవన్నీ కలసి అటు పిల్లలకీ, యిటు పెద్దలకీ కూడా క్షోభ కలిగిస్తాయి.

అలాంటి "ప్రజ్వలన" సమయంలో మీరు ఊరుకొన ప్రయత్నించండి. తర్వాత "యిప్ప డింక యీ విషయం కొంచెం ప్రశాంతంగా పరిశీలిద్దాం" అని మీరు అనవచ్చు. లేకపోతే ఒంటరిగా ఉండేందుకు వాడికి అవకాశం కల్పించండి. వాడు తన "ప్రజ్వలన" విషయంలో యిబ్బంది పడుతూ వుండటం, తన ఆలోచనలనూ, భావాలనూ మరింత మెరుగ్గా వ్యక్తం చేసేందుకు తంటాలుపడుతూ వుండటం మీరు గమనిస్తారు.

ఇలా చేయ్, అలా చేయ్ అని శాసించడం తేలిక. "నేనిప్పుడిలా వీడి తిక్క వేషాలన్నీ సాగనిస్తే, యిది చివరకి ఎక్కడకి దారితీస్తుంది? ఊహుఁ, అదేం కుదరదు. ఇంట్లో నాదే పెత్తనమనీ, వాడింకా కుర్ర సన్నాసేననీ వాడు గుర్తించేలా చెయ్యాలి," వగైరా మీ మన సుల్లో మెదిలినప్పుడు మీరు ఊరుకోవడం అంత తేలిక కాదనుకోండి.

కౌమార వయస్కులకి కొన్ని విశిష్ట లక్షణాలు వుంటాయి. నిజానికి ఆ లక్షణాలమీద వాళ్ల ప్రత్యేక ప్రభావం వుండదు. అవి చాలావరకు వాళ్ల శారీరక, మానసిక పెరుగుదల ఫలితాలు. ఆ విశిష్ట లక్షణాలను పెద్దవాళ్లు లెక్కలోకి తీసుకోని మూలంగానే సాధారణంగా పిల్లలతో పెద్దవాళ్లకి ఘర్షణ సంభవిస్తుంది.

ఇక్కడ మనం చెప్పుకొంటున్నది తల్లితండ్రులు తమ పిల్లల ప్రతిస్పందనని లెక్కలోకి తీసుకోని కారణంగా కలిగే ఘర్షణలను గురించి మాత్రమే. అలాంటి వాటికి బాధ్యత తల్లితండ్రులదే. అయితే, నైతిక విశ్వాసాలకీ, ప్రపంచ దృక్పథానికీ సంబంధించిన మౌలిక సమస్యలమీద తల్లితండ్రులు కౌమార వయస్కులతో వాదించరాదని దీని అర్థం కాదు. అలాంటి జోక్యానికీ, పిల్లల ఆత్మగౌరవానికి భంగకరమైన చిల్లరమల్లర జోక్యాలకీ, బలప్రయో గానికీ ఎంత మాత్రం సంబంధం లేదు.

పెద్దవాళ్లని మనం ఏదైనా చెయ్యమని అడిగినా లేక కోరినా వాళ్లకి కోపం రాకుండా, సగౌరవంగా మనం మాట్లాడతాం, ఔనా? అయితే యిలాంటి పద్ధతిని కౌమార వయస్కుల విషయంలో అవలంబించవలసిన అవసరం లేదని చాలా మంది తల్లితండ్రులు భావిస్తారు. కొన్ని సందర్భాల్లో మానసికంగా కుంచించుకుపోయి వున్నప్పుడు, తల్లితండ్రులు సరైన పద్ధతిలో మాట్లాడినా కూడా వాళ్ల మాట మన్నింపబడకపోవడం కూడా జరుగుతూ వుంటుంది. అన్ని సందర్భాల్లోనూ సానుకూల ఫలితాలే లభిస్తాయని ఎవరూ అనుకో కూడదు. అలాంటి తరుణాల్లో, ఒక్కొక్క సారి ఉపచేతనలో వివిధ ప్రేరణల మధ్య ఆం తరిక ఘర్షణ జరుగుతూ వుండివుండవచ్చు. ఆ క్రమం పూర్తి అయ్యేదాకా, కౌమార వయస్కులు స్వతంత్రంగా నిర్ణయం చేసుకునేదాకా, ఆ నిర్ణయం పూర్తిగా పరిణతమయ్యే దాకా, ఏ సానుకూల ప్రతివర్తనా వుండదు.

అలాంటి సందర్భాల్లో తల్లితండ్రుల ప్రభావాలకు కౌమార వయస్కుల ప్రతిస్పం దనలు ఒక్కొక్కప్పుడు వాళ్ల ఆత్మరక్షణ వాంఛ పర్యవసానం కావచ్చు. విభిన్న ప్రేరణల, భావోద్వేగాల మధ్య మానసిక ఘర్షణలో వున్నవాళ్లు బయటివాళ్ల జోక్యాలనుంచి తమని

తాము కాపాడుకొంటున్నారన్న మాట. ఆ క్రమాన్ని త్వరీకృతంచేయడం వాంఛనీయం కాదు. ఎందుకంటే, చుట్టూ వున్నవాటిని గురించిన అభిప్రాయాన్ని పూర్తిగా అవగతం చేసుకోవడం అవసరం. అయితే అలాంటి సమయాల్లో కౌమార వయస్కులను వాళ్ల మానాన వాళ్లని వదిలెయ్యడం కూడా మంచిది కాదు. ఎందుకంటే, వాళ్లు ఏ క్షణాన అయినా ఒక నిర్ణయం చేసుకోవచ్చు. అందుకు పెద్దవాళ్ల తక్షణ జోక్యం, సహాయమూ అవసరం కావచ్చు.

మనం పిల్లల్లో రాగల వివిధ ప్రతిస్పందనలన్నింటినీ పరిగణనలోకి తీసుకొని, వివిధ బోధన శాస్త్రీయ పద్ధతులను అన్వయించాలి. అప్పుడే బోధన కళను కూలంకషంగా జీర్ణించుకొనే విస్తృతమైన అవకాశాలు ఆవిష్కృతమవుతాయి.

## బోధన శాస్త్రీయ యుక్తియుక్త వ్యవహారజ్ఞత

చాలా తరచుగా మన అంతర్జ్ఞానం లేక సహజజ్ఞానం అవసరమైన చర్యలను ఎంచుకొని, బోధన శాస్త్రీయ యుక్తియుక్త వ్యవహారజ్ఞత ప్రదర్శించేందుకు తోడ్పడుతూ వుంటుంది.

అయితే మరి, "బోధన శాస్త్రీయ అంతర్జ్ఞానం" లేక సహజజ్ఞానం అంటే యేమిటి? దాన్ని నమ్మకోవచ్చునా? యుక్తియుక్త వ్యవహారజ్ఞతకీ సహజజ్ఞానానికీ మధ్య సంబంధం యేమిటి?

"నా కొడుక్కి ఏదో జరుగుతోంది," "వాడు మారిపోయాడు" అంటూండే తల్లితండ్రుల స్వరాల్లోని ఆదుర్దాని మనం తరచుగా గమనిస్తూంటాం. ఈ ఊహలకి ఆధారం కటిక వాస్తవాలు. ఈ ఊహలు కొంత మేరకు సహజజ్ఞానంతో ముడిపడి వుంటాయి. సహజజ్ఞానం సద్యోజనిత జ్ఞానం లేక సంవేదన అని సామాన్యంగా అంటూ వుంటారు. ఈ జ్ఞానానికి మూలంలో విధిగా ఏ నిదర్శనమూ ఉండక పోవచ్చు. సహజ జ్ఞానం ఎప్పుడూ తర్కబద్ధమైన ఆలోచనా రూపాల, మానసిక ప్రతిబింబాలమీద ఆధారపడిన ఆలోచనల సమ్మేళనం.

సహజజ్ఞానం శుద్ధ రూపంలో వుండదు. సహజజ్ఞానంమీద ఆధారపడిన నిర్ణయాలు ఎంత తక్షణమైనవైనప్పటికీ, వాటికి పూర్వరంగంలో ఎప్పుడూ సంచిత సమాచారం వుంటుంది. సరైన బోధన శాస్త్రీయ చర్య తక్షణావిష్కరణని "మనస్సులో తటాలున తళుక్కుమనడం" అంటారు. దీని వెనుక ఎంతో శోధన వుంటుంది.

బోధకుడు ఎప్పుడూ తన కార్యాచరణలకు కొంత మేరకు సద్యోజనితమైన అంతర్

జ్ఞానాన్ని ఆధారంగా చేసుకుంటాడు. అంటే, అతను వాస్తవ సమాచారంమీద ఆధారపడి, సహజజ్ఞానం సహాయంతో తన అభిప్రాయాలకు రూపం యిచ్చుకోవాలి. అందుచేత ఆధార సమాచారం విశ్వసనీయమైనదవడం, అది సాధ్యమైనంత ఎక్కువగా వుండటం చాలా ముఖ్యం.

సహజజ్ఞాన సారాంశాన్ని గీతల్లో చూపడం అవసరమైతే, దాన్ని సంవేదనల రంగానికీ చైతన్య రంగానికీ మధ్య సాగే గీతగా చిత్రించవచ్చు. ఈ రెండు రంగాలూ సహజజ్ఞాన రంగానికి పుష్టిని చేకూరుస్తాయి.

స్వయంస్ఫురిత హెచ్చరికలను బోధన శాస్త్రీయ జ్ఞానంతో పోల్చిచూసుకోవడం ద్వారా బోధకుడికి అనుకోకుండానే పిల్లలతో ఎలాంటి స్వరంలో మాట్లాడాలో స్ఫురిస్తుంది.

పిల్లలను ప్రభావితంచేసేందుకు సరైన స్వరాన్ని ఎంచుకోవడమన్నది ప్రధానంగా బోధకుడికి వున్న బోధన శాస్త్రీయ సంస్కృతి స్థాయిమీద ఆధారపడి వుంటుంది. బోధకుడి వ్యక్తిగత లక్షణాలమీద కూడా యిది చాలావరకు ఆధారపడి వుంటుందని ప్రత్యేకించి చెప్పనక్కర్లేదనుకోండి.

పిల్లల పెంపకంలో సద్యోజనిత జ్ఞానంగా సహజజ్ఞాన వినియోగం అనివార్యం. ఎందుకంటే, వ్యక్తిగత భావ ముద్రలు చాలా వేగంగా పెరిగిపోతాయేమో, లభించిన సమాచారం అంతనీ జీర్ణంచేసుకొని, ఆ సమాచారాన్ని ఒక క్రమబద్ధ వ్యవస్థగా వింగడించుకోవడం అసాధ్యమవుతుంది. పెద్దలకీ పిల్లలకీ మధ్య సంబంధాల విశిష్ట లక్షణాల్లో ఒకటేమిటంటే, చాలా సందర్భాల్లో తటపటాయింపుకి వ్యవధి గాని, అవకాశం గాని వుండదు: తక్షణ విశ్లేషణ, ప్రతివర్తనలు అవసరమవుతాయి. అయితే, సహజ జ్ఞానం మీదనే పూర్తిగా ఆధారపడాలని దీని అర్థం ఎంతమాత్రం కాదు.

...తల్లితండ్రుల ఆదుర్దాలకి అంతు వుండదు. వాటిని ముందు ఊహించుకోవడం కూడా దుస్సాధ్యం. ఏదైనా దురదృష్టం వాటిల్లినప్పుడు, సామెత చెప్పినట్టు, "కష్టాలు ఒంటరిగా రావు." యూర బాక్సింగ్ వ్యామోహాన్ని అధిగమించేసరికి, వాడిని మరింత "భయంకరమైన" మరో వ్యామోహం ఆవహించింది. వాడికి మోటర్‌సైకిలుమీద సవారీ సరదా పట్టుకుంది. మరీయా అలెక్సేయెవ్నా దిగులు పెట్టుకొని, చాటుగా కన్నీళ్లు పెట్టుకోవడం మొదలుపెట్టింది. ఆవిడకి వయస్సు పైన పడ్డట్లు కూడా కనిపిస్తోంది. తన కొడుకు మోటర్‌సైకిలు శిక్షణకి వెళ్లినప్పుడు ఆవిడ బుర్రని విషాదకరమైన దిగుళ్లు ఆవరించాయి. అయితే యూరతో వాదించి ప్రయోజనం లేదని ఆవిడ అర్థంచేసుకుంది. ఒక రోజున ఆవిడ భయాలు నిజమయ్యాయి. యూర కాలు విరగ్గొట్టుకున్నాడు. వాడు ఒక నెల పాటు "ఎందుకూ పనికిరాకుండా" పోయాడు.

అప్పుడు మళ్లీ కోస్త్య బోయెవూ, వోవ్క జరూబినూ వీన్నిక్‌ల యింటికి తరచుగా రావడం

మొదలుపెట్టారు. అమ్మాయిలు కూడా వస్తూండేవారు. వాళ్ళ తమ హోమ్‌వర్కు కలిసి చేసుకునేవారు. వాళ్ళు తాము చదివిన పుస్తకాలను గురించి చెప్పుకునేవారు. వాళ్ళు వాదించుకునేవారు. కోస్త్య హడావిడి మరీ ఎక్కువగా వుండేది. వాడు కాల్పనిక సైన్సు సాహిత్యం వట్టి చెత్త అన్నాడు. వోవ్కా జరూబిన్ చదివిన పుస్తకాలు ''పసలేనివి'' అన్నాడు. కోస్త్య తనతో చిన్న చిన్న కవితా సంపుటాలు పట్టుకొచ్చేవాడు. యూర ముఖం చిట్లించే వాడు. సరళ విజ్ఞాన, కాల్పనిక విజ్ఞాన సాహిత్యాన్ని మాత్రమే వాడు గుర్తిస్తాడు. విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి సంబంధించిన పుస్తకాలు, ప్రముఖుల జీవిత చరిత్రలు, ''యాంత్రికీకృత'' జీవితానికి సంబంధించిన కాల్పనిక వైజ్ఞానిక నవలలు అంటే వాడికి ప్రత్యేకమైన యిష్టం.

మరీయా అలెక్సేయెవ్నా అతి సకృత్తుగా మాత్రమే యీ సంభాషణల్లో జోక్యం కలి గించుకునేది. ఆవిడ తన మనస్సులో చూస్తూచూస్తూ వుండగా పిల్లలు ఎంత ఎదిగి పోయారు, వీళ్ల ఆసక్తుల్లో ఎంత వైవిధ్యం వుంది అని మాత్రమే అబ్బురపడుతూ వుండేది. తన కొడుకు యిష్టాల కంటె సాహిత్యం విషయంలో కోస్త్య భావాలే ఆవిడకి సన్నిహితమైన వనడం నిజమే గాని, ఆవిడ చెయ్యగలిగింది ఏముంది...

అమ్మాయిలందరిలోకీ ల్యూద స్తొయ్‌కినాయే అతి తరచుగా వస్తూ వుండేది. ఒకసారి అనుకోకుండా ల్యూదకీ తన కొడుక్కీ మధ్య జరుగుతున్న సంభాషణ మరీయా అలెక్సేయెవ్నా వినడం తటస్థించింది. ''నన్ను చెయ్యి విరగ్గొట్టుకొమ్మంటావా, చెప్పు విరగ్గొట్టుకుం టాను'' అంటోంది ల్యూద. ఆవిడ కొడుకు నవ్వేశాడు. ''నీకు మంట అంటే భయమా?'' అంటూ అగ్గిపుల్ల గీసింది. ''చాల్లే యింక'' అంటూ యూర యీడ్చుకొంటూ జవాబిచ్చి, ''ఏయ్! నీకు మతిపోయిందా?'' అంటూ అరిచాడు. ''ఏమోలే, నీకు నామీద జాలి లేదేమో అనుకున్నాను...''

అది జరిగిన కొద్ది రోజులకి ల్యూద హడావిడిగా వెళ్లిపోతూ గుమ్మంలో యూర తల్లిని ఢీకొంది. అప్పుడు మరీయా అలెక్సేయెవ్నా ''ఏమైంది, ఆ అమ్మాయి వెళ్లిపోయిం దేం?'' అంటూ తన కొడుకుని అడిగింది. ''పోతే పోనిలే పీడాపోయిరి... అదీ అందరు అమ్మాయిల్లాగే మూర్ఖురాలు'' ఆ అమ్మాయి పోయిన వైపు చేతులు ఊవుతూ అన్నాడు యూర. మరీయా అలెక్సేయెవ్నా నిర్ఘాంతపోయింది. ఈ మొరటుతనంపట్ల కంటె యీ మాటలు అన్నప్పుడు తన కొడుకు ముఖంలో వ్యక్తమైన భావానికి ఆమె ఆదుర్దా చెందింది. తన కొడుకు ఎందుకో సిగ్గుపడుతున్నట్లూ, బహుశా అందుకే తన కళ్లు పక్కకి తిప్పుకొంటున్నట్లూ ఆవిడ గమనించింది. ఆవిడ వాడితో అప్పటికప్పుడే మాట్లా డాలని అనుకుంది గాని, తగిన మాటలు ఆవిడకి స్ఫురించలేదు. యూర ఏమీ జరగలేదన్నట్లు ఆవిడతో ఆప్యాయంగా ''అమ్మా, దుప్పటి పరుపుకిందకి సరిగ్గా దోపవూ'' అంటూ గోముగా అడిగాడు. వాడు సంభాషణని ఏదో ఒక విధంగా తప్పించుకోవాలని ప్రయత్నించాడు. తన

తల్లికి తన యీ మాటలు నచ్చుతాయని తెలిసిన యూర తన తల్లితో పదో సారి మోటరు సైకిలు యింక తను ముట్టుకోననీ, యిప్పణ్ణుంచి సంగీతం శ్రద్ధగా నేర్చుకుంటాననీ చెప్పాడు.

ఆ తర్వాత ల్యూద చాలా కాలం పాటు వాళ్లింటికి రాలేదు. ఒకసారి మరీయా అలెక్సేయెవ్నాకి ల్యూద షాపులో కనిపించింది. కాని ఆమె ఆవిణ్ణి చూడనట్లు ఒక మూలకి వెళ్లిపోయింది.

ఆవిడ తన కొడుకుతో యీ విషయం చెప్పింది. యూర నవ్వేశాడు. "యూరా, నీ నవ్వు చూస్తూంటే నాకు విచారం కలుగుతోంది" అని, ఆవిడ గదిలోంచి బయటకి వెళ్లిపోయింది.

ఒక ఘటననుంచి సాధారణీకరణకు సూటి దారి లేదు. చాలా తరచుగా వెనక ముందులు చూసుకొని, ఆ ఘటనకు ప్రత్యక్ష సంబంధం లేనిదిగా కనిపించినప్పటికీ, అనుభవాన్ని వినియోగించుకోవాలి. ఘటనల ప్రాముఖ్యం భిన్నం కావచ్చు. చాలా తరచుగా చర్య కంటె కూడా — కొన్ని విధాలుగా అది నైతిక ప్రమాణాలకు భిన్నమైనప్పటికీ — ప్రేరణ ముఖ్యం. ఆ ప్రేరణని వెల్లడించడం కష్టం.

యూర తల్లి మేళవించ ప్రయత్నించిన ఘటనలు ఇవీ: "వెకిలి నవ్వు," "మొరటు మాట," "కపటమైన చూపు."

భర్తతో తన ఆలోచనలను ఆమె పంచుకొంది. "అవి ఘటనలు కావు, అవి అర్థం పర్థం లేని మాటలు. సహజ జ్ఞానం, అంతే!"

"నువ్వేం చెప్పినా సరే, నేను అనుకున్నది రైటే: అమ్మాయిలపట్ల వాడిది సరియైన వైఖరి కాదు. ఇది చాలా ముఖ్యమైన విషయం అనుకుంటున్నాను."

కౌమార వయస్కుల మనోస్థితి ఉధృతంగా మారిపోతూ వుంటుంది. వాళ్ల ప్రవర్తన నియతంగా ఒకే మాదిరిగా వుండదు. పిల్లల అభివృద్ధిలోని అలాంటి తొలి దశల్లో మంచి, చెడులపట్ల వాళ్ల వైఖరిని సరైన పంథాలో పెట్టడం ఎంత కష్టం! ఈ విషయంలో తీవ్ర విశ్లేషణ లేక పరిశీలనాత్మక ఆలోచన లేకుండా పని జరగదు. అయితే వట్టి ఊహాలే సరిపోవు. విషయాలు తెలుసుకోవడం సైతం సరిపోదు. పిల్లల అనుభవాల ప్రపంచంలో ప్రవేశించడం, వాళ్ల సంవేదనలను స్పృశించడం, వాళ్ళు తమ అభీష్టాలను, దృక్పథాలను గుర్తించేందుకు తోడ్పడటం, వాళ్లతో బాటు ఏకైక సక్రమ పంథాను కనుక్కోవడం వంటి అత్యంత సంశ్లిష్ట కర్తవ్యాలు యింకా ముందు ముందు వుంటాయి. దీనికి యుక్తి యుక్త వ్యవహారజ్ఞత, నిదానం వుండాలి. ఏది ప్రధానమైనది, ఏది ద్వితీయ ప్రాధాన్యం కలిగినదన్న విచక్షణ వుండాలి. అప్పుడే పిల్లలతో ఎలా మాట్లాడాలి, ఏమి మాట్లాడాలి,

వాళ్లపట్ల వహించవలసిన సరైన వైఖరి, పద్ధతి, మార్గం ఏమిటి, మొదలైనవి విశద మవుతాయి.

మరీయా అలెక్సేయెవ్నా కేవలం ఊహలమీద మాత్రమే ఆధారపడవలసివచ్చింది, కాని నికార్సైన బోధకుడు అన్నీ పూర్తిగా స్పష్టపడేదాకా వేచివుండకూడదు. అప్పటికి పిల్లల నైతిక వైఖరి సుక్షేత్రం చూసుకొని, దృఢంగా వేళ్లూనుకుపోతుంది.

పిల్లల సంవేదనలను దెబ్బతీయకుండా లేక వాళ్ల మనస్సును గాయపరచకుండా వుండేందుకుగాను, పెద్దవాళ్లు కనుగలిగి వుండి, పిల్లలపట్ల దయగా వుండాలనీ, వాళ్లతో హార్దికంగా మాట్లాడాలనీ యిటీవల చాలామంది చెప్పడం వింటున్నాం. కాని ఈ అనిర్దిష్ట తర్కం వాస్తవాలకు చాలా దూరమైనదనీ, వాటిలో ఎన్నో నిశితమైన కోణాలు, ఆజీవితాంతం వుండిపోయే గాయపు మచ్చలను కల్పించే సన్నివేశాలు ఎన్నో వుంటాయనీ చాలా సందర్భాల్లో వెల్లడైంది. పిల్లల భవితవ్యంపట్ల బోధకుడికి వున్న ప్రత్యేక ఆసక్తిచేత అతని నికరమైన యుక్తియుక్త వ్యవహారజ్ఞత నిర్ధరింపబడుతుంది.

...ఉదాహరణకి, కోస్త్యా బోయెవ్‌ని తీసుకుందాం. వాడికి ఇంటి దగ్గర వాతావరణం సరిగా ఉండదు. అయితే వాడు తన శారీరక అవకరమైన కుంటితనం మూలంగా ఎక్కువగా బాధపడతాడు. చాలా తరచుగా అలాంటి పరిస్థితుల్లో వున్న పిల్లల్లో చిరాకు, కోపం గూడుకట్టుకుంటాయి. వాళ్లు తరచు నిరాశా నిస్పృహలకు గురై, మౌన స్వభావులవుతారు.

అందుచేత, యుక్తియుక్త వ్యవహారజ్ఞత అన్నది కేవలం ఓదార్పు కలిగించే సామర్థ్యం మాత్రమే కాదు. యుక్తియుక్త వ్యవహారజ్ఞత అంటే పిల్లల మనసుల్లో, సంవేదనల్లో వుండే క్లేశాలనుంచి, వాళ్లు తమకి తాము కలిగించుకున్న బాధనుంచి, సర్వనాశన నిర్వేదం నుంచి వాళ్లని విముక్తం చేసే సామర్థ్యం కూడా. చాలా తరచు అలాంటి పరిస్థితుల్లో హార్దిక సంభాషణ అవసరం బహుశా వుండదు. టీచరు వ్లదీమిర్ పెత్రోవిచ్‌కి యీ విషయంలో పూర్తి నమ్మకం వుంది. కాని యిందుకు బదులు, కోస్త్యా తండ్రితో మాట్లాడటం అవసరమని ఆయన భావించాడు. ఆయన కొంచెం యించుమించుగా తన సంభాషణని యిలా మొదలెట్టాడు: "కోస్త్యా చాలా సున్నిత మనస్కుడు. నిస్సందేహంగా వాడిలో సాహిత్యపరమైన సామర్థ్యాలు వున్నాయి. మీ వాడు జర్నలిజం విభాగంలో చేరేందుకు ప్రయత్నిస్తే మంచిది. కాని మీ వాడి మనస్సెందుకో గాయపడిందేమో అనిపిస్తోంది." ఈ మాటలు బోయెవ్‌గారి మనస్సును చివుక్కుమనిపించాయి. కాని ఆయన టీచరుతో యింకేమీ మాట్లాడలేదు. ఆయన కోపంగా యింటికి తిరిగివచ్చి, తిన్నగా పోయి పడుకున్నాడు. అంతే ఎందుకోగాని ఆయన నిద్రపోలేకపోయాడు. "వాడి మనస్సెందుకో గాయపడింది" అన్న టీచరు మాటలు ఆయన మనస్సులో మార్మోగసాగాయి. "ఎందుకు గాయపడాలి?

మేము యితరులెవ్వరి కంటె తీసికట్టుగా బతకడం లేదు కదా..." అనుకోసాగాడు. తండ్రి ఓరవాకిలిగా తెరిచివున్న తలుపు సందులోంచి చూశాడు. కొడుకు గదిలో టేబిలు దగ్గర కూర్చొని చదువుకుంటున్నాడు. మధ్య మధ్య వాడు చటుక్కున లేచి, తనలో తను ఏదో మాట్లాడుకొంటూ, నవ్వుకుంటున్నాడు. అలాంటి క్షణాల్లో వాడి ముఖంలో ఉద్రేకావేశాలు తొణికిసలాడుతున్నాయి. తండ్రి "వీడు నిజంగానే కవిలా వున్నాడు" అని అనుకొని, రెండో పక్కకి ఒత్తిగిలి పడుకున్నాడు. ఉదయం లేచాక ఆయన "నువ్వేం పుస్తకం చదువుతున్నావురా?" అని అడిగాడు. కొడుకు అయిష్టంగా "ఆఁ, ఏదో పుస్తకంలే" అని ముక్తసరిగా జవాబిచ్చాడు. తనేం పుస్తకం చదువుతున్నదీ వాడు చెప్పనందుకు తండ్రికి చిరాకు కలిగింది. తన కొడుకు భావి వృత్తి గురించి మాట్లాడాలని ఆయన సంభాషణ మొదలుపెట్టగా, కొడుకు ఏదో అస్పష్టంగా జవాబిచ్చాడు. వాడి తండ్రి "సిగ్గుపడకు! జర్నలిస్టు వృత్తి మంచిదే. బహుశా నువ్వు రచయితవి కూడా అవచ్చు. సరే, చదువుకో. మంచి పని దేనికైనా సరే డబ్బు ఖర్చుపెట్టేందుకు నేను వెనుకాడను..." అంటూ వాణ్ణి ప్రోత్సహించాడు.

ఇప్పుడు తన తండ్రి టీచర్లతో తల్లితండ్రుల సమావేశాలకి మరింత యిష్టంగా హాజరవుతూ వుండటం కోస్త్య గుర్తించనారంభించాడు. ఇప్పుడాయన వాణ్ణింక ఎంత మాత్రం మందలించడం లేదు. తద్భిన్నంగా ఆయన వాణ్ణి పొగుడుతున్నాడు. ఒక రోజున ఆయన "బోయెవ్‌ల కుటుంబంలో కూడా కొందరు విద్యావంతులు ఉండబోతున్నారన్న మాట" అన్నాడు. కుర్రాడి చదువు సంధ్యల విషయంలో సైతం ఆయన ఆసక్తి పెంచుకోనారంభించాడు. కుర్రాడు ఏమేం పుస్తకాలు చదువుతున్నాడో ఆయన చూస్తున్నాడు. తరచు "బహుశా నీకింకేమైనా వేరే పుస్తకాలు కావాలంటే చెప్పు. డబ్బిస్తాను కొనుక్కుందువుగాని" అంటున్నాడు. ఈ మార్పులు గమనించి కోస్త్య సంబరపడ్డాడు. వాడు సాహిత్య బృందపు సమావేశాలకు మరింత సముత్సాహంగా హాజరు కాసాగాడు.

ఎనిమిదో క్లాసులో టీచరు సాయంతో వాడు క్లాసు సాహిత్య పత్రికను వెలువరచడం మొదలెట్టాడు. స్కూలు ప్రదర్శనలకి వాడు కొన్ని సంభాషణలు సినేరియోలు కూడా రాశాడు. ఒక పేట పత్రికలో వాడు రాసిన చిన్న వ్యాసం ప్రచురింపబడినప్పుడు, వాడి తండ్రి దాన్ని జాగ్రత్తగా కత్తిరించి తన వాలెట్‌లో భద్రపరచుకున్నాడు.

కోస్త్య తండ్రిలో కొంత ఆసక్తిని రేకెత్తించి, తద్వారా ఆ కుర్రాడిపట్ల ఆయన వైఖరిని మార్చగలిగిన ఆ టీచరు ప్రదర్శించిన యుక్తియుక్త వ్యవహారజ్ఞత సారాంశాన్ని విపులీకరించడం అవసరమేమో? ఒక అంశాన్ని యిక్కడ నొక్కిచెప్పడం ముఖ్యావసరం. బోయెవ్ కుటుంబంలో వచ్చిన మార్పులు ఆ టీచరుకి తెలుసు. కోస్త్య ప్రవర్తనలో, వాడి మొత్తం వాలకంలో, స్కూలు చదువులో, స్కూలు కార్యకలాపాల్లో వాడి జయాపజయాల్లో వచ్చిన మార్పులను ఆయన గమనించాడు. అయితే తనేదో సాయం చేశానని కోస్త్యతో

ఒక్క మాట కూడా చెప్పలేదు. ఇదిగో యిది బోధన శాస్త్రీయ యుక్తియుక్త వ్యవహార జ్ఞత అత్యున్నత రూపం, ఏదైనా మంచి పని విధాయకమైన సామాన్య విషయం అన్నట్లు చేయడం.

కానైతే, ఎనిమిదో క్లాసు చివర్లో, దాదాపు ఫైనల్ పరీక్షలకి ముందు, కోస్త్య ఉన్నట్లుండి దిగాలుగా తయారయ్యాడు. వాడికి నాసి మార్కులు రావడం మొదలైంది. వాడు యింటికి వచ్చేవాడు, పుస్తకం తెరిచి కూర్చునేవాడు, ఒక్క పంక్తి కూడా చదవకుండా గంటల తరబడి కూర్చుండి పోయేవాడు. వాడు కిటికీల గుండా బయటకి, ఆకాశంలో కదలాడే మబ్బులు చూస్తూ గడిపేవాడు. కాని తన తండ్రివో, తల్లివో అడుగుల చప్పుడు వినిపించినప్పుడు, వాడు తన పాఠ్య పుస్తకం తీసి, కొన్ని మాటలు బిగ్గరగా గొణిగేవాడు. వాడు క్లాసులో అన్ని పాఠాలు జరుగుతున్నప్పుడూ అలాగే కూర్చునేవాడు.

స్కూల్లో ప్రతి ఒకరూ "కోస్త్య బోయెవ్‌కి ఏదో జరిగింది" అంటూండేవారు. గణితంలో వాడెప్పుడూ వెనకబడే వుండేవాడు. కాని యిప్పుడు ఒక్క గణితంలోనే కాదు, మిగతా సబ్జెక్టుల్లో కూడా వాడు వెనకబడ్డాడు. టీచరు వాడి మనస్సులో వున్న విషయాన్ని పసిగట్టాడు. "కుర్రాడు ప్రేమలో పడ్డట్టున్నాడు..." అన్నాడు. వ్లదీమిర్ పెత్రోవిచ్ కోస్త్యతో మాట్లాడేందుకు ప్రయత్నించాడు. తనని అడిగిన ప్రశ్న తనకి అర్థం కానట్లు కోస్త్య మౌనంగా అయినా ఉండిపోయేవాడు, లేకపోతే భుజాలు ఎగరేసేవాడు. ఇంతకీ సంగతేమిటంటే, ఏం జరుగుతోందో వాడికే తెలియదు.

తన కొడుక్కి నాసి మార్కులు వస్తున్నాయని తెలుసుకున్నప్పుడు, ఒక విధంగా తను దోచుకోబడినట్లు లేక మోసగింపబడినట్లు అనిపించి, తండ్రి వాడిమీద విరుచుకుపడ్డాడు. "నీ బుర్రలో వున్న భూతాన్ని వదలగొడతాను! నువ్వు ఈ వెర్రివేషాలు కట్టిపెట్టనైనా కట్టిపెట్టు, లేకపోతే నిన్ను పనిలో పెట్టేస్తాను. పోయి ఏ చెప్పులు కుట్టడమో నేర్చుకుందువుగాని!" అన్నాడు. తన కొడుకు ఏడుస్తాడు లేకపోతే వాగ్దానాలు చేస్తాడని తండ్రి అనుకున్నాడు. కాని కోస్త్య ప్రశాంతంగా "నువ్వు నన్ను ఎక్కడకి కావాలంటే అక్కడకి పంపించుకో, నాకు యిదంతా విసుగెత్తిపోయింది" అని సమాధానం యిచ్చాడు.

"నువ్వెంత కృతఘ్నుడివిరా! నీకు నేను సమస్తం యిచ్చాను, నువ్వేమో మమ్మల్ని ఆటపట్టిస్తున్నావు! అదేం సాగదు తెలుసా!" అంటూ తండ్రి భగ్గున మండిపడ్డాడు. కోస్త్య సన్నగా చిరునవ్వు నవ్వాడు. కొడుకు ప్రశాంతంగా వుండటం తండ్రిలో మహా కోపాన్ని రేకెత్తించింది. ఆయన కోస్త్య రెండు భుజాలూ పట్టుకుని వాడి కళ్లలోకి నేరుగా చూసి, "నీకు యింకేం తక్కువైందిరా?" అంటూ పళ్లు కొరుకుతూ అడిగాడు. కొడుకు తన తండ్రి వైపు తిరస్కారంగా చూశాడు. "నా ముఖంలోకి ఏం తేరిచూస్తావు గాని నీ పుస్తకంలోకి చూసి ఏడు..." అంటూ ఆయన తన కొడుకు ముఖాన్ని తెరిచివున్న పుస్తకం మీదకి నెట్టాడు.

ఆ మరుసటి రోజున కోస్త్య తనే స్వయంగా గొడారివాడి దగ్గరకి వెళ్ళి, "నాకు మీ వృత్తి నేర్చుకోవాలని వుంది, నన్ను పనిలో చేర్చుకుంటారా?" అన్నాడు.

ఆ గొడారి మీష తాత పరమ వాగుడుకాయ. అతను ఆరెనొకసారీ, సూదినొకసారీ మహా నేర్పుగా లాగుతున్నాడు. అతని దగ్గర మరవ్రజం, రబ్బరు, తోలు వాసనలు గుప్పున కొడు తున్నాయి. కోస్త్యకి చాలా కాలంగా మనుషుల్లో కనిపించని ప్రశాంతి అతనిలో కొట్టవచ్చి నట్లు కనిపించింది... కోస్త్య కొంచెం సేపు గుమ్మం దగ్గర నిలబడి, తర్వాత లోపలకి పోయి చదికిలబడి కూర్చుని అకస్మాత్తుగా "మీ జీవితం మీకు తృప్తిగా వుందా?" అని ప్రశ్నించాడు. సమాధానంకోసం ఆగకుండా, "అసలు మనుషులు ఎందుకు బతుకుతారో నాకు మటుకు అర్థం కాదు. అటూ యిటూ పరగులు తీస్తారు, పెద్ద హంగామా చేస్తారు, ఒకళ్లతో ఒకళ్లు పోట్లాడుకుంటారు... నేనీ సత్యాన్ని ఎవరో ఒకరికి చెప్పాలని అనుకున్నాను. కాని వాళ్లు అర్థంచేసుకుంటారా అని? చిన్న సాకు దొరికితే చాలు మా నాన్న నన్ను బాదేందుకు బెల్టు తీస్తాడు. ఇక టీచర్లు చేసేదల్లా కూకలెయ్యడమే..." అంటూ కొనసాగించాడు.

తనకి తెలియకుండానే కోస్త్య యిటీవల తన మనస్సును పట్టి పీడిస్తున్న విషయం గురించి "మా క్లాస్ టీచరు ఒక్క జర్నలిజమే నేర్పే ఒక డిపార్టుమెంటు ఏదో వుందని చెప్పాడు. కాని అందులోకి చేరే అవకాశం ఎక్కడ దొరుకుతుంది?" అంటూ మాట్లాడటం మొదలెట్టాడు.

"మరి మీ నాన్నకి నువ్వు జర్నలిజం చదవడం యిష్టమేనా?" అని అడిగాడు మీష తాత. "ఇప్పుడేమో తెలియదు గాని, ఇంతకు ముందు ఆయన నన్ను చదవమనే అన్నాడు. అంతే కాదు, 'ఎంత ఖర్చైనాసరే నేను వెనకాడను' అన్నాడు. కాని యిప్పుడు నాకు యివన్నీ విసుగెత్తిపోయాయి. ఏమో, నాకేం కావాలో నాకే తెలియదు. అయినా తరుణం మించి పోయింది. నేను నా చదువు పూర్తిగా అశ్రద్ధ చేశాను. దాంతో ముగిసిపోయాయి అన్నీ..." అని చెప్పుకువచ్చాడు కోస్త్య.

కోస్త్య యింకేదో చెప్దామని అనుకున్నాడు, కాని మీష తాత అడ్డువచ్చి, "ఓయ్, నువ్వెంత బలహీనుడివి!.." అన్నాడు. కోస్త్య "ఏమిటి మీ ఉద్దేశం?" అని ప్రశ్నించి సమాధానంకోసం చెవులు రిక్కించాడు. "ఇరవై యేళ్లు నిండక ముందే నాకు రెండు కాళ్లూ పోయాయి. నేనూ నీ లాగే కృంగిపోయాను. నేను అడుక్కోవడానికి కూడా తెగ బడ్డాను. నా బతుకు ముగిసిపోయిందని అనుకున్నాను. ఇంతలో అకీమిచ్ — బహుశా ఆయన నీకు తెలిసి వుండవచ్చు, లేకపోతే ఆయన్ని యిక్కడ ఎప్పుడైనా నువ్వు చూసివుండవచ్చు — నన్నిక్కడికి, ఈ కొట్లోకే లాక్కొచ్చాడు. ఆయన నన్ను సముదాయించి, యిదిగో సరిగ్గా యిక్కడే కూర్చోబెట్టాడు. ఆయన నాకీ పని నేర్పడం మొదలెట్టాడు. నీకు తెలుసా, నేనొకప్పుడు విమానపు పైలట్‌ని అవాలనుకున్నాను. కాని నువ్వో, నువ్వేమి కావాలనుకుంటే

అదే కావచ్చు. మనం దేన్ని గురించి మాట్లాడుతున్నామబ్బా...'' అని, మీష తాత తన య్యాప్రన్ సర్దుకొని, యింక తను చెప్పవలసింది ఏమీ లేదన్నట్లు రెండో బూటు చేతిలోకి తీసుకున్నాడు.

కౌమార వయస్సులో పిల్లలు అనేక విషయాలను పునఃపరిశీలిస్తారు, పెద్దవాళ్ల మాదిరిగా, ఒక కొత్త కొలబద్దతో జీవితాలను చూస్తారు. ఈ దశలో వాళ్లు తరచు రక రకాల ''సంక్షోభాలకు'' గురి అవుతారు. అలాంటి దశల్లో తరచుగా వాళ్లు యితరులనుంచి తమ భావాలనూ, సంవేదనలనూ మరుగుపరచేందుకు ప్రయత్నిస్తారు. దిగాలు స్థితిలో వున్న కుర్రాడు నవ్వుతాడు, నాకేమిటి అనే ధీమా ప్రదర్శిస్తాడు, నిర్లక్ష్యం వెనకా, నిర్లిప్తత వెనకా తనని తాను మరుగుపరచుకుంటాడు. అయితే వాడి నవ్వునూ, వాడి స్వర వైవిధ్యాలనూ ఎవరైనా మరింత శ్రద్ధగా గమనిస్తే, వాడి మనోస్థితిలోని యీ ''బీట''నూ, అనిశ్చితత్వాన్నీ, దిగులునూ కనిపెట్టడం ఏమంత కష్టం కాదు. తనలో ఏ మార్పులు వస్తున్నాయో తెలుసుకోలేకపోవడం మూలంగా కుర్రాడు తన ''బలహీనతలను'' బయటకి చూపేందుకు భయపడతాడు. అదే సమయంలో వాడు వాటినుంచి బయట పడేందుకూ, తన యీ దిగాలు స్థితిని వదిలించుకొనేందుకూ ఏదైనా మార్గంకోసం వెతుకుతాడు.

అలాంటి స్థితిని పెద్దవాడైతే అర్థంచేసుకోగలడు. అలాంటి పరిస్థితుల్లో అతను తనకి బాగా సన్నిహితమైన వ్యక్తి దగ్గర, కొన్ని సందర్భాల్లో డాక్టరు దగ్గర సైతం సహాయం పొందేందుకు ప్రయత్నిస్తాడు. కౌమార వయస్కుడికి యీ కష్టం రెండు విధాలుగా వుంటుంది. ఒక వైపున, వాడికి తనలో వస్తున్న మార్పులను గురించి చెప్పడం యింకా చేతకాదు, సన్నిహిత సంభాషణల అనుభవమూ వాడికి వుండదు. మరో వైపున, తన యీ మనోస్థితికి కారణం ఏమిటో, దాని స్వభావం ఏమిటో తెలియదు. అంతకు ముందంతా అన్ని సమస్యలూ మరింత తేలిగ్గా పరిష్కారమైపోయేవి. ఉదాహరణకి, సంతోషం పొందేందుకు గాను (ఆటలకి వెళ్లడం, సినిమాలకి వెళ్లడం, వగైరాలకి) పిల్లవాడు ముందు హోమ్ వర్కు చేసుకోవాలి. లేక తన తల్లి దగ్గర్నుంచి ఏదైనా పొందాలంటే, మొదట వాడు గునవాలి, బతిమాలాలి, లేకపోతే మంకుపట్టుపట్టాలి. కౌమార వయస్కుడు యీ సరళ వైఖరికి అతీతుడవుతాడు. వాడికి కొంత స్వతంత్రం వచ్చి వుంటుంది. అయితే అదే సమయంలో, యీ స్వాతంత్ర్యాన్ని అసలైన పద్ధతిలో వాడుకోలేని కారణంగా వాడిని అది అణచివేయనారంభిస్తుంది. వాడి అవసరాలు మరింత సంక్లిష్టమూ, మరింత వైవిధ్య పూరితమూ అవుతాయి. వాడు ఒకసారి ఒక కొసకీ మరోసారి మరో కొసకీ గంతులేస్తూ వుంటాడు. వాణ్ణి జీవిత ప్రవాహం ఎక్కడకి లాక్కుపోతుందో ఎవరికి తెలుసు? వాడు మన పక్కనే వున్నాడు కదా, వాడిలో ఏమీ మార్పులు జరగడం లేదని పెద్దవాళ్లం అను

కొంటూ వుంటాం. అంతే కాదు, వాడి బాధ్యతా రాహిత్యంపట్ల మనం క్రుద్ధులమవుతూ వుంటాం, వాడు మన భావాలకి విధేయత చూపాలనీ, వాడు మరింత బాగా చదువుకోవాలనీ, తన పెద్దల ఆదర్శాన్ని అనుసరించాలనీ మనం పదేపదే పాటపాడుతూ వుంటాం. ఇంతకీ నువ్వేం చిన్నారి కూచివి కావు, పెద్దవాడివయ్యావు అంటూ వుంటాం. మన యీ మాట లన్నీ వాడి ఒక చెవిలో దూరి మరో చెవిలోంచి బయటకి పోతూ వుంటాయి. అదే సమ యంలో యీ సంశ్లిష్ట సంబంధాలను తనకి తానుగా అర్థంచేసుకోవాలని వాడు ప్రయ త్నిస్తూ వుంటాడు.

కోస్త్య బోయెవ్‌లో వస్తున్న మార్పులు యేమిటి? అవి కౌమార వయస్కులందరికీ వచ్చేవే. ఔను, వాడూ మిగిలిన కుర్రాళ్లందరి మాదిరిగానే బతికాడు. వాడికి ఒక అమ్మా యంటే యిష్టం ఏర్పడింది. దురదృష్టవశాత్తూ వాడి స్నేహాన్ని ఆ అమ్మాయి తిరస్క రించింది. వాడు తన అవిటికాలును తిట్టుకున్నాడు. తనకి సంభవిస్తున్న ప్రతిదానికీ తను యితరుల మాదిరిగా ఉండకపోవడమే కారణం అనుకున్నాడు. తను పెనుదుఃఖంలో వున్నా నని వాడు ఊహించుకున్నాడు. వాడు తన స్నేహితులపట్ల అసూయచెందాడు. వాళ్లకి అన్నీ అందుబాటులో వుంటాయని అనుకున్నాడు. ప్రతీదీ వాళ్లకీ యిలాగే కష్టసాధ్యమనీ, తన లాగే వాళ్లూ తమ రహస్యాలను మరుగుపరుస్తున్నారనీ పళ్లు బిగపట్టి భరిస్తున్నా రనీ, జోకులు విసురుతూ, అమ్మాయిల అభిమానం చూరగొనేందుకు వాళ్ల చుట్టూ తిరుగుతున్నారనీ, పైకి నిర్లిప్తంగా కనిపిస్తూ చేదు మాత్రలు మింగుతున్నారనీ పాపం వాడికి తెలియదు.

తను కృతఘ్నుడుగా తేలిన మూలంగానూ, తన చుట్టూ వున్నవాళ్ల ఆందోళన మూలంగా సర్వత్రా తను ఒత్తిళ్లకు గురి అవుతున్న కారణంగానూ కోస్త్య ప్రస్తుతం దిగులుగా చిరాకుగా వున్నాడు. స్కూల్లో ఏం జరుగుతుందో ముందే తెలిసే, వాడు స్కూలుకు వెళ్లాడు. ప్రతి ఒకడి ముఖంలోనూ "ఏమిటోయ్, యిప్పటికైనా బుద్ధి తెచ్చుకున్నావా?" అనే ఒకే మాదిరి ప్రశ్న కనిపించింది. క్లాసు టీచరు తనచేత ఎలాగైనా బాగా చదివించాలని చేస్తున్న ప్రయత్నం వాడికి సిగ్గు కలిగించింది. వాడికి యింటికి వెళ్లాలని అనిపించలేదు. వీళ్లందరూ తనని ఒంటరిగా వదిలేస్తే బాగుండునని వాడు అనుకున్నాడు.

అలాంటి సందర్భాల్లో కౌమార వయస్కుణ్ణి కొంత కాలం వాడిమానాన వాణ్ణి వదిలెయ్యాలి. దీనికి కూడా బోధన శాస్త్రీయ యుక్తియుక్త వ్యవహారజ్ఞత అవసరం. వాడు తన నిర్ణయాలను తనే చేసుకునేందుకూ, పెద్దవాళ్ల దగ్గరకు వెళ్లి తనకి కావలసిన సలహాను అర్థించేందుకూ వాడిని వదిలెయ్యాలి.

దీంట్లో విరోధాభాస వుందనడం స్పష్టం. కౌమార వయస్కుడు తన మనస్సు విప్పి మాట్లాడేందుకు మనం నిరీక్షిస్తాం. వాడితో హార్దికంగా అరమరికలు లేకుండా ఏ పద్ధ తుల్లో మాట్లాడాలా అని మనం చూస్తూవుంటాం. అదే సమయంలో తను మనస్సు

విప్పి ఎవరితో మాట్లాడాలా అని వాడు వెదుకుతూ వుంటాడు. తనకి యాదృచ్ఛికంగా పరిచయమైన వ్యక్తి దగ్గర వాడు తన మనస్సులో వున్నది పైకి వెళ్లగక్కుతాడు. ఈ కౌమార వయస్కుడిని "సరికొత్త" దృష్టితో చూసే యీ నూత్న పరిచితుడు వాడి మనస్సును మరింత త్వరగా అవగతం చేసుకోగలుగుతాడు. అంతే కాదు, అలాంటి పరస్పర అభిప్రాయ మార్పిడి పద్ధతి ఐచ్ఛిక ప్రాతిపదికను కలిగివుంటుంది. క్లిష్టమైన సమస్య మీద యిలాంటి సంభాషణ నిర్నిబంధ స్వభావం కలిగివుంటుంది. మరి అలాంటి పరిచితుడు చెడ్డ వ్యక్తి అయితే? ఈ రీత్యా కోస్త్య బోయెవ్ అదృష్టవంతుడు. సంభాషణ చివరి ఘట్టంలో తనకి "ఉపదేశించడం" మొదలుపెట్టినప్పటికీ, గొడారి మీష తాత కొన్ని విధాల యుక్తియుక్త వ్యవహారజ్ఞత ప్రదర్శించాడు. కుర్రవాడు తన ఆదుర్దాలను గురించి మరింత లోతుగా ఆలోచించుకునేందుకు అతను తోడ్పడ్డాడు.

...కోస్త్య తన చదువును నిర్లక్ష్యంచెయ్యనారంభించి, తనతో మాట్లాడేందుకు ప్రయత్నించిన టీచర్లతోనూ, స్నేహితులతోనూ పెళసరంగా వ్యవహరించినప్పటినుంచీ, వాడు వ్లదీమిర్ పెత్రోవిచ్‌ని తప్పించుకు తిరిగేందుకు సాధ్యమైన సర్వ విధాలా ప్రయత్నించాడు. తనకి ఎన్నో విధాల సాయంచేసిన క్లాస్ టీచరుకి ఎదురుపడేందుకు వాడు సిగ్గుపడిపోయాడు. క్లాస్ టీచరు వాడికి పుస్తకాలు యిచ్చి, రచయితలను గురించీ, వాళ్ల రచనలను గురించీ చెప్పి, వాడిలో సాహిత్యాభిలాషను పెంపొందించడం మాత్రమే కాదు. అంతకంటె కూడా ప్రధానమైన విషయం ఏమిటంటే, ఆయన వాడిలోనూ, వాడి సామర్థ్యాల్లోనూ నమ్మకం పెట్టుకున్నాడు. అంతకు కొద్ది నెలల క్రితందాకా కోస్త్య తన క్లాస్ టీచరు దగ్గరకి సంతోషంగా వెళ్తూండేవాడు, ఆయనతో గంటల కొద్దీ కూర్చునేవాడు, ఆయనతో అనేక విషయాలమీద మాట్లాడుతూండేవాడు, ఆయన దగ్గర్నుంచి వెళ్లిపోయేటప్పుడు ఆశాభావంతో, ఏవేవో చేసెయ్యాలన్న కోర్కెలతో, ఆలోచనలతో తిరిగివెళ్లేవాడు. ఇప్పుడు అదంతా సుదూర గతానికి చెందిన సంగతిలా కనిపిస్తోంది.

మరి, క్లాసు సమావేశాల్లో జరిగే విమర్శలు కోస్త్యకి ఎంత చిరాకు కలిగించేవంటే, వాడు దాదాపు తన స్నేహితులందరితోనూ దెబ్బలాడాడు.

ఏదేమైతేనేం, కోస్త్యకి యిప్పుడు వ్లదీమిర్ పెత్రోవిచ్ దగ్గరకి వెళ్లి, ఆయనకి తన కవితలు చూపించాలన్న బలీయమైన కోర్కె కలిగింది. సద్యోజనితంగా వాడికి స్ఫురించిన ఈ పంక్తులు చాలా బాగున్నట్లు కోస్త్యకి అనిపించింది. అవి అనూహ్యమైన వరసలతో, సరికొత్త అలంకారాలతో, విషయాలపట్ల సరికొత్త దృక్పథంతో నిండివున్నాయి. కోస్త్య వాటిని చదివివినిపించాలని తహతహలాడుతున్నాడు, అయితే, వాటి సిసలైన విలువను మెచ్చుకోగలిగిన వ్యక్తి దగ్గర మాత్రమే వాటిని చదివివినిపించాలని వాడు కోరుకున్నాడు. వాడు తన కవితలు వున్న నోట్‌బుక్కును చేతపట్టుకొని ఒక వారం రోజులు తిరిగాడు,

కాని క్లాస్ టీచరు దగ్గరకి వెళ్ళేందుకు ధైర్యం కూడగట్టుకోలేకపోయాడు. ఒకసారి క్లాస్ రూములో ఎవరూ లేనప్పుడు తన నోట్‌బుక్కును క్లాస్ టీచరు బ్రీఫ్‌కేసులో కుక్కి, మరు సటి రోజుకోసం ఆత్రంగా నిరీక్షించసాగాడు.

సాయంత్రం ఐదో క్లాసు కుర్రాడొకడు వాళ్ల యింటికొచ్చి, వ్లదీమిర్ పెత్రోవిచ్ నీకోసం ఎదురు చూస్తున్నాడని చెప్పాడు. కోస్త్య సంతోషంతో ఉప్పొంగిపోయాడు. స్కూలుకి బాణంలా దూసుకుపోయాడు. వాడు నేరుగా క్లాసులోకే దౌడుతీశాడు. వ్లదీమిర్ పెత్రోవిచ్ తన డెస్కు దగ్గర్నుంచి లేచి, కోస్త్య కృషిని అభినందించాడు. కోస్త్య టీచరుతో మాట్లాడాలనీ, తను రాసిన కవితల్లో ఒక్కొక్కదాన్ని గురించీ, తన కొత్త ఆలోచనలను గురించీ చెప్పాలనీ తహతహలాడాడు. టీచరు అడ్డు తగిలి, "నీకు నాలో నమ్మకం వుందా?" అని ప్రశ్నించాడు. "ఉందండి" అన్నాడు కోస్త్య రొప్పుతూ. "నేను నీకు చెప్పిన పని చెయ్యగలవా?" అంటూ టీచరు కొనసాగించాడు. "చేస్తాను" అన్నాడు కోస్త్య. "సరే అయితే, నువ్వు యింటికి పోయి కూర్చుని నీ హోమ్‌వర్కు చెయ్యి. ఇదిగో నువ్వు బద్ధకించిన అన్ని సబ్జెక్టుల్లోని అన్ని అంశాల జాబితా. ఫైనల్ పరీక్షకి యింకా 43 రోజులు మిగిలివున్నాయి. నీకు నాలుగు సబ్జెక్టుల్లో ఫెయిల్ మార్కులు వచ్చాయి. నీ కవితలు చాలా బాగున్నాయి. ముందు ముందు నువ్వు యింకా మంచి కవితలు రాస్తావు. వీటిని గురించి రెండు వారాల్లో క్లాసులోని యితర పిల్లల్ని నువ్వు అందుకున్నాకే మనం మాట్లాడుదాం. నీకు యిది సమ్మతమేనా?" అని అడిగాడు టీచరు. కోస్త్య మౌనంగా ఉండిపోయాడు. అటు తర్వాత కోస్త్య యింత సేపూ నిరీక్షిస్తున్న సంగతి చెప్పాడు టీచరు. ప్రతిభావంతంగా రాసిన ఈ కవితల మూలంగానే తప్ప, కోస్త్యతో తను అసలు మాట్లాడి వుండేవాణ్ణి కాను అని చెప్పాడు టీచరు. కోస్త్యకి తన చదువులో వెనకబడే హక్కు లేదని చెప్పాడు ఆయన. గుండె దిటవు లేని, వెన్నెముక లేని వ్యక్తిని కాక, సిసలైన మనిషిని, తనని తాను కూడదీసుకుని, ఆ క్షణంలో చెయ్యవలసిన పనిని విజయవంతంగా చెయ్యగలిగిన మనిషిని చూడాలని తను కోరుకుంటున్నట్లు టీచరు చెప్పాడు. "నీ ఫెయిల్ మార్కులతో ప్రధానంగా నిన్నే నువ్వు నష్టపరచుకుంటున్నావు. అంతే కాదు, మొత్తం క్లాసుకీ, స్కూలుకీ నువ్వు నష్టం కలిగిస్తున్నావు. వీటి విషయం నువ్వు పట్టించుకో కుండా ఉండలేవనుకుంటాను కోస్త్యా" అన్నాడు టీచరు.

టీచరు యీ చివరి మాటలు అనేసరికి కోస్త్య ముఖం పైకెత్తి "అది నిజం కాదు. నేను యిదంతా రెండు వారాల లోపుగానే చేసి చూపిస్తాను" అని వాగ్దానం చేశాడు. వాడు తను చెయ్యవలసిన హోమ్‌వర్కు వివరాలు వున్న కాగితం తీసుకున్నాడు. మూడు రోజులు గడిచేసరికి కోస్త్య వాటన్నింటినీ పూర్తి చేస్తానని వాగ్దానం చేసినందుకు విచారించ సాగాడు.

అదే రోజున తను పోయి టీచర్ని కలుసుకుని, మొత్తం పని పూర్తిచెయ్యడం తన

వల్ల కాదనీ, బహుశా తను ఎనిమిదో క్లాసులోనే మరో ఏడాది ఉండిపోవాలేమోననీ కోస్త్య అనుకొంటూ వుండగా, స్వయంగా వ్లదీమిర్ ప్యెత్రోవిచే కోస్త్య దగ్గరకి వచ్చాడు. ''నీకు తెలుసా కోస్త్యా, ఈ వారంలో నువ్వు ఊహకి అందనంత హోమ్‌వర్కు చేశావు. అందరు టీచర్లూ యిదే మాట అంటున్నారు. అన్నట్లు, యీ ఆదివారం నువ్వు పనిచెయ్యకపోతే, మా యింటికి రా, నీ కవితల్ని గురించి మాట్లాడుదాం...'' అన్నాడు టీచరు. కాని కోస్త్య తనకే ఆశ్చర్యం కలిగేలా ''రానండి, ఆదివారం నేను పని చేసుకుంటాను'' అన్నాడు.

కౌమార వయస్కుడికి సకాలంలో తోడ్పడటం, వాడిలో ఆత్మ విశ్వాసాన్నీ, శక్తినీ పురిగొల్పడం ఎంత ముఖ్యమో నేనిక్కడ పునశ్చరణ చెయ్యను. బోధన శాస్త్రీయ సాహిత్యంలో కేవలం ఏకపక్షంగా వర్ణింపబడే యుక్తియుక్త వ్యవహారజ్ఞత గురించిన మన చర్చను కొనసాగిద్దాం. యుక్తియుక్త వ్యవహారజ్ఞత అంటే సున్నితత్వం అనీ, సంస్కారం అనీ, దయగా మాట్లాడటం, వగైరాలనీ వివరింపబడుతోంది. ఈ దృష్ట్యా, కోస్త్య బోయెవ్‌తో వ్లదీమిర్ ప్యెత్రోవిచ్ సంభాషణను యుక్తియుక్త వ్యవహారజ్ఞత లేనిదిగా చెప్పవలసి వుంటుంది. ఎందుకంటే, టీచరు కరుకైన పదాలు వాడాడు, నిర్బంధిస్తున్నట్లు, కచ్చితంగా మాట్లాడాడు. టీచరు స్వరంలో ఆత్మీయత లేదు, నర్మగర్భత లేదు. పెంకె పిల్లలతో మాట్లాడేటప్పుడు యితర టీచర్లు సాధనాలుగా ఉపయోగించే తియ్యటి మాటలు లేవు (యిలాంటి మాటలు అన్నప్పుడూ మామూలుగా వాంఛించిన ఫలితాలను యివ్వవు).

మన ముందు నిర్ద్వంద్వమైన, ప్రత్యక్ష సంభాషణలు (వీటిని ముఖాముఖీ సంభాషణలు అని కూడా అనవచ్చు) వున్నాయి. ఒకటి తండ్రి తన కొడుకుతో జరిపిన సంభాషణ, రెండవది టీచరు తన విద్యార్థితో జరిపిన సంభాషణ. వాళ్లిద్దరూ కోస్త్యమీద కృతఘ్నతా నేరం మోపారు. వాళ్లిద్దరూ వాడికి మంచి చెయ్యాలనే యీ సంభాషణలు జరిపారు. తమ అభిప్రాయాలు చెప్పేందుకు వాళ్లిద్దరూ భయపడలేదు. ఫెయిల్ మార్కులు వచ్చిన సబ్జెక్టుల్లో తక్షణం మెరుగుదల చూపించాలని డిమాండుచేశారు. అయితే, అదే సమయంలో కొడుకుతో తండ్రి జరిపిన సంభాషణ బోధన శాస్త్రానికి అనుగుణమైనది కాదు, యుక్తియుక్త వ్యవహారజ్ఞత లేనిది, మొరటు నిరంకుశత్వంతో కూడినది. ఇందుకు భిన్నంగా విద్యార్థితో టీచరు జరిపిన సంభాషణ బోధన శాస్త్రీయమైన నికరమైన యుక్తియుక్త వ్యవహారజ్ఞతతో కూడివుంది. హేతుబద్ధమైన బలాత్కార ప్రయోగానికి యీ సంభాషణలో యింకా చోటు వుంది.

మనం తరచు ఉన్నదున్నట్లు మాట్లాడేందుకు భయపడుతూ, మనకి మనమే హానికలిగించుకొంటూ వుంటాం. ఆయా విషయాల సారాంశాన్ని అర్థంచేసుకోలేక, సత్యానికి

దూరంగా పోతూ వుంటాం. పిల్లల పెంపకంలో బలాత్కారానికి చోటు వున్నమాట నిజమే. అయితే మనం యీ మాటను అక్షరాలా తీసుకుంటే, పిల్లవాడు చెయ్యగోరని పనిని వాడి చేత చేయించడం అవుతుంది.

పిల్లవాడు ఒక నిర్దిష్ట సమయంలో నిమగ్నుడు కాగోరని పనులను చెయ్యగోరేలా చేసే సామర్థ్యంలోనే బోధన శాస్త్రీయ యుక్తియుక్త వ్యవహారజ్ఞత వ్యక్తమవుతుందని నేనిక్కడ మరో సారి వక్కాణిస్తున్నాను. టీచరు కోస్త్యతో వ్యవహరించడంలో యుక్తియుక్త వ్యవహారజ్ఞత చూపాడని చెప్పేది సరిగ్గా యీ కారణంగానే. కుర్రవాడిని చదవడం అవసరం అనుకొనేలా చేస్తూ, ఆయన అదే సమయంలో నైతిక సూత్రాన్ని ఉపయోగించాడు. ఆయన తన ప్రతిష్ఠనీ, ఆకాంక్షనూ, హుందాతనాన్నీ రేకెత్తించే తన సాధనాలనూ వినియోగించాడు. కోస్త్యని లొంగదీసుకున్నప్పుడు పిల్లవాడి ప్రయోజనాసక్తులు ఆ టీచరు మనస్సులో వున్నాయి.

బోధన శాస్త్రీయ యుక్తియుక్త వ్యవహారజ్ఞత అంటే మెత్తదనం కాదని నేనిక్కడ మరో సారి ఉద్ఘాటిస్తున్నాను. బోధన శాస్త్రంలో యుక్తియుక్త వ్యవహారజ్ఞత అంటే, పిల్లవాడితో ఘర్షణ రాకుండా చూసుకోవడం మాత్రమే కాకుండా, అవసరమైతే, వైరుధ్యాలను పరిష్కరించేందుకుగాను యీ ఘర్షణను సరైన పద్ధతిలో ఎదుర్కోవడంలో టీచరుకి వున్న సామర్థ్యం అని అర్థం.

అంతే కాదు, యుక్తియుక్త వ్యవహారజ్ఞత అంటే ఏది ఏ మోతాదులో వినియోగించాలో తెలిసి వుండటం, పిల్లవాడిని ప్రభావితం చేసేటప్పుడు సరైన మోతాదులో దాన్ని వినియోగించే సామర్థ్యం, అవసరమైతే, ఒక పద్ధతిమీద మరో పద్ధతికి వున్న వీళ్లను తూకం వేసుకోగలిగిన సామర్థ్యం.

## సృజనాత్మకత, క్రమశిక్షణ

బోధకుడు అనుసరించే బోధన శాస్త్రీయ నైపుణ్యాలు తమకి తామే గమ్యం కావు, అవి సముచిత విద్యా పరిస్థితులను కల్పించేందుకు వినియోగపడతాయి. బోధకుడికి వుండే సంశ్లిష్ట నైపుణ్యాల్లో విద్యార్థులను ఏక కాలంలో ఆదేశించడం, వాళ్లపట్ల దయకలిగి వుండటం అనేవి యిమిడి వుంటాయి. పద్ధతులను ఎంపిక చేసుకునేది బోధకుడు కాదు. జీవితం, సన్నివేశం పిల్లల మానసిక పరిస్థితి — యివీ విద్యా పద్ధతులను, ఎత్తుగడలను నిర్ణయించేది. పిల్లల జీవితంలోని దిగుళ్లను, సంతోషాలను తెలుసుకోగలిగి వుండటం — యిదీ బోధన కళ ప్రాతిపదిక.

ఇందులో యిమిడి వున్న సంశ్లిష్టతలకు ఉదాహరణలు యిచ్చేందుకు ప్రయత్నిస్తాను...

"...వర్ణ సమ్మేళనాన్ని ఏకపక్షంగా పరిష్కరించడం సాధ్యం కాదు... వర్ణ సమ్మేళనాన్ని లేక వర్ణ విన్యాసాన్ని చిత్రకళా నియమాల పరిజ్ఞానం ద్వారా మాత్రమే పరిష్కరించడం సంభవం." ఈ మాటలు వోవ్కా జరూబిన్‌కి చెప్పినది చిత్రకళా నిలయంలోని బోధకుడు లియొనీద్ సెర్గేయెవిచ్. ఆయన యింకా యిలా అన్నాడు: "వర్ణాన్ని, రూపాన్ని గురించిన సాంప్రదాయిక అవగాహన పరిధిని అధిగమించాలన్న వర్ణనాతీతమైన కోరిక కళాకారుణ్ణి సదా వెన్నాడుతూనే వుంది. త్వరత్వరగా రూపం తీసుకునే ఆలోచనా నైపుణ్యం లేనిదే యీ వాంఛ, నికరమైన వాస్తవిక కళనుంచి దూరంచేసే ప్రమాదం వుంది... క్లుప్తంగా చెప్పాలంటే జరూబిన్ సోదరా, చిత్రకళ టెక్నిక్కులను తెలుసుకున్నప్పుడు మాత్రమే నువ్వు ప్రయోగాలు ప్రారంభించగలుగుతావు."

వోవ్కా తాన్యా జీబినా వేసిన స్కెచ్ చూశాడు. ఎండలో చలి కాచుకుంటున్నట్లున్న పచ్చ గడ్డి పెరిగిన బయలు, కళ్లు చెదిరిపోయేట్లు వున్న బెరడు ఒలిచిన క్రర దుంగలు, ఎర్రటి పైకప్పు కలిగిన ఆకుపచ్చటి పాక — యిదీ చిత్రం. ఇదంతా స్ఫుటంగా, ఆత్మ విశ్వాసంతో వేసిన బ్రష్షు గీతలతో నిండి వుంది.

కుర్ర మేళం జరూబిన్‌ని ఆటపట్టించడం మొదలెట్టారు. మొదట్లో వోవ్కా కోపగించుకోలేదు. అందుకు భిన్నంగా "నేను నా సొంత శైలిని వెతుక్కుంటున్నాను" అని జవాబిచ్చాడు. అయితే తర్వాత అతనికి ఇబ్బందిగా కనిపించింది. వాడు ప్రసరిస్తున్న కాంతి మరో సారి చూశాడు. తర్వాత లియొనీద్ సెర్గేయెవిచ్ కేసి తిరస్కారంగా చూశాడు. ఈయనకి అన్నీ తెలుసుగాని తనేమీ సిసలైన చిత్రకారుడు కాడనీ, ఆయన తన జీవిత కాలంలో ఏ మంచి చిత్రాన్నీ వేయలేదనీ, "హ్హాం, ఈయనా ఒక టీచరేనా!" అనీ అనుకున్నాడు వోవ్కా. వాడు తన చిత్రాన్ని చించిపారేయాలనుకున్నాడు. కాని వాడు వేసిన చిత్రం మేఘాల్లా వాడి ముందు తేలుతోంది. అన్నట్లు వాడికి గంటల తరబడి మేఘాల కేసి చూస్తూ వుండటమంటే యిష్టం. కట్టె దుంగలు బయలుమీద తేలియాడుతున్నాయి. గడ్డి నేలమీద ఊగుతున్నట్లు వుంది. వోవ్కా ట్యూబులోంచి కొంత పెయింటు పిండాడు. రంగులు ఎంపిక చేసుకోవడం మొదలెట్టాడు. వాడు యిలా తర్కించుకున్నాడు: "ప్రతీదీ మూడే మూడు రంగులు: పసుపుపచ్చ, ఎరుపు, ఆకుపచ్చ. చిత్రకారుడు మూడు రంగులకి పరిమితం కావాలి. కాని అది చిత్రకళా నియమాలకి విరుద్ధమని లియొనీద్ సెర్గేయెవిచ్ అంటాడు. పోనీ..."

ఒక్క అరగంటలో వోవ్కా చిత్రంలోని ఆకాశం నారింజ రంగులోకీ, పాక ఆకుపచ్చ, ఎరుపు రంగుల్లోకీ మారాయి. కాగా దుంగలు కళ్లు చెదరగొట్టే పసుపచ్చ రంగులో వున్నాయి. వాడు తన మనస్సులో సూర్యకాంతిలో జాజ్వల్యంగా వున్న పచ్చిక బయలును ఊహించుకోగలిగాడు. చివరకి అన్ని రంగులూ వేసేటప్పటికి గాలి బిడాయించినట్లు వుందని వోవ్కా గ్రహించాడు. కేన్వాసు నిండా ఉజ్వలంగా, ఒకదానికీ మరోదానికీ సంబంధంలేని రంగు మరకలు

వున్నట్లు, దానిమీద ఎవరో రంగురంగుల క్ర చెక్కులను దిమ్మరించారా అన్నట్లు తయా రైంది చిత్రం. అయితేనేం వోవ్కా ఆ రోజున ఏదో ఒకటి జరిగిపోవలసిందే అనుకున్నాడు. వోవ్కా ఒక చిన్న సీసాలో రంగులు కరిగే సాల్వెంటును తీసుకొని, దాన్ని తన చిత్రంమీద ఊతంగా కళ్లాపు కొట్టాడు. పసుపు పచ్చ, ఎరుపు రంగులు నాలుగు పక్కలకీ ప్రసరించ సాగాయి. వోవ్కా చిత్రాన్ని తన చేతుల్లోకి తీసుకొని, నారింజ – ఆకుపచ్చ రంగుల మిశ్రమం అడ్డగీతల్లా కారేలా వంచాడు. ఆ ఘట్టంలో చిత్రంలోని ప్రతీదీ నాట్యంచేస్తున్నట్లు, పైకి లేస్తున్నట్లు, మెరుస్తున్నట్లు అనిపించింది. వాడి ఆంతరిక స్థితికీ కేన్వాసుమీది రంగులకీ మధ్య ఒక రకమైన సజీవ ఐక్యత ఉత్పన్నమైంది. నిజమైన దృశ్యానికీ చిత్రంలోనిదానికీ మధ్య దాదాపు పోలిక లేకుండా పోయింది. కాని వోవ్కా ఆ చిత్రం చూసి ఎంత ముగ్ధుడయా డంటే, ఎవరైనా దానికి బదులు విలువైనదేదైనా యిస్తానంటే, చచ్చినా యీ చిత్రం వదులుకొనేందుకు సిద్ధపడి వుండేవాడు కాడు! పచ్చికబయలుకి అవతల ఎక్కడో నీరున్నట్లూ, దానిలో సూర్యుడు తేలుతున్నట్లూ, మేఘాలు తేలియాడుతున్నట్లూ కనిపిస్తున్నాయి. పాక పక్కన ఎర్ర స్వెట్టరు తొడిగిన మనిషి వున్నట్లు, మెసులుతున్నట్లు వుంది. వోవ్కా ఆ మనిషి వీపుకి ఎర్ర రంగు పూశాడు. అంతే, ఆ వ్యక్తి జీవంపోసుకున్నాడు. అన్నింటి కంటె ముఖ్యం ఏమిటంటే, ప్రతి ఒకటీ కదులుతున్నట్లుంది. అందునా, వోవ్కా కోరుకున్నట్లే కదులుతోంది.

అదిగో ఆ తరుణంలో లియొనీద్ సెర్గేయెవిచ్ వాడిని మందలించాడు. "కుహనా చిత్ర కళ" అనే మాటలతో ఆయన మొదలెట్టాడు. సరిగా ఆ మాటలే వోవ్కాకి అన్నిటి కంటె పెద్ద తిట్లు అనిపించాయి. ఆయన అందరూ వినాలనీ, వాళ్లందరూ వోవ్కాని ఎగతాళి చెయ్యాలనీ ఆ మాటలు ఒత్తి పలికాడు. మిగిలినవాళ్లు కూడా యిదే మాదిరిగా చెయ్యకుండా నివారించడమే ఆయన లక్ష్యం. ఆ తర్వాత ఆయన వాటికింకా చాలా మాటలు జోడించాడు: "కృత్రిమత్వం, డాంబికత, యింత కంటె బాగా వెయ్యడం చేతగాక వేసిన చిత్రం, చిత్ర కళ ఆభాస..." అన్నాడు. బహుశా తను చాలా దూరం పోయానని గ్రహించి అప్పుడిక టీచరు నెమ్మదిగా, ఒప్పిదంగా, కాని ఎప్పటి మాదిరిగానే దృఢంగా వాళ్లకి చెప్పడం మొద లెట్టాడు. పికాసో, రెనోయర్, సెరోవ్, వ్రూబెల్‌లు మహా చిత్రకారులనీ, వాళ్లలో ఎవరి సొంత శైలి వాళ్లకి వుందనీ, వాళ్ల కళ సమరసమైనదనీ చెప్పాడు.

"కాని నాకు ఈ శైలి యిష్టం" అన్నాడు వోవ్కా.

"అయితే, మన దారులు చీలిపోతాయి" అన్నాడు టీచరు విచారంగా.

"సరే, ఒకే దారిలో వెళ్లనక్కర్లేదు!" అంటూ వోవ్కా టీచరు మాటల్ని తుంచేశాడు.

ఎండలో మెరుస్తున్న బయల్లో గడ్డి సవసవలూ, మిడతల సన్నటి కీచుధ్వనులూ వినవచ్చేటంత నిశ్శబ్దం ఆవరించింది. కుర్రాళ్లూ, అమ్మాయిలూ తమతమ తలల్ని ఈజెళ్ల మీదకి వంచేశారు. వోవ్కా తన కుంచెలు తుడిచి, తాపీగా తన వస్తువులు సర్దుకోవడం

మొదలెట్టాడు. తనకి తెలియకుండానే, వాళ్లు తనని ఆపుచేస్తారని వాడు ఆశించాడు. కాని ఏ ఒక్కరూ వాడితో ఒక్క మాట కూడా అనలేదు, వాడు వెళ్లిపోయాడు.

వోవ్కా మెయిన్‌రోడ్డుమీద నడుస్తున్నాడు. కాని వాడికి తన ముందున్న వాటిలో కంటికి ఏ ఒక్కటీ ఆనడం లేదు. తను తన యింటి వైపు కాక ఎదర వైపు పోతున్నట్లు వోవ్కా అస్పష్టంగా గ్రహించాడు. సాధ్యమైనంత దూరం వెళ్లిపోవాలనీ, ఏ ఒక్కరి కంటా పడకూడదనీ వాడు అనుకున్నాడు. వోవ్కా రోడ్డునుంచి మళ్లి, అడవి కాలిబాటపట్టాడు. తనింక ఒక్కణ్ణే వున్నానని రూఢికాగానే వాడు పచ్చగడ్డిమీద బొక్కబోర్లా పడుకొని, వెక్కివెక్కి ఏడ్చాడు. అంతలోనే అంతః ప్రేరణ మూలంగా అన్నట్లు అకస్మాత్తుగా లేచాడు. తననేదో కుట్టినట్లు ఎగిరి గంతేశాడు. తన పిడికిళ్లు బిగించి, కోపంతో తన ముఖం మెలితిరుగుతూండగా వాడు ఎవళ్లనో బిగ్గరగా తిట్టి, వాళ్లనిలా బెదిరించనారంభించాడు: "నేను చూపిస్తా(నా రూపమంటే ఏమిటో, రంగంటే ఏమిటో మీకు చూపిస్తా(నా! నేను మీకు వర్ణఛాయ అంటే ఏమిటో, వర్ణవిన్యాసమంటే ఏమిటో చూపుతా(నా! మీకు అసలు ఏ ప్రతిభా లేదురా!" ఈ "మీరు" ఎవరో వోవ్కాకే తెలియదు. ఈ మాట ప్రధానంగా లియొనీద్ సెర్గేయెవిచ్‌కి వర్తిస్తుందని వోవ్కా చెప్పలేకపోయాడు. ఇన్ని జరిగినా టీచరంటే వాడికి యిష్టమే. ఆయన నిక్కచ్చితనాన్నీ, న్యాయబుద్ధినీ వాడు మెచ్చుకుంటాడు. పోతే యీ "మీరు" మిగిలిన కుర్రాళ్లకీ వర్తించదు. వాళ్లతో తనకి సరదాగానే గడిచింది. వాడేదో అగోచర శక్తిని సవాలుచేస్తున్నాడు. తనని ఒక వ్యక్తిగా గుర్తించని ఆ శక్తితో వాడు యిప్పుడే విడివడ్డాడు.

వాడు పెయింట్ బాక్సులోంచి తన చిత్రాన్ని పైకి తీశాడు. అంతకు ముందు పచ్చిక బయలులో తనకి కనిపించిన అసాధారణ స్వభావమూ, ఆకర్షణా ఏ అజ్ఞాత కారణంగానో మటుమాయమైనట్లు వాడు కనిపెట్టాడు. తను దోచుకోబడ్డ భావం కలిగింది వాడికి. ఎవరో తన చిత్రానికి బదులు మరొక తుక్కోజీ చిత్రం తెచ్చి దాని స్థానంలో పెట్టారని వాడికి అనిపించింది. వోవ్కా ఆ చిత్రాన్ని నేలమీదకి గిరవటేసి, దాన్ని తన శక్తి కొద్దీ కాళ్లతో మట్టెయ్యడం మొదలెట్టాడు. అప్పుడిక వాడు మళ్లీ ఏడ్వ నారంభించాడు. కన్నీళ్లు నిండుకునేదాకా ఏడుస్తూనే వున్నాడు.

తనింక చస్తే చిత్రాలు వేయనన్న దృఢ సంకల్పంతో వాడు యింటికి తిరిగివచ్చాడు.

లియొనీద్ సెర్గేయెవిచ్‌ని యీ ఒకే ఒక్క ఘటన ఆధారంగా నిందించకుండా వుండాలన్నా, ఆయన చర్యలు సహేతుకమైనవేనని ఒప్పుకోవాలన్నా మనకి ఆయన్ని గురించి మరికొంచెం బాగా తెలిసి వుండాలి.

చాలా తరచు మనం టీచరు చర్యలను లోతుగా పరిశీలించకుండా, మరీ నిర్ద్వంద్వంగా ఖండిస్తూ వుంటాం. టీచరు తన విద్యార్థిని గట్టిగా మందలించడం మనం చూసినప్పుడు

ఆయన మరీ స్ట్రిక్టుగా వున్నాడని ఆయన్ని మనం తిట్టుకుంటాం. కొందరు తల్లితండ్రులు తమ పిల్లల్ని కేకలేయడం చూసి మనం చటుక్కున వాళ్లు మరీ అంత స్ట్రిక్టుగా వుండ కూడదన్న తొందరపాటు నిర్ణయానికి వస్తూ వుంటాం! కాని కాలం గడిచాక స్ట్రిక్టు టీచరూ, కచ్చితంగా వుండే తల్లితండ్రులూ మంచి, తెలివైన, కార్యతత్పరులైన, బాగా చొరవ వున్న పిల్లల్ని తీర్చిదిద్దినట్లు మనం చూస్తాం.

అందుకే, టీచరుతో వోవ్కా జరూబిన్ బాంధవ్యపు చరిత్రని స్థూలంగానైనా ముందు తెలుసుకోకుండా, తొందరపాటు నిర్ధారణలకు రావద్దని నేను పాఠకుణ్ణి కోరుతున్నాను.

లియొనీద్ సెర్గేయెవిచ్ పిల్లలకి కళకీ, జీవితానికీ సంబంధించిన అత్యంత సంశ్లిష్ట మైన గతితార్కిక విషయాలను వివరించి చెప్పాడు. ఆయన వాళ్లకి నేపథ్యాన్ని శాసించే నియమాలను, చిత్రలేఖనానికి సంబంధించిన సాంకేతిక పద్ధతులను నేర్పి, వాళ్లలో అధి కతర సృజనాత్మకతను ప్రోత్సహించాడు. ఆయన వాళ్లకి సర్వజనాంగీకృతమైన నియమాలను ఉల్లంఘించినట్లు కనిపించి, అయినా కూడా గొప్ప కళాఖండాలను సృష్టించిన కళాకారుల చిత్రాలను చూపించి వాళ్లని గురించి చెప్పాడు.

వోవ్కా ఇంప్రెషనిస్టు కళాకరుల చిత్రాలను మొట్టమొదటిసారి చూసినప్పుడు, వాటి లోని రంగుల నదరుతనాన్ని చూసి అబ్బురపడ్డాడు. వెంటనే వాడికి చిత్రకళా నియమాలకి తోడు చిత్రకళలో మరింత ముఖ్యమైన మరేదో కూడా వుందన్న విశ్వాసం కలిగింది. సరిగ్గా యీ "మరింత ముఖ్యమైన మరేదో"నే వాడు కనుక్కోవలసి వుంది.

వాడు ప్రపంచాన్ని ఇంప్రెషనిస్టు చిత్రకారుల దృష్టితో చూసి వాళ్లని అనుకరించ నారంభించాడు. లియొనీద్ సెర్గేయెవిచ్ యీ విషయాన్ని గ్రహించగలిగాడు. ఆయన గమనించాడు గాని, యిది స్పష్టంగా కాపీ కొట్టడం అని వాచా అనలేదు. కుర్రాడి మనస్సును ఎక్కడ గాయపరుస్తానో అని ఆయన జంకాడు.

వాస్తవ ప్రపంచంలో సుందరమైనదాన్ని చూడటాన్నీ, డ్రాయింగుకీ, పెయింటింగుకీ సంబంధించిన మూల సూత్రాలకు జీర్ణించుకోవడాన్నీ ఆ కుర్రాడికి నేర్పడమే తన ప్రధాన కర్తవ్యమని లియొనీద్ సెర్గేయెవిచ్ గ్రహించాడు.

ఈ చిన్న వివరణనుంచి, వోవ్కా జరూబిన్ జీవితంలో పైన నేను వర్ణించిన ఘటన నుంచి, వాడి వ్యక్తిత్వాన్ని గురించీ, తర్వాత సంభవించిన ఘటనల ప్రాముఖ్యం గురించీ సాధారణ నిర్ధారణలు చేయడం సాధ్యమా? సాధ్యమనుకుంటున్నాను. వోవ్కా నిస్సందేహంగా ప్రతిభావంతుడు, అసాధారణమైన ప్రత్యేకత కలిగినవాడు. అయితే వాడిలో వస్తున్న మార్పు, వాడు పొందుతున్న అనుభవాలూ ఒక్క చిత్రకళలోనే కాకుండా, యితర కళల్లో, టెక్నాల జీలో, విజ్ఞాన శాస్త్రంలో, ప్రత్యక్ష కార్యకలాపాల్లో కొద్ది గొప్పల్లో ప్రతిభ కలిగిన అలాంటి కౌమార వయస్కుల్లో అధిక సంఖ్యాకులకు విశిష్టమైనవి. కచ్చితంగా చెప్పాలంటే, ఇక్కడ మనం చర్చిస్తున్నది స్వతహాగా ప్రతిభ కలిగివుండటం విషయం. పెరుగుతున్న మనిషి

స్వభావ, వ్యక్తిత్వాలను తీర్చిదిద్దడమనే విషయం. పిల్లల వ్యక్తిత్వం రూపొందడంనుంచి వాళ్ల ప్రతిభలను విడదీయడం సాధ్యం కాదన్న విషయం. ఎందుకంటే, పిల్లల సామర్థ్యాలు ఎంత స్పష్టంగా వెల్లడి అయితే వాళ్ల స్వభావం అభివృద్ధి చెందే క్రమం అంత ఎక్కువ సంశ్లిష్టం అవుతుంది. అదే సమయంలో, కౌమార వయస్కుల అభివృద్ధి, వాళ్ల సంవే దనల, భావాల, చర్యల అభివృద్ధికి సంబంధించిన క్రమం అంత ఎక్కువ ఉద్విగ్నంగా, అంత ఎక్కువ నిశితంగా వుంటుంది.

ఈ అనుభవాల వైశిత్యాన్నీ, అనుభవాల ఉద్విగ్నతనీ కౌమార వయస్కుల జీవిత పార్శ్వాలనూ, వాళ్ల వ్యక్తిత్వం తీసుకొంటున్న దిశనూ, దాని విలువలనూ, మొగ్గనూ పేర్కొనకుండా వివరించడం సాధ్యం కాదు. తన సంవేదనల తాజాతనంతో, స్పష్టతతో ఆకృష్టులైన పిల్లలు ప్రతి ఒక్క క్షణంకోసం, అత్యంత సమీప భవిష్యత్తుకోసం జీవిస్తారు. పిల్లల్లో అంతకంతకు అధిక అనూహ్యమైన యిష్టాయిష్టాలు, భావోద్వేగాలు ఉద్బుద్ధమవుతూ వుండటం మనం తరచు గమనించం. అదిగో సరిగా యీ ప్రాతిపదికపైననే కౌమార వయస్కులలో ప్రేరణలు, అవసరాలు, అంతేగాక వాటిని సంతృప్తిపరచే పద్ధతులు ఉత్పన్నమవుతాయి.

ఈ సంకీర్ణ అంతర్గత మనోస్థితి అస్థిరత్వం కౌమార వయస్కుల ఆసక్తుల్లో సులువుగా మార్పులు రావడంలో వ్యక్తమవుతుంది. అదే సమయంలో వాళ్లలో ఏదో ఒక కళారూపంలో ఆసక్తి, ఏదో ఒక సాంకేతిక విషయానికి నిబద్ధతా సమవసించవచ్చు. లేక దయగా చూడబడే అవసరం, అల్లరిపట్ల మొగ్గ వాళ్లలో ప్రదర్శితం కావచ్చు.

వాళ్ల ప్రవర్తన అవ్యవస్థితంగా ఉందని అనిపించవచ్చు. అయితే వాస్తవంలో, వాళ్ల కార్యకలాపాల్లో కొన్ని ఆషామాషీవిగా తేలగా, మరి కొన్ని ప్రగాఢమైనవిగా వుంటాయి. బౌద్ధిక, భావోద్వేగాత్మక, ఆచరణాత్మక అనుభవం సంచితమవుతుంది. ఏదైనా ఒకటి నిలిచి వుండి, వృద్ధిచెందుతుంది, స్థిరత్వాన్ని చేకూర్చుకొంటుంది. అయినప్పటికీ, "యాదృచ్ఛికతాంశం" కొంత పాత్ర విధిగా వహిస్తుంది. ఒక కౌమార వయస్కుడి అభిరుచులను, సామర్థ్యాలను, గర్భిత శక్తులను అంచనా వేసేందుకు ప్రయత్నించేటప్పుడు మనం ఈ అంశాన్ని తోసిపుచ్చలేము. ఈ యాదృచ్ఛికతాంశం నిర్దిష్ట వ్యక్తి వాస్తవిక లక్షణం అనబడేదానితో తరచు ముడిపడి వుంటుంది.

కౌమార వయస్కుడు తనలో అస్పష్టమైన "దేన్నో" యింకా అనుభూతిచెందుతూ వుండగా, అనుభవజ్ఞుడైన బోధకుడి నిశిత దృష్టి తన శిష్యుడిలో అస్పష్టమైన ఏదో సహజ ప్రతిభ చిన్నెలను కనిపెడతాడు. అది అభివృద్ధిచెందేందుకు బోధకుడు ప్రేరణ యిస్తాడు. ఈ ప్రేరణ ప్రభావంలో పిల్లవాడు స్వయంగా తన ప్రతిభలను మొట్టమొదటి సారి దర్శిస్తాడు. వాడి వ్యక్తిత్వం రూపొందడంలో యిది ముఖ్యమైన ఒక అంశం అవుతుంది.

బోధకుడికి సంబంధించినంతవరకు యీ ఘట్టంలో పొరపడకుండా వుండటం, ఏదో యాదృచ్ఛికంగా జరిగినదాన్ని నికరమైనదిగా అంచనావేసుకోకుండా వుండటం ముఖ్యం. అలాంటి పొరపాటు శిష్యుడికి తీవ్ర నష్టం కలిగిస్తుంది. కౌమార వయస్కుల సామర్థ్యాలను ఎక్కువగా మెచ్చుకోవడం మిక్కిలి ప్రమాదం. వాళ్ళు తమ పనిలో ఆత్మవిశ్వాసం పెంచుకొని, తాము ఎంపిక చేసుకున్న ఆ రంగానికి పూర్తిగా అంకితులవుతారు. అప్పుడది విషాదాంత మవుతుంది: వాళ్ల సామర్థ్యాలు వాళ్ళు అనుకున్నంత గొప్పవి కావనీ, తమలో వున్న శక్తులను వాళ్ళు అతిశయింపజేసుకున్నారనీ తేలుతుంది.

దీనికి పూర్తి భిన్నంగా కూడా జరగవచ్చు. నికరమైన ప్రతిభ మొదట సామాన్య ప్రమాణాలకు విరుద్ధమైన రూపంలో వ్యక్తమవుతుంది. మరి బోధకుడు సారాన్ని కాక రూపాన్ని మాత్రమే చూసి, కౌమార వయస్కులలో సరిగ్గా ప్రోత్సహించవలసిన దాన్నే అణచివేయ నారంభిస్తాడు.

వీటన్నింటినీ బట్టి మన పిల్లల ఆసక్తులపట్ల ఎంత జాగ్రత్త అయిన వైఖరి వహించాలో తేలుతుంది. ఏకపక్ష ప్రశంసా, విచక్షణారహితమైన విమర్శా రెండూ సమానంగానే హానికరమైనవి. మన వ్యాఖ్యలు వ్యవహార సరళిలో, ఆచరణాత్మక స్వభావం కలిగివుంటే, అది వేరే విషయం. నాసిగా చేసిన పనిలోనైనా సరే, నికరమైనదేమైనా కనిపిస్తే వాడితో "చూడు, యిది చాలా బాగా ఉంది. ఈ స్థాయికి తగ్గకుండా చేసేందుకు ప్రయత్నించు" అని చెప్పండి. అలాంటి వైఖరి చాలా ముఖ్యం. ఎందుకంటే, పిల్లలు తరచు తాము చేసిన వాటిని గురించి తామే వేసుకునే అంచనాల్లో అతి వుంటుంది.

వీటన్నింటినీ బట్టి చేసుకోగలిగిన నిర్ధారణలు ఏమిటి? నా సిఫారసులు ప్రధానంగా పిల్లల సృజనాత్మక కార్యకలాపాలకీ, వాళ్ల ప్రతిభల అభివృద్ధికి సానుకూలమైన కార్యకలాపాలకీ వర్తిస్తాయని నేనిక్కడ మరో సారి నొక్కిచెప్తున్నాను.

ఈ విధంగా, పిల్లల తొలి ప్రయత్నాలను గురించి విమర్శించేటప్పుడు, ఆ విమర్శ నిర్మాణాత్మకంగా వుండాలే గాని, వాళ్ల సృజనాత్మక శక్తులను నాశనంచేసేదిగా వుండకూడదు. మొరటు, నిశిత విమర్శల మాదిరిగానే వ్యంగ్యమూ, వెక్కిరింతా కూడా, పిల్లల్లో తమ అభివృద్ధికి తోడ్పడే కార్యకలాపాల్లో పాల్గొనాలన్న అభిలాషను మలిపివెయ్యవచ్చు.

అయితే మీరొక ప్రశ్న వేయవచ్చు. పిల్లల డ్రాయింగో, మోడలింగో, ఎంబ్రాయడరీయో మరీ అధ్వానంగా వున్నప్పుడు, వాళ్ళు తప్పు దోవ పట్టకుండా ఉన్నదున్నట్లు వాళ్లకి నిజం చెప్పకూడదా? అదేమిటి, చెప్పవలసిందే! వాళ్లకి నిజాన్నే, నిజాన్ని మాత్రమే చెప్ప వలసిందే. అయితే యిక్కడ సమస్యల్లా యీ కటిక నిజాన్ని వాళ్లకి ఎలా చెప్పడం, ఏ రూపంలో చెప్పడం, ఏ మోతాదులో చెప్పడం అన్నదే.

అత్యున్నత ప్రమాణాలు డిమాండుచేసే అత్యభ్యర్థన తత్వానికి హద్దులు లేకపోతే అదెప్పుడూ వ్యక్తిత్వాన్ని శుష్కింపజేస్తుంది. నిజానికి వోవ్కా జరూబిన్ విషయంలో జరిగింది

సరిగ్గా యిదే కదా? తన చిత్రాన్ని మహోత్సాహంగా అదో కళాఖండం అన్నట్లు చూసిన కేవలం రెండు గంటల తర్వాత వాడు దాన్ని అసహ్యించుకొనేందుకూ, దాన్ని చింపి పోగులు పెట్టేందుకూ దారితీసింది విమర్శ. ప్రస్తుతానికి మనస్సు గాయపడటం సమస్యనీ, ఘర్షణ పరిస్థితినీ పక్కన పెడదాం. ఈ సమస్య యింత కంటె చాలా లోతైనది. సృజనాత్మక కార్యకలాపాల్లో నిమగ్నులైన తరుణాల్లో పిల్లలు తన్మయత్వ స్థితిలో వుంటారు. అలాంటప్పుడు వాళ్ల ఆత్మలు వాళ్ళు సృజించినవాటితో సంలీనమవుతాయని చెప్పవచ్చు. అప్పుడిక వాళ్లకి దాని కంటె ప్రీతిపాత్రమైనది మరొకటేదీ లేదని అనిపిస్తుంది. ఒక పిల్లవాడు ఏ కర్ర ముక్కతో చిన్న కాల్వను తవ్వి, దానిలో పడవను ఒక గుంటలో నడిపించేందుకు ప్రయత్నిస్తున్నప్పుడు, మీరు ఆ కాల్వను తొక్కి చూడండి ఏమవుతుందో. అదేదో నిజంగానే ఘోర విపత్తు వాటిల్లినట్లు వాడు గొల్లుమంటాడు. కాని ఒక అరగంట గడిచాక, అదే పిల్లవాడు తను అంతకు ముందు మహా సముద్రాల్లో పయనించే ఓడలా భావించిన ఆ కర్ర పడవను తనే తొక్కిపారేస్తాడు, తను నిర్మించిన కాలవను తనే నాశనం చేస్తాడు. పొంగు చల్లారిందా, అన్నీ మామూలు సాదా వస్తువులుగా కనిపిస్తాయి.

అయితే, చిన్న వయస్సులో అలాంటి అత్యభ్యర్థన తత్వం, అదెంత దౌర్జన్యపూరితమైనదైనా కూడా, నిరపాయకరమైనదే. కౌమార వయస్కుడిలో అది మరీ అంత ఎక్కువ నష్టదాయకం కాని పరిణామాలకు దారితీయవచ్చు.

సరిగా యీ కారణంగానే టీచరు అత్యభ్యర్థన తత్వంతో కూడిన తీర్పులు చెప్పకూడదు. అయితే, యీ విషయంలో కొన్ని మినహాయింపులు వుండవచ్చు. ఈ సందర్భంగా వోవ్కా జరూబిన్‌పట్ల చిత్రకళా స్టూడియో టీచరైన లియొనీద్ సెర్గేయెవిచ్ ప్రవర్తించిన తీరు ప్రత్యేకించి నా మనస్సులో మెదులుతోంది.

నేను యింతకు ముందు చెప్పినదానికి యిది విరుద్ధమా? కాదు. బోధన శాస్త్రీయ చర్యను దేన్నైనా విమర్శించేటప్పుడు, వివిధ అంశాలను పరిగణనలోకి తీసుకోవలసి వుంటుంది. వాటిలో కెల్లా అతి ముఖ్యమైనది పిల్లల మానసిక స్థితి.

బోధకుడు తన ముందు పెట్టుకునే లక్ష్యాలను మనం తెలుసుకోవాలి. ఇక్కడ అసలు విషయం యేమిటంటే, పెద్దవాళ్లకీ పిల్లలకీ మధ్య సంబంధాలు బోధన కృషిలో సంయోగించెందుతాయి. ఈ సంబంధాల క్రమాన్నీ, జరూబిన్‌లోని సృజనాత్మక ప్రతిభ జాగృతం చేయబడిన పద్ధతినీ నేను తర్వాత వివరిస్తాను. అయితే ప్రస్తుతానికి పిల్లల పెంపకపు కృషిలో అద్వితీయమైనదాన్ని గురించీ, అద్వితీయతని గురించీ నేనిక్కడ ప్రస్తావిస్తాను.

కుర్రాడిలో నిస్సందేహంగా ప్రతిభ వుందన్న విషయం లియొనీద్ సెర్గేయెవిచ్ కనిపెట్టాడు. వాడిలో ఆత్మవిశ్వాసానికి దోహదంచేశాడు. అయితే, వాడి యీ ఆత్మవిశ్వాసం మరో అతికి దారితీసి, వోవ్కాలో తను అద్వితీయుడినన్న అతిశయాన్ని పెంపొందించింది. వాడింకా స్వాతంత్ర్యానికి అంతగా సన్నద్ధుడు కాకపోయినప్పటికీ, వాడు బుద్ధిపూర్వకంగా యీ

స్వాతంత్ర్య చట్రాన్ని విస్తరింపజేసుకున్నాడు. మరి అలాంటి కుహనా స్వేచ్ఛ పిల్లల పెంపకానికి మొరటు బలాత్కారం, ఆదేశం లేక నిర్బంధం ఎంత హానికరమైనదో అంత హానికరం.

లియొనీద్ సెర్గేయెవిచ్ నచ్చచెప్పడం ద్వారా వోవ్కని క్రమశిక్షణలో పెట్టేందుకు ప్రయత్నించాడు. దానివల్ల యేమీ ప్రయోజనం లేకపోయింది. కుర్రాడిలో అతిశయం బలిసింది. టీచరు తన జీవిత కాలంలో స్వయంగా చిత్రకళలో సృజనాత్మక కృషి యేమీ చెయ్యలేదని వాడు వ్యంగ్య ధోరణిలో భావించడం మొదలెట్టాడు. తన టీచరు గొప్పతనం సరిగ్గా ఆయనకి వున్న బోధన శాస్త్రీయ ప్రతిభయేనన్న విషయం వాడు గ్రహించలేదు. అంటూ వాడు నిర్ద్వంద్వంగా తర్కించుకున్నాడు. మరో వైపున, వోవ్కా జరూబిన్ అనే తనలో మహా ప్రతిభ వుందనీ, మిగిలిన ప్రతివాడూ ప్రతిభ లేనివాడేననీ అనుకున్నాడు. తన వ్యక్తిగత స్వేచ్ఛలో వాళ్ళు జోక్యం కలిగించుకోనంతవరకు వాళ్ల అస్తిత్వాన్ని గుర్తించేందుకు తను సిద్ధంగా వున్నాడు. అయితే, ఆ స్వేచ్ఛ యిప్పటికే వాడిని అణచివేయనారంభిస్తోంది; వాడి ఆత్మలో ఎవ్వరూ నింపజాలని గాఢమైన శూన్యాన్ని కల్పిస్తోంది.

మరో వైపున, లియొనీద్ సెర్గేయెవిచ్ తన శిష్యుడిలో వస్తున్న మార్పును పూర్తి సరిగ్గా అర్థంచేసుకున్నాడు. తన జీవిత కాలంలో ఆ అనుభవజ్ఞుడైన బోధకుడు తమ సామర్థ్యాలను అభివృద్ధిచేసుకోలేకపోయిన చాల మంది ప్రతిభావంతులను చూశాడు. కొందరు తమ అతిశయం వల్ల పాడైతే, మరి కొందరు క్రమశిక్షణ కొరవడటం వల్ల పాడయారు. కొందరు విజయం సాధించాలన్న కాంక్షతో పాడైతే, యింకా కొందరు ఆత్మవిశ్వాసం కోల్పోయినందున తమ వ్యక్తిత్వాన్ని పోగొట్టుకున్నారు. నికరమైన ప్రతిభ అన్నది, దాన్ని సంయమనంతో వినియోగించుకుంటే, అది ఆ వ్యక్తికి సంతోషాన్నే కాక వేదనను కూడా కలిగిస్తే, సంపూర్ణ స్థాయికి అభివృద్ధిచెందుతుంది. నేనిక్కడ కేవలం స్పృశించిన విషయాన్ని యిక ముందు విపులంగా వివరిస్తాను.

వోవ్కా టీచరు దృష్టిలో వాడు బలమైన వ్యక్తిత్వం కలిగినవాడు. ఆ కుర్రాడు తన సొంత బాధలను అనుభవించవలసిన సమయం వచ్చిందనీ, అది మాత్రమే వోవ్కా స్వాతిశయాన్నీ, అహంభావాన్నీ వదిలించుకొనేందుకు తోడ్పడగల తరుణం వచ్చిందనీ లియొనీద్ సెర్గేయెవిచ్‌కి నమ్మకం కలిగింది.

తన విద్యార్థికి తనెంత బాధను కలిగించాడో ఆ టీచరుకి తెలుసా? తెలుసు. వోవ్కా కొంత కాలం పాటు పాఠాలకోసం స్టూడియోకి రాడని కూడా ఆయనకి తెలుసు. అంతే కాదు, వాడిని యీ తరుణంలో ఎలాంటి పరిస్థితుల్లోనూ నిర్లక్ష్యం చేయకూడదని తెలుసు. అయితే అదే సమయంలో ఆయనకి మరో విషయం కూడా తెలుసు. వోవ్కా తన బాధల అగ్ని గుండంలో తనని తాను "తప్తం" చేసుకోకపోతే, తనని గురించి తనకి వున్న అభిప్రాయాన్నీ, తనలో నమ్మకం పెట్టుకొని, తనపట్ల దయగా వున్న వారిపట్ల తన అభి

ప్రాయాన్నీ మార్చుకోకపోతే వాడికి సరైన భవిష్యత్తు వుండదని ఆయనకి తెలుసు.

అదే సమయంలో యీ పరీక్షను తట్టుకోగల మనో స్థైర్యం జరూబిన్‌కి వున్నట్లు టీచరు పరిగణించాడు. వోవ్కా నాటకీయ "నిర్గమనం" విషయంలో అందుకే లియోనిద్ సెర్గేయెవిచ్ నిమ్మకి నీరెత్తినట్లు శాంతంగా వుండిపోయాడు. కుర్రాడు "కళ"నుంచి పారిపోలేడన్న విషయం ఆయనకి తెలుసు.

వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దడాన్ని రెండు పక్కలనుంచి చూడవచ్చు: ఒక వైపున, అది ఒక వ్యక్తిలో గర్భితంగా వున్న గుణాలను క్రమంగా అతను క్రమేణా స్వయంగా కనుక్కోవడం, రెండో వైపున, అది బాహ్య ప్రభావాల, ప్రత్యక్ష లేక పరోక్ష బోధన ఫలితం. పైపెచ్చు బోధన శాస్త్రీయ, మనస్తత్వ శాస్త్రీయ అధ్యయనాలు రెండవ పద్ధతిని గట్టిగా సిఫారసు చేస్తున్నాయి. తత్వశాస్త్రవేత్తలూ, మనస్తత్వ శాస్త్రజ్ఞులూ పిల్లల పెంపకం, అభివృద్ధుల విరుద్ధ స్వభావం గురించి వక్కాణించి చెప్తున్నారు. ఒక వైపున, పరిసరాలు, పెంపకాల బాహ్య ప్రభావాలమీద మాత్రమే ఆధారపడకూడదు, పిల్లవాడిలో బాహ్యప్రభావాల క్రియా రహిత ప్రభావాల ఫలితాన్ని మాత్రమే చూడకూడదు. మరో వైపున, వ్యక్తి గుణగణాల సద్యోజనిత స్వీయాభివృద్ధిమీద మాత్రమే ఆధారపడకూడదు. ఈ రెండు క్రమాలూ పరస్పర సంబంధితాలు, పరస్పరం ఒకదానిమీద మరొకటి ఆధారపడినవి.

కళపట్ల వోవ్కా జరూబిన్ ఆసక్తి ఎలా వెల్లడైందో వివరిస్తాను.

...స్కూల్లో అందరూ నూతన సంవత్సర ఉత్సవానికి సన్నాహాలు చేస్తున్నారు. అప్పుడు వోవ్కాకి పది ఏళ్లు. ప్రతి ఒక క్లాసూ పది నూతన సంవత్సర చిత్రాలు తయారుచెయ్యాలి. అవి స్కూలు గదుల తలుపులను, గోడలను, కిటికీలను అలంకరించేందుకు ఉద్దేశింపబడ్డ చిత్రాలు. పిల్లలు ఆడిటోరియంలో చిత్రాలు వేయపూనుకున్నారు. డ్రాయింగు టీచరు అలెక్సాండ్ర్ ఇవానొవిచ్ వాళ్లకి మార్గదర్శకంగా కొన్ని రేఖా చిత్రాలు, పోస్టర్లు, పిక్చర్ పోస్టు కార్డులు చూపించాడు. పిల్లల్లో అధిక సంఖ్యాకులు వాటిని కాపీ చెయ్యడం మొదలెట్టారు. కాని వోవ్కా ఎగురుతున్న రెండు కుందేళ్లు, క్రిస్మస్ తాత, ఒక ఫర్ చెట్టు, నక్షత్రాలతో కూడిన ఒక చిత్రం స్వయంగా వేశాడు. అలెక్సాండ్ర్ ఇవానొవిచ్ తన వెనక్కి ఎప్పుడు వచ్చిందీ వోవ్కా గమనించనే లేదు. ఈ టీచరులో ఏదో ప్రత్యేకత వుంది. ఆయన హాస్యగాడని చెప్పలేము. అలాగని, ఆయన ఎప్పుడూ సీరియస్‌గానూ వుండడు. ఆయన కేసి చూసినప్పుడు చిరునవ్వు నవ్వకుండా ఎవరూ ఉండలేరు. ఆయనకి పిల్లలు "బాగు బాగు" అనే వెక్కిరింత పేరు పెట్టారు. ఈ మాట ఎప్పుడూ ఆయన నాలుక చివర వుండటమే యిందుకు కారణం. ఆయన యీ మాటని అన్ని సందర్భాల్లోనూ, తన అసంతుష్టిని వ్యక్తంచెయ్యదలచినప్పుడు సైతం వాడేవాడు. అలాంటి సందర్భంలో యీ "బాగు బాగు" విచారసూచకంగా సాగదీసినట్లు వినవచ్చేది. అయితే, అలెక్సాండ్ర్ ఇవానొవిచ్ ప్రత్యే

కించి ఎవరినైనా మెచ్చుకోదలచినప్పుడు ఆయన యీ "బాగు బాగు"కి నికరమైన సంతోషం జోడించేవాడు. ఆయన నోట యీ మాట సాటి లేనిది, బ్రహ్మాండం, బలే అందంగా వుంది అంటున్నట్లు అతి పొగడ్తలా వుండేది! ఈ అర్థ భేదాల వివరం పిల్లలకి చాలా బాగా తెలుసు.

ఇప్పుడు ఆయన జరూబిన్ దగ్గరకి వెళ్లి అన్న "బాగు బాగు" అనే మాట పిల్లలకి అసాధారణంగా వినరావడంతో చాలా మంది పిల్లలు వోవ్కా దగ్గరకి పరుగెత్తుకు వెళ్లారు. అలెక్సాంద్ర్ ఇవానొవిచ్‌కి ప్రకాశంగా తర్కిస్తున్నట్లు మాట్లాడటం ఇష్టం. ఆయనకి హాస్యస్ఫోరకమైన మాటలు వాడి సీరియస్ విషయాలు చెప్పే అద్భుతమైన సామర్థ్యం వుంది. బహుశా అన్నిటి కంటె ముఖ్యంగా యీ మాటలే ఆ టీచరుపట్ల పిల్లలు ఆకర్షితులయ్యేందుకు కారణం కావచ్చు.

"కాని యివి కుందేళ్లు కావు సుమా" అన్నాడాయన. ఆ మాటలు ఆయన ఎంత నొక్కి పలికాడంటే, అవి కుందేళ్లు కావనీ, వాటికి అంత కంటె చాలా ఎక్కువ ప్రాధాన్యం వుందనే విషయంలో ఏ ఒకరికీ సందేహం లేకుండా పోయింది. "ఇవి క్లాసునుంచి బయటకి పంపించేసిన ఐదో క్లాసువాళ్లు. చూడండి వాటి తోకలు ఎలా ముడుచుకుంటున్నాయో. కళ్లు ఎంత తెలివిగా వున్నాయో!" క్రిస్మస్ తాతకేసి చూపించి, "మరి యిదెవరో తెలుసా, క్లాస్ టీచరు..." అన్నాడు.

"అయితే, అన్నింటి కన్న ముఖ్యమైనదేమిటంటే, రంగులు. ఈ ఆకుపచ్చ, ఎరుపు రంగులు అలంకారప్రాయంగానూ వున్నాయి, భావస్ఫోరకంగానూ వున్నాయి – యిది బ్రహ్మాండంగా వుంది!" అంటూ కొనసాగించాడు అలెక్సాంద్ర్ ఇవానొవిచ్.

మరో రెండు నెలలు గడిచిపోయాక స్కూల్లో చిత్ర కళోత్సవం జరిగింది. వోవ్కా ఆ ప్రదర్శనలో పెట్టేందుకు ఏదైనా చిత్రం వెయ్యాలనుకున్నాడు. వాడు పైన ఆకాశం, కింద భూమి, మనుషులు, వగైరాలతో కూడిన చిత్రం వేశాడు. నిజానికి వాడు అదే వర్ణ సముదాయాన్ని వాడాడు. నీలం, ఆకుపచ్చ రంగుల సమ్మిశ్ర నేపథ్యంలో జాజ్వల్యమైన ఎరుపు రంగులో మనుషుల్ని, జ్వలిస్తున్నట్లున్న ఎరుపు వన్నెలో ఒక అంతరిక్ష నౌకనీ వేశాడు. తన టీచరు పొగడ్తని దృష్టిలో పెట్టుకుని వోవ్కా ఒక్క నిమిషం కూడా తటపటాయించకుండా సరిగ్గా అవే రంగులు వాడాడు. అలెక్సాంద్ర్ ఇవానొవిచ్ మరో సారి జరూబిన్ చిత్రాన్ని చూశాడు. ఆ పోటీలో జరూబిన్ చిత్రం కూడా బహుమతి పొందింది. అలెక్సాంద్ర్ ఇవానొవిచ్ వాడితో "సంగతేమిటంటే వోవ్కా, నువ్వు చిత్రకళా విభాగంలో చేరితే బాగుంటుంది. ఈ బొమ్మ ఫరవాలేదు, బాగానే వుంది. నువ్వు మన చిత్రకళ తరగతిలో చేరు" అని చెప్పాడు.

నిజం చెప్పాలంటే, మొదటి మూడు పాఠాలూ వోవ్కా జరూబిన్‌కి చిత్రకళపట్ల ఉత్సాహాన్ని కొంచెం మందగింపజేశాయి. వోవ్కాకి కూజాలు, సీసాల్లాంటి అప్రాణి వస్తువులు

గీయడమంటే ఆసక్తి లేదు. అయితే తనపట్ల డ్రాయింగ్ టీచరుకి వున్న ఆపేక్షతో కూడిన వైఖరి వోవ్కాని డ్రాయింగు క్లాసులకి ఆకర్షించింది. వోవ్కా చిత్రకళలో తనేమీ ముందుకి వెళ్లడం లేదనీ, క్లాసులకి వెళ్లడం మానెయ్యాలనీ అనుకున్న తరుణాలు కూడా లేకపోలేదు. సరిగ్గా వాడు అలాంటి నిర్ణయాలు చేసుకున్నప్పుడే అలెక్సాండ్ర్ ఇవానొవిచ్ వాడి దగ్గరకి వచ్చి "దానిలో ఎదుగూబొదుగూ లేకపోవడమేమిటి, దానిలో 'ఏదో విశేషం' వుంది. చూడు యీ గీత ఎంత బాగా వచ్చిందో" అంటూండేవాడు. గీతలన్నింటిలోనూ చాలా బాగా వున్న గీత వెతికి టీచరు ఆ చిత్రంలో ఏదో విశేషం వుందని నిరూపించేవాడు.

ఈ "ఏదో విశేషం" అన్నది వోవ్కా జరూబిన్ మనస్సులో గాఢంగా నాటుకుపోయింది. తనకి కొన్ని సామర్థ్యాలు వున్నాయన్న ఆత్మవిశ్వాసం క్రమంగా వాడికి కలిగింది. వాడి తోటి విద్యార్థుల్లో వాడికి చిత్రకారుడన్న గుర్తింపు వచ్చింది. క్లాస్ రూములో ఏదైనా అలంకరణ చెయ్యాలన్నా, క్లాస్ వార్తా పత్రిక తయారుచెయ్యాలన్నా వోవ్కా జరూబిన్‌ని పిలుస్తూండేవారు. ఒకసారి వాళ్ల అమ్మ "స్కూలు పూర్తి చేశాక, నువ్వు దేంట్లో చేరాలనుకుంటున్నావురా?" అని అడిగింది. "ఇంకెక్కడ? చిత్రకళ స్కూల్లోనే" అని వాడు జవాబిచ్చాడు.

వాడు తన తీరిక కాలమంతట్నీ చిత్రకళకే వినియోగిస్తూండేవాడు. వాడు రంగులను శ్రద్ధగా పరిశీలనగా చూస్తూండేవాడు. వాడు వీధిలో నడుస్తూ అకస్మాత్తుగా ఆగి, కళ్లు చెదరగొట్టే మంచు నేపథ్యంలో ఎర్రటి బస్సుకేసి తదేకంగా చూసేవాడు. వాడు దృశ్యాలన్నీ గుర్తుపెట్టుకునేందుకు ప్రయత్నిస్తూండేవాడు. వాడు యింటికి తిరిగి వచ్చి, తను చూసిన దృశ్యాలను పునః సృష్టించేందుకు ప్రయత్నిస్తూండేవాడు. అయితే వోవ్కాకి ఆయిల్ పెయింటు అన్నిటికంటె ముఖ్యమైన ఆవిష్కారంగా పరిణమించింది. వాటితో చిత్రాలు వెయ్యడం బాగా తేలిగ్గా, మరింత ఆసక్తికరంగా కనిపించింది. వాటితో చిత్రాలు వేసేటప్పుడు డ్రాయింగులో కూలంకష జ్ఞానం సంపాదించుకోవలసిన బెడద వుండదు. వాడు ఆషామాషీగా చెట్లు గీసి, అప్పుడు వాటికి రంగులు ఎంచుకునేవాడు. దాంట్లో డ్రాయింగు లేనట్లు అనిపించింది. అయితేనేం, బ్రహ్మాండమైన పెయింటింగు తయారవుతుంది. అన్నట్లు, తన యీ ఆవిష్కరణ గురించి వాడు అలెక్సాండ్ర్ ఇవానొవిచ్‌కి చెప్పాడు కూడా. ఆయన చాలా సంతోషించి, వాడి చిత్రాలను తనకి చూపించమని అడిగాడు. ఒకసారి వోవ్కా ప్లైవుడ్ చెక్కలమీద తను వేసిన పెయింటింగులను స్కూలుకి తీసుకెళ్లాడు.

అలెక్సాండ్ర్ ఇవానొవిచ్‌కి ప్రత్యేకించి ఎర్ర బస్సు చిత్రం నచ్చింది. ఆయన వాడిని ఆ చిత్రాన్ని తనకి బహూకరించమని అడిగాడు. అంతే కాకుండా ఆయన వోవ్కాతో, "నువ్వు అసలైన ఆర్టు స్టూడియోలో చేరాలని అనుకుంటున్నాను. నేను నీ చిత్రాల్ని నా ఆర్టిస్టు మిత్రుడొకాయనకి చూపిస్తాను" అన్నాడు.

అలెక్సాండ్ర్ ఇవానొవిచ్ సిఫారసుమీద వోవ్కా జరూబిన్ లియొనీద్ సెర్గేయెవిచ్ స్టూడియోలో చేరడం అదిగో అలాగ సంభవించింది.

కొత్త టీచరు చాలా స్ట్రిక్టుగా వుండే బాపతనీ, పని విషయంలో ఏ మాత్రం అలసతనీ సహించడనీ వోవ్కా గమనించాడు.

లియొనీద్ సెర్గేయెవిచ్ వోవ్కాతో యిలా చెప్పాడు: "చిత్రకళ నేర్చుకోవాలంటే చాలా కృషి చెయ్యాలి. బాబూ, యిప్పటికి నీకున్నదల్లా రంగుల విషయంలో కొంత ప్రజ్ఞ. అది చాలా మంచిదే అనుకో. కాని నీకు చిత్రకళకి సంబంధించిన జ్ఞానం అవసరం. నువ్వు పెయింటింగ్ టెక్నిక్కులు కూలంకషంగా నేర్చుకోవాలి."

ఆ స్టూడియోకి వచ్చే కుర్రాళ్లతో వోవ్కాకి పరిచయం ఏర్పడింది. వాళ్లకి అప్పుడే వాళ్ల సొంత పెయింటింగులు వున్నాయి. వాళ్లు కళాకారుడి వృత్తిపరమైన పరిభాషలో మాట్లాడేవారు. వోవ్కాకి యిది నచ్చింది.

తన మిత్రులు పని చేసే తీరు చూసేసరికి వోవ్కాకి కాళ్లు చల్లబడ్డాయి. తను వాళ్లలాగ ఎన్నడూ పెయింటు చేయలేనని దిగాలుపడ్డాడు. కాని ఒకసారి లియొనీద్ సెర్గేయెవిచ్ వాడి దగ్గరకి వచ్చి, వాడి పెయింటింగు చేతిలోకి తీసుకుని యిలా చెప్పడం మొదలెట్టాడు:

"జరూబిన్‌కి తను వేస్తున్న వస్తువుకి సంబంధించిన ప్రధానమైన రేఖలను దాదాపు వెంటనే పట్టుకోగలిగిన సత్తా వుంది. ఇతను వేసే ప్రధానమైన గీతలు వస్తు నిర్మితిని క్షణంలో పట్టేస్తాయి. అంతే కాదు, అవి కచ్చితంగా సరైన గీతలు. వీటి తర్వాత అతను చెయ్యవలసిందల్లా వివరాలు నింపడం మాత్రమే. అదిగో అందులోనే యితనికి ఓపిక కొరవడింది."

లియొనీద్ సెర్గేయెవిచ్ మధ్యమధ్య వోవ్కా తీసుకునే విశృంఖల స్వేచ్ఛ విషయంలో వాడిని మందలిస్తూండేవాడు. అయితేనేం, తన సామర్థ్యాలను ఆయన గుర్తించాడనీ, తనలో "ఏదో విశేషం" వుందనీ వోవ్కా తెలుసుకున్నాడు.

తను ప్రజ్ఞావంతుడిననీ, తన భావి అవకాశాలు తప్పకుండా ఆసక్తికరంగా వుంటాయనీ – యిదీ క్రమంగా వోవ్కా తనని గురించి తాను ఏర్పరచుకున్న అభిప్రాయం. వాడు తన స్వప్నాల్లో యితరుల మధ్య తనని తానొక స్వతంత్రుడిగా, ఆత్మస్థైర్యం కలిగినవాడిగా చూసుకోనారంభించాడు. కలల్లో తను పెద్దవాడినైనట్లూ, తను సుప్రసిద్ధ చిత్రకారుడైనట్లూ, పత్రికల్లో తన వ్యాసాలు సైతం ప్రచురింపబడుతున్నట్లూ వోవ్కా ఊహించుకోనారంభించాడు. అన్నిటికంటె ముఖ్యంగా తన భావి భారీ చిత్రాలను ఊహించుకున్నప్పుడు వోవ్కాకి పరమానందం కలిగేది. యథార్థ వస్తువులతో, మనుషులతో, సన్నివేశాలతో కలగాపులగమైపోయే ఆ చిత్రాలు అసాధారణమైన, అద్భుతమైన, జాజ్వల్యమానమైన వర్ణాలతో మెరిసిపోతూండేవి. ఒక్కొక్క సారి వాడికి చిత్ర దృశ్యం, దానిలో విడివిడి వివరాలు ఎంత స్పష్టంగా కనిపించేవంటే, తన మనో ఫలకంమీద చిత్రితమైన ఆ దృశ్యం ఎక్కడ చెదిరి

పోతుందో నన్న భయంతో వాడు రివ్వున యింటికి పరుగెత్తుకువెళ్లేవాడు. రంగులు తీసుకుని చిత్రించనారంభించేవాడు. అలాంటి రోజుల్లో వాడు రోజంతా కూర్చుని చిత్రం వేయగలిగేవాడు. చిత్రం పూర్తి అయాక వాడికి అసంతృప్తి కలిగేది. నిట్టూర్పులు విడుస్తూండేవాడు. మొదట్లో వాడికి కొన్ని వివరాలు అసంపూర్తిగా వున్నట్లు అనిపించేది. తర్వాత వాడికి చిత్రపు కూర్పులో దోషాలు కనిపించేవి. సంధ్య కాంతిలో తనని వివశుణ్ణి చేసిన నగర భాగం చిత్రంలో అంతగా తన మనస్సును ఉత్తేజితం చేస్తున్నట్లు వాడికి అనిపించలేదు. వాడు తన చిత్రాన్ని ఎవరికైనా చూపించి, అభిప్రాయం తెలుసుకోవాలని అనుకున్నాడు. వాడు తన చిత్రాన్ని తన తల్లికి చూపించాడు కాని ఆవిడ జోకులు వేసి, చిత్రాన్ని అంతగా పట్టించుకోలేదు. తన కొడుకులో రేకెత్తిన యీ చిత్రకళాభిరుచి తాత్కాలికమైనదనీ, అది త్వరలోనే కరిగిపోతుందనీ ఆవిడ అనుకుంది. చాలా తరచుగా ఆవిడ "ఇదంతా బాగానే వుందిగాని, చదువు సంగతి ఏమిటి?" అంటూ వుండేది. అప్పుడిక వోవ్కాకి తన తల్లితో తన సందేహాలు వెల్లడించి ప్రయోజనం శూన్యం అనిపించేది. వాడు ఉగ్గబట్టుకుని, మౌనంగా వుండిపోయి, జీవితంలో మళ్లీ ఎప్పుడూ తన తల్లిని యిలాంటి ప్రశ్నలు వెయ్యకూడదని తీర్మానించుకున్నాడు.

రెండేళ్లలో వోవ్కావి సుమారు ఒక వంద ప్రకృతి దృశ్యాలు పోగుపడ్డాయి. వాడు వాటిలో కొన్నింటిని లియొనీద్ సెర్గేయెవిచ్‌కి చూపించేందుకు ఎంపికచేశాడు. మిగిలినవాటిని ఆయనకి చూపేందుకు బెదిరాడు. వాడు ఎంపికచేసిన చిత్రాలు ప్రకృతిలో చూసి, చిత్రకళా నియమాల మేరకు తను వేసిన వాస్తవిక రేఖాచిత్రాలు. మిగిలినవి చాలావరకు స్మృతినుంచి వేసినవి. అవి కాల్పనికమైనవాటినీ, అభూతమైనవాటినీ మిళితంచేసి వేయ ప్రయత్నించిన చిత్రాలు. మొదటి రకం చిత్రాలను వాడు ప్రశాంతంగా, శ్రద్ధగా వేయగా, రెండో రకం చిత్రాలు అత్యంత ఉత్తేజిత మానసిక స్థితిలో ఉన్నప్పుడు వేసినవి. ఒక సారి వాడు తన చిత్రాలను అలెక్సాండ్ర్ ఇవానొవిచ్‌కి చూపించాడు.

"నేను పెద్దగా యేమీ చెప్పలేననుకో. ఇవి ఆసక్తికరంగానే ఉన్నాయి గాని, అసహజంగా వున్నాయి. నా సలహా యేమిటంటే, వాస్తవిక పెయింటింగు పద్ధతిని నువ్వు కూలంకషంగా నేర్చుకుంటే మంచిది" అన్నాడాయన.

అప్పట్నుంచి వోవ్కా జరూబిన్ తన చిత్రాలను తన పాత టీచరుకి చూపి, సలహా అడగడం మానేశాడు.

వోవ్కా జరూబిన్ తన చిత్రాలను తన క్లాసుమేట్లకి కూడా చూపించాడు. కుర్రాళ్లు వాటిని చూసి, "భలే!" అనో, "ఇదేమిటి, యిలా వుంది?" అనో మాత్రమే అనేవాళ్లు. "ఇంతకీ, నువ్వు దీంట్లో చిత్రించాలనుకున్నది యేమిటి?", "మంచు ఎక్కడైనా పచ్చగా వుంటుందా?", "ఆదేమిటి, అక్కడ మనిషి తలమీద ఇల్లుందేమిటి?" అంటూ వాళ్లు ప్రశ్నలు వేసినప్పుడు వాడికి చిరెత్తుకొచ్చేది.

యూరా వీన్నిక్ చిత్రకళ విషయంలో తనని తానొక నిపుణునిగా పరిగణించుకునేవాడు. వాడు వోవ్కా చిత్రాలను సంశయాత్మకంగా చూసి, చివరకు "నువ్వు ఇప్పుడు ఫేషనులో వున్న పద్ధతిలో చిత్రాలు వేసేందుకు ప్రయత్నిస్తున్నావు. నువ్వు ఇంప్రెషనిస్టు చిత్ర కారులని అనుకరిస్తున్నావు..." అన్నాడు.

కోస్త్య బోయెవ్ ఒక్కడు మాత్రమే వోవ్కాలో నికరమైన ప్రతిభ వుందని నచ్చ చెప్పేందుకు ప్రయత్నించాడు.

"నువ్వు యెవళ్ల మాటా పట్టించుకోకురా. చిత్రకళ విషయంలో నీ ఇంగితం ఎలా చెప్తే అలా వెయ్యి" అన్నాడు.

నిజానికి కోస్త్య తనని గురించి తను యీ మాటే చెప్పుకున్నాడు. వాడు కవిత్వం రాశాడు. తను ఎప్పుడూ ఎవరో ఒకర్ని అనుకరిస్తున్నానని వాడు బాధపడుతూండేవాడు.

వాడి తర్కం యిలా సాగింది: "నేను రాయడం మొదలుపెడతాను. అద్భుతంగా తయారవుతోంది అనిపిస్తుంది. కాని అంతలోనే ఆ లయా, వరుసలూ, ఉపమానాలూ మరెవరివాటినో పోలి వున్నాయని అనిపిస్తుంది. కచ్చితంగా చెప్పాలంటే, సుప్రసిద్ధ కవులకి కాపీ అనిపిస్తుంది... నీ రచనో, చిత్రమో ఎవరివాటికో అనుకరణ కాకుండా వుండాలి. అతి ముఖ్యమైన విషయం అదీ."

కోస్త్య చిత్రకళ విషయంలో నిపుణుడు కాడని తనకి తెలిసినప్పటికీ, వోవ్కా తన చిత్రాలు మొట్టమొదట చూపించినది వాడికే. వాడు కోస్త్యకి తన భావాలను గురించీ, తన పొరపాట్లను గురించీ, తన అన్వేషణలను గురించీ చెప్పాడు. కోస్త్య అన్నీ అర్థం చేసుకున్నాడు.

అయితేనేం, తన స్థాయిని బట్టి విలువ కట్టే వారిని ఎవర్నైనా కలుసుకోవాలని వోవ్కా కలలు కంటూనే వున్నాడు. స్టూడియోలో తనతో బాటు చిత్రకళ అభ్యసించిన తాన్యా జీబినా యిందుకు సరైనది లాగ వాడికి అనిపించింది. మొదటిది, ఆమె స్వయంగా చిత్రాలు బాగా పెయింటు చేసింది. రెండోది, ఆ అమ్మాయి తల్లితండ్రులు చిత్రకారులు. మూడోది, తనకి ఆమె అంటే యిష్టం. ఆమెతో తను యింతకు ముందు సీరియస్‌గా ఎందుకు మాట్లాడ లేకపోయాడో వాడికి బోధపడలేదు.

## సమష్టి ప్రభావం ఎలా వుండాలి

ఒక పద్ధతిగా సమష్టి ప్రభావ ప్రాధాన్యానికి ఒక్కొక్కప్పుడు మనం ఎక్కువ న్యాయం చేకూర్చం. పిల్లవాడు ఎలాంటి పరిసరాల్లో జీవిస్తాడో, ఎవరితో తన మనస్సు విప్పి తన ఆలోచనలు, భావాలు పంచుకుంటాడో ఆ పరిసరాలు, ఆ వ్యక్తులే పిల్లవాడి వ్యక్తిత్వాభి వృద్ధి విషయంలో ప్రత్యక్ష బోధకులని సైతం మనం గ్రహించం. అదిగో సరిగ్గా ఆ

సమవయస్కులతో సాంగత్యం ద్వారానే కౌమార వయస్కుడు తనని తాను తెలుసుకుంటాడు. తన తల్లితండ్రులనుంచీ, స్కూలునుంచీ, పుస్తకాలనుంచీ తను పొందిన భావాలను వాళ్ల ముందు పరీక్షకి పెడతాడు. ప్రపంచాన్ని గురించిన తన అవగాహనను వాళ్లకు తెలియ జేస్తాడు. ఆయా విషయాలను గురించి, ఘటనలను గురించి తనకి వున్న అభిప్రాయాలను వెల్లడిస్తాడు. వాటిని గురించి సానుకూల లేక ప్రతికూల అంచనాలు వింటాడు. మన పెద్దవాళ్లం మన కొడుకులోనో లేక కూతురిలోనో ఎంతో కష్టంమీద చొప్పించిన అభిప్రాయా లను ఒక్కొక్కప్పుడు ఒక పిల్లల బృందం ఒక్క క్షణంలో టుప్పున ఎగురగొట్టెయ్యగలదు.

ఒక్కొక్కప్పుడు మన అబ్బాయిలోనో, అమ్మాయిలోనో మనం అంతకు ముందు ఉన్నదని అనుకోని ఒక గుణం మనకి కనిపిస్తుంది. ఆకస్మికంగా అబ్బాయి లేక అమ్మాయి ఏ సీరియస్ విజ్ఞానశాస్త్రంలోనో తల్లీనమవడం తటస్థిస్తుంది. వాడు తన ముందు తాను ఒక ముఖ్యమైన, ఆసక్తికరమైన కర్తవ్యాన్ని పెట్టుకుంటాడు. ఆ కర్తవ్యం తాన్యాతోనో, కోల్యా తోనో వాడు మన దృష్టిలో "కాలం వృథా చేసిన" దాని ఫలితమన్న విషయం మనకి తోచదు. కొన్ని సమయాల్లో యిందుకు తలకిందులుగా కూడా జరుగుతూ వుంటుంది. మన పిల్లలు తమ సమవయస్కులకు తమ కార్యకలాపాలను "అంటిస్తారు."

సామాన్యంగా మన తల్లితండ్రులం ఎంపికచేసిన ఏదో ఒక కార్యకలాపంలో మన పిల్లల ఆసక్తిని ప్రోత్సహించేందుకు ప్రయత్నిస్తాం. లేక కొన్ని సందర్భాల్లో దాన్ని నిర్ద్వంద్వంగా వ్యతిరేకిస్తాం.

నాకొక కుర్రవాడు తెలుసు. వాడు తల్లితండ్రుల్ని అకార్డియన్ కొనమని పీక్కు తినే శాడు. అంత ఖరీదైన వస్తువును వాళ్లు కొని యివ్వకపోవడానికి వాడిలో సంగీత స్వారస్య సామర్థ్యం లేకపోవడమే కారణం. "అయితే ఏమిటి? అయినా సరే నాకు అది కావలసిందే" అంటూ వాడు మొరాయించాడు. చివరకి వాళ్లు అకార్డియన్ కొన్నారు. వాడు దాన్ని వాయించడం బాగానే నేర్చుకున్నాడు. అకార్డియన్ క్లాసులో వాడు నేర్చుకున్నప్పుడు ఎవరూ నవ్వి హేళనచేసేవాళ్లు కారు. అక్కడ ఆసక్తి గొలిపే, తెలివైన టీచరు ఉండటమే యిందుకు కారణం. అకార్డియన్ క్లాసులో చేరక ముందే వాడికి అకార్డియన్ బాగా వాయించే కొందరు కుర్రాళ్లు పరిచయమయ్యారు. వాళ్లు వాడికి యిప్పుడు సాయంచేశారు. తన ఆ స్నేహి తుల మూలంగా కాకపోతే, ఆ కుర్రాడు సంగీతాధ్యయనంలో అంతటి శ్రద్ధ చూపి వుండే వాడు కాడనడంలో నాకు సందేహం లేదు.

"వీధి" అనబడేది కొందరు కౌమార వయస్కులకు ఒక ముఖ్య బోధకుడుగా ఉపయోగ పడి, వాళ్లలో కొన్ని ఆసక్తులను, సామర్థ్యాలను జాగృతం చేస్తుంది. పిల్లల వ్యక్తిత్వం రూపొందడంలో యీ ప్రభావం నిర్ణయాత్మకమైనది కావచ్చునని నేను నొక్కిచెప్తున్నాను. దాన్ని గురించి తెలుసుకోవడం మన విధి.

సమష్టి ప్రభావాన్ని సమవయస్కులతో సాంగత్యానికి కుదించడం నా ఉద్దేశం కాదు.

అది అంతకంటె బాగా విస్తృతమైనది. ఇక్కడ ప్రతీదీ – కుటుంబం, పొరుగు ఆమెతో సంభాషణ, యాదృచ్ఛికమైన ఒక మాట, కుర్రవాడి ప్రవర్తనను గురించి ఒక వృద్ధుడు, టీచరు, తండ్రి లేక పయనీరు గ్రూపు నాయకుడు వేసే అంచనా – ఒక ముఖ్య పాత్ర వహిస్తుంది. యాదృచ్ఛిక సమావేశాలు, సన్నిహిత సాంగత్యాలు, ప్రేమ, మైత్రి, ఆటలు, సీరియస్ కృషి – యివన్నీ కౌమార వయస్కుణ్ణి విస్తృతమైన బోధన సమష్టితో కలిపే అంశాలే.

పరిసర ప్రపంచంతో వాడి వ్యక్తిత్వ రూపధారణ దృష్ట్యా, వోవ్కా జరూబిన్ "సృజనాత్మక జీవిత చరిత్ర"ని మనం ఇక్కడ పరిశీలిద్దాం.

ఆ కుర్రాడిలో మొదట జరిగింది ఏమిటంటే, కళపట్ల ఆసక్తి. అది అప్పటికింకా పూర్తిగా గుర్తింపబడలేదు. వాడి ప్రతిభ "యాదృచ్ఛికంగా" బయటపడడం, దాన్ని వాడి చుట్టూ వున్నవాళ్లు, ప్రత్యేకించి అలెక్సాండ్ర్ ఇవానొవిచ్ గుర్తించడం అన్నది యీ విషయంలో కీలకమైన పాత్ర వహించాయి. అటు తర్వాత వాడి చుట్టూ వున్నవాళ్లు – వాడి క్లాస్‌మేట్లు, స్టూడియోలో తోటి విద్యార్థులు, డ్రాయింగు టీచరు – వోవ్కా జరూబిన్‌లో యీ ప్రతిభ వున్నట్లు గుర్తించారు. అది మొత్తంమీద చిత్రకళలో వాడి ఆసక్తిని జాగృతం చేసినట్లైంది. క్రమంగా చిత్రకళ వోవ్కా జీవితాన్ని ఆకృష్టం చేసి, వాడికి ప్రాణప్రదం అయింది. వాడు ఇచ్ఛా శక్తి, పట్టుదల చూపవలసివచ్చింది. చిత్రకళలో మనస్సును పూర్తిగా మగ్నంచేయవలసివచ్చింది. తనలో యింకా పూర్తిగా నెలకొనని లేక యింకా పూర్తిగా సాధింపబడని ఒక లక్ష్య సాధనకు వాడు తన జీవితపు రోజువారీ క్రమాన్ని లోబరచనారంభించాడు. రంగుల్లో, ప్రకృతిలో, మనుషుల్లో సౌందర్యంకోసం చేసే అన్వేషణనుంచే ఆనందం పొందవలసిన కీలకావశ్యకత వాడిలో అభివృద్ధి చెందనారంభించింది.

ఆదిలో అది వాడిలో జాగృతమవుతున్న ఆకాంక్షను తృప్తిపరచడం మాత్రమే కాగా, చిత్రకళాధ్యయనపు రెండో సంవత్సరంలో ఒక తరుణంలో, తన చుట్టూ వున్నవాళ్లచేత ప్రభావితుడై, తనలో వున్న సృజనాత్మక వ్యక్తిత్వ లక్షణాలను వాడు గ్రహించాడు. వాడి చుట్టూ వున్నవాళ్లు యాదృచ్ఛికంగా అన్న "వీడిలో ఏదో విశేషం వుంది" అన్న మాటలను వాడు సార్థకం చేయనారంభించాడు. దీనికి తోడు యీ గ్రహింపు రెండు విధాల జరిగింది. మొదటిది శుద్ధ వృత్తిపరమైన జ్ఞాన, నైపుణ్యాలకి సంబంధించినది. అంటే, బహుశా మరెవరికీ లేని (!), తనకి మాత్రమే వున్న ప్రతిభని గురించిన, వాస్తవ వస్తువులను, రంగులను, రూపాలను దర్శించగల వ్యక్తిగత సామర్థ్యం గురించిన చైతన్యం వాడికి కలిగింది. మొట్టమొదటి సారిగా వాడు కల్పన, ఊహ, సృజనాత్మకత అనే భావనను తనకి తాను ఆపాదించుకున్నాడు. ఒక రోజున తన తల్లికీ పొరుగింటావిడకీ మధ్య జరిగిన యీకింది సంభాషణను యాదృచ్ఛికంగా వాడు వినడం తటస్థించింది:

"ఏమోనమ్మా, మా వాడిని ఏం చెయ్యాలో నాకేమీ పాలుపోవడం లేదు. పొద్దుటి నుంచి రాత్రి పొద్దుపోయేదాకా వాడు చేసే పనల్లా రంగులు పులమడమే..."

"ఇంకేం, బ్రహ్మాండం. వాడు స్వభావ రీత్యా కళాత్మక దృష్టి వున్నవాడన్న మాట..." అంది పొరుగింటావిడ.

"మీకు తెలియదేమో, అన్నింటికీ – నేలకి, చాకులకి, గుడ్డపీలికలకి, కిటికీలకి – రంగు మరకలే..." అంది వాడి తల్లి.

"మీకేం, మీరు అదృష్టవంతులు. మీ కొడుకు ఎంచక్కగా ప్రతిభావంతుడు!.." అంది పొరుగామె.

వోవ్కా యీ సంభాషణను గుర్తుపెట్టుకున్నాడు. "కళాత్మక దృష్టి కలవాడు, ప్రతిభావంతుడు..." అనే విశేషణాలు వాడి మనస్సులో నాటుకున్నాయి. తనకి దేనిలో వుందబ్బా ప్రతిభ అంటూ వాడు ఆలోచించ సాగాడు. ఏమో, తనలో బొత్తిగా ఏ అసాధారణ ప్రతిభలూ లేనేలేవేమో? వాళ్లు ఊరికే యిలా అంటున్నారేమో?

వోవ్కా తనని గురించి తాను మధనపడుతూ ఆలోచించుకున్నాడు. వాడు కళాకారులను గురించిన పుస్తకాలు చదివినప్పుడు, వాళ్లతో తనని పోల్చుకునేవాడు. వాళ్లకీ తనకీ ఏదైనా ఉమ్మడి అంశం వుంటే వాడు కొండ ఎక్కినంత సంబరపడేవాడు.

తన "వృత్తిపరమైన" లక్షణాలకు సంబంధించిన యీ అవగాహనకు సమాంతరంగా ఆ కుర్రాడు తనకి తాను "నేనేమిటి?" అనే ప్రశ్న వేసుకున్నాడు. తన వ్యక్తిత్వం యింకా అభివృద్ధి దశలోనే వుందన్న అస్పష్ట అవగాహన మూలంగానేమో, వాడు తనని గురించి ఊహలో చిత్రించుకునేందుకూ, ఏకబిగిన ఆ చిత్రానికి పూర్ణత్వం యిచ్చేందుకూ బృహత్ ప్రయత్నం చేశాడు. వాడు తన భావి బృహత్ చిత్రాలను గురించి కలలు కనేటప్పుడు తనకీ తన సామర్థ్యాలకీ మధ్యా, తన వ్యక్తిత్వానికీ తన కార్యకలాపాలకీ మధ్యా వున్న అగడ్త గురించి ఆలోచించనైనా లేదు. తనని గురించి తాను అంచనా వేసుకునేటప్పుడు, వాడు యీ అంచనాలను తన చుట్టూ వున్నవాళ్ల అంచనాలతో సరిపోల్చుకునేవాడు. వాడు నిరంతరం అలాంటి అంచనాల ఏకీభావంకోసం వెతుకుతూండేవాడు. అవి ఏకీభవిస్తే వాడు సంతోషించేవాడు. అవి ఏకీభవించకపోతే వాడి మనస్సును అనుమానాలు ఆవరించేవి. మరి అలాంటి సంపూర్ణ ఏకీభావం ఎన్నడూ వుండదు గనుక, తను నిజంగా వున్నదాని కంటె తనని తాను కౌమార వయస్కుడు ఎప్పుడూ మరింత మెరుగ్గా అంచనా వేసుకుంటాడు. అప్పుడది వాడిని క్లేశపూరితమైన ఆత్మ పరిశోధనకి గురిచేస్తుంది. అలాంటి విశ్లేషణ వాడి చైతన్య, స్వభావాలు రూపొందేందుకు అవసరమైన ముఖ్య షరతుల్లో ఒకటవుతుంది.

పిల్లలు తమ ప్రపంచాన్ని చుట్టూ వున్నవాళ్ల విమర్శకోసం తెరుస్తారు. తమకి యిష్టం వున్నా లేకపోయినా వాళ్లు యీ పని చేస్తారు. వాళ్లు వాళ్ల అంచనాకోసం నిరీ

క్షిస్తారు. దానితో వాళ్ళు ఏకీభవించవచ్చు, ఏకీభవించకపోవచ్చు. అనేది వేరే విషయం.

తమ చుట్టూ వున్నవాళ్ల అభిప్రాయాన్ని ఎన్నడూ ఆమోదించకపోతే, తమ పెద్దల అభిప్రాయాలను తిరస్కరిస్తే, వాళ్లలో నిహిలిజం, సంశయాత్మకత వంటి ధోరణులు అభివృద్ధిచెందుతాయి. తమ చుట్టూ వున్నవాళ్ల అభిప్రాయాలన్నింటినీ విమర్శనాత్మకంగా వాళ్ళు తిరిగి అంచనా వేసుకోకపోతే, వాళ్ళు ప్రతీదీ ఆమోదిస్తే, కాల్రకమేణా వాళ్లలో జీవితంపట్ల అనుసరణ ధోరణి వేళ్లూనుకొంటుంది.

అందుకే పెద్దవాళ్లకీ పిల్లలకీ మధ్య సంబంధానికీ, ఉత్పాదకమైన పరస్పర ప్రతి వర్తనకీ దారితీసే ఏకీభావం పిల్లల పెంపకపు క్రమంలో ఒక ముఖ్యాంశం.

ఏకీభావం అంటే, యిలా పరస్పరం ప్రతివర్తించే పక్షాల అభిప్రాయాల సంపూర్ణ, పరమ అనుగుణ్యత కాదు. అభిప్రాయాలు, ప్రయోజనాలు, చేతల కలయికనుంచి ఏకీభావం ఉత్పన్నమవుతుంది.

తమ ఆత్మ చైతన్యానికి మిక్కిలి సన్నిహితమైన వైఖరులు కలిగినవాళ్లతో సాంగత్యం నెరపేందుకు పిల్లలు యిష్టపడతారు. తమని అర్థంచేసుకోగలిగినవాళ్లతో, సామరస్యంపై ఆధారపడిన సంబంధాలను ఎవరితో పెట్టుకోగలరో, పెట్టుకోవాలని అనుకుంటారో వాళ్లతో సంబంధాలు పెట్టుకొని, వాటిని కొనసాగించాలని పిల్లలు అనుకుంటారు. ఏ లక్షణాలను తాము అస్పష్టంగా మాత్రమే తెలుసుకున్నారో, ఏ లక్షణాలు తమకి స్పష్టం కాలేదో, వేటిని తాము కనుక్కోలేకపోయారో, తమ ఆ లక్షణాలను వెలికి తీయగలిగిన వ్యక్తి దొరికినప్పుడు పిల్లలకి, ప్రత్యేకించి కౌమార వయస్కులకి, మహా సంతోషం కలుగుతుంది.

చాలా సందర్భాల్లో పిల్లలు తమ లక్షణాల్లో కొన్నింటిని తమ సమవయస్కులు ఎలా అంచనా వేస్తారో అలాగే తామూ అంచనా వేస్తారు.

...తాన్యా జీబినాకి ఒక వ్యక్తిగా తనంటే బొత్తిగా పట్టదన్నట్లు వోవ్కా జరూబిన్‌కి అనిపించింది. కాని తాన్యా జీబినా మాత్రమే తన కృషిని సిసలైన అంచనా వేసిందన్న విశ్వాసం వాడికి కలిగింది. ఆమె తన ప్రకృతి దృశ్యాలను వాటన్నింటిలోనూ తన అస్తిత్వమే లేదన్నట్లు చూడటం వోవ్కాకి చిరాకు కలిగించిందనడం నిజమే. బహుశా యీ కారణంగానేవాడు ఆమెపట్ల మొరటుగా వ్యవహరించాలని అనుకున్నాడు.

అయితే మొత్తంమీద వాడు తాన్యా జీబినా గురించి అంతకంతకు ఎక్కువ తరచుగా ఆలోచించసాగాడు. ఆమె ఎలా మాట్లాడిందో, ఎలా ప్రవర్తించిందో, ఎలా నడిచిందో వాడు గుర్తుచేసుకున్నాడు. వాడు ఆమె చిత్రాలను, ఆమె విమర్శనను, ఆమె తన చిత్రాలను పరిశీలనగా చూసి, అవి "బలంగా, అసాధారణంగా" వున్నాయనడాన్ని వాడు జ్ఞాపకంచేసుకున్నాడు.

తాన్యా జీబినా ప్రశంస వోవ్కా దృష్టిలో టీచరు ప్రశంస కంటె ఎక్కువది కాక పోయినా, దానితో సమానం.

వాడు తాన్యాని కలుసుకునేందుకు కొన్ని సార్లు ప్రయత్నించాడు. వాడు ఆమెకోసం స్కూలు గేటు దగ్గర నిరీక్షించేవాడు. వాడు ఆమె ఇంటికి వెళ్ళేవాడు. ప్రతి సారీ ఆమె ఎవరితోనో మాట్లాడుతూ వుండటం చూసి, ఆమెని పలకరించనైనా పలకరించకుండా వాడు వెళ్ళిపోయేవాడు.

వేసవి సెలవల్లో ఒక రోజున వాడు తలుపు తెరిచేసరికి తాన్యా జీబినా గుమ్మంలో నిలబడి వుండటం చూశాడు.

యాంత్రికంగా వోవ్కా ఒక అడుగు వెనక్కి వేశాడు. కారిడారులో లైటు వేశాడు. ఈలోగా తాన్యా వాడితో ఒక్క మాట కూడా మాట్లాడకుండా వోవ్కాని దాదాపు పక్కకి నెట్టి వాడి గదిలోకి వెళ్ళింది. ఇక ఆమె ప్రశ్నల వర్షం కురిపించింది:



"ఇదేమిటి? ఇదెప్పుడు వేశావ్?"

ఆమె వోవ్కా ప్రకృతి చిత్రాలను పరిశీలనగా చూస్తోంది.

వోవ్కా మౌనంగా ఉండిపోయాడు. అయితే వాడు ఆమె కంటపడకుండా తన చొక్కాని లాగులో టక్ చేసుకుని, ఆమె కేసి కన్నార్పకుండా చూస్తూ నిలబడ్డాడు. ఆమె లైటును ఆర్పుతూ, వెలిగిస్తూ, వోవ్కా అక్కడ లేనేలేడన్నట్లు గదిలో చుట్టూ అలంగం తిరుగుతూ చిత్రాలను అటూ యిటూ తిరిగి సర్దింది. మధ్యమధ్యలో ఆమె "ఈ చిత్రం యిక్కణ్ణుంచి బాగా కనిపిస్తోంది... ప్రత్యేకించి యిది బాగుంది" అంది.

అదొక చిన్న చిత్రం. దానిమీద స్కిప్పింగ్ చేస్తున్న యిద్దరు అమ్మాయిల్ని వాడెప్పుడో వెనక చిత్రించాడు. వాళ్ల ఆకారాలు పొడుగ్గా సాగినట్లూ, పారదర్శకంగానూ కనిపిస్తున్నాయి.

"దీన్ని నాకు ఇచ్చెయ్యి" అంది తాన్యా. ఆ వెంటనే "నీకు యివ్వాలని లేదేమో కదూ, సర్లే ఫరవా లేదు!" అంటూ జోడించింది.

వోవ్కా అకస్మాత్తుగా "మొత్తం వీటన్నింటినీ కట్టకట్టి తీసుకుపో. ఇవన్నీ వట్టి చెత్త. కుహనా కళ..." అన్నాడు.

వోవ్కా చిరునవ్వు నవ్వినా, వాడి గొంతు తడబడింది. ఆ సంగతి స్వయంగా తనూ గమనించాడు. తాన్యా యిప్పుడిక తను స్టూడియోనుంచి లేచి వచ్చేసిన భయంకరమైన రోజును గురించి ప్రస్తావిస్తుందేమో అని సైతం వాడు భయపడ్డాడు. అదిగో సరిగ్గా దాన్ని గురించే వాడు మాట్లాడాలని అనుకున్నాడు. తను యీ సంగతి ప్రస్తావించాలనీ, అప్పుడామె యిదంతా వ్యర్థమనీ, తను తిరిగి లియొనీద్ సెర్గేయెవిచ్ దగ్గరకి వెళ్ళితీరాలనీ



ఆమె అంటుందని ఎదురుచూశాడు... అప్పుడు తను ఆయన దగ్గరకి వెళ్లకపోయినా తేలికగా గడుపుకోగలననీ, తనకింక ఆయన అవసరం లేదని చెప్తామనీ వోవ్కా మనస్సులో అనుకున్నాడు.

"వీటిలో కొన్ని చెత్తే గాని, మరి కొన్ని చాలా బాగున్నాయి వాలోద్య*..." అంది తాన్యా.

ఇంతవరకు వోవ్కాని ఎవళ్ళూ యీ పేరున పిలవలేదు. అంతకు ముందు తాన్యా కూడా వాడినెప్పుడూ ఇంటి పేరుతోనే పిలిచేది. "ఏమిటి జరూబిన్, కొత్త విశేషాలేమిటి?" అని

* వోవ్కాకి వాలోద్య ఆత్మీయమైన పేరు. – సం.

ఆమె అడుగుతూండేది. ''కొత్త విశేషాలేమీ లేవు జీబినా'' అని వోవ్కా సమాధానం చెప్పే వాడు. కాని యిప్పుడామె తనని వొలోద్య అని పిలిచింది...

వోవ్కాకి తను ఎంత నిస్సహాయుడుగా, అపరిణతుడుగా అనిపించిందంటే, నోరు విప్పితే ఏ మూర్ఖపు మాట మాట్లాడుతానో అని నోరు విప్పేందుకు భయపడ్డాడు. తనేం చెప్పినా, తన స్వరం కృత్రిమంగా అనిపించక మానదనే విషయంలో వాడికి సందేహం ఎంత మాత్రం లేకపోయింది. దీనితో సరిపోతే యింకా ఫరవా లేదు. తను ఉన్నట్లుండి నత్తడం మొదలెడితే... యింక చూసుకోనక్కర్లేదు ఎంత సొంపుగా వుంటుందో. ఒక సారి అలా జరిగింది కూడాను...

అంతలో అకస్మాత్తుగా వోవ్కా కంటబడిన విషయం సరిదిద్దుకోజాలని ముప్పుగా కనిపించింది. వాడు తాన్యామీదకి ఉరికి, ఆమె చేతిలోని చిన్న రూపచిత్రాన్ని లాక్కునేం



దుకు ప్రయత్నించాడు. వాడు చాలా కాలం శ్రమపడి వేసి, యింతదాకా ఎవరికీ చూపిం చని చిత్రం అది... అది తాన్యా రూపచిత్రం.

''ఎవరేమిటి యీ పిల్ల?'' అని అడిగింది తాన్యా. ఆమె కళ్లలో కొంటె చూపు మెరిసింది.

వోవ్కా సిగ్గుల మొగ్గ అయిపోయి, నోరు మెదపకుండా ఉండిపోయాడు.

''ఈ బొమ్మ నాకిచ్చెయ్యి, నా గదిలో పెట్టుకుంటాను. లేకపోతే దీనికొక కాపీ వేసి ఇయ్యి. ఏం, యివ్వగలవా? సర్లే, పోనీ. నాకూ అంతే, నా చిత్రాలు ఎవళ్లకైనా యివ్వాలంటే ప్రాణ గొడ్డంగా వుంటుంది. నాతో తియ్యగా మాట్లాడి నా వస్తువులు కొట్టెయ్యాలని చూసేవాళ్లని నేను సహించలేను. అన్నట్లు ఒక విషయం నీతో చెప్పాలి. ఆదివారం నాడు

మా యింటి దగ్గర ఒక చిన్న ప్రదర్శన ఏర్పాటుచేస్తున్నాను. దానికి మా నాన్నగారికి పరిచితులైన చిత్రకారులు వస్తారు. నీ చిత్రాలు కూడా కొన్ని అక్కడ ప్రదర్శనలో పెడదాం..." అంది తాన్యా.

వోవ్కాకి యీ ప్రతిపాదన బాగా నచ్చింది. అది మంచి ఆసక్తికరంగా వుంటుందనడంలో సందేహం లేదు. కాని వోవ్కా "చచ్చినా యివ్వను!" అన్నాడు.

"ఎందుకు, ఇవి నీ చిత్రాలని ఎవరికీ చెప్పం. ఇవి కూడా నావిగానే చలామణీ అవుతాయి. అలా చేస్తే తమాషాగా వుంటుంది, జరూబిన్... ఏమంటావ్?" అంది తాన్యా.

తాన్యా నవ్వుతోంది. ఆమె కళ్లు మిలమిల మెరుస్తున్నాయి. ఆ క్షణంలో ఆమె సిసలైన మగ కుర్రాడిలా వుంది.



"అయితే సరేలే, జీబినా!" అన్నాడు వోవ్కా.

ఉన్నట్లుండి వోవ్కాలో చురుకుదనం వెల్లివిరిసింది. వాడు చిత్రాలు పైకి తీసి ఏరడం మొదలెట్టాడు. అంతే కాదు, వాటిని బాగా పొగడటం మొదలెట్టాడు. దానితో తాన్యా నవ్వు ఆపుకోలేకపోయింది. వోవ్కా జోకులు విసురుతున్నాడు, వాడి స్వరం వాడికే విలక్షణంగా వినిపించింది. ఆ మాట్లాడుతున్నది మరెవరో అనీ, అసలు వోవ్కా జరూబిన్ తను కావాలని కోరుకున్న వ్యక్తి అనీ వాడికి అనిపించింది.

అప్పుడిక తాన్యా తన కోటు వేసుకుని తలుపు దగ్గరకి వెళ్లింది.

"నేను నిన్ను మీ యింటి సాగనంపుతాను" అన్నాడు వోవ్కా.

"అవసరం లేదు, నేను వెళ్లగలను" అంది తాన్యా. ఆమె ముఖం గంభీరంగా, ఏకాగ్రంగా మారింది.

వోవ్కా తన రెయిన్‌కోటు తీసుకునే ప్రయత్నంలో ఒకే చోట అన్యమనస్కంగా అటూ యిటూ తచ్చాడాడు. వాడి సంతోషం తృటిలో మాయమైంది. వాడిని అదృశ్య వ్యక్తి ఎవరో మొత్తినట్లు అనిపించింది. అంతలో తాన్యా చటుక్కున వాడిని సమీపించి వాడి బుగ్గమీద ముద్దు పెట్టుకుంది. అలాగే తృటిలో వోవ్కా ముఖంమీదే తలుపు దఢాలున వేసి బయటకి వెళ్లింది.

వోవ్కా పరుగున కిటికీ దగ్గరకి వెళ్లాడు. తాన్యా వీధి వెంట నడిచి, చిన్న పార్కు దాటి, ఆగింది. ఒక వయస్కుడు ఆమెని సమీపించాడు. ఆ వ్యక్తి లియొనీద్ సెర్గేయెవిచ్ అని వోవ్కా గుర్తించాడు.

"అయితే, యిదన్న మాట అసలు సంగతి!"

వోవ్కాకి తనని ఆట పట్టించినట్లూ, మోసగించినట్లూ అనిపించింది. ఇప్పుడిక తను ఆమెమీద బదులు తీర్చుకోవాలని అనుకున్నాడు. కాని ఏం చెయ్యాలో వాడికి తోచ లేదు. వాడు అందుకు అనేక పద్ధతులు ఆలోచించాడు. చివరకి ఘాటుగా కించపరుస్తూ ఉత్తరం రాయాలని నిర్ణయించుకున్నాడు వోవ్కా. వాడు యిలా రాయడం మొదలెట్టాడు: "గౌరవనీయమైన జీబినాకి." కొన్ని సార్లు వాడు ఆ "గౌరవనీయమైన" అన్న పదం కొట్టేసి, "కుట్రదారు," "వాగుడు పిట్ట," "మోసగత్తె" అంటూ మార్చి మార్చి రాశాడు. ఈ దెబ్బతో దాని పొగరు అణిగిపోవాలి అనుకున్నాడు. వాడు రెండో పంక్తిని కూడా జాగ్రత్తగా సంస్కరించాడు. "నా దృష్టిలో యావత్ప్రపంచంలోనూ నువ్వు అత్యుత్తమురాలివి" అన్న మాటల్ని "ఈ విశాల ప్రపంచమంతట్లోనూ నా దృష్టిలో నీ కంటె ఉత్తమురాలు లేదు, ఒకప్పుడు... నువ్వు నిజాయితీపరురాలివి అనుకున్నాను. కాని..." అంటూ వాడు మార్చాడు.

అక్కడకి వచ్చేసరికి వోవ్కా తటపటాయించాడు. తాన్యా నిజంగానే వాడి దృష్టిలో యావద్విశాల ప్రపంచంలోనూ ఉత్తమురాలు...

"ఇది నిజమేనా అని!" అంటూ అరిచి, వోవ్కా అద్దం దగ్గరకి పరుగెత్తాడు. వాడు తన ముఖాన్ని అందులో పరిశీలనగా, తన బుగ్గమీద తాన్యా ముద్దు జాడల్ని చూసేందుకు ప్రయత్నిస్తున్నట్లు చూసుకున్నాడు. వాడికింకా ఆ ముద్దు అనుభూతమవుతూనే వుంది. వాడి ముఖ కవళిక వాడికే రోతగా వుంది. ఆ అద్దం తన సొంతదే అయితే, వాడు దాన్ని వెయ్యి ముక్కలు చేసివుండును. వాడు టేబిలు దగ్గరకి తిరిగి వచ్చి, ఉత్తరం మళ్లీ చదివి, దాన్ని చింపి పోగులు పెట్టాడు.

ఇంకోలా చెయ్యచ్చు — తాన్యాని పట్టించుకోకుండా వుండటం, కనిపించినా పలకరిం

చకపోవడం. ఆమెని పట్టించుకోకుండా సగర్వంగా నడిచివెళ్లిపోవడం, అది బాధపడితే పడనీ అనుకున్నాడు.

అంతే కాదు, వోవ్కా ఎలాగైనా సరే ఏదో ఒక జబ్బుపడాలని అనుకున్నాడు. తీవ్రమైన జ్వరం, లేకపోతే ఆపరేషనైనా సరే. అంతే కాదు, తనకి ఆ జబ్బు ప్రాణాంతకమైనదైతే మరీ మంచిది. అప్పుడు చిట్టచివర తన ప్రాణం పోయే ముందు ''చూశావా, దీనంతకీ నువ్వే కారకురాలివి'' అనవచ్చు అనుకున్నాడు. అలాంటి అద్భుతమైన అవకాశాలతో సైతం వాడికి తృప్తి కలగలేదు.

క్లుప్తంగా చెప్పుకోవాలంటే దీన్నుంచి బయటపడే మార్గం లేదు. తన బతుకు చివరకి యిలా బద్దలైంది! వోవ్కాకి మంచి ఆకలి లేకపోయి వుంటే యీ విషాదకర ఘటన దేనికి దారితీసి వుండునో ఆ భగవంతుడికే తెలియాలి. ఏదో యాదృచ్ఛికంగా వాడు వంటింట్లోకి వెళ్లడం తటస్థించింది. సరిగ్గా తాన్యా రాక ముందు తను తయారుచేసుకున్న వంటకాలు బల్లమీద వున్నాయి. రెండు కోడిగుడ్లు, పంది మాంసపు ఒక ముక్క, రెఫ్రిజిరేటరునుంచి తను తీసి బయటపెట్టిన పాలు బల్లమీద పరిచి వున్నాయి. వాడు ఆబగా నమిలి మింగిన ఉదయపు ఫలహారం ప్రాణోత్తేజకరమైన, ఇంద్రజాలికమైన ఒక సాధనంగా పరిణమించి, వాడిని తశ్శాంతి పరచింది.

అలా తన ఆకలి తీర్చుకొని శాంతించాక తాన్యా మెచ్చుకున్న చిత్రాలను వోవ్కా తదేకంగా చూశాడు. ఇప్పుడవి వాడికి నిర్దుష్టమైనవిగా కనిపించాయి.

అప్పుడిక వోవ్కాకి తను ఎప్పుడు పనిలోకి దూకుదామా అన్న ఆతృత కలిగింది. తన తోటి విద్యార్థుల్నీ, లియొనీద్ సెర్గేయెవిచ్ స్టూడియోనీ చూడాలని అనిపించింది. తను యిప్పటికీ ఏదో కొంత చెయ్యగలనని స్టూడియోలోని వాళ్లకీ, ప్రత్యేకించి తాన్యాకీ, రుజువు చెయ్యాలని అనిపించింది. వాడు ఆ వెంటనే ఒక అట్ట తీసుకుని నీలం కోటు తొడుక్కుని వెళ్లిపోయిన తాన్యానీ, ఆమె పక్కనే గూని మూపు లియొనీద్ సెర్గేయెవిచ్‌నీ చిత్రించ పూనుకున్నాడు...

వోవ్కా మంచి ఉత్సాహంగా బొమ్మ వేస్తూండగా, అంతకు ముందు సంభవించిన ఘటనలు పరిసరాలకీ వ్యక్తి చైతన్యానికీ మధ్య పరస్పర సంబంధాలతో ఎలా ముడిపడి వుంటాయో క్లుప్తంగా చెప్తాను.

మొదటి సంగతి, పరిసరాలకీ, సాంఘిక సాంగత్యానికీ వెలిగా ఏ చైతన్యమూ వుండజాలదు. మనుషులతో సాంగత్యంలోకి వచ్చినప్పుడే, వాళ్ల విమర్శలు, అభిప్రాయాలు విన్నప్పుడే పిల్లవాడు తనని తాను ఒక వ్యక్తిగా చూసుకుంటాడు. పిల్లవాడి చైతన్యం వాడి సొంత చైతన్యాన్ని సవిమర్శకంగా విశ్లేషించుకోవడం ద్వారా, తననీ, యితరులనూ గురించి ఒక అవగాహనను ఏర్పరచుకోవడం ద్వారానే రూపొందుతుంది. సకాలంలో వాడిని యీ మాదిరి విశ్లేషణ

చేసుకొనేలా చేయడం ముఖ్యం. కొన్ని సందర్భాల్లో యిందుకు తీవ్రమైన పరిస్థితి అవసరమవుతుంది. అలాంటి పరిస్థితుల్లో పిల్లవాడు తన చుట్టూ వున్నవాళ్లతో తన సంబంధాలను తనకి కష్టంగా ఉన్నా సర్దుకోవలసివుంటుంది. కొన్ని సందర్భాల్లో యీ విశ్లేషణ పిల్లవాడికీ వాడి చుట్టూ వున్నవాళ్లకీ మధ్య జరిగే చర్చ కొనసాగింపుగా ఉండవచ్చు. అలాంటి సందర్భాల్లో పిల్లవాడు తనకి అంతకు ముందు తెలియని సమస్యలను పరిష్కరించక గత్యంతరం లేని స్థితిలో పడతాడు. ఇక్కడ గమనించవలసిన ఒక ముఖ్య విషయం యేమిటంటే, వ్యక్తి తన శీలాన్నీ, ప్రవర్తననీ గురించి విధిగా ఆలోచించి, అవగాహన చేసుకోవలసిన పరిస్థితిలో అతన్ని పెట్టడం.

టీచరు తన గర్విష్ఠి విద్యార్థిపట్ల తీవ్రంగా వ్యవహరించడం ద్వారా ప్రమాదభూయిష్టమైన పంథాను చేబట్టాడు. అయితే, ఆయన వోవ్క సంగతి మరచిపోలేదు. ఎందుకంటే, తాన్యా రాక లియొనీద్ సెర్గేయెవిచ్ భాగస్వామ్యం లేకుండా జరగలేదు. అయితే, దీని అర్థం ఆయన తాన్యాని ఆమె స్నేహితుడి దగ్గరకి బలవంతాన పంపాడని కాదు. అందుకు భిన్నంగా, తాన్యాయే వోవ్కపట్ల టీచరు అన్యాయంగా వ్యవహరించాడనీ, అది సరిదిద్దుకునేందుకు ఏమైనా చెయ్యాలనీ రోజుల తరబడి టీచరుతో పోరుపెట్టింది. లియొనీద్ సెర్గేయెవిచ్, తాన్యాలు వోవ్క జరూబిన్ వుండే పేటకి రావడం అలా జరిగింది. టీచరుకి ఆ పేటలోని ఒక ఆఫీసులో ఏదో పని పడింది. అందుకని ఆయన తాన్యా వోవ్క దగ్గరకి వెళ్లాలని సూచించాడు. అయితే వోవ్క చిత్రాలను ప్రదర్శించాలన్నది మటుకు ఆమె ఊహే, ఆమె ఆలోచనే, ఆమె రహస్యమే.

వ్యక్తికి తోడ్పాటు అవసరం. గుర్తింపు లేకపోతే, ప్రతిభా సామర్థ్యాలు తరచు నీరసించి, నశించిపోతాయి. గుర్తింపు, తోడ్పాటు, సవిమర్శక అంచనాలు సాంఘిక సాంగత్యానికి సంబంధించిన ఫలవంతమైన రూపాలు. అవి వ్యక్తి చైతన్యం రూపొందడాన్ని సాధ్యం చేస్తాయి. ఒక వ్యక్తి స్నేహితుల సద్విమర్శ కౌమార వయస్కులకు తమని తాము మరింత లోతుగా అంచనా వేసుకునేందుకు తోడ్పడుతుంది. అలాంటి సాంఘిక సాంగత్యం, కొత్తగా సంతరించుకున్న పరస్పర అవగాహనకి ముందు ఎలాంటి ఘర్షణలు జరిగినప్పటికీ, విశేష లాభదాయకమైనదవుతుంది. దీనికి వ్యక్తిగత సానుభూతి, అనురాగాలు, స్నేహ భావాలు, పిల్లల ప్రేమ తోడైతే, "ఘర్షణ పరిస్థితులు" వ్యక్తి అభివృద్ధిలో నిర్ణయాత్మకమైన పాత్ర వహిస్తాయి.

## పనిపట్ల వైఖరి, మనుషులపట్ల వైఖరి

తన చుట్టూ వున్నవాళ్లపట్ల పెరుగుతున్న వ్యక్తి వహించే వైఖరిని బట్టి అతన్ని అంచనా వేసేవాళ్లు ఎక్కువ మంది వుండరు.

పాఠాలు, ఆటలు, అన్ని రకాల యింటి పనులు, స్కూలు, వీధి స్నేహితులతో బాటు వోవ్కా జరూబిన్‌కి ఒక ప్రత్యేకమైన ఆసక్తి వుంది. అది చిత్రకళ. చిత్రకళలో వాడు మరింతగా నిమగ్నుడయ్యే కొద్దీ, వాడి పరిచితుల బృందం కూడా పెరుగుతోంది. అలాగే, వాడి సాధారణ అభివృద్ధినీ, తన చుట్టూ వున్నవాళ్లపట్ల వాడి వైఖరినీ కొంత మేరకు ప్రభావితం చేసే వాడి బాంధవ్యాలు కూడా పెరుగుతున్నాయి. ఇక్కడ మనం వాడి జీవితపు రెండు పార్శ్వాలను అంటే వాడి చిత్రకళాభిరుచుల అభివృద్ధిని, మనుషులపట్ల వాడి వైఖరిని పరిశీలిస్తున్నాం. ఈ రెండు పార్శ్వాలనూ పరిశీలిద్దాం.

వోవ్కా జరూబిన్‌కీ తాన్యా జీబినాకీ మధ్య సంబంధాన్నే మరో సారి తీసుకోండి. కొంత మేరకు వాళ్ల స్నేహం ఒకానొక నిర్దిష్ట కాలంలో యిద్దరూ నిమగ్నులైన కార్యకలాపాల ఫలితంగా ఉత్పన్నమైంది.

అయితే చిత్రకళలో సామర్థ్యానికి తోడు వోవ్కా ఆ అమ్మాయిలో చిత్రకళతో ఎంత మాత్రం సంబంధం లేని మరి కొన్ని అంశాలు కూడా చూస్తున్నాడు. వోవ్కా దృష్టిలో ఆమెలో ప్రతీదీ ప్రత్యేకత కలిగినదే. ఆమె కళ్లు అసాధారణమైనవి, ఆమె అభిప్రాయాలు అసాధారణమైనవీ, మౌలికమైనవీ కూడా, ఆమె స్వతంత్రంగా వ్యవహరిస్తుంది... ఏదో అజ్ఞాత భావనతో వాడు ఉక్కిరిబిక్కిరవుతున్నాడు. వాడికి ఆమె మొత్తం రూపం మనో ముద్రితమైంది, ఆమె పలచటి కోల ముఖం, ఆమె జుట్టు తళుకు, ఆమె శరీరంలోని వంపు. వాడికి ఆమెని తాకాలన్న అణుచుకోలేని వాంఛ కలుగుతోంది. తాన్యా తన చిత్రాలపట్ల మాత్రమే ఆసక్తురాలైతే వాడికి తృప్తి లేదు. ఆమె తనకి స్నేహితురాలిగా వుండాలనీ, చిత్రకళతో ప్రసక్తి లేకుండా అసలు వ్యక్తిగా తనని ఆమె స్వీకరించాలనీ వాడు కోరుకుంటున్నాడు. తాన్యా తన దగ్గరకి వ్యక్తిగా తనపట్ల ఆసక్తురాలై కాక, తనంటే యిష్టం వుండి కాక, లియొనీద్ సెర్గేయెవిచ్ పనుపున వచ్చిందన్న ఆలోచన తన బుర్రలోకి రాగానే, తను మోస గింపబడినట్లు, అవమానింపబడినట్లు వాడు అనుకుంటున్నాడు.

కౌమార వయస్కులు తొందరపాటు నిర్ణయాలకి వస్తారని యిక్కడ చెప్పకోవడం అప్రస్తుతం కాదు. వాళ్లు చాలా తరచుగా తాము చూసినదాన్ని వక్రీకరిస్తారు, పైకి కనిపించేవాటినే వాస్తవం అనుకుంటారు. వాళ్లలో అయిష్టమూ, కోపమూ యిట్టే భగ్గుమంటాయి, మాట్లాడకుండా బిగిసిపోవడం, అనుమానం వాళ్లలో తరచు కనిపిస్తాయి. మోసగింపబడతామేమో, తమని చూసి నవ్వుతారేమో అన్న భయం వాళ్లు అర్థరహితంగా ప్రవర్తించేందుకు, దుస్సాహసంతో కూడిన కొంటె పనులు చేసేందుకు దారితీస్తుంది. ఈ భయమే వాళ్లలో బడాయిని ఉత్పన్నం చేస్తుంది. అందుకే అలాంటప్పుడు కౌమార వయస్కుడు తన సంవేదనలను, ప్రవర్తనను అర్థంచేసుకునేందుకు తోడ్పడటం ముఖ్యం. దీనికిగాను పిల్లవాడితో సన్నిహిత సాంగత్యం అవసరం, అంతే కాకుండా వాడు ఏ పరిస్థితిలో తనని

గురించీ, తన చర్యలను గురించీ, వాంఛలను గురించీ విధిగా ఆలోచించవలసిన అవసరం కలుగుతుందో వాడిని అలాంటి పరిస్థితిలో పెట్టాలి.

కౌమార వయస్కుడు తనని తాను తెలుసుకునేందుకు తోడ్పడేటప్పుడు ఎప్పుడూ వాడు ఎంపికచేసుకున్న వ్యాసంగం మనుషులపట్ల వాడి వైఖరిని ఎలా ప్రభావితం చేస్తుందన్న విషయం దృష్టిలో వుంచుకోవాలి. ఆసక్తి గొలిపే వ్యాసంగం బాగానే వుంది కాని, మనుషులపట్ల జాలితో కూడిన నిజాయితీ వైఖరిని వహించడం అన్నింటి కంటె ముఖ్యం అనే విషయాన్ని వాడు గుర్తించేలా చెయ్యాలి. అలాంటి తర్కపు వక్కాణింపు మాత్రమే పిల్లవాడి ప్రతిభా సామర్థ్యాలు వాటి పూర్తి ప్రమాణానికి అభివృద్ధి చెందడాన్ని సాధ్యం చేస్తుంది.

కొందరు బోధకులు మనం చెయ్యవలసిందల్లా పిల్లవాడిని వివిధ తరహా కార్యకలాపాల్లో చేరుస్తే చాలు, వాడు వెంటనే సత్ప్రవర్తన కలిగినవాడు, తెలివైనవాడు, నిజాయితీ, వగైరాలు కలిగినవాడు అయిపోతాడని అంటూ వుంటారు. అయితే నేను యీ అభిప్రాయంతో ఏకీభవించను. అంతే కాదు, పుస్తకాలు, కళాత్మక, సాంకేతిక సృజనాత్మకత, యాత్రలు, క్రీడలు, పాండిత్య సంపాదనలో సాఫల్యం, వగైరా వైవిధ్యంతో కూడిన అద్భుతమైన కార్యకలాపాలు సైతం మంచి నైతిక ఫలితాన్ని ఖాయం చెయ్యలేవు. వ్యక్తి స్వీయానుభవం, మనుషులపట్ల వైఖరి — యివే అతని ప్రధాన గురువు.

సృజనాత్మక కృషి నిస్సందేహంగా పిల్లల మానసిక ఉద్వేగాన్నీ, మేధా శక్తినీ పెంపొందిస్తుంది. అయితే అదే సమయంలో సంకుచిత ప్రత్యేక కార్యకలాపాల్లో మగ్నమవడం చిన్నతనంనుంచీ బహుముఖ ప్రాపంచిక విషయాలనుంచి దూరంచేసి ఏక ముఖ అభివృద్ధికి కారణం అయ్యే ప్రమాదం వుంది.

మరో ప్రమాదం కూడా వుంది. పిల్లలు తమ ఆకాంక్షలకీ, తీవ్రోద్రేకాలకీ, ఆ కార్యకలాప క్రమానికీ బానిసలు కావచ్చు. ఆ ఆకాంక్షయే వాళ్లమీద సవారీ చేసేటంత శక్తిని సంతరించుకొంటుంది. అప్పుడిక దాన్ని అధిగమించడం వాళ్ల శక్తికి మించిన పని అవుతుంది.

ఇదిగో మన ముందు వొక్క జరూబిన్‌కీ, వస్తు ప్రపంచానికీ, ఘటనలకీ మధ్య పరస్పర ప్రతివర్తన: మనస్సును ఉత్తేజితం చేసి, ఊపిరి బిగపట్టేలా చేసే రంగులు, వివిధ కాంతి పరిస్థితుల్లో ప్రకృతి శకలాలు — వాడి ప్రకృతి చిత్రాలు... కళా మర్మాల స్పర్శ తగలగానే వాడి హృదయం వేగంగా కొట్టుకుంటుంది. ఒకానొక దశలో వాడు సృష్టించిన చిత్రానికి, అంటే వాడి కృషి ఫలితానికి వాడి హృదయంమీదా, మనస్సుమీదా అసాధారణ బలం కలిగిన ప్రభావం వుండేది. వాడు ప్రకృతినీ, చుట్టూ వున్న ప్రపంచాన్నీ ఒక భిన్నమైన పద్ధతిలో దర్శిస్తాడు, వాడిలో సౌందర్య శాస్త్రీయ భావన అభివృద్ధి చెందుతుంది.

మనం పరిశీలించిన సందర్భంలో కార్యకలాపాలు ఉపయోగకరమైనవి, సృజనాత్మకమైనవి. అయితే యీ కార్యకలాపాలు కొంచెం భిన్నమైన స్వభావం కలిగినవైతే ఏమవుతుంది?

ఫుట్‌బాల్, హాకీ ఆటల్లో తప్ప మరి దేనిలోనూ ఆసక్తి లేని పిల్లల్ని నేను ఎరుగుదును. బోలెడు మంది పిల్లలు అర్థరహితమైన సేకరణ రంధి కలిగి వుంటారు. అది ఒక్క చదువు

లోనే కాక, తదితర ప్రయోజనకర కార్యకలాపాల్లో సైతం వాళ్ల ఆసక్తిని పూర్తిగా ధ్వంసంచేస్తుంది. మనం యిక్కడ చర్చిస్తున్నది పిల్లలమీద వినాశకరమైన ప్రభావం బరపే లేక పిల్లలను పూర్తిగా ముంచివేసే గాఢావేశాలను గురించి గాని, పిల్లల మానసిక దృక్పథాన్ని విస్తృతంచేసే మాదిరి వ్యావృత్తులను గురించి కాదని నేనిక్కడ స్పష్టంచేయదలచుకున్నాను.

పిల్లల సృజనాత్మక కార్యకలాపాల నైతిక పార్శ్వాన్ని పరిశీలించేటప్పుడు, ఏ కార్యకలాపమైనా, అదెంత ఒంటరిదే అయినప్పటికీ, ముందు వెనుకల్లో సాంఘిక సాంగత్య రంగంలో వెల్లడవుతుందన్న విషయాన్ని మరో సారి వక్కాణించి చెప్పడం అవసరం.

దీనికి తోడు, కొత్త తరహాల కార్యకలాపాలూ, కొత్త వ్యావృత్తులూ విధిగా మనుషులతో, పిల్లల నైతిక శిక్షణలో పాలుపంచుకొనే కొత్త భాగస్వాములతో కొత్త సంబంధాలను తెస్తాయి. ఈ కొత్త సంబంధాలు అంతకు ముందరివాటిమీద ప్రభావం బరపి, విలువల పునరంచనాకి దారితీస్తాయి. అదే సమయంలో, వ్యక్తి పరిణతుడవడం ఎప్పుడూ మనుషుల సాంఘిక సాంగత్యపు మరింత లోతైన పారల్లోకి, మనుషులతో మరింత సున్నితమైన, సంశ్లిష్టమైన పరస్పర వర్తన రంగాల్లోకి పిల్లల ప్రవేశంతో ముడిపడి వుంటుంది.

ఏమి జరుగుతుందో చూద్దాం. వోవ్కాకి తన టీచరు లియోనీద్ సెర్గేయెవిచ్ అంటే యిష్టమే. అయితేనేం, వోవ్కా చిత్రాలపై టీచరు సవిమర్శక అంచనా ఒక వ్యక్తిగా టీచరు పట్ల విద్యార్థి వైఖరిని మార్చివేస్తుంది. టీచరుకి తనంటే యిష్టమేననీ, లియోనీద్ సెర్గేయెవిచ్ తనతో దయగా వ్యవహరిస్తున్నాడనీ, పని విషయంలో కచ్చితంగా వున్నాడనీ మనుస్సు లోలోపల వోవ్కాకి తెలుసు. అయితే వాడు యీ ఆలోచనను తన మనస్సులోంచి తరిమేసి, టీచరు తనకి శత్రువయ్యాడని తనకి తాను నచ్చచెప్పుకుంటాడు.

తన తల్లితో వాడి సంబంధం కూడా సరిగ్గా యిదే క్రమంలో సాగుతుంది. తల్లి తనని హృదయపూర్వకంగా ప్రేమిస్తోందన్న నమ్మకం వాడికి వుంది. కాని ఆవిడ తనపట్ల పూర్తిగా భిన్నమైన వైఖరి వహించాలని వాడు కోరుకుంటాడు. తన స్నేహితుడు యూర తల్లి ముఖాన్ని వోవ్కా ఎంతో ఈర్ష్యగా చూస్తాడు. ఆవిడ తన కొడుకుని అర్థంచేసుకుంటుంది. వాడికి సహాయం చేసేందుకు ప్రయత్నిస్తుంది. ఆవిడ ఒక సారి వోవ్కాతో "ముఖ్య విషయం నీ కృషిని మధ్యలో విరమించకపోవడం. బహుశా నీకు సాఫల్యం కలగవచ్చు. దాన్నే అంటిపెట్టుకొని వుండు!" అని చెప్పింది.

వోవ్కా తల్లే గనుక వోవ్కాతో అలా చెప్పి వుంటే! కాని ఆవిడ పూర్తిగా భిన్నమైన పద్ధతిలో మాట్లాడుతుంది. చిత్రకళలో వాడి ఆసక్తి త్వరలోనే పోతుందనీ, తన కొడుకు త్వరలోనే స్కూలు చదువు పూర్తిచేసి, నిర్మాణ లేక వాస్తుశిల్ప కళాశాలలో చేరుతాడనీ ఆవిడ ఆశిస్తుంది.

చాలా కాలం తర్వాత వోవ్కా జరూబిన్ తల్లి కన్నీళ్లు పెట్టుకొని యిలా వాపోయింది:

''నేను వాడికోసం అన్నీ వదులుకున్నాను. వాడికి స్కీలు వున్నాయి, స్కేట్లు వున్నాయి, సైకిలు వుంది. వాడికి నేను పుస్తకాలు, పెయింట్లు, కేన్వాసులు సమస్తం కొనిపెట్టాను. కాని నలుగురిలో వున్నప్పుడు వాడికి నన్ను అమ్మా అని పిలవడం కూడా నామోషీగా వుంటోంది. నేను చదువు తక్కువదాన్నని వాడు బిడియపడుతున్నాడు.''

ఎందుకూ కొరగాని యీ ''వ్యాపకం''లో తన కొడుక్కి ఆసక్తి కలిగిన రోజును తల్లి తిట్టుకొని, తనలో తను యిలా గొణుక్కుంది: ''అందరి పిల్లలూ చక్కగా పిల్లల్లా వుంటే, నా కొడుకు చిత్రకారుడు...'' యీ దారుణమైన వ్యాపకం లేకపోయి వుంటే, వాడు తనపట్ల ప్రేమగా వుండేవాడనీ, తన కష్ట సుఖాలు పట్టించుకునేవాడనీ, ఆపేక్షగా, వాత్సల్యంగా వుండేవాడనీ ఆవిడకి అనిపించింది.



వోవ్కా కూడా తనని తను తిట్టుకొని, తన తల్లి మనస్సును యింకెప్పుడూ కష్ట పెట్టకూడదని అనుకున్నాడు. వాడు వెళ్లి తన తల్లికి సాయంచేశాడు. తన తప్పు అలా దిద్దు కోవాలని వాడు ప్రయత్నించాడు. ఎప్పుడో ఒకప్పుడు, ఏదో ఒక విధంగా తన తల్లి రుణం తీర్చుకోవాలని కూడా వాడు కలలు కన్నాడు. కాని వోవ్కా జరూబిన్ యిదెన్నడూ జరగదని గ్రహించలేకపోయాడు. ఏదైనా మంచి పని చేయడం రెండు సార్లు వాయిదా వేసిన మనిషి విధిగా మూడో సారి కూడా వాయిదా వేసి తీరుతాడన్నదే ఆ విషయం. మంచి పనిని వాయిదా వేయడమంటే, మనుషులపట్ల నిర్లక్ష్యం చూపడమే అని అర్థం.

ఇంకొక ముఖ్యమైన బోధన శాస్త్రీయ సమస్య కూడా వుంది: అది వ్యక్తులకీ వాళ్ల

చుట్టూ వున్న మనుషులకీ మధ్య ఘర్షణ. అతి సన్నిహిత వ్యక్తులైనా సరే, వాళ్ల అభిప్రాయాలు మొత్తంమీద ఏకీభవించకపోతే, ముందు వెనుకల్లో ఒకరినుంచి మరొకరు దూరమై పోతారన్నది స్వయంసిద్ధ సత్యం. నేనిక్కడ చెపుతున్నది అభిప్రాయాలు, దృక్పథాలు, ఆసక్తులను గురించే గాని, ఆనుగుణ్యతని గురించి కాదు. తల్లికీ కొడుక్కీ మధ్య అంతస్సంబంధాల్లో ఎడబాటు వోవ్కా తన తల్లిని ప్రేమించకపోవడం వల్ల గాని, ఆమెలో సల్లక్షణాలు చూడకపోవడం వల్ల గాని తటస్థించలేదు. అందుకు భిన్నంగా, వాడు తన తల్లిపట్ల చాలా తరచుగా ఆర్ద్రంగా వ్యవహరిస్తాడు, ఆవిడకి అన్నింట్లోనూ సాయం చేసేందుకు ప్రయత్నిస్తాడు, తన పెడసరపు కొంటె చేష్టలపట్ల సిగ్గుపడుతూ వుంటాడు. అయితే, ఆవిడ మొరటుగా, యుక్తాయుక్త విచక్షణ లేకుండా తన ప్రధాన ఆసక్తులమీదా, తను



జీవితంలో ప్రధానమైనవిగా భావించిన విలువలపట్లా తృణీకార భావం ప్రదర్శించినప్పుడు వాడు ఆవిడపట్ల నిర్దాక్షిణ్యంగా వ్యవహరిస్తాడు. ఇప్పుడు తన వ్యావృత్తులను అర్థంచేసుకొని, ఆసక్తి చూపేవాళ్లపట్ల వాడు ఆకర్షితుడవుతున్నాడు. తన సావాసగాళ్లకి కళని గురించిన ప్రగాఢ జ్ఞానం లేకపోయినా సరే పరవా లేదు, తన సృజనాత్మక కృషిపట్ల కొంచెం ఆసక్తి చూపిస్తే చాలు వాడికి... సరే, వోవ్కా జరూబిన్ సంగతి యింక వదిలేద్దాం. ఒక వైపున, పొరపాటు నిర్ణయాలు, ఆదుర్దాలు, అవమానాలతో, మరో వైపున, ఆనందంతో, విజయాలతో, సంతోషంతో నిండిన పూర్తి జీవితం వాడి ముందు వుంది...

మనం యిక్కడ మొత్తంమీద ఒక సానుకూల ఉదాహరణను చూసినట్లు మీరు

గమనించి వుంటారు. తెలివైనవాడు, ప్రజ్ఞావంతుడు, మనుషులనీ, ప్రకృతినీ సునిశితంగా పరిశీలించే శక్తి కలిగినవాడిని మనం యిక్కడ చూశాం. వోవ్కా జరూబిన్ తనకి ఆసక్తి వున్న వ్యావృత్తిలో నిమగ్నుడైన మంచి విద్యార్థి. అయితేనేం, వాడెంత గడుగ్గాయి!

బోధన శాస్త్రం ప్రతి ఒక నిర్దిష్ట సన్నివేశానికీ అన్వయింపజేయగలిగిన సాధారణ పరిష్కార మార్గాలు సమకూర్చదు. డజన్ల కొలది బోధన శాస్త్రీయ గ్రంథాలు చదివినా కూడా, టీచరుకి తటస్థపడే అసాధారణ వ్యక్తిత్వాల విశిష్టతలు వివరించలేకపోవచ్చు.

అయితే, బోధన శాస్త్రీయ సాధనాలు, మనస్తత్వ శాస్త్రీయ పరిజ్ఞానం కలిగిన తల్లి తండ్రులకి లేక టీచర్లకి పిల్లల జీవితంలో తమ కళ్ల ముందు సంభవిస్తున్న సంశ్లిష్ట క్రమాల మూలంలో వున్న కారణాలు, వాటి పరిష్కారాలు ఎప్పుడూ స్ఫురిస్తాయి.

"బోధన శాస్త్రంలో నిర్దిష్ట నిబంధనలంటూ ఏమీ లేవు. బోధన శాస్త్రం గతి తార్కికమైనది. అందుచేత ఇలా చేయవచ్చు అలా చేయవచ్చు" అనే వాదన తరచు వింటూ వుంటాం.

అయితే, యిది నిజం కాదు. నిబంధనలు ఉన్నాయి. ట్రాఫిక్ నిబంధనల కంటె అవి సంశ్లిష్టమైనవని ప్రత్యేకించి చెప్పనక్కర్లేదు. పిల్లల అభివృద్ధి క్లిష్ట క్రమాన్ని శాసించే "నేరుగా ముందుకెళ్లు!", "ఎడమకి తిరుగు!" వంటి నియమాలు లేకపోయినా నమ్మలేనన్ని ఎక్కువ హెచ్చరికలు వున్నాయి.

బోధన శాస్త్రీయ నిబంధనలు సునిర్వచితమైనవి కావు. అవి వర్తించే పరిధి విస్తృతి మూలంగా అవి చాలా సంశ్లిష్టమైనవి. వాటిని నిపుణంగా ఉపయోగించని నాడు, అవి పూర్తి తలకిందులు ఫలితాలను యివ్వవచ్చు. ప్రోత్సాహం శిక్షగా పరిణమించవచ్చు, లేక పోతే అతిశయానికి దోహదం చేయవచ్చు. చిత్తశుద్ధితో కూడిన సంభాషణ విసుగు పుట్టించే నీతి బోధ ఉపన్యాసం కావచ్చు. పిల్లల మనోస్థితికి అనుగుణం కానివాటిని డిమాండు చేస్తే సంబంధాల విచ్ఛిత్తికి దారితీయవచ్చు, వగైరాలు. బోధన శాస్త్రీయ పద్ధతులను ఏ మేరకు అన్వయిస్తే అత్యుత్తమ ఫలితాలు లభిస్తాయో తెలుసుకోవడం ముఖ్యం.

## సమష్టి, వ్యష్టి మనస్తత్వం తెలుసుకోవడం, దాన్ని పరిగణనలోకి తీసుకోవడం

స్కూలు అధ్యయన కేంద్రం మాత్రమే కాదనీ, అది సాంఘిక సాంగత్య ప్రపంచమనీ, ఆరాట అనుభవాల, సంతోష పరాజయాల ప్రపంచమనీ ప్రత్యేకించి చెప్పవలసిన అవసరం లేదు.

మన పిల్లల మంచి దస్తూరీ గురించీ, తెలివి గురించీ మనం శ్రద్ధ చూపుతాం. టీచరు ఏమంటోందనీ, ఏం మార్కులు వేసిందనీ మనం అడుగుతూ వుంటాం. తమ సమాధానంపట్ల, టీచరు వ్యాఖ్యలపట్ల తమ క్లాస్‌మేట్లు ఎలా ప్రతిస్పందించారు, తమ మిత్రుల మాటలపట్ల వీళ్లు ఎలా ప్రతిస్పందించారు, తమ క్లాస్‌మేట్ల సమక్షంలో వీళ్లకి ఎలా అనిపిస్తుంది – యీ ప్రశ్నలను మాత్రం మనం తరచు నిర్లక్ష్యం చేస్తాం. ఈ ప్రశ్నలకి సమాధానం చెప్పడం పిల్లలకి కూడా కష్టమే.

మరో విషయం కూడా వుంది. ఎందుకో తెలియదు గాని, కౌమార వయస్కులైన స్కూలు పిల్లల సాంఘిక సంబంధాల్లో ప్రత్యేకమైన నైతిక సమస్యలంటూ ఏమీ లేవని మనకి అనిపిస్తూ వుంటుంది. కాని యిది నిజం కాదు.

ప్రాథమిక తరగతుల్లోని పిల్లలు మెత్తటి మట్టి ముద్దల్లాంటి వాళ్లనీ, వాళ్లని ఎలా కావాలనుకుంటే అలా తీర్చిదిద్దవచ్చుననీ అనుకోవడం పొరపాటు. పిల్లవాడు ఎంత చిన్నవాడైతే, వాడి సంవేదనలు అంత ఎక్కువ సద్యోజనితమైనవిగా, అంత ఎక్కువ స్ఫుటమైనవిగా వుంటాయి. వాడి స్వయం వ్యక్తీకరణ ధోరణి అంత తీవ్రతరంగా వుంటుంది. ఈ ధోరణి ఎంత బలవత్తరంగా వుంటే, వాడి పరాజయాలూ, వాడి దాడులూ అంత ఎక్కువ పరిగణనీయంగా వాడికి కనిపిస్తాయి. స్కూల్లో నూత్న సంవత్సరాది సందర్భంగా ఏదైనా పోటీ జరుగుతుందని టీచరు ప్రకటించినప్పుడు, ఆ పోటీలో తనకి ప్రథమ బహుమతో, ద్వితీయ బహుమతో వస్తుందని కౌమార వయస్కుడు అంతరాంతరాల్లో ఆశించినప్పటికీ, తన గత అనుభవం వల్ల ఆ బహుమతి మరొకరికి రావచ్చునని వాడికి ముందే చూచాయగా తెలుస్తుంది. తనని పెద్దవాళ్లు మెచ్చుకపోయినప్పటికీ వాడు నిరుత్సాహపడడు.

కాని, అదే మొదటి తరగతి పిల్లవాడైతే, వాడికి అన్నీ కొత్తగా వింతగా వుంటాయి. వాడికి టీచరు మాట తిరుగులేనిది. పోటీలో గెలిస్తే బహుమతి వస్తుందని చెప్పినప్పుడు, టీచరు ఆ మాట తనని ఒక్కణ్ణే మాత్రమే ఉద్దేశించి చెప్పినట్లు వాడికి అనిపిస్తుంది. అంతే కాదు, తన చుట్టూ వున్న పిల్లల్ని పరిగణనలోకి తీసుకోవడం వాడికి యిష్టం వుండదు. ప్రతి స్కూలు పిల్లాడూ, ప్రత్యేకించి ప్రతి ఒకటో తరగతి విద్యార్థీ బహుమతి పొందే అవకాశం వుంటే, వాడు దాన్ని ఎంతో సహజంగా అనుకుంటాడు. నిజం చెప్పాలంటే, మంచి స్కూళ్లలో యిదే ఆచారం వుంటుంది. 20–30 మంది పిల్లలుండే క్లాసులో 20–30 బహుమతులు వుంటాయి.

పోటీకోసం తను తయారుచేసిన వస్తువు తీసుకొని, మహోత్సాహంగా స్కూలుకి వచ్చిన మొదటి తరగతి పిల్లాడికి ఏ బహుమతీ రాకపోయేసరికి, తను మోసగింపబడినట్లు వాడు అనుకుంటాడు. "ఏరా, ఎలా జరిగింది పోటీ?" అని తన తల్లిదండ్రులు అడిగినప్పుడు, వాడు భుజాలు ఎగరేసి, అనాసక్త స్వరంలో "ఏం బాగా లేదు" అని జవాబిస్తాడు.

అయితే, పెద్దవాళ్లు బహుమతులు పంచడం మొదలెట్టిన క్షణందాకా, తను పెద్ద

పిల్లల్ని తోసుకుంటూ, తను పోటీకోసం తయారుచేసినది జడ్జీలకి చూపించేదాకా వాడికి ఆ పోటీ ఆసక్తికరంగానే వుంది. "ఫలానావాడికి (తనకి కాదు!) బహుమతి. మిగతావాళ్లు కూడా మంచివే చేశారు" అని జడ్జీలు అన్నప్పుడు, వాడి ముఖాన్ని విచార మేఘాలు అలము కున్నాయి.

ఈ గదిలో ఉన్న యిద్దరు పిల్లల్నీ చూడండి. వాళ్లలో ఒకడికి బహుమతి వచ్చింది. వాడు సంతోషంగా, హుషారుగా వున్నాడు. రెండోవాడి చేతిలో ఏ బహుమతీ లేదు. వాడు ఉడుక్కుంటున్నాడు. బహుశా జీవితంలో మొట్టమొదటి సారి వాడిలో ఈర్ష్య పొడచూపి వుంటుంది.

పిల్లల మధ్య చాలా కాలం పనిచేసిన లేక పిల్లలతో చాలా కాలం సంబంధం వున్న వాళ్లెవరైనా అకస్మాత్తుగా, అకారణంగా వాళ్లలో ఒకరు తన నేస్తాన్ని కొట్టడమో, లేక నేలమీద పడగొట్టి నొప్పించడమో చూశారు. ఇదేదో కేవలం కొంటె చేష్ట, తమాషాయో (కొన్ని సందర్భాల్లో అది కూడా జరగవచ్చు) కాదు. తరచు ఇలాంటి దానికి పూర్వ కారణ మేదో వుంటుంది. అలా దాడిచేసిన పిల్లవాడికి ఆ పూర్వ కారణం గుర్తు కూడా వుండి వుండకపోవచ్చు. అయితే మచ్చ మిగల్చని గాయం వుండదన్న విషయం మనం యింతకు ముందే చూశాం. అనుభవాలూ, భావముద్రలూ మనస్సులో మెదులుతూ, ఎప్పుడో ఒక ప్పుడు పైకి పొడుచుకొని వస్తూనే వుంటాయి.

పిల్లలు ఒకళ్లతో మరొకళ్లు ఆడుకునేటప్పుడు, ఏవైనా కార్యకలాపాల్లో నిమగ్నులై నప్పుడు వాళ్ల నైతిక గుణాలు వెల్లడవుతాయి. తమ నేస్తాలు దేంట్లోనైనా విఫలమైనప్పుడు పిల్లలు చంకలు కొట్టుకుంటారు. ఎవళ్లైనా స్కూలుకి ఆలస్యంగా వచ్చినప్పుడు, లేక బ్లాక్‌బోర్డు దగ్గర ఎవళ్లైనా పప్పులో కాలు వేసినప్పుడు పిల్లలు భళ్లున నవ్వుతారు. వాళ్లు పూర్తిగా టీచరు పక్షం వహిస్తారు...

అయితే, 6–7 క్లాసుల్లోకి వచ్చేసరికి పిల్లలు అనేక విషయాలను బాగా పునరాలో చిస్తారు. వాళ్లలో కొత్త నైతిక ప్రమాణాలు రూపొందుతాయి. ఉదాహరణకి, క్లాసు ఫస్టు విద్యార్థిపట్ల పిల్లల వైఖరిని పరిశీలిద్దాం.

పాఠం మొదలయ్యేందుకు ముందు విద్యార్థుల్లో ఒకరు అందరి అభిప్రాయాన్నీ యిలా వ్యక్తంచేశారు: "పోయిన క్లాసులో టీచరు లెక్కని స్పష్టంగా వివరించి చెప్పలేదు. అందు కని మేము దాన్ని చెయ్యలేకపోయాం. మాకు బోధపడలేదు. మరో సారి వివరించి చెప్పాలి..."

కాని క్లాసు ఫస్టు కుర్రాడు ఆ లెక్క చేశాడు. అయితే అందుకు కారణం ఆ లెక్కలో వాడికి వున్న ఆసక్తే కాని, అందరి మధ్యా బోర విరుచుకు నిలబడాలన్న బులపాటం కాదు. ఆ లెక్క శుద్ధ తేలికైనదనీ, మిగిలిన వాళ్లందరూ బుర్రలేనివాళ్లనీ, తను దాన్ని క్షణంలో చేసి పారేశాననీ, వగైరా గప్పాలు కొడితే పిల్లల మధ్య వాడి ప్రతిష్ఠ గంగపాలై వుండేది. అందుకు బదులు వాడు టీచరుకి తన సమాధానం రైటవునో కాదో తనకి సందేహంగా వుం

దనీ, ఆ లెక్కలో చాలా మెలికలు వున్నాయనీ చెప్తే, అప్పుడు వాడి ప్రతిష్ఠ పెరిగి వుండేది. ఎందుకంటే వాడి మాటకి రెండు విధాల పదును వుండేది. మొదటిది, వాడు మిగిలిన పిల్లల్ని సమర్థించి, వాళ్ల సంఘీభావం పొంది వుండును. రెండవది, వాడు తను వినమ్రుడిననీ, నమ్మదగినవాడిననీ, సమష్టితత్వాన్ని మన్నించేవాడిననీ మరో సారి రుజువుచేసుకొని వుండును.

పిల్లల్లో యిలాంటి ప్రవర్తన సామాన్యమైనదని నా ఉద్దేశమా? ఎంత మాత్రం కాదు. పైపెచ్చు, పిల్లల పెంపకపు క్రమం తరచు పిల్లవాడి విశేషసక్తికి అడ్డుకట్ట వేసి, మనస్సును మొద్దుబారజేసి, తప్పు అభిప్రాయాలను పెంపొందించే "వీధి" చట్టాల ప్రాబల్యంలో చాలా మటుకు నష్టపోతుంది.

"వీధి చట్టం" కొన్ని సందర్భాల్లో చాలా ప్రమాదకరమైనది. దాన్ని నాశనం చెయ్యడం కష్టం. అది ప్రచ్ఛన్నమైనది. దాన్ని దొడ్డివాకిలినుంచి మాత్రమే తొంగి చూడగలం. అయితే అప్పుడప్పుడు మనకి తెలియని యీ అజ్ఞాత ప్రపంచం పిల్లల సాంగత్యంలో రూపొందుతుంది. ప్రధానంగా పిల్లవాడి నైతిక అభివృద్ధిమీద దాని నిర్ణయాత్మక ప్రభావం వుండవచ్చు.

నేనీ కింది విషయం మీదకి పాఠకుల దృష్టిని ఆకర్షించ కోరుతున్నాను. ఆధునిక కౌమార వయస్కుడు 11–12 ఏళ్ల వయస్సుకల్లా నైతికతకి సంబంధించిన సమస్యల్లో నిశ్చితమైన దృక్పథాన్ని పెంపొందించుకోగలిగి వుంటాడు. మరింత కచ్చితంగా చెప్పాలంటే, ఆ వయస్సుకి వాడు ఏది మంచో, ఏది చెడో తెలుసుకోగలిగి వుంటాడు. మన పెద్దవాళ్లం పిల్లల అభివృద్ధిని బాగా తక్కువ అంచనా వేస్తాం, వాళ్లకి మనం అనుకునేదాని కంటె బాగా మెరుగైన గ్రహణ శక్తి వుంటుంది. మనం పిల్లల మానసిక ప్రపంచాన్ని ఒక మొత్తంగా చూస్తూ వుంటాం. సర్వసాధారణంగా పిల్లల్లో గుప్తంగా వున్న భావాలను మనం గమనించం. నిజానికి పిల్లలు తమపట్ల మనం యిష్టం కలిగి వుండాలని కోరుకుంటే, వాళ్లు మంచివాళ్లని అనుకుంటాం. వాళ్లు "తమ వయస్సుకి మించి తెలివైన మాటలు" చెప్తే, మనం సంతోషపడతాం.

పిల్లలు కల్లలు పలికితే, మనం చాలా తరచు అవేవో తమాషా కొంటె చేష్టలని అనుకుంటాం. పిల్లల ప్రవర్తనలో దోషాలను ఎత్తి చూపడం మన విధిగా మనం పరిగణిస్తూ వుంటాం. అసత్యం ఆడరాదు, గర్వం ప్రదర్శించరాదు, ఈర్ష్య చూపరాదు, పిరికితనం హేయము అంటూ పిల్లలచేత మనం నీతి వాక్యాలు వల్లింపజేస్తూ వుంటాం. కాని వాస్తవ జీవితంలో తరచు మనమే బోధించిన యీ నీతులకి భిన్నంగా ప్రవర్తిస్తూ వుంటాం. ఈవిధంగా తల్లితండ్రుల మాటలకి విలువా, ప్రతిష్ఠ పోతూవుంటాయి.

ప్రతికూల అనుభవానికి సంబంధించిన ఈ మాదిరి మొత్తం క్రమం మనకి తెలియకుండానే సంభవిస్తూ వుంటుంది. ఈ క్రమానికి సంబంధించిన వివరాలు, విశేషాలు

తేలిగ్గా దృష్టిగోచరమయ్యేవి కావు. ఈ ప్రతికూల అంశాలు అంతిమ రూపం తీసుకునేందుకు నెలలే కాదు సంవత్సరాలు కూడా పట్టవచ్చు. పిల్లలు స్కూల్లో ప్రవేశించినప్పుడు యీ వికృతాకృతి నాశనం కావడం అత్యంత సంభావ్యం. టీచర్లు, పయనీర్ సంఘాల ప్రభావంలో పిల్లల మానసిక ప్రపంచంలో కొత్త విలువలు, సాంఘిక సాంగత్యానికి సంబంధించిన కొత్త ప్రమాణాలు గమ్యోన్ముఖమైన పద్ధతిలో ప్రవేశపెట్టబడతాయి. అయితే, మన పిల్లల సాంఘిక సాంగత్యంలో సంభవించే ప్రతీదీ మనకి తెలుసా? వాళ్ల సంబంధాలు ఎలా రూపొందుతాయి? ఈ సంబంధాలకు వాటి సొంత రూపాలంటూ ఏమైనా వున్నాయా? పిల్లల సాంఘిక సాంగత్యాన్ని తీర్చిదిద్దవచ్చునా? విభిన్న కుటుంబాలకు చెందిన, విభిన్న అనుభవాలు, విభిన్న అభిరుచులు కలిగిన పిల్లలు స్కూలుకి వస్తారు. స్కూలు అన్నది ఒక స్వరమేళ లాంటిది. దానిలో ప్రతి ఒక్కరూ తన వాయిద్యం వాయించేందుకు ప్రయత్నిస్తారు. కాని సంగీత సాధనాలు భిన్నభిన్న శక్తులు కలిగినవి, విభిన్న ధ్వనులు కలిగినవి. స్వరమేళ విషయం ఎవరికీ పట్టకపోతే, అపశృతులు వినిపించవచ్చు. మద్దెల మోతలు సున్నితమైన ఫిడేలు ధ్వనులను మింగెయ్యవచ్చు. బాకాల హోరు తదితర ధ్వనులన్నింటినీ ముంచెయ్యవచ్చు.

పిల్లల సమాజంలో ఆయా పిల్లలు ఆక్రమించే స్థానాల సోపానాన్ని సుమారుగా నిర్ణయించేందుకు ప్రత్యేకమైన మనస్తాత్త్విక పరిశీలన యేమీ అక్కర్లేదు. ఫ్రీ టిక్కెట్లు లభ్యమైనప్పుడు సినిమా హాల్లో పిల్లలు సీట్లు ఎలా ఆక్రమిస్తారో అన్నది యిందుకు నమూనాప్రాయమైన ఉదాహరణ. వాళ్లలో మిక్కిలి బలవంతులు లేక "నాయకులు" అనబడేవాళ్లు అత్యంత సౌకర్యమైన లేక అత్యుత్తమ స్థానాలను ఆక్రమిస్తారు. ద్వితీయ, తృతీయ శ్రేణికి చెందిన వాళ్లు ఉన్నవాటిలో బాగా మంచి స్థానాలను ఆక్రమిస్తారు. అయితే, చిట్టచివరివాళ్లకి అసలు సీట్లే వుండవు. ఈ చివరివాళ్లలో ఒకడు తన సీటును "వదులుకోగా," యిద్దరు ముగ్గురు తరిమెయ్యబడతారు.

నగరం బయటికో, ఒక శిబిరానికో లేక ఎక్స్‌కర్షనుకో వెళ్లేటప్పుడు పిల్లలు బస్సులో ఎలాంటి సీట్లు ఆక్రమిస్తారో గమనించండి. కిటికీ దగ్గిరి సీట్లు ఎవరు ఆక్రమిస్తారో, తలుపులకి చేర్లబడి ఎవరు నిలబడతారో గమనించండి.

పిల్లల్లో ప్రతి ఒక్కరి అభిరుచులనూ సమష్టి నైతికతకు అనుగుణంగా రూపొందించేందుకు అవసరమైన పరిస్థితులను సృష్టించడమే ఒక సమష్టిని వ్యవస్థీకరించే సరైన పద్ధతి.

వ్యక్తి సారాంశం సాంఘిక సంబంధాల వెరసి మొత్తమే అన్న, యీ సంబంధాల వెలుపల వ్యక్తి గాని, వ్యక్తికి స్వేచ్ఛ గాని, సంతోషం గాని లేదన్న అందరికీ తెలిసిన సత్యాన్ని యిక్కడ తిరిగి పేర్కొననక్కర్లేదు. ఒక్క విషయం స్పష్టం. వివక్షణకి గురైన ఆ యిద్దరు ముగ్గురు వ్యక్తుల, సమష్టిలో చివరి స్థానం ఆక్రమించేవాళ్ల పరిస్థితి పరమ నికృష్టంగా వుంటుం

దనీ, ఆ కట్టకడపటి స్థానాలను చిరకాలంగా ఆక్రమించడం ద్వారా వాళ్ళు వేదనకి గురి అవుతారనీ, యీ వేదన సహేతుకమైనది కాదనీ, అలాంటి వ్యక్తిని యీ వేదననుంచి విముక్తం చేసేందుకు ఒకే ఒక్క మార్గం వుందనీ – అది స్థానాలను పునర్వ్యవస్థీకరించడమే ననీ, మంచి, చెడు, మధ్యమ స్థానాలను వరుసవారీగా ప్రతి ఒక్కరూ ఆక్రమించేలా చూడటమే యీ పద్ధతి అనీ, అంటే పిల్లల "సహజ" జీవితం అనబడేదాన్ని, సద్యోజనితంగా ఏర్పడిన సాంఘిక సాంగత్యాన్ని సరిదిద్దడమేననే విషయం స్పష్టం. ఇందుకోసం సాంగత్య మనస్తత్వాన్నీ, సమష్టి నిర్మాణాన్నీ తెలుసుకోవడం అవసరం.

ఈ అంశాన్ని పరిశీలిద్దాం.

పిల్లలు ఏ కార్యకలాపంలోనైనా – అది చదువైనా, వినోదమైనా, పని అయినా – కలిసికట్టుగా నిమగ్నం కాగానే, వాళ్ల మధ్య వెంటనే నిర్దిష్టమైన సాంఘిక సంబంధాలు ఏర్పడతాయి. వాళ్ల జీవితానికి సంబంధించిన ఒక ఆంతరిక పథకం అనబడేది – అంటే, లక్ష్యాలు, నిబంధనలు ఎవరిచేతా ఆధికారికంగా రూపొందించబడని, తనకి తానూ, యితరులకీ విధ్యుక్త బాధ్యతలను నిర్దేశించుకోని, న్యాయ, ధర్మాలపట్ల తమకి తాము ఏర్పరచుకున్న అభిప్రాయాలతో కూడినది – ఉత్పన్నమవుతుంది. మనం యింతకు ముందే కొన్ని సార్లు చూసినట్లు, మంచి, చెడులపట్ల పిల్లల నియమాలు నైతికతకి సంబంధించిన పెద్దల అభిప్రాయాలతో చాలా తరచుగా ఏకీభవించవు. ఈ విషయం తెలిసో లేక గ్రహించో పిల్లలు తమనీ, తమ నియమాలనీ టీచర్లనుంచీ, తాము నమ్మకంలోకి తీసుకోజాలమని నిక్కచ్చిగా అనుకునేవాళ్లనుంచీ మరుగుపరుస్తారు. పిల్లలు యీ నియమాలను తమ నాయకుల ద్వారా వ్యక్తం చేసి, వాటిని తమ అంతర్ వలయంలోనే ఉంచుకుంటారు. ఈ అంతర్ వలయంలోకి అందరికీ ప్రవేశార్హత వుండదు.

సాధారణంగా క్లాసుకి ఒక లీడరో, మానిటరో ఉంటాడు. అయితే, క్లాసులో అనధికార నాయకుడు అతని కంటె ఎక్కువ ప్రతిష్ఠ కలిగినవాడై వుండటం, అతనే వాస్తవంలో నాయకుడుగా పరిగణింపబడటం తరచు సంభవిస్తూ వుంటుంది. కౌమార వయస్కుల సమష్టుల్లో అలాంటి వాళ్లు ఒకరి కంటె ఎక్కువ మందే వుంటారు. వీళ్లలో ప్రతి ఒక్కరూ పరస్పరం ఒకరితో ఒకరు ఉమ్మడి ఆసక్తులు, అనుభవాలు, నివాస స్థానాలు, ఉమ్మడి క్లాసులు లేక గ్రూపులచేత అనుబంధితులైన యితర పిల్లల్ని ఆకర్షిస్తారు. ఈ విధంగా క్లాసులో చిన్నచిన్న గ్రూపులు ఏర్పడుతాయి. దీనిలో దోషమేమీ లేదు. ఈ గ్రూపుల మాదిరిగానే నాయకత్వం కూడా ఏర్పడుతూ వుంటుంది. ఒక్కొక్క రోజు గడిచే కొద్దీ పిల్లలు పెరుగుతూ వుంటారు. వాళ్లు ఏదో ఒకదాంట్లోకి త్వరితంగా ఆకర్షితులవుతారు, కొత్త అనుభవాలు, కొత్త జ్ఞానం, కొత్త సామర్థ్యాలు సంతరించుకుంటారు. ప్రతి చిన్న గ్రూపులోనూ ఉమ్మడి ఆసక్తులచేతా, సానుభూతులచేతా, పరస్పరం ఒకరిమీద మరొకరి నిర్దిష్ట పరాధీనతచేతా పిల్లలు సమీకృతులవుతారు. ఈ గ్రూపుల, వాటి నాయకుల చర్యలు

ఎంతో ఉపయోగకరమైన, సాంఘికంగా ప్రాముఖ్యం కలిగిన స్వభావం కలిగి వుండవచ్చు, లేక అవి అత్యంత హానికరమూ, అపభ్రంశమూ, అవినీతికరమూ కావచ్చు. నికరమైన మైత్రీ, పరస్పర సహాయమూ అభివృద్ధి చెందే గ్రూపులను ప్రజాస్వామికమైన లేక ప్రతి ష్ఠాకరమైన గ్రూపులనీ, తద్విరుద్ధంగా, భ్రష్ట నిర్మాణం కలిగిన గ్రూపులను నిరంకుశ గ్రూపులనీ అనవచ్చు.

నిరంకుశ నాయకుడి నాయకత్వంలో వున్న గ్రూపుల్లో నలుగురికీ యిష్టులు కాని పిల్లల బతుకు చాలా దుర్భరంగా వుంటుంది. వాళ్లని అవమానిస్తారు. వాళ్ల చొరవని తొక్కేస్తారు. వాళ్లచేత హీనమైన పనులు చేయిస్తారు. భోజనశాలలో వాళ్లకి తిండి ఆఖర్న పెడతారు. బస్సుల్లో వాళ్లు యిరుకు స్థలాల్లో నిలబడవలసి వుంటుంది. ఆటల్లో వాళ్లెప్పుడూ ఆటలో కాక అంబటోల్ల బుడగల్లా పక్కన నిలబడవలసి వుంటుంది, వగైరా.

సాంఘిక సాంగత్యపు సంఘటన లేకపోవడం పిల్లలకి మరింత స్వాతంత్ర్యాన్ని యిస్తుందనీ, సాంఘిక సంబంధాల సంఘటితత్వం ఏ రూపంలో వున్నా సరే, అది చొరవకి శృంఖలమై, వ్యక్తిని అణచివేస్తుందనీ కొందరు భావిస్తున్నారు. నా ఉద్దేశంలో యీ నిర్ధారణ పూర్తిగా తప్పు.

నిజానికి, అసంఘటిత సంబంధాలను నిర్ధరించే సూచన యేమిటంటే, సాంగత్యాన్ని ఎంపిక చేసుకునే స్వాతంత్ర్యం. నేనిక్కడ వక్కాణించి చెప్తున్నది ఎంపికని గురించే గాని, దాని ఆభాసని గురించి కాదు. ఒక పిల్లవాడు ఐచ్ఛికంగా తన స్నేహితులను ఎంపిక చేసుకున్నాడని అనుకుందాం. అయితే, కొద్ది కాలం తర్వాత వాళ్లలో ఒకడు ఒకళ్ల తర్వాత ఒకళ్లని కొడతాడు, వాళ్లకి ఇది చెయ్యి, అది తీసుకురా, అలా వుండు, మొదలైన ఆదేశాలు జారీచెయ్యడం మొదలుపెడతాడు. అయితే, వాడు యివన్నీ మొరటుగా కాక, యుక్తిగా, సహేతుకంగా కనిపించేలా చేస్తాడు. కన్నెన్న మొదట బుస్సెన్నని కొడతాడు. అలా కొట్టి, తను సింగన్నని రక్షించేందుకు అలా కొట్టానని తన చర్యని సమర్థించుకుంటాడు. తర్వాత, బుస్సెన్న న్యాయాన్ని సమర్ధించినందుకు, వాణ్ణి కొడతాడు. మరో రెండు రోజుల్లో, వాడు బుస్సెన్నని సమర్థిస్తాడు. దానితో బాటు, తను వాడితో ఏదో యాదృచ్ఛికంగా అన్నట్లు, "నా దగ్గర రెండు సినిమా టికెట్లు ఉన్నాయిరా, నువ్వొకటి తీసుకో..." అంటాడు. వాళ్లిద్దరూ స్నేహితులవుతారు... కొంత కాలం పాటు యిది ఎంపిక, వ్యక్తీకరణల స్వేచ్ఛ. కాగా యితురలకి సంబంధించి యిదెంతటి తీవ్ర పరాధీనత అంటే, ఎవడైనా ఒక పిల్లవాడు యీ స్నేహాన్ని భగ్నం చెయ్యాలి అనుకున్నా, ఆ పని చెయ్యలేడు.

క్లుప్తంగా చెప్పాకోవాలంటే, పిల్లల "స్వేచ్ఛాయుత" సాంఘిక సాంగత్యంలో కొందరు ఎంత అస్వతంత్రులుగా ఉంటారంటే, తమలో ప్రతి ఒక్కరూ తన సామర్థ్యాలను పూర్తిగా అభివృద్ధి చేసుకునేందుకు హామీ కల్పించే ఏ యితర సంస్థలో అయినా సరే చేరేందుకు సర్వ సంసిద్ధంగా వుంటారు. పిల్లల యీ గుప్త వాంఛ వాళ్ల సమష్టి జీవితానికీ, యీ గ్రూపుల్లో

వాళ్ల సంబంధాలు ఏర్పడేందుకూ పునాదిగా వుండాలి. వీటన్నింటి తాత్పర్యం ఏమిటంటే, తత్వశాస్త్రజ్ఞులు చెప్పినట్లు, స్వేచ్ఛకీ, వాళ్లని విడదీసే ఆవశ్యకతకీ మధ్య వార లేదు, అవి రెండూ అన్యోన్య సంబంధితాలు. ఈ రెండు రూపాలూ (నిజానికి ఒకే రూపం) ఏక మొత్తమే. అందుకే, వీటిలో ఏ రూపం — సంఘటితమైనదా లేక అసంఘటిత మైనదా — మెరుగైనదన్న ప్రశ్నే ఉత్పన్నం కాదు.

ఆచరణలో దాని ప్రాముఖ్యం ఏమిటి?

టీచరు ఆటని ఒక సాధనంగా వినియోగించినవాడు, పిల్లలకి ఆనందదాయకమైన ఆట గంభీరము, కష్టతరము అయిన సాంఘిక విధుల నిర్వహణకు తోడ్పడవచ్చు. ఆటల సాంఘిక, నైతిక సారాంశపు సంశ్లిష్టతను క్రమంగా పెంచి, వాటిని మేధాపర లేక శారీరక శ్రమ వంటి యితర తరహాల కార్యకలాపాలతో జోడించడం ద్వారా యీ పరివర్తన సాధింపబడుతుంది.

నా అనుభవం రీత్యా అయితేనేమి, బోధన శాస్త్ర చరిత్ర, గతానికి, ప్రస్తుతానికి చెందిన ప్రముఖ బోధన శాస్త్రజ్ఞుల అనుభవాల అధ్యయన ఫలితంగానేమి, ఆటలనూ, కృషినీ మేళవించడమే ప్రముఖ విద్యా సాధనం అని నేను దృఢంగా విశ్వసిస్తున్నాను.

ఉత్తర ధృవం, దక్షిణ ధృవంలా కనిపించే యీ రెండింటికీ పొత్తేమిటని ఎవరైనా ప్రశ్నించవచ్చు. ఈ రెండు రకాల కార్యకలాపాల్లోనూ వ్యక్తిత్వం రూపొందగా, ఆటలు పిల్లల ఆంతరిక ప్రపంచంలోకి తొంగిచూసేందుకూ, పిల్లల సమష్టిలోకి ప్రవేశించి, పిల్లల స్వభావాన్నీ, వాళ్ల పెంపకంలో కీలకాంశాన్నీ అర్థంచేసుకునేందుకూ తోడ్పడతాయి.

పైపై చూపులకి మాత్రమే ఆటలూ, పనీ ఒకదానితో మరొకటి పొసగనివన్నట్లూ, పరస్పరం వ్యతిరేకమైనవైనట్లూ కనిపిస్తాయి. ఆట ఐచ్ఛికం కాగా, పని తరచు విధాయకం. అయితే, ఆట విధాయకమైతే భారప్రాయం కాగలిగినట్లే, స్వచ్ఛందతా, యిచ్ఛాలక్షణాలు లేని పని తరచు పిల్లవాడికి భారప్రాయమవుతుంది. ఆట దాదాపు తోడ్తోనే ఎలాంటి ఇబ్బందులనైనా అధిగమించే ప్రయత్నాన్ని — పనిలో సరిగా యిదే మిక్కిలి అవసరం — ఉత్పన్నం చేస్తుంది. ఆట పైకి మాత్రమే బాదరబందీ లేనిదిగా, తేలికైనదిగా కనిపిస్తుంది. కాని వాస్తవానికి ఆటలో ఆటగాళ్లు తమ గరిష్ఠ శక్తిని, తెలివితేటల్ని, ఓర్మిని ప్రదర్శించవలసి వుంటుంది. కొన్ని సమయాల్లో ఆట విశేష శరీర శ్రమ యిమిడివున్న పనిగా పరిణమించి, ఆ విశేష శ్రమ ద్వారా ఆనందదాయకమైనదవుతుంది. పనికి యిందుకు కొంచెం భిన్నమైన తర్కం వర్తిస్తుంది. పని చేసేటప్పుడు, ఆ పని మనకి యిష్టం వున్నా లేకపోయినా, దాన్ని నిర్వర్తించడంలో విధాయకత వుంటుంది. అయితే తరచు పని క్రమంలో ఉత్పన్నమయే ఆసక్తి, ఆనందాల మూలంగా, యీ "విధాయకత లక్షణం" తొలగిపోతుంది. పనిలో సాఫల్యం పిల్లల్లో ఉత్తేజాన్నీ, ఉదాత్త సంకల్పాలనీ ఉత్పన్నం చేస్తుంది. అంటే, ఆటలకి ఏ స్వచ్ఛందత, ఆసక్తి, విజయ సాధన తమకాలు ఆధార

ప్రాయాలో సరిగా అలాంటి ధోరణులే పని క్రమంలో కూడా అవసరమన్న మాట.

ఈవిధంగా పిల్లల వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దే యీ రెండు ముఖ్య కార్యకలాపాల్లోనూ మనకి ఒకే మాదిరి అంశాలు కనిపిస్తాయి. సరిగా యీ అంశాలు కొరవడితేనే అటు నికరమైన పని గాని, యిటు విద్యాత్మకమైన ఆటలు గాని వుండవు. సృజనాత్మక కృషికి ఆటలో సాంద్రీకృతమైన అంశాలు అత్యవసరం కాగా, ఆటకి కృషి పరిధిలో యిమిడి వున్న అంశాలు అవసరం అవుతాయన్నది ఇక్కడ అత్యంత ఆసక్తికరమైన విషయం. బహుశా పెద్దవాళ్లు యీ విషయాన్ని గమనించినప్పుడే, యీ రెండు క్రమాలనీ జోడించే కృషి ప్రారంభమై వుంటుంది.

పిల్లల అభివృద్ధిలోని పరస్పర విరుద్ధ అంశాలను మరో సారి పరిశీలిద్దాం. పిల్లలు సద్యోజనితంగా ఆటలపట్ల ఆకర్షితులవుతారు. కాని పని విషయంలో అలాంటి అవసరం ఉండదు. కాగా పని అవసరాన్ని పిల్లలచేత గుర్తింపజేయడమే పెద్దవాళ్ల నికరమైన కర్తవ్యం. ఆటలను పనితో జోడించడంలో పెద్దవాళ్లు యెలాంటి పొరపాట్లు చేయవచ్చు? ఈ ప్రశ్నకు మరింత స్పష్టమైన సమాధానం యిచ్చేందుకుగాను, కొన్ని ఆటలను పెంపొందించే క్రమంలో నా స్వానుభవాన్ని సవిమర్శకంగా పరిశీలించేందుకు నేనిక్కడ ప్రయత్నిస్తాను.

ఆటల్లో తల్లీనులైన పిల్లలు ఏ పని బాధ్యతలనైనా సరే తేలిగ్గా నిర్వర్తించగలుగుతారని నేను గ్రహించినప్పుడు, నేనా అనుభవాన్ని వినియోగించుకొని, స్కూలుకి అవసరమైన పనులన్నింటినీ ఆటల్లో యిమడ్చనారంభించాను. దానితో ఆటలు రూపంలోనూ, విషయాంశంలోనూ విస్తృత ప్రమాణాన్ని సంతరించుకోసాగాయి. ప్రతి ఒక్క ఆటా కొన్ని వారాల పాటు కొనసాగేది. టీచర్లతో బాటు మేము అలాంటి ప్రతి ఒక్క ఆటకోసమూ సుదీర్ఘమైన సన్నాహాలు చేసేవాళ్లం. దానికొక పథకం రూపొందించేవాళ్లం. వాటిలో మరింతగా మనస్సులను ఆకట్టుకొనే శిఖర స్థాయి సన్నివేశాలను గుర్తుపెట్టుకునేవాళ్లం. పిల్లల్ని ఏ యాత్రలకి, క్లాసు ఎక్స్‌కర్షన్లకి తీసుకెళ్లవచ్చో నిర్ణయించేవాళ్లం. ఫలితాలను సమీక్షించే పద్ధతులను గురించీ, పిల్లల్ని ప్రోత్సహించే పద్ధతులను గురించీ ఆలోచించేవాళ్లం. నేను పనిచేసిన బోర్డింగు స్కూలుకి 445 యకరాల భూమి వుంది. ఓ పెద్ద కూరగాయల తోట, పూల మడులు, కోళ్ల క్షేత్రం, స్టూడియోలు, వేర్వేరు కార్యకలాపాల బృందాలు వున్నాయి.

దీనికి కావలసిన పని బాధ్యతలన్నింటినీ మేము ఆటలుగా మార్చాము. పిల్లలు లారీ నిండా వున్న ఇటుకల్ని అన్‌లోడ్ చెయ్యడం, కార్ఖానాలు నిర్మించడం, కాబేజి పంట కోసి పోగుచెయ్యడం, పోటీలు, చిత్రకళా ప్రదర్శనలు ఏర్పాటుచెయ్యడం వంటి మిక్కిలి కష్టమైన పని బాధ్యతలకోసం పోటీలు పడేవాళ్లు. నేను అప్పట్లోనే ఆటలను పనితో జోడించడంలోని సానుకూల పార్శ్వంతో బాటు ప్రతికూల పార్శ్వాన్ని కూడా గమనించాను. అయితే

నేను యిలా తర్కించుకున్నాను: పిల్లలు పనిని ఒక విధాయకంగా కాక, ఒక ఆట సరదాలో చేస్తున్నారు, సరే, బాగానే వుంది. కౌమార వయస్కుడు ప్రత్యక్షానుభవం, పని నైపుణ్యాలు సంపాదించుకుంటున్నాడు. పరిసర ప్రపంచాన్ని గుర్తించేందుకు స్వయంగా ఆకర్షితుడవుతున్నాడు. ఇది ముఖ్యాంశం. ఉదాహరణకి, ఆట నిబంధనల మేరకు, కొన్ని చిత్రాలను గియ్యాలి, కొన్ని కవితలు రాయాలి. దానికి ముందు ప్రత్యేకమైన శిక్షణ యివ్వబడింది. కౌమార వయస్కులు చిత్రాలు గీసేందుకూ, గీతాలు రాసేందుకూ సంబంధించిన సాంకేతిక అంశాలను నేర్చుకున్నారు. నేనిలా ఊహించుకుని మొదలుపెట్టాను: పిల్లల్లో ప్రతి ఒక్కరూ, తనకి కవిత్వంలో లేక చిత్రకళలో అసలు సామర్థ్యాలు వున్నాయా, లేవా అనే దానితో ప్రసక్తి లేకుండా, ఏదో ఒక కళలో నిమగ్నం కావాలి. ఇందుకుగాను ప్రతి ఒక్కరూ తన ప్రతిభని పరీక్షించుకోవాలి. అది ప్రయత్నం మాత్రమే, అంతకు మించి మరేమీ కాదు! ఏ ఒక్కరూ ఏ ఒక్కర్నీ ఏ ఒక్కటీ చెయ్యమని బలవంతం చెయ్యరు. అయినా కూడా, వాళ్లలో ప్రతి ఒక్కరూ కవిత రాశారు, చిత్రాలు గీశారు.

దీంట్లో పొరపాట్లు వుండగల అవకాశం వుందా? ఉంటే, వాటిని నివారించడం ఎలా?

మొదటి విషయం, ఆటని పని బాధ్యతలతో నింపెయ్యకూడదు. మరోలా చెప్పాలంటే, ఆటని పిల్లల పని కలాపాల అభివృద్ధికి కేవలం ఒక సాధనంగా మాత్రమే పరిగణించకూడదు. ఆటని ఒక సంకేతారాధనగా, పిల్లల్ని పని కలాపాల్లో నిమగ్నం చేసేందుకు ఒక సాధనంగా మాత్రమే పరిగణిస్తే, మనం ఆ కార్యకలాపాన్ని క్రియాశీలంగా వుండాలన్న ఒక కోర్కెలోకి, అనాలోచిత క్రియాత్మకతలోకి అనివార్యంగా మార్చివేయడం తథ్యం. ఆటలో వున్న ఉద్విగ్నత మూలంగా, అది పిల్లల కళ్లను మిరుమిట్లు గొలిపే మెగ్నీషియం తీగ కాంతిచ్ఛట లాంటిది. మరోలా చెప్పాలంటే, అది ఏమి జరుగుతోందో పరకాయించి చూడవలసిన, తన కార్యకలాపాల పర్యవసానాలను సవిమర్శకంగా విశ్లేషించుకోవలసిన ఆవశ్యకతను పిల్లలకి లేకుండా చేస్తుంది. అంతే కాదు, ఆటల సాయంతో ఆలోచనా శూన్యుడైన క్రియాశీలురను తయారుచేయగలుగుతారు. ఇందుకోసం విజయ సాధనే పరమ లక్ష్యం కావచ్చు.

రెండో విషయం, ఆట ఉత్సాహంమీద ఆధారపడుతుంది. పిల్లల జీవితాల్లోనూ, వాళ్ల పరిసరాల్లోనూ వుండే అనేక సంశ్లిష్ట వైరుధ్యాలపట్ల ఎలాంటి శ్రద్ధా చూపకుండా వుండటాన్ని అది సాధ్యం చేస్తుంది. బోధన శాస్త్ర రంగంలో మనం దేన్ని స్పృశించినా కూడా, ఏదో ఒక విధంగా పరిమితి సూత్రాన్ని చేరుకుంటామని మకారెంకొ ఎంతో సరిగా వక్కాణించి చెప్పాడు. మరి యీ పరిమితి "ఎక్కువ – తక్కువ" సూత్రం మేరకు మధ్య బిందువు ఎంత మాత్రం కాదు. సరికదా అది ఒక సాధనాన్ని మరోదానితో, బహుశా దానికి రూప, విషయాంశాల్లో బద్ధ విరుద్ధమైనది కావడం మరింత సంభావ్యం.

మూడో విషయం, పాత్ర పోషక సమష్టి ఆట పిల్లల్లో అనుకరణ సామర్థ్యాలను పెంపొందిస్తుంది, మరొకరి ఆదర్శాన్ని స్వీకరించేలా ఒత్తిడిచేస్తుంది, ఒకరిని అనుసరించి

కాపీచేసేలా, ఒకరి నమూనాను పునఃసృష్టించేలా చేస్తుంది. ఇది పిల్లల మనస్సుల్లో ఉత్పన్నమైన వక్రీకృత ఆదర్శం అయ్యే అవకాశం వుంది. అలాంటి ఆటల్లో పిల్లలు వహించే పాత్రల నైతిక అంశాలను టీచరు వివరించి చెప్పడం ముఖ్యావసరం. పాత్ర పోషకమైన ఆటను మధ్యమధ్య ఆపి, పాత్రలతో ప్రసక్తి లేని ఆటలను, సమష్టి ఆటలను, వైయక్తికమైన ఆటలను ఆడించడం అవసరమనడం స్పష్టం. పిల్లలు ముమ్మరమైన సమష్టి జీవిత ప్రవంతిలో మునిగి వున్నప్పుడు సైతం, మధ్యమధ్య వాళ్లకి కొంత ఒంటరితనం అవసరం అవుతుంది. ఈ ఒంటరితనం లేనిదే పిల్లలు తమ సామర్థ్యాలను పూర్తి స్థాయికి పెంపొందించుకోలేరు. సర్వసాధారణంగా బలీయమైన మానసికోద్వేగం కలిగినప్పుడు, తమకి సన్నిహితమైన వ్యక్తితో మనస్సు విప్పి మాట్లాడవలసిన అవసరాన్ని కల్పిస్తుంది. కాగా టీచరు అలాంటి "ఏకాంతానికి" అవకాశాలు కల్పించవలసి వుంటుంది.

ఆటల సృజనాత్మకతా పద్ధతిని కూలంకషంగా చేసుకునే క్రమం దానికదే ఆసక్తిదాయకమైనది. టీచర్లు, శిక్షకులు లేక తల్లితండ్రులు తాము స్వయంగా క్రీడా కలాపాల్లో నిమగ్నులై, తామే ఆడనారంభించినప్పుడు వెంటనే ఏర్పడే అభిప్రాయాలకు ఒక పద్ధతిగా ఆటల విద్యాత్మక ప్రాముఖ్యం గురించిన ఎన్ని వర్ణనలైనా సరిదీటు కావు.

నేను అనుసరించిన పద్ధతి యిదీ: నేను నాలో "బాల్య స్థితిని" ఆవాహన చేస్తాను. అంటే, పిల్లలకి సహజసిద్ధమైన బాల్యోచితమైన తేలిక ఆలోచనలను నాలో నేను రేకెత్తించుకుంటాను. నాలోని "వయోజన" సహజమైన వాటన్నింటినీ, నా పరిపాలనాత్మక పాత్రలో యిమిడివున్న వయోజనుల బాహ్య పార్శ్వాలన్నింటిలో అత్యధిక భాగాన్ని పక్కకి నెట్టేస్తాను. అటు తర్వాత, పిల్లల్ని సంబోధించే రూపాలను ఎంపిక చేసుకుంటాను. ఈ సంబోధన రూపాల్లో స్వర ధోరణుల, వివరణ పద్ధతుల, ప్రవర్తన రీతుల ఎంపిక యిమిడి వుంటుంది.

ఆటలో టీచరు ప్రవర్తన పని కార్యకలాపంగా ఆ ఆటలోని అంశాలపైననే పూర్తిగా ఆధారపడి వుంటుందనడం స్పష్టం. పిల్లలకి ఆట ఆసక్తికరంగా వుండటమే కాకుండా, స్వభావ రీత్యా అది బాల్యోచితమైనదిగా కూడా వుండాలి. ఆట బాల్యంలో, కుటుంబంలో ఉత్పన్నమైందన్న విషయం మరచిపోకూడదు. ఆట పెద్దలకీ పిల్లలకీ మధ్య ఆర్ద్ర సంబంధాల వారధి అవుతుంది. ఆట ఉపాధ్యాయుల, తల్లితండ్రుల కృషిని సమైక్యంచేస్తుంది.

స్కూలులోనూ, కుటుంబంలోనూ ఆట పద్ధతి సాంఘిక సాంగత్య రూపాలను సజీవం, ఆసక్తికరం చేయగలిగిన నాడు, సంశ్లిష్ట సాంగత్య క్రమం పిల్లలకి సులభతరం చేయడం సాధ్యమవుతుంది. సరిగా యీ కారణంగానే తల్లితండ్రులు పిల్లల పెంపకంలో ఆటని తమ సహచరిగా చేసుకోవాలి.

పెద్దలకీ పిల్లలకీ మధ్య సాంఘిక సాంగత్యానికి సంబంధించిన ముఖ్యాంశం మరొకటి వుంది. అది విశ్వాసం.

నమ్మకం సాంఘిక సాంగత్యంలో అత్యంత ఆనందదాయకమైన అంశం. పిల్లలతోడి సంబంధాల్లో విశ్వాసం అద్భుతమైన స్వేచ్ఛనూ, ఎంతో శక్తినీ, ధీమానీ ఉత్పన్నం చేస్తుంది. ఆలోచనాపరులైన తల్లితండ్రులూ, ఉపాధ్యాయులూ యీ పరస్పర విశ్వాసాన్ని అపురూపమైనదిగా, అతి విలువైనదిగా పరిగణిస్తారు.

నమ్మకం ఎప్పుడూ రిస్కుతో ముడిపడి వుంటుంది, ఇతరుడి సద్గుణాలకు విజ్ఞప్తి ప్రాయంగా వుంటుంది. "ఒకరిలో నమ్మకం ఉంచడం" ఒక వ్యక్తిలో తొట్టతొలి సారి వ్యక్తిత్వాన్ని జాగృతంచేసి, అతని అంతరంగంలోని క్రూరమైన మానవ ద్వేషాన్ని భగ్నం చేస్తుందనీ, తన "అప్రాముఖ్యాన్నీ," నైతిక "హీనత్వాన్నీ" గట్టిగా గుర్తింపజేస్తుందనీ తత్వవేత్తలు నొక్కిచెప్తున్నారు.

అయితే, అలా "భగ్నంచేయడం" అనేదానికి ఒకరిని విద్యా సంపన్నుని చేయడం అని గాని, అతనిలో కొత్తదేదైనా ప్రవేశపెట్టడమని గాని అర్థం ఎంత మాత్రం కాదు.

పిల్లల సమష్టితో పనిచేసేటప్పుడు వాళ్ల అంచనాలను వినడం, వాళ్లని పరస్పరం ఒకరిపట్ల మరొకరు దయతో, శ్రద్ధతో కూడిన వైఖరిని వహించేలా చూడటం, ఎవరి మటుకు వారు ఎక్కువ బాధ్యతాయుతంగా పనిచేసేలా చూడటం అవసరం. ప్రముఖ సోవియట్ బోధన శాస్త్రజ్ఞుడు ఎస్. షాత్‌స్కీ రూపొందించిన సూత్రానికి టీచర్లు కచ్చితంగా కట్టుబడి వుండటం అవసరం. ఈ సూత్రపు సారాంశం యిలా వుంటుంది: పిల్లలు ఒకరినొకరు వాళ్లని పెద్దవాళ్లు అర్థంచేసుకున్నదాని కంటె బాగా అర్థంచేసుకుంటారు. అందుకని, ఒకరిద్దరు పిల్లలు టీచర్ని అర్థంచేసుకొనేలా చూడాలి. మిగిలినవాళ్లకి అవసరమైన అన్నింటినీ వాళ్లు మరింత తేటతెల్లంగా వివరిస్తారు. స్కూలు విద్యార్థుల సమష్టితో పనిచేసే టీచరు కృషి ప్రధాన కర్తవ్య సారాంశం సరిగ్గా యిదే.

విధ్యుక్తతా భావాన్నీ, బాధ్యస్థతా భావాన్నీ నేర్పడంతో నమ్మకం విడదీయరాని విధంగా ముడివడి వుంది. విధి అంటే యేమిటని సీరియస్‌గా ఆలోచించినప్పుడు, నైతిక బాధ్యతల నుంచి దాన్ని విడదీసి చూడటం సాధ్యం కాదు. జీవితం, పరిస్థితులు, సన్నివేశాలు, ఒక ఉమ్మడి ఆశయం, స్నేహితులు, దృఢ విశ్వాసాలు, నైతిక సూత్రాలు యిలాగ మాత్రమే ప్రవర్తించాలి, మరెలాగూ ప్రవర్తించకూడదు అని నిర్దేశిస్తాయి, శాసిస్తాయి. మనిషి ఆనందం అన్నది విధి ఆవశ్యకతల పరిపూర్తి మానవాత్మ ఉత్తమ పార్శ్వాలను స్పృశించి, సంతోషాన్ని ఉత్పన్నం చేసే ఒక సన్నివేశం అయ్యే అవకాశం వుంది. తనకి తాను విధించుకొనే బాధ్యతలు వ్యక్తి నైతిక స్వభావాన్ని తీర్చిదిద్దే విధులు కాగా, నికరమైన నైతికత వ్యక్తిగత ఆసక్తులకి సాంఘిక ప్రయోజనాలతో ముడివడిన మానవ అవసరాల అనుగుణ్యతా రంగంలో, మనిషికి అత్యధిక ఆనందాన్ని చేకూర్చే ఐచ్ఛిక కృషి రంగంలో మనిషి విధి నిర్వహణలో వుంటుంది.

బాధ్యతల రూపంలో వెల్లడయ్యే నైతికత విధాయకాలు నిర్లక్ష్యం చేయబడినప్పుడు

నీతి రాహిత్యం మొదలవుతుంది. విధులు, అనివార్యంగా అమలుజరపవలసిన నిబంధనలు లేని స్వత్ప్రవర్తన నియమాలు నైతికత లేని స్వత్ప్రవర్తన నియమాలు అవుతాయి. విధ్యుక్తాలన్నవి సాంఘిక జీవితావసరాల ఫలితంగా ఉత్పన్నమవుతాయి, వాస్తవికతచేత నిర్దేశింపబడతాయి.

అందుకే, విధాయకతలతో నమ్మకపు ఎడతెగని సంబంధాన్ని గమనించి, నిరంతరం అనుభూతి చెందే సామర్థ్యం పిల్లల పెంపకపు అతి ముఖ్య పార్శ్వాల్లో ఒకటి.

కాగా, సమష్టి, వ్యక్తుల మనస్తత్వ పరిజ్ఞానం లేనిదే, ఆధునిక పరిస్థితుల్లో పిల్లల పెంపకపు కళని కూలంకషంగా కైవసం చేసుకోవడం దుస్సాధ్యం.

# ప్రకరణం 2

# అనుదిన, అనుక్షణ బోధన శాస్త్రం

## (ప్రభావం బరపే నియమాలు, పద్ధతులు. ప్రాథమిక, మాధ్యమిక స్కూలు వయస్సు)

కచ్చితంగా బోధన శాస్త్ర పద్ధతులకి కేటాయించబడిన యీ ప్రకరణంలో ఎలా వ్యవహరించాలి, ఎలా ప్రభావితం చెయ్యాలి, పిల్లల్ని ఎలా పెంచాలి అనే ప్రశ్నలకి సమాధానాలు యివ్వబడ్డాయి.

పిల్లల పెంపకం విషయంలో ఎవరికైనా బోధించేటప్పుడు బోధన శాస్త్రాన్ని పక్కకి తోసెయ్యాలి అనే విరోధాభాసప్రాయమైన వాక్యం నాకెప్పుడూ జ్ఞాపకం వస్తూ వుంటుంది. ఈ ఉద్ఘాటన బోధన శాస్త్రీయ పాండిత్య ప్రకర్షపట్లా, బోధన శాస్త్రీయ నీతి బోధపట్లా నిరసన ప్రకటన. ఈ నిరసన నాకూ సమ్మతమే. అయితే, అందుకు నాకొక గణనీయమైన మినహాయింపు వుంది: పిల్లల పెంపకాన్ని శాసించే నియమాల పరిజ్ఞానం మాత్రమే పిల్లల వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దడంలో తోడ్పడుతుంది. ఈ జ్ఞానం స్థానాన్ని అనుభవం గాని, వివేకం గాని ఆక్రమించలేదు. అనుభవం, జ్ఞానం, మానవ వివేకం — యీ మూడింటి మేలి కలయిక ప్రతి ఒక్కరికీ అవసరం. ఇది ప్రతి ఒక అధ్యాపకుడికీ బాసట కావచ్చు.

బోధన శాస్త్రానికి సంబంధించిన అనిర్దిష్ట సూత్రాలనుంచి కాక, పిల్లలతో క్రమబద్ధమైన అనుదిన సంబంధంనుంచి ఉత్పన్నమైన అనుదిన "ఆచరణాత్మక" బోధన శాస్త్ర పథకాన్ని వివరించేందుకు నేనిక్కడ ప్రయత్నిస్తాను. నాకూ పాఠకులకీ లేక తమ నిరంతర అన్వేషణ క్రమంలో కుటుంబ సంబంధాల సూక్ష్మ బోధన శాస్త్రాన్ని సృజించే తల్లితండ్రులకీ మధ్య అవగాహనకి యిదొక సంభావ్య పద్ధతిగా నాకు అనిపిస్తోంది.

### ఉదయం

మీరు ఉదయం లేస్తారు, రోజల్లా ఎలా గడపాలా అని ఆదుర్దా చెందుతారు. మీరు చెయ్యవలసిన పనులు మీ మనస్సులో ఒక గొలుసు మాదిరిగా ఏర్పడతాయి: ఉదయం పల

హారం తయారుచెయ్యడం, గిన్నెలు, ప్లేట్లు కడగడం, టేబిలు శుభ్రం చెయ్యడం, సంభాషించడం, ఏయే పనులు చెయ్యాలో జ్ఞాపకం చేసుకోవడం, పనికి సకాలంలో చేరుకోవడం, వగైరా వెయ్యిన్నొక్క చిల్లర మల్లర వివరాలు, ఘర్షణలు, ఆకాంక్షలు. ఈ సవాలక్ష వ్యవహారాల్లో ముఖ్యమైనవాటిలో మీ పిల్లలకి సంబంధించింది ఒకటి. వాళ్లని నిద్ర లేపడం, వాళ్లకి తిండి పెట్టడం, వాళ్ల దుస్తుల సంగతి చూడటం, వాళ్లని స్కూలుకి పంపడం. ఈ పనులేవీ మీ మనస్సుకి పట్టవు. ఇప్పటికి దాదాపు అవి మీకు అలవాటుగా మారిపోయాయి. ఈ అలవాట్ల స్వభావం ఏమిటి? మీ పిల్లలకి ఉదయపు పలహారం తయారీతో ఏమైనా సంబంధం వుందా? బల్ల శుభ్రంచేయడంలో వాళ్లు మీకు సాయం చేస్తారా? వాళ్లు మీకేమైనా జ్ఞాపకం చేస్తారా లేక తామేమైనా మీకు చేసిపెడతానని వాగ్దానం చేస్తారా?



పిల్లలు స్కూలుకి వెళ్లే సమయానికి వాళ్ల మానసిక ధోరణి ఎలా వుంది? వాళ్లు మీ దగ్గర సెలవు తీసుకుని వెళ్లేటప్పుడు వాళ్ల ముఖ కవళికలు ఎలా వున్నాయి? వాళ్లు వెళ్లే ముందు మీరు చెప్పిన మాటలకి వాళ్ల ప్రతిస్పందన ఏమిటి? మీ మటుకు మీరు పనికి వెళ్లేటప్పుడు మీ మనస్సుకి ఎలా వుంటుంది?

ఉదయంపూట ప్రతి ఒక్కరికీ టైము అస్తుబిస్తుగా వుంటుంది. ఉదయపు గంటలు మీలో రూపొందిన బోధన శాస్త్రీయ సాంకేతిక పద్ధతులకు గీటురాయి లాంటివి. ఆ పద్ధతుల పనను పరీక్షకి పెడతాయి. మీ యిచ్ఛనీ, కార్యాచరణ సన్నద్ధతనీ మీ పర్యాలోచనతో ఘర్షణలోకి తెస్తాయి. ఉదయపు గంటల్లో మీ సంబంధాల అనుభవాలు, గౌరవ నిర్లక్ష్యాల అనుభవాలు, ఉదాసీనతోత్సాహాలు, ఆతృత అమిత భయాలు అమల్లోకి వస్తాయి. ఉదయం

మీకు ఉత్సాహమైనా కలిగిస్తుంది, లేక అజ్ఞాతమైన వెగటు అయిష్టాన్ని, బాధాకరమైన ప్రశ్నలను, సన్నని బాధనైనా కలిగిస్తుంది. అప్పటికి మీకు యింకా అనుభూతం కాని యీ బాధ మరి కొంత సేపట్లో మీ అనుభవంలోకి రావచ్చు.

నాకు పరిచితమైన కుటుంబాలన్నింటినీ మూడు తరహాల్లోకి విభజించవచ్చు: మొదటి తరహా కుటుంబాలు పరమ ఆదర్శప్రాయమైనవి. వాటికి ఉదయం సంతోషాన్నీ, ఆనంద మయమైన ఆశల్నీ తెచ్చిపెడుతుంది. రెండో తరహాది సగటు కుటుంబం. దీనికి సాధారణంగా ఉదయం ఆందోళనకరమైనదిగా వుండదు. దీనిలో అన్నీ ఉండవలసిన పద్ధతిలో వుంటాయి. ప్రతి ఒక్కరూ తమ పని తాము చేసుకుంటారు, చూసుకుంటారు. ఇక మూడో తరహా కుటుంబం వుంది. ఇది మహా చిరాకు పుట్టించే కుటుంబం. దాని సభ్యుల తొలి కలయికలు



ప్రత్యక్ష లేక ప్రచ్ఛన్న ప్రతికూల భావంతో నిండి వుంటాయి.

అనుదిన వ్యక్తిగత సంబంధాల సాంకేతిక పద్ధతిలోని సానుకూల, ప్రతికూల అంశా లను పరిశీలించేందుకుగాను యీ మూడు రకాల సంబంధాలనూ మీ ముందు ఉంచేందుకు ప్రయత్నిస్తాను.

ఆదర్శ నమూనా. పరిస్థితి యిలా వుండవచ్చు. మీ పిల్లవాడి సున్నిత స్పర్శకు మీరు నిద్ర లేస్తారు. వాడు యిలా అంటాడు: "అమ్మా, టైమైంది లే. టీ కెటిలూ, ఇస్త్రీ పెట్టే కాలేశాను. పలహారం టేబిలుమీద పెట్టాను. నిన్న రాత్రి మనం అనుకున్నట్లు యీ రోజు నేను పెందరాళే లేచి, క్లాసు పరీక్షకి తయారయ్యాను." అందరూ పలహారం చేస్తూండగా తండ్రి ఆ రోజు ప్రోగ్రాం చెప్తాడు. కొడుకు "అన్నీ సలక్షణంగా జరుగుతా

యిలే, నాన్నా. నా మటుకు నేను పరీక్షకి ఫస్టుగా తయారయ్యాను'' అంటాడు. వాడు బామ్మతో ''వీధిలో జారుడుగా వుంది బామ్మా. నువ్వు యీ రోజు షాపుకి వెళ్లొద్దు. కావలసిన సరుకులన్నీ లిస్టు రాయి. నేను కొని తెచ్చిపెడతాలే'' అంటాడు. తల్లితో ''అమ్మా, నీకు ఆలస్యమవుతుంది. నువ్వెళ్లు, టేబిలు నేను శుభ్రం చేస్తాలే'' అంటాడు.

సగటు నమూనా. అందరి కంటె బామ్మ ముందు లేస్తుంది. ఉదయం పలహారం తయారుచేస్తుంది. తల్లి లేచి, ఇస్త్రీ పెట్టె కాలేసి, కొడుకు పాంటు ఇస్త్రీ చేస్తుంది. తల్లి మొదట తండ్రిని లేపుతుంది. తండ్రి లేచి, ముఖం కడుక్కుంటాడు. ఒంటరిగా పలహారం చేసి, మాటా మంతీ లేకుండా పనికి వెళ్లిపోతాడు. తల్లి ''ఒరే టైమైంది, లేరా'' అంటూ కొడుకుని లేపుతుంది. ''ఉండవే, అప్పుడే యేమిటి'' అంటాడు కొడుకు. అమ్మ బామ్మతో దేన్ని గురించో మాట్లాడుతుంది. వాళ్లిద్దరి మధ్య స్వల్ప అభిప్రాయభేదం పొడచూపుతుంది. ''వాడింక లేవాలి'' అంటుంది బామ్మ. చివరకి ఎలాగైతేనేం కొడుకు లేచి, నీళ్ల గదిలోకి వెళ్తాడు. వాడు మౌనంగా తిండి మింగి, బయటకి వెళ్తాడు. తల్లి వాణ్ణి ముద్దుపెట్టుకునేందుకు ప్రయత్నిస్తుంది, కాని వాడు తప్పించుకుని వెళ్లిపోతాడు.

ప్రతికూల నమూనా (రగడ నమూనా). ఈ నమూనా కుటుంబం సుదీర్ఘమైన ద్వేషం, కోపతాపాలు, దురభిప్రాయాల సుదీర్ఘమైన ఒక గొలుసు లాంటిది. నిద్ర లేచే క్రమం అరగంట సాగుతుంది. కుర్రాడు అమ్మమ్మని ఒక తాపు తంతాడు. ఆమె ఏడుస్తూ వుంటుంది. తల్లి ''ఏయ్ అమ్మా, నువ్వు యింక మూలగడం కట్టిపెడతావా!'' అంటుంది. ఆవిడ చివరకి తన కొడుకు కప్పుకున్న రగ్గు లాగేస్తుంది. కొడుకు ముణగదీసుకుని, మంచంమీద పడుకునే వుంటాడు. తల్లి ''వీడిని చూడండర్రా! ఇంకెంత సేపురా నువ్విలా నిగిడేది?'' అంటూ మండి పడుతుంది. ''నాకు కడుపు నొప్పిగా వుంది'' అంటాడు కొడుకు. ''అబద్ధాలకోరు!'' అని అరుస్తుంది తల్లి. ''నేనేం అబద్ధాలాట్టం లేదు, నువ్వే అబద్ధాలాడుతున్నావ్'' అని జవాబిస్తాడు కుర్రాడు లేచి. వాడు దొడ్లోకి వెళ్తాడు. ''ఎంత సేపురా ఆ బ్రహ్మదేవుడి శంకనార్ధాలు'' అని అరుస్తారు అమ్మమ్మా, అమ్మా. వాడు లోపల్నుంచి ''నాకు కడుపు నొప్పిగా వుంది'' అంటాడు. వాళ్లు ఒకళ్లని విడిచి ఒకళ్లు కుర్రాణ్ణి కేకలేస్తారు.

''నేనేం తినను!'' అంటూ కుర్రాడు పేచీ పెడతాడు. ''నేను మొదటి పాఠానికి వెళ్లను!'' — మరో పేచీ. ''నేను ఈ చొక్కా వేసుకోను!'' — యింకో పేచీ. ''మా క్లాస్ టీచరు యీ రోజు జబ్బుపడింది. నేనీ రోజు జీన్సు వేసుకుంటాను'' అంటూ వాడు రగడ కొనసాగిస్తాడు. ఇల్లు రగులుకొంటుంది, రణగొణ ధ్వనులు తప్ప మరేమీ వినిపించవు. అమ్మమ్మ ''ఓరి దేవుడోయ్, మాకీ పీడ ఎక్కడ దాపురించిందిరో?..'' అంటూ శోకన్నాలు పెడుతుంది. ఆ ''పీడ'' మరో కొత్త ఝంఝూవర్తం కాబోతోందని వాళ్లకి తెలియదు. వాడు

తన స్కార్ఫుని తీసి తల్లి మీదకి విసిరి కొడతాడు, ఇంటి పైకప్పు ఎగిరి పడేలా తలుపు దఢాలున మూసి, విసవిసా మెట్లు దిగుతాడు.

మీ కుటుంబ సంబంధాలు ''ఆదర్శ నమూనా''కి అనుగుణంగా వుంటే, మీరీ పుస్తకం మూసి, పక్కన పెట్టవచ్చు. మీరు దీంట్లో కొత్తగా నేర్చుకునేది ఏమీ వుండదు.

మీ కుటుంబ సంబంధాలు రెండో నమూనా సూత్రాల ప్రకారం వుంటే, మీరీ పుస్తకం చదవడం కొనసాగించండి. మీకు అవసరమైనది మీరు దీన్నుంచి నేర్చుకోవచ్చు.

ఒక వేళ మీ సంబంధాలు రెండో నమూనాకీ మూడో నమూనాకీ మధ్య వుంటే, లేక ''రగడ నమూనాకి'' సమీపంలో వుంటే, రండి కలిసి ఆలోచిద్దాం. మీ పొరపాట్లకి మూలం దేనిలో వుందో వెతికేందుకూ, మీ పెంపకపు కృషిలో లోపాలు యేమిటో గుర్తించేందుకూ ప్రయత్నిద్దాం.

...నిద్రపోతున్న పిల్లవాడికేసి చూడండి. ఎంత అమాయకత్వం, ఎంత ప్రశాంతి కనిపిస్తాయో! మీ బిడ్డ అందగాడు. ఈ అందాన్ని మెచ్చుకునేందుకు ప్రయత్నించండి. నేను చాలా ఏళ్ల పాటు అల్లరి పిల్లల బోర్డింగ్ స్కూళ్లలో పనిచేశాను. తరచు ఉదయం పూట లేచీ లేవగానే నిద్రపోతున్న పిల్లల ముఖాలకేసి చూస్తూండేవాణ్ణి. ఆ ముఖాలు నిజంగానే ఎంతో అందంగా వుండేవి. వాటిలో నైర్మల్యం, దయాభావం తొణికిసలాడుతూ వుండేవి. ఆ ముఖాల్లో ద్వేషం గాని, కోపం గాని కొంచెం కూడా కనిపించేది కాదు. వాళ్ల దుస్తులతో బాటు అన్ని చెడ్డ గుణాలూ పక్కకి విసిరెయ్యబడ్డాయా అనిపించేది. వాళ్ళు కళ్లు విప్పేందుకూ తెలివి తెచ్చుకునేందుకూ మధ్య విరామంలో వాళ్లు తమ ఎప్పటి మామూలు ''దుస్తులు'' తగిలించుకున్నారా అన్నట్లూ, ఆ దుస్తులు వాళ్లలో నాటుకొని వున్న చెడ్డ అలవాట్లు, పొరగుబోతు ప్రవర్తన అనే పడుగుపేకలతో నేయబడ్డాయన్నట్లూ అనిపించేది.

మీరు చెయ్యవలసిందల్లా ఏమిటంటే, జీవిత క్రమంలో మీ బిడ్డ సంతరించుకున్న పాడు, చెడు అలవాట్లన్నింటినీ మీ బిడ్డలోని అందమైనదానంతనుంచి వేరుజెయ్యడం అందరిలో వున్నట్లే వాడిలోనూ అంతర్గర్భితంగా సంభావ్య సల్లక్షణాలున్నాయి. చెడ్డ ప్రవర్తన అనే ''బిగుతు దుస్తులు'' పూర్తిగా తొలగింపబడేందుకు అనువైన పరిస్థితులను కల్పించడమే ఎవరైనా చెయ్యవలసిందల్లా. వాటిని బలవంతంగా ఒలిచెయ్యకూడదు, పిల్లవాడే తనకి తాను వాటిని విసర్జించాలి.

సకాలంలో లేవాలని కోరుకోకపోయేందుకు ఉండగల కారణాలను గురించి కొంచెం ఆలోచించండి. మొదటి కారణం శారీరకమైనది కావచ్చు: కుర్రాడికి సరిగా నిద్రపట్టి వుండకపోవచ్చు. వాడు ఆలస్యంగా నిద్రపోయి వుండవచ్చు. లేకపోతే పక్క ఎక్కేందుకు ముందు శరీరానికి ప్రేరణ కలిగించేది ఏదైనా తినడం మూలంగా, ఏదైనా ఆసక్తికరమైన పుస్తకం చదువుతూ వుండటం మూలంగా, లేక తగినంతగా తాజా గాలిలో తిరగకపోవడం మూలంగా బాగా పొద్దుపోయేదాకా వాడికి నిద్రపట్టి వుండకపోవచ్చు, ప్రాణ వాయువు లోపం

వల్ల నిద్ర భంగం కావచ్చు, నరాలు ఉద్రిక్తం కావచ్చు, లేక యితర అస్వస్థతలు కలగవచ్చు. శారీరక కారణాలను తక్కువ అంచనా వెయ్యడం నైతిక అఘాతాలకు దారితియ్యవచ్చు. అందుచేత, పిల్లల పెంపకానికి సంబంధించిన నైతిక పార్శ్వంతో మీరు ప్రారంభించాలని అనుకుంటే, బిడ్డ శారీరక అభివృద్ధిని మరచిపోకండి.

రెండవ కారణం మానసికమైనది: పిల్లవాడికి తన ఎదుట వున్న రోజు ఏమాత్రం ఆశాజనకంగా వుండదు. ఆదుర్దాలు, రకరకాల ఘర్షణలు, చివాట్లు, వాడి గుండెమీద పెనుబండలా పూర్తిచెయ్యని విధుల భారం మాత్రమే వాడికి కనిపిస్తూ వుంటాయి. స్కూల్లో వాడికి ఎదురయ్యేది అప్రియమైన అనుభవం మాత్రమే. పాఠాలు రాకపోవడం, ప్రశ్నలకి నంగినంగి జవాబులు చెప్పడం, క్లాస్‌మేట్ల వెక్కిరింతలు, తనలో వెగటు భావాలు. రోజూ యిదే తంతు! మీ పిల్లవాడిపట్ల జాలి చూపండి. ఈ భారమైన అప్రియ భావాల పద్మ వ్యూహంనుంచి బయటపడేందుకు వాడికి సాయంచెయ్యండి. వాడి పెడసరితనానికీ, కంగారుకీ, బెదురుకీ పెంపకంలో అశ్రద్ధ కారణమనీ, వాడి వ్యవహారాలపట్లా, వాడి మంచిపట్లా మీ ఉదాసీనతే కారణమనీ మీరు గుర్తుంచుకోండి. పైన నేను పేర్కొన్న రెండు కారణాలనూ మీరు తొలగించకపోతే, మీరు ఎంత కఠినంగా వున్నా, మీ పిల్లవాడి వ్యక్తిత్వాన్ని మీరు తీర్చిదిద్దలేరు. పిల్లవాడు చెయ్యలేనిదాన్ని చెయ్యమని బలవంత పెట్టి ప్రయోజనం లేదు. మీ ప్రతి గద్దింపూ పరిస్థితిని మరింత దిగజారుస్తుంది. పిల్లలకి నిద్ర లేవాలని వుండదు. బతుకు సజీవ నరకంగా పరిణమిస్తుంది. ఒకసారి ఊహించుకోండి: నిర్లక్ష్యం చేయబడిన పిల్లలందరి పరిస్థితీ సరిగ్గా యిలాగే వుంటుంది.

ఈ పరిస్థితిలో మీ అబ్బాయిపట్ల లేక మీ అమ్మాయిపట్ల కేవలం జాలి ప్రదర్శిస్తేనే సరిపోదు, వాళ్లని బుజ్జగిస్తేనే సరిపోదు. మీరు వాళ్లకి సాయపడాలి. ఇలాంటి సందర్భంలో ఆపేక్ష, జాలి చూపడం అరవడం, కాఠిన్యం కంటె తక్కువ వినాశకరం కాదు. ఎందుకంటే, "జాలి" వాళ్ల నిస్సహాయతా భావాన్ని మాత్రమే బలపరుస్తుంది. పిల్లలు తమ ఇబ్బందులకి కారణాలను యింకా గుర్తించగల స్థితిలో లేరు. కాని వాళ్ల సహజేంగితం బట్టి, సాను భూతి ఒక్కదాని వల్లనే తమకి ఒరిగేదేమీ లేదని అప్పటికే వాళ్లకి తెలుసు. అందుకు సానుభూతి వాళ్లకి తరచు ఆందోళన కలిగిస్తుంది. సరిగ్గా అందుకే చాలా మంది పిల్లలకి తాము గోము చెయ్యబడటమంటే చిరాకు. ఉదారవాద బోధన శాస్త్ర పద్ధతులను వాళ్లు వ్యతిరేకిస్తారు. సానుభూతీ, జాలీ బాధకి ఉపశమనం కలిగించి, తాత్కాలికంగా మాత్రమే వైరుధ్యాలను కప్పిపుచ్చుతాయి, అంతే గాని వాటిని అవి పరిష్కరించవు.

పిల్లల మనస్సును ఉత్సాహపరచడం, వాళ్లు జీవితానందాన్ని అనుభూతం చేసు కోవడాన్ని సాధ్యంచెయ్యడం అంటే, పిల్లల వ్యక్తిత్వపు ఏ పార్శ్వాలు వాళ్ల అన్యధాకరణను అధి గమించేందుకు తోడ్పడతాయో ఆ పార్శ్వాలను స్పృశించడం అన్న మాట. పిల్లలు స్వయంగా, తమ శక్తియుక్తులమీద ఆధారపడి, స్వీయ పునరుజ్జీవనాన్ని సాధించుకోనినాడు, ఏ బాహ్య

మార్పులూ సమూల పరివర్తనను సాధించలేవు. మరింత కచ్చితంగా చెప్పాలంటే, బాహ్య మార్పులకు పిల్లల స్వయం కృషి జోడైనప్పుడు మాత్రమే పిల్లల పెంపకంలో వాంఛిత ఫలితం లభించవచ్చు. ఈ మానసిక పరివర్తనల సంశ్లిష్ట యంత్రాంగాలను పరిశీలిద్దాం.

ఈవిధంగా "రగడ" ఉదయపు నమూనానుంచి ఆదర్శ నమూనాకి పరివర్తనే మన ముందున్న పరిమిత లక్ష్యం. నేనిక్కడ ప్రతిపాదించబోయే ఇరవై ప్రత్యామ్నాయాల్లో మీ పిల్లలకి, వాళ్ల వయస్సుకి, వ్యక్తిగత లక్షణాలకి సరిపోయేవాటిని మీరు ఎంచుకోవచ్చు.

పిల్లల పెంపకం ఎప్పుడూ నమూనాలు, సాధనాలు, పద్ధతుల ఎంపికతో ముడిపడి వుంటుంది. ఆయా నిర్దిష్ట పరిస్థితుల్లో ఎంపిక అవకాశాన్ని వక్కాణించేందుకుగాను నేనిక్కడ "సన్నివేశం" అనే పదం వాడుతున్నాను.

## మొదటి సన్నివేశం. సంతోషజనక పద్ధతులు

ఉదయం తను చిరకాలంగా నిరీక్షిస్తున్న, ఆహ్లాదకర విషయం తనకి సంభవించబోతోందని తెలిసి కూడా హుషారుగా నిద్ర లేవకుండా వుండే పిల్లలు ప్రపంచంలో ఎవరూ వుండరు. ఉదయంపూట సంతోషదాయకమైన విషయాలు ముందు ఉంటే పిల్లలు ఎంతటి మహోత్సాహంతో ఉక్కిరిబిక్కిరవుతూ వుండేవాళ్లో చూసినప్పుడు నాకు విభ్రాంతి కలిగేది. వాళ్ల ముఖాలు నిరీక్షణతో, ఉత్తేజంతో వెలిగిపోతూండేవి. అలాంటి భావాలతో ఎవళ్ల ముఖాలైనా ఎంతో అందంగా వుంటాయి. ఈ ఆనందానికి సంబంధించిన బోధన శాస్త్రీయ సారం అతి సామాన్యమైన రోజువారీ పనులతో ముడిపడి వుంటాయి (యీ పనుల జాబితా నేనిక్కడ ప్రత్యేకించి పేర్కొంటాను): ఆస్పాల్టు బాటలను వేడి నీళ్లతో కడగడం (హాలండులో ఆస్పాల్టు బాటలను సబ్బు నీళ్లతో కడుగుతారట!), టీచర్లు వచ్చేలోపుగా గది సక్రమంగా సర్దడం (టీచర్లు చూసి విభ్రాంతి చెంది, "ఏమిటిదంతా! బలేగా వుందే, యిక్కడ?" అనే లాగ), తమ దుస్తుల్ని సాధ్యమైనంత పరిశుభ్రంగా ఉంచుకోవడం, తమ హోమ్‌వర్కు చెయ్యడం ("మేము ఏదైనా సరే చేసిపారెయ్యగలం" అని తమలో తాము అనుకోగలిగేందుకు), పాఠాలు మొదలయ్యేలోగా తమ నేస్తాలకి ఏదో విధంగా సాయంచెయ్యడం, గ్రామసీమకి ఏ వినోద యాత్రనో ఏర్పాటుచెయ్యడం, చేపల వేట, వగైరాలను ఏర్పాట్లు చెయ్యడం.

దీనికి పూర్వావసరమల్లా, కర్తవ్యం వ్యక్తి అందుబాటులో వుండి, సాధింపబడటం ఒక్కటే. అంతే కాదు, సంతోషానికి మూలం దానికి అదిగా పనిలో కాక, ఆ పని క్రమంలో ఇతరులతో సాంగత్యంలో వుంటుందన్న విషయం నేను గమనించాను. ఉదాహరణకు, ఒక కుర్రాడు తనకి ఇష్టుడైన ఏ పెద్దవాడైనా చెయ్యమన్న ఏ పనైనా సరే చేసేందుకు సిద్ధంగా వుంటాడు. ఒక్కొక్కప్పుడు సంతోషానికి మూలం కర్తవ్య నిర్వహణ పద్ధతిలో వుంటుంది. ఒక ఆట లేక పోటీ యిందుకు ఉదాహరణ.

ఒక్కొక్కప్పుడు యీ సంతోషం ఏదైనా ఒక పనిలో వెనక పొందిన పరాజయానికి

పరిహారంగా కనిపించవచ్చు. తన చదువులో వెనకపడి వుండి, బాగా రాణించలేకపోయిన పిల్లల ఉదాహరణ తీసుకుందాం. వాళ్ళు పనిలోనో, రకరకాల శరీర వ్యాయామాల్లోనో తమ తాహతు చూపగలుగుతారు. కాగా తమ అత్యుత్తమ సామర్థ్యాలను ప్రదర్శించే యీ అవకాశం వాళ్లకి అత్యధిక ఆనందాన్ని చేకూరుస్తుంది.

ఇష్టమైన ఏదో ఒక పని లేని పిల్లలు ప్రపంచంలో ఎక్కడా వుండరు. తాము స్వయంగా చేసిన పని చూసుకొని సంబరపడి, మహా సంతోషం, పొందే సరిగా యీ అద్భుతమైన గుణంలోనే మీ పిల్లల సంతోషం యిమిడి వుంటుంది. వాళ్ల యీ గుణాన్ని ఉపయోగించు కోండి! వాళ్లని ఆ ఆనందంకోసం లేక సంతోషంకోసం ఎదురుతెన్నులు చూడనివ్వండి. వాళ్లని అందుకు మరుసటి రోజుకోసం, మరుసటి ఉదయంకోసం నిరీక్షించనివ్వండి. వాళ్ళు తమంతట తాము నిద్రలేవనివ్వండి, ఎవరూ పోరకుండా కాలకృత్యాలు తీర్చుకోనివ్వండి. వాళ్ళు తమంతట తాము ఫలహారం తీసుకుంటారు. బహుశా వాళ్ళు జీవితంలో మొట్ట మొదటి సారి టేబిలు శుభ్రంచెయ్యడం కూడా సంభవించవచ్చు. పాఠం బాగా నేర్చుకోవడం, కొత్త స్కీలు, తమ స్నేహితులతో కాలక్షేపం చేయడం, తమ తండ్రితో షికారు, తాము చక్కగా పెంచిన పూలమడి, యింకా యిలాంటివే అనేక యితర విషయాలు అలాంటి ఆనందానికి కారణం కావచ్చు...

## రెండో సన్నివేశం. తీవ్రమైన మార్పులు ఆశించకండి

పిల్లల పెంపకం విషయంలో అతి శ్రద్ధ చూపడం అసలు శ్రద్ధ చూపకపోవడమంత ప్రమాదం, మీ పిల్లవాడిమీద అత్యంత భారమైన కార్యక్రమాన్ని మోపడం ప్రమాదకరం కావచ్చు. సంవత్సరాల క్రమంలో ఏర్పడిన అలవాట్లను క్రమంగా వదిలించాలి. పిల్లలు ఉదయంపూట అయిదు సార్లకి బదులు మూడు సార్లే పేచీలు పెడితే అది అప్పటికే ఒక విజయమన్నట్లూ, పిల్లలు తమమీద తాము గొప్ప విజయం సాధించినట్లూ పరిగణించాలి. మీరు రూపొందించిన పథకానికి కచ్చితంగా అంటిపెట్టుకొని వుండటం ముఖ్యం. పిల్లలు ఎంత స్వల్పకాలమైనా సరే సంతోష భావం మనసులో నిలుపుకోవడం కూడా ముఖ్యం. మీకు ఓర్పు లేకపోతే, మిగిలిన రెండు వాదనల్లోనూ కోపం ప్రదర్శిస్తే, నేనింతకు ముందు పేర్కొన్న ఆదర్శ నమూనాను మీకు సన్నిహితం చేసే సద్భావమంతనీ మీరు నాశనం చేసిన వాళ్లవుతారు.

## మూడవ సన్నివేశం. ప్రోత్సాహ పద్ధతులు

సంతోషం అన్నదొక సాంఘిక గుణం. పిల్లలు ఒంటరిగా ఉన్నప్పుడు సైతం సంతోషంగా వుండటం సాధ్యమే అనుకోండి. అయితే సర్వ సాధారణంగా పిల్లలు తమ సంతోషాన్ని యితరులకు పంచిపెడతారు. పిల్లలు సంతోషాన్ని లేక విజయాన్ని గమనించడం ముఖ్యం.

పిల్లలు తమ సంతోషాన్ని తమ తల్లితండ్రులతోనో లేక నేస్తాలతోనో పంచుకున్నప్పుడు మాత్రమే ప్రయోజనం వుంటుంది. సంతోషంలో అలా పాలుపంచుకోవడం పరస్పర విశ్వాసాన్నీ, సౌలభ్యాన్నీ కల్పించి, కుటుంబంలో ఆరోగ్యకరమైన వాతావరణాన్ని సృష్టిస్తుంది. మీ పిల్లలు సకాలంలో నిద్ర లేచి, తొలి ఆదర్శ నమూనా పద్ధతిలోని కొన్ని అవసర కార్యాలు నిర్వర్తిస్తే వాళ్ళని మెచ్చుకోవడంలో మీరు పితలాటకం చూపించకండి. అప్పుడు మీరు "అరే, ఎవరూ లేపకుండా మీ అంతట మీరే లేచిపోయి, మీ పనులన్నీ మీరే చేసేసుకోగలి గారే!" అనాలి. కుటుంబంలోని మరో సభ్యుడు "అరే, మీరు యింతటి వాళ్ళని నేను అనుకో లేదు సుమా..." అంటూ వంత పాడాలి.

పిల్లల చదువుల్లో వాళ్ల స్థాయిని పెంచాలని మీరు అనుకున్నప్పుడు, వాళ్లకి పాఠం నేర్చుకోవడంలో చాలా సేపు మీరు తోడ్పడినప్పుడు మీరు విధిగా టీచరుతో యీ విషయం చెప్పాలి. అప్పుడు టీచరు కొంచెం యించుమించు యీకింది మాటల్లో, అంటే దాదాపు "బాగుంది, నువ్వు నీ పాఠాలు బాగా నేర్చుకోగలవన్న మాట" అంటాడు. వాళ్ల తరగతి వాళ్ళ యిలాంటి పరిస్థితిలో సాధారణంగా వాళ్లపట్ల దయనీ, ఔదార్యాన్నీ ప్రదర్శిస్తారు. పిల్లలకి యీ దయ వాళ్ల చూపుల్లో, వ్యాఖ్యల్లో, బహుశా వాళ్ళ సాయిలా పాయిలాగా "నువ్వు సిసింద్రీవిరా!" అనే ఔదలలోనూ అనుభూతమవుతుంది. అప్పుడు పిల్లవాడి మనస్సు సంతోషంతో నిండుతుంది. అది మీకూ, వాడికీ కూడా మహా విజయం అవుతుంది. ఒకప్పుడు బాగా "వెనకబడి వుండి," సంబంధాలు అప్పటికే బెడిసిన సందర్భాల్లో, అలాంటి పిల్లల సమాధానాన్ని టీచరుచేత గుర్తింపచేయడం కొన్ని సమయాల్లో కష్టం, అలాంటి టీచరుని సానుభూతితో అర్థంచేసుకునేందుకు ప్రయత్నించాలి. తనని "ప్రాణం విసిగింప జేసిన" మీ పిల్లలపట్ల ఉపాధ్యాయుడు ప్రతికూల అభిప్రాయం ఏర్పరచుకొని వుంటే, అప్పుడు ఆ ఉపాధ్యాయుడు తన మనస్సు మార్చుకునేలా చెయ్యడం అంత తేలిక పనేమీ కాదు. అందుకని, ఆయన్ని బలవంతపెట్టకండి. అలాగని, మీ సంకల్పాలూ మార్చుకోకండి.

## నాలుగో సన్నివేశం. మీ పిల్లల్ని ప్రయోగాలకి పనికొచ్చే జంతువుని చెయ్యబోకండి

ఈకింది విషయాన్ని అనుసరించేందుకూ, అర్థంచేసుకునేందుకూ ప్రయత్నించండి: మీ పిల్లల్ని పెంచే ఏ పద్ధతి అయినా లేక మార్గమైనా మీ సహజ ప్రేరణగా వాళ్లకి కనిపించాలి. పిల్లలు పెంచబడరు, వాళ్ళ తమ సొంత జీవితం జీవిస్తారు. తమ వ్యక్తిత్వాన్ని తాము కల్పించుకోవడం వాళ్లకి యిష్టంగా వుంటుంది. అంతే గాని, మీ లక్ష్యాల సాధనకు — అవెంత అద్భుతమైనవైనా కూడా — ఒక సాధనం అవడం వాళ్లకి యిష్టం వుండదు. మరొకరి లక్ష్యాల సాధనకు ఒక సాధనం అవడం ఎవరికీ యిష్టం వుండదు. ఒకవేళ మీ పిల్లలు మీ చర్యల వెనక వున్న సంకల్పాలను కనిపెట్టితే, మీరు స్పష్టంగా వాళ్లకి యిలా

చెప్పండి: "ఔను నిజమే. మీరు మీ జీవితంలో మరింత సంతోషానందాలు పొందాలని నా కోరిక. ఏం, మీకు అది యిష్టం లేదా? చివాట్లు తినడమే మీకు నిజంగా యిష్టమా?.."

## ఐదవ సన్నివేశం. పని, సరదాల ఐక్యతా సూత్రం

సరదా అన్నది విద్యలో విభిన్న పాత్రలు వహించవచ్చు. అది ఉపయోగకరమైనది కావచ్చు, హానిదాయకం కావచ్చు. అనారోగ్యకరమూ, స్వార్థపూరితమూ అయిన ధోరణులు ప్రబలేందుకూ, అధికతర కోర్కెలకూ దారితీసినప్పుడు అది హానిదాయకం అవుతుంది. ఆనందం శారీరక లేక మానసిక శ్రమనుంచి ఉత్పన్నమైనప్పుడు అది ఉపయోగకరమైనదవుతుంది. నైతిక విద్యకు దారితీసే పని, ఆనందాల ఐక్యత — విద్యా బోధన శాస్త్రం సాధించ ప్రయత్నిస్తున్నవాటిలో యిది కూడా ఒకటి. పిల్లలు సంపూర్ణమైన బతుకు బతుకుతున్నారని ఎవరైనా అన్నప్పుడు, ఆనందానికి అసలైన అర్థం యేమిటో వాళ్లకి తెలుసుననీ, పని ద్వారా లభ్యమయ్యే నికరమైన సంతోష క్షణాలను వాళ్లు అనుభూతి చెందుతున్నారనీ అతను వక్కాణించి చెప్తున్నాడన్న మాట. పిల్లలు చాలా కష్టపడి చదువుతారనీ, కాని పూర్తిగా అలసిపోయినట్లు కనిపిస్తారనీ, వాళ్లు ఎప్పుడూ హుషారుగా, సంతోషంగా కనిపించరనీ ఎవరైనా అన్నప్పుడు, ఆ పిల్లల శిక్షణా, పెంపకం అన్యార్ధమూ, పాండిత్య ప్రకర్షకమూ అయిన పద్ధతిలో సాగుతున్నాయనీ, ఆ పిల్లల్లో సచేతనమైన ప్రతీదీ మలిపివేయబడిందనీ అతను నొక్కిచెప్తున్నాడన్న మాట.

అత్యంత కష్టభూయిష్టమూ లేక క్లేశపూరితమూ అయినవాటితో సహా అన్ని కార్యకలాపాల్లోనూ ప్రసరించవలసిన జీవసారం ఆనందం. అయితే, సక్రమంగా వినియోగించబడనప్పుడు యీ జీవసారం విషంగా మారవచ్చు. శుద్ధ అతి కాంక్షా స్వభావం కలిగిన సంతోషం, దాని పరితృప్తికి మాత్రమే కాక, మనిషి వ్యక్తిత్వాన్ని సైతం వక్రీకరిస్తుంది.

రెండు ఆనందాలను ఒకదాని సరసన మరొకదాన్ని నిలిపినప్పుడు, అవి అతి కాంక్షా ధోరణులను పెంపొందిస్తాయి. "పని — ఆనందం — పని" యిదీ వ్యక్తిని తీర్చిదిద్దే క్రమంలో విజయానికి నడిపే సూత్రం. దీన్ని వెనకముందులు చేసి, మన సూత్రంలో పని స్థానంలో ఆనందాన్ని పెట్టడం బోధన శాస్త్రీయ ఆనందో బ్రహ్మ వాదానికి, అతి కాంక్షతో కూడిన మనస్తత్వానికి దారి తీస్తుంది.

"రచయితగారు భ్రమపడుతున్నారేమో? పిల్లవాడు ముందు తన గదిని శుభ్రం చేసుకోవడం ద్వారా, తర్వాత తన పాఠాలు చదువుకోవడం ద్వారా, అటు తర్వాత ఆసక్తికరమైన పుస్తకం చదవడం ద్వారా ఆనందం పొందితే దోషం యేమిటి? ఇక్కడ పొందే ఆనందాలు మూడూ వరుసలో వున్నాయి కదా?" అని పాఠకుడు ప్రశ్నించవచ్చు... నేను యిలాంటి పాఠకుడికి మీరు చెప్పిందంతా నిజమే అని జవాబిస్తాను. ఇక్కడ వున్న మూడు ఆనందాలూ అతి కాంక్షమీద గాక, పనుల ప్రాతిపదికమీద ఉత్పన్నమైనవి. పనుల ద్వారా

సాధింపబడిన ఆనందం అవసరాలను కల్పిస్తుంది. అలారం గడియారం పెట్టుకొని లేవడంలో పిల్లలు ఆనందం పొందితే (యిది వాళ్ళ యిష్టపూర్వకంగా చేసిన పని), మనం యీ ఆనందాన్ని యింతకు ముందు చేయని మరో పనికి, అంటే తమకి తాము స్నానం చెయ్యడం, దుస్తులు వేసుకోవడం, శుభ్రంచేయడం, వగైరాలకి ముడిపెట్టాలి. మన యీ పథకంలో పిల్లలు ఒక పాఠం నేర్చుకుని, స్కూల్లో ప్రశ్నలకి బాగా సమాధానం చెప్పడం ద్వారా ఆనందం పొందితే, యీ ఆనందాన్ని యితర పాఠాలు నేర్చుకునే సన్నాహ క్రమంలో మొదటి లింకు అయ్యేలా చూడండి.

## ఆరవ సన్నివేశం. స్వల్ప విషయాలను నిర్లక్ష్యం చేయకండి!

"పిల్లల పెంపకంలో స్వల్ప విషయాలు లేవు" అనే సూత్రం ప్రాముఖ్యంలో మిగతా బోధన శాస్త్రీయ సూత్రాల్లో ఏ ఒక్కదానికీ తీసిపోదు. పెద్దవాళ్ళకి స్వల్పాంశంగా కనిపించేది పిల్లలకి ముఖ్యమైనదీ, అవశ్యకమైనదీ కావచ్చు. చిన్న పిల్లల విషయంలో బూట్లకి తాళ్ళు కట్టుకోవడం ఎలాగో నేర్చుకోవడం అన్నది పెద్దవాళ్ల విషయంలో విదేశీ భాషలు నేర్చుకోవడం కంటె తక్కువ ప్రాముఖ్యం కలిగిన విషయమేమీ కాదు. "ఇంత చిన్న పని కూడా నీకు చేత కాదే?" అంటూ పిల్లల్ని కోపంగా అడిగేదాని కంటె మిక్కిలి భరింపరానిదీ, బోధన శాస్త్ర విరుద్ధమైనదీ అయిన ప్రశ్న మరొకటి వుండదు. మీ రోజువారీ సాంగత్యాల క్రమం యావత్తూ తరచు స్వల్ప విషయాల్లో వుంటుంది. మీ పిల్లలు తమ చెవులు కడుక్కొని శుభ్రం చేసుకోవాలని కోరుకుంటే, మీరు వాళ్ల తలలను నీళ్ల తొట్టెలో ముంచవలసిన అవసరం లేదు. దీని వల్ల మీరు సాధించగలిగేది తమకి తాము కడుక్కొని శుభ్రం చేసుకోవాలన్న వాంఛను చాలా కాలం పాటు వాళ్లలోంచి తరిమెయ్యడం మాత్రమే. కాని మీ పిల్లలు తడి చేత్తో తమ చెవుల్ని కడుక్కున్న మొట్టమొదటి సారే మీరు విధిగా వాళ్లతో "చన్నీళ్లన్నా మీకు భయం లేనట్లుందే. మీ చెవులు చన్నీళ్లతో కడుక్కోవడం యిదే మొదటి సారా?" అనడం మరచిపోకండి.

విషయాలనీ, సంఘటనల్నీ పిల్లల దృష్టితో చూసేందుకు ప్రయత్నించండి. బాల విద్యార్థి దృష్టిలో మామూలు దుప్పటి పెద్దవాళ్ల దృష్టిలో ఓ పెద్ద బెంటు గడ్డ అంత పెద్దది. అందుకని పిల్లలు చెయ్యవలసిన పనిని కొన్ని భాగాలుగా విభజించండి. వాళ్ళు ఒకదాని తర్వాత మరొకటిగా వాటిని చెయ్యనివ్వండి. ఒకవేళ అన్నీ ఏక బిగిన చేస్తామని ముందుకు వస్తే అలా చెయ్యనివ్వండి. అలా వాళ్లు ముందుకు రాకపోతే తగిన తరుణందాకా వేచి వుండండి. చెయ్యమని పట్టు పట్టకండి. పిల్లలకి రోజువారీ పనులు చెయ్యడం స్వల్ప విషయాలతో బాటు నేర్పండి. వాళ్ళు అన్ని పనులూ ఒకే సారి చేసెయ్యనక్కర్లేదు. అయితే, యీ తాత్సార క్రమం ఎందుకు? వాళ్లచేత బలవంతాన చేయించవచ్చు కదా?

పైన పేర్కొన్న "రగడ నమూనా"లను బట్టి చూస్తే పిల్లలచేత బలవంతాన

చేయించడం ఏమంత సులభం కాదు. అలాంటి బలవంతపు వైఖరి ఎంతవరకు సత్ఫలితం యిస్తుందన్నది అనుమానాస్పదం. అడపాదడపా బలవంతం అనుమతించ దగ్గదే. కాని క్రమబద్ధంగా బలవంతం చేయడం అనివార్యంగా దుష్ఫలితాలకు దారితీసితీరుతుంది.

ఏడవ సన్నివేశం. అవసరాలకి ప్రేరణ

ఏదైనా ఒక పని పూర్తిచేసినప్పుడు పిల్లలకి కలిగే ఆనందం, సరదా, సంతోషాలు, వాళ్ల చుట్టూ వున్నవాళ్ల ప్రశంసలు, పిల్లల స్వీయ అంచనా ప్రయోజనకరమైన అవసరాలు ఉత్పన్నమయ్యేందుకు ప్రాతిపదికను కల్పిస్తాయి. పిల్లల విషయంలో పనిచేయవలసిన అవసరం సజీవం కావాలంటే, రకరకాల సరదాలతో బాటు ఆయా పనులను తరచు చేయవలసివుంటుంది. అసలు సంగతేమిటంటే, వాటికవిగా యీ అవసరాలను పిల్లలు గ్రహించరు. అవి వాళ్ల అలవాట్లలో, ఉద్రేకాలలో, చోదక ప్రేరణల్లో ఒక భాగం. పిల్లలు ఏదో ఒకదానిపట్ల ఆకర్షితులవుతారు. పని చేయవలసిన అవసరం ఎప్పుడూ వివిధ వ్యక్తిగత ఆసక్తులతో ముడిపడి వుంటుంది. ఏదైనా నిర్మించాలన్న అవసరం: ఒక రేడియో సెట్టు కూర్పులో పిల్లలు గంటలు తరబడి పనిచెయ్యగలరు. చదువు అవసరం: పిల్లలు వారాల తరబడి చదవగలరు. చదువులో సాఫల్యం పొందవలసిన అవసరం పిల్లల వ్యక్తిత్వ ప్రతిష్ఠతో విధిగా ముడిపడి వుంటుంది. పిల్లల్ని తీర్చిదిద్దే ఏ అవసరమైనా కూడా యితరులతో సాంగత్యం పెట్టుకోవలసిన అవసరంతో పరోక్షంగానో లేక ప్రత్యక్షంగానో ముడిపడి వుంటుంది. ఇతరులతో సాంగత్యం కలిగివుండటంతో పనిచేయవలసిన అవసరానికి గల సంబంధమే దరహాంమీద పిల్లల పెంపకానికి ప్రాతిపదిక.

మీ పిల్లలు స్కూల్లో బాగా చదువుతూ, ఇంటి దగ్గర ఏమీ పనిచెయ్యరని అనుకోండి. అంటే వాళ్లలో ఆకాంక్ష, బాధ్యతా భావం, తనీగా తమకోసమే పనిచేసుకోవడం పెంపొందాయన్న మాట. అంతే కాదు, వాళ్లలో నిస్వార్థ గుణాలు కొరవడ్డాయన్న మాట. తల్లి యింటి పనులు చేసుకుంటూ వుండగా, కూతురు తల్లికి ఎన్నడూ సాయంచేయకుండా వుంటే, అప్పుడా పిల్లని దయామయురాలని అనేందుకు ఎంతమాత్రం వీల్లేదు.

నాకొక అమ్మాయి తెలుసు. ఆమెకి యింట్లో ఎవరైనా జబ్బుపడితే — అది తల్లో, బామ్మో లేక తండ్రో అయినా సరే — పరమ చిరాకు. అలా ఎవరైనా జబ్బు పడ్డప్పుడల్లా ఇంటికి ఆమె పెందారాళే వచ్చేది కాదు. ఎవరికైనా సాయం చెయ్యడమంటే, ఆమె దృష్టిలో "బోరు." అలా కాలం వృథా చేయడం ఆమెకి నచ్చేది కాదు. ఆ అమ్మాయి నాలుగో గ్రేడ్‌లో వుంది. హోమ్‌వర్కు శ్రద్ధగా చేసేది. అది ఆమె ప్రతిష్ఠని పెంపొందించేందుకు దోహదం చేసింది.

ఇంటి దగ్గర వివిధ బాధ్యతలు నిర్వహించవలసిన అవసరం తన కుటుంబానికి సాయం చెయ్యాలన్న కోర్కెతో, అందర్నీ సంతోషపెట్టాలన్న వాంఛతో ముడిపడి వుండాలి.

ఈ ప్రకరణం మొదట్లో నేను వర్ణించిన నమూనా "రగడ నమూనా"నుంచి ప్రధానంగా ఒక విషయంలో విభేదిస్తుంది. మొదటి నమూనాలో పిల్లలు తమ కుటుంబాన్ని ప్రేమిస్తారు. కార్యకలాపాల ఎంపిక ఒక్కదానికే కుదింపబడినట్లయితే పిల్లల పెంపకం మరీ సంకుచితమైన కర్తవ్యం అయివుండేది. పనుల విషయంలోనూ, పనిచేయవలసిన అవసరాన్ని రూపొందించడంలోనూ — అదెంత సృజనాత్మకమైనదైనా కూడా — ధర్మోపదేశాలకే పరిమితమయ్యే బోధన శాస్త్రం అనివార్యంగా తన నైశిత్యాన్నీ, ఉత్సాహాన్నీ కోల్పోతుంది.

నేను మా గదులను శుభ్రం చేసేది అవి శుభ్రంగా వుండాలని కోరుకోవడం వల్ల మాత్రమే గాక, నేను మా అమ్మలు, బామ్మలు, వగైరాలకు సాయం చేసేందుకు కూడా అన్న తర్కాన్ని పిల్లలు అర్థంచేసుకోవాలి. మనుషుల్ని ప్రేమించడం ఎవరికైనా నేర్పడం అన్నది అత్యున్నతమైన మానవీయమైన విలువల్లో ఒకటి.

<u>ఎనిమిదో సన్నివేశం. పదేపదే జ్ఞాపకం చేయడం అంటే భయపడకండి</u>

పిల్లలు యంత్రాలు కారు. మానవీయమైనదేదీ వాళ్లకి విజాతీయమైనది కాదు. వాళ్లు తరచు చాలా విషయాలను మరచిపోతూ వుంటారు. వాళ్లు అలా మరచిపోయేందుకు రకరకాల కారణాలు వున్నాయి. పిల్లలు ఇల్లు ఊడ్వకపోతే వాళ్లు మిమ్మల్ని ప్రేమించడం లేదనే, బామ్మల్ని నిర్లక్ష్యం చేస్తున్నారనే తొందరపాటు నిర్ధారణకి రాకండి. అంతే కాదు, వాళ్లతో అలా అనకండి, మొత్తంమీద మీపట్ల వాళ్ల ప్రేమని గురించి వాళ్లతో మాట్లాడేందుకు ప్రయత్నించకండి. ప్రేమ అనేది బలవంతం కాదు. ఒకే విషయాన్ని మీరు పదేపదే రెట్టించినంత మాత్రాన పెద్దగా మార్పేమీ రాదు. అలా పదేపదే జ్ఞాపకం చేయబడటానికి పిల్లలు అలవాటుపడిపోయి, వాటిపట్ల శ్రద్ధ చూపడం మానేస్తారు. అందుకని పిల్లలకి రకరకాలుగా జ్ఞాపకం చేస్తూ వుండాలి. ఒక అమ్మాయి ఎప్పుడూ గదిలో తన వస్తువులు చెల్లాచెదరుగా పడేస్తూ వుండేది. వాళ్ల అమ్మ ఆ అమ్మాయి వెనకాలే వెళ్లి వాటిని తీసి సద్దుతూ వుండేది. ఆ తల్లికి తన పిల్లకి చెప్పిచెప్పి విసుగొచ్చి, ఒకసారి తన వస్తువుల్నీ, తన పిల్ల వస్తువుల్నీ కలిపి గది అంతటా విసిరేసింది. ఆ అమ్మాయి అది చూసి సహించలేక "అమ్మా, ఏమిటి నువ్వు చేసే పని?" అని అడిగింది. "ఏముంది, నిన్ను అనుకరిస్తున్నాను, అంతే" అని తల్లి జవాబిచ్చింది.

ఇది సకృత్తు అయిన పద్ధతి. దీన్ని అన్నప్పుడూ అనుసరించడం బహుశా సాధ్యం కాకపోవచ్చు. అయితే, యీ అవసరాలను తీర్చిదిద్దేందుకు సమాంతరంగా అలవాట్లను రూపొందించే క్రమం కూడా ఒకటి సాగుతుంది. ఈ క్రమం పదేపదే జ్ఞాపకం చేయనిదే దాదాపు దుస్సాధ్యం. అలవాటు తరచు యాంత్రికమైనది. అదెప్పుడూ పదేపదే చేసేదాని ఫలితం. కాగా, పిల్లల్ని పనుల్లో పూర్తిగా యాంత్రికంగా ఉండమని డిమాండు చేయడం సాధ్యమా? యిలాంటి సందర్భాల్లో ఓపిక అవసరం.

తొమ్మిదవ సన్నివేశం. మానవ సాంగత్యపు అవసరం

ఇంతకు ముందు నేను వర్ణించిన "రగడ నమూనా"లో ఎడముఖం, పరస్పరం ఒకరి పట్ల మరొకరి నిర్లక్ష్యం అన్నవి భయంకరమైనవి. అలాంటి తల్లితండ్రుల్ని "మీ నిరంకుశ బాలుణ్ణి మీరు ప్రేమిస్తున్నారా?" అని అడగండి. "చాలా" అన్నది అతి తరచుగా మనకి వినిపించే సమాధానం. అది నిజంగా కూడా అంతే. మరి అలాంటి సంబంధాలకు కారణం ఏమిటి? అతిశయ ప్రేమా? తల్లితండ్రులకి పట్టుపట్టే గుణం లేకపోవడమా? సంబంధ బాంధవ్యాల స్వభావమా? పూర్తి సంబంధ బాంధవ్యాలు లేకపోవడమా? లేక బహుశా వీటన్నింటి కలయిక కారణమా?

ఏ కారణంగా నైతేనేం, ఎడముఖం వుంది కాబట్టి, దానికి మూలం ఏమిటో కనిపెట్టాలి. నైతిక అవసరాలను తీర్చాలి అనే మొదటి ఆదేశాన్ని అమలుజరుపుదాం. పిల్లలు మొరటుతనం ప్రదర్శించిన సందర్భాల్లో జాలికీ, సాకులకీ, సర్దుబాట్లకీ తావు వుండకూడదు. పిల్లల్లో చెడు ధోరణులు సర్వసాధారణంగా కుటుంబంలోని శత్రు వైరుధ్యపూరిత సంబంధాల మూలంగా ఉత్పన్నమవుతాయి. పిల్లల చిల్లరమల్లర అవిధేయ కార్యకలాపాలకీ, నిరసనకీ, తల్లితండ్రుల ఆదేశాలను వాళ్ళు తిరస్కరించడానికీ మూలంలో సాధారణంగా మరింత ఘనిష్ఠమైన కుటుంబంలో నైతిక ఎడబాటు మూలంగా కలిగిన కారణాలు వుంటాయి. పిల్లలు మీకు విధేయులుగా వుండాలంటే, వాళ్ళు మీరంటే భయపడితేనే సరిపోదు, మిమ్మల్ని వాళ్ళు గౌరవించాలి. శిక్షింపబడతామేమోనన్న భయం కంటె గౌరవ భావం చాలా బలవత్తరమైనది.

కుటుంబంలోని యితర సభ్యులపట్ల పిల్లలకి వుండే నిర్లిప్త భావంనుంచి వాళ్లలో నైతిక ఎడబాటు ఉత్పన్నమవుతుంది. తల్లితండ్రులు తమకి తెలియకుండానే తమ పిల్లల ప్రవర్తన రీతుల్ని తీర్చిదిద్దుతారు. అది పిల్లల్లో అనివార్యంగా స్వార్థపరత్వాన్నీ, అతి కాంక్షనీ పెంపొందిస్తుంది. పిల్లలు అతి కాంక్ష అనే ఒకే ఒక్క ధోరణిని మాత్రమే అలవరచుకొని వుంటే, ఏం చెయ్యాలి? సహజంగానే పిల్లలతో సంబంధాల స్వభావాన్ని మార్చుకోవాలి.

పిల్లలకి మీతో కలిసిమెలిసి వుండాల్సిన నిశ్చితమైన అవసరం ఎప్పుడూ వుంటుందన్న విషయాన్ని మీరు గుర్తుంచుకోవాలి. పిల్లల్లో పెంపొందిన అతి కాంక్ష ధోరణిని తొలగించేందుకు వాళ్లలోని యీ అవసరాన్ని ఆధారంగా చేసుకోవాలి. ఇందుకోసం పిల్లలు యీ సాంగత్య అవసరాన్ని మాత్రమే కాకుండా, తమ తల్లితండ్రుల సానుభూతినీ, వాళ్లతో సాయిలా పాయిలా అయిన, ఆహ్లాదకరమైన సంబంధాన్ని కోల్పోయే సంభావ్యతని కూడా ఏదో ఒక సమయంలో గ్రహించాలి. మీ పిల్లలకి మరింత సన్నిహితులయ్యే క్రమంలో, వాళ్ల చేత పనిలోనూ, వాళ్ల తొలి విజయాల్లోనూ వున్న ఆనందాన్ని గుర్తింపచేయడం ద్వారా, యిప్పటికే మీరు కొంత ముందుకు వెళ్లారు. అయితే, మీరు మైత్రీపూర్వక సంబంధాలు ఎంత ఎక్కువగా పెట్టుకున్నా, అవి మీ పిల్లల్లో ఆదినుంచీ పాతుకుపోయిన దుర్లక్షణాలను

తొలగించలేవు. నైతిక ప్రవర్తన ఎప్పుడూ ఎంపిక చేసుకోవడంతో, ఆత్మిక క్షోభతో, నైతిక వేదనతో ముడిపడి వుంటుంది. దయతో కూడిన భావాలు దాదాపు ఎప్పుడూ వేదననుంచి ఉత్పన్నమవుతాయి. పిల్లలు నైతిక క్లేశాన్ని అనుభవించేందుకుగాను వాళ్ళకి మీరు బుద్ధి పూర్వకంగా చిత్త క్షోభని కలిగించాలి. దీనిలో చాలా మటుకు మీ సద్బోధమీదా, మీ పిల్లలతో మీరు పెట్టుకొనే సంబంధాల్లో మీ నైపుణ్యంమీదా ఆధారపడి వుంటుంది. ఆదర్శ నమూనాకి చేరుకునే మీ ప్రయత్నాల క్రమంలోని సంశ్లిష్టతలన్నింటినీ అర్థంచేసుకునేందుకుగాను కొన్ని సన్నివేశాలను ఏక సమయంలో విశ్లేషిద్దాం.

ముభావ సన్నివేశం. పిల్లలు తప్పుగా ప్రవర్తించిన వెంటనే మీరు కొంచెం ముభావంగా వుండాలి. అయితే వాళ్ళ మీ ముఖంలో అసంతృప్తిని దర్శించే వీలు కల్పించండి అలా చేసేటప్పుడు మీలో నటన వుండకూడదు. ఎందుకంటే, మీ పిల్లలతో మామూలు సంబంధం లేనందుకు నిజంగానే మీరు మానసికంగా క్షోభపడుతున్నారు. వాళ్ళ "ఏం పొరపాటు చేశానబ్బా?" అని ప్రశ్నించుకునేలా ప్రయత్నించండి. దానికి వెంటనే సమాధానమివ్వకండి. లేకపోతే "నీకు నిజంగానే తెలియదా? నీకు బోధపడలేదా?" అనే పరోక్ష ప్రశ్నల్లో పిల్లలు ఆసక్తులయ్యేలా చూడండి. పిల్లలకి యీ ప్రశ్నలు స్ఫురించకపోయినా, వాటి సమాధానాల కోసం వాళ్ళ అన్వేషణ ప్రారంభించకపోయినా నిరాశ చెందకండి. సంభాషణ మొదలు పెట్టేందుకు అనువైన తరుణంకోసం నిరీక్షించండి. సంభాషణ బామ్మని గురించి అయితే, ఆవిడ వృద్ధాప్యం గురించీ, అనారోగ్యం గురించీ చిత్రించేందుకు, పిల్లల్లో ఆమెపట్ల జాలిని రేకెత్తించేందుకు ప్రయత్నించండి. దయాదాక్షిణ్యాలు లేని స్వార్థపరులు తమ కుటుంబాల్లోని యితర సభ్యులను ఎలా పట్టించుకోరో అనేందుకు మనస్సుకి హత్తుకొనే ఉదాహరణలు పేర్కొనండి. అలాంటి దగుల్బాజీ ప్రవర్తనపట్ల పిల్లల్లో వెగటు పుట్టించండి. అయితే అలా మీరిచ్చే ఉదాహరణల్లో పిల్లలు తమని తాము వెంటనే గుర్తించుకుంటారని ఆశించకండి. కాని, పిల్లల్లో ఏ కొంచెం అవగాహన కనిపించినా, తమ వైఖరిని మార్చుకొనే విషయంలో ఏమాత్రం అభిముఖ్యం కనిపించినా వాళ్ళ నిజాయితీతో కూడిన సహజేంగితానికి దోహదం చేయండి. పిల్లల్ని దయతో కూడిన తమ తొలి కార్యం చేసి, అందుకు వాళ్ళని తృప్తి చెందనివ్వండి.

తెగతెంపుల సన్నివేశం. పిల్లలతో మీ సంబంధాల విషయంలో ప్రధానాంశాలను గురించి మీ మనోగత భావాలను కుండ బద్దలుకొట్టినట్లు వెల్లడించేందుకు జంకకండి. తెగతెంపుల కోసం కావాలని ప్రయత్నించకండి, కాని అందుకు సంసిద్ధులై వుండండి. పిల్లలకి మీ స్వరాల్లో మీ ధర్మబుద్ధి, మీ ఇచ్ఛా శక్తీ స్ఫురించాలి. అయితే పిల్లల్ని మీ ఆదేశాలన్నింటితో ఒక్కుమ్మడిగా ఉక్కిరిబిక్కిరి చేయకండి. "ఈ రోజునుంచి నువ్వు నీ పెద్దలు చెప్పినవన్నీ మారు మాటాడకుండా పాటించాలి" అనకూడదు. అయితే పిల్లలు మొరటుగా వ్యవహరించకూడదు, వాళ్ళలో అతి కాంక్ష ధోరణులు పనికి రావు అనే ప్రధాన విషయాన్ని మాత్రం

మీరు వాళ్ళకి తెలియజెప్పాలి: "నిన్నిలా చెడగొట్టడంలో మా పొరపాటు కూడా వుంది. బహుశా మేమందరం నిన్ను మరీ గారాబం చేసివుంటాం. నువ్వు యీ క్షణంలోనే మారి పోవాలని మేము చెప్పడం లేదు. అది బహుశా అసాధ్యమే. కాని యీ రోజు మొదలుకొని నీకూ మాకూ మధ్య సంబంధం కొనసాగాలని నీకు వుంటే, నువ్వీ కింది పనులు చెయ్యాలి."

బిడ్డ "నేను చేయను, నాకు మారాలని లేదు, నేనెందుకు మారాలి?" అని అంటే, — యిలాంటి పరిణామం పెంపకం విషయంలో పొరపాట్ల మూలంగా పూర్తిగా సంభవమే — మీ కృతనిశ్చయాన్ని గురించి బిడ్డని తెలుసుకోనివ్వండి. "అయితే మనం మాట్లాడవలసింది యింకేమీ లేదు" అని బిడ్డకి చెప్పండి.

సమాంతర కార్యాచరణ సన్నివేశం. మీరు ఒంటరిగా వ్యవహరించబోయినట్లయితే మీరు విధిగా విఫలురవుతారన్న విషయం గుర్తు పెట్టుకోండి. మీ పిల్లలు తెగతెంపుల దిశగా పోతుంటే, వాళ్ల మానాన వాళ్లని వదిలేసే హక్కు మీకు లేదు. అది అత్యంత ప్రమాదకరం. అందుకని మీరు సమాంతర కార్యాచరణ ప్రారంభించాలి. తెగతెంపులకి కారణాన్ని మీ పిల్లలు గ్రహించేలా చేసేందుకూ, వాళ్ల పొరపాటును వాళ్ళు గుర్తించేలా చూసేం దుకూ మరొకరెవరైనా ప్రయత్నించే ఏర్పాటు మీరు చెయ్యాలి. అలా చేసేది ఒక బాబాయో, బామ్మో, టీచరో, లేక పిల్లల క్లాసుమేటో ఎవరైనా కావచ్చు. తెగతెంపుల కాలంలో పిల్లల్లో ప్రతిదీ ఎంతో సున్నితంగా, సునిశితంగా వుంటుంది. కచ్చితంగా చెప్పా లంటే, సరిగ్గా అలాంటి స్థితిలోనే పిల్లలు నైతిక ప్రభావానికి అభిముఖంగా వుంటారు. అలాంటప్పుడు యింక ఎంత మాత్రం తాత్సారం చేయకుండా, పిల్లల మనోస్థితిలో మీరు స్వయంగా తెచ్చిన మార్పుని వినియోగించుకోవాలి. పిల్లలు తాము పొరపాటు చేశామన్న భావంతో మీ దగ్గరకి రావాలి.

సంభావ్య రాజీ సన్నివేశం. పరిస్థితిని బట్టి పిల్లలతో రాజీ చేసుకోవచ్చు. పిల్లల క్షమాపణని అనుమతించండి, అయితే వాళ్లకి కచ్చితంగా "నాకు కావలసింది క్షమాపణలు కావు. నువ్వేం చెయ్యాలో నేనింతకు ముందు అనేక సార్లు నీతో చర్చించాను. వాటిని నువ్వు అమలుజరపాలి" అని చెప్పండి. అలా చెప్పేటప్పుడు భావోద్వేగాలకు చోటివ్వకండి. సాధారణ సంభాషణకి దిగకండి. ఈ తరుణంలో వాటికి చోటు లేదు. కొన్ని సందర్భాల్లో కొన్నికొన్ని కలిపి చేయడం మంచిది. ఉదాహరణకి, "సరే, నీ సంకల్పాలు మంచివైతే, నీ వాగ్దానాలు చిత్తశుద్ధితో కూడినవైతే పనికి దిగుదాం. నీ లెక్కల నోట్‌బుక్కు తీసుకుని లెక్కలు చేయడం మొదలెట్టు" అని చెప్పండి. లేకపోతే, "ఇద్దరం కలిసి ఇల్లు శుభ్రం చేద్దాం నడు" అనండి. "పని — ఆనందం — పని" అనే సూత్రాన్ని మరో సారి జ్ఞాపకం చేసుకోండి. పనిచేసేటప్పుడు సాధ్యమైతే, పిల్లల్ని "చూశావా, నీకు అన్ని పనులూ ఎలా వచ్చునో" అంటూ ప్రోత్సహించండి.

## పదవ సన్నివేశం. పిల్లల్ని బుజ్జగించేందుకు జంకకండి

సంబంధం లేక సాంగత్యం విషయంలో పిల్లలకి వున్న అవసరం ఎప్పుడూ ఆపేక్ష అవసరంతో ముడిపడి వుంటుంది. పిల్లలకి తగినంతగా ఆపేక్ష లేకపోతే వాళ్లు అనివార్యంగా చిరాకుగా, మొరటుగా, అశాంతిగా తయారవుతారు. ఈ "చిరాకు లక్షణాలు" ఆపేక్ష అవసరాన్ని వ్యక్తంచేసే ఒక రూపం. ఆపేక్ష పిల్లల వైఖరిని మెత్తబరచి, వాళ్లని కలివిడి అయినవాళ్లుగా మార్చి, ఏది లేనిదే పిల్లలతో ప్రయోజనకరమైన సాంగత్యం ఉండజాలదో అలాంటి అవసరమైన సమతూకాన్ని ఉత్పన్నం చేస్తుంది. పిల్లలు బుజ్జగింపు, లాలింపు మాటలు, ప్రేమ దృక్కులు కోరుకుంటారు. పిల్లలు తమపట్ల శ్రద్ధాపూరితమైన వైఖరిని ఆశిస్తారు. ధారాళంగా ఆపేక్ష చూపండి. పిల్లలకీ మీకూ మధ్య ఏ కారణంగానైతేనేం తలెత్తిన ఎడమొగం పెడమొగాన్ని కరిగించగలవి మీ ఆపేక్ష, హృదయపూర్వకమైన ఆర్ద్రత మాత్రమే. కొన్ని సందర్భాల్లో మీ చేతులకి ఒక మాటకి, దీర్ఘ సంభాషణకి, లేక బహుమతికి వున్నదాని కంటె ఇంద్రజాలిక శక్తి వుందన్న విషయాన్ని గుర్తుంచుకోండి. మానవ హస్త స్పర్శకి వున్న చికిత్సా శక్తిని యింకా ఎవరూ అధ్యయనం చేసినట్లు లేదు. పిల్లలు తమకి తెలియకుండానే తల్లి మృదు స్పర్శ, తండ్రి కరస్పర్శలోని పురుష మార్దవత్వం, భుజంమీద మైత్రీపూర్వకంగా తట్టడం, వగైరాల మధ్య భేదాలను గ్రహిస్తారు.

పిల్లలు ప్రపంచాన్ని మానసిక సంవేదనల ద్వారా దర్శిస్తారు. చాలా తరచుగా పిల్లలు మాటల ద్వారా కంటె సంవేదనల ద్వారా ఎక్కువ తెలుసుకుంటారు. మాటల్ని పరిహరించి, మీ వైఖరిని నయన విక్షేపంతో లేక హస్త చాలనంతో లేక స్పర్శతో తెలియచెయ్యగలిగిన అవకాశం వున్నప్పుడు మీరు మరింత బాహాటంగా, మరింత తరచుగా అలా చేయండి. మీరు మీ పిల్లల్ని పని గట్టుకొని లాలించక్కర్లేదు. మీరు చేసే వాటన్నింటిలోనూ ఆపేక్ష తొణికిసలాడాలి. మీరు కలిసి బయటికి వెళ్లినప్పుడు, పిల్ల స్కార్ఫు సర్దండి, మెడ తట్టండి, జుట్టు సవరించండి. మీరేదైనా చదివి వినిపించేటప్పుడు, పిల్లల భుజం తాకుతూ కూర్చోండి. మీ పిల్లకి ఉక్కగా వున్నప్పుడు ఆమె కాలరు గుండీ విప్పండి. ఒక పిల్ల తన తల్లి కేసి బుజ్జగింపుకోసం వాలితే, లేక ఒక పిల్లవాడు తన తండ్రితో తన బలాబలాలు తేల్చుకునేందుకు పట్టు పట్టాలని అనుకుంటే, వాళ్లని విదిలించెయ్యకండి. వాళ్లని కౌగలించుకోనివ్వండి. పిల్లల్ని మీ శరీరపు వెచ్చదనాన్నీ, బలాన్నీ అనుభూతి చెందనివ్వండి. అలాంటి స్పర్శ రక్షణ భావాన్ని, శాంతిని, అద్భుతమైన సౌలభ్యాన్ని ఉత్పన్నంచేస్తుంది.

## పదకొండవ సన్నివేశం. బోధన శాస్త్రీయ ఆనందం

పిల్లలతోడి సాంగత్యంలో మీరు ఎలాంటి ఆనందమూ పొందకపోతే మీరు విద్యా బోధన లక్ష్యాలేమీ సాధించరు. పిల్లల పెంపకం అన్నది విధిగా ఆనందాన్ని చేకూర్చవలసిన మాదిరి

కృషుల్లో ఒకటి. బోధన శాస్త్రీయ విజయాల రహస్యం సరిగా దీనిలోనే వుంది. ఈ బోధన శాస్త్రీయ విషయంలోని మూలాంశాలు ఏమిటి? అవి మూడు.

మొదటిది – ఒక లక్ష్యం నిర్దేశించడంలో కలిగే ఆనందం. మీరు మీ పిల్లల జీవితంలో ఒక నిర్దిష్ట క్రమాన్ని నెలకొల్ప సంకల్పించారని అనుకోండి. దానిలో మీరు ఒకే ఒక్క లక్ష్యాన్ని అనుసరించడం అన్నదెన్నడూ సంభవించదు. బోధన శాస్త్రీయ పథకాల లక్షణాల్లో ఒకటేమిటంటే, వాటిలో ప్రతి ఒక్కటీ "కొన్ని లక్ష్యాల"కు ప్రాతినిధ్యం వహిస్తుంది. మీరు ఒకే లక్ష్యం పెట్టుకున్నట్లు అనిపిస్తుంది, కాని వాస్తవంలో పరస్పరం అత్యంత సన్నిహిత సంబంధం కలిగిన, సమాంతరంగా అభివృద్ధి చెందుతున్న ధోరణుల, స్వభావ, సామర్థ్య, కృషి, వగైరా లక్షణాల సమాహారంగా అది తేలుతుంది. మీ లక్ష్యం మీ పిల్లలు ప్రొద్దుటే లేచి, పక్క సర్దుకోవడానికే పరిమితమైనా కూడా, మీకు తెలియకుండానే పిల్లలతో సరైన పరస్పర సంబంధాలు, మీరు చెప్పేదానికి వాళ్ళు సరిగా ప్రతిస్పందించడం నేర్పడం, వాళ్లలో ఆత్మవిశ్వాసం చొప్పించడం, వాళ్లకి బాధ్యస్థ భావాన్నీ, క్రమశిక్షణనీ అలవరచడం, పిల్లలు క్రమబద్ధమైన పనికి, రోజువారీ పనులను సరిగా సంఘటితం చేయడం, వగైరాలకు అలవడేలా చేయడం వంటి "పరస్పర సంబంధిత" లక్ష్యాలను కూడా మీరు సాధించవలసి వుంటుంది. ఈ పరస్పర సంబంధితమైన వాటిలో ఒకానొక నిర్దిష్ట సమయంలో మీకు అతి ముఖ్యమైన ఒక లక్ష్యాన్ని ఎంపిక చేసుకోండి. మొదట్లో మీరు ఒక్క లక్ష్యాన్ని మాత్రమే సాధించగలిగినా మీరు విజయం సాధించినట్లే. ఈ సాధింపబడిన ఒక్క లక్ష్యమూ మిగిలిన లక్ష్యాల గొలుసును "దగ్గరకి లాగుతుంది."

రెండవది – లక్ష్యాల సాధన మార్గాల ఎంపిక. సాధనంగా ఏదైనా పనికి రావచ్చు. అది ఇల్లు ఊడ్వడం కావచ్చు, పుస్తకం చదవడం కావచ్చు. అది సంభాషణ, ప్రోత్సహించడం లేక ఖండించడం, ఎడబాటు లేక రాజీ, సమాధానపడటం లేక సంయుక్త కృషి – వీటిలో ఏ ప్రయత్నమైనా కావచ్చు, ఏ పనైనా కావచ్చు. వివిధ సాధనాల వినియోగం కొంత మేరకు మీ సంకల్పాలను మార్చవచ్చు. అంత మాత్రాన మీరు గాభరా పడకండి. మీ పథకాలను ఎలా సఫలం చేసుకోవాలో, పిల్లలు మీకు ఏ మేరకు సహచరులుగా వుంటారో మీరు చాలా జాగ్రత్తగా పర్యాలోచించండి. దీనితో బాటు తమ జీవిత క్రమం అంతటి ద్వారా ప్రపంచంలోని అత్యున్నతమైనది తాము మాత్రమే కాదనీ, తమ తల్లులు, తండ్రులు, బామ్మలు, టీచర్లు, స్నేహితులూ అన్న విషయం పిల్లలు గ్రహించాలి. వాళ్లలో ప్రతి ఒక్కరికీ తమ సొంత యిబ్బందులు వుంటాయనీ, సొంత సంతోష విచారాలు వుంటాయనీ పిల్లలు తెలుసుకోవాలి. పిల్లలు యితరులపట్లా, వాళ్ల జీవితాలపట్లా శ్రద్ధ చూపాలి. పిల్లల పెంపకంలో యీ ఆలోచనలు మీకు మార్గదర్శకత్వం వహించాలి. ఈ కార్యకలాపాల్లో మీరు విజయాలు సాధించేందుకు మీకు తోడ్పడేవి సరిగా యివే.

మూడవది – మీ కృషి ఫలితాల విశ్లేషణ. ఉదయంపూట చెయ్యవలసిన పనులను

మీ పిల్లలచేత చేయించడంలో మీరు సఫలురైతే — అంటే వాళ్లు ఆదర్శ నమూనా ప్రకారం వ్యవహరిస్తే — యీ ఫలితం దరిమిలా మీరు పెట్టబోయే లక్ష్యాలకు ప్రాతిపదిక అవుతుంది. ఒకటి రెండు నెలలు లేక మూడు వారాల క్రమంలో మీరు మీ "ఉదయం" లక్ష్యాలను మాత్రమే సాధించి వుంటే, మీరు యితర లక్ష్యాలను నిర్లక్ష్యం చేశారని అర్థం కాదు. పాఠాలు, వాళ్ల పనులు, వగైరాలపట్ల పిల్లల వైఖరిని మార్చడంలోనూ, తీర్చిదిద్దడంలోనూ మీరు చాలానే చేశారన్న మాట. దీని నైతిక ఫలితాన్ని అంచనా వేయడం కష్టం. కాని అది అన్ని రకాల పనులకూ, సరదాలకూ విస్తరిస్తుంది. దానితో మీరు పరిష్కరిస్తూనే వుండ వలసిన కొత్తకొత్త సమస్యలు మీకు ఎదురవుతూనే వుంటాయి.

## పన్నెండవ సన్నివేశం. అధిగమన సూత్రం

ఇదెంత విడ్డూరంగా కనిపించినా కూడా, పిల్లలతో జరిగే చాలా ఘర్షణలు తల్లితం డ్రులు తమ పిల్లలపట్ల తమ వైఖరులను మార్చుకోకపోవడం మూలాననే సంభవిస్తాయి. తల్లితండ్రులు తమ పిల్లల్లో వస్తున్న మార్పులను గమనించరు. పిల్లలు తమ తల్లితండ్రుల నుంచి తమపట్ల వాళ్ల కొత్త వైఖరిని బలవంతాన "రాబట్టుకోవలసి వుంటుంది." పిల్లలు అభివృద్ధిచెంది, పెరిగే కొద్దీ తల్లితండ్రులు తమని పెద్దవాళ్లుగా చూడాలనీ, తాము మరింత స్వతంత్రులవ్వాలనీ వాళ్లు కోరుకుంటారు. చాలా తరచుగా జరిగేదేమిటంటే, పిల్లల యీ సహజ ధోరణిని తమ అదుపునుంచి తప్పుకునేందుకు వాళ్లు చేసే ప్రయత్నంగా తల్లితండ్రులు భావిస్తూ వుంటారు. దానితో ఘర్షణలు తలెత్తుతాయి. పిల్లలు తమ ప్రతిస్పందనల్లో వుండేదాని కంటె తల్లితండ్రులు తమ పద్ధతుల్లో మరింత ఛాందసంగా వుంటారు. ఈ ఛాందసత్వం అనేక విధాల వ్యక్తం కావచ్చు.

ఉదాహరణకు, ఆపేక్ష విషయం తీసుకుందాం. ఇతరుల సమక్షంలో మీ బిడ్డల్ని మీరు ముద్దు పెట్టుకున్నప్పుడు వాళ్లు ముఖాలు పక్కకి తిప్పేసుకోవడం మీరెప్పుడైనా గమనించారా? వాళ్లు అలా ముఖం తిప్పేసుకోవడం మీ ఆపేక్ష వాళ్లకి నచ్చక కాదు, ఆ ఆప్యాయత ప్రదర్శింపబడిన తీరు నచ్చక మాత్రమే. తమ వయస్సును బట్టి యిలాంటి ఆపేక్ష మరో రూపంలో వుండాలని వాళ్లు అప్పటికే అర్థంచేసుకో నారంభించారన్న మాట. ఆర్ద్రమైన చూపు, మెల్లగా వీపు తట్టడం చాలు. వాళ్ళు యివన్నీ పెద్దవాళ్ల మధ్య వున్నట్లే వుండా లని కోరుకుంటారు. ఒక్కొక్కప్పుడు వాళ్ల చిన్నతనంలో మీరు వాళ్లని కేకలేస్తూ వుండేవాళ్లు. అప్పుడు అందుకు వాళ్లు కోపగించుకునేవాళ్లు కారు. కాని యిప్పుడు వాళ్లకి పద్నాలుగు పదిహేను ఏళ్లు వచ్చాయి. మీరు యిప్పుడు వేసే కేకలు ప్రతి ఒక్క సారీ వాళ్ల మనస్సులను` గాయపరుస్తాయి.

పిల్లల్ని మీరు చూసే సాధారణమైన తీరును మీరు సకాలంలో మార్చుకోవాలి. మీరు వాళ్లమీద పెట్టే విధి నిషేధాల పద్ధతులను మార్చుకోండి.

మీరు మీ పద్ధతుల్ని మార్చుకునేలా చేసేది మీ పిల్లలు గాక, మీరే మీ విధి నిషేధా లను మార్చుకునేలా, పిల్లలు తమ ప్రవర్తనను మార్చుకునే స్థితిలో పెట్టేలా యిది జరగాలి. మీ పద్ధతులు పిల్లల అభివృద్ధిని కొంచెం అధిగమించేవిగా వుండాలి గాని, దానికి వెనకపడేవిగా వుండకూడదు. పిల్లల శారీరక, మానసిక అభివృద్ధియొక్క వివిధ దశల్లో మీరు ఒకే విధానాన్ని అనుసరించాలి. "నువ్వు పెద్దవాడివి, తెలివైనవాడివి కనుక, నువ్వీ పని స్వయంగా చెయ్యాలి" అని చెప్పాలి. పిల్లలు మరింత స్వతంత్రంగా వ్యవహరించే స్థితిని సాధించేందుకు ప్రయత్నించండి. "ఇది నా అంతట నేనే చేస్తాను" అనే పిల్లల అద్భుతమైన సూత్రాన్ని పిల్లల పెంపకంలో మీకు ధ్రువజ్యోతిగా, మార్గదర్శక పద్ధతిగా వుంచుకోండి.

## పదమూడో సన్నివేశం. పిల్లలతో ఘర్షణలకు భయపడకండి!

వైరుధ్యాల పరిష్కారం లేనిదే ఏ సాంఘిక సంబంధాలూ వుండనట్లే, ఘర్షణలు లేని పిల్లల పెంపకం ఏదీ వుండదు. ఘర్షణలు అన్నవి దృక్పథాలు, అభిరుచులు, కోర్కెలు, అభిప్రాయాలు ఢీకొనడం. ఈ ఘర్షణ పిల్లల అభివృద్ధిలో ఒక చిక్కు ముడి లాంటిది. ప్రతి సారీ ఈ ముడిని విప్పకుండా వదిలేస్తే మనిషి ఇక ఏ మాత్రం ముందుకు పోలేడు. ఘర్షణ యింతకు ముందున్నదాని సంస్కరణ. అదెప్పుడూ పునర్నవ ఆవశ్యకతతో ముడిపడి వుంటుంది.

అన్ని ఘర్షణలనూ, వాటిని పరిష్కరించే సాధనాలనూ ఫొక్కుపరచేది ఏదో ఒకటి వుందని నాకు అనిపిస్తుంది. ఏదేమైనప్పటికీ, ఏ ఘర్షణలోనైనా కొన్ని ధోరణులను చూడ వచ్చు.

సైన్సు ఫిక్షన్ పుస్తక పఠనంలో మీ పిల్లవాడి ఆసక్తి వాడి చదువుకి భంగకారి అవనారం భించిందనుకోండి. పిల్లవాడి పని క్రమం భగ్నమై, వాడి హోమ్‌వర్కు చేసుకోవడం దెబ్బ తినే క్రమాన్ని నివారించేందుకు మీరు ప్రయత్నించడం మీ ప్రవర్తనలో సానుకూల లక్ష ణమే. కాని ఆ పుస్తకాలను మీ పిల్లవాడి చేతుల్లోంచి లాగేసుకోవడం ద్వారా మీరు ప్రమా దాన్ని కోరితెచ్చుకొంటూ వుండవచ్చు. నిషిద్ధ ఫలాలమీద వాడి ఆసక్తి పెరగనూ వచ్చు, లేకపోతే పుస్తకాల్లో పిల్లవాడికి వుండే మంచి ఆసక్తి చిదిమివెయ్యబడనూ వచ్చు. పిల్లవాడి విషయంలో కూడా యిది తక్కువ సంశ్లిష్టమైన పరిస్థితేమీ కాదు. పిల్లవాడు వైజ్ఞానిక కాల్పనిక సాహిత్యంలో వుండే ఉత్తేజకర ఘటనల సమ్మోహనకర ప్రభావంలో మునిగి పోతాడు — నిజానికి యిది అద్భుతమైన స్థితి. పిల్లవాడి అంతరాంతరాల్లో ఏ మూలనో "నేనింకా హోమ్‌వర్కు చేసుకోవాలి, పెందరాళే లేవాలి" అంటూ పీకుతూ వుంటుంది. కాని వాడు ఆ పుస్తకాలు వదిలిపెట్టలేడు. అందుకే వాడు తనకి కొత్తగా అబ్బిన గ్రంథ

పఠనాసక్తికి అడ్డువచ్చేవాళ్లెవరితోనైనా సరే సద్యోజనితంగానే ఘర్షణపడేందుకు సిద్ధపడతాడు.

ఈ ఘర్షణ బహుముఖమైనదన్న విషయం మీరు గమనించవచ్చు. మీరు పిల్లవాడి దగ్గరకి వెళ్లి "ఇంక చాలు!" అంటూ పుస్తకం లాగేసి, లైటు ఆర్పేస్తే మీరు సాధించేది ఎక్కువేమీ వుండదు. అలాంటి చర్య బొత్తిగా పనికి రాదని చెప్పలేము గాని, అది అత్యవసర పరిస్థితిలో మాత్రమే ప్రయోగార్హమైనది. అయితే ముందే దానికి ఎగబడకూడదు. వచ్చిన ఘర్షణను పరిష్కరించేందుకు వేరే పద్ధతిని ముందు ప్రయత్నించండి. పిల్లవాడి దగ్గరకి వెళ్లి "ఇది చాలా ఆసక్తికరమైన పుస్తకంలా వుందే?" అనండి. బహు సకృత్తుగా తప్ప పిల్లవాడు "ఉండు, నన్ను డిస్టర్బు చేయకు" అనలేడు. పిల్లలకి ఏదైనా నచ్చినప్పుడు దాన్ని యితరులతో విధిగా పంచుకోవాలని అనుకుంటారు. వాళ్లు "చాలా ఆసక్తికరంగా వుంది" అనడం అత్యంత సంభావ్యం.

ఈ చిన్న సంభాషణ రెండు పనుల్ని అప్పుడే సాధించింది: పుస్తకంలో పిల్లవాడి ఆసక్తిని మీరు సుదృఢం చేశారు, వాడి ఆసక్తిలో పాలుపంచుకున్నారు. రెండోది, మీరు అప్పుడే పుస్తకంనుంచి పిల్లవాడి దృష్టిని మళ్లించి, వాడి ధ్యానాన్ని ఆలోచన, అంచనా, వగైరాలమీదకి తిప్పారు. మీరు పిల్లవాడి ముఖంలోకి చూడండి, వాడి మగ్నత మాయమవడం చూస్తారు. తనకి తెలియకుండానే వాడు మీ వంక చూస్తాడు. "బహుశా నువ్వు అత్యంత ఆసక్తికరమైన ఘట్టంలో ఆపినట్టున్నావేమో కదూ?" అనో, లేక "పుస్తకం అంతా యింత ఆసక్తికరంగానే వుందేమిట్రా?" అనో మీరు అడిగినప్పుడు పిల్లవాడు మీతో సంభాషణ మొదలుపెడతాడు. ఈ సాంగత్యం పిల్లవాడికి ఒక ప్రాతిపదికగా వినియోగపడి, పిల్లవాడు మీ సూచన సాయంతో తనే స్వయంగా ఒక నిశ్చయానికి వచ్చి, చదివే పుస్తకాన్ని మరుసటి రోజుదాకా పక్కన పెట్టడం సాధ్యమవుతుంది. ఈ సన్నివేశంలో భళ్లుమనబోయే ఘర్షణని మీరు నివారించారన్న మాట. అలాంటి నివారక చర్య చాలా అవసరం. ఎందుకంటే, అది పరస్పర సంబంధాల ప్రాతిపదికకు మూలాధారాన్ని కల్పిస్తుంది. అలాంటి ప్రాతిపదికమీద రాగల ఎలాంటి ఘర్షణలనైనా పరిష్కరించడం సులభం అని వేరే చెప్పనక్కర్లేదు. ఈ నివారక చర్యలకు నియమం ఏమిటంటే, పిల్లల్లో అత్యంత ప్రతికూలమైన మొగ్గులతో బాటు కనిపించే సానుకూల ధోరణులను ప్రోత్సహించడం, పెంపొందించడం.

## పధ్నాల్గవ సన్నివేశం. ఉదయం ఘర్షణలను నివారించండి

పిల్లలకి ఉదయం అతి కష్టమైన సమయం. ఇది ఒక్కొక్కళ్ల విషయంలో ఒక్కొక్కలాగ వుంటుంది. కొందరు పిల్లలు చటుక్కున వెంటనే నిద్రలేస్తారు. మరి కొందరికి "మేల్కొనేందుకు" లేక ఒక స్థితినుంచి మరో స్థితికి మారేందుకు వ్యవధి పడుతుంది. కొందరు పిల్లలకి వ్యాయామం చెయ్యడం తేలిక కాగా, మరి కొందరికి అది ప్రాణసంక

టంగా వుంటుంది. కానైతే అలా ప్రాణసంకటంగా వుండేవాళ్లే కొంత కాలం తర్వాత తీవ్రమూ, సుదీర్ఘమూ అయిన శారీరక, మానసిక శ్రమ చేయగలగవచ్చు. పిల్లల శారీరక అభివృద్ధి లక్షణాలను పరిగణనలోకి తీసుకోవడం అవసరం. అయితే పిల్లల్లో యీ సందర్భంలో వాళ్ల ఉదయపు గంటల్లో ప్రతి ఒక్కరిలోనూ అంతర్గర్భితంగా వుండే ఉమ్మడి లక్షణాలను తెలుసుకోవడం మరింత ముఖ్యం.

ఉదయంపూట రోజులోకెల్లా ఆశావహమైన సమయం. ఉదయం ఎప్పుడూ శుభ సంఘటనల నిరీక్షణల వేళ. పిల్లలపట్ల ఉదయంపూట ప్రత్యేక శ్రద్ధాసక్తులు చూపడం అవసరం. వాళ్ల సుఖ నిద్రకి సంబంధించిన వెచ్చదనానికీ అవిరామమైన రోజులోని ఒత్తిళ్లకీ మధ్య నిశితమైన అంతరాలు వుండకూడదు. ఉదయపు తొలి క్షణాల్లో పిల్లలు తమ హడావిడి రోజులో ప్రవేశించేందుకు వాళ్లకి తోడ్పడే ఆపేక్షతో కూడిన వాతావరణాన్ని సృష్టించాలి. ఈ కారణంగా ఉదయపు గంటల లయ అంతా హడావిడి రోజులో పిల్లల క్రమబద్ధమైన ప్రవేశాన్ని సులభతరం చెయ్యాలి. ప్రశాంత వాతావరణంలో నాస్తా, చివరి సన్నాహం, పుస్తకాల సంచి సరిచూసుకోవడం, దుస్తులు వేసుకోవడం – యివన్నీ కూడా మరింత వేగంగా జరగాల్సిందే గాని, రభస లేకుండా జరగాలి.

పదిహేనవ సన్నివేశం. కోపం వచ్చినవాళ్ల పాత్ర వహించకండి

పెద్దవాళ్లు తమ సంబంధాల్లో తరచు "కోపం తెప్పించినవాళ్ల," "కోపం వచ్చిన వాళ్ల" పాత్ర ఒక ఎత్తుగడగా వహిస్తూ వుంటారు.

ఈ ఆట యిలా సాగుతుంది. ఒకడు తన సన్నిహితుడితో అంటీ ముట్టనట్లు, నిర్లిప్తంగా వ్యవహరిస్తాడు. రెండవవాడు తన మనోభావాన్ని వెల్లడించకపోయినా కూడా అతను మనస్సులో కోపం తెచ్చుకుంటాడు. అందుకని ఆ రోజున కోపం వచ్చినవాడు తన పాత్ర పోషిస్తాడు. అయితే "కోపం తెప్పించినవాడికి" సంగతేమిటో తెలియదు, కాగా ఒకదాని తర్వాత మరొక పొరపాటు చేస్తాడు. ఆటు తర్వాత సుదీర్ఘమైన సంజాయిషీలు, సర్దుబాటు చేసుకోవడం, క్షమించడం జరుగుతాయి. కొన్ని సందర్భాల్లో పెద్దవాళ్లు తమకి తెలియకుండానే చిన్న పిల్లలతో యీ పద్ధతిని అనుసరిస్తారు. కూతురు ప్రొద్దుటే లేచి, టీ కాచాలని ఒక తల్లీ, కూతురూ రాత్రిపూట నిర్ణయించుకుంటారు. కాని కూతురు యీ విషయం మరచిపోతుంది. ఆమె పాలు తాగి, చేతికి అందుబాటులో వున్నదేదో తినేసి, హడావిడిగా స్కూలుకి వెళ్లిపోతుంది. తల్లికి కోపం వస్తుంది: "తల్లి సంగతి దానికి పట్టడం లేదు" అంటూ సణుక్కుంటుంది. ఆమె రెండు రోజుల పాటు కోపంలో మునిగి వుంటుంది. కూతురు తన తల్లి ముభావాన్ని గమనించి "అమ్మా, ఏమిటింత కోపంగా వున్నావ్?" అని అడుగుతుంది. ఈ ప్రశ్న విన్న తల్లికి పుండుమీద కారం జల్లినట్లవుతుంది. "దీనికి నా సంగతే పట్టడం లేదెందుకనో?" అనుకుంటుంది. కాని, కూతురు అలాంటిదేమీ కాదు.

ఆమె జీవిత లయ మనకి పరుగుపందెంలా కనిపిస్తుంది. అలాంటి పందెంలో ఎడాపెడా విశితంగా గమనించడం సాధ్యమా? మీరు మీ పిల్లలకి పరుగుపందెంలో "ఆగడం" ఎలాగో నేర్పకపోతే, ఎదుటివాళ్ల స్వరానికి ప్రతిస్పందించడం ఎలాగో, ఎదుటివాళ్ల కళ్లలో ఎలాంటి భావం వ్యక్తమవుతోందో, మనుషుల సంవేదనలను ఎలా గ్రహించడమో మీరు వాళ్లకి ఎన్నడూ నేర్పలేరు. మీరు శ్రద్ధాళువు, దయాళువు అయిన వ్యక్తిని తీర్చిదిద్దలేరు.

పిల్లలకి యీ సంశ్లిష్ట, బహుముఖ దృష్టిని అలవరచడానికి పెద్దవాళ్లు విజ్ఞులై వుండాలి, ప్రశాంత చిత్తం కలిగి వుండాలి, హేతుబద్ధమైన పెంపకపు ఎత్తుగడలను అను. సరించాలి. పెద్దవాళ్లు కోపగించుకోవడం అవమానకరం. కోపగించుకోవడం పెద్దవాళ్ల వైఖరిని నిస్సహాయం, బలహీనం చేస్తుంది.

ఎప్పుడైనా ఒక సారి పిల్లల ముందు పెద్దవాళ్లు తమ బలహీనతని ప్రదర్శించవచ్చు. పిల్లల తోడ్పాటును ఆశించి వాళ్లకి ఏదైనా రహస్యం చెప్పవచ్చు. అయితే అసాధారణ పరిస్థితుల్లో మాత్రమే యిది చేయాలి. పిల్లల సానుభూతి పొందేందుకోసం పెద్దవాళ్లు తమ బలహీనతని ఎన్నడూ ఒక సాధనంగా వాడకూడదు.

ఘర్షణ సన్నివేశంలో పెద్దవాళ్లది పైచేయిగా వుండాలి. పెద్దవాళ్లు ఆ పార పొచ్చెంలో మొదటి, చివరి అడుగులు రెండింటినీ చూడగలిగి వుండాలి. చివరి అడుగు ఆశావహమైన నిర్గమనానికి మార్గంగా వుండాలి. ఘర్షణ పరిష్కారాన్ని వాయిదా వేయకూడదు, పిల్లల "త్వరీకృత" జీవితానికి అది అనుగుణంగా వుండాలి. మీరు మీ సంబంధాలను జాగ్రత్తగా విశ్లేషించుకుంటే, అవి అనంతమైన చిల్లరమల్లర ఘర్షణల వరుసగా ఉంటాయని మీరు గ్రహిస్తారు. మీరు ప్రొద్దుట "చెత్త పారెయ్యి" అంటారు. అప్పట్లో పిల్లవాడు తన సొంత పనుల్లో నిమగ్నుడై వుండి మీ మాట వినిపించుకోడు. ఇంకా సరిగా చెప్పాలంటే, వాడు మీ మాట వింటాడు గాని, మీ కోర్కెకి ప్రాముఖ్యమేమీ ఆపాదించడు. మీరు కోపం తెచ్చుకున్నట్లూ, ఆ పని మీరే చేసినట్లూ వాడి కంటబడితే, వాడి అంతరాత్మమీది భారాన్ని మీరు దించేసినవాళ్లవుతారు. "ఇదీ బాగానే వుంది. ఇంక నేనా పనికి మాలిన చెత్త విషయం పట్టించుకోనక్కర్లేదు" అనుకుంటాడు వాడు. మీరేమో మానసిక ఘర్షణకి గురి అవుతారు. కాగా పిల్లవాడేమో యీ ఘర్షణ యింతతో ముగిసిపోయిందని అనుకుంటాడు. అయితే మీరు మీ ఆదేశాన్ని చిరాకు లేకుండా, ప్రశాంతంగా, పట్టుదలగా "ఊఁ, తొందరగా" అంటూ రెటిస్తే, పిల్లవాడు మీరు చెప్పిందాన్ని చేస్తాడు. పిల్లవాడు యీ పని చేస్తూ ఒకవేళ అయిష్టత చూపినా మీరది పట్టించుకోకండి. అవసరమైతే ఏ జోకో వేసి, ఉద్రిక్తతని తగ్గించండి.

ఇంకో పరిస్థితి కూడా ఏర్పడవచ్చు. మీరు చెత్త బాల్చీని చేతిలోకి తీసుకుంటారు. పిల్లవాడు వెనకనుంచి "నాన్నా, ఒక్క క్షణం ఉండు. నేను తీసుకెళ్తా చెత్త బాల్చీ" అని అరుస్తాడు. మీరు ఖాళీ బాల్చీతో యింట్లోకి తిరిగి వస్తారు. పిల్లవాడు నేరస్థ భావంతో

మీకేసి చూస్తాడు. వాడు సిగ్గుపడ్డాడన్న మాట. ఇలాంటి చిల్లరమల్లర విషయాల్లో నిర్మాణాత్మకం కాని ఆత్మ విశ్లేషణని పెంపొందనివ్వకండి. "ఫరవా లేదులే, యీ సారి చెత్త బాల్చీని నేను గుర్తుచెయ్యకుండానే తీసుకెళ్ళవు గాని" అని మీరు పిల్లవాడితో శాంతంగా, హుషారుగా చెప్పండి. అంత మాత్రమే. పిల్లవాడు తనని తాను సమర్థించుకొంటూ గొణిగితే, "ఇంక చాల్లే" అని తుంచెయ్యండి. మీరు చెయ్యవలసిన యితర పనులకి పూనుకోండి.

ప్రతి ఒక్క సారీ పొరపొచ్చాన్ని సరిదిద్దుకునేందుకు ప్రయత్నించకూడదు. అలా చెయ్యబూనుకొంటే ప్రత్యేకించి మీరే బాగా అలసిపోతారు. చిల్లరమల్లర ఘర్షణలన్నీ ముదిరి, అవి "ప్రధాన ఘర్షణ"లోకి పక్వమయ్యే పరిస్థితిలోకి దారితీసేదాకా వేచి వుండండి. అప్పుడిక పిల్లల ప్రవర్తనలోని పొరపాట్ల ఉదాహరణలను ఏకరువు పెట్టడం ద్వారా సంబంధాలను స్పష్టం చేయాలి, లేకపోతే "ఢీకోవాలి." పొరపొచ్చపు పర్యవసానాన్ని, అంటే ఆసందిగ్ధమైన ఆశావహమైన దృక్పథాన్ని మీరు దృష్టిలో పెట్టుకోవాలి.

## పదహారవ సన్నివేశం. పిల్లలకి ఓపిగ్గా నేర్పాలి

మీరు నేర్చుకున్నవన్నీ, ఉదాహరణకి, వేగంగా నాస్తా తయారుచెయ్యడం, ఇల్లు, మీరు పనిచేసే చోటూ తుడవడం – వీటికి మీకు ఏళ్ల తరబడి పట్టింది. మీ పనులు మీరు చేసుకునే నైపుణ్యాలు వందలు, వేలాది అత్యంత సూక్ష్మమైన పనుల ద్వారా మీకు అబ్బాయి. అయితేనేం, యీ అలవాట్లకి మీరు ఏ ప్రాముఖ్యమూ ఆపాదించరు. ఈ నైపుణ్యాలు స్వల్పాంశమనీ, పిల్లలు వాటిని తేలిగ్గా అలవరచుకోగలరనీ మీరు అనుకుంటారు. "ఏమిట్రా, నువ్వీ ఆషామాషీ పనులే చెయ్యలేవా? ఇంత చిన్న పనులే నీ అంతట నువ్వు చేసుకోలేకపోయావా?" అని మీరు పదేపదే రెట్టిస్తారు. వాస్తవానికి పిల్లవాడు యీ చిన్న పనులే చేసుకోలేడు. వాడికేదో అడ్డుపడుతోంది. బహుశా వాడికి ధైర్యం లేదో, వాడెందుకో భయపడుతున్నాడో. పిల్లవాడి భయం బహుముఖమైనది. అది తరచు కుటుంబంలో చాలా కాలంగా రూపొందుతూ వచ్చిన ఒక పరిస్థితితో ముడిపడి వుంటుంది. ఈ పొరపాట్లను అధిగమించడం ఎలాగో మీకు చెప్పాలని అనుకుంటున్నాను.

ఆన్యాకి పదేళ్లప్పుడు అన్నా ఇవానొవ్నాని నేను కలుసుకున్నాను. అన్నా ఇవానొవ్నా కూతురు మీద యిలా ఆరోపించింది: "మా అమ్మాయి పనులన్నీ అమ్మమ్మచేత చేయించుకునేందుకు అలవాటుపడింది. అది యిప్పుడు అవన్నీ నాచేత చేయించుకోవాలని ఎదురుచూస్తోంది. కాని నాకెక్కడ తీరుతుంది. నాకు నా పని వుంది. నేను దానికి అన్నీ అమర్చిపెట్టలేను. అంతే కాదు, అలా చెయ్యాలనుకోను. ఎందుకంటారేమో, తన పనులు తను చేసుకోవడం అది నేర్చుకోవాలి. ఏదో ఒక రోజున అది స్వతంత్రంగా బతకాలి కదా. అమ్మా, అమ్మమ్మా శాశ్వతంగా వుండరు కదా."

ఆ సన్నివేశాన్ని శ్రద్ధగా పరిశీలించే ప్రయత్నంలో "ఇంతకీ మీ అమ్మాయి చేసుకోలేక పోతున్నది ఏమిటి?" అని అడిగాను.

"అది ఏమీ చెయ్యలేదు. చీపురు పట్టుకోలేదు. పక్క వేసుకోలేదు. అగ్గిపుల్ల వెలిగించడానికి కూడా దానికి భయమే. దానికి అగ్గి పుల్ల వెలిగించడం ఎలాగో నేర్పేందుకు మా తాతలు దిగొచ్చారు. ఎందుకంటే, అది ఇంటికి ఒకత్తే వస్తుంది. అది తన భోజనం వెచ్చబెట్టుకోవాలి. టీకి నీళ్ల మరగపెట్టుకోవాలి. ఈ చిల్లర పనులకోసం నేను పని వదులుకుని రావాలా? అది చిన్నారి కూచి కాదు, పెద్దదైంది!"

ఆస్యా స్కూల్లో బాగా చదువుతుంది. సంగీత పాఠశాలకి హాజరవుతోంది. అందులో ఆమె మంచి పురోగతి సాధించింది. కాని ఇంటి దగ్గర...

తెలివితేటలు తొణికిసలాడే మెరిసే కళ్లతో ఆస్యా అందమైన ఆకర్షణీయమైన అమ్మాయి. కొంచెం వ్యంగ్యంతో కూడిన ఆమె కళ్లలో ఉత్సుకత ఉంది. ఆమె నిబ్బరమైన అమ్మాయి. ఆమె కదలికల్లో ఆరోగ్యకరమైన అమ్మాయిలో వుండే బలం, శక్తీ కనిపిస్తున్నాయి. కొంచెం గారాబం చెయ్యబడ్డ బిడ్డ లాగా కనిపిస్తోంది ఆమె.

ఆస్యా, ఆమె తండ్రి, తల్లి, నేను — మేము నలుగురం కూర్చున్నాం.

"ఏమిటీ, ఆస్యాకి అగ్గిపుల్ల వెలిగించడం చేతకాదా? మీరంటున్నది అర్థం లేదు! ఆస్యాకి ఎంత అద్భుతమైన వేళ్లున్నాయో చూడండి. అలాంటి వేళ్లున్న అమ్మాయి అగ్గిపుల్లే కాదు ఆకాశంలోని నక్షత్రాలను కూడా వెలిగించగలుగుతుంది" అన్నాను.

ఆస్యా విభ్రాంత, శంకిత నయనాలతో చూసింది. నేను తమాషా చేస్తున్నానని గ్రహించిన ఆస్యా నా తమాషాని జాగ్రత్తగా గమనించసాగింది. కాని ఆమె చూపులు "మీ పప్పులేం నా దగ్గర ఉడకవు. నేను అగ్గిపుల్లని వెలిగించలేనంటే వెలిగించలేను, అంతే" అని సవాలు చేస్తున్నట్లు వున్నాయి. అప్పుడామె తన చూపులను తన తల్లితండ్రుల కేసి తిప్పింది. ఆమె చూపులు "నేను అగ్గిపుల్ల వెలిగించలేను. నేను ఏం చెయ్యాలంటాడు ఈయన? నేను వెలిగించలేనని చెప్పండి..." అన్నట్లున్నాయి.

ఇప్పుడిక నా బోధన శాస్త్రీయ ప్రతిష్ఠ అగ్గిపెట్టెమీద ఆధారపడి వుంది. "ఇప్పుడిక ఆస్యాతో మాజిక్ చెయ్యాలి" అన్నాను. నేనా అమ్మాయి చెయ్యి పట్టుకొని యింకో గదిలోకి తీసుకెళ్లాను. మేమిద్దరం ఎదురుబదురుగా కూర్చున్నాం. ఆస్యా ప్రతిఘటించేందుకు సిద్ధంగా కూర్చుంది. నేను నిర్లక్ష్యంగా యిలా అన్నాను:

"నేను నీకు అగ్గిపుల్ల వెలిగించడం నేర్పాలనుకుంటున్నానని నువ్వు నిజంగానే నమ్ముతున్నావా?" అంటూ అగ్గిపెట్టెని నా జేబులో దాచేశాను. ఆస్యా ముఖంలోని ఉద్రిక్తత మాయమై, దాని స్థానంలో ఉత్సుకత చోటుచేసుకుంది.

"నీ వేళ్లు చురుకైనవనుకుంటాను" అన్నాను.

"నాకున్న వేళ్లు అలాంటివి" అని, ఆస్యా తన వేళ్లని చటుక్కున గట్టిగా వెనక్కి వంచింది. ఆమె అతిగా నొక్కి వేళ్లెక్కడ విరుచుకుంటుందో అని భయపడ్డాను.

"అన్నింటి మాటా అలా వుంచి, నీకు భయం లేనట్లుంది, నీకు వేళ్ళు నొప్పెట్ట లేదూ?" అన్నాను.

"అసలు నొప్పే పెట్టలేదు."

"నేను నమ్మను!" అన్నాను.

ఆస్యా నవ్వింది. ఇంక పరస్పర అవగాహన ఏర్పడిందనీ, ఇప్పుడింక వ్యవహారంలోకి దిగవచ్చుననీ నాకు అనిపించింది.

ఉన్నట్లుండి "అన్నట్లు, అగ్గిపుల్లల సంగతేమిటి. అన్నీ నువ్వనుకున్నంత సరళమేమీ కాదు. అసలు సంగతేమిటో నన్ను చెప్పమన్నావా? ఇది నీ వ్యక్తిత్వానికి సంబంధించింది" అన్నాన్నేను యథాలాపంగా.

ఆస్యా తన వ్యక్తిత్వానికి సంబంధించిన ప్రతిదాన్ని గురించీ తెలుసుకోవాలని ఉత్సుకత చూపుతుంది. ఆ మాట కొస్తే, పిల్లలందరికీ యీ ఉత్సుకత వుంటుంది.

"ఇదిగో, నీలో ఆశ్చర్యం గొలిపేటంత అందమైనదేదో అభివృద్ధి చెందుతోంది" అని చెప్పాను. "కాని యీ 'ఏదో' నశించిపోవచ్చు. 'నేనది చెయ్యలేను' అంటూ నువ్వొక అద్భుతమైన ఆట కనిపెట్టావు. కాని యథార్థానికి అది అసలు ఆట కొనసాగింపు. ఏం జరుగుతుందో చూద్దాం, వుండు. ఇప్పటికి పదేళ్ళుగా నీకీ అగ్గిపుల్లలంటే భయం. 'అగ్గి పెట్టె ముట్టుకోకు. నిప్పు దగ్గరకి పోకు' అంటూ నీకు నూరిపోశారు. నీకు ఆ భయం అలవాటై పోయింది. భయం నీలో వేళ్ళూనుకొంది. అది నీలో ఒక్క అగ్గిపుల్లల విషయంలోనే బయట పడదు. అది నువ్వు పియానో దగ్గర కూర్చున్నప్పుడు, లేక నువ్వు చదువుకునేటప్పుడు, లేకపోతే నువ్వు అబ్బాయిలతో మాట్లాడేటప్పుడు కూడా వెల్లడవుతోంది..."

"కాని నాకు నిజంగానే భయం" అంది ఆస్యా. "పయనీర్ కాంపులో కూడా నేనెప్పుడూ అబ్బాయిల్నే చలిమంట ముట్టించమనేదాన్ని..."

"కాంపులో నువ్వెలాగూ అబ్బాయిల్నే మంట వెయ్యమనాలి. అది అబ్బాయిల పనే. మొత్తంమీద అమ్మాయిలు ఎప్పుడూ తాము అబలలమన్న విషయాన్ని వక్కాణించాలి..."

ఓయ్, నా వయోజన స్వరం ఆమెకి ఎంతగా నచ్చిందనుకున్నారు! అన్నట్లు, నేనామెతో పెద్దావిడతో లాగే మాట్లాడాను. ఆమె యింకా "నాకు నిజంగానే భయం" అంటూ గొణుగుతూనే వున్నా, ఇది ఆమెను నాకు బాగా అభిముఖురాల్ని చేసింది. ఆమె స్వరంలోని యిబ్బందికరమైన శంకను నేను అప్పటికే పసిపట్టగలిగాను. నేనప్పుడిక ఇంద్రజాలికుడి మాదిరిగా "నేను నీ భయం వదలగొడతాను!" అన్నాను.

ఆమె నిజంగానే భయావిష్టురాలైనట్లు నాకు అనిపించింది. పదేళ్ళుగా ఆమె బుర్ర లోకి ఎక్కించబడిన భయం యిది. నేను కావాలనే వెనక్కి జరిగి, ఒక అగ్గిపుల్ల గీసి, ఆమె ఆ మంటకి అలవాటుపడేలా చేశాను. ఆ మంట సన్నగా, అందంగా, చిన్న మాజిక్ పతాకంలా వుంది. నేను నా చేతిని మంటమీద పెట్టి, కందిన నా అరచేతిని ఆమెకి చూపాను. అలా

నేను ఒకదాని తర్వాత మరొక అగ్గిపుల్ల వెలిగించాను. తర్వాత నేనా అగ్గిపెట్టెని పక్కన పెట్టి, నా చేతిని ముట్టుకొనేందుకు ఆమెకు అందించాను. అటు తర్వాతనే నేను ఆ అగ్గిపెట్టెని ఆమె చేతిలో పెట్టాను. ఆమె దాదాపు కన్నీళ్లతో "కాని నాకు భయం..." అంది.

"అబ్బే, నువ్వది వెలిగించవు కదా" అంటూ నేనామెను అనునయించాను. "నువ్వు అగ్గిపుల్లని పట్టుకుంటావు. పట్టినే పట్టుకుంటావంతే. దేవుళ్లమీద ఒట్టు. మీ క్లాసు టీచరుమీద ఒట్టు. మీ బొచ్చు కుక్కమీద ఒట్టు. నిన్ను నేను మోసగిస్తే నువ్వు నన్ను శపించు" అంటూ జోక్సుతో నేనామె మనోస్థితిని సరిచేసేందుకు ప్రయత్నించాను.

చేతిలో అగ్గిపుల్ల పట్టుకొని నేనామె చేయి పట్టుకున్నాను. కొన్ని సార్లు మేమిద్దరం కలిసి అగ్గిపుల్ల వెలిగించాం. క్రమంగా నేను నా చేతిని వెనక్కి జరిపాను. పదవ అగ్గిపుల్ల తర్వాతనో యేమో నేనామె భుజాన్ని స్వల్పంగా తాకానంతే. ఆస్యా మొదట అగ్గిపుల్లని చిట్టచివర పట్టుకుంది. కాని అలా వెలిగించడం అసౌకర్యంగా వుండి, అగ్గిపుల్ల అగ్గిపెట్టె పక్కనుంచి జారిపోయింది. అగ్గిపుల్ల అంటుకోలేదు. తర్వాత తనంతట తనే ఆమె అగ్గిపుల్లని అనువుగా వుండే చోట పట్టుకుంది. పదో అగ్గిపుల్ల వెలిగేసరికి "జై!" అని అరిచి, నేనామె చేతిని ఎలా వదిలేశానో, తనే ఆ అగ్గిపుల్లని ఎలా వెలిగించిందో నేను ఆస్యాకి చెప్పాను. ఆమె నా సంతోషంలో పాలుపంచుకుంది. అప్పుడు మేము వంటింట్లో గాసు పొయ్యిల దగ్గరకి వెళ్లాం.

అక్కడ కూడా అగ్గిపుల్ల వెలిగించే తంతు రెట్టించబడింది. ఆస్యాకి భయం వదిలిపోయాక, గాసు పొయ్యిల దగ్గరకి వెళ్లేందుకు భయపడే అమ్మాయిలు స్కూల్లో చాలా మంది వున్నారని ఆస్యా నాతో చెప్పింది. నేనామెతో గునగునగా యిలా చెప్పాను:

"మీ అమ్మనీ, నాన్ననీ ఆశ్చర్యపరుద్దాం. నీకు టీ కాచడం వచ్చునా?"

"రాకేం" అంది ఆస్యా.

కాని ఆమె ఆ సాయంత్రం వెంటనే టీ తయారుచెయ్యలేదు. ఆస్యా తన కొత్త నైపుణ్యాన్ని ప్రదర్శించింది. ఆమె మంటతో గంభీరంగా వ్యవహరించింది. అగ్గిపుల్లల్నీ, గాసు పొయ్యిల్నీ ఉపయోగించగలనన్న నమ్మకం కలిగేదాకా పూర్తిగా ఓ అగ్గిపెట్టెడు పుల్లలు వెలిగించింది.

పదిహేడవ సన్నివేశం. అతీత సమస్యల పరిష్కారం దిశగా పిల్లల ప్రయత్నం వల్ల కలిగే సంతుష్టి

చేస్తే అంతా చేస్తాను, లేకపోతే యేమీ చెయ్యననే గుణం పిల్లల్లో స్వభావసిద్ధంగా ఉంటుంది. పిల్లల అభివృద్ధి క్రమంలో ఒకానొక దశలో ద్వితీయ ప్రాధాన్యం కల పనులు వాళ్లకి భారప్రాయమవుతాయి. సర్వ సాధారణంగా తల్లితండ్రులు పిల్లల్ని అది "తీసుకురా,"

యిది "తెచ్చిపెట్టు," అది "ముయ్యి" అంటూ నౌకరు స్థానంలో వుంచుతారు. కాని ఏదో ఒక రోజున—అది ఎంత త్వరగా అయితే అంత మంచిది—పిల్లలకి గది అంతా శుభ్రం చేయడం, ఫలహారం తయారుచేయడం, తమ్ముణ్ణో లేక చెల్లెల్నో స్కూలుకి సిద్ధంచేయడం వంటి "పూర్తి" పనులు అప్పగించేందుకు పెద్దవాళ్ళు మారాలి.

పిల్లలు ఆటల్లో ఎలా ప్రవర్తిస్తారో గుర్తుచేసుకుందాం. ఆట ఆడే పిల్లల్లో "ద్వితీయ ప్రాధాన్యం కలిగిన పనులు" మాత్రమే నిర్వర్తించేవాళ్ళు ఆటలో ఆసక్తిని కోల్పోతారు. పిల్లలందరూ ఇటుకలు అందించడం మాత్రమే కాకుండా, ఇల్లు కట్టాలని కోరుకుంటారు. పిల్లల్లో ప్రతి ఒక్కరూ "అవీ యివీ తీసుకురావడం, అందించడం" కాక, వంట ఆద్యంతం తయారుచేసేందుకు ప్రయత్నిస్తారు.

పెందరాళే లేచి "మొత్తం నాస్తా" తయారుచెయ్యాలని ఆస్యాకి చెప్పినప్పుడు ఆమె అందుకు సమ్మతించింది. "సరే, మీరు లేచేసరికల్లా నాస్తా టేబిలుమీద సిద్ధంగా వుంటుంది" అంది. నిజానికి పెద్దవాళ్ళలో ఏ ఒక్కరూ ఆ ఉదయం నిద్రపోవడం లేదు. వాళ్ళలో ప్రతి ఒక్కరూ ఆమె జావ ఎలా కాస్తోందో, సలాద్, టీ ఎలా తయారుచేస్తోందో అంటూ ఆదుర్దాపడ్డారు. కాని ఆ చిన్నారి గృహిణి తను సకాలంలో అన్నీ తయారుచేస్తానా లేదా, నిర్ణీత సమయానికి ముందే పెద్దవాళ్ళలో ఎవరైనా వంటింట్లోకి వచ్చేస్తారా అంటూ కంగారుపడింది.

"మమ్మల్ని నాస్తాకి టేబిల్ దగ్గరకి పిలిచినప్పుడు మా కళ్ళకి ఓ కొత్త పిల్ల కనిపించింది. వెనకటి నిస్సహాయ బాలిక ఆస్యాకీ యీ కొత్త పిల్లకీ పోలికే లేదనిపించింది. వంటింట్లో ఓ యువ గృహిణి హడావిడిగా తిరుగుతోంది. దాని ముఖంలో ఎంతో సంతోషం, ఎంతో హుషారైన ఉత్తేజం మెరుస్తున్నాయి. నేను దాన్ని ముద్దుపెట్టుకోకుండా తమాయించుకోలేకపోయాను. అది మేము ఏమంటామా విందామని నిరీక్షిస్తోంది. మేమైనా పొగడ్తలో పితలాటం చూపలేదు. జావ కొంచెం అడుగంటిన మాట నిజమేననుకోండి. అయినా మేమా సంగతి పట్టించుకోలేదు. అది సలాద్‌లో ఉప్పు వేయడం మరచిపోయింది. 'అయితే మటుకు మునిగిపోయిందేమిటి? ఉప్పు ఎక్కువైతే కష్టం గాని, తక్కువైతే కలుపుకోవచ్చు కదా' అన్నాం మేము" అని చెప్పింది ఆస్యా తల్లి.

నాస్తా తయారుచెయ్యడం అన్నది ఒక ఆట లాంటిదని వేరే చెప్పనక్కర్లేదు. కుటుంబంలో అవసరమైనది సరిగా యిలాంటి ఆటే. వాళ్ళ సంబంధాల్లో ఆహ్లాదకరమూ, ఆనందదాయకమూ అయిన ధోరణిని ప్రవేశపెట్టేది సరిగా యిలాంటి ఆటే. ఇది క్రీడేతర ప్రతివర్తనలకు దారితీసి, నైపుణ్యాలుగా పెంపొంది, అలవాట్లుగా అవుతాయి.

పద్దెనిమిదవ సన్నివేశం. ఆటనుంచి ఆటకానిదానికి పరివర్తనకి కొంత విరామం, నిర్దిష్టమైన కొంత "రొడ్డ కొట్టుడు" అవసరమని గుర్తుంచుకోండి

నేను వెళ్లేసరికి ఆస్యా తల్లి కలత చెంది వుంది.

ఆమె యిలా చెప్పడం మొదలెట్టింది:

"పది రోజుల పాటు ఆస్యా ఆదర్శప్రాయమైన అమ్మాయిగా వుంది. తనంతట తను ప్రొద్దుటే లేచింది. ఇల్లు తుడిచి శుభ్రంచెయ్యడంలో నాకు సాయం చేసింది. నాస్తా తయారుచేసింది. కాని నిన్న దానికేం తిక్క వచ్చిందో గాని, గిన్నె తీసి విసిరి కొట్టింది. పింగాణీ పూత ఊడిపోయేటంత గట్టిగా కొట్టింది. అది నన్ను కసురుకుని, చస్తే వంటింట్లో మళ్లీ అడుగుపెట్టనంది. నేను దానితో మాట్లాడాలని ప్రయత్నించాను, కాని అది యింకో గదిలోకి విసురుగా వెళ్లిపోయింది. సాయంత్రం ప్లేట్లు కడుగుదాం సాయం చేయమని అడిగాను. నాకు జరూరు పని వుందన్న విషయం దానికి తెలుసు... కాని అంతలోనే అది బండరాయిలా మారిపోయింది... నేను దానితో మాట్లాడ్డం మానేశాను. అది రెండు రోజుల కంటె ఎక్కువ నాతో మాట్లాడకుండా వుండలేదని నాకు తెలుసు. తర్వాత నాతో రాజీపడి క్షమాపణ అడుగుతుంది. అయితే యింతకీ అది కాదు అసలు సంగతి. దానిలో వచ్చిన మార్పు మటుమాయమైపోయింది. అదీ అసలు సంగతి."

"ఇటీవల నాస్తా తయారుచెయ్యడం అనే ఆటలో ఆస్యా వెనకటి కంటె బాగా తక్కువ ఉత్సాహం చూపుతున్న సంగతి మీరు గమనించారా?" అని నేను ప్రశ్నించాను.

"ఔను సుమా, గత కొద్ది రోజులుగా అది నాకు సాయం చేస్తోంది గాని, దాని ఆలోచన ఎప్పుడూ ఎక్కడో వుంటోంది. అది అస్తమానం ఒక పనికి మరోటి చేస్తోంది. ఉప్పు తియ్యమంటే పంచదార తీస్తోంది. పాలు పొంగిపోతూంటే పరధ్యానంగా వుంటోంది. ఒక పొయ్యి ఆన్ చేసి మరో పొయ్యి అంటిస్తోంది..."

"మీరు కోపపడ్డారా? మీరేమైనా సాధించారా?"

"కోపం రాదూ మరి? నిన్న అది కడిగిన ప్లేట్లు మురికి గుడ్డతో తుడిచింది. మొన్న నేమో టేబిల్‌ని శుభ్రమైన తువ్వాలుతో తుడిచింది..."

నేను అన్నా ఇవానొవ్నాని శాంతపరచి, కొంపముంచుకుపోయే ప్రమాదం యేమీ జరగలేదనీ, ఖంగారు పడిపోవలసిన అవసరమేమీ లేదనీ అనునయించాను. ఇప్పుడీ తల్లికీ పిల్లకీ మధ్య సంబంధాల్లో వచ్చిన ప్రతిష్టంభనను తొలగించడం ఎలాగో చూద్దాం. ఈకింది వాస్తవంతో మొదలుపెడదాం. అన్నా ఇవానొవ్నా మొదట తన కూతురు అన్నీ స్వయంగా చేసేలా ఆకర్షించేందుకుగాను ఆట పద్ధతిని వినియోగించింది. ఆస్యా నాస్తా తయారుచేసే ఆ ఆట ఆడింది. ఆట ఆటకానిదానితో విభేదించేదల్లా ఆస్యా వాడే వస్తువులు బొమ్మవి కాక నిజమైనవి కావడంలో మాత్రమే. అన్ని ఆటల్లో మాదిరిగానే, యీ పరిస్థితికి మూలంలో

వుండేది ఆసక్తి, ఆనందాలే. అన్ని ఆటల్లో మాదిరిగానే, యిందుకు ఆ అమ్మాయిలో ప్రయత్నం, నిబ్బరం, ఏకాగ్రత వుండాలి. ఈ ఆటకి ముందు ఆ అమ్మాయి ఎలా వుండేదో జ్ఞాపకం చేసుకుందాం: ఆమె ఏ పనీ చెయ్యలేకపోయేది, చివరకు అగ్గిపుల్ల కూడా వెలిగించ లేకపోయేది. ఇంతలో ఒక్క సారిగా అత్యంత వాస్తవిక కార్యకలాపాలకు పరివర్తన సంభ వించింది. ఆట పరిస్థితిలో కాకపోతే తను చేసిన పని సైతం ఆస్యా చేసి వుండేది కాదు. అయితే ఆట సారాంశం ఏమిటంటే, అది ఎప్పుడో ఒకప్పుడు ముగుస్తుంది, లేకపోతే మరొక దానిలోకి మారుతుంది. ఒకవేళ అది ముగియకపోతే దాన్ని ఆట పద్ధతుల్లోనే కొనసాగించాలి. ఆన్నా ఇవానొవ్నా యీ ఆట నిబంధనలను ఉల్లంఘించింది. ఆవిడ దెప్పిపొడవడం, ఆదే శాలివ్వడం, కేకలెయ్యడం వంటి ఆటకి సహజం కాని పద్ధతిలో వ్యవహరించడం మొదలు పెట్టింది. అంతే కాదు, తన కూతురుకి యీ ఆట అంటే విసుగు పుట్టిందన్న మరో అంశాన్ని కూడా ఆవిడ పరిగణనలోకి తీసుకోలేదు. ఏదో ఒక మాదిరి సహజ విరామం అవసరం. ఏ నాలుగో రోజో, ఐదో రోజో తర్వాత ఆవిడ తన కూతురితో "బహుశా నీకు విసుగ్గా వుం దేమో. రేపు నాస్తా నేనే తయారుచేస్తాను, నువ్వు మరి కొంచెం సేపు పడుకుందువు గాని..." అని వుండవలసింది.

ఈ మాటలకి ఆ అమ్మాయినుంచి కొంత ప్రతిఘటన వచ్చి వుండేది, ఆమె "అబ్బే, నాకు విసుగెట్టలేదు" అని వుండును. సాధారణంగా పిల్లల దగ్గర్నుంచి అలాంటి అభ్యం తరం రావాలని పెద్దవాళ్లు అనుకుంటారు. ఒకవేళ అలాంటిదేమీ లేకపోయినా ఎవరూ నిరుత్సాహపడకూడదు. ఆ పిల్ల నిజంగానే అలసిపోయింది. "ఆడుతున్న ఆటని" ఆమె ఆపాలి. ఈ విరామాన్ని ఒక మాదిరి సమీక్షకి వినియోగించుకోగలుగుతాము. ఆస్యా గడిపిన అంతకు ముందరి హడావిడి ఉదయాలు చర్చనీయాంశాలు కావాలి. టేబిలు సర్ది తుడవ డం, గిన్నెలు కడగడం, వగైరాల్లో ఆమె చేసిన పొరపాట్లను గురించి ప్రస్తావించవలసిన తరుణం యిది. మూడు నాలుగు రోజులు యీ విరామం తర్వాత కార్యకలాపాల్లో కొత్త వేగానికి మారవచ్చు. ఈ కార్యకలాపాలు యింక ఎంత మాత్రం ఆట ప్రాతిపదికగా ఉం డనక్కర్లేదు. ఈ విరామ కాలంలో ఏమీ చెయ్యనక్కర్లేదని అర్థం కాదు. ఒక ఉదయం పూట మీరు ఆ అమ్మాయిని వంటింట్లోకి పిలిచి, మీరు అవసరమైనవనుకున్న వాటన్నిం టినీ ఆమెకి చూపించవచ్చు. ఉదాహరణకి, టీ తయారుచెయ్యడంలో మెళుకువలన్నీ చెప్ప వచ్చు. దీనిలో ఆసక్తికరమైనదే కాక, అపూర్వమైనది కూడా బోలెడంత వుంది. సలాద్ తయారుచెయ్యడంలో అత్యంత ఆకర్షణీయమైన పద్ధతులను మీరు ఆమెకి చూపించవచ్చు. ఆమెకి యిదొక కొత్త అనుభవం, చక్కటి అభిరుచికి సంబంధించిన అనుభవం అవుతుంది.

ఆర్తెక్‌లో పిల్లల పోటీ ఒకదానికి నేను హాజరయ్యాను. దాని పేరు "తరుణ గృహి ణుల నిలయం." వివిధ దేశాలకు చెందిన పిల్లలకి ఆహార పదార్థాలు యిచ్చారు. వాటితో వాళ్లు నాస్తా తయారుచేయాలి. ఉక్రెయిన్, మొల్దావియాలనుంచి వచ్చిన సోవియట్

అమ్మాయిలూ, యుగోస్లావియా, ఆస్ట్రేలియాలనుంచి వచ్చిన అమ్మాయిలూ మంచి రుచికరమైన వంటకాలు తయారుచేశారు. ఆస్ట్రేలియన్ అమ్మాయి జీన్ హైగేట్ వంటకాలు ఎంత ఆరితేరినట్లు తయారుచేసిందంటే, ఆమె వంటకాలను చూసి అందరూ సమ్మోహితులయ్యారు. ఆమె తయారుచేసిన సలాద్ వర్ణ సమ్మేళనం కూడా ఎంతో అందంగా వుంది. వీటన్నింటినీ ఆమె ఎక్కడ నేర్చుకుందో నేను తెలుసుకోవాలని అనుకున్నాను. తన టీచరు దగ్గర, తన తల్లితండ్రుల దగ్గర, అంతే కాక హోమ్‌సైన్సు టీచరు దగ్గర తను యీ కళ నేర్చుకున్నట్లు ఆమె చెప్పింది. పాక సౌందర్య గ్రహణ శాస్త్రం అనదగిన ప్రత్యేక పాఠాలు తన హోమ్‌సైన్సు టీచరు నేర్పినట్లు ఆమె చెప్పింది. సూక్ష్మంగా చెప్పాలంటే, పిల్లల్లో మనం అన్నింటిపట్లా, అన్నింటి ద్వారా అభిరుచిని పెంపొందించాలి.

మొత్తంమీద అమ్మాయిలు "పాక సౌందర్య గ్రహణ శాస్త్రం"పట్ల ఆకర్షితులవుతారని అంటూ వుంటారు. మధ్య ఎర్రటి బీట్‌రూట్ బొడ్డుతో కేరట్ దుంపతో తయారు చేసిన పూలన్నా, తెల్లటి గుడ్డుమీద ఎర్రటి టొమాటో టోపీతో చిన్నచిన్న పుట్టగొడుగులన్నా, బంగాళ దుంపతో తయారుచేసే అందమైన పూలన్నా, మెరిసే మిరియాలు, తళతళమనే పచ్చటి రకరకాల ఆకులు, చిన్నచిన్న రెమ్మలతో హెర్రింగ్ చేపలమీద వెండిలా తెల్లటి ఉల్లి రింగులు ఎంతో చక్కగా అమరుతాయి... సౌందర్య భావంతో బాటు తిండి పదార్థాలపట్ల పొదుపు వైఖరి కూడా వాళ్ళకి నేర్పాలి. ఆటలకీ ఆటలు కానివాటికీ మధ్య ఎప్పుడూ సరిహద్దులో వుండే యీ బోధన స్పష్టమైన ఆట సన్నివేశాలకీ రోజువారీ పనుల నియమబద్ధ లయకీ మధ్య విరామాలను నింపాలి. ఆటలో ఆట కాని భావి కార్యకలాపాల నమూనా రేఖామాత్రంగా వుంటుంది. రోజువారీ బాదరబందీలతో కూడిన జీవితమే నైపుణ్యాలను తీర్చిదిద్ది, అలవాట్లకు మెరుగులు దిద్దుతుంది.

పంథొమ్మిదవ సన్నివేశం. మీరు కేకలు వేసేందుకు దిగజారితే మీ పెంపకం ద్వారా సాధించిన ఫలితాలన్నింటినీ నాశనం చేసుకుంటారు

గొడవ తప్ప, పిల్లల్ని కేకలేయడం వల్ల కలిగే ఫలితం ఏమీ వుండదు. అది వైషమ్యం కలిగించి శాశ్వతమైన ఎడబాటుకి దారితీయవచ్చు. అంటే, మీరు మీ పిల్లల ఆపేక్షను కోల్పోవాలని అనుకుంటే, మీరు ఎడతెగకుండా వాళ్ళని కేకలెయ్యాలన్న మాట. కాని మీరు కోరుకునేది యిది కాదు. అందుకని పిల్లల్ని కేకలెయ్యడం ఎన్నడూ పనికి రాదు. కేకలెయ్యడం మనుషులకి యోగ్యమైంది కాదు. కేకలెయ్యడమన్నది తను కావాలనుకునే పనులు చేయించుకునే అత్యంత సరళ, ఆదిమ రూపం. కేకలు ధర్మబద్ధమైన కోపంనుంచి కాక అక్కసునుంచి ఉత్పన్నమవుతాయి. పిల్లల పెంపకంలో అక్కసుకి చోటు వుండకూడదు.

ఉదయం పెద్దవాళ్ల కేకలు విన్న పిల్లలు ఐదారు పాఠాలను ప్రశాంతంగా వినే మానసిక స్థితిలో వుండరు. పైపెచ్చు, "కోపపు సంకేతం" వాళ్ల మనసుల్లో చొప్పింపబడు

తుంది. ఇది తమ మిత్రులతో, టీచర్లతో వాళ్ల సంబంధాల క్రమంలో పొగరుబోతుతనం, అవమానించడం, అభిప్రాయభేదం వంటి రూపాల్లో బయటపడుతుంది.

ఇరవయ్యో సన్నివేశం. మీ పిల్లల ఆరోగ్యం మీ ప్రధాన బాధ్యతల్లో ఒకటని గుర్తుంచుకోండి

ప్రముఖ సోవియట్ బోధన శాస్త్రజ్ఞుడైన వి. సుహోమ్లిన్‌స్కి సృజనాత్మక అనుభవం యీ విషయంలో గమనీయమైనది.

ఆయన రాసిన "పిల్లలకే నా హృదయం అంకితం" అనే పుస్తకం స్కూలు పూర్వ, స్కూలు వయస్సు పిల్లలకు శిక్షణ కరపే విషయంలోనూ, అలాగే కుటుంబ పెంపకంలోనూ, సాంఘికంగా ఉపయోగకర కృషి అలవాట్లను అలవరచడంలోనూ ఆయన వ్యాసాల సంకలనం. ఈ పుస్తకంలో "ఆరోగ్యాభివృద్ధి రస్తు" అన్నది ఒక ప్రకరణం. దానిలో సుహోమ్లిన్‌స్కి యిలా రాశాడు: "బోధకుడి ముఖ్య కర్తవ్యం పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్త వహించడ మని మళ్లీ మళ్లీ చెప్పడానికి నేను సంకోచించను. పిల్లల బౌద్ధిక జీవితాలు, ప్రపంచ దృక్పథాలు, స్థిరమైన జ్ఞానం, ఆత్మ విశ్వాసం వాళ్ల ఉల్లాసంమీదే ఆధారపడి వుంటాయి. వాళ్ల చదువులో మొదటి నాలుగేళ్లలోనూ వాళ్లని గురించిన నా అందోళన ముక్కాలు మువ్వీసం వాళ్ల ఆరోగ్యానికి సంబంధించినదే అయి వుంటుంది."* సుహోమ్లిన్‌స్కి వాళ్ల రోజువారీ జీవితాల హేతుబద్ధమైన కార్యకలాపాలు, వ్యాయామం, తిండి క్రమాలమీద ఆధారపడిన ఆరోగ్య పరిరక్షణ విధానాన్ని రూపొందించాడు. అయితే యీ విధానంలో ప్రధానాంశం ఆరుబయట సాధ్యమైనన్ని ఎక్కువ రకాల పనులు చెయ్యడం. "ఆరుబయలు పాఠశాల" ప్రకృతి అధ్యయనం, జంతు పోషణ, రష్యన్ భాష, గణిత, జీవ శాస్త్రాల్లో పాఠాలకు సమాచార సేకరణలతో కూడి వుంటుంది.

ఆరోగ్య పరిరక్షణ విధానం ప్రయోజనకర సాంఘిక శ్రమైక కార్యకలాపాలతో విడ దీయరాని విధంగా ముడిపెట్టబడింది. ప్రతి వేసవిలోనూ సుహోమ్లిన్‌స్కి పిల్లలతో బాటు కొమ్మలతో, మొక్కలతో నిర్మించిన పర్ణశాలల్లో గడుపుతూండేవాడు. "మేం ప్రభాత వేళలో లేచేవాళ్లం, ప్రకృతి పునస్సృష్టించలేని అందాన్ని ఆస్వాదించేవాళ్లం. రాత్రి కలల తర్వాత లేచి తుషారంమీద తిరిగేవాళ్లం, సెలయేటి నీటిలో కడుక్కునేవాళ్లం. ఆ నీటిని చెక్క పీపాల్లో తెచ్చి వాష్ స్టాండులో పోసేవాళ్లం. పిల్లలకి ప్రతీదీ సంతోషమే: ఉదయం

---

* చూ: వి. సుహోమ్లిన్‌స్కి, "పిల్లలకే నా హృదయం అంకితం," "ప్రగతి" ప్రచురణాలయం, మాస్కో, 1987, పేజి 154. – సం.

వ్యాయామాలు, చన్నీళ్ల స్నానం, టొమాటోల తోటి ఉడకబెట్టిన బంగాళా దుంపల్ని తినడం, పుచ్చకాయని తినడం. నాస్తా తర్వాత మేం పనిచేసేవాళ్లం..."*

ప్రకృతితో పిల్లల యీ మాదిరి సాంగత్యాన్ని కొందరు విమర్శకులు జానపద భావోద్వేగపూరితమైనదిగా పరిగణిస్తారు. సమరసమైన అభివృద్ధికి విద్యకి అతి గొప్ప మూలమైన ప్రకృతితో మానవ ఆత్మ ఐక్యత ఎంత అవసరమో వాళ్లు గుర్తించకపోవడమే యిందుకు కారణం.

సుహోమ్లిన్స్కీ మహా శ్రద్ధగా ఒకదాని తర్వాత మరొకటిగా మానవ వ్యక్తిత్వం రూపొందడానికి సంబంధించిన సంశ్లిష్ట యంత్రాంగాన్ని వివరిస్తాడు. దీనిలో పనే ఆనందానికి మూలాధారం, తిరుగులేని మానవ అవసరం. పరిశోధన ఆధారంగా పిల్లల అస్వస్థతలకీ, పిల్లల సోమరితనానికీ కుటుంబ పెంపకంలోని పొరపాట్లే కారణమని ఆయన నిర్ధారణకి వచ్చాడు. ఆయన పిల్లల పెంపకాన్ని సరిగా తల్లితండ్రులతో ప్రారంభిస్తాడు. అలాగే ఆయన సరిగా పిల్లల ఆరోగ్య పరిరక్షణతోనే వాళ్ల నైతిక పెంపకాన్ని ప్రారంభిస్తాడు. పిల్లల్లో 20 శాతం మంది ఉదయం నాస్తా తీసుకోరనీ, వాళ్లకి ఆకలి వుండదనీ, 30 శాతం మంది ఉదయంపూట వాళ్లు తినవలసినదాని కంటె తక్కువ తింటారనీ, 28 శాతం మంది సగం నాస్తా మాత్రమే చేస్తారనీ, కాగా 22 శాతం పిల్లలు మాత్రమే మామూలుగా తీసుకోవలసినంత నాస్తా తీసుకుంటారనీ సుహోమ్లిన్స్కీ పరిశోధన ద్వారా కనుగొన్నాడు.

ఆకలి లేకపోవడం ఆరోగ్యానికి భంగకారి, రకరకాల అస్వస్థతలకీ, జబ్బులకీ మూలం. దీనికి కారణం పిల్లలు కొన్ని గంటల పాటు తాజా గాలి లేని తరగతి గదుల్లో కూర్చుంటారు (అందుకే క్లాసు పాఠాలకి మధ్యమధ్య చేతిపనులు, ఆరుబయట తాజా గాలిలో వుండటం అవసరం).

పిల్లలకి చదువుపట్ల తీవ్రమైన అయిష్టత ఏర్పడినప్పుడు, అది వాళ్ల జీర్ణ కోశాన్ని దెబ్బ తీసి, ఉదరకోశ వ్యాధుల్ని కలిగించిన అనేక సందర్భాలు గమనించాడు సుహోమ్లిన్స్కీ. అందుకే ఆయన వినీలాకాశం కింద తన "సంతోష చంద్రశాల"ను నిర్మించాడు. అందుకే ఆయన తన విద్యార్థుల్ని చలిమంట చుట్టూ సమావేశపరచి ఆరుబయట తాజా గాలిలో ఆటలు ఆడించాడు.

పిల్లల స్వాతంత్ర్యాన్ని పెంపొందించేటప్పుడు సుహోమ్లిన్స్కీ పని తేలిగ్గా వుండనవసరం లేదని నిరంతరాయంగా వక్కాణించి చెప్పాడు. పనిలో కష్ట స్థాయి పిల్లల్లో పరిణతికి దారితీసే అతి ముఖ్యమైన క్రమాన్ని నిర్ణయిస్తుంది. అయితే యీ కష్ట స్థాయి పిల్లలకి పని తగినంత వుండేలా, నైతికంగా శిక్షణాత్మకమైనదిగా, బౌద్ధికంగా ఆకర్షణీయమైనదిగా,

---

* అదే పుస్తకం, పేజి 160.

ఉత్తేజకరమైనదిగా వుండాలి. అది మనుషులకి ఆనందదాయకమైనదిగా వుండాలి, ఈ ఆనందం పిల్లల చదువునూ, వాళ్ల జీవితాలనూ సమ్మోహకరం, మరెంతో సజీవం చెయ్యాలి.

పిల్లల్ని స్కూల్లో యింకా చేర్చుకోక ముందే వాళ్ల తల్లితండ్రుల్తో సుహొమ్లీన్స్కి ఒక ఒప్పందం చేసుకున్నాడు. పిల్లల్లో ప్రతి ఒక్కరూ తమ తండ్రులకి, తల్లులకి, సమష్టి క్షేత్రానికి లేక పాఠశాలకి సంబంధించిన ప్రజాహిత కార్యాలను గురించి తెలుసుకోవాలనడమే యీ ఒప్పందం. ప్రతి ఒక్క భావి మొదటి తరగతి విద్యార్థికీ ఒక మేకపిల్ల అప్పగించబడుతుంది. వాళ్లు యీ మేకపిల్లని సాకాలి. ఈ చిన్న పిల్లలు మేకపిల్లను ఎలా సాకడమా అని ఎలా ఆలోచిస్తారో ఊహించుకుందాం. వాళ్లు తమ తొలి సిసలైన పనిని ఎలా ఎదుర్కొంటారో, శ్రమైక సౌందర్యాన్ని వాళ్లు మొదటి సారి ఎలా అనుభూతం చేసుకుంటారో, తాము చూపిన దయా భావపు తొలి ఆనందాన్ని ఎలా అనుభవిస్తారో, వాళ్లని వాళ్లు పరీక్షించుకోవలసిన అవసరం ఎలా ఉత్పన్నమవుతుందో ఊహించుకుందాం.

శ్రమకి సంబంధించిన అలవాట్లనుంచి విద్యాభ్యాసంలో సౌందర్యగ్రహణ శాస్త్రీయ అంశాలనూ, నైతిక అంశాలనుంచి శారీరక అంశాలనూ వేరుచేయడం సాధ్యమా? రకరకాల మానవ సంతోషంతో అను సంధానితమైన పిల్లల బౌద్ధిక, శారీరక శక్తుల యీ మహత్తర ఐక్యతే ఆధునిక పెంపకానికీ, ఆధునిక సమాజానికీ అత్యంత అనివార్యమైన సమరసతకి ప్రతిబింబం.

ఇరవయ్యొకటవ సన్నివేశం. సాధారణ స్వరం ధోరణిలో మార్పు పిల్లల పెంపకానికి ప్రతిఘటనను తొలగిస్తుంది

నాస్తా సమయంలో సంభాషణ సాధారణంగా యిలా సాగుతుంది:

''నాకు తినాలని లేదు'' అంటాడు పిల్లవాడు.

''పోనీ యిది కొంచెం తిను...'' అని పట్టుపడుతుంది తల్లి.

''నాకు యిది కూడా అఖ్ఖర్లేదు...''

''పోనీ, కొంచెం టీ అయినా తాగు...''

''నాకు టీ, గీ అఖ్ఖర్లేదు!''

''నువ్వు చదువుకోవాలి, తినకపోతే ఎలా?..''

ఇలా వుంటుంది నాటకం. ఈ నాటకంలోని పాత్రలు బాధపడే తల్లి, విజయుడైన బిడ్డ. తల్లి బలవంతం చేసే కొద్దీ పిల్లలు మరింత ప్రతిఘటిస్తారు. పిల్లలు తమ పాత్రలో కొట్టుకుపోవడమే కాకుండా, తమ తల్లుల బతిమలాటలో స్వార్థపూరితమైన సంతోషం కూడా పొందుతారు. కొందరు పిల్లలు భోజనాల బల్ల దగ్గరకి వచ్చేసరికి చాలా ఆకలిగా వున్నా కూడా, ''నాకు ఆకలి లేదు'' అని కొన్ని సార్లు అంటూవుంటారు. ప్రతి రోజూ తిండికి ముందు ఈ అభ్యంతరాలు ఉపోద్ఘాతప్రాయమైనవి. ''నాకు ఆకలి లేదు,

తినాలని లేదు'' అన్న తర్వాత వాళ్లు నాస్తావో, మధ్యాహ్న భోజనమో ఏమీ మిగల్చకుండా తినేస్తారు. అందుకే పిల్లల వైద్యులు పిల్లల్ని తిండి తినమని బలవంతం చెయ్యకూడదనీ, వాళ్ల ముందు తిండి పెట్టి, భోజనాల గదిలో పిల్లల్ని కొంత సేపు ఒంటరిగా వదిలెయ్యడం మంచిదనీ సలహా చెప్తారు. అయితే పిల్లలు మొదటి ఉదయమే తినడం మొదలుపెడతారన్న హామీ లేదనుకోండి. అందుకు భిన్నంగా, కొన్ని సందర్భాల్లో తమపట్ల వైఖరి మారినప్పుడు పిల్లలు నాస్తా తీసుకోకుండా నిరసన ప్రదర్శించవచ్చు. అయినా కూడా బోధన శాస్త్రీయ రీత్యా మీరు కొంత ప్రయోజనం పొంది వుండవచ్చు: మామూలు ప్రవర్తన మారి ఓ కొత్తదానికి ప్రాతిపదిక ఏర్పడి వుండవచ్చు. ఈకింది సందర్భం పరిశీలిద్దాం.

నాస్తా సమయంలో ఆస్యాతో వ్యవహరించి వుండగల పద్ధతులన్నింటినీ ఆన్నా ఇవానొవ్నాతో నేను సవివరంగా చర్చించాను. మా ఊహల ప్రకారం ఆమెని చూసిన కొత్త తీరుపట్ల ఆస్యా క్రుద్ధురాలై వుండాలి. జరిగింది సరిగ్గా అదే. ఆ ఉదయం జరిగిన ప్రతి అంశపు మనస్తాత్విక పార్శ్వమూ ప్రత్యేక ఆసక్తిదాయకమైనది. అందుకే దాన్ని గుర్తు చేసుకోవడం అవసరం.

నాస్తా టేబిలుమీద సిద్ధంగా వుంది. కాని ఆన్నా ఇవానొవ్నా ఆస్యాని రమ్మనలేదు. ఆస్యా టేబిలు చుట్టూ తచ్చాడింది. కాని కూర్చోవాలో, వద్దో నిర్ణయించుకోలేకపోయింది. తల్లినుంచి బుజ్జగింపులు గాని, సాధింపులు గాని లేవు. ఇదో కొత్త పరిస్థితి.

''అమ్మా, యీ పూట నాస్తా యేమిటి?'' అంది ఆస్యా చిలిపిగా.

''అన్నీ బల్లమీదే వున్నాయి'' అని జవాబిచ్చింది తల్లి తాపీగా.

ఆస్యా చెమ్చాతో జావ తీసుకుంది.

''ఏమిటీ నలక యిందులో?''

తల్లి సమాధానమివ్వలేదు.

''టీలో పంచదార వేశావా?'' ఆస్యా ఓ పట్టాన వదలకుండా అంది.

''నువ్వే చూడు...''

తన తల్లి ''ప్రవర్తన''పట్ల కుపితురాలై ఆస్యా టేబిల్ దగ్గరనుంచి లేచి, తల్లికి వీడ్కోలు చెప్పకుండా వెళ్లిపోయింది.

ఆ సాయంత్రం తల్లితో ఆమె యిలా చెప్పింది:

''క్లాసులు జరుగుతున్నంత సేపూ కడుపు నొప్పి, తల నొప్పి నన్ను సతాయించాయి. వా బుర్రని పాఠాలమీద మగ్నం చేయలేకపోయాను...''

''అలాగా?'' అంది వాళ్ల అమ్మ విభ్రాంతిగా.

'' 'అలాగా?' అంటే నీ ఉద్దేశం?'' అంది కూతురు కోపంగా. ''కూతురు స్కూలుకి ఆకలి కడుపుతో వెళ్తుంది, నువ్వేమో 'అలాగా!' అని ఊరుకుంటావు...'' అనడమే ఆమె ఉద్దేశం.

"నీకు కడుపు నొప్పి ఎందుకొచ్చింది?" అని అడిగింది ఆమె తల్లి.

"నేను ప్రొద్దుట ఏం తిన్నాను? ఓ గుక్కెడు టీ నీళ్ల తాగాను, అంతే కదా."

ఆ మరుసటి ఉదయం కూడా యిదే తంతు సాగింది. "నాస్తా దిట్టంగా తిను. నీకు మళ్లీ ఏ కడుపు నొప్పీ రాదు" అంది తల్లి.

ఆవిడ వంటింటినుంచి బయటకి వెళ్లింది. ఆ ఉదయం తల్లి రెట్టించకుండా ఆస్యా కడుపు నిండా నాస్తా చేసి, ప్లేట్లు కడిగేసి స్కూలుకి వెళ్లింది.

నేనీ కథని మరో తల్లికి చెప్పాను. ఆవిడ కూతురు కూడా ఉదయంపూట యిలాగే పెంకె వేషాలు వేస్తూండేది.

"మీరు చెప్పింది అర్థం లేదు. మా స్వేతాని తినమని బలవంతం చేయకపోతే సంతోషిస్తుంది. అసలు సంగతేమిటంటే, దానికి నిజంగానే ఆకలి వుండదు. అది పెంకెది కాదు. స్వేతా చాలా నీరసంగా వుంటుంది. దాని చేతులు పూచిక పుల్లల్లా వుంటాయి" అంది ఆ తల్లి.

నా మటుకు నాకు స్వేతా మామూలుగా ఎదిగిన పిల్లలా కనిపించింది. ఆమె బలహీనంగా వున్నట్లేమీ కనిపించలేదు. ఆమె చేతులు అందరి చేతుల్లా మామూలుగానే వున్నాయి. ఆమె బుగ్గలు గులాబి వన్నెలో వున్నాయి. ఆమె కొంచెం నాదారిగా వున్నట్లు వుంది. ఆమె శరీర కృషి చెయ్యకపోవడమే యిందుకు కారణం.

"మీ అమ్మాయికి ఐదేళ్ల వయస్సప్పటినుంచి యీనాటిదాకా తిండి పెట్టే విషయంలో మీ అమ్మాయిపట్ల మీ వైఖరిలో వచ్చిన మార్పేమిటి?" అని అడిగాను.

ఆ తల్లి కొంచెం సేపు ఆలోచించి, "మొత్తంమీద మార్పేమీ లేదు" అని సమాధానం ఇచ్చింది.

"మరి మీరు పదేళ్ల అమ్మాయిని ఐదేళ్ల అమ్మాయిలా చూడటం సరైనదేనంటారా?"

మరుసటి రోజున ఆ తల్లి తన కూతురుతో "నువ్వింక పెద్దదానివయ్యావు. అందుకని నీకు ఇష్టం వున్నట్లు తిను" అని చెప్పింది.

కూతురు తన తల్లిని ముద్దుపెట్టుకుని, "అమ్మయ్య, చిన్న పిల్లలా నాకు గోరుముద్దలు తినిపించలేవన్న సంగతి నువ్వు యిన్నాళ్లకి అర్థంచేసుకున్నావు" అంది. అప్పుడా అమ్మాయి కడుపారా నాస్తా చేసింది.

రెండు మూడు రోజులయ్యేసరికి ఆ తల్లి యింక ఉండబట్టలేక, స్వేతా ముందు శాండ్విచ్చిలు పెట్టడం మొదలెట్టింది.

అప్పుడు స్వేతా "నా తిండి విషయంలో మనిద్దరం నిర్ణయించుకున్నాం. నువ్వేమో మళ్లీ 'ఇంకొక్కటి తిను...' అంటూ మొదలెట్టావు" అంది.

సుప్రసిద్ధ జర్మన్ బోధన శాస్త్రజ్ఞుడు ఎ. డీస్టెర్‌వెగ్ పిల్లల స్వాతంత్ర్యానికి

మార్గదర్శకత్వం వహించవలసిన అవసరం గురించి చెప్పాడు. పిల్లలు చెయ్యలేకపోయినదాన్ని బోధకుడు చెయ్యాలి. కాని పిల్లల పనిని తనే చేయకూడదు. పిల్లలు తమ ఆరోగ్యం విషయంలో స్వయంగా శ్రద్ధ వహించేలా చేయాలి.

పెరుగుతున్న పిల్లల్లో స్వతంత్రతం అభివృద్ధి చెందడంపట్ల పట్టించుకోకపోవడం సమంజసం కాదు. దానిపట్ల మంచి శ్రద్ధ, అర్థవంతమైన మార్గదర్శకత్వం వహించాలి.

## మధ్యాహ్నం

పిల్లలు తమ స్కూళ్లలోనూ, మనం మన పనిలోనూ వుండే ఆ కొద్ది గంటల ఎడబాటు మనం కలిసి వుండే కొన్ని సుదీర్ఘ దినాల కంటె కూడా మనల్ని మరింత సన్నిహితుల్ని చేస్తుంది. బహుశా మన మాతాపితృ అనుభూతులు ప్రాబల్యం వహించడమే యిందుకు కారణం కావచ్చు. అరక్షితులైన మన పిల్లలు ఎలా వున్నారో? స్కూల్లోని సంశ్లిష్ట సుడిగుండంలో పడి వాళ్లు ఏమనుకుంటున్నారో? టీచర్లు, స్నేహితులు, డజన్ల కొలది బాధ్యతలు, మన పిల్లల పైకి కనిపించే పూర్తి నిస్సహాయత. మన పిల్లలు మనం అనుకున్నంత అధ్వాన్నంగా కాక, చదువులో బాగా రాణిస్తే, మనం మన బక్క పిల్లలు (చాల మంది తల్లితండ్రులు తమ పిల్లలకి సవాలక్ష అస్వస్థతలు వున్నట్లు భ్రమిస్తారు) స్కూలూ, జీవితమూ పిల్లల భుజస్కంధాలమీద మోపే హోమ్‌వర్కు, పనులు చేసినందుకు గర్వం కూడా చెందుతాం. మన మనసుల్లో ఏ మూలనో పిల్లల విషయంలో మన ఆదేశాలు మితిమీరాయేమోనన్న అనుమానం కూడా కలగక మానదు. ఆపేక్ష చూపేందుకు బదులు మనం వాళ్లని కేకలేశాం. సానుభూతి చూపేందుకు బదులు మనం వాళ్లని తిట్టాం. ప్రోత్సహించేందుకు బదులు మనం నవ్వాం.

మనం పనిలో ఉన్నప్పుడు, ఏ మధ్యాహ్న భోజన విరామంలోనో, లేక యిళ్లకి తిరిగి వచ్చేటప్పుడో మనం మన పిల్లల్ని తప్పనిసరిగా మరింత దయగా చూడాలని కొన్ని సార్లు బహుశా అనుకుంటాం. అలాంటప్పుడు మనలో ఆర్ద్రత పెల్లుబుకుతుంది. కాని మనం మన పిల్లల్ని కలుసుకున్నప్పుడు (కొన్ని వివరాలు: స్కూలు యూనిఫారమ్ గదిలో విసిరేయబడి వుంటుంది, కటింగ్ ప్లయర్ సోఫామీద వుంటుంది, పిల్లల చేతులు మురికిగా వుంటాయి) మన సత్సంకల్పాలు కాసినీ కరిగిపోతాయి. మనం మన పిల్లల్ని తిట్టిపోస్తాం, వాళ్లమీద సణుగుతాం. ఒకవేళ మీ కుర్రాడు సకల గుణాభిరాముడైతేనో! నాసి మార్కులు వస్తే, ఏదో పారేసుకు వచ్చేవాడైతే, వాడు "యాదృచ్ఛికంగా" ఎవళ్లనో కొట్టి వచ్చేవాడైతే, వాడిచేత దెబ్బతిన్న పిల్లాడి తల్లి వచ్చి ఫిర్యాదు చేస్తే, వాడు కిటికీ అద్దం పగలకొడితే, వాడు పాలు ఒలకపోస్తే, వాడు ఏ అమ్మాయితోనో "ప్రేమలో పడి," ఆ అమ్మాయి చుట్టూ

భ్రమరంలా తిరుగుతూ వుంటే, ఆమె తల్లితండ్రులు ఫిర్యాదు చేస్తే, స్కూల్లో అందరూ వాణ్ణి "పూల రంగడు" అని పిలుస్తూ వుంటే – యింక చూసుకోండి ఎలా వుంటుందో, ఇంటి దగ్గర వాడికి చివాట్లు వుండనే వుంటాయి...

చిన్న పిల్లల అల్లరిని కనీసం ఏ పదేళ్లో గడిచాక జ్ఞాపకం చేసుకున్నప్పుడు అది మనకి పసందుగానే వుంటుంది. కాని వాళ్లు అల్లరిచేసిన తరుణంలో అది మనకి చిరాకు కలిగిస్తుంది. దీనికి కారణం ఏమిటి? మామూలు పిల్లవాడి యీ "నేరాల" జాబితాలో పాఠాలు జాగ్రత్తగా చదవడం, వినయం కంటె ఉన్నతమైనదేమీ లేదా? లేక తల్లితండ్రుల హృదయాలను పులకింపజేసే వాంఛిత బాధ్యతా నిర్వహణ రూపం లేదా? అయితే యీ బేరీజులకి యిక్కడ స్థానం లేదు. కుటుంబ బోధన శాస్త్రానికి సంబంధించిన, అంటే పిల్లలు విధేయులుగా వుండేలా, అదే సమయంలో తమ ప్రత్యేకత కోల్పోకుండా వుండేలా చూడటం ఎలాగన్న సంశ్లిష్ట ప్రశ్నకి సమాధానం యిచ్చేందుకు నేనిక్కడ ప్రయత్నిస్తాను.

మనం ఉదయం వేళని గురించి చెప్పుకున్నప్పుడు పిల్లల ప్రవర్తనకి సంబంధించిన మూడు నమూనాలనూ, వాటికి అనుగుణమైన మూడు రకాల కుటుంబ సంబంధాలనూ నేను పేర్కొన్నాను. మూడే ఎందుకో, అంతకంటె ఎక్కువ ఎందుకు పేర్కోలేదో నేనిప్పుడు వివరిస్తాను.

పిల్లల పెంపకం లక్ష్యాన్ని నేను నిర్వచించవలసివచ్చినప్పుడు, దాన్ని నేను ఆదర్శ సాధనకోసం కృషి అని నిర్వచిస్తాను. అందుకే ఆదర్శ నమూనా అత్యున్నతమైనది. దాని దిశగా మన పిల్లల్ని మనం నడపాలి.

పరిపూర్ణత దిశాభిముఖ ప్రయత్నం మాత్రమే పిల్లల పెంపకానికి ప్రాముఖ్యం కల్పిస్తుంది. పిల్లల పెంపకం విషయంలో సంపూర్ణ సూత్రబద్ధతకి నేను అనుకూలుణ్ణి. మానవ కార్యకలాపాల్లోకెల్ల సంపూర్ణ సూత్రబద్ధతని సమర్థించగలిగినది పిల్లల పెంపకం అవడమే యిందుకు కారణం. పిల్లల పెంపకంలో మనిషికి విధులనూ, బాధ్యతలనూ పెంచి వేయడమంటే నైతిక వైఖరికి అధికతర ప్రాముఖ్యం యివ్వడమే.

వెనకటి ప్రకరణంలో మాదిరిగానే యీ ప్రకరణంలో నేను స్కూలు పిల్లల ఉద్రిక్తమైన రోజువారీ జీవితాన్నీ, వారం పొడవునా వాళ్ల, వాళ్ల తల్లితండ్రుల రోజువారీ ఉద్రిక్త జీవితాన్నీ నేనిక్కడ వివరిస్తాను. ఇవి లేనిదే నికరమైన పెంపకం వుండజాలదు. అంతే కాదు, పిల్లల జీవితాన్ని క్రమబద్ధం చేయడంతో వాళ్ల బౌద్ధిక జీవితాన్ని రూపొందించడాన్ని మేళవించే విషయాన్ని మనం సదా గుర్తుంచుకోవాలి. నేనిక్కడ ఒక షరతు పెట్టాల్సి వుంది. అదేమిటంటే, పాఠకుడు తన స్వానుభవంమీద ఆధారపడి విశ్లేషణ జరపాలి. అలా చేసినప్పుడు అతను పద్ధతులు, సంబంధాలు, ఆత్మిక విలువల యీ సంశ్లిష్ట మొత్తాన్ని తన మనస్సుతో, హృదయంతో సమ్మిళితం చేయగలుగుతాడు.

మళ్లీ యిప్పుడు పిల్లల ప్రవర్తనకి సంబంధించిన మూడు నమూనాలనూ, వాటికి

అనుగుణమైన నమూనాలనూ వివరించేందుకు ప్రయత్నిద్దాం. అవి పిల్లల జీవితంలో ప్రధానంగా రోజులో రెండో భాగంతో సంబంధితమైన కుటుంబ సంబంధాలు.

ఆదర్శ నమూనా. మీరు పనిలో వుంటారు. మీ ఊహలో సినిమా రీలులో లాగ చిత్రాలు తిరుగుతూ వుంటాయి. చిత్రంలో చాలా మంది వున్న దృశ్యంలో ప్రధానమైన హీరో మీ బిడ్డ. చిత్ర దర్శకుడు టీచరు. మూగ నటులు విద్యార్థులు. క్లాసు ముగుస్తుంది. మీ బిడ్డ బాగా చదివాడు, పనిచేశాడు (పూర్తిగా ఓ గంట సేపు తోట ఆవరణలో). వాడు రెండున్నరకి యింటికి వచ్చాడు. అతని (ఆమె) దుస్తులు మార్చుకునేందుకు రెండు నిమిషాలు పడుతుంది (యూనిఫారమ్ జాగ్రత్తగా మడతపెట్టి బట్టల బీరువాలో పెడతాడు). వార్తాపత్రిక తిరగేసేందుకు పది నిమిషాలు పడుతుంది. అతను (ఆమె) జాగ్రత్తగా ఇల్లు శుభ్రంచేసే దృశ్యాన్ని మీరు ఊహించుకుంటారు. "సినీ కెమేరా" నాలుగు మూలలకీ తిరుగుతుంది: ఎక్కడా దుమ్ము లేదు, అన్నీ శుభ్రంగా తుడిచి వున్నాయి. కొద్దిగా అలసిన కూతురో, కొడుకో పడక కుర్చీమీద వాలుతారు. కొట్టులో చేతిలో సంచితో వున్న అతని మీదకి లేక ఆమెమీదకి "కెమేరా" తిరుగుతుంది: మాంసపు విభాగం, బ్రెడ్డు విభాగం, పాల విభాగం. "చిల్లర" టేబిలుమీద పెట్టి వుంది. సరుకులు వాటివాటి చోటుల్లో సర్ది వున్నాయి. 3.30 – 6.30 అనే అంకెలు మీ మానసిక తెరమీద మెరుస్తాయి. ఇదింక హోమ్‌వర్కు చేసే టైము. అందుకు కావలసినవి: పుస్తకాలు, పాఠ్యపుస్తకాలు, ఎక్సర్‌సైజు పుస్తకాలు, రంగు రంగుల పెన్సిళ్లు, రూళ్లకర్ర, కంపాస్‌లు. ఓ స్నేహితుడు వస్తాడు. మీ అబ్బాయి అతనికి త్వరత్వరగా ఓ కష్టమైన లెక్క చేయడం ఎలాగో చెప్తాడు. ఆ స్నేహితుడు వెళ్లిపోతాడు. వాళ్లు సుమారు 7 గంటలకి స్కీయింగు చేసేందుకు కలుసుకోవాలని నిర్ణయించుకుంటారు.

హోమ్‌వర్కు పూర్తి అయింది. మీ అమ్మాయి (లేక అబ్బాయి) రాత్రి భోజనం తయారు చెయ్యడంలో నిమగ్నమై వుండగా, మీరు హడావిడిగా యింటికి వస్తున్నారు. మీ కోటు విప్పడంలో మీ పిల్లవాడు (లేక పిల్ల) సాయం చేసి, స్లిప్పర్లు తీస్తాడు (తీస్తుంది). మీరు టేబిలు వంక కృతజ్ఞతగా చూస్తారు. దానిమీద వంటకాలు సర్ది వున్నాయి, రాత్రి భోజనం తయారై వుంది. రాత్రి భోజన సమయంలో ఒక చిత్రకారుణ్ణి గురించిన ఆసక్తికరమైన పుస్తకం ఎలా సంపాదించారో మీరు చెప్తారు... ఆగండి! మన టైము ముగిసిపోయింది...

నేను కొన్ని అంశాలు వదిలేశాను. ఉదాహరణకి, యీకింది సంభాషణ: "స్కూలు విశేషాలేమిటి?" – "నాకు ఫిజిక్సులోనూ, ఆల్జీబ్రాలోనూ ఫస్టు క్లాసు మార్కులు వచ్చాయి. కాని నన్ను రష్యన్ భాషలో ఏమీ అడగలేదు. మరి నీ విశేషాలేమిటి?" – "నేను మా బాస్‌కి ఫిర్యాదు చెయ్యాలి. ఈ అశ్రద్ధని నేనింక సహించలేను." – "కాని నువ్వేమైనా చిక్కులో పడతావేమో, ఔనా?" – "నాకింకో గత్యంతరం లేదు." – "నువ్వు సరైన పని చేశావు."

సగటు (మామూలు) నమూనా. మీ అబ్బాయి ఒక స్నేహితుడితో వున్నాడు. వాళ్ల చేతుల్లో కర్రలు వున్నాయి. ఒక కర్రతో యినుప కమ్మీమీద కొడుతూంటే బోలుగా, గట్టిగా శబ్దమవుతోంది. వాళ్లిలా బాదడంతో విసుగెత్తగానే మరో కొత్త ఆటకోసం వెతుకుతున్నారు. కర్రకి స్కూలు బాగ్ తగిలించి గిరగిర తిప్పుతున్నారు. ఇటీవలే కొని సరభసంగా బహూకరించిన స్కూలు బాగ్ గాలిలో ఎగురుతోంది! ఎవరి బాగ్ ఎక్కువ దూరం వెళ్తుందన్నది పందెం. తర్వాత వాళ్లొక బెంచిమీద కూర్చుంటారు. కుక్కలు, పుస్తకాలు, రేడియో భాగాలు, రికార్డులు, కార్లు, జీన్సు, గణిత సమస్యలు, ఫుట్‌బాల్ పోటీలు, చ్యూయింగ్ గమ్‌లను గురించి, కొత్త సినిమాని గురించి వాళ్లు మాట్లాడుతారు. వాళ్లు ఒకరితో పోటీ పడి మరొకళ్లు తాము మాట్లాడేవాటిని గురించి నటిస్తూ మరీ మాట్లాడుతారు. ఎవరు ఎక్కువ గట్టిగా మాట్లాడగలరన్నట్లు మాట్లాడుతారు!

మూడు గంటలవుతుంది. ఇంటి దగ్గర ప్రధాన హీరో టెలివిజన్ ఆన్ చేస్తాడు. వాడు టి.వి. ముందు బిగిసిపోతాడు. ఆ ప్రోగ్రామ్ నాలుగు గంటలకి ముగుస్తుంది. ఓ స్నేహితుడి దగ్గర్నుంచి ఫోను కాలు వస్తుంది. ఆ "ఆసక్తికరమైన" సంభాషణ సుమారొక అర గంట సాగుతుంది:

"ఎలా వున్నావ్?"

"బాగున్నాను."

"గేంక ఫోను చేశాడా?"

"లేదే."

"ఎందుకు చెయ్యలేదు?"

"ఏమో, నాకు తెలియదు."

"ఇప్పుడేం చేస్తున్నావ్, టి.వి. చూస్తున్నావా?"

"ఊఁ."

"ప్రోగ్రాం భలేగా వుంది కదూ?"

"ఔను, బ్రహ్మాండంగా వుంది."

"ఓ విశేషం చెప్పనా? నాకు ఎమ్–5 ట్రాన్సిస్టర్లు దొరికాయి. నీ దగ్గరకి పట్టుకు రమ్మంటావా?"

"పట్టుకురా."

"నీ దగ్గర ఆర్–2 రెసిస్టర్లు వున్నాయా?"

"లేవు."

"సర్లే. నేను గేంక దగ్గరున్నాయేమో అడుగుతాను."

గేంకతో సంభాషణ:

"ఎలా ఉన్నావ్?"

"బాగున్నాను."

"టి.వి. ప్రోగ్రాం చూశావా?"

"చూశా."

"బాగుంది, కదూ?.."

"నువ్వేం చెయ్యబోతున్నావ్?"

"హోమ్‌వర్కు చేసుకుంటాను."

"నువ్విక్కడకి రాకూడదూ? చదరంగం ఆడుకుందాం. నీ ఆట కట్టిస్తా. కావాలంటే నీకు ముందెత్తులు యిస్తాను..."

"నాకేం ముందెత్తులు అక్కర్లేదు. నేనెలాగూ గెలుస్తాను."

"నువ్వెప్పుడొస్తావ్?"

"నువ్వే రాకూడదూ?"

తర్వాతి దృశ్యం. మీ అబ్బాయి వాడి స్నేహితుడి ఫ్లాట్‌లో వుంటాడు. అక్కడి సామాన్లు: రేడియో విడి భాగాలు, ఒక రేడియో సెట్టు, ఒక టేప్ రికార్డరు, ఒక రికార్డు ప్లేయరు, చెల్లాచెదరుగా పడివున్న చదరంగం పిక్కలు. రికార్డు ప్లేయరులో పాట చెవులు బద్దలయేటంత గట్టిగా వినిపిస్తోంది. పొరుగువాళ్లు గోడలు తట్టుతున్నారు. "వీళ్లకేమొచ్చింది? నాకు హక్కుంది. రాత్రి యింకా పదకొండు కాలేదు" అని గేంక అరుస్తున్నాడు. సాయంత్రం ఆరు గంటలు. పిల్లలు తమాయించుకుంటారు: "ఇంక పోదాంరా, లేకపోతే అమ్మా, నాన్నా వస్తారు — అంతే సాధింపు మొదలవుతుంది..." అనుకుంటారు.

6.20. పిల్లవాడు రిఫ్రిజిరేటరులో గాలిస్తున్నాడు. వాడికి తినడానికి ఏదో దొరికింది. తర్వాత వాడు టి.వి., టేప్ రికార్డరూ ఆన్ చేసి, హోమ్‌వర్కు చేసేందుకు కూర్చుంటాడు. వాడు హోమ్‌వర్కు చేస్తాడు. తల్లి వస్తుంది. ఆమె సంతోషంగా వుంది. "ఏం చేస్తున్నావురా, నువ్విక్కడ?" అంటుంది తలి. సమాధానం: "మాట్లాడించకమ్మా." — "నీకు ఆకలి వేస్తూ వుంటుంది. నేనదే అనుకున్నాను. నువ్వు జావ వెచ్చచేసుకోలేదు, అప్పచ్చులు చూసుకోలేదు, పెరుగు తాగలేదు. నీకు తినేందుకు ఒక్క క్షణంలో ఏదైనా చేసి పెడతా. నీవింకా బట్టలు మార్చుకోలేదేం?"

ప్రతికూల నమూనా. మీరు మీ "ఊహాత్మక కెమేరా"ని ఆన్ చేయరు. మీ అబ్బాయి యిటీవల అనుసరించ నారంభించిన జీవన సరళిని తలపోసుకునే అవకాశాన్ని మీరు చెదరగొట్టేస్తారు.

కింది ప్రశ్నలు మిమ్మల్ని సతమతం చేస్తూవుంటాయి: "వాడెక్కడ వున్నాడు? ఎవరితో వున్నాడు? బహుశా ఆ పొడుగు జుట్టువాడు వీణ్ణి కలిసేందుకు వచ్చాడేమో. నిన్న మిమ్మల్ని స్కూలుకి రమ్మని కబురంపారు. వాడు హోమ్‌వర్కు చేయడం లేదట. వాడు క్లాసు జరుగుతూండగా మధ్యలో వెళ్లిపోయాట్ట. వాడు ఇంటికి తిరిగివచ్చేసరికి

వాడి రెయిన్‌కోటు బురద కొట్టుకుని వుంది. వీడు ఎవళ్ల పోలికబ్బా? తండ్రి తన బెల్టు తీసి కొడుకుని బాదబోయాడు. 'నువ్వు కొట్టావో, నేను ఇంట్లోంచి వెళ్లిపోతాను' అన్నాడు కొడుకు. పిల్లవాడు తన తండ్రిమీద అరవడం అదే మొదటి సారి..."

పిల్లలతో మీ సంబంధాలు "ఆదర్శ నమూనా" ప్రకారం నిర్మింపబడినప్పటికీ మీరీ పుస్తకం చదవాలని నిర్ణయించుకుంటే, మీ పిల్లల యితోధికాభివృద్ధి క్రమాన్ని మీరు నిర్ణయించుకోండి. ఆదర్శ నమూనాలో మీ పిల్లల బౌద్ధిక జీవితంలో గాఢమూ, మరింత ప్రక్షిప్తమూ అయిన వైరుధ్యాలు వుండవచ్చు. నేను వాటిని తప్పకుండా పరిశీలిస్తాను.

మీ సంబంధాలు సగటు నమూనా ప్రకారం అభివృద్ధి చెందుతూ వుంటే, కనీసం మొదట్లోనైనా మీ పిల్లల జీవితాన్ని వాళ్లు ఊరికే బలాదూరు తిరిగేందుకు ఎక్కువ టైము లేకుండా ఏర్పాటుచెయ్యండి. పిల్లల దయార్ద్ర భావాలకు దయతో కూడిన పనులు ప్రాతిపదికగా వుండేలా చూడండి. ప్రయోజనకరమైన పనులు యితరులపట్ల దయతో వ్యవహరించేందుకు అనుగుణంగా వున్నప్పుడే పెంపకాన్ని ఆదర్శ నమూనాకి సన్నిహితంగా తీసుకెళ్లగలుగుతుంది.

మీ సంబంధాలు ప్రతికూల నమూనాగా ఏర్పడి వుంటే, మీ పిల్లల "రోగానికి" సరైన నిదానం ఏమిటో నిర్ణయించండి. అలాంటి పిల్లల్ని బాగా జబ్బుగా వున్నవాళ్లని చూసినట్లు చూడండి. జబ్బుగా వున్నవాళ్లని తిట్టరు, కొట్టరు. వాళ్లని దీర్ఘ కాలం పాటు, వాళ్ల ఆరోగ్యం ససిపడేదాకా ఓపిగ్గా చూస్తారు. నేను ప్రతిపాదించే ప్రత్యామ్నాయాలు ప్రత్యేకించి ప్రతికూల నమూనా పిల్లల్ని సరిదిద్దేందుకు ఉద్దేశింపబడ్డాయి. నా సూచనలు సగటు నమూనాని ఆదర్శ నమూనాగా మార్చేందుకు ఉద్దేశింపబడ్డాయి.

అందుకనే, నేను ప్రతికూల నమూనానీ, దానిని సగటు నమూనానుంచి ఆదర్శ నమూనాకి మార్చే సాధనాన్నీ ఎంచుకున్నాను.

సరే, యింక మొదలెడదాం.

పిల్లలపట్ల ఆశావహ వైఖరి వహించండి. నేనీ ఆశావహ వైఖరిని నైతిక ఆత్మ సంతృప్తి రూపంగా ప్రతిపాదించడం లేదు. వైరుధ్యాలను కప్పిపుచ్చే ఆశాభావం హానికరమైనది.

పిల్లల పెంపకంలో ఆశాభావం పిల్లల వ్యక్తిత్వ అభివృద్ధిలో మౌలిక వైరుధ్యాలను పరిష్కరించే మార్గాల పరిజ్ఞానంమీదా, అతిగా అలక్ష్యం చేయబడిన పిల్లల్లో సైతం సానుకూలమైనది చాలా వుంటుందన్న విశ్వాసంమీదా ఆధారపడి వుంటుంది. సానుకూలమైనదాని మీద ఆధారపడటం అనే యీ సూత్రం పాతదిగా కనిపిస్తుంది! కాని వాస్తవంలో దీన్ని ఆచరణలో పెట్టడం చాలా కష్టం. అందుకని "అల్లరి పిల్లల" ప్రతికూల నమూనాలో కనిపించే సానుకూలమైనదేమిటో చూద్దాం. అల్లరి పిల్లల్లో అధికాంశం దీర్ఘ కాల క్రమంలో మంచివాళ్లు, అంతే కాకుండా మంచి కార్మికులు, ఉద్యోగులు, కుటుంబీకులు

అవడం నేను అనేక సార్లు చూశాను. కొన్ని విషయాల్లో వాళ్లు ఆదర్శ నమూనాకి సంబంధించిన కొన్ని గణనీయమైన లక్షణాలను కలిగిన వెనకటి తమ క్లాస్‌మేట్స్‌కి సైతం ఏమీ తీసిపోరు.

చాలా మంది అల్లరి పిల్లల్లో ఏ మాదిరి సానుకూల లక్షణాలు కనిపిస్తాయి?

వాళ్లలో విశేషమైన శక్తీ, జీవితేచ్ఛా వుంటాయి. అల్లరి పిల్లలు – తమని ఎంతగా కేకలేసినా, తిట్టినా (మనం తరచుగా అదే చేస్తూ వుంటాం) – యింకా యింకా అల్లరి చేసేందుకు అవసరమైన విశేషమైన శక్తిని నిలుపుకుంటారు.

సర్వసాధారణంగా అల్లరి పిల్లలు శారీరకంగా మోటుగా, కష్ట సహిష్ణువులుగా వుంటారు. ఈ రెండు గుణాలూ వాళ్లు తమ మాట నెగ్గించుకునేవాళ్లుగా వుండటానికీ, యితర అమ్మాయిలకు, అబ్బాయిలకు నాయకులు అయ్యేందుకూ తోడ్పడతాయి.

ఈ "అల్లరి పిల్లలు" అనబడేవాళ్లే తమ స్నేహితుల విశ్వాసాన్ని అన్నిటి కంటె ఎక్కువగా విలువైనదిగా పరిగణిస్తారు. అందుకే క్లిష్ట పరిస్థితుల్లో వాళ్లమీద ఆధార పడవచ్చు. ప్రమాదాన్ని ఎదుర్కొనే విషయంలో వాళ్ల అత్యధిక ఆభిముఖ్యం కచ్చితమైన అంచనాలతో ముడిపడివుంటాయి.

నేను పిల్లల్ని దూరపు నడకలకు తీసుకువెళ్లినప్పుడు అందరి కంటె యీ "ప్రతి కూల నమూనా"కి చెందిన పిల్లలే ఎప్పుడూ ముందుండేవారు. వాళ్లు మా డబ్బు జాగ్రత్త పెట్టేవారు, గుడారాలు వేసేవారు, అతి బరువైన మూపుమూటలు మోసేవారు, బల హీనులకి తోడ్పడేవారు. చాలా తరచు వాళ్ల ఆదర్శ నమూనా లక్షణాలు కలిగిన "ప్రతి ద్వందులు" నైపుణ్యాల్లో, నేర్పులో, లాఘవంలో వాళ్లకి తీసికట్టుగా వుండేవారు. నేనొక ప్పుడు పనిచేసిన ఒక బోర్డింగు స్కూల్లోని పిల్లలు ప్రాక్టీసుకోసం ఒక ఫర్నిచరు కర్మాగా రానికి వెళ్లారు. అక్కడ బృంద నాయకులైనది యీ అల్లరి పిల్లలే. అతి కష్టమైన పనులు చేసింది వాళ్లే. నేను చాలా కాలం పాటు పిల్లలతో బాక్సింగ్ సెక్షనులో పనిచేశాను. అక్కడ యీ అల్లరి పిల్లలే ఎప్పుడూ అత్యుత్తమ ఫలితాలు సాధిస్తూ వచ్చారు.

పరిశ్రమ, శక్తి, ఉత్సాహం, దృఢమైన ఇచ్ఛ, నైపుణ్యాలు, కలివిడితనం, యితరులకి సాయం చేసేందుకు సంసిద్ధత – యీ గుణాలన్నీ సాటిలేనివి. వాళ్ల నైతిక ప్రవర్తనకి యివే హామీ కాదనడం నిజమే అనుకోండి. అయితే అది వేరే సమస్య. వాళ్లలో యీ సద్గు ణాలు వున్నాయి, బుద్ధి కౌశల్యం కలిగిన ప్రతి బోధకుడూ వాటిమీద ఆధారపడవచ్చు అన్నదే యిక్కడ ప్రధానాంశం.

"పిల్లలు స్వతహాగా దయకీ, సమరసత్వానికీ, అందానికీ ప్రతిరూపాలు" అనే సూత్రంతో నేను పూర్తిగా ఏకీభవించను. క్రూరులు, కఠినాత్ములు, దుష్టులు అయిన పిల్లలు కూడా వున్నారు. స్వతహాగా దయాంతరంగం అంటూ ఏదీ లేదు. ఒక నైతిక అంశంగా దయ అన్నది సాంఘిక పరిస్థితులమీద ఆధారపడి వుంటుంది. సాంఘిక పరిస్థితు లెప్పుడూ యితరుల

పట్ల సంబంధాలమీద ఆధారపడి వుంటాయి. కాని మనిషి జీవశాస్త్రపరమైన లక్షణాలూ, వాటి స్థాయీ సామాజికాభివృద్ధిమీద ఆధారపడి వుంటాయి.

మరి సమరసత్వం మాట ఏమిటి? సౌందర్యం మాట ఏమిటి? అవి ప్రధానమైనవి కావా? చర్మపు మెరుపులో, కళ్ల నీలి కాంతిలో, పెదవుల దొండపండు వన్నెలో, పట్టుకుచ్చు వంటి కురుల్లో వ్యక్తమయ్యే జీవశాస్త్రపరమైన లక్షణాలు అందమైనవి కావా? "తుదకంటా మానవీయం చేయబడని" ప్రకృతికి అవి ప్రతిబింబం కావా? ఇంకా పూర్తిగా విప్పారని సమరసత్వానికి అవి ప్రతిరూపం కావా? పిల్లలు ప్రకృతి కంటె మరింత పరిపూర్ణులు, మరింత ఎక్కువ సమరసత్వం కలిగినవాళ్లు. ప్రకృతి సమరసమైనది, సుందరమైనది అనడంలో మనకి సందేహం లేదు. కారు మేఘాలతో ఆచ్ఛాదితమైన ఆకాశం సైతం మనకి ఆనందం కలిగిస్తుంది. చిత్రకారుడి చిత్రంలోనే కాదు, ప్రకృతిలో సైతం ఇది యింతే.

మానవ జాతిలో అంతర్నిహితంగా వుండే సౌందర్యం ముఖంలో మెరవని పిల్లలు ఎవరూ వుండరు! పిల్లల స్వాభావిక గుణాల్లో అతి మెత్తదనం ఒకటి. మిక్కిలి కఠినాత్ములైన పిల్లలు సైతం ఆసక్తికరమైన ప్రతిదానిపట్లా ప్రతిస్పందిస్తారు: వాళ్ల కళ్లు మెరవనారంభిస్తాయి, వాళ్లు మీకు మాలిమి అవుతారు, వాళ్లలో మీకు నికరమైన మానవ కాంతి ద్యోతకమవుతుంది.

ఈవిధంగా, మీ అల్లరి పిల్లల్లో ఎంతో విలువైన మానవ లక్షణం నిక్షిప్తమై వుంటుంది. దాన్ని గురించి శ్రద్ధ తీసుకోకపోవడం, దాన్ని మానవాత్మ అనే మేలిమి బంగారంలోకి మార్చకపోవడం పాపమే అవుతుంది.

## సరైన రోగ నిదానం చెయ్యండి

మీ పిల్లలు స్కూల్లో బాగా చదవకపోవడం, క్లాసులు ఎగ్గొట్టడం మొదలైందంటే, వాళ్లు ఆత్మవిశ్వాసం కోల్పోయారని అర్థం. వాళ్లు చదువులో బాగా వెనకబడ్డారనీ, తమంతట తాము అశ్రద్ధ చేసిన పాఠాలను పూర్తిచేయ కలిగిన శక్తి వాళ్లకి లేదనీ దీని అర్థం. టీచరు తమని ఎక్కడ ప్రశ్నలు అడుగుతాడో అని వాళ్లు సతమతమవుతారు. తమ స్నేహితుల ముందు, టీచర్ల ముందు, తమ ముందు తామే కూడా వాళ్లు సిగ్గుపడతారు. ఈ భయం రోజురోజుకీ పెరుగుతుంది. ఈ భయాన్ని వదిలించుకునేందుకుగాను పిల్లలు దాడి వైఖరి తీసుకో నారంభిస్తారు. అప్పుడిక టీచర్లతో, క్లాసులోని చురుకైన పిల్లలతో, తల్లితండ్రులతో ఘర్షణ ప్రారంభమవుతుంది. ఒక్క సారిగా వాడిమీద అనేక బాధ్యతలు మేటపడతాయి. వాటిని నిర్వర్తించడం వాడి శక్తికి మించినవిలా కనిపిస్తాయి. అలాంటి ఒత్తిళ్లు వాణ్ణి నిత్యం దొలిచేస్తున్న భయాన్ని మరింత పెంచుతాయి. ఆ పిల్లలు తమ నైతిక ఒంటరిపాటుతనంతో వేదనకి గురి అవుతారు. వాళ్లకి రక్షణ వుండదు. ఈ కారణంగానే వాళ్లు

తెంపరితనంతో కొత్త సాంగత్యాలకు పూనుకొంటారు. ఆ సాంగత్యాలు వాళ్లని భయంనుంచీ, సిగ్గునుంచీ కొంతమేరకు విముక్తం చేస్తాయి. ఆయా పరిస్థితులన్నీ తమ యీ "సంచిత" "పాటవాన్ని" బహిర్గతం చేయవలసిన ఆవశ్యకతను కలిగిస్తాయి. వాళ్ల శక్తి బయట పడేందుకు "మార్గాన్ని" వెతుక్కోవలసి వుంటుంది. పర్యవసానాలు ఊహాతీతమైనవిగా ఉంటాయని ప్రత్యేకించి చెప్పనక్కర్లేదు.

మీ పిల్లలు మీకు ఇంటి పనుల్లో సాయం చెయ్యడంలేదంటే, దానికి కొన్ని కారణాలు వుండవచ్చు. తాము చెయ్యవలసిన పనులు వాళ్లు చేయలేకపోవచ్చు. వాళ్లకి ఆ పనులు నేర్పలేదు. చాలా కాలంగా వాళ్లచేత యింట్లో పనులేవీ చేయించలేదు. తమ కుటుంబాలకు సాయం చేయడమన్నది వాళ్ల పెంపకంలో అలక్ష్యం చేయబడింది. బహుశా యిందుకు కారణం ఆయా కుటుంబాల్లో సభ్యుల మధ్య ఎడబాటు వుండి, వాళ్లలో ప్రతి ఒక్కరూ తమ సొంత ఒంటరి బతుకులు బతుకుతూ వుండి వుండవచ్చు. మీ పిల్లలు బాగా చదువుతూ వుండి, మీపట్ల మొరటుగా వుంటే, మీ మధ్య సంబంధంలో తప్పు ధోరణి వృద్ధిచెందు తోందన్న మాట. దీనికి కారణం ఏమిటో కనుక్కోవాలి. ఎందుకంటే, అలాంటి సంబంధాలు ముందు వెనకల్లో వాళ్ల చదువుల్లో కూడా ప్రస్ఫుటం కావచ్చు.

మరో సన్నివేశం కూడా వుండవచ్చు. కుర్రాడు బాగా చదువుతూ ఉన్నాడు. వాడు తన తల్లికి సాయం చెయ్యకుండా తప్పించుకొంటూ వున్నాడు. అయితేనేం "మంచి సంబంధాలు" నిలుపుకొంటూ వుండవచ్చు. ఈ "మంచి" సంబంధాలకి అంత ఎక్కువ విలువేమీ వుండదు. కానైతే, యీ మంచి సంబంధాల్లో ఎంతో కొంత సానుకూల అంశం వుంది. ప్రయోజనకరమైన పని ప్రాతిపదికమీద ఆధారపడిన నికరంగా గంభీరమైన సంబంధాలను పెంపొందించుకునేందుకు అవి ఉపయోగపడవచ్చు.

ఇక్కడ నేను మరో విషయం కూడా జోడించవలసి వుంది. స్కూల్లో మీ పిల్లలు వెనకబడి వుండటానికి వాళ్ల ఆరోగ్యం సరిగా ఉండకపోవడం కూడా కారణం కావచ్చు. అలాంటి సందర్భాల్లో సహజంగానే వాళ్లని డాక్టరుకి చూపించాలి.

అల్లరి పిల్లలు, ఆరోగ్యవంతులై వుండి, చదువులో వెనకబడినప్పుడు, వాళ్లు పెంకె వాళ్ళుగా తయారవుతారు. ఈ కారణంగా మీ కొడుకుతో గాని, కూతురుతో గాని మీ భావి సంబంధాల అభివృద్ధి మీరు వాళ్ల పనులను, ప్రధానంగా వాళ్ల చదువులను ఎలా ఏర్పాటు చేస్తారన్నదానిమీద ఆధారపడి వుంటుంది.

## మీ పిల్లల బాదరబందీలలో పాలుపంచుకోండి

చాలా మంది తల్లితండ్రులు ఒకే పొరపాటు చేస్తూ వుంటారు. పిల్లలకి సాయం చేసేందుకు బదులు "కూర్చుని హోమ్‌వర్కు చేసుకో!", "చదువు ఇంకా ఎప్పుడు మొదలెడతావు!" అంటూ ఆదేశాలిస్తూ వుంటారు. వీటికి సమాధానంగా పిల్లలు సాధారణంగా

"ఇంకా టైముందిలే" అనో, లేక "ఇదుగో యిప్పుడే మొదలెడతాను!" అనో, లేక "మాకీ రోజున హోమ్‌వర్కు యివ్వలేదు" అనో సాకులు చెప్తూ వుంటారు.

"ఆదర్శ నమూనా"ని సృష్టించేవాళ్లు యిందుకు కొంచెం భిన్నంగా ప్రారంభిస్తారు: "సర్లే, రష్యన్ భాషలో నువ్వేం చెయ్యాలో చూద్దాం వుండు. ఒక ఎక్సర్‌సైజు చేయాలా. సరే. దానికి నీకెంత టైము పడుతుంది? అరగంటా. బాగుంది. మరి లెక్కల్లో నువ్వేం చెయ్యాలి? రెండు లెక్కలా? ఏవి? ఓహో యివా... సరే, నీ అంతట నువ్వు చెయ్యి. నీకు రాకపోతే యిద్దరం ప్రయత్నిద్దాం..."

తమ పిల్లలు మంచి విద్యార్థులుగా వుండాలని కోరుకుంటే, తల్లితండ్రులు వాళ్ల పాఠ్య క్రమం ఏమిటో, కనీసం ప్రాథమిక పాఠశాల పాఠ్యక్రమం ఏమిటో తెలుసుకోవాలి. అయితే పిల్లలు ప్రాథమిక తరగతుల్లో బాగా చదివి వుంటే, వాళ్లు అప్పుడే క్రమబద్ధమైన అధ్యయనపు అలవాట్లు చేసుకున్నారన్న మాట. మానసిక శ్రమకీ, యితర పిల్లల మధ్య తమ ప్రతిష్ఠ విషయంలో శ్రద్ధ తీసుకునేందుకూ అలవాటుపడ్డారన్న మాట.

మీ పిల్లలకు మీరు నిజంగానే సహాయపడాలని అనుకుంటే, వాళ్ల చిన్నారి ప్రపంచపు బాదరబందీలను మీరు తెలుసుకోవాలి. స్కూల్లో వాళ్లకి యివ్వబడే ఆదేశాలేమిటో మీరు తెలుసుకోవాలి.

ప్రాథమిక విద్యార్హత మాత్రమే (నాలుగు క్లాసులు) కలిగిన కొందరు తల్లులు నాకు తెలుసు. అయితేనేం, వాళ్లు తమ పిల్లలకి సాయంచేశారు. పిల్లల చదువును తనిఖీ చెయ్యడమే కాకుండా, వాళ్ల హోమ్‌వర్కులో కూడా తోడ్పడ్డారు. నిజానికి వాళ్లు పిల్లలతోబాటు చదివి, కలిసి కొత్త విషయాలు నేర్చుకున్నారు. అయితే యిది అంత తేలిక కాదన్న విషయం నిజమేననుకోండి. అయితే యిది తప్పనిసరి అవసరం. విద్యా క్రమమే మనిషికి ఎదురయ్యే అతి కష్టమైన విషయం. అందుకే పిల్లల్ని యీ విషయంలో గాలికి వదిలెయ్యకూడదు.

## స్వల్ప విషయాలతో ప్రారంభించండి

మరింత కచ్చితంగా చెప్పాలంటే, అతి సూక్ష్మమైనవాటితో ప్రారంభించండి. పిల్లల్లో అతి స్వల్పంగానైనా సరే ఆత్మవిశ్వాసాన్ని చొప్పించేందుకు కృషిచెయ్యండి. స్కూల్లో చెప్పే ఏ సబ్జెక్టులో ప్రాథమిక ఆసక్తిని రేకెత్తించడం సాధ్యమో దాన్ని ఎంచుకోండి. పిల్లవాడు గణిత శాస్త్రంలో వెనకబడి వుంటే, వాడు వెనక చేసిన లెక్కల్ని వాడితో కలిసి చేసేందుకు ప్రయత్నించండి. తమ హోమ్‌వర్కు చేయగలమన్న విశ్వాసాన్ని పిల్లల్లో కలిగించడమే మీ బోధన శాస్త్ర ప్రయత్నాల్లో మొదటివి కావాలి. తనకు యిచ్చిన సమస్యను పరిష్కరించి, అది చాలా తేలిక అని వాడు అన్నప్పుడు, "నువ్వు రోజూ విడవకుండా యివి చేస్తే నీ హోమ్ వర్కు కూడా యింత తేలిగ్గా వుంటుంది" అని వాడికి చెప్పండి.

మీ పిల్లవాడు వర్ణక్రమంలో వెనకబడి వుంటే, వాడిచేత రోజూ ఒక అరగంట

సేపు యీకింది పని చేయించండి. పాఠ్య పుస్తకంలోంచి కొన్ని వాక్యాలు డిక్టేట్ చేసి వాడి చేత రాయించండి. తర్వాత వాడిని పాఠ్య పుస్తకాన్ని చూసి తను రాసిన వాక్యాల్లోని వర్ణక్రమ దోషాలని స్వయంగా దిద్దుకోమనండి. ఇలా రోజూ రెండు మూడు వాక్యాలు రాసి, మీ సమక్షంలో తప్పులు దిద్దుకుంటే, ఆ పాఠ్యాంశంలో బోలెడు మెరుగుదల సాధించవచ్చునని చెప్పండి.

మీ అబ్బాయి లేక అమ్మాయి మరో సబ్జెక్టులో (ఉదాహరణకు, చరిత్రలో, ప్రకృతి శాస్త్రంలో లేక భూగోళ శాస్త్రంలో) వెనకబడి వుంటే, వాళ్ళలో యీకింది విధంగా ఆసక్తిని రేకెత్తించండి. మీ అబ్బాయి లేక అమ్మాయి పాఠ్య క్రమాన్ని తిరగేసి వాళ్ళకి హోమ్‌వర్కు ఏమి వుంటుందో జాగ్రత్తగా చూడండి. లైబ్రరీకి వెళ్ళి, మీ అబ్బాయో, అమ్మాయో చదివే ఆ పాఠ్యాంశంమీద కొన్ని పుస్తకాలు తీసుకుని వాటిలో కొన్ని ప్రకరణాలు చదవండి. ఆ పుస్తకాల్లో మీరు నేర్చుకున్నదేమిటో మీ పిల్లలకి చెప్పండి. వాటిలో అత్యంత విస్పష్టమైన ఖండికలను మీ పిల్లలకి చదివి వినిపించండి. మీరు చదవ నిర్ణయించుకున్న ఖండికల్లో అత్యంత ఆసక్తికరమైన ఘట్టాల్లో ఆపుచేసి, మిగిలిన భాగాలను వాళ్ళనే చదువుకోమనండి. ఇలా కొన్ని సార్లు జరిగాక మీ అబ్బాయి లేక అమ్మాయి తను సంతరించుకున్న కొంత జ్ఞానాన్ని స్కూల్లో చూపవచ్చు. ఈ విషయాన్ని టీచరూ, మిగిలిన పిల్లలూ గమనిస్తారు. మంచి మార్కులు పొందడం ఒక్కటే కాదు యిక్కడ సంగతి. తాము సాధించగలిగింది యేమిటన్న విషయంలో పిల్లలు ఆత్మవిశ్వాసం సంతరించుకుంటారు. బెరుకు పోతుంది లేక తగ్గుతుంది. ప్రధానమైన విషయం ఏమిటంటే, మీకూ మీ పిల్లలకీ మధ్య పెంపొందే ఉమ్మడి ఆసక్తి, మీ ఉమ్మడి లక్ష్యాల సాధనా క్రియాశీల, మానవీయ, సృజనాత్మక మానవ సంబంధాల సరైన ధోరణిని – యిది లేనిదే పిల్లల పెంపకం అసాధ్యం – కనుక్కోవడంలో తోడ్పడతాయి.

కోపంగా వేధించే వైఖరీ, అనవసరమైన ఘర్షణలూ లేకుండా చూసుకోండి.

మీరు మీ అబ్బాయితో లేక అమ్మాయితో చదువు మొదలుపెట్టారు. మీరు చిరాకు పడకండి. మీరు ఒక్క సారి చిరాకుపడినా కూడా (మీరు దాన్ని పైకి కనిపించనీయక పోయినా, మీ పిల్లలు దాన్ని గమనిస్తారు, అనుభూతి చెందుతారు) మీ ప్రయత్నాలన్నీ బూడిదలో పోసిన పన్నీరవుతాయి.

మీరు కలిసి చదివేటప్పుడు మీ పిల్లలు ఏం చేసినా కూడా మీరు హుషారుగా, సాయిలా పాయిలాగా వుండండి. లేకపోతే సద్భావంతో కచ్చితంగా వుండండి.

"నేను అడవికి వెళ్ళేందుకు నిశ్చయించుకున్నాను" అని మీరు చెప్పినప్పుడు మీ అమ్మాయి "ఆమె అడవిలోకి రేగి పళ్ళు కోసేందుకు వెళ్తుంది" అని రాసిందనుకోండి. ఆమె భావుకతను ముందు మెచ్చుకొని, చివర "అయినా కూడా మొత్తం వాక్యాన్ని 'నిశ్చయించుకున్నాను' అనే మాటతోనే రాద్దాం. ఈ మాట చాలా కష్టమైనది" అని చెప్పండి.

పిల్లలతో కలిసి చదవడంలో మొదట్లోనే మీరు "ఇలా అయితే ఎలా! నేనొకటి చెప్తుంటే, నువ్వు మరొకటి రాస్తున్నావ్. నా మాట నువ్వు వినడం లేదు. నేను చెప్పింది ఒక చెవితో విని మరో చెవిలోంచి వదిలేస్తున్నావ్" అంటే, మీరు మీ లక్ష్యాన్ని సాధించలేరు. ఇలాంటి పనికిమాలిన సాధింపుతో ఆదిలోనే మీ పిల్లల ఊహా శక్తిని మీరు పాడుచేస్తారు. మీ పిల్లలు జబ్బుపడితే వాళ్లకి "పెడబుద్ధి" వుందని మీరు పదేపదే ఆ సంగతి రెట్టించి, వాళ్లకి సరిగా నయమయేలా చూడకపోతే, మీరు వాళ్లకి ఏవిధంగానూ తోడ్పడరు.

మీ పిల్లలతో కలిసి చదివేటప్పుడు మీరు ఏ స్వరంలో, ఏ ధోరణిలో మాట్లాడతారో జాగ్రత్తగా గమనించండి.

మీ పిల్లలు మరి కొంచెం "పుంజుకున్నాక," అంటే మీతో కలిసి క్రమబద్ధంగా కృషి చేసి, ఒక నిర్దిష్ట పద్ధతికి అలవాటుపడినప్పుడు మీరు మీ స్వర ధోరణి మార్చవచ్చు. అంటే, పిల్లల గర్వాన్ని కికురించి, తద్వారా వాళ్లలో ఉత్తేజాన్ని జాగృతం చేయాలని మీరు నిజంగా కోరుకుంటే (అప్పటికి మీకీ అలవాటు పోకపోతే) మీరు అన్యాపదేశంగా మాట్లాడ వచ్చు. కాని యీలోగా, ఎంత కష్టమైనా కూడా, నిశితంగా మాట్లాడకుండా చూసు కోండి. ఓపిగ్గా, సంయమనంతో వుండండి. ఇది పిల్లల్లో పూర్తి భద్రతా భావాన్నీ, పూర్తి వెసులుబాటుతనాన్నీ కల్పిస్తుంది. మీ కృషికి శతాధిక ఫలితం కలుగుతుంది. ఈ కలిసి చేసే కృషిలో చిత్రమైన ఒక విషయం యేమిటంటే, మీ అబ్బాయి లేక అమ్మాయి మీరు చెప్పినది తు.చ. తప్పకుండా చేయవచ్చు, కాని వాళ్లు చేసిన ఆ పని వల్ల ఏదీ ప్రయో జనం లేకపోవచ్చు. మీరు అనుక్షణం పిల్లల పీకమీద కూర్చుని, "పెన్ను పట్టుకోవడం అలాగేనా! నేనెన్ని సార్లు చెప్పాను... ఆ అక్షరం సరిగ్గా రాయడం నీకు ఎప్పటికి చేతనవు తుంది?" అనడం సాగిస్తే యిదే జరగవచ్చు.

అసలు విషయం మీ స్వరంలోని చనువుమీదా, మార్దవంమీదా ఆధారపడుతుంది. ఈ అతి సూక్ష్మ ఆరంభం ప్రయోజనకరమవుతుందా లేక అంతా వెనకటి మాదిరిగానే ఉండిపోతుందా?

మీ అబ్బాయి లేక అమ్మాయి తొలి విజయాన్ని విధిగా గుర్తించండి.

అయితే "తొలి విజయం" అంటే ఏమిటి? అసలు మొత్తంమీద విజయం అంటే ఏమిటి? ఐదవ క్లాసు విద్యార్థికి ఏడవ క్లాసు లెక్కలు చేయగలగడం, పట్టణంలో జరిగే లెక్కల పోటీలో గెలవడం విజయం కావచ్చు. మరొకడి విషయంలో స్కూలులో క్లాసులు అయిన తరువాత యితర పిల్లల్తో కలిసి అడవిలోకి వెళ్లి, రాత్రి పొద్దుపోయేదాకా వుండి బంగాళదుంపలు తంపటవేయడం, గంటల తరబడి ఆయా విషయాలమీద హస్కు కొట్టే అలవాటును అధిగమించడం విజయం కావచ్చు. వాడు యీ అలవాటును అధిగమించి, టేబిలు దగ్గర కూర్చొని, తను వెనకబడిన సబ్జెక్టులో ఏదో విధంగా ముందుకి రావడం విజయమే మరి.

ఇంతకీ మనం దేన్ని విజయం అనవచ్చు?

ఇది మీకే బాగా తెలుసు. విజయానికి కింది సరిహద్దు రేఖ (నేనింతకు ముందు నిర్వ చించినట్లు) పిల్లవాడు టేబిలు ముందు కూర్చొని, దాదాపు ఏమీ చెయ్యకపోయినా కూడా మనం ఆశ వదులుకోకుండా, "నువ్వు హోమ్‌వర్కు చేసేందుకు కూర్చున్నావు. బాగుంది. ఈ రోజున నువ్వు ఎక్కువ చెయ్యలేకపోయావు. అయితేనేం, పరవా లేదు. నువ్వు చెయ్యాలని అనుకోవడమే ప్రధాన విషయం..." అని చెప్పాలి.

"కాని, యీ పిల్లవాడు ఏమీ చెయ్యలేదు కదా! వాడిని పొగడటం ఎందుకు?" అని మీరు ప్రశ్నించవచ్చు. అది నిజం కాదు. ఎందుకంటే, వాడు టేబిలు ముందు కూర్చొని, తన పాఠ్య పుస్తకాలు తెరిచి వుండకపోతే, లేక అసలు ఇంటికే వచ్చి వుండకపోతే వాడేమీ చేసివుండేవాడు కాదు. ఇంత కంటె నిర్దిష్టంగా చెప్పాలంటే, వాడు అడవినుంచీ, చలిమంట దగ్గర్నుంచీ రాత్రి 11 గంటల ప్రాంతంలో తిరిగివచ్చి వుంటే, వాడిని మెచ్చుకోవలసిన అవసరం ఏమీ వుండేది కాదు. అయితే యీ సందర్భంలో తను స్నేహితులతో కలిసి వుండాలన్న గాఢమైన కాంక్షను అధిగమించి, తనకి ఆత్మవిశ్వాసం లేని దాంట్లో, మరింత నిర్దిష్టంగా చెప్పాలంటే, తనకి నమ్మకం లేని దాంట్లో తనని తాను పరీక్షించుకునేందుకు పూనుకోవడం స్వల్ప విజయమేమీ కాదు.

పిల్లల ఆత్మవిశ్వాసాన్ని జాగృతం చేయాలని అనుకున్నప్పుడు పిల్లలు సాధించిన అతి స్వల్ప విజయాన్ని సైతం మనం గుర్తించాలి. మానవ హుందాతనాన్నీ, పరిశ్రమ చేసే స్వభావాన్నీ, స్వతంత్ర ప్రవృత్తినీ, సత్ పౌరతత్వాన్నీ తీర్చిదిద్దడంలో తోడ్పడేది సరిగా యీ భావమే.

మీ పిల్లల తొలి విజయాన్ని స్వయం శిక్షణ అనే అత్యున్నత కర్తవ్యంతో జోడించండి.

పిల్లల పెంపకంలో స్వల్పమైన వాటికీ పెద్ద వాటికీ మధ్య ప్రత్యక్ష సంబంధం వుంది. మీరు గమనించి, ప్రోత్సహించిన చిన్న విజయాల అనంతరం తమ స్వీయ సామర్థ్యంలోనూ, అపరిమిత మానవ శక్తిలోనూ విశ్వాసం పిల్లల్లో క్రమంగా పెరగనారంభిస్తుంది. పిల్లల్లో ఆత్మగౌరవ భావాన్నీ, మానవుడు తన కృషి ద్వారా, ఓర్పు, పట్టుదలల ద్వారా సమస్తం సాధించగలడన్న విశ్వాసాన్నీ పెంపొందించేందుకూ, అలవరచేందుకూ ప్రయత్నించకపోతే పిల్లల పెంపకం ద్వారా సాధించగలిగింది ఏమీ వుండదు.

పిల్లలు తమ స్వల్ప విజయాల ద్వారా తాము మహత్తర విజయాల దిశగా పురోగమిస్తున్నామని తెలుసుకోవాలి.

మళ్లీ మళ్లీ ప్రయత్నించేందుకు భయపడకండి. థామస్ ఎడిసన్ ఎలెక్ట్రిక్ బల్బు వెలిగేందుకు ముందు వేయికి పైగా ప్రయత్నాలు చేశాడు. అలాగే మనిషిలో ఒకప్పుడు మలిగిపోయిన జ్యోతి తిరిగి ప్రజ్వరిల్లేందుకు బహుశా అంత కృషీ అవసరం కావచ్చు. మీ కృషి మన పిల్లల్లో అంత హుందా అయిన ఆవిష్కరణలనూ చేసేందుకు దారితియ్యగలిగితే బ్రహ్మాండమే!

మంచి బోధకుడు ఎప్పుడూ ఈ మాటకి గల అత్యుత్తమ అర్థంలో ఓపిక గల పరిశోధకుడు. మీరు పిల్లల పాఠ్య క్రమాన్ని అధ్యయనం చేశారు, మీరు మీ పిల్లలతో కలిసి కృషి చేశారు, మీరు బోధనకి సంబంధించిన పుస్తకం చదివారు, మీరు మీ కుటుంబ జీవితాన్ని బోధన శాస్త్రానుగుణంగా పునర్వ్యవస్థీకరించాలని ఆలోచిస్తున్నారు – అంటే, మీరు పరిశోధనలో నిమగ్నులవుతున్నారన్న మాట.

పదిహేను లేక ఇరవై యేళ్ల క్రితం నేనిప్పుడు మిమ్మల్ని అడుగుతున్న పనిని చెయ్యమని అడిగి వుండేవాణ్ణి కాను. నాకిప్పుడు పిల్లల పెంపకం మనిషి, మొత్తంగా సమాజపు బౌద్ధిక జీవితంలో విడదీయరాని అంశీభూత భాగమవుతోందన్న పూర్తి నమ్మకం వుంది. తల్లి తండ్రుల అధికతర బాధ్యత భావాన్ని అలక్ష్యం చేసేందుకు వీల్లేదు, అయితే అదే ప్రధానాంశం కాదు. సాంస్కృతిక స్థాయిని పెంచడం, పిల్లల్ని పెంచవలసిన తక్షణావశ్యకత, తమ అనుభవాన్ని పిల్లలకి అందజేయడం, కొంతమేరకు తామే నేర్చుకోవడం – యిదీ ప్రధానాంశం.

విజయం సాధించాలని కోరుకుంటే, మీ పిల్లలతో సుదీర్ఘ సాంగత్యానికి సన్నద్ధం కండి. మీ తొలి ప్రయత్నం సఫలం కాకపోతే, బహుశా యితర అధ్యయన సమాచారంతో మళ్లీ ప్రయత్నించండి. అదీ సఫలం కాకపోతే, "పిల్లలకి మీరే బోధించుకోండి!" అంటూ టీచర్లని సవాలు చెయ్యబూనుకోకండి. కొంచెం పస్తాయించి మీ తదుపరి "ఎత్తు"ను గురించి జాగ్రత్తగా ఆలోచించండి. పది లేక ఇరవై ప్రయత్నాలు చెయ్యవలసివచ్చినా సరే, చెయ్యండి.

టీచర్లతో సంప్రదించడం మరచిపోకండి.

మీ పిల్లలు స్కూల్లో బాగా చదువుతూ వుండకపోతే, వాళ్ల బోధన విషయంలో అశ్రద్ధ జరిగి వుంటే, మీరు పదేపదే స్కూలుకి వెళ్లడం (పిలవా పెట్టకుండా) అవకతవకగానే వుంటుంది. మీ పిల్లల్లో ఏ కొంచెం పురోగతి వున్నా కూడా, మీరు పోయి టీచర్ని కలవడం చాలా ముఖ్యం. ఈ పురోగతి బోధనని గురించి మాట్లాడేందుకు మంచి అవకాశంగా వినియోగపడవచ్చు. అలా మీరు వెళ్లడంతో మీ లక్ష్యం సుస్పష్టంగా వుంటుంది. మీ పిల్లలకి ఏ సబ్జెక్టుల్లో మీరు తోడ్పడబోయేదీ మీరు టీచరుకి చెప్తారు. అయితే మీరు టీచరునుంచి ఏ లెక్కలు చెయ్యాలో, యే ఎక్సర్‌సైజులు, వగైరాలు చెయ్యాలో కొంత సలహా పొందాలని కోరుకోవచ్చు.

ఈ మాదిరి నిర్దిష్ట సంభాషణలో మీ వైఖరి సందిగ్ధంగా ఉండబోదు, గాభరా పడవలసిన అవసరం వుండదు.

మీ పిల్లలకి సాయం చెయ్యగలిగిన ప్రతి ఒక్కరినీ సమీకరించేందుకు ప్రయత్నించండి.

ఈ విషయాన్ని తార్కికంగా ఆలోచిద్దాం. మీ పిల్లలు జబ్బుపడితే, మీ వ్యవహారాల్లో చాలా వాటిని పక్కన పెట్టి, వాళ్లకి నయమయ్యేలా చూసేందుకు శ్రద్ధ వహిస్తారు. చదువులో వెనకబడటం అలాంటి యే జబ్బు కంటె – ఫ్లూ కంటె, గవదల కంటె, లేక ఆట

లమ్మ కంటె – భయంకరమైనది. చదువులో వెనకబడటం మానసిక అఘాతంగా పరిణమించి, పిల్లల్లో మానసికంగా ఆత్మన్యూనతా భావాన్ని కలిగిస్తుంది.

అనుభవంలో నాకొక విషయం నిరూపితమైంది. కొన్ని పిచ్చి సంప్రదాయాల మూలంగా చాలమంది తల్లితండ్రులు తమ పిల్లలకి వాళ్ల స్కూలు చదువులో సాయం చెయ్యరు. వాళ్ల రోజువారీ చదువులో నికరమైన ఆసక్తి చూపరు. వేరే కొందరు వ్యాపార పద్ధతిలో ఆలోచించి, చదువులో పిల్లల విజయాలకు టీచర్లదీ, స్కూలుదే బాధ్యత అనుకుంటారు. ఈ వైఖరి పూర్తిగా తప్పే కాకుండా, ప్రమాదకరమైనది కూడా.

చదువులో వెనకబడటానికీ, జబ్బుకీ మధ్య పోలికకి తిరిగి వెళ్దాం. జబ్బు ఎంత తీవ్రమైనదైతే, మీ పిల్లల్ని సాధ్యమైనంత త్వరగా స్వస్థుల్ని చేసేందుకుగాను మీరు అంత ఎక్కువగా సలహాదారుల, నిపుణుల సలహాకోసం ప్రయత్నిస్తారు. మీ పిల్లలు స్కూల్లో బాగా చదవాలని మీరు కోరుకుంటే, లేక మరింత నిర్దిష్టంగా చెప్పాకోవాలంటే, "ప్రతికూల నమూనాకి సంబంధించిన లక్షణాలను" అధిగమించాలని కోరుకుంటే, మీరు స్వయంగా చేసే ప్రయత్నాలతో బాటు, వాళ్లకి తోడ్పడే ప్రతిదాన్నీ వినియోగించుకోవాలి.

స్కూలు మిత్రులు, టీచర్లు, బంధువులు – యిలా మీ పిల్లలకి ఆచరణలో ఏ మాత్రమైనా తోడ్పాటు యివ్వగల ప్రతి ఒక్కరి తోడ్పాటూ పొందాలి. ఇలా చేసేటప్పుడు, అనవసరమైన నీతి బోధలకీ, అనవసరమైన మందలింపులకీ వ్యతిరేకంగా మీరు మీ పిల్లల్ని కాపాడాలి.

కొన్ని సందర్భాల్లో స్కూలు మిత్రులు ఒక టీచరు చేసేదాని కంటె, తల్లితండ్రులు చేసేదాని కంటె ఎక్కువ చేయగలుగుతారు. దానికి చాలా కారణాలు ఉండవచ్చు: పిల్లవాడికి తన మిత్రునిమీద వుండే నమ్మకం, అతనిపట్ల వుండే గౌరవం లేక ప్రేమ, లేక తరచు ఆ మిత్రుడి బోధన శాస్త్రపరమైన ప్రతిభ.

అయితే "పైనుంచి" ఎవరిమీదనైనా మీరు ఆధారపడేటప్పుడు, మీ పిల్లల భవితవ్యం ఆధారపడేది ప్రధానంగా మీమీదనే అన్న విషయాన్ని గుర్తుపెట్టుకోండి.

స్వతంత్రానికి పరివర్తన స్ఫుటంగా కనిపించేదిగా వుండకూడదు.

బోధన శాస్త్రపరమైన మార్గదర్శకత్వం పిల్లల స్వతంత్రంలో విడదీయరాని భాగం. హేతుబద్ధమైన మార్గదర్శకత్వం స్వతంత్రానికి ప్రేరణ కల్పిస్తుంది (యిదే దాని ప్రధాన లక్ష్యం). పెంపకపు క్రమంలో పెద్దవాళ్లకీ పిల్లలకీ మధ్య పరస్పర ప్రతివర్తన ఎప్పుడూ సంభాషణ రూపంలో, ఎప్పుడూ రెండు అంతస్తుల్లో వుండాలి. మొదటి అంతస్తు మీ మార్గదర్శకత్వం. అది ప్రభావితంచేసేదిగా, తేలిగ్గా కూడా వుండాలి. అప్పుడే "స్వాతంత్ర్య అంతస్తు" స్వేచ్ఛగా అభివృద్ధి చెందుతుంది. విద్యాబోధనలో మార్గదర్శకత్వం పాలు ఎక్కువైతే, అది స్వతంత్ర ప్రవృత్తిని మందగింపజేస్తుంది, దాని వల్ల ఎక్కువ ఫలితం వుండదు.

స్వతంత్ర కృషి మొలకలు వెంటనే అంకురిస్తాయి, కాని అవి చాలా అల్పంగా వుంటాయి. అందుకే, పిల్లల చొరవకి నేర్పుగా దోహదం చెయ్యడమే ప్రధానావసరం. వాళ్ల స్వతంత్ర ప్రయత్నాల్లో సాధారణంగా కొన్ని పొరపాట్లు వుంటాయి. పిల్లలకి యీ పొరపాట్లు చేసే హక్కు వుందనీ, పొరపాట్లు లేని పిల్లల పరిపూర్ణ కార్యకలాపాలంటూ ఏవీ వుండవనీ, పిల్లలు తమ పొరపాట్లను అధిగమించేలా ప్రయత్నించడం బోధన కర్తవ్యాల్లో ఒకటనీ జ్ఞాపకం వుంచుకోండి.

బోధన శాస్త్రపరమైన మార్గదర్శకత్వ, స్వతంత్రాల మధ్య ఐక్యతలో ఒక మాదిరి ప్రతికూల ప్రభావం గర్భితమై వుంటుంది. పిల్లలు మార్గదర్శకత్వానికి అలవాటుపడతారు. పెద్దవాళ్ల సమక్షంలో మాత్రమే స్వతంత్రంగా వ్యవహరించేందుకు అభిముఖంగా వుంటారు. పిల్లలకి నికరమైన స్వతంత్రాన్ని క్రమంగా నేర్పాలి. దాన్ని తొందరగా అలవరచకూడదు. మొదట మీరు పిల్లలకి "నేను బయటకి వెళ్లాలి, నేను లేనప్పుడు ఫలానా ఫలానా పనులు చెయ్యి" అని పురమాయించండి. మీ అబ్బాయి లేక అమ్మాయి మీరు అప్పగించిన "స్వతంత్ర నిర్దిష్ట కృషి" చెయ్యకపోయినా మీరు నిరుత్సాహపడకండి. మీరు చెయ్యమన్న పని ఎంత తేలికో చూపించండి. మీరు వెనకనుంచి ఏమీ అందించకుండా పిల్లల్ని స్వంతంగా చెయ్యనివ్వండి. మీ మార్గదర్శకత్వంలో మీ అబ్బాయి లేక అమ్మాయి స్వతంత్రంగా చెయ్యడానికి అలవాటుపడ్డాక మాత్రమే, వాళ్లంతట వాళ్లు స్వయంగా చెయ్యడాన్ని ప్రోత్సహించండి.

పిల్లలు నేర్చుకోవడాన్ని వాళ్ల మొత్తం సంవేదనలనుంచి వేరుచెయ్యడం సాధ్యం కాదనే విషయం గుర్తుంచుకోండి.

ఈ ప్రకరణంలో నేనిచ్చిన సలహాకీ, అంతకు ముందరి ప్రకరణంలో యిచ్చిన సలహాకీ మధ్య ఉమ్మడి అంశం చాలా వుందన్న విషయం మీరు గమనించారా? రేఖా మాత్రంగా యివ్వబడినవి సాధారణ సూత్రాలు. ఈ సూత్రాలను పిల్లల్ని వాళ్ల సొంత అవసరాలను తీర్చుకునే ప్రాథమిక రూపంలోనూ, వాళ్ల బౌద్ధిక కార్యకలాపాల్లో స్కూలు పిల్లల అత్యంత సంశ్లిష్ట జీవితంలోనూ మగ్నం చేయడం ద్వారా అమల్లో పెట్టవచ్చు. ఈ సాధారణ సూత్రాన్ని యీకింది సంబంధాల గొలుసుగా వెల్లడించవచ్చు.

అతి చిన్న పనులతో, నిస్సందేహంగా సాధింపబడగలవాటితో ప్రారంభించి, పిల్లలతో ప్రతివర్తన ఫలితంగా మీరు కార్యకలాపాల అవసరాన్ని రూపొందిస్తారు. పనిమీదా, స్వతంత్ర కృషిమీదా ఆధారపడినప్పుడు, సంతోషానందాలతో మేళవింపబడినప్పుడు కార్యకలాపాలు స్నేహపూర్వక, గంభీర సంబంధాలకు దారితీస్తాయి. కార్యకలాపాలను, సరైన సంబంధాలను జోడించడం నైతిక పునాది ఏర్పాటుకీ, పిల్లల్లో గ్రహణ సామర్థ్యాల అభివృద్ధికీ దారితీస్తుంది.

మీ అబ్బాయి లేక అమ్మాయి ఐదవ రోజునో, పదో రోజునో "చిన్న" పనిని నిర్వర్తిస్తే, అలా చేయడం ద్వారా వాళ్లు మీపట్ల, వాళ్ల స్నేహితులపట్ల, వాళ్ల టీచర్లపట్ల తమ

వైఖరిని మారుస్తారు. ఈ మార్పులు యింకా స్వల్పమైనవే, అవి యిప్పుడిప్పుడే ద్యోతక మవుతున్నాయి. కాని అవి వున్నాయి. పిల్లలు స్వతంత్రంగా నిర్వర్తించిన యిరవై ముప్పయ్ "సూక్ష్మ కర్తవ్యాల" అనంతరం పిల్లల సంవేదనలు నిశితమైన మార్పుకి లోనవుతాయి. కొంత కాలం వాళ్ళు "తలెత్తుకు తిరుగుతారు." వాళ్ళని చివాట్లు పెట్టకండి. తమ తొలి విజయంనుంచి వాళ్ళని సంతోషం పొందనివ్వండి. ఈ పూర్తి సహజసిద్ధ, బాల్యోచిత గీర్వాణం త్వరలోనే వెనకపట్టు పడుతుంది.

వాళ్ల ఆత్మవిశ్వాసానికి మీరు అత్యంత ప్రాముఖ్యం యివ్వాలి. అయితే "పటిష్ఠమైన యీ ఆత్మవిశ్వాసాన్ని" దేన్నుంచి యింకేదో తయారుచెయ్యాలో అలాంటి ముడి పదార్థంగా మీరు పరిగణించాలి. పిల్లలు కొత్తగా సంతరించుకున్న యీ సంవేదన స్వాతిశయంలోకి మారకూడదు. ఈ "ఆత్మవిశ్వాస" శక్తి యితర రకాల కార్యకలాపాల్లో కూడా అను భూతమైతే, అప్పుడది ఆదర్శవంతమైనదవుతుంది. అయితే, ఏ యితర కార్యకలాపాల్లో? ప్రధానంగా పనిలో. చదువు మధ్య విరామంగా ఏదో ఒక పనిని ప్రవేశపెట్టేందుకు ప్రయ త్నించండి. "మనం యిప్పుడే కొంత మంచి పని చేశాం. ఇప్పుడింక మనం కలిసి భోజనం సంగతి చూద్దాం. నువ్వు వెళ్లి బ్రెడ్డు, పాలు తీసుకురా, నేను కొన్ని చాప్‌స్టిక్కులు వేయి స్తాను. లేకపోతే నువ్వు చాప్స్ వేయించు, నేను పోయి బ్రెడ్డు, పాలు తెస్తాను" అని ప్రతిపా దించండి. మీ అబ్బాయి లేక అమ్మాయి మీ ప్రతిపాదనను తిరస్కరిస్తే, మీరు కోపం తెచ్చు కోక, "సరే, విశ్రాంతి తీసుకో. కొంచెం సేపు పోయాక కలిసి యిల్లు శుభ్రం చేద్దాం" అని చెప్పండి.

మరోలా చెప్పాలంటే, మీ సంయుక్త కృషి, మరింత కచ్చితంగా చెప్పాలంటే, ఆ పని పద్ధతులు చదువు పరిధిని దాటి మీ సాంగత్యాలకు బదిలీ చేయబడాలి. అలాగే రెండో వైపు కూడా. మీ పిల్లలతో కలిసి మీరు షికారుకి, థియేటరుకి, సినిమా చూసేందుకు, లేక సుదీర్ఘమైన నడకకి వెళ్లినప్పుడు మీరు పొందే ఆనందాన్ని మీ పిల్లలతో కలిసి చదివే చదువుమీదకి మార్చవచ్చు. వివిధ కార్యకలాపాల, సంబంధాల యీ మాదిరి "పరస్పర బదిలీ" సంయోజనం మాత్రమే సరైన బోధన శాస్త్రీయ ఫలితానికి దారితీస్తుంది.

పిల్లల హోమ్‌వర్కు తర్వాత తాజా గాలిలోకి తీసుకెళ్లడాన్ని, వ్యాయామం చేయించడాన్ని మరచిపోకండి.

పిల్లల ఆరోగ్యంపట్ల యీ శ్రద్ధలో పౌష్టికాహారం, నిద్ర, శారీరక చలనం, తాజా గాలిలో తిరగడం వంటి కొన్ని ముఖ్యాంశాలు యిమిడి వున్నాయి. పట్టణవాసపు స్కూలు పిల్లల జీవితం గురించి ప్రత్యేక పరిశోధన ద్వారా లభించిన చిత్రం ఏమంత ఆకర్షణీయంగా లేదు. వాళ్ళు తాజా గాలిలో తగినంత కాలం మసలరు. తాజా గాలిలో 2నుంచి 3 గంటల దాకా గడపవలసింది, వాళ్ళు 30–40 నిమిషాలు మాత్రమే గడుపుతారు. 2–3 గంటల శరీర వ్యాయామం, పనిచేయవలసి వుండగా వాళ్ళు 20–30 నిమిషాలు గడిపితే గడు

వుతారు. ఆ స్థితిలో వాళ్ల శారీరక పరిస్థితి మానసిక శ్రమకి సన్నద్ధంగా వుండదు. అందుకే సాధ్యమైనంతవరకు దృఢమైన శరీరాన్నీ, చురుకైన మస్తిష్కాన్నీ నిలుపుకోవడంలో పిల్లలకి తోడ్పడండి. ఇందుకుగాను వున్న ప్రతి అవకాశాన్నీ ఉపయోగించుకోండి. శరీర వ్యాయామ సామగ్రిని (డంబెల్సు, బరువులు, స్కిప్పింగు తాళ్లు, సాగతీసే సాధనాలు, వగైరాలను) పిల్లలకి సమకూర్చండి. పిల్లల గదిలో వాల్ బార్సు బిగించండి. అడ్డ పట్టీని గట్టిచెయ్యండి. పిల్లలు క్రమబద్ధంగా వ్యాయామం చేయకపోయినా, మధ్యమధ్యలోనే (వాళ్ల స్నేహితులు వచ్చినప్పుడే) చేసినా కూడా ప్రయోజనాలు అధికంగానే వుంటాయి.

నికీతిన్లది ఒక పెద్ద కుటుంబం. ఆ కుటుంబ సభ్యుల్లో ఏ ఒక్కరూ క్రమబద్ధమైన క్రీడల్లో పాల్గొనరు. కాని నేను వాళ్ల ఇంటికి వెళ్లిన రోజున వాళ్ల రెండేళ్ల అమ్మాయి లేనా యింటి పైకప్పుని తాకే వాల్ పోలుమీద పైకీ, కిందకీ సుమారు ఇరవై సార్లు ఎక్కి, దిగింది. వాళ్ల అమ్మాయిల్లో మరొకామె ఆ గంట సేపట్లో కొన్ని సార్లు ఒక మూల వున్న "చిన్న వల" అనబడే ఉయ్యాలలోకి ఎక్కి దిగింది. ఇది కారిడార్‌లో పైకప్పుకి వేలాడే చిన్న ఉయ్యాల. ఆ "చిన్న వల"లో విశ్రాంతి తీసుకోవచ్చు, పుస్తకం చదువుకోవచ్చు, కొంత ప్రశాంతంగా ఆలోచించుకోవచ్చు. అయితే, శారీరకంగా యింకా సన్నద్ధం కాని పిల్లవాడికో, పిల్లకో దాంట్లోకి ఎక్కడం, దాంట్లోంచి దిగడం అంత తేలిక కాదు. ముందు ఆవరణలో హారిజాంటల్ బార్లు, ఉయ్యాలలూ ఉన్నాయి. కాగా సహజంగానే, ఎలాంటి కచ్చితమైన వరుసా లేకుండా, పిల్లలు తమకి కావాలని అనుకున్నప్పుడల్లా ఐదారు నిమిషాల పాటు ఆ సాధనాల సాయంతో సరదాగా గంతులేస్తారు. ఆ సమయంలో వాళ్ల శరీరాలకు తగినంత వ్యాయామం లభిస్తుంది. అది వాళ్లలో మరింత మానసిక ఉత్పాదకతను పెంపొందిస్తుంది. మొత్తంమీద మరింత మెరుగైన ఆరోగ్యానికి దారితీస్తుంది.

పిల్లలతో కలిసిమెలిసి వున్నప్పుడు వాళ్లకి ఆత్మగౌరవాన్ని పెంపొందించుకునేందుకు తోడ్పడండి.

సాంఘిక మనస్తత్వ శాస్త్రవేత్తలు యీకింది నియమాన్ని రూఢంచేశారు. తనని తాను పనికిమాలిన వాడినిగా పరిగణించుకునే వ్యక్తి ఏ పనీ చెయ్యలేడు, తన పరిస్థితిని మెరుగుపరచుకునేందుకు బాగా గట్టిగా కృషిచెయ్యడు. ఇందుకు భిన్నంగా, తన విలువపట్ల ఉన్నతమైన అంచనా కలిగిన వ్యక్తి కష్టించి గట్టిగా పనిచేసేందుకూ, తన శక్తియుక్తుల్ని గరిష్ఠ స్థాయిలో వినియోగించేందుకూ అభిముఖంగా వుంటాడు. కష్టాలకు తల వంచడం పరువు తక్కువగా పరిగణిస్తాడు. ఆత్మగౌరవం ప్రవర్థిత సామర్థ్యాలకి, ఒకడు తనని గురించి తాను ఎలా భావించుకుంటాడన్న దానికి, హోదాకి, తన స్వీయ వ్యక్తిత్వపు అంచనాకి అపూర్వమైన కొలమానం.

ఆత్మగౌరవం కలిగిన పిల్లలు "యీ పని యితరులు చెయ్యగలరు కనుక నేనూ చెయ్యగలను" అన్నట్లు ప్రవర్తిస్తారని చెప్పవచ్చు.

ఆత్మగౌరవం అభివృద్ధి చెందని పిల్లలు యిలా వ్యవహరిస్తారని చెప్పవచ్చు: "నేనీ పని ఎన్నడూ చెయ్యలేను." (నేనిక్కడ తల్లితండ్రులకు ఒక విషయం చెప్పదలచుకున్నాను: దీన్ని మామూలు పిల్లల ప్రవర్తనతో గలిబిలి చెయ్యకూడదు. మామూలు పిల్లవాడు తన సామర్థ్యాన్ని పరీక్షించుకునేటప్పుడు, ముందు "అబ్బే, నేను దీన్ని ఎప్పటికీ చెయ్యలేను" అనుకుంటాడు. కాని నిజానికి వాడి ఉజ్వలమైన నవ్వు, మెరిసే కళ్లు యిందుకు పూర్తి భిన్నంగా చెప్తాయి: "భలే, ఎంత ఆసక్తికరంగా వుందో. నేనింతకు ముందెప్పుడూ ప్రయత్నించలేదు. నాకు స్వయంగా దీన్ని చెయ్యాలని మహా కుతిగా వుంది...".)

ఆత్మగౌరవం, ఆత్మన్యూనతా భావం—యీ రెండింటి లక్షణాలూ ఏమిటి? ఈ రెండింటి మధ్యా తేడాలను గురించి సాంఘిక మనస్తత్వ శాస్త్రం ఏం చెప్తుంది?

విజయం సాధ్యమవుతుందనే నమ్మకం లేని సమస్యలను దాటవేయడమనేది ఆత్మగౌరవం తక్కువ స్థాయిలో వున్నవాడి ప్రధాన లక్షణాల్లో ఒకటని మనస్తత్వ శాస్త్రజ్ఞులు గమనించారు. తను చేసేదాన్ని యితరులు ప్రతికూలంగా అంచనా వేసినప్పుడు, అతను మనస్సులో తెగ మధనపడిపోతాడు. అతను విమర్శను పట్టించుకున్నట్లు పైకి కనిపించకపోయినప్పటికీ, విమర్శ అతన్ని బాగా పీడిస్తుంది. "నువ్వీ పని సరిగా చెయ్యలేదు" అని ఎవరైనా అన్నప్పుడు, "ఈ పని చస్తే చెయ్యను" అని అతను నిర్ణయించుకుంటాడు. అతనికి ఆత్మగౌరవం తక్కువ. "నువ్వీ పని యింత కంటె మెరుగ్గా చేసి వుండగలిగేవాడివి" అని ఎవరైనా విమర్శిస్తే, యీ అంచనాతో అతను బాగా కించపడిపోయి, ధైర్యం కోల్పోతాడు. అతను నిరుత్సాహం చెంది అన్నింటిపట్లా ఉదాసీనుడవుతాడు.

ఆత్మన్యూనతా భావం కలిగిన పిల్లలు ఏదైనా బాగా చేసినప్పుడు, ఇతరులెవరూ దాన్ని గమనించకపోతే, వాళ్ల మనస్సులు గాయపడతాయి. ఎవరిమీదో పగ తీర్చుకుంటున్నట్లు "సరే నేనీ పని చస్తే యింక చెయ్యను" అని నిశ్చయించుకుంటారు. అలాంటి పిల్లలు తమ పాఠాలు తమకోసం కాక యితరులకోసం చదువుతున్నట్లు అనుకుంటారు.

దీనికితోడు ఆత్మ అన్యధాకరణ కూడా ఉత్పన్నం కావచ్చు. తన సొంత సామర్థ్యం మీద నమ్మకం లేని పిల్లలు యితరులను అనుకరించేందుకు ప్రయత్నిస్తారు. అలా చేసేటప్పుడు, వాళ్లు యితరుల దుస్తుల్ని ధరిస్తున్నట్లు, ముసుగులు వేసుకొంటున్నట్లు, వాళ్ల పాత్రల్ని తాము ఆపాదించుకొంటున్నట్లు కనిపిస్తారు.

తమ వ్యక్తిత్వాన్ని వ్యక్తంచేసే మార్గం కనపడని అసంతృప్తితో వాళ్లు పగటి కలల్లో, అవాస్తవిక ఊహా లోకాల్లో విహరిస్తారు. గంటల తరబడి తాము బలవంతులమనీ, సాహసికులమనీ, మనో నిబ్బరం కలిగినవాళ్లమనీ, విశృంఖలురమనీ వాళ్లు ఊహల్లో తేలగలరు. జీవితంలో తమ క్రియాశీల భాగస్వామ్యం గురించి వీళ్లు అత్యంత ఊహాత్మక చిత్రాలు చిత్రించుకోగలరు (స్కూల్లో, హోమ్‌వర్కు చేసుకునేటప్పుడు లేక చదువుకునేటప్పుడు యిది సంభవిస్తుంది). అలాంటి నిరంతరాయమైన భ్రమాత్మక క్రమం వాళ్లని వాళ్లనుంచే

అన్యథాకరించి, "ఎండమావి"కీ, వాళ్ల సొంత వాస్తవ పాటవాలకీ మధ్య అడ్డుగోడలు నిలువుతుంది.

పిల్లల ఆత్మన్యూనతా భావానికి అవమానాలు, చివాట్లు, తిట్లు, వ్యంగ్యం కూడా తోడైతే, వాళ్లలో పగ అత్యంత ప్రమాదకరమైన స్థాయిలో పేరుకుపోవచ్చు. అలాంటి పిల్లల మనసుల్లో "సరే, మీ పని పడతాను!" అనే భావం రహస్యంగా మెదులుతుంది. వాళ్లు తరుణంకోసం వేచి వుంటారు. తమ వ్యక్తిత్వాన్ని తగినంతగా లెక్కచెయ్యని స్నేహితులమీద పగ తీర్చుకునేందుకు వాళ్లు నిరీక్షిస్తారు. వాళ్లు తమ బంధువులకు (తమని ఎద్దేవా చేసిన అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, అత్తలు, దొడ్డమ్మలకు) తమ విలువను నిరూపించేందుకు కాసుకొని వుంటారు. తమ "ప్రత్యేక" విద్యార్థుల ప్రవర్తనని మెచ్చుకోని టీచర్లకు వాళ్లు తమ పొరపాటును గుర్తించేలా చేసే తరుణంకోసం ఎదురు చూస్తూ వుంటారు.

కొన్ని సందర్భాల్లో యిలాంటి నిరీక్షణలో వున్న పిల్లలు తమ అవమానిత ఆత్మగౌరవపు తక్కువ స్థాయిని అధిగమించేందుకుగాను "గెంతాలని" నిర్ణయించుకుంటారు. కాని చాలా తరచుగా యీ ధోరణి తమ చుట్టూ వున్నవాళ్లపట్ల పిల్లల్లో నిర్ణయాత్మక భావాలు గూడు కట్టుకునేందుకు దారితియ్యవచ్చు. అలాంటి పిల్లలు పరిణతులయ్యే కొద్దీ, తమకి తెలియకుండానే (యీ అవకాశాన్ని మినహాయించకూడదు) తమలో ఏళ్ల తరబడిగా పేరుకొన్న నిర్దయాత్మక భావాలనూ, కోపాతిరేకాన్నీ "ప్రసరింపజేయవచ్చు."

ఇందుకు భిన్నంగా ఆత్మగౌరవం ఉన్నత స్థాయిలో వున్న పిల్లల్లో ("ఉన్నత" అనే మాటని నేనిక్కడ "మామూలు" అనే అర్థంలో వాడుతున్నాను) మనోవైకల్యం గాని, విశీర్ణత గాని లేకపోవడంతో బాటు వాళ్ల జీవిత సరళి యావత్తూ మరో ప్రాతిపదికమీద నిర్మింపబడుతుంది.

అబద్ధం ఆడవలసిన, తమని తాము కొంచెపరచుకోవలసిన లేక శిక్ష అంటే భయపడవలసిన అవసరం వాళ్లకి వుండదు. వాళ్లకి ఫెయిల్ మార్కులు వచ్చినప్పుడు తమ తల్లితండ్రులు తమని మెచ్చుకోరని తెలుసు. అలాగని, తమని శిక్షించరని కూడా తెలుసు. తమకీ ఫెయిల్ మార్కు ఎలా, ఎందుకు వచ్చిందో వాళ్లు తమ తల్లితండ్రులకి చెప్తారు. ఎందుకంటే, వాళ్ల యిళ్లల్లో యిలా అపజయాల విషయం చర్చించుకోవడం సామాన్య విషయం. తమ తల్లులూ, తండ్రులూ "ఎదురు దెబ్బలు" తగిలినప్పుడు ప్రవర్తించినట్లే యీ పిల్లలూ ప్రవర్తిస్తారు. ఏదైనా దురదృష్టకరమైనది సంభవించినప్పుడు, వాళ్ల కుటుంబాల్లో అందరూ – పన్నెండేళ్లున్న యీ పిల్లలతో సహా – ఆ దుర్ఘటన గురించి, యింకా స్పష్టంగా చెప్పాలంటే, దాన్ని అధిగమించే మార్గాలను గురించి చర్చలో పాల్గొంటారు.

దురదృష్టం ఎదురైనప్పుడు వీళ్లు ధైర్యం కోల్పోరు. అందరి లాగే వీళ్లూ బాధపడతారు, అయితే అంత మాత్రాన వీళ్లు బెంబేలుపడి వెనక్కి తగ్గరు. క్లిష్ట పరిస్థితి

నుంచి బయటపడే విషయంలో వీళ్ళు తమ శక్తి సామర్థ్యాలను శంకించరు. క్లిష్ట పరిస్థితుల్లో వ్యవహరించవలసిన ఒక ప్రామాణిక పద్ధతిని వీళ్ళు రూపొందించుకొని వుంటారు. తమ లక్ష్య సాధనలో తమకి సాయపడగల వాళ్ళతో వీళ్ళు ప్రయత్నపూర్వకంగా సంబంధాలు నెలకొల్పుకుంటారు.

క్లిష్ట పరిస్థితుల్లో యితరులకు సాయంచేసేందుకు సైతం వీళ్ళు సిద్ధపడతారు. ఉన్నత స్థాయి ఆత్మగౌరవం కలిగినవాళ్ళ స్వాభావిక లక్షణాల్లో ఒకటేమిటంటే, వాళ్ళు ఉదారమూ, విశాలమూ అయిన హృదయాలు కలిగి వుంటారు. బలహీనులు క్లిష్ట పరిస్థితుల్లో తమ కోపాన్ని యితరులమీద వెళ్ళగక్కగా, బలవంతులు, ఉన్నతులు తమ విషాద, దురదృష్ట తరుణాల్లో యితరులపట్ల మరింత సున్నితంగా, ఆర్ద్రంగా వుంటారు.

వీళ్ళు ప్రతి ఒక్కరిపట్లా – తమ కంటె చిన్నవాళ్ళపట్లా (అందుకే చిన్నవాళ్ళు వీళ్ళంటే యిష్టపడతారు), తమ కంటె బాగా పెద్దవాళ్ళపట్లా కూడా – ఒకే మాదిరిగా వ్యవహరిస్తారు. పెద్దవాళ్ళతో "సమానులుగా వుండటం" అంటే, వీళ్ళ దృష్టిలో పెద్దవాళ్ళంటే నికరమైన గౌరవం చూపడం అని అర్థం. పెద్దవాళ్ళ మాటలు శ్రద్ధగా వినేందుకు వీళ్ళు సంసిద్ధులై వుంటారు. ఒకవేళ పెద్దవాళ్ళు చెప్పిన మాటలతో మరీ ఏకీభవించకపోతే వీళ్ళా విషయం ఎప్పుడూ వాళ్ళకి చెప్పి, తమ అభిప్రాయాన్ని సమర్థించుకుంటారు. వీళ్ళు పెద్దవాళ్ళకి తోడ్పడేందుకు సిద్ధంగా వుంటారు. తాము బొత్తిగా ఆమోదించని సలహాలను సైతం వీళ్ళు వింటారు, "అయితే యీ దృక్పథం కూడా వుందన్న మాట. దీని సంగతి కూడా ఆలోచించాలి" అనుకుంటారు.

తమని ఎవరూ అలక్ష్యం చెయ్యలేరనీ, నిర్లక్ష్యమూ చేయలేరనీ తెలుసును గనుక వీళ్ళు ఎవరి సమక్షంలో వున్నా కూడా సముచితంగా ప్రవర్తిస్తారు. తమని సముచిత గౌరవంతో చూస్తారన్న విషయంలో వీళ్ళకి ఎలాంటి సందేహమూ వుండదు. పిల్లలు స్వస్వరూప జ్ఞానం పొందేందుకు తోడ్పడండి.

ఒకే పిల్లవాడి స్వాభావిక లక్షణాలను గురించి తమతమ అంచనాలను చెప్పమని పది మందిని అడగండి. పదిమందీ పది విధాలుగా చెప్తారు. పిల్లవాడు స్కూల్లో ఎలా చదువుతాడన్నదాన్ని బట్టి టీచర్లు అతన్ని అంచనా కడతారు. బామ్మా, తాతా పిల్లవాడు ఎంత ఆపేక్షపరుడు, విధేయుడు, శుచి శుభ్రతలపట్ల వాడికి ఏ మాత్రం శ్రద్ధ వుంది, వాడికి ఏ మేరకు పరిశ్రమ స్వభావం, దయ వున్నాయి అన్నదాన్ని బట్టి వాడిని అంచనా కడతారు. వాడి స్నేహితులు వాడు ఏ మేరకు "బృంద ప్రమాణాలను" అందుకుంటాడు, ఏ మేరకు వాడిమీద ఆధారపడవచ్చు, వగైరా అంశాల ఆధారంగా వాడిని అంచనా వేస్తారు. కొందరు వాడి లోపాలను వేలెత్తి చూపగా, మరి కొందరు వాడి ప్రతిభలను పేర్కొంటారు.

తనకి సంబంధించిన ఏ వాస్తవాన్ని (స్వరూప జ్ఞానాన్ని) గురించి పిల్లవాడు తెలుసుకోవాలి? ఎందుకంటే, పిల్లవాడు పెరుగుతున్నాడు. వాడు ఈ రోజున ఒక వ్యక్తి,

రేపు మరొకడు, ఎల్లుండ పూర్తిగా అందుకు భిన్నమైనవాడు. పిల్లలకి వాళ్లని గురించిన పూర్తి సత్యం, వాళ్ల వాస్తవంలో ఎలా వున్నారన్న విషయం చెప్పడమంటే, వాళ్ల నికరమైన పాటవాలను వాళ్ల ముందు వెల్లడించడం పిల్లలు తమ ఆదర్శ నమూనాలను ఎలా సమీపిస్తున్నారో వాళ్లకి తెలియజెప్పడం. పిల్లలకి వున్న వాస్తవ గుణాలను (బహుశా కొన్ని ప్రతికూలమైన వాటితో బాటు) వాళ్లలో ఉండాలని ఆశించేవాటితో సరిపోల్చాలి.

చాలా తరచు తమ సామర్థ్యం యేమిటో పిల్లలకి తెలియదు. తమని గురించి యితరులు అనుకునేదాన్ని బట్టి వాళ్ల తమని తాము అంచనా వేసుకుంటారు. యిదెలా జరుగుతుందో చూద్దాం. చాలా మంది పిల్లలు సగటు విద్యార్థులు. స్కూల్లో వాళ్లకి ఒక రిపోర్టు (అనధికారికమైనదే అనుకోండి) యిస్తారు, వాళ్ల ఫలానా ఫలానా అని, దాదాపు నాసి విద్యార్థులని. ఇళ్ల దగ్గర తమ తల్లితండ్రుల దగ్గర్నుంచి "వాడికి ఏ ప్రత్యేక సామర్థ్యాలూ లేవన్న మాట, యింక చేసేదేముంది..." అన్న నిర్ధారణలు వింటూ వుంటారు. పెద్దవాళ్ల మధ్య యీ అప్రకటిత ఏకీభావం (ముందు చేసుకున్న ఒప్పందం ప్రకారం కాక, లోకజ్ఞాన స్థాయిలో వట్టి సాధారణీకరణ) ప్రాతిపదికమీద పిల్లలు తమని గురించి తాము "నాకు పుట్టుకతో ఏ సామర్థ్యాలూ లేవు. అంటే సామర్థ్యాలు ప్రతి ఒక్కరికీ ఉండవన్న మాట. అంటే అందరూ అదృష్టవంతులు కారన్న మాట" అనే అంచనా వేసుకో నారంభిస్తారు. వాళ్ల తమని గురించిన తమ అంచనాలకు, అంతే రహస్యమూ, తరచు విషణ్ణమూ అయిన యీకింది నిర్ధారణలను జోడించుకుంటారు: "దీనికి తోడు, నా అందవికారమైన రూపమొకటి" (అన్నట్లు, అత్యంత ఆకర్షణీయమైన పిల్లలు సైతం తరచు సరిగ్గా యీ కించతో సతమతమవుతూ వుంటారు), "నన్ను ఎవరూ ప్రేమించరు" అనుకుంటారు.

బహుశా వాళ్లిలా వేసుకునే స్వయం అంచనాలను భగ్నం చెయ్యడం వెంటనే సాధ్యం కాదు. పిల్లలు తమని తాము మరో దృష్టితో చూసుకొనేందుకు అవకాశమున్న సన్నివేశంలోకి వాళ్లని తప్పనిసరిగా నడపాలి. ఏదైనా ఒక ఉన్నత భావోద్దీప్తమైన పని చేసేటప్పుడు, సృజనాత్మక ప్రచోదన కలిగినప్పుడు, పట్టుదలగా పని చేసేటప్పుడు మనుషుల ముఖాలు సహజ సుందరంగా వుంటాయన్న విషయాన్ని పిల్లలకి నిరూపించాలి.

మీ అనుమానాలతో, అవిశ్వాసంతో పిల్లల్ని వేధించకండి.

"నా అమ్మాయి తలవంచుకొని నడుస్తున్నట్లుంది. ఈమధ్య తరచు అది అబద్ధాలు ఆడుతోంది" అంది ఒక తల్లి.

నేను కిటికీలోంచి బయటకి చూశాను: ఆ అమ్మాయి ఒక చేత్తో పుస్తకాల సంచి పట్టుకొని దిగులుగా, మెల్లగా నడుస్తోంది. ఆమె గ్లొవ్‌లు వేసుకోలేదు. ఆకురాలు కాలపు తీవ్రమైన, నిశితమైన గాలులు వీస్తున్నాయి. అదిగో ఆమె ఆస్యా. ఆమె నవ్వు కొంచెం బిడియంగా వుంది, కొంచెం ఆలోచనా మగ్నంగా వుంది, కొంచెం ఆశాపూరితంగా వుంది...

సరిగ్గా అంతకు ముందే ఆమె తల్లి తన కళ్లలో ఆందోళన తొంగి చూస్తూండగా,

నాతో యిలా చెప్తోంది: "మా అమ్మాయి నాతో అబద్ధాలాడటం మొదలెట్టిందన్న విష యం నేను గమనించాను. అందుకని నేనీ కింది ఆట ఏర్పాటు చేశాను: 'ఆస్యా, మనం ఇంటి చుట్టూ ప్రదక్షిణాలు చేద్దాం. నువ్వు నాతో అబద్ధం ఆడినప్పుడల్లా ఆగుదాం. అలా ఆగినప్పుడల్లా నీ వేళ్లలో ఒక్కొక్కటి మడుస్తూ వుండాలి' అని చెప్పాను. అలా మడిచిన వేళ్లు ఐదు తేలాయి! నేను దానితో ఏమీ అనలేదు..."

ఆస్యా తల్లి ఆస్యాతో ఎలా మాట్లాడుతుందో నేను వింటూ వుంటాను.

"ఏం జరిగిందే?"

"ఏమీ జరగలేదు."

"మరైతే నాకేసి అలా చూస్తావేం?"

"ఎలా చూస్తున్నాను?"

"నీ కళ్లు మళ్లించుకుంటున్నావు..."

"ఏమో మరి..."

"నీకు ఫెయిల్ మార్కు వచ్చిందా?"

"అబ్బే లేదే. నన్నసలు ప్రశ్నలు అడగలేదు..."

"నీ ఒంట్లో ఎలా వుంది?"

"శుభ్రంగా వుంది."

తర్వాత ఆస్యా కొట్టుకి వెళ్లినప్పుడు, వాళ్ల అమ్మ నాతో యిలా చెప్పింది:

"అది యిప్పుడు కూడా నాతో అబద్ధమే చెప్తోంది. అది ఏదో దాస్తోంది. నాకు తెలుస్తూనే వుంది."

ఏదైనా జరిగినప్పుడు ఎప్పుడూ తల్లి పసికట్టగలుగుతుంది. తన పిల్లలకి ఏదైనా జరుగుతున్నప్పుడు కనిపెట్టని తల్లులు ఎవరూ వుండరు. మరి పిల్లలకి ఎప్పుడూ ఏదో ఒకటి జరుగుతూనే వుంటుంది. అదేదో నిజంగానే చాలా తీవ్రమైనదే ఏదో అవుతుంది. పన్నెండేళ్ల పిల్లలకి ఎప్పుడూ అత్యంత అసాధారణమైనవి సైతం సంభవిస్తూ వుంటాయి. ఒక అమ్మాయి తనకి ఎన్నడూ జరగని అవమానం జరిగిందని, దాన్ని గురించి నాకు యిలా చెప్పింది: "నేను నా స్నేహితురాలు వేరాతో కలిసి వీధిలో వెళ్తున్నాను: నేను కాలు జారి కింద పడ్డాను. వేరా అక్కడే నిలబడి పకపక నవ్వింది."

అది ఆమె స్నేహితురాలిపట్ల ఆశాభంగం మాత్రమే కాదు — అదో గొప్ప దుర దృష్టం. ఆమె ఏడ్చింది. కాని ఏమి జరిగిందో ఎవరికీ చెప్పలేదు. ఆ అమ్మాయికి ఏదో జరి గిందని వాళ్ల అమ్మ కూడా పసిగట్టింది. దాన్ని గురించి ఆమెని అడిగింది. చెప్పమని పట్టు పట్టింది. కాని ఆ అమ్మాయి నోరు విప్పలేదు. నిలబెట్టి అలా ప్రశ్నించడంతో ఆమె మనస్సు మరింత వికలమైంది. మరో సందర్భం. ఒక అమ్మాయి పక్క తరగతిలోని అబ్బాయిని గురించి తెగ ఆలోచిస్తూ వుంటుంది. ఆమె తన యీ ప్రేమ గురించి తన స్నేహితురాలికి చెప్పింది.

ఆ స్నేహితురాలు స్వయంగా తనే ఆ అబ్బాయితో ప్రేమలో పడింది. దీన్ని ఆ అమ్మాయి మహా ద్రోహంగా పరిగణించింది. బహుశా ప్రత్యేకించి ఏమీ సంభవించలేదు. కాని ఆ అమ్మాయికి మాత్రం యిదొక విపత్తు. వాళ్ల అమ్మ "ఏమైంది?" అని పదేపదే అడుగుతుంది.

పిల్లల జీవితంపట్ల ఆసక్తి చూపాలనడంలో సందేహం లేదు. కాని తమ పిల్లల్ని చూసే పద్ధతిలో సున్నితత్వం కూడా వుండాలి. పిల్లలు పెరుగుతున్నారు, తమ ఆంతరిక వ్యక్తిత్వాన్ని అలవరచుకుంటున్నారు. దాన్ని అనుభూతి చెందుతున్నారు. తమ సొంత వైయక్తిక శక్తిగా, పిల్లల ఆత్మలను రూపొందించి, వాళ్ల జీవితాలను ఉత్తేజితం చేసే శక్తిగా దాన్ని కాపాడుకొంటున్నారు. లోతైన యీ ఆంతరిక ప్రపంచం తనకి తానుగా ఆవిష్కృతమవుతోంది. జోక్యాలు దాన్ని నాశనం చేస్తాయి. పిల్లలు అబద్ధాలు ఆడటం ప్రారంభిస్తారు. నిరంతరాయమైన అనుమాన అవిశ్వాసాలు పిల్లల్లో వాళ్లకి అత్యంత సన్నిహితులైన వాళ్లపట్ల గౌరవాన్ని సైతం దొలిచివేస్తాయి. పిల్లలు రహస్యాన్ని ఎక్కువ కాలం దాచలేరు. తమని బాధిస్తున్న, వేధిస్తున్న విషయాలన్నింటినీ ఎవరికో ఒకరికి చెప్పుకోవాలని వాళ్లు విలవిలలాడుతారు. పిల్లలు అలా సలహాని అర్థించే, లేక తమ భయాలనూ, శంకలనూ గురించి వట్టినే చెప్పుకొనే తొలి వ్యక్తి మీరే అయ్యే అవకాశాన్నీ, ఆనందాన్నీ మీకు మీరై కోల్పోకండి.

పిల్లల అనుకరణ సామర్థ్యం వాళ్ల సృజనాత్మక సామర్థ్యమంత సహజమైనదన్న విషయం జ్ఞాపకం ఉంచుకోండి.

మీ పిల్లలు ఎవరిని, దేన్ని అనుకరిస్తారు? ఏ నిర్దిష్ట వ్యక్తీ లేడంటారా? బహుశా వాళ్లు తమ చుట్టూ వున్న పిల్లల్ని అనుకరిస్తారేమో? పిల్లలు తమకున్నవన్నీ యితరులకి వున్నవాటిలా వుండాలని కోరుకుంటారు. వాళ్లు కనీసం తాము నాసివని పరిగణించేవాటిని కోరుకోరు. వీళ్ల పుస్తకాల సంచులు యితరులందరి వాటిలా వుండాలి. అలాగే వాళ్ల పాంట్లు, చొక్కాలు, కోట్లు, టోపీలు, బెల్టులు, జోళ్లు, వగైరాలన్నీ యితరులందరి వాటిలా వుండాలని పిల్లలు కోరుకుంటారు. తమ నడక తీరును కేశాలంకరణను, ప్రశ్నలు అడిగే పద్ధతిని, సమాధానమిచ్చే పద్ధతిని – వీటన్నింటినీ స్వయంగా పెంపొందించుకునేందుకు ప్రయత్నిస్తారు. ఈ విషయాల్లో మాత్రం వాళ్లు విచక్షణ చూపి తీరవలసిందే.

అయితే, వాళ్లు అనుకరించేది ఎవరిని?

తమ తరాన్ని. పిల్లల్ని వాళ్లవాళ్ల వయస్సుల రీత్యా బృందాలుగా విభజిస్తే, ఆసక్తికరమైన ఒక చిత్రం కనిపిస్తుంది.

రెండవ తరగతివాళ్ల తరం (7–8 ఏళ్లవాళ్లు). వీళ్లెప్పుడూ దేన్ని గురించో ఆలోచిస్తూ ఉత్సుకత నిండిన చూపులతో, ఆశ్చర్య విభ్రమాలతో నోరు తెరుచుకొని, కళ్లు విప్పార్చుకొని వుంటారు.

ఐదో తరగతివాళ్ల తరం (10–11 ఏళ్లవాళ్లు). వీళ్ల ప్రత్యేకత: వేగం, ఉద్రేకం.

ఏకాగ్రతకి సమయం లేనట్లు వుంటారు. వాళ్లు ఆడపిల్లల జడలు పట్టుకుని చటుక్కున లాగుతారు! నెత్తిమీద ఒక్కటి పుచ్చుకుంటారు! పుస్తకాల సంచుల్ని ఊపుతూ వుంటారు! హోమ్‌వర్క్ చెయ్యలేదా, ఎవళ్లకి లెఖ్ఖ, అదే అవుతుంది. వీళ్లు దేనికీ ఎప్పుడూ లెక్క చెయ్యరు. వీళ్లది దేనికీ చీకుచింతల్లేని, అవిశ్రాంతమైన, ఉద్రిక్తమైన తెగ. వీళ్లు తమనితాము ముసుగు వీరుల్లా, ఆకాశ గాముల్లా, పాతాళ యాత్రికులుగా ఊహించుకొంటూ వుంటారు.

ఎనిమిదో తరగతివాళ్ల తరం (13–14 ఏళ్లవాళ్లు). వీళ్లకి తొలి సంవేదనల సూచనలు సైతం ముఖ్యం. ఏదో కొత్తదనం, అస్థిరత, సున్నితత్వం. నన్ను ముట్టుకోకు నామాలకాకితనం. కోపతాపాలు, నిరుత్సాహాలు. తాము మరీ సన్నంగా వున్నందుకు, మరీ లావుగా వున్నందుకు, తాము పాలిపోయి వున్నందుకు, తమ బుగ్గలు గులాబి రంగులో మిసమిసలాడుతూ వున్నందుకు, లేకపోతే తమకి మొటిమలు వున్నందుకు తెగ మథనపడిపోతూ వుంటారు. పీడ కలలు. స్వకపోల కల్పిత కథలు. స్నేహం చేసుకోవాలన్న ప్రబల వాంఛ — స్నేహితులు లేకపోవడం. ఎవళ్లూ తమని అర్థంచేసుకోవడం లేదన్న ఉడుకుబోతుతనం. తాము బాగా చదువుకోవాలి. తాము "అందంగా కనిపించాలి." తమ బాహ్య రూపం విషయంలో వీళ్లకి ఎంత తాపత్రయం ఉంటుందంటే, పక్కమీద సైతం అద్దం పెట్టుకునే పడుకుంటారు. వీళ్లకి వీళ్ల సొంత దువ్వెనలు వుంటాయి, కొత్త జేబురుమాళ్లు వుంటాయి. పెద్దవాళ్ల టూత్ బ్రష్షులు ఒక్కొక్కటి అరిగే సరికి వీళ్లవి ఐదేసి అరిగిపోతాయి...

పదవ తరగతివాళ్ల తరం (16–17 ఏళ్లవాళ్లు). నిన్నటిదాకా పిల్లలైనవాళ్లు యిప్పుడు పెద్దవాళ్లు. వీళ్లు ఎప్పుడు ఎదిగారబ్బా! వీళ్లు తమ తల్లితండ్రుల కంటె పెద్ద బూట్లు వేసుకుంటారు. వీళ్ల స్వరాలు బొంగురు అవుతాయి. వీళ్లకి తమ విలువ తమకి తెలుసు. వీళ్లు ప్రశాంతంగా, తర్కబద్ధంగా మాట్లాడతారు. వీళ్లు తమ తల్లితండ్రుల కంటె తెలివైనవాళ్లు. వీళ్లు తమ తల్లితండ్రుల్లా జీవించబోరు. వీళ్లు మరింత పొదుపుగా, అర్థవంతంగా జీవిస్తారు. వీళ్లు తాగరు, పొగ పీల్చరు. వీళ్లు అనవసర విలాస వస్తువులు కొనరు. ఆ అదనపు డబ్బంతా ఎందుకు ఖర్చుపెట్టడం? వీళ్లకి పొదుపు ఎవరూ నేర్పినట్లు కనిపించదు. వీళ్ల నిజాయితీ సంపూర్ణమైనది: "పది కోపెక్కులు మిగిలాయి" అంటారు. "ఉంచుకో" అని పెద్దవాళ్లు అంటే, "నాకెందుకు?" అంటారు. వీళ్లు పుస్తకాలు చదువుతారు. వీళ్లు మగపిల్లలతో, ఆడపిల్లలతో కూడా సాయిలాపాయిలాగా వుంటారు. వీళ్లకి న్యూనతా భావాలు, ఆదుర్దాలు వుండవు. బహుశా పైనుంచి చూస్తే యిలా అనిపిస్తుందేమో అంటారా? ఔను, బయటనుంచి చూసినప్పుడే. అయితే నిజానికి, అన్నీ చిక్కులతో కూడి వుంటాయి. అన్నీ కుతకుతలాడుతూ వుంటాయి. అమ్మాయిలతో, అబ్బాయిలతో, టీచర్లతో కూడా యిదే పరిస్థితి. జీవితమంటే అర్థం యేమిటన్న చర్చల విషయంలో కూడా యింతే. అన్నీ సున్నితమైనవే, అన్నీ కత్తిమీద సాములే. వీళ్లకి చేయూత ఎంత అవసరమో!

ఆయా తరాల్లో ప్రతి ఒక్కరూ అద్వితీయులే. అయితే వీళ్లలో ప్రతి ఒక్కరికీ తన తరంలో మాత్రమే అంతర్గర్భితంగా వున్న ఉమ్మడి అంశమేదో వుంటుంది. ప్రతి వయో బృందానికీ దాని సొంత ఆదర్శం వుంటుంది. దాన్ని ఉమ్మడి నమూనా అనవచ్చు. ఏ తరమైనా ఏక రీతిగా వుండదు. గ్రామీణ ప్రాంతపు పదో తరగతివాళ్లు అనుకరించేందుకు వాళ్ల సొంత ఆదర్శ నమూనా వుంటుంది. పట్నణ ప్రాంతపు కౌమార వయస్కులకి యిందుకు పూర్తి భిన్నమైన ఆదర్శ నమూనా వుంటుంది. మరో బృందపు ప్రమాణం యీ మొదటి బృందపు ప్రమాణానికి ఎంత మాత్రం అనుగుణంగా వుండదు.

పిల్లలు అనుకరించకుండా వుండటం దుస్సాధ్యం. ఎందుకంటే, అనుకరించడం ద్వారా వాళ్లు తమ పరిసరాలకీ, ఒకానొక నిర్దిష్ట బృందంలో ప్రబలంగా వున్న ప్రమాణాలకీ సరి పుచ్చుకుంటారు. ఐదో తరగతివాళ్లందరూ పాంట్లే వేసుకుంటే, ఒకళ్లు నిక్కర్లు వేసుకోవడం అవమానకరం అవుతుంది. వాడు యితరుల మాదిరిగా పాంట్లు కొనమని పట్టు పట్టుతాడు. తల్లితండ్రులు వాడి కోరికను తీర్చవలసి వుంటుంది. ఇలాంటి ఘటన నాకొకటి తెలుసు. పిల్లవాడు తనకి జీన్సు కావాలన్నాడు. తల్లితండ్రులు జీన్సుకి బదులు ఖరీదైన ఉలెన్ పాంట్లు కొన్నారు. కొడుకు దానికి మసి పూసి, మరుసటి రోజే దాన్ని చింపి పెట్టి, జీన్సు కొననందుకు తన తల్లితండ్రులమీద చాలా కాలం పాటు కోపం పూనాడు...

పిల్లలు తమకి తెలియకుండానే పుస్తకాలు, దుస్తులు, సంగీతం, ప్రవర్తన—యిలా చాలా విషయాల్లో అనుకరిస్తారు. "నీ ఐదో తరగతి పిల్లల్ని (ఎనిమిదో తరగతి పిల్లల్నో) నువ్వు అనుకరించేందుకు ప్రయత్నిస్తున్నావు, మంచిది. కాని ఎవళ్ల విలువనైనా యితరులం దరిలా ఉండటం బట్టి కాక తమ సొంత ప్రత్యేకమైనదాన్ని బట్టి అంచనా కడతారు. నీకంటూ స్వయంగా ఏమి యిష్టమో ఆలోచించేందుకు కొంచెం ప్రయత్నించు. అప్పుడు 'నీది' అంటూ యేమిటో, నువ్వు యితరులనుంచి అనుకరించదలుచుకున్న దేమిటో, యీ రెండింటికీ మధ్య వ్యత్యాసమేమిటో గమనించు" అని వాళ్లకి చెప్పండి. దీన్ని గురించి వాళ్లని కొంచెం ఆలోచించనివ్వండి. ఈ విషయమే పిల్లలకి పదేపదే రకరకాలుగా నూరిపొయ్యండి. పిల్లలు విధిగా తమ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటారు. ఒక తల్లి ఒక సారి తన కొడుకును యిలా ప్రశ్నించింది: "అది నువ్వు మీ నాన్న దగ్గర నేర్చుకున్నావు. నీకు ఇది నేను నేర్పాను. ఇది నువ్వు నీ టీచరు దగ్గర నేర్చుకున్నావు. మరి నీ అంతట నువ్వు స్వయంగా నేర్చుకున్నదేమిటి?" బలే ప్రశ్న!

యూర సీదొరొవ్ ప్రెలేస్త్నియె అనే గ్రామానికి చెందిన మూడో తరగతి కుర్రాడు. వాళ్ల తాత "నువ్వింక అకార్డియన్ వాయించడం నేర్చుకున్నావు కనుక, నీ అంతట నువ్వు స్వయంగా ఏదైనా ట్యూను కట్టేందుకు ప్రయత్నించు" అంటూ వాణ్ణి ప్రోత్సహించాడు. యూర నిజంగానే చాలా ఆసక్తికరమైన కొన్ని ట్యూనులు కట్టాడు. అతను స్వరకర్త కాకపోయినా పెద్ద ముంచుకుపోయేదేమీ లేదు. కాని కొన్ని ట్యూనులు కట్టడం

ద్వారా యూర తనకి తానొక పూర్తి కొత్త ప్రపంచాన్ని ఆవిష్కరించుకున్నాడు. దాని ప్రభావం అతను చేసే యితర పనులమీద విధిగా పడితీరుతుంది. అది ఆ కుర్రాడికి ఆత్మ నిబ్బరం కలిగించి అతని అనుభూతులను పెంపొందిస్తుంది. పిల్లలందరూ నికరమైన సిసలైన సృజనాత్మకతను ఒకరినుంచి మరొకరు అనుకరించాలి.

మీ పిల్లలకి "అతి రక్షణ" కల్పించకుండా జాగ్రత్తపడండి.

పిల్లలకి తమ సొంత విలువపట్ల వుండే అంచనా ఎప్పుడూ వాళ్ల కుటుంబాల జీవిత సరళిని ప్రతిబింబిస్తుంది. కుటుంబంలో పిల్లలు ప్రేమింపబడి, తమ యోగ్యతలకుగాను గౌరవింపబడితే, వాళ్ల ప్రవర్తన అతిగా ప్రశంసింపబడకుండా, విలువైనదిగా పరిగణింపబడితే, అప్పుడు వాళ్లు తమ సామర్థ్యాల విషయంలో హామీతో బాగా పెరుగుతున్నారన్న మాట. ఒక కుటుంబంలో ఒకరిపట్ల వివక్షను చూపే జీవన సరళి అభివృద్ధి చెందితే (తాత, బామ్మ, తమ్ముడు; కొన్ని సార్లు వాళ్లని కేకలెయ్యడం సైతం అనుమతింపబడితే), అలాంటి బాంధవ్యం పిల్లల పెంపకంమీద విధిగా ప్రతికూల ప్రభావం బరుపుతుంది. అలాంటి పిల్లలు తమ కుటుంబాల్లో అమల్లో వున్న వైర భావ రూపాలను అలవరచుకు తీరుతారు. కుటుంబంలో దాష్టీకపు సంబంధాల సరళి అమల్లో వుంటే (యిలాంటి కుటుంబాల్లో ఒక్క వ్యక్తి పెత్తనం చేస్తాడు, తన పెత్తనాన్ని దుర్వినియోగం చేస్తాడు), లేక పిల్లలు వ్యక్తిగత ఆస్తిగా పరిగణింపబడి, "వీళ్ల నేను చెప్పినట్లు చెయ్యవలసిందే" అన్నట్లు వుంటే, యిలాంటి సంబంధం పిల్లల స్వభావంలో క్రూరత్వం, న్యూనతా భావం, ఉదాసీనత, ఊగిసలాట వంటి ప్రతికూల లక్షణాలు చోటుచేసుకునేందుకు దారితీస్తుంది. అదే సమయంలో "అతి స్వేచ్ఛ" కూడా తరచు పిల్లల వ్యక్తిత్వపు కొన్ని పార్శ్వాలు విరూపం చెందేందుకు దారితీస్తుంది. "అతి స్వేచ్ఛ" యితరులతో పిల్లల సంబంధాలను దెబ్బతీస్తే, అది ప్రత్యేకించి ప్రమాదకరమవుతుంది. అతిధులు వస్తారు. ఒక చిన్న కుర్రాడు అకస్మాత్తుగా అతిధిని కొట్టడం మొదలెడతాడు. అమ్మా, నాన్నా "ఏదీ, మళ్లీ వాణ్ణి కొట్టు!" అంటూ ప్రోత్సహిస్తారు. కుర్రాడు మంచి హుషారుగా పకపక నవ్వుతాడు. ఇలాంటి సందర్భంలో అతి స్వేచ్ఛకి అతి రక్షణ తోడైందన్న మాట. ఇలా యింటి దగ్గర తను అలవాటుపడిన ప్రవర్తన రీతిని కుర్రాడు వీధిలో తన స్నేహితులతో ఎంత మాత్రం ఉపయోగించలేడు. ఒక వేళ వాడు అలా ప్రవర్తిస్తే, వాడు ప్రతి అరగంటకీ ఒక సారి ఇంట్లోకి పరుగెత్తి, తనతో ఎవరూ ఆడేందుకు యిష్టపడటం లేదనీ, తనని ఎవరో ఒకరు కొట్టారనీ ఫిర్యాదు చెయ్యవలసివుంటుంది.

పిల్లలు యింటి దగ్గర నేర్చుకున్న అతి స్వేచ్ఛకీ, మరో చోట అనుమతింపదగని మాధ్యమానికీ మధ్య అగాధం అనిశ్చితత్వాన్నీ, న్యూనతా భావాన్నీ పెంపొందిస్తుంది. పిల్లలు యీ వైరుధ్యాలను పరిష్కరించలేరు కనుక, వాళ్లు అత్యంత సంక్లిష్ట పరిస్థితిలో పడతారు.

అలాంటి పిల్లలు చాలా తరచు అమితావేశానికి గురై, యితరుల్ని శంకించి, అనుమానించ నారంభిస్తారు.

ఇక్కడ మనం ఒక "అతి రక్షణ" ఉదాహరణ చూశాం. అయితే, కడుపులో చల్ల కదలని బాపతు యిలాంటి పెంపకమూ (క్రియాశూన్యమైన, తగిన శరీర శ్రమ, ఉద్రిక్తతలు లేని, బాధ్యతలు లేని) పిల్లల స్వభావంలో ప్రతికూల ధోరణులకు దారితీస్తుంది.

అందుకని, మనకి మూడు రకాల ప్రవర్తన రీతులు, మూడు రకాల సంబంధాలు తటస్థపడతాయి. వీటిలో ఉత్తర దక్షిణ ధృవాల వంటి బద్ధ విరుద్ధ అంశాలు వుంటాయి: అరక్షణతత్వం — రక్షణతత్వం — అతి రక్షణతత్వం. అరక్షణతత్వం పిల్లల్లో స్వాతంత్ర్య మూలాలు నులిమివేయబడే పరిస్థితికి దారితీస్తుంది, వాళ్ల చొరవ మందగించి, వాళ్ల గణనీయ మైన సొంత ఆలోచనలు మలిగిపోయే పరిస్థితికి దారితీస్తుంది. అతి రక్షణతత్వం అసలు చొరవ చూపవలసిన అవసరాన్ని తొలగిస్తుంది. అరక్షణలో నిర్బంధ ప్రభావ రూపాలు వ్యక్తిని వికలం చేయగా, అతి రక్షణలో స్వయంగా ఏమీ చెయ్యవలసిరాకపోవడం, సముచిత మైన అవరోధాలు పూర్తిగా తొలగింపబడటం, అన్ని రకాల స్వతంత్రమైన చొరవలూ నాశనం చేయబడటం అసంతోషకర, అవాంఛిత వ్యక్తులు తయారయేందుకు దారితీస్తాయి. రక్షణతత్వ గతితర్కం ప్రకారం పిల్లలకి తమని తాము రక్షించుకొనే సామర్థ్యాన్ని నేర్ప డమే కాక, పిల్లలు ఎవరితో కలిసి జీవిస్తారో, కలిసిమెలిసి వుంటారో అలాంటి తల్లి, తండ్రి, సన్నిహిత బంధువులు, స్నేహితుల వంటి వాళ్లను సైతం పరిరక్షించే సామర్థ్యాన్ని సైతం వాళ్లు కలిగివుండాల్సి వుంటుంది.

కుర్రాడు ఆడుకునేటప్పుడు తన కోటును యింటి ముందరి బయల్లో మరచిపోయి ఇంటికి వస్తాడు. బయట చీకటిగా, వర్షం పడుతూ వుంటుంది. కాని మీరు వాణ్ణి ఒంట రిగా పోయి (వాడు భయపడుతున్నా) కోటు వెతికి తెచ్చుకోమని చెప్పినప్పుడు మీరు సరిగా వ్యవహరిస్తున్నారన్న మాట. ఎందుకంటే, మీరు అలా చేయడం ద్వారా మీ పిల్లవాడి భయాలకి వ్యతిరేకంగా అతన్ని రక్షిస్తున్నారు. వాడు మనస్సు నిబ్బరం చేసుకోవడం, పిల్లలు అందరిలాగే తనకి కూడా వున్న చీకటి భయాన్ని అధిగమించడం ఎలాగో నేర్చుకోవడం తప్పనిసరి అవ సరం.

పిల్లవాడు హోమ్‌వర్క్ చేయకపోతే మీరు వాడిని గంట పెందరాళే లేపుతారు (వాడు యింకా నిద్రపోవాలని ఎంతగానో కోరుకొంటూ వుంటాడు, వాడిని చూస్తూంటే మీకు జాలి కలుగుతుంది!), మీరు వాడి వ్యక్తిత్వాన్ని కించపరచేలా వ్యవహరిస్తున్నారని దీని అర్థం కాదు. తద్వ్యతిరేకంగా, క్లాసులో వాడి మానసిక స్థితిని కాపాడేందుకు మీరు శ్రద్ధ వహించా రన్న మాట. వాడు తన పాఠ్యాంశాలు నేర్చుకుని, క్లాసులో నిర్భయంగా కూర్చోగలిగేందుకు మీరు తోడ్పడతారు.

ఆదివారం నాడు మీ పిల్లలు తమ గదులు శుభ్రం చేయనిదే వాళ్లు సినిమాకి వెళ్లేందుకు

పిల్లేదని మీరు చెప్తే, మీరు సరిగా వ్యవహరిస్తున్నారన్న మాట. ఎందుకంటే, మీరు వాళ్లకి బాధ్యతనూ, క్రమశిక్షణనూ నేర్పుతున్నారు. ఇవి తరచు సరైన పరిరక్షిత మనో భావాల ఫలితాలు.

పిల్లలు తాము యితరుల కంటె ఎక్కువ ప్రత్యేక హక్కులు కలిగిన వాళ్లం యిక ఎంత మాత్రమూ కామని గ్రహించడం రక్షణ గతితర్కంలో యిమిడి వుంది. పిల్లల రక్షిత భావం యితరుల అరక్షిత భావానికి బదులుగా ఏర్పడినది కాకూడదు. అందుకని, మీ మటుకు మీరు పిల్లల్ని అతి స్వేచ్ఛగా వుండనివ్వడం ద్వారా (పిల్లలు అప్పుడు తమ చిత్తం వచ్చినప్పుడు, ఎక్కడికి కావాలనుకుంటే అక్కడికి పోతారు, మిగిలినవాళ్లు ఏమి అన్నా వాళ్లు లెక్క చెయ్యరు) మీరే బాధపడితే (పిల్లలు బయటకి పోయారు, మీరే అప్పుడు శుభ్రం చేయాలి), అప్పుడు మీ అరక్షిత భావం మీ పిల్లల పెంపకాన్ని ప్రతికూలంగా ప్రభావితంచేస్తుంది.

మీ పిల్లలకి మీరు పొదుపరి దృష్టి కలిగివుండటం నేర్పండి.

వ్యక్తిని తీర్చిదిద్దడంలో డబ్బుకి చాలా విశేషమైన ప్రాముఖ్యం వుంటుంది. వ్యక్తిని రూపొందించడంలో డబ్బుకి సంబంధించిన సమస్యపట్ల ఏవగింపు రెండు రకాల దోషాలకు కారణభూతమవుతుంది.

పిల్లలు ఆర్థిక విషయాల్లో పరాధీనతను, కుటుంబపు సంభావ్య ఆర్థిక యిబ్బందు లను గురించి తెలుసుకోరాదన్న భావాన్ని పెంపొందించుకోవచ్చు. లేక మరో అతిశాయితకి గురి కావచ్చు. డబ్బు దురాశనీ, ఈర్ష్యనీ, దాన్ని పోగెయ్యాలన్న కాంక్షనీ పెంపొందించవచ్చు.

పిల్లల్ని వాళ్లవాళ్ల కుటుంబాల ఆర్థిక జీవితానికి బాగా చిన్నతనంలోనే పరిచయం చెయ్యాలి. కుటుంబ ఆదాయ వ్యయాలు వాళ్లకి తెలియాలి. కుటుంబ పోషణకి నెలకి సుమారు ఎంత అవుతుందో, రోజుకి ఎంత అవుతుందో వాళ్లకి తెలియాలి. బ్రెడ్డు, వెన్న, పాల వంటి ప్రధానమైన పదార్థాల వెల ఎంత వుంటుందో వాళ్లకి తెలియాలి. పిల్లలు పెరిగే కొద్దీ, వాళ్లని "వస్తువుల ధరల ప్రపంచం"లో (దుస్తులు, బూట్లు, టెలివిజన్ సెట్లు, వగైరాల కిమ్మతు) ప్రవేశపెట్టాలి. ఇంటి మరమ్మతుకి, సెలవు ప్రయాణాలకి, దుస్తులకి, తదితర కొనుగోళ్లకి ఎంత ఖర్చవుతుందో వాళ్లకి తెలియాలి.

తల్లితండ్రులు మామూలుగా చేసేదానికి తోడు అదనపు పని చేస్తున్నారంటే, తమ తల్లులు లేక తండ్రులు కుటుంబ పోషణను సులభతరం చేసేందుకు పనిచేస్తున్నారన్న విషయం అర్థంచేసుకోవాలి. వాళ్లు యీకింది తర్కాన్ని అర్థంచేసుకోవాలి: కుటుంబ జీవితాన్ని మెరుగుపరచేందుకు కుటుంబ సభ్యుల్లో ప్రతి ఒక్కరూ తన సామర్థ్యాన్ని బట్టి దోహదం చెయ్యాలి. పిల్లలు యీ సహాయం ఎంత చిన్నతనంలో ప్రారంభిస్తే అంత మంచిది. పిల్లలు ఏ రకమైన సహాయం చేయగలరు? సంపాదన ద్వారానా? అంత మాత్రమే కాదు. పిల్లలు ఇస్త్రీ పెట్టె, ఎలెక్ట్రిక్ స్టౌ, హేంగరు, తలుపు తాళం, కుర్చీల వంటి ఇంట్లోని వివిధ వస్తువులను మరమ్మతు చేయడం ఎలాగో నేర్చుకోవచ్చు. పెద్దవాళ్లు ఇంట్లో ఏవైనా

మరమ్మతులు, ఇతర పనులు చేసేటప్పుడు పిల్లలు వాళ్లకి సాయం చేయవచ్చు.

కుటుంబానికి తిండికి రోజుకి కనీసం ఎంత ఖర్చు అవుతుందో పిల్లలకి తెలియాలి. పిల్లలు ఇంటి పనుల్లో సాయం చేయాలి. తల్లో, తండ్రో ఊళ్లో లేనప్పుడు, లేక జబ్బు పడినప్పుడు పిల్లలు సరుకులు కొని తేవడం, భోజనం తయారుచేయడం, ఇల్లు శుభ్రం చేయడం, "తేలిక" బట్టలు ఉతకడం వంటి ముఖ్యావసరమైన పనులు చేయగలిగివుండాలి.

అయితే, యిందుకు భిన్నమైన అభిప్రాయం కూడా వుంది: పిల్లలకి వ్యాపారపు లెక్కలు నేర్పకూడదు, వాటి అవసరం లేదు. ఏయే వస్తువు ఎంత ఖరీదో పిల్లలకి సామాన్యంగా బాగా తెలిసే వుంటుంది, వాళ్లకి ప్రతి కోపెక్కు విలువా తెలుసు. ఇదంతా నిజమే. మన పిల్లలు కొంత పొదుపు పాటించే మాట నిజమే. అయితే చాలా తరచు యీ పొదుపు తమ సొంత అవసరాలను తీర్చుకునేందుకు మాత్రమే ఉద్దేశింపబడుతుంది. పిల్లలు తమ చిల్లర డబ్బులు లెక్కపెట్టుకుంటారు. ఒకళ్లకొకళ్లు డబ్బు అప్పులిచ్చుకుంటారు. ఒకొక్కప్పుడు వస్తువులు అమ్ముకుంటారు లేక మార్పిడి చేసుకుంటారు. వాళ్లు "తమ సొంత ఆర్థిక వ్యవస్థను" నిర్వహించుకుంటారు. అయితే యిక్కడ నా ఉద్దేశం మరొకటి. నేనిక్కడ చెప్పదలచుకున్నది పిల్లల్లో ఆస్తి ధోరణులను గురించీ, పిల్లల్ని పెద్దవాళ్లనుంచి విడదీయగల అనవసరమైన పొదుపును గురించీ కాదు. కుటుంబ జీవితాన్ని మెరుగుపరచేందుకు ఉద్దేశింపబడిన సీరియస్ జమాఖర్చుల్లో వున్న సమష్టి శక్తిని గురించే నేనిక్కడ చెప్తున్నది.

మీ అబ్బాయి లేక అమ్మాయి సెలవల్లో కొంత డబ్బు సంపాదించి, దాన్ని తనకోసం మాత్రమే ఖర్చుపెట్టుకొని, తల్లితండ్రులకి ఏమీ కొని తీసుకురాకపోతే, అది ఆదుర్దాపడ వలసిన విషయమే.

అలా కాకుండా మీ అబ్బాయి లేక అమ్మాయి తను సంపాదించిన డబ్బు (అది కొద్ది కోపెక్కులే అయినా కూడా) కుటుంబంకోసం తెచ్చి, తల్లికి యిస్తే, యీ సంగతి కుటుంబంలో చిన్న పండుగ చేసుకోవలసినది. ఆ డబ్బును అలా ఉద్దేశపూర్వకంగా వాడేటప్పుడు, దాన్ని గురించి "ఈ పాలు కోల్యా సంపాదనతో కొన్నాం" అనో, "వొలోద్య సంపాదనతో కొన్న వస్తువులతో యీ అప్పచ్చిలు చేశాం" అనో చెప్పాలి.

మీ అబ్బాయి లేక అమ్మాయి వేసవి సెలవల్లో ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలోనో లేక పోస్టాఫీసులోనో పనిచేసి గణనీయమైన పెద్ద మొత్తంలో డబ్బు సంపాదిస్తే, ఆ డబ్బును ఎలా వెచ్చించాలన్న విషయాన్ని మీరు కలిసి ఆలోచించాలి. అసలు అలాంటి సంభాషణే పిల్లల పెంపకంమీద పెద్ద ప్రభావం కలిగిస్తుంది.

చచ్చు మనిషిని కాక, దృఢ వ్యక్తిని పెంచేందుకు ప్రయత్నించండి.

"దృఢ వ్యక్తి" భావం సూపర్‌మాన్‌తో ముడిపెట్టబడి కొంత ప్రతిష్ఠను కోల్పోయింది. బలప్రయోగం అన్నది నిర్దాక్షిణ్యమైన అజ్ఞానంతో లేక మానవాత్మలోని సున్నితమైన అత్యుత్తమ వాహినులకు విరుద్ధమైన స్వప్రయోజనతత్వంతో ముడిపెట్టబడి వుంది.

"దృఢ వ్యక్తి"ని గురించిన నా భావనలో రెండు ప్రధాన సూత్రాలు యిమిడి వున్నాయి: మొదటిది, సౌందర్య ప్రపంచాన్ని అర్థంచేసుకొనే, అనుభూతం చేసుకొనే (దయ, న్యాయపరత్వం, శ్రమ సౌందర్యం) సంభావ్యత; రెండోది, ఈ ప్రపంచాన్ని కాపాడేందుకు సంసిద్ధత, దాన్ని కాపాడే సామర్థ్యం. చెడును ప్రతిఘటించే సామర్థ్యం, చెడును అధిగమించే సామర్థ్యం. మరి యీ మనో బలం, అనుభూతి బలం, ఆచరణ బలం, సవిమర్శక అంచనా వేసే బలం అవసరం.

దృఢ వ్యక్తిని గురించి చెప్పుకునేటప్పుడు మనం అనివార్యంగా ఆరోగ్య సమస్యకు తిరిగి వస్తాం. పిల్లలు సౌష్ఠవమైన శరీరాలతో పెరిగితే (కాళ్ళు తడిస్తే రొంపపట్టకుండా, రొంపని తట్టుకోగలిగితే, ఆకురాలు కాలం ముదిరాక ఆరు బయట గుడారంలో వుండగలిగితే, దీర్ఘ పాదయాత్రలు, వగైరాలకు పోగలిగితే) యీ కష్ట సహిష్ణుత వాళ్ళని శారీరకంగా బలిష్ఠమైన వ్యక్తుల్ని చేస్తుంది.

దృఢ వ్యక్తిని గురించి మనం మాట్లాడేటప్పుడు, మనం మనుషుల ఆత్మ బలం గురించి, నైతిక స్థైర్యం గురించి, వాళ్ల విశ్వాసాల దృఢత్వం గురించి కూడా చెప్పుకుంటాం. పిల్లలు దయగా వుండాలని చెప్పడం మాత్రమే కాకుండా, జీవితపు అన్ని పార్శ్వాల్లోనూ కమ్యూనిస్టు నైతిక ప్రమాణాలను అమలుజరిపితే, యీ నైతిక శక్తినే మనం హర్షిస్తాం.

మనం దృఢ వ్యక్తిని గురించి మాట్లాడుకునేటప్పుడు, బుద్ధినైశిత్యాన్ని, మన చుట్టూ వున్న ప్రపంచాన్ని మరింత విస్పష్టం చేసి, మానసిక జీవితాన్ని సుసంపన్నం చేసే సృజనాత్మక సామర్థ్యాన్ని కూడా చేరుస్తాము. పిల్లలు తెలివిగా, ఉత్సుకంగా పెరుగుతూ, నిరంతరాయంగా తమ్మని తామూ, తదితరుల్నీ "విభ్రాంతుల్ని" చేస్తూ వుంటే, యీ ధోరణి వాళ్ల పెరుగుదలకి తోడ్పడటమే కాకుండా, పిల్లల సాంఘిక పరిసరాలను కూడా మారుస్తుంది — పిల్లలు యీ పరిసరాల్లో మరింత మెరుగ్గా వుంటారు.

## సాయంత్రం

నేనీ విషయం చాలా మంది అబ్బాయిలతోనూ, అమ్మాయిలతోనూ, వయస్కులతోనూ మాట్లాడాను. మీ పిల్లల రోజువారీ జీవితాల్లో ఏ గంటలు వాళ్లకి అత్యంత సంతోషదాయకమైనవని నేను వాళ్లని అడిగాను. వాళ్లలో చాలా మంది "సాయంత్రపు గంటలు" అని సమాధానమిచ్చారు. హోమ్‌వర్కు చేసుకోవడం అయిపోయి, ఆ రోజుకిక బాదరబందీలూ, ఆందోళనలూ అయిపోయాక ఎవరైనా తనకి కావలసిన, తను మనసారా కోరుకునే పనులు చేసుకోగలుగుతారు.

సౌకర్యమైన సాయంత్రాలు, దీపాల వెచ్చటి కాంతితో, సన్నిహితమైన తగ్గు స్వరాల్లో, రమ్యమైన సంగీతంతో, అలవోకతనంతో, పగలు జరిగిన ఘటనలను గురించిన ప్రశాంత

సంభాషణలతో కూడిన సాయంత్రాలు లేకుంటే, పిల్లలు ఎంతో కోల్పోతారు. వాళ్ల పెంపకం దెబ్బతింటుంది.

సాయంత్రానికి సంబంధించిన అతి ముఖ్యమైన అంశం ఏమిటి? దాని ఆంతరిక పార్శ్వమా? లేత నీలం వన్నెల్లోని వాటర్ కలర్ మరక మాదిరిగా పని రోజుకి సహజ సుందర పరాకాష్ఠ?

పన్నెండు గంటల పాటు పనుల తర్వాత విశ్రాంతా (పిల్లలకి స్కూలు, ఆటలు; పెద్ద వాళ్లకి పని, కుటుంబ బాదరబందీలు)?

రేపటి రోజుకు సన్నాహమా? ఇది అవసరమే. కాని అదే ప్రధాన విషయం కాదు.

సాయంత్రాలు ఎలా గడుపుతారు? కచ్చితంగా "సాయంత్రపు" సంబంధాల మూడు నమూనాల రేఖాచిత్రాలను గీయకపోతే ఈ ప్రశ్నకి బహుశా మనం నేరుగా సమాధానం చెప్పకోలేము.

మొదటి నమూనా – ఆదర్శమైనది కూడా. కాలం – సాయంత్రం ఏడునుంచి రాత్రి పది గంటలదాకా: మూడు గంటల పాటు ఆంతరిక అనుభవాలు, ఆవిష్కరణలు, కలయికలు. ఎక్కువ తక్కువలు లేని యీ మూడు గంటల ఆటని ఎలా ఏర్పాటు చేసుకోవాలి? తండ్రితో, తల్లితో లేక సోదరుడితో ఓ అరగంట షికారా? అది బ్రహ్మాండంగా వుంటుంది. ఆ షికారు సమయంలో అనేక విషయాలు తేల్చుకోవచ్చు. మీ అమ్మాయి ప్రశ్నలకి సమాధానాలు చెప్పేందుకు ప్రయత్నించండి: టీచరు గాల్యా అబద్ధమాడిందని అనుమానపడినప్పుడు ఆమె ఎందుకు బావురుమంది? అబ్బాయిలు ఎందుకలా జీళ్లలా పట్టుకుంటారు? ఎందుకలా వాళ్లు మిమ్మల్ని ఏడిపిస్తారు, మీ ప్రాణం తీస్తారు? మీరు వాళ్లని వదిలించుకోలేరు. నెపోలియన్‌ని అంత మంది ఆరాధించగా అతను ఎందుకంత నిర్దయగా వ్యవహరించాడు? ఇలా యీ "ఎందుకు?"లు అనంతంగా సాగుతాయి. సాయంత్రం పూటల్లో వీటిలో కొన్నింటికి సమాధానాలు చెప్పక పోతే, అవి పెరిగిపెరిగి ఆకాశంలో చుక్కలన్ని అవుతాయి.

ఈవిధంగా, ఆదర్శ నమూనాలోని లింకుల్లో ప్రశ్నలకి సమాధానాలు చెప్తూ సాగించే షికారు ఒకటి. అటు తర్వాత మీ పిల్లలు తమకి ఆసక్తికరమైన పనులకి పూనుకుంటారు: బహుశా మీ అబ్బాయి రోమాంచితమైన డిటెక్టివ్ కథ చదవడం పూర్తిచేస్తున్నాడు; లేకపోతే ఓ కొత్త ట్యూను సాధన చేస్తున్నాడు; అదీ కాకపోతే గణిత శాస్త్రపు పోటీలో ఎవరూ చెయ్యలేని లెక్క చేస్తున్నాడు. అలా చేసేటప్పుడు మీ అబ్బాయి లేక మీ అమ్మాయి కళ్లు మెరుస్తూ, ముఖం ఉద్రిక్తంగా వుంటాయి. అప్పుడు వాళ్ల దృష్టిని మళ్లించడం మీకు యిష్టం వుండదు. మీరు ఒక పుస్తకమో, పత్రికో చేతిలోకి తీసుకుని కూర్చుంటారు. మీరు మౌనంగా వుంటారు. మీ పిల్లలు వాళ్ల హోమ్‌వర్కు సకాలంలో చేసుకున్నందుకూ, ఓ తలగడా తెచ్చిపెట్టడమో, మీ పక్క వేసిపెట్టడమో వంటివి చేసినందుకూ మీరు సంతోషంగా వుంటారు... అప్పటికీ మీకింకా మరుసటి రోజును గురించీ, మర్నాటి ఉదయం ఎవరు ఏమి చెయ్యాలన్న విషయమూ మాట్లాడేందుకు వ్యవధి వుంటుంది... మీరు కొద్ది క్షణాలు

మీ పిల్లవాడి దగ్గర ఆగి, వాడి నుదురు తాకుతారు, బహుశా వాడిని ముద్దు పెట్టుకుంటారు...

సగటు నమూనా. "ఏది, నీ లెక్కలు ఎలా చేశావో చూద్దాం" అంటున్నాడు తండ్రి. "అయితే, లెక్కలు మళ్లీ తగలబెట్టావన్న మాట. సరే, యింకేం చెయ్యాలి?"

"ఇంకా జాగ్రఫీ వుంది. 20 పంక్తుల కవిత్వం కంఠతా పట్టాలి..."

"మరి ఎప్పుడు కంఠతా పడతావ్?"

"ఇప్పుడే."

ఇరవై నిమిషాలు గడిచిపోతాయి. తల్లితండ్రులు టి.వి. చూస్తూ వుంటారు. మొదట పిల్లవాడు తలుపు దగ్గర నిలబడతాడు. తర్వాత మెల్లిగా వెళ్లి, తన తండ్రి పక్కన సోఫా మీదకి చేరుకుంటాడు.

తండ్రి కోపంగా "నువ్వు హోమ్‌వర్కు ఎప్పుడు చేసుకుంటావ్?" అని అడుగుతాడు.

"ఒక్క క్షణం వుండి వెళ్లిపోతాను" అని సమాధానం చెప్పి, కుర్రాడు సినిమా చూడటం కొనసాగిస్తాడు. తొమ్మిది గంటలకి వాడు జాగ్రఫీ పాఠం మొదలుపెడతాడు. తల్లితండ్రులు సినిమా చూసి, టీ తాగి, అప్పుడు తమ కొడుకుని సారవంతమైన భూములను గురించీ, ఉపవృత్తికలను గురించీ ప్రశ్నలు వేస్తారు. కాని పిల్లవాడికి ఏమీ తెలియదు. తండ్రి మండి పడతాడు, తల్లి తల్లడిల్లుతుంది.

అయితే చివరకి పిల్లవాడు నిశ్చయంగా పాఠ్య పుస్తకాల్లో తలదూర్చుతాడు. ఓ గంటలో వాడు అన్నీ నేర్చుకుంటాడు. అప్పటికి రాత్రి పదకొండు గంటలవుతుంది. కొడుకు పడుకుంటాడు. నుదురు తాకడాలు, వగైరాలు ఏమీ వుండవు...

ప్రతికూల నమూనా. తల్లి గడియారం కేసి చూస్తుంది: పది గంటలైంది. ఈలోగా కూతురు మెట్ల దగ్గర నిలబడి తన స్నేహితురాలితో మాంచి హుషారుగా బాతాఖానీ కొడుతూ వుంటుంది.

"నువ్వు జిమ్నాస్టిక్సుకి రాలేదేం? నువ్వొట్టి నష్టజాతకురాలివి!"

"విశేషమేమైనా జరిగిందా?"

"విశేషమా! మేము బయటకి వెళ్లి తాగినవాళ్లలా నటించడం మొదలుపెట్టాం. జనం మా కేసి గుడ్లప్పగించి చూశారు. పెద్ద గలాటా అనుకో!"

"దాన్ని మొగ్గ వెయ్యమన్నారు! కాని నీకు తెలుసు కదా, అది వెయ్యగలిగిన మొగ్గ ఏమిటో. అది ఎంత లావుంటుందో నీకు తెలుసు కదా. అది వెయ్యనంది. కోచ్ దాన్ని వదిలేశాడు. మేమంతా నవ్వడం మొదలెట్టాం. అది సామాను గదిలోకి పారిపోయింది. అదెందుకు ఏడుస్తోందో మాకు అర్థం కాలేదు. ఎందుకో మరి! మేం ఊరికే వేళాకోళం చేశామంతే! వేళాకోళం కూడా చెయ్యకూడదా యేమిటి కర్మ?"

పదిన్నర. కూతురు పిల్లిలా అడుగులో అడుగు వేసుకుంటూ గదిలోకి వస్తుంది. తల్లి తలగడా మీంచి తన తల ఎత్తుతుంది.

"ఎక్కడున్నావ్, యింత సేపూ? నువ్వింకా హోమ్‌వర్కు చెయ్యలేదేమో..."

"చేశాను. తినడానికి ఏముంది?"

"ఇదిగో యిప్పుడే ఒక్క క్షణంలో ఏదో ఒకటి తయారుచేస్తాను..." ఆవిడ లేస్తుంది. తిండి వెచ్చచేస్తుంది. కూతురికి వడ్డిస్తుంది. తిండి తిన్నాక కూతురు కొన్ని వారపత్రికల పేజీలు తిరగేస్తుంది... కళ్లు మూతలుపడ నారంభించేదాకా పత్రికల పేజీలు అలా తిప్పుతూనే వుంటుంది. సుమారు ఏ రెండు గంటలకో ఆమె నిద్రపోతుంది. పక్కన లైటు వెలుగుతూనే వుంటుంది.

ఏకైక సంతానం వున్న కుటుంబాల్లో అత్యధికమైన కష్టాలు సంభవిస్తాయని అనుభవం తెలియజేస్తోంది. కుటుంబంలోనూ, స్కూల్లోనూ కూడా ఏక సంతానం కల్పించే సమస్యలు తీవ్రమైనవి. ఈ విషయం తర్వాత ప్రత్యేకించి చూద్దాం. పిల్లల సాంఘిక పరస్పర సాంగత్యానికి సంబంధించిన ప్రశ్నలు వేరే వున్నాయి. ఈ సాంగత్య ప్రపంచమే పిల్లల వ్యక్తిత్వాన్ని రూపొందిస్తుంది. ఈ ప్రపంచంలోనే వ్యక్తిత్వం తను సంచితం చేసిన "అహాన్ని" వెల్లడిస్తుంది.

ఒక్కొక్కసారి పిల్లలు టీచర్లతోనూ, యితర పిల్లలతోనూ సరికాని సంబంధాలు పెంపొందించుకున్న మూలంగా స్కూల్లో వెనకబడ నారంభిస్తారు. చాలా తరచు తల్లితండ్రులు పిల్లల యిబ్బందులను జాగ్రత్తగా సాయంత్రం పూట విశ్లేషించి, సరైన నిర్ధారణలకు వస్తారు: "ఆ టీచరు అలా ఎలా చేయగలిగాడబ్బా! మొదటి తరగతివాణ్ణి చూసి తను నవ్వడం, క్లాసులో మిగతా వాళ్లు నవ్వితే ఊరుకోవడం!" లేక: "పిల్లవాడి మనస్సును యితర పిల్లలందరూ గాయపరిస్తే, యింక సమష్టి ఎక్కడున్నట్లు?!"

ఇప్పుడింక "ఏక సంతానం – క్లాసు" సమస్యని పరిశీలించేందుకు ప్రయత్నిద్దాం.

"ఏక సంతానం – క్లాసు" సూత్రం అనేక సాంఘిక, బోధన శాస్త్రీయ సమస్యలకి కేంద్రాంశం. పెద్ద కుటుంబాలకు చెందిన పిల్లలకి మామూలువిగా, సహజమైనవిగా కనిపించే విషయాలు ఏక సంతాన కుటుంబాల పిల్లలకి తరచు ప్రమాదకరమైనవిగా కనిపిస్తాయి.

పిల్లలు కుటుంబంలో తీర్చిదిద్దబడి, కొన్ని నిర్దిష్ట విలువలతో స్కూలులో ప్రవేశిస్తారు. ఉదాహరణకు, అన్నలు వున్న కుటుంబాల్లో చిన్న పిల్లలు, ఆ కుటుంబాల సమష్టికి అలవాటు పడిన కారణంగా, క్లాసు సమష్టిలో సులభతరంగా ప్రవేశించి, యితర పిల్లలతో సంబంధాలు పెట్టుకుంటారనీ, మరింత రక్షణ కలిగినవాళ్లుగా ప్రవర్తిస్తారనీ అనుభవం తెలియజేస్తోంది. దీనికితోడు పిల్లవాడికీ క్లాసుకీ మధ్య అనివార్యంగా వుండే వైరుధ్యాన్ని కూడా మనం గుర్తుంచుకోవాలి.

కీలకాంశం ఏమిటంటే, ప్రతి ఏడేళ్ల పిల్లవాడూ, పిల్లా తన సొంత విశిష్ట ప్రపంచ దృక్పథాన్ని సమష్టిలోకి తీసుకొస్తారు. క్లాసు తత్వంతో పిల్లవాడి ఆంతరిక ప్రపంచపు ఘర్షణ చాలా సమస్యల్ని ఉత్పన్నం చేస్తుంది. అతి ముఖ్యమైన వాటిలో ఒకటేమిటంటే,

ఈ చిన్నారి మానవ వ్యక్తి వైయక్తిక సామర్థ్యాలు అభివృద్ధి చెందగలుగుతాయా లేక అణచివేయబడతాయా?

ఈ సమస్య బోధకుల్ని వేధిస్తోంది. ఈ సమస్య గురించి కుప్పతెప్పలుగా రాస్తున్నారు, బోలెడంత చెప్తున్నారు. ఈ సమస్య తల్లితండ్రుల్ని సైతం యింతగానూ వేధిస్తూ వుండాలి. ఏకైక సంతాన కుటుంబాల పిల్లలు మామూలుగా మానసికంగా మరింత బలహీనంగా వుంటారు. అందుకని వాళ్ళ సమష్టితో సంబంధంలోకి రాగానే, వాళ్ళకి మరో మనస్తాత్విక వైరుధ్యాన్ని – తమ ఆసక్తులకీ భయాలకీ మధ్య వైరుధ్యాన్ని – అధిగమించడం ప్రత్యేకించి కష్టంగా వుంటుంది. ఈ వైరుధ్యం ఏమిటి? పిల్లలకి సాంఘిక సాంగత్యం తీవ్రమైన అవసరమే. అయితే దీనికి తోడు తమ సొంత సామర్థ్యాలను, తాము చేయగలిగినదాన్నంతనీ, స్కూలు రాక ముందు తాము నేర్చుకున్నదాన్నంతనీ ప్రదర్శించవలసిన తీవ్రావసరం కూడా వుంటుంది. అయితే, అన్నీ అర్థంచేసుకునే ఏడేళ్ల పిల్లవాడు క్లాసులోని ఏ విడి విద్యార్థి సంవేదనలనూ క్లాసు పిల్లలు లెక్కచేయకపోవడం, తమ శ్రద్ధకీ, గౌరవానికీ యోగ్యులు కారని తాము అనుకున్నవాళ్ళని చూసి తేలిగ్గా నవ్వేయడం చూస్తాడు గనుక, తను క్లాసు పిల్లలకి భిన్నంగా పరిగణింపబడేందుకు భయపడతాడు. ఈవిధంగా తమ మనస్సునూ, తమ ఆంతరిక ప్రపంచాన్నీ విప్పేందుకు భయం పెంపొందుతుంది. స్కూల్లో చేరేందుకు ముందు తమని ప్రేమించే, తమ కోర్కెలకు లొంగే పెద్దవాళ్ల మధ్య వున్న పిల్లల్లో ప్రధానంగా యీ భయం వేళ్ళూనుకొంటుంది.

తమ సమవయస్కుల ప్రపంచంలో ప్రవేశించిన మన కూతుళ్ళూ, కొడుకులూ పరస్పరం ఆకర్షితులవనారంభిస్తారు. అయితే వీళ్ళ విధిగా రెండు మూడు సార్లు చేతులు కాల్చు కుంటారు. తమ యింటి, తనీగా వయోజన వాతావరణంలో కాకుండా, తామిప్పుడు ఒక ఘర్షణ పరిస్థితిలో వున్నట్లు గమనిస్తారు. పిల్లల సహజాత జ్ఞానంతో "వాళ్ళు ఎవరికి లెఖ్ఖ. వాళ్ల అవసరం నాకు లేదు" అనే తిరుగులేని నిర్ణయానికి వస్తారు. వీళ్ల దృష్టిలో "వాళ్ళు" అన్నప్పుడు క్లాసు, పిల్లలు అని అర్థం. ఇలాంటి ఏక సంతాన కుటుంబాల పిల్లలు ఒంటరిగా ఉండిపోతారు. ఈ ఒంటరిపాటుతనం అత్యంత ప్రతికూల పర్యవసానాలకు దారి తీయవచ్చు. కార్యకలాపాలు లేకుండా చేయబడిన యీ పిల్లల సుదీర్ఘ ఒంటరిపాటుతనం మామూలుగా మనస్తాత్వికమైన వాటితో బాటు రకరకాల లోపాలకు దారితీస్తుంది.

ఏం చెయ్యాలి? అలాంటి పరిస్థితిలో ఎలా వ్యవహరించాలి? దీనికి ఒకే ఒక్క పరిష్కారం వున్నట్లు నాకు అనిపిస్తుంది. ఇలాంటి పిల ల అభివృద్ధిమీద సానుకూల ప్రభావం కలిగించే సావాసాలను యీ పిల్లలు వెతుక్కునేందుకు తోడ్పడాలి. చాలా మంది తల్లితండ్రులు తమ పిల్లల క్లాస్‌మేట్లని ఆదివారం పూట నాస్తాకో, లేక అడవిలో షికార్లకో, బోటు షైర్లకో, లేక సినిమాకో, నాటకానికో ఆహ్వానిస్తూ వుంటారు. దీని మూలంగా ఏక సంతాన కుటుంబాల పిల్లల సమవయస్కులు క్లాసు సమష్టిలోనూ, ఆట స్థలంలోనూ తక్కువగా చూడబడే తమ స్నేహితులను అందుకు భిన్నంగా, మరింత గౌరవంగా చూడనారంభిస్తారు.

స్వయంగా తల్లితండ్రులు కూడా తమ పిల్లల స్నేహితులతో మరింత సన్నిహితమైన పరిచయం పెట్టుకోవాలి. ఇది వాళ్ల కొడుకులు, కూతుళ్లు వాళ్ల సమవయస్కుల సమష్టిలో సరైన పద్ధతిలో ప్రవర్తించేందుకు తోడ్పడుతుంది.

మరోలా చెప్పాలంటే, తల్లితండ్రులు తమ పిల్లలకి నికరంగా సాయంచేయాలని కోరుకుంటే, వాళ్లు తమ పిల్లల హోదానీ, ఆదర పాత్రత స్థాయినీ పెంచగలరు.

అయితే, మీ పిల్లలు మరీ ఆదర పాత్రులైతే కలిగే ప్రమాదాలను కూడా మీరు దృష్టిలో పెట్టుకోవాలి.

ఏక సంతాన కుటుంబాల పిల్లల్లో యిందుకు భిన్న తరహా వాళ్లు కూడా వుండవచ్చు. ఇలాంటి పిల్లలు పెద్దవాళ్లతో కలిసివుండేందుకు అలవాటుపడతారు కనుక, వాళ్లు తమ చుట్టూ వుండేవాళ్లని తేలిగ్గా చూసేందుకు, అతి చనువునూ, అతిశయాన్నీ ప్రదర్శించేందుకూ అలవాటుపడతారు. ఇలాంటి వాళ్లు తమ సమవయస్కులతో సాంగత్యంలోకి వచ్చినప్పుడు, రాకపోకలు, వృథా కాలక్షేపాలు మోతాదును మించవచ్చు. చివరకి యీ పిల్లలు మంచి సామర్థ్యాలు వున్నా కూడా, తమ కాలాన్నీ, తమ సామర్థ్యాలనూ అభివృద్ధిచేసుకునే అవకాశాలను వృథాచేసుకోవచ్చు.

పెద్దవాళ్లు పిల్లల సాంఘిక సాంగత్యానికి సంబంధించిన ప్రధాన సమస్యలను పరిష్కరించడం నేర్చుకోవాలి.

సాయంత్రాల్లో మీ పిల్లలు ఇంటి దగ్గర కొన్ని గంటలు గడిపి చల్లబడ్డాక, స్కూల్లో వాళ్లకి తటస్థపడిన అనాహ్లాదకర పరిస్థితులను గురించీ, ఘర్షణలను గురించీ ఆలోచించేందుకు అంత ఇష్టంగా వుండరు. వాళ్లకి ఇష్టం లేకపోయినా కూడా, వాళ్లు తమకి తెలియకుండానే తమ వ్యక్తిగత సంబంధాలను పరిష్కరించుకోవడంలో నిమగ్నులై వుండవచ్చు: "ఫలానావాడు ఫలానావాడితో మళ్లీ స్నేహం కడుతున్నాడు. ఫలానావాడు నాకేసి కన్నెత్తి చూడనైనా లేదు. ఫలానావాడు నన్ను మళ్లీ బెదిరించాడు." ఆ '"ఫలానావాళ్లు" తెలిసినా కూడా, సంబంధాలను తృప్తిపరచే పద్మవ్యూహం యింకా ఎంత చిక్కుగా వుందంటే, దాంట్లో దారి తప్పడం, పొరపాట్లు చేయడం మహా తేలిక.

మీ పిల్లలకి ఏమి జరుగుతోందో తెలుసుకునేందుకు మీరు ప్రతి రాత్రీ ప్రయత్నించాలి. లేకపోతే వాళ్ల ఆదుర్దాలు పొంగిపొర్లి మిగిలిన వాటన్నింటినీ—వాళ్ల స్కూలు చదువుని, వాళ్లకి ఉన్న సత్సంకల్పాలని, వాళ్ల ఆకాంక్షల్ని—ముంచెత్తవచ్చు...

మీ సాయం నిర్దిష్టంగా వుండాలి.

"ఈ రోజు మళ్లీ సుష్కోవ్ తలుపుకి చేయి అడ్డం పెట్టి నిలబడ్డాడు. మేమంతా తరగతి గదిలోంచి బయటకి వెళ్లినప్పుడు వాడి చేతి కింద వంగి వెళ్లాల్సివచ్చింది" అని చెప్తాడు మీ కొడుకు.

"నువ్వు కూడా వంగి వెళ్లావా?"

"నేను వంగే వెళ్ళాను. వాడికి వాళ్ల అన్న వున్నాడు..." అని చెప్పాడు కొడుకు.

అలాంటప్పుడు మీరేం చెయ్యాలి? మీరీ పరిస్థితిని ఎలా ఎదుర్కొంటారు? మీరు వెళ్లి టీచర్నో, ప్రిన్సిపాల్‌నో కలుసుకోవాలా? అదే మిక్కిలి సరైన నిర్ణయం అనిపించ వచ్చు. కాని మీరలా కల్పించుకొని, తనని కాపాడితే మీ అబ్బాయికి ఎలా అనిపిస్తుంది? ఇది మీ పిల్లవాడి ఆత్మగౌరవాన్ని దెబ్బతీయదా?

మీ కొడుక్కి యువ పయనీర్ సంఘం, లేక యువజన సంఘం సహాయాన్ని అర్థించ మని సలహా చెప్పాలా? అది కూడా సరైనదే. కాని యిలా పితూరీ చేయడం మీ పిల్లవాణ్ణి ఎప్పుడూ సమస్యనుంచి బయటపడే అతి తేలిక మార్గాన్ని వెతుక్కునే దిశగా నెట్టదా?

ఇలాంటి పరిస్థితిలో ఓ డజను పరిష్కార మార్గాలు వుండవచ్చుననడం నిజమేనను కోండి. కాని అనుసరించవలసింది ఒక్కటే. అది లేనిదే మిగిలినవన్నీ వ్యర్థమే.

నా కొడుకే కనుక తను తలవంచి వెళ్లవలసివచ్చిందని చెప్తే, నేను నిరుత్సాహపడి వుండేవాణ్ణి. "నేను ఏం చేసి వుండాల్సింది?" అని వాడు నన్ను అడిగివుంటే, నేనిలా చెప్పి వుండేవాణ్ణి: "నెట్టుకు వెళ్లు! పర్యవసానం ఏమైనా సరే, లెక్కచెయ్యకు, తలవంచి, నిన్ను నువ్వు అవమానం పాలుచేసుకోకు!"

"మీరందరూ కలిసి సుష్కోవ్ దగ్గరకి వెళ్లి, 'చేతులు అడ్డం తీస్తావా? లేకపోతే మేమందరం కలిసి నీకు బడిత బాజా పట్టించాలా?' అని చెప్పివుండాల్సింది. వాడు అప్పుడు కిక్కురుమనకుండా చేతులు తీసి వుండేవాడు. ఏ అన్నా వాడికి సాయం చేయగలిగి వుండే వాడు కాడు."

"ఇలా చెప్పడం తేలికే" అని నా కొడుకు సమాధానం యిచ్చి వుండేవాడు. వాడు నా సలహాని పాటించకపోయినా, వాడి మనస్సులో న్యాయబద్ధమైన నిరసన బీజాన్ని నాటివుండే వాణ్ణి. ఇది లేనిదే ఏ నైతిక పెంపకమూ వుండజాలదు.

పిల్లలు అభిమానంతో బాటు, మానసిక శక్తినీ, దృఢమైన సత్ పౌర భావాన్నీ సంత రించుకునే దిశలో మీరు ప్రవేశపెట్టాలి.

సాయంకాలాల ఖాళీ గంటల్లో పిల్లలతో మాట్లాడే క్రమమే కాకుండా, పెంపకపు సూక్ష్మ సిద్ధాంతాన్ని తల్లితండ్రులు స్వయంగా రూపొందిస్తూ వుండటం, కుటుంబ విద్యకి సంబంధించిన ప్రధాన దిశను గురించి చర్చించడం కూడా ఏక కాలంలో జరగడం సహజమే. తల్లితండ్రుల్లో ఒకరు అతి ముఖ్యమైన ప్రశ్నను యిలా చక్కగా సూత్రీకరించారు: "ఒకే వ్యక్తిలో మానసిక శక్తినీ, దిటవునీ ఆత్మిక సున్నితత్వంతో, హృదయ స్పందన శక్తితో, యిత రుల కష్టాల్లో పాలుపంచుకొనే సామర్థ్యంతో సమరసంగా జోడించడం ఎలా సాధ్యం?"

మన పిల్లలకి దయగా వుండటం, యితరులపట్ల జాలిపడటం, సాధుత్వం నేర్పేందుకు మనం గట్టిగా ప్రయత్నిస్తాం. అయితేనేం, యీ అద్భుతమైన గుణాలతో బాటు మన సొంత ిల్లలు తగు మాత్రంగా లౌకికంగా వుండాలనీ, తనకి తాను నిలబడగలిగి వుండాలనీ, బండగా

చెప్పాలంటే, చెడుకి వ్యతిరేకంగా మంచిని తన పిడికిలితో కాపాడేందుకు సిద్ధంగా వుండాలనీ మనం కోరుకుంటాం, వాళ్లు అలా వుండేలా ప్రయత్నిస్తాం. అయితే బహుశా యీ సంద ర్భంగా కొంత క్రౌర్యంతో సమ్మిశ్రితమైన దయని మనం కోరుకుంటున్నామనా దీని అర్థం. కాదు, ఇది మరింత సంశ్లిష్టమైనది.

పిల్లలు అతి దయగా వున్నా, అతి జాలి చూపినా, వాళ్ల సమవయస్కుల్లో కొందరికి చిరాకు కలుగుతుందన్న విషయం నేను గమనించాను. అలాంటి కుర్రాళ్లను చితక్కొట్టి, వాళ్ల డబ్బులు, టోపీలు, వగైరాలు లాగేసుకున్న కొన్ని సందర్భాలు నాకు తెలుసు. అమ్మాయిలు సైతం అలాంటి తమ స్నేహితురాళ్లని చావచితక కొట్టడం నేను ఎరుగుదును.

ప్రేమ, ఆపేక్ష, లాలన వాతావరణంనుంచి, సౌకర్యవంతమైన చోట్లనుంచి, ప్రేమతో చూసే తల్లితండ్రుల దగ్గర్నుంచి వచ్చిన పిల్లలు క్రియాశీల వ్యక్తీకరణల ప్రపంచంలోకి, స్కూలుకి వచ్చి పడతారు. అన్నీ సలసల మరుగుతూ వుండే, యీ సలసలలాడటం తరచు అతి కచ్చితత్వంలోకీ, నైశిత్యంలోకీ, చివరకు క్రౌర్యంలోకీ సైతం మారే ప్రపంచం యిది. పిల్లల శక్తిని సమున్నత సత్ పౌరత్వంలోకి పరివర్తితం చేసే యీ క్రమం దాన్ని నికరమైన మానవీయ సారంతో నింపడం ద్వారా సాగుతుంది.

పిల్లల సాంఘిక సంబంధాలను "మానవీయం" చేసే యీ సంశ్లిష్ట కార్యకలాపం దేనిలో వ్యక్తమవుతుంది? ఈ సాంఘిక సంబంధాలను బాధ్యస్థ భావం, న్యాయం, దయ, సాహచర్య భావాల ప్రాతిపదికమీద వ్యవస్థీకరించడంలో వ్యక్తమవుతుంది. బహుశా బలప్రయోగాన్ని ఎదిరించగల, రాజీ పడకుండా "కుదరదు" అని ప్రకటించగలిగిన మాదిరి వ్యవస్థీకరణలో వ్యక్తమవుతుంది.

దయతో కూడిన మానసికోద్వేగాలను జాగృతం చేయడంతో కూడా యిది వ్యక్తమవు తుంది. ఇది తక్కువేమీ కాదు. రష్యన్ మహా కవి పూష్కిన్ తనని గురించి తాను యిలా రాసుకోవడం సకారణమైనదే:

నా గేయం ప్రేమపూరితమైన దయతో చిప్పిలుతోంది
కనుకనే జనం నన్ను దీర్ఘకాలం గౌరవిస్తారు...

సుహోమ్లీన్‌స్కీ ప్రతిభావంతుడైన బోధన శాస్త్రవేత్త. ఆయన పత్రాల్లో పవ్లీష్ సెకండరీ పాఠశాలకోసం ఆయన స్వయంగా తయారుచేసిన బోధనా పథకం నాకు దొరి కింది. అది 1970/1971 స్కూలు సంవత్సరంలో అమల్లో పెట్టేందుకు ఆయన రూపొం దించిన పథకం. అందులో "ప్రాథమిక నైతిక సంస్కృతిని పెంపొందించడం" అనే విభాగాన్ని నేను పరిశీలించాను. దానిలో 300 పాఠ్యాంశాలు వున్నాయి. వాటిలో ప్రతి ఒకటీ ఒక సుభాషితంగా అభివృద్ధిచేయబడింది. మచ్చుకు యివి చూడండి:

"43. శ్మశానం అన్నదొక మానవ పవిత్ర స్థలి. దానిలో వున్నది గతానికి చెందిన

బూడిద కాదు. భవిష్యత్తుకి సంబంధించిన శాశ్వత సజీవ మూలాలు. మానవ పవిత్ర స్థలిని పదిలంగా వుంచేందుకు ప్రయత్నించండి. తన పూర్వీకుల సమాధులను దర్శించినప్పుడు, నీచుడో లేక మూర్ఖుడో మాత్రమే నిర్లిప్తంగా ఉంటాడు.

"55. వృద్ధాప్యం ఆనందం గాని, సంతోషం గాని కాజాలదు. 'సంతోషకర వృద్ధాప్యం' అనే పదబంధాన్ని కూర్చినవాడు అజ్ఞాని. వృద్ధాప్యం విశ్రాంతి గాని, విషాదం గాని కావచ్చు. గౌరవింపబడినప్పుడు అది విశ్రాంతి అవుతుంది. ఉపేక్షా, ఒంటరితనమూ దాన్ని విషాదంగా మారుస్తాయి...

"173. భవిష్యత్తులో నువ్వొక మాతవి. ప్రకృతీ, సమాజమూ నీకు మహత్తరమైన బాధ్యతను కల్పించాయి. నువ్వొక స్త్రీవి. నికరమైన స్త్రీత్వం జాలి, కాఠిన్యాల, ఆపేక్షా, లొంగమిల మేలి కలయిక."

ఇక్కడ మన విషయాంశానికి అంత సంబంధం లేనివిగా కనిపించే సుభాషితాలను నేను ఏరాను. కాని యీ అసాధారణ వైఖరుల్లో మానవత్వం, సత్ పౌరత్వం, దయ, సాంఘిక విలువలూ ఎంత సజీవంగా సమ్మిళితమవుతున్నాయో గమనించండి. మంచి పౌరుణ్ణి పెంచడమంటే యిదీ. కొందరు వృత్తిపర బోధకులకి యిది విచిత్రంగా కనిపించవచ్చు. కాని జన సంప్రదాయాల్లో యిది పూర్తిగా సహజమైనది. పిల్లలు ఎంతకైనా తెగించి మానవ విలువలను కాపాడాలి.

"ఉదయం" శీర్షిక కిందలో పెద్దవాళ్లు తమ పిల్లల ఆంతరిక ప్రపంచంలో మొరటుగా కల్పించుకోరాదన్న విషయాన్ని క్లుప్తంగా చెప్పాను. ఈ నియమం పిల్లల స్కూలు సంబంధాలకీ, కుటుంబ సంబంధాలకీ కూడా సమానంగానే వర్తిస్తుంది.

మన పొరపాట్లలో చాలా మటుకు మన యోగ్యతల కొనసాగింపు (లేక మరింత కచ్చితంగా చెప్పాలంటే, వక్రీకరణ)... కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడాలి, నిర్మొగమాటంగా వుండాలి అన్న కోర్కెలు, మొత్తంమీద చెప్పకోవాలంటే, యోగ్యతలు, సమష్టి తత్వపు చిన్నెలు. అయితే దేన్నీ పరిగణనలోకి తీసుకోరాదు, సమష్టిని "పడగొట్టాలి" (యిదేం మాట, ఏదో ఓ కొయ్యపెట్టెని గురించి మాట్లాడుతున్నట్లు!) అన్న వాంఛ కొందరు బోధకులు అనాలోచితమైన బోలెడు బోధన శాస్త్రీయ కార్యకలాపాలను విపులీకరించేందుకు దారితీసింది. అత్యున్నత బోధన శాస్త్రీయ ఆకర్షణగా కొందరు బోధకులు పిల్లల్ని సమష్టిగా "చీల్చి చెండాడటాన్ని," దాక్షిణ్యం చూపకపోవడాన్ని ప్రతిపాదిస్తారు. అలాంటి శిక్ష విధింపబడ్డ విద్యార్థి క్లాసు మధ్యలో తల వాల్చుకొని, జేబుల్లో చేతులు పెట్టుకొని, కాలు మార్చి కాలిమీద నిలబడుతూ వుంటాడు. "సరిగ్గా నిలబడు!" అంటూ క్లాసు పిల్లలు అరుస్తూ వుంటారు. "వీడికి సరిగ్గా నిలబడటం నేర్పండి!" అంటూ టీచరు "కుర్రాళ్లకి" సౌంజ్ఞ చేస్తాడు. వాళ్లు కుర్రాడి చెయ్యి మెలిపెడతారు. అలా వాణ్ణి "సరిగా నిలబడే"లా చేస్తారు.

తమ పౌర అస్తిత్వాన్ని చూపించుకోవాలని అందరు పిల్లలూ తహతహలాడతారు. ఈ

మహోత్సాహానికి స్కూల్లోనూ, ఇటు యింట్లోనూ కూడా దోహదం చెయ్యాలి. మౌలికమైన నిజాయితీ, తమ పౌర విధి నిర్వహణపట్ల ఆత్రుత — యీ రెండింటి మేలి కలయికే పెంపకంలో అవసరమైన, సరైన నైతిక ఫలితాన్ని యిస్తుంది.

మనం పిల్లల్ని ఎందుకు పెంచుతున్నాం అని మనల్ని మనం ప్రశ్నించుకున్నప్పుడు, ఆనందంకోసం, శ్రమకోసం అన్నదే అనివార్యమైన సమాధానం అవుతుంది. అయితే మన చిన్న పిల్లల ముందు కుటుంబానికి సంబంధించిన బ్రహ్మాండమూ, సర్వవ్యాప్తమూ అయిన భావనను ఉంచడం కొంత భయంకరంగా వుంటుంది. మన పిల్లలకి తమ సొంత కుటుంబాలను కలిగివుండే సమయం వచ్చితీరుతుంది.

మీకు పదిహేనేళ్ల అమ్మాయి వుంటే, ఆమె అతి త్వరలోనే తన సొంత కుటుంబాన్నీ, పిల్లల్నీ కలిగి వుండగలుగుతుంది. మీరు ఆమెను యీ బాధ్యత వహించేందుకు సన్నద్ధం చేయాలి. ఆమెను నిరంతరాయంగా అందుకు సంసిద్ధురాల్ని చెయ్యండి. అందుకే ఇంటి పనులు చేయడంలో ఆమెకి మీరు ఆసక్తి కల్పించాలి. తనకి తాను, తన పిల్లలకి, తన భర్తకి ఆపేక్ష వాతావరణాన్ని కల్పించడాన్ని మీరు ఆమెకు నేర్పాలి.

అయితే, ప్రధానమైనది పిల్లలకి మీరు ప్రేమించడం నేర్పడం. ప్రేమ శ్రమని, ఆసక్తుల్ని, వ్యక్తిగత సంబంధాలని ఆవరించి వున్నప్పుడే అది నికరమైన ప్రేమ అవుతుంది. ఒకరికి ప్రేమించడం నేర్పడమంటే, సుందరమైన దానితో నిరంతరాయంగా సంతోషం పొందడం నేర్పడమే. విశేషంగా ప్రయత్నించి, మంచిని సృష్టించడం, ఒకరికి అతి సన్నిహితంగా వున్నవాళ్లకి సంతోషం కలిగించడం ఎలాగో నేర్పడమనే దీని అర్థం.

మీ అబ్బాయి మీపట్ల, తన టీచరుపట్ల, తన స్నేహితురాలిపట్ల శ్రద్ధ చూపడం లేదంటే, వాడు యితరులపట్ల శ్రద్ధాసక్తులు చూపడం అనేది అలవరచుకోవడం — యివి లేనిదే అసలైన కుటుంబ జీవితం అంటూ ఏదీ వుండదు — అనుమానాస్పదమే.

మీ పిల్లలు ఆరోగ్యంగా, బలంగా పెరుగుతున్నారంటే, తమ కంటె బలహీనుల్ని ఎంతకైనా తెగించి కాపాడేందుకు సదా సంసిద్ధంగా వుంటున్నారంటే, మీరు జబ్బుగా వున్నప్పుడు మిమ్మల్ని వాళ్లు శ్రద్ధగా కనిపెట్టుకొని వుండి చూస్తున్నారంటే, వాళ్లు మీ కుటుంబ సమష్టి ప్రయోజనాలను తమ వ్యక్తిగత కోర్కెల కంటె ఉన్నత స్థాయిలో ఉంచుతున్నారంటే, యీ ప్రేమపూరిత సంబంధాలు వాళ్ల సొంత కుటుంబాలకు కూడా విస్తరిస్తాయని మీరు ధ్రువీకరించుకోవచ్చు.

పిల్లలు ఎప్పుడూ విశిష్ట వైఖరులు కలిగి వుంటారు. ఒక బృందంనుంచి మరో బృందానికి, ఒక కుటుంబ సమష్టినుంచి మరో కుటుంబ సమష్టికి మారినప్పుడు మనిషి తన వైఖరులను, అవసరాలను చుట్టూ వున్నవాళ్ల ప్రపంచంలోకి తీసుకువస్తాడు. ఈ వైఖరులు నూతన మానవుడి, నూతన సమష్టి ప్రతిబింబించే నికరమైన మానవ విలువలను రూపొందించేవిగా వుండటం ముఖ్యం.

ఇక చివరి సంగతి...

సాయంకాలం ఎప్పుడూ మరుసటి రోజుమీద ప్రతిబింబం. మరుసటి ఉదయాన్ని ఆనందమయ కార్యాల సాధనకి శుభారంభాన్ని చేసేందుకు శాయశక్తులా కృషి చెయ్యండి.

కొన్ని రోజువారీ సూత్రాలు.

పిల్లలతో నైతిక ప్రవర్తనకి సంబంధించిన ముఖ్యమైన సంభాషణలను రాత్రి పొద్దు పోయేదాకా వాయిదా వెయ్యకూడదు. సాయంత్రం ఏడు లేక ఎనిమిది గంటలలోగా వాటిని ముగించేందుకు ప్రయత్నించండి. నిద్రకి ఉపక్రమించేందుకు ముందరి రెండు గంటలూ పిల్లలు విశ్రాంతిగా ఉండాలి. అప్పుడు వాళ్లకి మరుసటి రోజుకి సన్నద్ధమవడం నేర్పాలి. ఏ ఒక్కటీ స్వల్పాంశం కాదు. వాళ్లు తమ పాఠ్య పుస్తకాలు, ఎక్సర్‌సైజు పుస్తకాలు పోగు చేసుకునేలా చూడండి. పెన్సిళ్లు, పెన్నులు సిద్ధంచేసుకునేలా చూడండి. వాళ్లు తమ దుస్తులు సర్దుకునేలా, అవసరమైతే ఊడిన గుండీలు కుట్టుకునేలా, నలిగిన బట్టలు ఇస్త్రీ చేసుకునేలా చూడండి. చివరి సంగతి – యిది అన్నింట్లోకీ అతి ముఖ్యమైనది – పొద్దుపోకుండా సరైన సమయంలో నిద్రపోయేలా చూడండి.

పిల్లలకి తమ పక్క తాము రోజూ ఒకే వేళప్పుడు వేసుకునే అలవాటు చెయ్యండి. "నా పని నేనే చేసుకుంటాను" అనే సూత్రాన్ని పూర్తిగా వినియోగించుకోవాలి. అయితే వాళ్లు అలా చేసుకునేటప్పుడు వాళ్లకి చేయూత యిచ్చి, వాళ్లు మరీ ఉద్రిక్తులు కాకుండా చూడండి. అందుకనే పిల్లల్ని రాత్రిపూట ఉద్రేకం కలిగించే సినిమాలు చూడనివ్వకూడదు. ప్రత్యేకించి హత్యలు, అపరాధ పరిశోధనలతో కూడిన డిటెక్టివ్ సినిమాలు అసలే చూడనివ్వకూడదు. మొత్తంమీద పిల్లల్ని రోజుకు ఒక గంటకి మించి టి.వి. చూడనివ్వకండి.

పిల్లలు నిద్రపోయేందుకు ముందు వాళ్లకి ఎటువంటి పరిస్థితుల్లోనూ కాఫీ గాని, మసాలాలు వేసిన వంటకాలు గాని యివ్వకూడదు. జూదం యిమిడివున్న ఆటలు ఆడనివ్వ కూడదు. భీతావహం కొలిపే కథలు గాని, క్రౌర్యంతో నిండిన కాల్పనిక కథలు గాని చెప్ప కూడదు. కుటుంబంలో ఏదైనా ఘర్షణ వచ్చి, దాన్ని పరిష్కరించుకోవలసి వుంటే, మీ పిల్లలు నిద్రపోయేదాకా ఆగండి. మీ యింటికి అతిథులు వస్తే, మీ బిడ్డల్ని సకాలంలో నిద్రపుచ్చండి. వాళ్ల సమక్షంలో పిల్లలు మరింత ఉద్రేకపడకుండా చూడాలి.

నిద్రపోయేందుకు ముందు పిల్లలకి అత్యుత్తమ కార్యకలాపం పెద్దవాళ్లతో కలిసి తాజా గాలిలో నడిచిరావడం, అప్పుడు మరుసటి రోజును గురించి, మర్నాటి ఉదయపు కార్యకలాపాలకు సన్నాహాలను గురించి చర్చించడం. ఇక్కడ కొంచెం "నాటకం" ఆడవచ్చు. మీరు మీ బిడ్డతో ఇలా అనవచ్చు: "ఇంకిప్పుడేమిటి, నిద్రపోవడమా? లేకపోతే, నీ జాగ్రఫీ హోమ్‌వర్కు గురించి నాకు మరో సారి చెప్తావా?" వాడు మొదటి దానికే అంటే, నిద్ర పోయేందుకే యిష్టపడతాడు. అందుకు మీరేమీ బాధపడకండి. తనింకా నేర్చుకోని జాగ్రఫీ పాఠంలోని భాగాన్ని ఉదయం స్కూలుకి బయల్దేరేందుకు ముందు తను చూసుకోవాలన్న

ఆలోచనతో వాణ్ణి పక్క ఎక్కనివ్వండి. వాడి హృదయాన్నీ, మనస్సునీ మర్నాటి శ్రమను గురించిన కించిత్ ఆదుర్దాతో కూడిన నిరీక్షణతో నిండనివ్వండి.

యువ పయనీర్ శిబిరాల్లో నాకు తరచు యీకింది విషయాలు తటస్థపడ్డాయి. అమ్మాయిలు నిద్రపోలేక తమ మానిటర్లతో "కాసేపు మా దగ్గర కూర్చోండి" అనో, లేక "నేను పడుకునేందుకు ముందు మా అమ్మ నన్ను ముద్దుపెట్టుకునేది, ఆ వెంటనే నాకు నిద్ర పట్టేసేది..." అనో, లేక "నాకు కథ చెప్పండి" అనో అంటూండేవాళ్లు.

ఈ మాటలు పిల్లలకి ఆపేక్ష ఎంత అవసరమో ప్రతిబింబించడమే కాక, ఆత్మికంగా సుసంపన్నంచేసే గుణాత్మక ఉన్నత అవసరాన్నీ, మరొకరెవరి దగ్గర్నుంచైనా నిగూఢమైన ఏదో ముఖ్యమైన దాన్ని వినాలన్న కోర్కెనీ, పిల్లలకి తమ సామర్థ్యంమీద విశ్వాసాన్ని తరచు దొలిచివేసే రోజువారీ ఉద్రిక్తతనూ, ఆదుర్దాలనూ తుడిచిపెట్టే నమ్మకమైన మాటలు చెప్పేవాళ్లతో సాన్నిహిత్యం ఎంత అవసరమో తెలియజేస్తాయి.

పిల్లలకి మాటల ద్వారా లేక మనస్సుని స్పందింపచేయడం ద్వారా ఆశాభావం కలిగించడం, వాళ్ల శక్తిలో విశ్వాసం కల్పించడం చాలా అవసరం. ఈకింది భావాలను వ్యక్తంచెయ్యవచ్చు: "నువ్వీ వేళ బోలెడు చదివావు. నువ్వింత క్రమశిక్షణగా ఎలా చదవగలిగావో అని నాకు ఆశ్చర్యంగా వుంది... దానిదేముందిలే, నువ్వు గట్టిగా ప్రయత్నిస్తే స్కూల్లో యింత కంటె బాగా చెయ్యగలవు..."

ఈ భావ స్ఫోరకమైన మాటల ద్వారా పిల్లవాడు బహుశా తను చెయ్యగలిగివుండీ, కొంత పని చెయ్యనందుకు మీ విచారాన్ని గ్రహించాలి...

మీ యీ ప్రయత్నాలు మీ పిల్లల్లో ఆలోచనలనూ, సంవేదనలనూ రేకెత్తించవచ్చు. వాళ్లు యిలా అనుకోవచ్చు: "మా అమ్మ నన్ను చక్కగా అర్థంచేసుకుంటుంది. అందుకే అమ్మ అంటే నాకు ప్రేమ... రేపు నేను తప్పకుండా ప్రయత్నించి అమ్మకి నా సత్తా చూపిస్తాను."

ఒకసారి కొందరు ఐదో తరగతి పిల్లల్ని స్నేహం గురించి, నిజమైన స్నేహితుణ్ణి గురించి కాంపోజిషను రాయమన్నారు. తన బామ్మ తను చెప్పింది వింటుంది కనుక, తనని అర్థంచేసుకుంటుంది కనుక, తన బామ్మను తను అసలైన మిత్రంగా పరిగణిస్తున్నట్లు మీష రాశాడు. నేను "మీ బామ్మ మీ అమ్మ లాగ అది చెయ్యమనీ, యిది చెయ్యమనీ, చదువుకొమ్మనీ అడగదు కనకా?" అని అడిగాను.

"అబ్బే, అదేం కాదు. బామ్మ నన్ను మరీ వేధిస్తోందని అమ్మ అస్తమానం అంటూ వుంటుంది. బామ్మ నేను ఏది చెయ్యకపోయినా వదిలిపెట్టదు. అయితేనేం, బామ్మ సరసంగా మాట్లాడుతుంది. నేను చెప్పే మాట ఎప్పుడూ వింటుంది. అందుకే బామ్మతో నాకు ఎక్కువ స్నేహం" అంటూ సమాధానం చెప్పాడు మీష.

* * *

వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దేది కృషి, కృషి మాత్రమే అని నిరంతరం నొక్కి వక్కాణించి చెపుతూ వుంటారు బోధకులు. దీన్ని కాదనలేము. అయితే, కృషికి సంబంధించిన భావనలో మౌలికమైన నైతిక ప్రమాణాలు, తన తల్లితండ్రులపట్ల, స్కూలుపట్ల తన బాధ్యతలను అర్థంచేసుకోవడం, మహత్తర నైతిక ఆదర్శాలను హృదయంతో, మనస్సుతో గ్రహించడం దిశగా ఉన్ముఖంచేయబడిన కుటుంబంలోని సన్నిహిత సాంగత్యం కూడా యిమిడి వుండాలి.

ఈ ఆదర్శాన్ని సాధించేందుకు పిల్లలను దయతో, కచ్చితంగా చూడడం, ఆదేశాలిచ్చే సంబంధాలు, పిల్లల సృజనాత్మక సామర్థ్యాల్లో విశ్వాసం కలిగి వుండడమే మార్గం.

సోవియట్ బోధన శాస్త్రపు అత్యుత్తమ సంప్రదాయాలు ఎప్పుడూ మనిషిలోని అత్యుత్తమమైన దానిలో విశ్వాసాన్ని వ్యక్తంచేశాయి. దాని సూత్రాలు పనులు చేయించడంలో కచ్చితత్వం, తగు మాత్రపు కాఠిన్యం, పిల్లల హుందాతనంపట్ల గౌరవంతో, దయతో జోడింపబడి వుంటాయి.

## ప్రకరణం 3

# సర్వతోముఖం, సమరసం

## (పద్ధతులు, సాధనాలు.

## కౌమార వయస్కులైన స్కూలు పిల్లలు)

### కౌమార వయస్కులు ఎలా వుంటారు

కుటుంబ సంబంధాలు సమరసంగా వున్నంత మాత్రాన సమస్యలు, ఘర్షణ పరిస్థితులు ఉండకపోవు.

ఇందుకు భిన్నంగా, ఆదర్శానికి ఎంత దగ్గర్లో వుంటే, కొత్త ఘర్షణల ప్రపంచం అంత ఎక్కువ సంశ్లిష్టంగా, సున్నితంగా వుంటుంది. సమరసత్వం అన్నదెప్పుడూ భిన్నమైన వాటి ఐక్యత. ఒకరి వ్యక్తిత్వ విస్తృతి గురించి మనం మాట్లాడేటప్పుడు, మనకి అతని "వైరుధ్యాల విస్తృతి" కూడా తటస్థపడుతుంది. విచిత్రమే, అత్యంత వైవిధ్య పూరితమైన ఆసక్తులు ఒక్క వ్యక్తిలో ఎలా మేళవింపబడ్డాయో? ఆసక్తులు అందమైనదాన్ని, మానవ ప్రేరణల, గవేషణల, సాంగత్యాల వైవిధ్యపూరిత ప్రపంచాన్ని పిల్లల జీవితంనుంచి తుడిచిపెట్టగల ఒక వ్యామోహం అవడాన్ని ఎవరైనా ఎలా నివారించగలరు? కొత్తగా ఉత్పన్న మవుతున్న అవసరం మరొక అవసరానికి ఏ ప్రాతిపదికమీద దారితియ్యాలి? ఏదైనా ఒక వైరుధ్యాన్ని పరిష్కరించడం కౌమార వయస్కులని అత్యున్నత ఆశాభావానికి అనివార్యంగా నడిపేలాగ, వాళ్ళని స్వయం విద్యకి ప్రేరేపించేలా చేయడం ఎలాగ?

ఒకరి వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దే అన్ని సంభావ్య సంబంధాల సామరస్య సాధనకి మార్గం ఏమిటి? తనపట్ల తన వైఖరి (ఆత్మచైతన్యం) బంధువులు, స్నేహితులు, టీచర్ల వంటి యితరులపట్ల, సమాజంపట్ల అతని వైఖరిని ఎలా ప్రభావితం చేస్తుంది?

బోధన శాస్త్ర ప్రమాణం, వ్యక్తి మామూలు స్థితినుంచి వైదొలగడం – యీ రెండూ విడివడినప్పుడు, పిల్లల పెరుగుదల స్వయంగా ఉత్పన్నంచేసే అత్యంత అనూహ్య సమస్యలు తలెత్తుతాయి.

ఆదర్శపు ఉనికి నిరంతరాయమైన చలన రూపంలో వుంటుంది. ఒక "నమూనా" నుంచి మరింత నిర్దుష్టం చేయబడిన నమూనాకి యీ చలనం జరుగుతుంది. ఈవిధంగా దానికదిగా ఆదర్శ ప్రమాణంలో "స్వయం చలనం" యిమిడి వుంటుంది. ఇది లేనిదే మనిషి "అంతరాత్మని" తీర్చిదిద్దే సంశ్లిష్ట గతితార్కిక క్రమాన్ని అర్థంచేసుకోవడం సాధ్యం కాదు.

నిరంతరాయమైన యీ పెరుగుదలలో ఏదో ఒకటి నాస్తీకరింపబడుతుంది, ఏదో ఒకటి మారుతుంది. వాస్తవిక సందర్భాల్లో యీ "నాస్తీకరణలు" బాధాకరం కావచ్చు, వీటిని వెన్నంటి చిల్లర సంక్షోభాలు, నైతిక ఆఘాతాలు, క్లేశాలు రావచ్చు.

బోధన శాస్త్ర సూక్ష్మాంశాల పరిజ్ఞానం అపరిష్కరణీయమైన ఘర్షణలను నివారించాలి. మరింత కచ్చితంగా చెప్పాలంటే, ఆ ఘర్షణలను హేతుబద్ధంగా ఎలా పరిష్కరించుకోవాలో సూచించాలి. అయితే, యిది కూడా – ప్రత్యేకించి మరింత పెద్ద కౌమార వయస్కులతో వ్యవహరించేటప్పుడు – అంత తేలికేమీ కాదు. వాళ్ల వివిధ ఆసక్తుల చట్రం లోపల, వాళ్ల వివిధ కార్యకలాపాల్లో పిల్లల స్వభావమూ, దానికి తోడు జీవితంపట్ల, బాధ్యత, ఆత్మశుద్ధి, సంతోషం వంటి సంశ్లిష్ట భావాభివర్గాలపట్ల వాళ్ల దృక్పథమూ ఆకస్మికంగా వెలికిరావచ్చు. పిల్లలు పెద్దవాళ్లయ్యే కొద్దీ, వాళ్ల అనుభవ వైశిత్యం మరో రూపాన్ని, కొన్ని సమయాల్లో మరింత ప్రచ్ఛన్న రూపాన్ని సంతరించుకోవచ్చు. మనుషుల మధ్య సంబంధాల విశ్లేషణ క్రమమే మరింత సంశ్లిష్టమవుతుంది.

అడుగడుగునా సమస్యలు వుంటాయి. మగపిల్లల పెంపకానికీ ఆడపిల్లల పెంపకానికీ మధ్య చాలా తేడాలు వుంటాయి. పిల్లలకి చదువుమీద ఆసక్తిని పెంపొందించడం పిల్లలకి సౌందర్యమయ ప్రపంచంతో పరిచయం చేయడానికి కొంత భిన్నమైనది. శ్రమ విద్య విశిష్ట లక్షణాల సంగతి ఏమిటి? పనికీ కళకీ మధ్య సంబంధం ఏమిటి? పిల్లల దృఢ విశ్వాసాలకీ వాళ్ల స్వతంత్ర కార్యాచరణకీ మధ్య సంబంధం ఏమిటి? ప్రపంచ దృక్పథంలోకి ఒకరి దృక్కోణపు అంశాల అతి సూక్ష్మ పరివర్తనల సంగతి ఏమిటి? కౌమార వయస్కుల ప్రాతికూల్యతత్వం, ఫేషన్లపట్ల వ్యామోహం, సాంప్రదాయికత, అనువర్తనం, మనస్సు సవిమర్శక చలనాల సంగతి ఏమిటి? తల్లితండ్రులు సమాధానాలు వెదుకుతున్న సమస్యల జాబితాలో యివి కొన్ని మాత్రమే.

కౌమార వయస్కులు స్వయంగా చెప్పేదేమిటో వినేందుకు ప్రయత్నించి, వాళ్ల పరస్పర విరుద్ధ నైతిక ప్రపంచం ఎలా రూపొందుతుందో చూద్దాం. మరింత పెద్ద కౌమార వయస్కులతో పనిచేసేటప్పుడు, వాళ్ల విషయాల్లో మరింత ఎక్కువ వెసులుబాటుతనం చూపాలనీ, బహుశా చిన్న పిల్లలతో పనిచేసే బోధకులు చూపేదాని కన్న మరింత ఉన్నత కళా రూపాన్ని ప్రదర్శించాలనీ నాకు అనిపిస్తుంది.

## కౌమార వయస్కులు ఎలా వుంటారు

చివరి స్కూలు సంవత్సరాలు.
శారీరక, మానసిక అభివృద్ధి.
ఆత్మావలోకనానికి ముమ్మరమైన వెదుకులాట.
అన్నీ తెలుసుకోవాలన్న, నిర్వచించాలన్న అసహనం.

నిరుత్సాహాలు.

అబ్బాయితో తొలి సమావేశాలు, గాభరా.

అనుకోకుండా ఫెయిల్ మార్కులు.

పునరావలోకనం. వాదోపవాదాలు...

బోధన శాస్త్ర వ్యాసాలను పిష్ట పేషణంలా, రొడ్డకొట్టుడుగా సాగలాగడం యిప్పుడొక ఫేషను అయింది. కాని బోధన శాస్త్ర వ్యాసాల్లో చెప్పదలచుకున్న భావాన్ని స్పష్టంగా వ్యక్తం చేయడం అవసరమని నా ఉద్దేశం. లేకపోతే మాటల ముమ్మరం వల్ల ప్రయోజనమేమీ వుండదు.

అందుకని, మొదటి అంశం.

కౌమార వయస్సులో తొలి సంవత్సరాలు అత్యంత దురవగాహ్యమైనవి, అత్యంత సంశ్లిష్టమైనవి.

మీ అమ్మాయికి యిటీవలే పన్నెండేళ్లు వచ్చాయి. ఇప్పుడిక ఆమెతో మీరు చిన్న పిల్లతో మాత్రమే కాకుండా, ఒక యువతితో వ్యవహరిస్తున్నారని గుర్తుంచుకోవాలి. ఆమె అప్పుడే స్త్రీల ప్రవర్తనకి సంబంధించిన సున్నిత అంశాలన్నింటినీ — కొద్దిగొప్పల్లో యుక్తాయుక్త జ్ఞానం, శోభస్కరమైన దౌర్బల్యం, కొంచెం గూఢవర్తన, సంఘీభావం, రహస్యగోపన సామర్థ్యం (రహస్యాన్ని ఆమె ప్రాణంపోయినా బయటపెట్టదు!) — దఖలుపరచుకొని వుంటుంది. తన తల్లితో అసాధారణమైన ఉమ్మడి సంఘటన (అన్నింట్లోనూ కాక, కొన్ని విషయాల్లోనే): ఉమ్మడి అభిప్రాయాలు, అభిరుచులు, అనుబంధాలు. తండ్రితో కొంత ఎడం. విడ్డూరమైన పెడసరి, విశృంఖల మగజాతిపట్ల కొంత ఏవగింపు వైఖరి... దీనితో బాటు, తమకి భిన్నమైన యీ మగజాతివాళ్లమీద పెత్తనం చలాయించాలన్న కాంక్ష, ప్రయత్నమూ కాక శుద్ధ స్త్రీ సహజమైన పద్ధతిలో వాళ్లని ఆకర్షించి తమకి అనుబంధించుకోవాలన్న తపన. వాళ్లని అర్థంపర్థం లేని మాటలు చెప్పనివ్వండి, వాళ్లలో వాళ్లని గప్పాలు కొట్టుకోనివ్వండి, అత్యాధునాతన స్థాయిలో తమ శక్తినీ, లాఘవాన్నీ ప్రదర్శించుకోనివ్వండి... అన్నట్లు మగాళ్లు జీన్సుకోసం, చొక్కాలకోసం, కేశాలంకరణకోసం ఎంతో కాలం వృథా చేయడం నిజంగానే శోచనీయమైన విషయం. ఈ రోజుల్లో ఏక నిష్ఠగా ప్రేమించగలిగిన, లేమిని సహించగలిగిన, ఒక ఆదర్శంకోసం త్యాగంచెయ్యగలిగిన నికరమైన మగాళ్లు ఎంత తక్కువో (యీ సంగతే వాళ్ల అమ్మ పదేపదే రెట్టిస్తూ వుంటుంది). మిమ్మల్ని అర్థంచేసుకోగలిగిన వ్యక్తి మీ పక్కన వుండాలనీ, యీ కోపిష్ఠి కౌమార వయస్కుడు మీ సరసన నడవాలనీ మీరు ఎంతగానో కోరుకుంటారు. అతనితో అత్యంత రహస్యమైన విషయాలను చెప్పకోగలగాలనీ, అవసరమైతే మీరే అతనికి ఏదో విధంగా సాయంచేయాలనీ, అతనికి సానుభూతి చూపి, సముదాయించాలనీ ఎంతగానో కోరుకుంటారు.

మీ అమ్మాయికి యిప్పటికే పన్నెండేళ్లు వచ్చి, మరో వ్యక్తిని కలుసుకోవడంలో కలిగే హుషారైన సంతోషం ఆమెలో ఎన్నడూ (లేశ మాత్రంగా కూడా) జ్వలించకపోతే, యిది

స్కూల్లో ఫెయిల్ మార్కులు తెచ్చుకోవడం కంటె తక్కువ దురదృష్టకరమైనదేమీ కాదు.

అమ్మాయిల విషయంలో సాంఘికానుభవం అనబడేదాన్ని పొందడం ప్రధానంగా వాళ్ల భావోద్వేగాభివృద్ధిలో సంభవిస్తుంది. అందుకే మీ పన్నెండేళ్ల అమ్మాయి చదువుతున్న క్లాసు సంబంధాలను తేల్చుకోవడంతో కుతకుతలాడుతూ వుంటుంది. నాయకత్వంకోసం పోరాటం "ప్రముఖుల" మధ్య మాత్రమే కాకుండా అప్రముఖుల మధ్య కూడా సాగుతూ వుంటుంది. ఎవరు ఎవరికి ఏమి చెప్పారు, ఎవరు ఎవరిని హాల్లో తమతో కలిసి నడిచిరమ్మని ఆహ్వానించారు, ఎవరు ముందు మాట్లాడారు, ఒకరెవరో ఎవరికి అదే పనిగా ద్రోహంచేశారు ("ఎవరో కొత్త అమ్మాయి క్లాసులోకి వచ్చింది, నా స్నేహితురాలు నాతో కాక, ఆమెతో కలిసి భోజనాల గదికి వెళ్లింది!") — యిలాంటివాటన్నింటికీ విశేష ప్రాముఖ్యం యివ్వబడుతుంది.

సరిగా యీ సంవత్సరాల్లోనే స్త్రీత్వపు మొలకలు పటిష్ఠమవుతాయి. ఈ కాలంలోనే అత్యంత వైవిధ్యపూరితమైన ఉదాత్తానుదాత్త స్వరాలు (పెద్దవాళ్లకి అంతగా కనిపించని, స్నేహితురాళ్లకి అర్థమయ్యే అర్థ భేదాల ద్వారా) వినవస్తాయి. ప్రతీదీ క్రమబద్ధంగా సాగుతుంది — చిరు హాసాలు, పాక్షిక శిరః కంపాలు, అర్ధ స్ఫోరక పదాలు. కాదంటే ఔననిలే, ఔనంటే కాదనిలే, ఆడవారి మాటలకు అర్థాలే వేరులే అన్నట్లుంటుంది ధోరణి.

మరి పన్నెండు — పదమూడేళ్ల అబ్బాయిలు ఎలా వుంటారు? వాళ్లు మగవాళ్లా? ఎంత మాత్రం కాదు. ఆ వయస్సులో "మగాళ్ల సమస్యల"పట్ల వాళ్ల శ్రద్ధాసక్తులు పూర్తిగా భిన్నమైనవి. వాళ్ల దృష్టిలో సంబంధాలను తేల్చుకోవడం అన్నది పరమ విసుగైన పని. దానిపట్ల శ్రద్ధ చూపడానికి అసలు అర్థమే లేదు. అమ్మాయిలెందుకో ఎప్పుడూ అంత రభసచేస్తూ వుంటారు. ఏమీ లేనిదానికి వాళ్లు పెద్ద రొదచేస్తూ వుంటారు: ఒకళ్లిలా అంటే, మరొకళ్లు అలా అంటూ వుంటారు! అయితే ఏమిటిట — ఎవరు ఏమి చెప్తే ఏమి కొంపమునిగిపోతుంది? ఒక మాటని ముట్టుకోవడం, దానికి మాటుపెట్టడం, లేక దాన్ని స్క్రూ తిప్పడం నిజంగా సాధ్యమా?

మగపిల్లలకి వాళ్ల సొంత ఆసక్తి — లక్ష్య దిశాభిముఖమైన పద్ధతి వుంటుంది. వాస్తవికమైన, ఆలోచనీయమైన పద్ధతి అది. వాళ్లు బౌద్ధికమైనదాన్ని పాదార్థికంగా వ్యక్తీకరింపబడిన నిర్దిష్టతతో కొలుస్తారు. వాళ్లు వస్తు ప్రపంచంచేత, జంతువులు, రాళ్లు, ఖనిజాలు, కరెంట్లు, పొలిమేర్లు, ట్రాన్సిస్టర్లచేత ఆకర్షితులవుతారు. ప్రపంచాన్ని కొలవగల, బద్దలుకొట్టగల, తిన్నగా చేయగల, కరిగించగల ప్రతిదానిచేతా — సుత్తి, కటింగ్ ప్లయర్, సందంశకం, టంకపు సామాను, మంట — మగపిల్లలు ఆకర్షితులవుతారు.

వాళ్లకి కుక్కలు, పాములు, ఖడ్గమృగాలు, తదితర జంతువుల జీవితం, అరుపులు, కేకలు, బుసలు, గాండ్రింపులు, కూతలు — యివన్నీ ప్రపంచాన్ని దర్శించే మార్గాలే, యివన్నీ ఆసక్తికరమైనవే.

పోతే, క్రీడలు: స్కీయింగు, ఫుట్‌బాల్, హాకీ, స్కేటింగు, కుస్తీ.

బల పరీక్షలు: "నేను వాణ్ణి యిలా ఒక్కటుచ్చుకున్నాను!", "మనమందరం వాడిమీద దాడిచేద్దాం!", "నువ్వు మళ్లీ యిలా చేశావో, నీ బుర్ర రామకీర్తన పాడుతుంది..."

ఆకాంక్ష: "తొందరగా పెద్దవాణ్ణైపోయి, చంద్ర లోకానికి ఎగిరిపోతే ఎంత బాగుండును!", "ఎనిమిదో క్లాసు పూర్తిచేసేసి, భూగర్భ శాస్త్ర యాత్రకి వెళ్లిపోవాలి!"

వాగ్దానాలు: "నేను పెద్దవాణ్ణైనప్పుడు నా పిల్లల్ని ఎప్పుడూ కేకలెయ్యను!"

సమవయస్కులైన అమ్మాయిలపట్ల వీళ్ల వైఖరి ఎలా వుంటుంది? వీళ్లు అమ్మాయి మార్మికతపట్ల కొన్ని విధాలుగా ఆకర్షితులవుతారు – అయితే అదేమిటి? దాన్ని మాటల్లో వ్యక్తంచేయడం మాట అటుంచి, దాన్ని అర్థంచేసుకోవడం కూడా కష్టం. చలిమంటల దగ్గర, దీర్ఘ పాద యాత్రలప్పుడు, విరామాల్లో, పాఠాలప్పుడు అమ్మాయిలు చుట్టూ వుండటం ఆసక్తికరంగా వుంటుందన్న మాట నిజమేననుకోండి. అబ్బాయిలకి అమ్మాయిలతో కొంచెం హాస్యం కొట్టడం యిష్టమే, కలిసి సినిమాలకు వెళ్లడం సరదాగానే వుంటుంది!..

అయితే, అమ్మాయిలకీ అబ్బాయిలకీ మధ్య ఏదో ఒక అనుల్లంఘనీయమైన ఆమోదిత లక్ష్మణ రేఖ వుంటుంది, ఏ కారణంగానో గాని దీన్ని ఎవరూ ఉల్లంఘించాలని అనుకోరు. ఇక్కడ అమ్మాయిలుంటే, అక్కడ అబ్బాయిలుంటారు. ఇంతలో అకస్మాత్తుగా ఒక అబ్బాయి అల్లరికోసం బాణంలా దూసుకువెళ్లి అమ్మాయిని రాసుకుంటూ తోసుకుంటూ పోతాడు. అమ్మాయి కోపంతో మండిపడుతూ "ఏయ్, మృగమా!" అంటుంది. పైకి మాత్రమే యీ అనైక్యత. మనసా, కర్మణా, చివరకు అడ్డుగోడల ద్వారా లేక దూరం ద్వారా సైతం వాళ్లు విడదీయబడరు.

## పరిశ్రమించే స్వభావాన్ని అభివృద్ధి చెయ్యడం ఎలా

పెద్దవాళ్లకి ఒక్క విషయం మాత్రమే తెలుసు: "నిన్ను ఏ సబ్జెక్టులో ప్రశ్నలు అడిగారు? నీకు ఏ మార్కు వచ్చింది? నీకేమైనా చివాట్లు తగిలాయా?" (చివాట్లు తగిలినట్లు చెప్పే తెలివితక్కువతనం ఏ కుర్రాడికి మటుకు వుంటుంది?) అన్నది అన్నింటి కంటె పెద్ద ఆఘాతం! "ఏది నీ ప్రోగ్రెస్ కార్డు?" (ఈ ప్రోగ్రెస్ కార్డు అన్నది మెడలో గుదిబండ లాంటిది. నీ పుస్తకాల సంచిలోనే వున్న పితూరీదారు!)

కాని ఆ కుర్రాడి తండ్రి ప్రోగ్రెస్ కార్డులోని రిమార్కులు తాపీగా చదువుతున్నాడు: రెండో క్లాసుకి ఆలస్యంగా వచ్చాడు, మళ్లీ అకాలంలో ఫుట్‌బాల్ ఆడాడు, బోటనీ క్లాసుకి రొప్పుతూ, ఒంటినిండా బురద మరకలతో వచ్చాడు... కుర్రాడు కోర్టు విచారణలో దోషిలా

నిలబడతాడు. తను ఫుట్‌బాల్ టీములో మేలి ఆటగాడు! ఆ రెండో క్లాసుకి ముందు తను ఎంత అద్భుతమైన గోలు వేశాడు! తన ప్రోగ్రెస్ కార్డులో ఇరవై రిమార్కులు పెడతారన్నా తను ఆ గోలు వదులుకొని వుండేవాడు కాడు. ఎదటి పక్షపు రక్షణ వలయం ఛేదించుకుని చివరకంటా వెళ్లింది తనొక్కడే. మూలనుంచి తనొక్కడూ ధన్నుమని షాట్ కొట్టాడు! తన టీము కుర్రాళ్లందరూ తనమీదకి దూకి తనని కౌగలించుకున్నారు! ఇది తరచు జరుగుతుందా? ఈ గోలు తన భవితవ్యాన్ని నిర్ణయిస్తుందనీ, కుర్రాళ్లతో తన సంబంధాలకి అది కీలకమైనదనీ తన తండ్రి ఎందుకు అర్థంచేసుకోడో?..

అయితే అమ్మాయిలకీ, అబ్బాయిలకీ ఉమ్మడి అంశం వుంది – వాళ్ల మనస్సుల కవితాత్మక స్థితి, ప్రేరణల ప్రశంసనీయమైన ఆత్మికత. పెద్దవాళ్లు పిల్లల యీ సుందర కవితాత్మక స్థితిని అర్థంచేసుకోవడంలో విఫలురైతే, దాన్ని వాళ్లు తమకి మిత్రాన్ని చేసుకోక పోతే, నైతిక ప్రభావాలను గురించి మాట్లాడటం వ్యర్థం.

పన్నెండేళ్ల వయస్సులో మధ్య మధ్య మానసిక స్వేచ్ఛ ప్రధానంగా ఆటల్లో కనిపిస్తుంది. ఈ మానసిక ఉత్తేజాన్ని కార్యాచరణల రంగంలోకి, చదువులోకి మార్చుకోవాలి.

పిల్లల కవితాత్మక స్థితిని మీకు మిత్రంగా చేసుకున్నాక, కుక్కలు, ఖడ్గమృగాలు, పోలిమెర్లు, అడవి దున్నపోతులు, తాబేళ్లు, ట్రాన్సిస్టర్లు, పెనాల్టీలు, వగైరాలన్నింటిని గురించీ మీ అబ్బాయి ఉత్సాహాన్ని పంచుకున్నాక, మీరు తరుణం కనిపెట్టి, ఎప్పుడు, ఎందులో అవసరమో అప్పుడు, అందులో మీ అబ్బాయికి సాయంచెయ్య జూపాలి.

ఉదాహరణకి, కుర్రాడికి ఏదైనా ఒక సబ్జెక్టులో తక్కువ మార్కులు వస్తూంటే, ఆ క్లాసులో వాడు నిశ్చితంగా కూర్చోలేడు. పాఠం నేర్చుకునేటప్పుడు కలిగే ఆనందాన్ని వాడు కోల్పోతాడు. వాడి పాఠం రెండు భాగాలుగా వుంటుంది. మొదటి భాగంలో వాడు భయావిష్టుడై వుంటాడు: తనని ప్రశ్నలేమీ అడగకుండా వుంటే బతికిపోతాను అనుకుంటాడు. రెండో భాగంలో వాడి ఆందోళన క్రమంగా తగ్గుతుంది. అంత మాత్రాన పాఠం వింటాడని అనుకునేందుకు వీల్లేదు. క్లాసు ఎప్పుడు అయిపోతుందా, విరామం ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తాడు. అధిక సంఖ్యాక విద్యార్థుల దృష్టిలో యీ విరామమే నిజమైన జీవితం! పది నిమిషాల అద్భుతమైన స్వేచ్ఛ, ఆనందం. వాడి ఊపిరితిత్తులనిండా తాజా గాలి, ప్రపంచమంతా తన పాదాక్రాంతం అయిన అనుభూతి చెందుతాడు వాడు.

క్లాసు జరిగేటప్పుడు మంచి విద్యార్థులు, అంటే బాగా చదివేవాళ్లు మాత్రమే పాఠం విని, జ్ఞాపకం పెట్టుకుంటారు. క్లాసులో మిగిలినవాళ్లు కాలం గడిపేస్తారంతే. మీ సుపుత్రుడు తన పెన్సిలుతో తన ముందు కూర్చున్నవాడి వీపుమీద పొడిచి, వాడి చెవిలో ఏదో చెత్త గొణుగుతాడు. రెండోవాడు వీడి కేసి తిరుగుతాడు. టీచరు వాణ్ణి చివాట్లు పెడుతుంది. అలాగే రెండో సారి, మూడో సారి కూడా వాణ్ణి టీచరు చివాట్లు పెడుతుంది...

ఈ ఘటనల సంభావ్య పరిణామాలను గురించి నేనిక్కడ కొనసాగించను...

మీ కుర్రవాణ్ణి యీ భయంకరమైన స్తబ్ధత్వంనుంచి బయటకి లాగండి!

అయితే ఎలాగ?

మీకు టీచరు విషయం నచ్చలేదా?

మీకిక్కడ ఓ కథ చెప్తాను: ఇందులో ప్రతి ఒక్క మాటా నిజం. ఇందులో నేను చెప్పే పేరు కూడా వాస్తవ వ్యక్తిది. ఆయన చాలా ఆసక్తికరమైన మనిషి.

నేను ఆస్పత్రిలో సుమారు మూడు వారాలు గడిపాను. అన్ని రోజులూ ఆస్పత్రిలో నా రూమ్‌మేట్ అయిన ఇంజనీరు బొరీస్ జ్వేరెవ్ పాఠ్య పుస్తకాలు అధ్యయనం చేసేవాడు. ఆయన ఏడవ తరగతి ఆల్జీబ్రా, జామెట్రీ, ఫిజిక్సు, కెమెస్ట్రీ పుస్తకాలు చదివేవాడు.

"సంగతేమిటంటే, మా అబ్బాయి జబ్బుపడ్డాడు. ఆ తర్వాత శానిటోరియంలో వున్నాడు. వాడు చదువులో వెనకబడ్డాడు. ఇప్పుడు నేను వాడికి సాయంచెయ్యాలి. అందుకని యీ సబ్జెక్టులు నేను మళ్లీ గుర్తుచేసుకుంటున్నాను..."

ఆ కుర్రాడు ఆస్పత్రికి వచ్చేవాడు. తండ్రి వాడికి జామెట్రీ థీరమ్‌లు వివరించి చెప్పేవాడు. కుర్రాడు అలసిపోయో, లేక ఒంట్లో బాగుండకో ఆస్పత్రికి రాలేకపోయినప్పుడు జ్వేరెవ్ భార్య వస్తూండేది. ఆవిడ సరిగా అర్థంచేసుకోలేకపోయిన, పూర్తిగా మరచిపోయిన లెక్కలు తండ్రి ఆవిడకి వివరంచి చెప్పేవాడు. తర్వాత ఆవిడ యింటికి వెళ్లి వాటన్నింటినీ కొడుక్కి వివరించి చెప్పేది.

"ఏ టీచరుకైనా తన విద్యార్థుల్లో ప్రతి ఒకర్ని గురించీ తెలియడం సాధ్యమా? ఆవిడకి అంత మంది విద్యార్థులు ఉన్నప్పుడు?" అంటూ తండ్రి తర్కించేవాడు.

"కనీసం ఆవిడతో మాట్లాడండి" అని నేను సలహా యిచ్చాను.

"దాని వల్ల ప్రయోజనం ఏమిటి?"

"మీ అబ్బాయిపట్ల ఆవిడ వైఖరి మారవచ్చు. అది ముఖ్యం కదా."

నేను ఆయనకి ఒక ప్రయోగం గురించి చెప్పాను. ఆ ప్రయోగంలో మనస్తత్వ శాస్త్రజ్ఞులు ఓ టీచరు విద్యార్థుల్లో ఐదుగుర్ని గురించి తప్పు అంచనా చెప్పి ఆవిణ్ణి మోసగించారు. గణిత శాస్త్రంలో వెనకబడి వున్న అయదుగురు విద్యార్థులకీ నిజానికి గణితంలో అసాధారణమైన ప్రతిభ వుందని చెప్పారు. దానితో ఆ పిల్లలపట్ల టీచరు వైఖరి మారింది. దరిమిలా ఆ పిల్లలు స్కూల్లో బాగా చదవనారంభించారు.

జ్వేరెవ్ నాతో ఏకీభవించాడు, కాని యిలా పేర్కొన్నాడు:

"నేనూ, మా అబ్బాయీ త్వరలోనే గణితంలో క్లాసుని అందుకుంటామనుకుంటాను. తర్వాతంటారా, మేము రష్యన్ మొదలెట్టాలి..."

ప్రతి ఉదయమూ జ్వేరెవ్ పాఠాలు చదివి సిద్ధమయ్యేవాడు. ఆయన తన కొడుకు సమస్యలకు వివరణనిచ్చి, రాతపూర్వకంగా సలహా యిచ్చి, కొడుక్కి తనకి చేతనైన అన్ని

విధాలా సహాయపడేవాడు. కొద్ది కాలంలో జ్వేరెవ్ కొడుకు క్లాసులో యితరుల్ని అందుకొని వుంటాడనడంలో నాకు ఎలాంటి సందేహం లేదు.

ఆ కుర్రాడికి ఏమైనా సరదాలు వున్నాయా? నిస్సందేహంగా వున్నాయి. వాడు గంటల తరబడి తన విద్యుత్ నిర్మాణపు సెట్లనీ, చిన్న మోటార్లనీ ముందేసుకు కూర్చునేవాడు. వస్తువులు తయారుచేసేవాడు. పర్యవసానంగా ఏదో ఒకటి సాధించగలిగేవాడు. ఫిజిక్సులో వాడికి మంచి మార్కులు వచ్చాయి. దాంట్లో వాడికి అన్నీ అర్థమయ్యేవి. కాని ఆల్జీబ్రా, జామెట్రీల్లో వాడు యింతవరకు వెనకబడి వున్నాడనీ, యింతవరకు గణిత శాస్త్రం ఒక్కటే వాడు లొంగదీసుకోలేకపోతున్నాడనీ వాళ్ల నాన్న చెప్పాడు. వాడింకా భయంతో సతమత మవుతూనే వున్నాడు.

పిల్లల అభివృద్ధిలో భయానికి వున్న నిర్దిష్ట ప్రాముఖ్యాన్ని గురించి మనస్తత్వ శాస్త్రజ్ఞులు చెప్పిన మాటలు పొరపాటేమీ కావు. భయం, నిర్బంధం, అరక్షణీయతల కూడ లిలో ప్రేరణల ముమ్మర ఘర్షణ, మంచికీ చెడుకీ మధ్య, పిల్లల హోదాని మెరుగుపరచేందుకు కృషికీ, వాళ్ల మానవ హుందాతనాన్ని అసమంజసంగా పూర్తిగా అణచివేయడానికీ మధ్య ఘర్షణ వుంటుంది.

సాంఘిక మనస్తత్వ శాస్త్రవేత్తలు యీకింది నియమాలను రూఢిచేశారు. తను ఎందుకూ పనికిమాలినవాడిననీ, తనకి ఏదీ చేతకాదనీ అనుకునే వ్యక్తి తన సొంత పరిస్థితిని మెరుగు పరచుకొనేందుకు ఏమీ కృషి చేయడు. అలాగే యిందుకు భిన్నంగా కూడా జరుగుతుంది. తన విలువని తాను గుర్తించినవాడు తన సామర్థ్యాలను గరిష్ఠ స్థాయిలో వినియోగించి గట్టిగా శ్రమించి పనిచేసేందుకు ఉన్ముఖుడై వుంటాడు. ఈ వ్యక్తి కష్టాలకు తలొగ్గడాన్ని తన గౌరవానికి భంగకరంగా పరిగణిస్తాడు. ఒక వ్యక్తి తన హోదాని గురించీ, తన స్వభావం గురించీ ఏమనుకుంటాడనేదానికీ, అతని స్వయం అంచనాకీ ఆత్మగౌరవం సాటిలేని కొలమానం.

తమకి యింటి దగ్గర సణుగుళ్లు, సాధింపులు, తిట్లు, చివాట్లు, ప్రశ్నలు ఎదురైతే పిల్లలు గాభరాపడతారు.

పిల్లవాడు యింటిని సమీపించే కొద్దీ యీ గాభరా పెరుగుతుంది. వాడు గుమ్మంలో అడుగుపెడతాడు. వాడి కదలికలు స్లో మోషను సినిమాలోలా వుంటాయి: వాడు తన కోటును వేలాడదీస్తాడు (వాడు గోడకి కరుచుకుపోయి నూరేళ్లు ఉండిపోగలడేమో అనిపిస్తుంది!), వాడు మెల్లగా వంగి, బూట్లు విప్పుతాడు. "ఏం మార్కు తెచ్చుకున్నావ్?" అనే అని వార్యమైన ప్రశ్నకోసం తడబాటుతో వాడు నిరీక్షిస్తాడు. వాడికి మంచి మార్కు రాలేదని వాడి తల్లితండ్రులు అప్పటికే ఊహిస్తారు. వాళ్ల కళ్లలోకి చూసేందుకు వాడికి సిగ్గు వేస్తుంది. అదిగో అందుకే వాడు గోడకేసి దిక్కులు చూస్తున్నాడు. అయినా కూడా ఆ భయంకరమైన ప్రశ్న రానే వస్తుంది... మరో క్షణం, "షార్ట్ సర్క్యూట్" ఏర్పడుతుంది. తల్లితండ్రుల నిర్దాక్షిణ్యం యీ సారి వినాశకర పరిణామాలకి దారితీస్తుందేమో ఎవరికి తెలుసు?

తనకి యింతకంటె మంచి మార్కు రాదని వాళ్లు నిజంగానే అర్థంచేసుకోలేరా? ప్రతీదీ యింత బొత్తిగా అశ్రద్ధచేయబడితే మంచి మార్కులు ఎక్కడినుంచి వస్తాయి?! అజ్ఞానం, సబ్జెక్టు నేర్చుకోవడంలో నైపుణ్యలోపమూ వాడి యిచ్ఛా శక్తిని స్తంభింపజేసి, వాడి ఆలోచనా శక్తిని నాశనం చేసినప్పుడు అదెలా సాధ్యం?

పిల్లవాడి సహజమైన యీ బెదురును జాగ్రత్తగా విశ్లేషించండి. వాడి స్థానంలో మీరే ఉన్నట్లు ఊహించుకోండి. అప్పుడు రూపుదాల్చిన పరిస్థితిని ఊహించుకునేందుకు ప్రయత్నించండి.

"బ్లాక్‌బోర్డు దగ్గరకి వెళ్లు జ్వేరెవ్, లెక్క చెయ్యి" అంటుంది టీచరు.

"నాకు చేత కాదు."

"కూర్చో. డి మార్కు."

వాడు క్లాసులో నిలబడేందుకు సిగ్గుపడ్డాడు. వాడు తనని తాను ఒక పక్కనుంచి చూసుకుంటున్నాడు. వాడి పెద్ద చేతులు నిస్సహాయంగా వేలాడుతున్నాయి. వాడు 170 సెంటిమీటర్ల పొడుగు వున్నాడు. 80 కిలోగ్రాముల బరువు వున్నాడు. కాని యీ చిన్న లెక్క చెయ్యలేకపోయాడు. ఆ చిన్న పిల్ల వేర్కా, వాడి కంటె ఒక ఏడాది చిన్నది, బోర్డు దగ్గరకి బిరాన వెళ్లి, చాక్‌పీసు తీసుకుని, దుమ్ము రేపుకుంటూ లెక్కంతా చేసిపారేసింది. "కూర్చో. ఎ" అంది టీచరు. కాగా తను, జ్వేరెవ్, చెమటతో తడిసిపోయాడు. బెల్లు తొందరగా మోగితే బాగుండును అనుకుంటున్నాడు.

మళ్లీ యింటి దగ్గర—"ఏం మార్కు వచ్చింది?" అని అడిగి, సమాధానం విని వాళ్ల అమ్మ అరుస్తుంది. అంతే కాదు, వాడికేసి కొట్టబోయినట్లు పిడికిలి ఊపుతుంది. వాళ్ల నాన్న వాడంటే జాలిపడతాడు. కాని యిది అంత కంటె హీనం. కొడుకు డి మార్కు తెచ్చుకున్నప్పుడల్లా అతని బ్లడ్‌ప్రెషర్ వెంటనే పెరుగుతూ వుంటుంది. ఇదే మళ్లీమళ్లీ పునరావృతమవుతూ వుంటుంది.

అయితే, ఒక రోజున వాతావరణం మారింది. వాళ్ల నాన్న యిలా చెప్పాడు: "మనం యీ రోజునుంచి పాత పద్ధతి మార్చేద్దాం. మనం ఆరో తరగతి లెక్కల్నుంచి మొదలెడదాం. సిగ్గుపడకు. నీకేదైనా అర్థం కాకపోతే నన్ను అడుగు..." చదువులు మొదలయ్యాయి. కొడుకు హుషారుగా ఉన్నాడు. వాడు తన 80 కిలోల బరువునీ, తన పొడుగునీ చూసుకోవడం—వాడు వాళ్ల నాన్న కంటె జానెడు పొడుగు—మానేశాడు. వాడి కదలికలు తేలికయ్యాయి. వాడి ముఖంమీద చిరునవ్వు విరిసింది. వాడికి ఏ మార్కు వచ్చిందని యింక ఎవరూ అడగడం లేదు. వాళ్లు కలిసి చదవడం కొనసాగించారు. కుర్రాడు యింటికి వచ్చి, "నాకీ రోజున జామెట్రీలో బి మార్కు వచ్చింది" అని చెప్పే రోజు వస్తుందని వాళ్లకి తెలుసు.

అదిగో సరిగా అదే జరిగింది.

"అయితే, మీరిలా కలిసి చదవడం మంచి లాగే, నష్టం కూడా కలిగించవచ్చునన్న విషయం గ్రహించాలి."

బొరీస్ జ్వేరెవ్ యీ విషయంలో యిలా చెప్పాడు: "నిజమే, అది నా విషయంలోనూ జరిగింది. మొదట్లో లెక్కలు నేనొక్కణ్ణే చేసేవాణ్ణి. మా అబ్బాయి వాటిని తన నోట్‌బుక్‌లో ఎక్కించుకునేవాడు. వాడికింక ఆలోచించే అలవాటు తప్పిపోయింది. నేనిక్కడ కూర్చుని లెక్క చేస్తూ వుంటాను, వాడక్కడ వేచిచూస్తూ వుంటాడు. అయితే, నేనప్పుడు యిది కాదు పద్ధతి అనుకున్నాను. వాణ్ణి లెక్క తీసుకుని తనంతట తను చెయ్యనియ్యి అనుకున్నాను. మేము మా చదువు పద్ధతి యిలా మార్చాం: వాడు లెక్క చేస్తాడు, నేను ఊరికే వాడికి ఎలా చెయ్యాలో సూచిస్తూ వుంటాను. తరచు వాడికి తెలియని చోట వివరిస్తూ వుంటాను."

తన కొడుకుతో కలిసి చదివే పద్ధతిని మార్చడంలో జ్వేరెవ్ సరైన పని చేశాడు. తన స్వయం కృషి ద్వారా మాత్రమే పిల్లలు నికరమైన జ్ఞానం ఆర్జించుకోగలుగుతారు, తమ మానసిక శక్తులను పెంపొందించుకోగలుగుతారు, స్కూలులోనూ, కుటుంబంలోనూ తమ హోదా పెంచుకోగలుగుతారు.

మీ అబ్బాయి ఏదైనా క్లాసుకి వెళ్లకపోవడం – ఒంట్లో బాగుండక యింటి దగ్గర వుండి పోయో, నిద్ర లేవకో, మరే కారణంగానో – తటస్థిస్తే, యిచ్చిన హోమ్‌వర్కు వాడు చేసేలా మీరు చూసుకోండి. వాడితో మీ సంభాషణ యిలా సాగవచ్చు:

"నీకు హోమ్‌వర్కు ఏమిచ్చారో కనుక్కున్నావా?"

"ఎవరికీ తెలియదు."

"'ఎవరికీ తెలియదు' అంటే?"

"నేను యూర్కాని అడిగాను. వాడు రాసుకోవడం మర్చిపోయాట్ట. పేత్కా యింటి దగ్గర లేడు."

వాడి యీ "ఎత్తుగడ"ని భగ్నం చేసేందుకు ప్రయత్నించండి. మీరే స్వయంగా శ్రమ తీసుకుని, వాడికి హోమ్‌వర్కు ఏమిచ్చారో కనుక్కుని, వాడితో కలిసి కూర్చుని, వాడు హోమ్ వర్కు చేసేదాకా వదలకండి.

అప్పుడు మీరు ఒక్క రాతితో రెండు పిట్టల్ని కొట్టినవాళ్లవుతారు. వాడి చదువులో ఖాళీలు లేకుండా చూస్తారు. రెండో సంగతి, మీ అబ్బాయి అనివార్యమైతే తప్ప క్లాసులు ఎగ్గొట్టాలన్న కోర్కెనుంచి బయటపడేలా చేస్తారు.

ఒక పాఠానికి హాజరు కాకపోవడం, లేక ఒక పాఠం నేర్చుకోకపోవడం, హోమ్‌వర్కు చేయకపోవడం అంత పెద్ద నేరం స్కూలు జీవితంలో మరొకటేదీ వుండబోదని మీ అబ్బాయి గ్రహించేలా చేసేందుకు ప్రయత్నించండి.

స్కూలు, స్కూలు మాత్రమే పిల్లలకి అన్నీ నేర్పాలి, పిల్లల్ని పెంచడం మాత్రమే తల్లితండ్రుల బాధ్యత అనే వాళ్లెవరూ యీనాడు మీకు కనిపించరు.

పిల్లల అభివృద్ధి వాళ్ల మొత్తం జీవిత ఫలితం అన్న విషయాన్ని చాలా మంది తల్లి తండ్రులు అర్థంచేసుకోనారంభించారు. పిల్లల అభివృద్ధి విషయంలో స్కూలుకి ఎంత

బాధ్యత వుందో కుటుంబానికీ అంత బాధ్యత వుంది. పిల్లల స్వీయాభివృద్ధికీ, తమ సంభావ్య సామర్థ్యాలను వాళ్ళు స్వయంగా ఆవిష్కరించుకోగలిగేందుకూ అవసరమైన ఒకే పునాదికి అటు స్కూలూ, యిటు కుటుంబమూ విభిన్న భాగాలను సమకూర్చాలి.

విద్యా క్రమం కూడా నిరంతరం మారుతుంది. ఇంజనీరు జ్వేరెవ్ ఏడవ తరగతి పాఠ్య పుస్తకాలు చదవడం మొదలుపెట్టినప్పుడు — ఉదాహరణకి, ప్రముఖ సోవియట్ గణిత శాస్త్రవేత్త, అకడెమీషియన్ కొల్మొగొరొవ్ రచించిన ఏడవ తరగతి లెఖ్ఖల పుస్తకాన్ని చూసినప్పుడు — ఆ పాఠ్య పుస్తకాల్లో వున్న కొత్త విషయాలను చూసి దిగ్భ్రమ చెందాడు. గణిత శాస్త్రంలో నూతన అంశాలు, కొత్త సిద్ధాంతాలు, సరికొత్త పద్ధతులు ఆయనకి కనిపించాయి.

ఇంజనీరు జ్వేరెవ్ స్వయంగా తనే అధ్యయనంచేయవలసివచ్చింది. ఇందులో పెద్ద విశేషమేమీ లేదు. పాఠశాల టీచర్లు సైతం తమ సబ్జెక్టులు కొత్తగా నేర్చుకోవలసివస్తోంది.

తమ తోటలో, వేటలో లేక ఆటల్లో చూపినంత ఆసక్తిని ప్రామాణిక బోధన శాస్త్రంలో చూపని, అయినప్పటికీ అపూర్వమైన సృజనాత్మక బోధనకోసం కృషిచేసే తల్లితండ్రులు అంతకంతకు తరచుగా నాకు తటస్థపడుతున్నారు. మాస్కోలో ప్యోత్ర్ పనోవ్ అనే ఒక మెకానిక్కు (ఈయన పుట్టు అంధుడు) తన ఆరేళ్ల కొడుకు అల్యోషలో (అతనికి సుమారు 3 శాతం దృష్టి వుంది) సంగీత సామర్థ్యాన్ని విశేషంగా పెంపొందించాడు. అది ఏ స్థాయికి చేరుకుందంటే, సంగీత ధ్వనులే ఆ అబ్బాయికి సాంఘిక సాంగత్య సాధనం అయ్యాయి. ఆ అబ్బాయికి క్లిష్టమైన సంగీత కృతులు వాయించడం యిష్టం. ప్రపంచాన్ని సంగీతం ద్వారా దర్శించడంలో వాడు ఆనందం పొందుతాడు. ప్యోత్ర్ పనోవ్‌కి బోధన పద్ధతుల్లో ఆసక్తి వుంది. ఆయన కొడుకుతో తన సంబంధాల్లో తన బాల్యంలోని అత్యుత్తమమైనదాన్నంతనీ ఉపయోగించుకుంటాడు. తనకి జ్ఞాపకం వున్న ప్రతికూల భావోద్వేగాలన్నింటినీ పరిహరించేందుకు సకల విధాలా ఆయన ప్రయత్నిస్తాడు. తన కొడుకు చాలా ఎక్కువ చెయ్యాలని ఆయన కోరుకుంటాడు. ఈ విధినిషేధాల మూలంలో వెసులుబాటుతనం, ఓర్మి, ఎదుటివాని వ్యక్తిత్వంపట్లా, వాని హుందాతనంపట్లా గౌరవం వున్నాయి.

తన తల్లితండ్రులనుంచి ఎంతో కొంత సహాయం పొందకుండా, పాఠశాలలో పిల్లలు తమ సామర్థ్యాలను ప్రదర్శించి ప్రథమ శ్రేణి విద్యార్థులు అవుతారని నాకు నమ్మకం లేదు. అడవి ఆపిల్ చెట్టును దొడ్లో పాతి పళ్ళు ఆశించడం ఎలా అసాధ్యమో యిది కూడా దాదాపు అంతే అసాధ్యం.

మీ పిల్లలకి చదువు బాగా రావాలనీ, వాళ్ళు బాగా వృద్ధిలోకి రావాలనీ మీరు కోరుకుంటే, మీరు ఒళ్ళు దాచుకోకూడదు. మంచి పెంపకం కలిగి, విద్యావంతులైన పిల్లలే తల్లితండ్రులకి ఉండగల అతి గొప్ప సంపద.

వెనక చదువులో మంచి ప్రోగ్రెస్ లేని మీ పిల్లవాడు యింటికి వచ్చి, క్లాసులో తనే

మొట్టమొదట లెక్క సరిగ్గా చేశాననీ, టీచరు తనని పొగడిందనీ చెప్తే, వాడి ఆనందం శిఖర స్థాయిలో వుందన్న మాట. ఏ ఫుట్‌బాలూ, ఏ ట్రాన్సిస్టరు రేడియో సైతం అజ్ఞానంమీద యీ మహత్తర విజయ భావానికి సాటి రాదు.

మీ పిల్లలు యీ భావోద్వేగం పొందకపోతే, తమమీద యీ విజయానందాన్ని – యిదే సంతోషవంతుడైన ప్రతి వ్యక్తికీ మహా భాగ్యం – తెలుసుకోలేకపోయారని అర్థం. వాళ్ళు యీ ఆనందం పొందేందుకు మీరు సాయపడండి.

మీ పిల్లలు అత్యున్నతమైన మార్కులు మాత్రమే పొందుతూ వుండి, వాటిపట్ల వాళ్ళు విసుగూ, తూష్ణీంభావమూ ప్రదర్శిస్తూ వుంటే, అది ప్రమాదకరం. మీ పిల్లలకి మరింత క్లిష్టమైన జ్ఞాన శాఖలు వెతుక్కునేందుకు తోడ్పడండి. వాళ్ల అభివృద్ధికి అనుగుణమైన భారాన్ని వాళ్ళు వహించేలా ప్రయత్నించండి.

సోవియట్ విద్యా విధానపు సానుకూల అంశాల్లో ఒకటేమిటంటే, అది సగటు విద్యార్థిని ఉద్దేశించి రూపొందించబడటం. దీని ఫలితంగా విద్యార్థుల్లో ఎవరిపట్లా వివక్ష చూపడం అనేది వుండదు. కాని చాలా మంది టీచర్లు క్షమించరాని పొరపాటు ఒకటి చేస్తూ వుంటారు. తెలివైన విద్యార్థుల్నీ, సగటు విద్యార్థుల్నీ వాళ్ళు ఒకే గాటన కట్టి, వాళ్లకి ఒకే వర్కు యిస్తూ వుంటారు. ఇలా జరిగినప్పుడు తెలివైన విద్యార్థులకి వాళ్ల పూర్తి సామర్థ్యం మేరకు లేక వాళ్ల అభివృద్ధి స్థాయికి సరిపడేటంత పని వుండదు. తల్లితండ్రులు యీ అంశాన్ని దృష్టిలో వుంచుకోవాలి. పిల్లలు స్వయం విద్యా క్రమంలో ఎంత తొందరగా నిమగ్నులైతే జీవితానికీ, తదుపరి జ్ఞానార్జనకీ వాళ్ల సన్నాహం అంత విజయవంతంగా వుంటుంది. మరింత ఉన్నత మానసిక కార్యకలాపాల రూపానికి దారితీసే చదువుకి మీ పిల్లల్ని మళ్లించే మార్గాలు వెతకండి.

మామూలు నిర్ణీత కార్యక్రమానికి తోడు, మీ పిల్లలు సంక్లిష్టమైన లెఖ్ఖలు చేస్తే, లేక సరదా కథలు రాస్తే, లేక తమ సొంత రేడియో సెట్లు తయారుచేస్తే, వాళ్ళు తాము పెట్టుకున్న లక్ష్యాన్ని సాధించేందుకు తోడ్పడండి. సాధింపబడిన లక్ష్యం వ్యక్తిత్వపు బౌద్ధిక, శారీరక, నైతిక సారాన్ని రూపొందించే మాదిరి పెంపకపు ఫలితం.

ఒక కుటుంబపు బౌద్ధిక జీవితం కూడా సమాచారపు మార్పిడి ప్రాతిపదికమీద రూపొందుతుంది. ఈ సమాచారం, పాక్షికంగానే అయినా కూడా, అధ్యయనం చేయబడే పాఠ్య క్రమాలకు అనుగుణంగా వుండాలి.

స్కూలు పాఠ్యాంశం టాల్‌స్టాయ్‌ని గురించి అయితే, టాల్‌స్టాయ్‌ని గురించి, ఆయన లేఖలు, ఆయన్ని గురించిన స్మృతులు చదవడం, పాఠ్య క్రమంలో లేని ఆయన రచనలు యింటి దగ్గర చదవడం మంచి పని. పిల్లలు "స్వేచ్ఛాయుతమైన" సాంఘిక సంబంధాల క్రమంలో పొందే జ్ఞానం వాళ్ల సాధారణ అభివృద్ధిలో చాలా ముఖ్యమైన పాత్ర వహిస్తుంది.

విద్యుచ్ఛక్తిని గురించి చదువుతూంటే, యీ అంశంమీద ఆసక్తికరమైన కొన్ని

పుస్తకాలు, విద్యుచ్ఛక్తి ఆవిష్కర్తలను గురించిన పుస్తకాలు సంపాదించేందుకు ప్రయత్నించండి.

పాఠ్యాంశం పరిణామ సిద్ధాంతం అయితే, చార్లెస్ డార్విన్‌ని గురించీ, తదితర ప్రకృతి శాస్త్రజ్ఞుల్ని గురించీ ఏదైనా పుస్తకాలు చదవడం తెలివైన పని అవుతుంది.

మీరు మీ పిల్లలకి కొత్త విషయం యేమీ చెప్పకపోయినా, వాళ్లే మీకు ఏదైనా చెప్పే, మీకు అర్థం అయేలా ఏ విషయమైనా వివరించే ప్రయత్నం చెయ్యనివ్వండి. ఇది కూడా ఎంతో ప్రయోజనకరమైనదే.

మీ పిల్లలకి గ్రంథపఠనాసక్తిని అలవరచండి. మీ అబ్బాయికో లేక అమ్మాయికో వాళ్లకి అభిమానపాత్రమైన పుస్తకాలతో చిన్న లైబ్రరీ ఏర్పాటుచేసుకుంటే, మీరొక ఘన కార్యం సాధించినట్లే.

మీ పిల్లలు "నా బొమ్మ," "నా సైకిలు," "నా స్కూలు" అంటూ ఎంతో తరచుగా సొంత ఆస్తి సహజ ప్రేరణని వ్యక్తంచేయడం మీరు గమనించి వుంటారు.

ఈ మాదిరి "సహజ ప్రేరణ" పుస్తకాలకు బదిలీ అయ్యేలా చూడండి. పిల్లలు "యివి నా అభిమానపాత్రమైన గ్రంథాలు. ఇవి నా అభిమానపాత్రమైన గీతాలు, అభిమాన పాత్రమైన నాటకాలు" అననివ్వండి. వాళ్లని ఆయా కూర్పులను, గ్రంథకర్తల్ని గుర్తుంచుకోనివ్వండి. గ్రంథసంచయనం అత్యుత్తమ మానవ అభిరుచుల్లో బహుశా ఒకటి. ఈ అభిరుచి మానవ ప్రపంచాన్ని సౌందర్య సంశోభితం చేస్తుంది.

తమ పని తావును వస్తువులతో, పనిముట్లతో అమర్చుకునేందుకు పిల్లలకి తోడ్పడండి. పిల్లలకి వాళ్ల స్వహస్తాలతో ఏమైనా తయారుచెయ్యడం నేర్పండి.

అనేక రకాల "పని తావులు" నేను చూశాను. ఒక కుర్రాడికి రసాయన శాస్త్రం అంటే సరదా పుట్టింది. ఇంట్లో కొన్ని షెల్ఫులు, ప్రత్యేకమైన బీకర్లు, పరికరాలు, ఒక బున్సెన్ బర్నరు, కిటికీ గుండా ఒక డ్రాఫ్టు పైపు ఉన్నాయి, గోడకు జింకు తొడుగు అమర్చబడింది...

పిల్లలు తమ చేతులు ఉపయోగించడం ఎందుకు నేర్చుకోవాలి? చేతిపనులను సమర్థించే అనేక ఉదాహరణలు, వాదనలు వున్నాయి: శరీర వ్యాయామం, పని నైపుణ్యాలను, సామర్థ్యాలు, వగైరాలను పెంచుకోవచ్చు. అయితే నేనిక్కడ ఒక్క పార్శ్వాన్ని మాత్రమే ప్రస్తావిస్తాను. చేతుల్తో పనిచేయడం నమ్మశక్యం కానంత ఉపయోగకరమైనది: పిల్లలు ఆధునిక టెక్నాలజీ ప్రపంచానికీ, ప్రాకృతిక విషయాలకీ సంబంధించిన మరింత ప్రగాఢమైన అవగాహన పొందుతారు. పిల్లల చేతులమీదుగా సాగే ప్రతీదీ (అంటే నైపుణ్యాలు, అలవాట్లు) అత్యంత విశాలమైన సాధారణీకరణలకు పుష్కలమైన సమాచారాన్ని సమకూరుస్తుంది. పిల్లలు తమ చేతుల ద్వారా ప్రపంచాన్ని కూడా దర్శిస్తారు. చేతి కదలిక కేవలం యాంత్రికమైనది మాత్రమే కాదు. అది జ్ఞాన గ్రహణం కూడా. అది వస్తువుల, పదార్థాల పూర్ణత్వాన్ని అర్థంచేసుకోవడం కూడా. పిల్లలు తమ చేతులతో చేయగలిగిన, చేసితీరవలసినదాన్ని ఏ

అనిర్దిష్ట భావనలూ, ఏ పుస్తకాలూ చేయలేవు. బుద్ధి చేతుల కదలికను తెలివైనదిగా చేసే మేరకే, చేతులు మెదడుని అభివృద్ధి చేస్తాయి.

ఉపయోగకరమైన ఉత్పాదక కృషితో బాటు పనితో పిల్లలు ఎంత ఎక్కువ తొందరగా పరిచయం పెట్టుకుంటే, వాళ్లకి నైతిక సూత్రాలు నేర్పేందుకు అంత మెరుగైన పునాది వుంటుంది.

చాలామంది పిల్లల్లో చూపించబడే సోమరితనం చూసినప్పుడు ఒక బోధకుడుగా నాకు చిరాకు కలుగుతుంది. అలాంటి పిల్లలకి పనిచేయవలసిన అవసరాన్ని చిన్నతనంనుంచి అలవరచరు. ఈ కృత్రిమంగా కల్పించబడిన సాంఘిక రక్షణ తరచు అలాంటి పిల్లలు యితరుల శ్రమమీద బతికేందుకూ, తమకి అప్పగించిన పనిపట్ల వాళ్ల సీరియస్ వైఖరి అవలంబించక పోయేందుకూ, కుత్రతనానికీ దారితీస్తుంది.

పిల్లల్ని పనిలో, ప్రధానంగా ఉపయోగకరమూ, ఉత్పాదకమూ అయిన పనిలో, నిమగ్నం చేసేందుకు సిసలైన పరిస్థితుల్ని కల్పించడం ఆధునిక స్కూలు ఎదుర్కొనే తీవ్ర సమస్యల్లో ఒకటి.

శ్రమశిక్షణను సంబంధిత పని నైపుణ్యాలను సంతరించుకోవడానికీ, లేక పని ఎంత అద్భుతమైనదో తెలిపే భాషణలకీ కుదించకూడదు. పిల్లలు కాగితపు పెట్టెల్ని అంటించ గలిగితే, కొయ్య వస్తువులకి పెయింటు చెయ్యగలిగితే, అంత మాత్రాన వాళ్లకి పని ఒక ఆంతరిక అవసరం అయిపోదు. పనికి ఆర్థిక ప్రాముఖ్యం వున్నప్పుడే, అదొక కర్తవ్యాన్ని సాధించి నప్పుడే, అది కేవలం శరీర వ్యాయామం కానప్పుడే, అది తన విద్యా విధిని నిర్వర్తిస్తుంది. వ్యర్థమైన శ్రమ మంచి ఏమీ నేర్పకపోగా, ప్రతికూల ఫలితం కూడా యివ్వవచ్చు. పని అవ సరం లేనప్పుడు, అర్థరహితమైనప్పుడు పనిపట్ల రోత కలుగుతుంది. పిల్లలు విధిగా డబ్బు సంపాదనకోసం మాత్రమే పనిచేయనక్కర్లేదు. కాని, పిల్లలు డబ్బు సంపాదనకోసం పని చేయవచ్చు. దీనిలో చెడుగేమీ లేదనుకుంటున్నాను. అయితే, పిల్లలకి సిసలైన పని చేయడాన్నీ, తాము చేసే పనికి బాధ్యత వహించడాన్నీ విధిగా నేర్పితీరాలి.

వేసవి సెలవల్లో రీగా నగరంనుంచి వచ్చి ఓ కొత్త స్కూలు నిర్మాణంలో తోడ్పడు తున్న పిల్లలు నాకు జ్ఞాపకం వస్తున్నారు. తమ సెలవల్లో సమష్టి వ్యవసాయ క్షేత్రంలో పనిచేసిన దొనేత్స్క ప్రాంత గ్రామానికి చెందిన పల్లెటూరి పిల్లలు నాకు జ్ఞాపకం వస్తున్నారు. వాళ్లని పనికి ఆకర్షించింది ఏమిటో కనుక్కోవాలని నేను ప్రయత్నించాను. "పని మాకు ఆసక్తికరంగా వుంటుంది" అన్నదే అందరి సమాధానమూను. సాష బెలీచెంకొ అనే ఎనిమిదో తరగతి విద్యార్థి సమాధానం నాకింకా జ్ఞాపకం వుంది. "నాకు డబ్బు ఎందుకు? నాకు డబ్బు అనవసరం. డబ్బెలాగూ మా అమ్మకే యిచ్చాను. కాని పిల్లల్తో కలిసి పనిచేయడం సరదాగా వుంది" అన్నాడు సాష. గాల్యా జబోర్స్కయా అనే ఐదో తరగతి అమ్మాయి ఇలా జోడించింది: "మా దళ నాయకురాలు లేనా ఆంటీ మూలంగా నేను పనిచేశాను. ఆవిడ

భలే అందమైంది, ఎంతో తెలివైంది." సోవియట్ బాలబాలికలు దానికదిగా పనికి, దాని పాదార్థిక ఫలితాలకు మాత్రమే ఆకర్షితులు కారు. ప్రధానంగా సమాజపు అసలైన వయో జన పౌరులుగా వాళ్ళు ప్రవేశించే మానవ సంబంధాల సౌందర్యం మూలంగా వాళ్ళు ఆక ర్షితులవుతారు.

పని, నైతిక, మానసిక పెంపకం, శారీరక శిక్షణల ఐక్యతే వ్యక్తి సమరస అభివృద్ధికి దారితీసే పద్ధతుల, రీతుల ప్రాతిపదిక. ఈ సమీకృత, సంశ్లిష్ట వైఖరి సుహోమ్లిన్స్కీ సృజనాత్మక బోధన శాస్త్ర సిద్ధాంతాల్లో కనిపిస్తుంది. దయ, బాధ్యత, అంతరాత్మ భావనలు పిల్లలకి టీచర్లతో, తల్లిదండ్రులతో, స్నేహితులతో వాళ్ళ రోజువారీ సంబంధాల్లో వెల్ల డవుతాయి. ఈ భావనలను వాళ్ళు ప్రత్యక్ష కార్యకలాపాల్లో, రకరకాల స్వతంత్ర కార్యాచర ణల్లో, చేసే పనుల్లో అలవరచుకుంటారు.

ఆత్మోన్నతిని నిత్య ఉపన్యాసాల ద్వారా మాత్రమే పెంపొందించడం సాధ్యం కాదు. ఆత్మోన్నతి సమష్టి సాంఘిక కార్యకలాపాల్లోనూ, ముమ్మరమైన పనిలోనూ రూఢిపరచ బడుతుంది. పిల్లలకు సంబంధించినంతవరకు పౌర బాధ్యతల తొలి స్ఫులింగాలు పని క్రమంలో ద్యోతకమవుతాయి. పని తొలి అడుగులు చాలా సరళంగా, సామాన్యంగా ఉండవచ్చు. ఉదాహ రణకి, పిల్లలు మొక్కలు పాతేందుకు నేలలో గుంటలు తవ్వుతారనుకోండి. తర్వాత వాళ్ళు ఆ మొక్కల్ని నాటుతారు, ఎరువు వేసి, నీళ్ళు పోస్తారు. ఇది కొన్ని ఏళ్ల పాటు యిలాగే సాగుతుంది – ప్రతీదీ సరళంగా, దాదాపు ఒకేలా వుంటుంది. ఇలాంటి శారీరక శ్రమ మని షిని మందగింపజేయడం ఎంత మాత్రం కాదు. ఇది ఆ మాట పూర్తి అర్థంలో సృజనా త్మకమైన పని. పిల్లలు చెట్టు ఎలా పెరుగుతుందో చూస్తారు, తమ కృషి ఫలితం చూస్తారు. దాన్నుంచి మహానందం పొందుతారు. సమష్టిలో భాగస్వామ్యం తన సత్తా ఏమిటో చూపించా లన్న కోర్కెను పెంపొందిస్తుంది. ఈ కోర్కె పోషలిస్టు సమాజపు నైతిక ఆశయాలతో సమరసంగా సమ్మిళితమవుతుంది.

ఒక కార్యకలాపం మరో కార్యకలాపాన్ని సంపన్నంచేస్తుంది, రూపొందిన ఒక అవసరం మిగిలినవి రూపొందేందుకు ఒక షరతు అవుతుంది. ఎందుకంటే, సమరసాభివృద్ధికి ఒకరి బహుముఖ ఆసక్తులు అభివృద్ధి చెందడం అవసరం.

పిల్లల స్వతంత్ర కార్యాచరణలను గురించి ప్రస్తావిస్తూ, పని సులభంగా ఉండనవసరం లేదని సుహోమ్లిన్స్కీ ఎప్పుడూ పేర్కొంటూండేవాడు. అయితే, పని నైతికంగా విద్యా దాయకంగా, మానసికంగా ఆకర్షణీయంగా ఉండేటట్లు చూడాలి. ఈ పని భారం పిల్లల శక్తికి అనురూపంగా వుండాలి. అప్పుడే యీ పని పిల్లల జీవితాన్ని, స్కూలు చదువును మరింత ఆసక్తికరం చేస్తుంది.

# సౌందర్యాభిరుచిని పెంపొందించడం ఎలా

ప్రపంచాన్ని తమ సొంత పద్ధతిలో, తమ సొంత రంగుల్లో, తమ సొంత శబ్దాల్లో దర్శించే విశిష్టత కళాకారులది మాత్రమేనా? కళాకారులు ప్రకృతినీ, మనుషుల ముఖాల్నీ, అంతరంగాల్నీ ఒక ప్రత్యేకమైన పద్ధతిలో దర్శిస్తారనడం నిజమేననుకోండి. అయితే మనం కూడా ప్రపంచాన్ని కళాకారుల కళ్లతో చూడటం సంభవిస్తుంది. "చూడండి! యీ హిమాలయపర్వతాలు సరిగ్గా రేరిహ్ చిత్రంలో లాగే వున్నాయి," "ఈ సముద్రం సరిగ్గా ఐవజోవ్‌స్కీ చిత్రంలో లాగే వుంది!" అంటూ వుంటాం.

కళాకారులు ప్రపంచాన్ని "చూసే నమూనాలు" సృష్టించి, మన సౌందర్య దృష్టి వైశాల్యాన్ని విస్తరింపజేస్తున్నారా అన్నట్లు మన దృష్టిని సంపన్నం చేస్తారు.

వాన్ గోగ్ పొద్దు తిరుగుడు పూలు.

నికొలాయ్ రేరిహ్ విశిష్టమైన ప్రకృతి దృశ్యాలు.

జపనీజ్ కళాకారులు చిత్రించిన విరగ పూసిన చెర్రీ పూల కొమ్మ.

ఇవి భిన్న రేఖలు, వర్ణాలు మాత్రమే కాదు. ప్రపంచం గురించిన భిన్న భావనలు, సుందరమైనవాటిపట్ల భిన్నభిన్న వైఖరులు.

మనిషి నిజమైన గులాబి పూవుని, దానిమీది తెలి ఎరుపు హిమబిందువులను చూస్తాడు. ఆనందోత్ఫుల్లమైన సున్నితమైన మత్తుతో అతని తల ఒకింత భ్రమిస్తుంది. అదే సమయంలో ఆ మత్తు అతన్ని సేదదీరుస్తుంది. శుద్ధ సువాసనాభరితమైన తాజాతనపు గుబాళింపు ఆకస్మికంగా అతనిలోకి చొరుచుకు వెళ్లడమే యిందుకు కారణం. ఈ తాజాతనపు గుబాళింపు మానవ దృష్టి ప్రపంచాన్ని శుద్ధి చేస్తుందని చెప్పుకోవచ్చు.

కొన్ని సమయాల్లో మనిషి తన సొంత అనుభూతులపట్లనే నిర్లిప్తంగా వుంటాడు. సౌందర్య భావనను అతను పెంపొందించుకోకపోవడం, అది నైతిక అనుభవంతో అనుబంధితం కాకపోవడమే యిందుకు కారణం.

ఇక్కడ నేను చెప్పేది సుందరమైనదానికీ మానవీయమైనదానికీ మధ్య పరస్పర ప్రతివర్తనని గురించి మాత్రమే గాని, కళకీ వాస్తవానికీ మధ్య సంబంధపు కొన్ని ఛాయలను గురించి కాదు. ప్రస్తుతం నాకు మనిషి మానసిక ప్రపంచం, దాని వైవిధ్యాలు, మానసిక జీవితపు దారిద్ర్య, సంపదలతోనే తప్ప కళతో సంబంధం లేదు. జీవితంపట్ల మనిషి వైఖరిలోనే నాకు ఆసక్తి. పిల్లలు యీ ప్రపంచాన్ని చక్కటి రంగుటద్దాలతోనే దర్శించడం నాకు యిష్టం లేదు. అయితే ప్రపంచాన్ని సదా అంధకార బంధురంగానే చూడటం కూడా భయంకర విషయమే.

సుందరమైనదానిపట్ల పిల్లల ఉదాసీనతను చూసినప్పుడు నేను ఖిన్నుడినవుతాను. భావోద్వేగ దారిద్ర్యానికి పిల్లల్లో సౌందర్య భావన పెంపొందకపోవడం ఒక్కటే కారణం

కాదు. పిల్లల నిర్లక్ష్యం, మానసిక దారిద్ర్యం, మొత్తంమీద మానసిక అలసత్వం కూడా కారణాలే.

ఏ పిల్లలు సుందమైనదాన్ని ఎలా దర్శిస్తారనే విషయాన్ని నేనెప్పుడూ ముందుగానే, దాదాపు నూటికి నూరు పాళ్లూ సరిగా చెప్పగలను. పిల్లల ముఖంలో తెలివీ, ఉత్సుకతా జ్వలిస్తే, వాళ్ల పరిశ్రమతత్వం సృజనాత్మక ఊహాశక్తితో మేళవింపబడితే, వాళ్ల ముఖ కవళికల్లో విధిగా ఆనందాతిరేకం కానవస్తుంది. ఈ పిల్లలు అందమైన సూర్యాస్తమయం చూసి, కనీసం యథాలాపంగా అయినా "ఓహ్, ఎంత అద్భుతంగా వుంది!" అనక మానరు.

ఇందుకు పూర్తి భిన్నమైన పిల్లలు వుంటారు. పిల్లల కళ్లలో ఒక ఆలోచన మలిగిపోతే, వాళ్లు అలవరచుకున్న పరిశ్రమతత్వం వాళ్ల హృదయాంతరంగపు తుళ్లింతలతో జోడింపబడక పోతే, యిలాంటి పిల్లలకు సౌందర్యమయ ప్రపంచం సర్వసామాన్యమూ, అర్థరహితమూ అయిన భూమిక మాత్రమే అవుతుంది.

నేను అనేక సార్లు పిల్లలతో కలిసి దీర్ఘ పాద యాత్రలకు వెళ్లాను. ప్రకృతిని వాళ్లు భిన్నభిన్నమైన అనేక పద్ధతుల్లో చూశారు. మానసికంగా అభివృద్ధి చెందిన స్కూలు పిల్లాడు (కష్టపడి చదివే మంచి విద్యార్థి, మంచి స్నేహితుడు) సముద్రాన్ని తొలి సారి చూసి ఉత్తేజితుడవుతాడు. అతను సముద్రానికి కొన్ని పోలికలు ఆలోచిస్తాడు. కొన్ని తాత్విక ఉపమానాలు సైతం వాడి మనస్సుకి స్ఫురిస్తాయి. "సముద్రానికి ప్రాణం వుంది, ఇది కూడా చాలా మంది మనుషుల వంటిది, పండగ చేసుకుంటున్న జాతి లాంటిది" అనుకుంటాడు. సాయంత్రంవేళ అతను మిలమిలలాడే కాంతినుంచి, నిగూఢమైన సంధ్యా రాగంనుంచి కళ్లు మరల్చు కోలేడు. అలల లయబద్ధమైన శబ్దాల్లో పూర్తిగా తల్లీనుడైపోతాడు.

ఇదిగో మరో కుర్రాడు (నేనిక్కడ మానసిక దారిద్ర్యం మూర్తీభవించినవాణ్ణి ఎన్నుకో లేదు). ఇతను ప్రాకృతిక విషయాలను చూసే తీరు వేరు. ఇతను మొత్తంమీద కష్టంపడి పనిచేసే తత్వం కలిగినవాడు, శాంత స్వభావి, సంయమన స్వభావం కలిగినవాడు, విధేయుడు, కాని బౌద్ధికంగా సంకుచిత స్వభావి, మానసికంగా వెనకబడినవాడు. ఇతన్ని తీర్చిదిద్దాలి, ఇతనికి నేర్పాలి, సౌందర్య అవగాహన దిశగా యితన్ని జాగ్రత్తగా నడపాలి. తొలి సారిగా సముద్రాన్ని చూసినప్పుడు యితను అనుత్సాహంగా "దీన్ని చూస్తూంటే బోరుగా వుంది. కనుచూపు మేరదాకా నీళ్లే, అంతే" అంటాడు. సాయంత్రం పూట యితను ఆకర్షణీయంగా, నిగూఢంగా మెరిసే సంజ కాంతిని గాని, చంద్ర భ్రమణ రేఖని గాని చూడడు. ఇతను సూర్యోదయం చూసి పొంగడు, ఫెళ్లున విరిగిపడే సముద్రపుటలల మహాశక్తిని చూసి ఉత్తేజితుడు కాడు. "ప్చ్, అయితే ఏమిటి, దీంట్లో ప్రత్యేకత ఏముంది?" అంటూ యితను చప్పరించేస్తాడు.

ఇలాంటి కుర్రాడితో కొంత సమయం వెచ్చించి, తన చుట్టూ వున్న ప్రపంచంలోని అందమైనదాన్ని చూడటాన్ని అతనికి నేర్పితే, అతని స్వరూపమే పూర్తిగా మారిపోతుంది.

అతని కళ్లలో మార్పు వస్తుంది. వాటిలో ఔత్సుక్యంతో కూడిన ఉత్తేజపు చూపులు తొంగి చూస్తాయి. వాటిని ఎవరూ సరిగా అర్థంచేసుకోకుండా ఉండలేరు. గుర్తింపుకి అది మూలాధారం. అతను మరింత స్పష్టంగా ఆలోచించనారంభిస్తాడు. ఇతర పిల్లలపట్ల అతను మరింత దయగా ప్రవర్తిస్తాడు. తన తల్లితండ్రుల దగ్గర మరింత సాధువుగా వ్యవహరిస్తాడు. వాళ్లు చెప్పేదాన్ని మరింత శ్రద్ధగా చెవి ఒగ్గి విని, చేస్తాడు. అతని పనిలో ఒక రకమైన హృదయపూర్వకత చోటు చేసుకుంటుంది. అతని ఊహాశక్తికి వెసులుబాటుతనం, వైశద్యం అబ్బుతాయి.

నేనిక్కడ చెప్తున్నది కళ గురించి కాదని మరో సారి చెప్తున్నాను. నేనిక్కడ చెప్తున్నది బౌద్ధిక సంస్కృతి గురించి, మానవుడి బౌద్ధిక సంపద గురించి, పిల్లల వ్యక్తిత్వాన్ని బౌద్ధికంగా తీర్చిదిద్దడంలో కళ ఏ మేరకు దోహదం చేయగలదనేదాన్ని గురించి.

కొంచెం భావి దృష్టితో, అనేక సంవత్సరాల నా ప్రత్యక్ష కార్యకలాపాల్లో నేను విని యోగించిన సూత్రాలను యిక్కడ విపులీకరిస్తాను.

చిన్నవాటిలో సౌందర్యం చూడలేని పిల్లలు పెద్దవాటిలో కూడా చూడలేరు.

పిల్లలు ఆచరణలో స్వయంగా సౌందర్యాన్ని "సృజించడం" ద్వారా వాళ్లలో సౌందర్య దృష్టి పటిష్ఠంచేయబడకపోతే, యీ సౌందర్య గ్రహణ విద్య అధికతర ఆవేశానికీ, క్రూరతనపు ఆనందాతిరేకానికీ మాత్రమే దారితీస్తుంది.

సుందరమైనది నైతికమైనదానితో జోడింపబడకపోతే, యీ ఎడం అనివార్యంగా వినాశకరమైన సౌందర్య గ్రహణతత్వానికీ, మిడిసిపాటుకీ మాత్రమే దారితీస్తుంది.

పిల్లల హృదయాల్లో మానవీయ సౌందర్యం ఉత్పన్నమవడంలోని కొన్ని సంక్లిష్ట పార్శ్వాలను వెల్లడించేందుకు యిప్పుడిక నేను ప్రయత్నిస్తాను.

మీ పిల్లలు అవినీతికరమైనవాటిపట్ల ఏహ్య భావాన్ని కలిగివుండాలని మాత్రమే కాకుండా జీవితంలో అనుచితమైనదాన్ని ఎదిరించాలని కోరుకుంటే, వాళ్లు సుందరమైనదాని వైపు సదా మొగ్గు చూపేలా చేయండి.

స్కూల్లో ఒకసారి ఒక ఘర్షణ జరిగింది. పదో తరగతి పిల్లలు యిద్దరు కొట్లాడారు. ఒకడు — యితని పేరు జేన్య గ్రూషెవ్ అనుకుందాం — కొన్ని పాకెట్ల అశ్లీల చిత్రాలు స్కూలుకి తెచ్చాడు. రెండోవాడు — సాష మకారొవ్ — యీ ఫొటో కార్డుల్ని చింపెయ్యడం మొదలెట్టాడు.

ఈ ఘటన రచ్చకెక్కింది. ఆ కుర్రాళ్ల తల్లితండ్రులు స్కూలుకి పిలవబడ్డారు.

జేన్య తండ్రి అబ్బురపడ్డాడు, అలా జరిగిందంటే నమ్మలేకపోయాడు. కొడుకు రాసి యిచ్చిన సంజాయిషీ పత్రాన్ని ఆయనకి చూపించారు: "నాకొకాయన 6 సెట్లు, ఒక్కొక్కటి ఆరు రూబుళ్ల చొప్పన యిచ్చాడు. ఆ ఆరు సెట్లూ అమ్మితే వచ్చే 36 రూబుళ్లలో

నాకు పదహారు రూబుళ్ళ కమిషన్ యిస్తానన్నాడు. అలా పదహారు రూబుళ్ళ నేను తీసుకున్నాను..."

సాష సంజాయిషీ యిలా సాగింది: "మానవ సౌందర్యాన్ని అప్రభంశంచేసేదాన్ని దేన్నీ నేను సహించలేను. అందుకే నేనా ఫొటోలు చూసీ చూడగానే చింపెయ్యనారంభించాను."

సాష తండ్రి ఆ సంజాయిషీని చదివినప్పుడు "నా కొడుకు మరోలా ప్రవర్తించగలడని నాకు తోచలేదు!" అన్నాడు.

రెండు భిన్న వైఖరులు. పెంపకంలో రెండు భిన్న ఫలితాలు.

జేన్య కుటుంబంలో సౌందర్య ప్రపంచంపట్ల సాధారణమైన నిర్లక్ష్యం వుంది. ఉపయోగితావాదం, కార్యప్రాధాన్యతత్వం ఉన్నత స్థాయిలో వున్నాయి.

సాష కుటుంబంలో అందమైనవాటిపట్ల ఆరాధనా భావం వుంది. తల్లితండ్రుల్లో ఏ ఒక్కరికీ వృత్తిపరమైన కళలతో ప్రత్యక్ష సంబంధం లేకపోయినప్పటికీ, కళా, సౌందర్య ప్రపంచాలు వాళ్ల జీవితాల్లో భాగాలు.

మీ పిల్లలు సుందరమైనవాటిపట్ల మొగ్గు చూపాలని మీరు కోరుకుంటే, కళలకి సంబంధించిన ఏదో ఒక విషయానికి పూనుకోండి. మీకు ఏ ప్రతిభా లేదనడం నిజం కాదు. ఎంతో కొంత ప్రతిభ లేని వ్యక్తి ఎవరూ ఉండరని నేను భావిస్తున్నాను.

తమ పిల్లల పెంపకంలో కొత్త పద్ధతులను అవలంబించడం ద్వారా ప్రసిద్ధి చెందిన నికీతిన్ కుటుంబ సభ్యులు ఒక ప్రత్యేక అలంకారం తయారుచేశారు. ఒక చెట్టు బొమ్మమీద కుటుంబ సభ్యుల్లో ప్రతి ఒక్కరూ ఒక్కొక్క పువ్వు చిత్రించాలి. ఎవరికి యిష్టమైన రంగులు వాళ్ళు ఎంచుకోవచ్చు. ఫలితంగా తయారైన ఆ ఉమ్మడి చిత్రం చాలా అందంగా వుంది. అయితే యిక్కడ ప్రధానాంశం ఏమిటంటే, ఆ కుటుంబ సభ్యుల్లో ప్రతి ఒక్కరూ తను సౌందర్య సృజన చేయడం ద్వారా ఉమ్మడి శక్తి ద్వారా సృజించిన సౌందర్య ప్రపంచంలో ప్రవేశం పొందడం.

ఒక తల్లి నాతో కోపంగా యిలా అంది:

"ఏమిటి మీరు బోధిస్తున్నది? నాటువైద్యమా? ప్రతి ఒక్కడూ చిత్రాలు వెయ్యడం మొదలుపెడితే ఏమవుతుంది? కళ అంటే ఏమిటో మీకు తెలియదా? కొద్ది మందికి పుట్టుకతోనే ఆ ప్రతిభ వుంటుంది. ఉదాహరణకి, నన్ను పుటం వేసినా, చిత్రకళ నాకు అబ్బదు."

"సరిగ్గా యిందుకు భిన్నమైనదాన్ని నన్ను నిరూపించమంటారా? మీరు అద్భుతమైన చిత్రం వెయ్యగలరు. అద్భుతమైన చిత్తరువు వెయ్యగలరు, అందునా తైల వర్ణాల్లో, కేన్వాసు మీద..." అని నేను వాదించాను.

ఆ తల్లి పగలబడి నవ్వింది. "తైల వర్ణాలు," "కేన్వాసు," "చిత్తరువు" అనే మాటలు ఆవిడకి వినోదం కలిగించాయి.

కాని నేను ఆవిడకి కొన్ని కుంచెలు, ఒక కేన్వాసు, రంగులు కలుపుకునే గుంటల ప్లేటు

కొని తీసుకువెళ్లి యిచ్చాను. మొదట పెన్సిలుతో ఏదైనా రేఖా చిత్రం వెయ్యమని ఆవిడకి చెప్పాను. ఆవిడ రెండు ఫర్ చెట్లు, రెండు మేఘాలు, తెరిచిన నోటితో ఒక తోడేలు, ఒక కుందేలు గీసింది. నేను ట్యూబుల్లోంచి కొన్ని పెయింట్లు ప్లేటు గుంటల్లోకి పిండాను. అవి మంచి నదరుగా మెరుస్తున్నాయి. బహుశా కంటికి యింపైన యీ మెరుపే ఆవిడ మనస్సులో స్పందన కలిగించి వుంటుంది. "వీటిలో మీ యిష్టమైన రంగు ఎంచుకోండి. మీ రేఖా చిత్రంలో పుయ్యండి. మీ చిత్తం వచ్చినట్లు ఎలాగైనా సరే. ఆకాశానికి ఎరుపు, చెట్లకి నీలం వెయ్యాలనుకుంటే, నిస్సంకోచంగా అలాగే వెయ్యండి! కాని రంగులు మటుకు వెయ్యండి" అని చెప్పాను.

"నేను ఏమంత మూర్ఖురాలిని అనుకున్నారా, ఆకాశానికి ఎరుపు రంగు వెయ్యడానికి? ఆకాశం నీలంగా వుంటుంది..."

ఓ అరగంట గడిచే సరికి ఆ తల్లి మాంచి హుషారుగా వుంది: ఆవిడ నిజంగానే ఒక ప్రకృతి చిత్రం, కేన్వాసుమీద, తైల వర్ణాల్లో వేసింది.

నేనిలా అన్నాను:

"అద్భుతంగా వుంది! ఊహకి కూడా అందనంత బ్రహ్మాండంగా వుంది. అయితే, అత్యంత విచారకరమైన విషయం ఏమిటంటే, యిది మీరే వేశారంటే, ఎవరూ నమ్మరు..."

నేనిక్కడ కొంచెం నటించాను, నాతో బాటు ఆవిడా నటిస్తోంది. ఆవిడలోని శిశువు మేల్కొంది. ఆవిడ మరేదైనా చిత్రించాలని తహతహలాడుతోంది. అప్పుడు నేనిలా సూచించాను:

"ఈసారి ఏదైనా మనిషి చిత్తరువు వెయ్యండి. ఎవరి చిత్తరువు వేస్తారు?"

"నా భర్తది" అందామె.

మళ్లీ పెన్సిలుతో రేఖా చిత్రం: నల్ల ఫ్రేము కళ్లద్దాలు, బుగ్గమీద సొట్ట, ఒత్తైన నల్లటి జుట్టు, గులాబి బుగ్గలు, అందమైన నీలి కళ్లు...

ఆ చిత్తరువు ఆవిడకి మరింత నచ్చింది. ఆ చిత్తరువుకీ, ఆవిడ స్వీయ స్వభావానికీ మధ్య ఉమ్మడి అంశాలు చాలా వున్నాయి: రంగుల్లో అదే ఉద్రిక్తత, చిత్తశుద్ధి, నిర్మొగమాటం, రేఖల్లో దృఢత్వం.

అయితే యిక్కడ అన్నిటి కంటె ముఖ్యమైనదేమిటంటే, ఆవిడ తన కూతురుతో బాటు చిత్రాలు వెయ్యడం మొదలుపెట్టింది.

పిల్లల్లో సౌందర్య భావనని చొప్పించేటప్పుడు ఎవరైనా చెయ్యగల పొరపాటు ఏమిటి? దాని వల్ల ఎంత నష్టం కలగవచ్చు?

మకారొవ్ కుటుంబంలో కలిగిన ఒక పర్యవసానాన్ని యిక్కడ విశ్లేషిస్తాను.

ఆ కుటుంబంలోని తండ్రి తన విషయమే నాతో యిలా చెప్పాడు:

"మా యింట్లో అందరూ చిత్రాలు వేసేవాళ్లు. అందుకని నేనూ వేస్తూ వచ్చాను. కాని నా చిత్రాలు మా అన్నగార్లు వేసినంత బాగుండేవి కావు. వాళ్లు నన్ను చూసి నవ్వుతూండే

వారు. దానితో నాకు చిత్రకళపట్ల రోత కలిగింది. ప్రకృతి, "ప్రకృతి చిత్రాలు" అంటే (నీటి నున్నటి ఉపరితలం, ఆకుపచ్చటి గడ్డి, గుబురైన పచ్చటి ఆకులతో చెట్లు) నాకు ఏవగింపు కలిగింది. మా నాన్న నాతో అంటూ వుండినట్లు నేను వేసిన ప్రతీదీ పరస్పర సంబంధం లేనివిగా, గజిబిజిగా, సుడులు తిరుగుతున్నట్లు, గరుకుగా వుండేవి. ఫ్రెంచి ఇంప్రెషనిస్టు చిత్రకారుల చిత్రాలనూ, ఈ శతాబ్ది ఆరంభంలో జీవించిన మన రష్యన్ చిత్రకారుల చిత్రాలనూ చూసి వుండకపోతే నేను మళ్లీ నా జీవితంలో కుంచెపట్టి చిత్రాల జోలికి పోయి వుండేవాణ్ణి కాను. వాటిని చూశాక, నేను చాలా పోగొట్టుకున్నానని అనిపించింది. ఆ చిత్రాలు చాలా వాటిలో నా చిన్ననాటి చిత్రాల్లో వుంటూ వచ్చిన మాదిరి రూప అస్పష్టత, స్పష్టత లోపమూ నాకు కనిపించాయి. మృదు పరివర్తనలు లేని అదే వర్ణ ఛాయల వైవిధ్యం కనిపించింది... అప్పుడింక నేను ఉన్మత్తావేశంలో తిరిగి చిత్రాలు వెయ్యడం మొదలు పెట్టాను. నేను చిత్రాలు వేసే క్రమంలో వివిధ టెక్నిక్కులు అధ్యయనం చేశాను. నేను నా తీరిక సమయం అంతా చిత్రకళకే అంకితం చేశాను.

"సహజంగానే నేను నా కొడుకు చిత్రకళ వైపు మొగ్గు చూపేలా చేశాను. అయితే యిక్కడ చిత్రమేమిటంటే, సరిగ్గా నా విషయంలో నా తల్లితండ్రులూ, అన్నలూ చేసిన పొరపాటే నేను కూడా చేశాను.

"నాకు ఆ పాపిష్టి సాయంత్రపు ఘటన, అది నిన్ననే జరిగిందా అన్నట్లు, నా మనస్సు మీద హత్తుకుపోయింది. మా అబ్బాయి సాషకి అప్పటికి నిండా ఆరేళ్లకి మించి లేవు. వాడు అప్పటికి వాటర్ కలర్లతో కాగితంమీద పులుముతున్నాడు. ఒక పూతమీద మరో పూత పెట్టడం మొదలెట్టాడు (వాటర్ కలర్ చిత్రాల్లో దీన్ని చేయకూడదు). నేను వాడితో కోపంగా 'ఒరేయ్, కాగితంమీద అంత రంగు పుయ్యకూడదురా! కాగితం రంగు గుండా కని పించాలి' అన్నాను.

"కాని, కొన్ని రోజుల తర్వాత కూడా సాష అదే పని చేశాడు... వాడు బుద్ధిపూర్వకంగానే సాసర్లో అంతకంతకు ఎక్కువ నీళ్లు పోసి, వాటర్ కలర్లు రంగు కరిగేదాకా కలుపుతున్నట్లు అనిపించింది. నాకింక ఓపిక పోయి, కోపం ముంచుకొచ్చి, 'ఒరే అలా చెయ్యకూడదు! నువ్వు రంగులు పాడు చేస్తున్నావు!..' అన్నాను.

"సాష నా ఓపిక పరీక్షిస్తున్నాడా అనిపించింది. నేను కోపంతో ఘూర్ణిల్లుతూ వుండగా, వాడు కలగాపులగంగా వున్న ఆ రంగు ద్రవం అంతా కాగితంమీద ఒంపేశాడు. విచారకర పరిణామం ఏమిటంటే, నేను వాణ్ణి తిరిగి చిత్రకళ కేసి ఆకర్షించాలని ఎంతగా ప్రయత్నిం చినా కూడా వాడింక మళ్లీ తన రంగులు ముట్టుకోలేదు. కాని మూడేళ్ల తర్వాత సాష ఎలాగో మొత్తంమీద క్రుస్యన్ చేప బొమ్మ వేసేందుకు ప్రయత్నించాడు. అది ప్రకృతి విజ్ఞాన శాస్త్రంలో హోమ్‌వర్కు. నేను మూడేళ్ల క్రితం చెప్పిన పాఠం వాడి చిన్నారి బుర్రలో ఎంత గాఢంగా నాటుకుందో చూసి నేను విభ్రాంతి చెందాను. వాటర్ కలర్లు

వాడు యీ సారి ఎంతో శుభ్రంగా, చక్కగా వాడాడేమో ఆ చేప ప్రతి పొలుసూ, ప్రతి ఎముకా వాటర్ కలర్లో మెరవాల్సిన రీతిలో మెరుస్తున్నాయి.

"నేనా చిత్రాన్ని – దురదృష్టవశాత్తూ ఎంతో ఆలస్యంగా – పొగిడాను. ఆ రోజు నుంచి సాష మళ్లీ చిత్రాలు వెయ్యడం మొదలెడతాడని అనుకున్నాను... కాని అలా జరగ లేదు. సాష వేసిన చక్కటి క్రుస్యన్ చేప బొమ్మకి 'సి' మార్కు వచ్చింది. వాడు ఆ చిత్రాన్ని తప్పు సైజులో వేసినట్లుంది. వాడు నిజంగానే కలవరపడ్డాడు. ఆ ఏటికింక తిరిగి వాడు రంగులు ముట్టుకోలేదు."

నా ఆలోచనల్ని ధ్రువీకరించుకునేందుకోసం "మరైతే మీరు చేసిన పొరపాటు ఏమిటి?" అని అడిగాను.

"ఎవరిలోనైనా సౌందర్య భావనను చొప్పించేందుకు ఊహకి అందనంతటి సున్నిత మైన జాగ్రత్త అవసరం."

"అన్ని సందర్భాల్లో పొగడటం, ప్రోత్సహించడం అవసరమనా మీ ఉద్దేశం?"

"సరిగ్గా అదే నేను చెప్పేది. పిల్లల సృజనాత్మక శక్తులను విముక్తంచేసే అవకాశం వున్నది సరిగా యిలాంటి పరిస్థితిలోనే..."

"కాని యిందుకు యితర పద్ధతులు కూడా వున్నాయి. ప్రపంచ ప్రఖ్యాత ఫిడేలు వాద్యకారుడు పగనీని తండ్రి పగనీనిని బాల్యంలో తిడుతూ, అతనిచేత ఫిడేలు వాద్యం ప్రాక్టీసు చేయించేవాడు. అయినా, పగనీని గొప్ప ఫిడేలు వాద్యగాడయ్యాడు."

"పగనీని నిలదొక్కుకున్నాడు నిజమే. కాని తమ తల్లితండ్రుల తిట్లు, తిరస్కారాల మూలంగా ఎందరు 'పగనీనిలు' పూర్తిగా పనికిరాకుండా పోయారు?"

"మరి పిల్లలు తమ మొదటి ప్రయత్నంలో శుద్ధ చెత్త వేస్తే ఏం చెయ్యాలి? అప్పుడు కూడా వాళ్లని పొగడాల్సిందేనా?"

"బహుశా, పొగడాల్సిందే" మకారొవ్ కొంచెం సంకోచిస్తూ అన్నాడు. "అన్నట్లు, నేను సరిగ్గా మీకు చెప్పాలనుకున్నది అదే..."

ఇక్కడొక అవసర విషయాన్ని వక్కాణించేందుకుగాను మకారొవ్ కథని ఆపుచేస్తాను. ఒక వ్యక్తి ఏదైనా ఒక విషయమంటే యిష్టపడేలా చెయ్యాలని మనం ప్రయత్నించేటప్పుడు, మొదట్లో మనం విమర్శనాత్మక వ్యాఖ్యలు చెయ్యకుండా చూసుకోవాలి. ఇది ఎలాంటి మినహా యింపులూ లేకుండా అన్ని రకాల కార్యకలాపాలకీ, అన్ని మానవాసక్తుల అభివృద్ధికీ వర్తించే సాధారణ సూత్రం.

ప్రత్యేకమైన యీ ఒక తండ్రి ప్రవర్తనను పరిశీలించేందుకు ప్రయత్నించడం ద్వారా ఆ పిల్లవాడి సృజనాత్మక అభివృద్ధికి సంబంధించిన ఆవశ్యక వివరాలను మనం అర్థంచేసుకో గలుగుతాం.

ఈ కథ నిస్సందేహంగా విజ్ఞానదాయకమైనది.

"ఇలా జరిగింది" అంటూ మకారొవ్ కొనసాగించాడు. "ఒక ఏణ్ణర్ధం సాష నా చిత్రాలను శ్రద్ధగా పరిశీలించాడు. అప్పుడప్పుడు నేను వాణ్ణి చిత్రకళా ప్రదర్శనలకు తీసుకు వెళ్తూండేవాణ్ణి. వాడంత ఉత్సాహం చూపించేవాడని చెప్పలేను గాని, నేను వాణ్ణి నా వెంట ఎలాగో లాక్కెళ్తూ వుండేవాణ్ణి. తను రాననేందుకు భయపడుతున్నట్లు వాడు నటించేవాడు. వాడు అయిష్టంగానే అయినా, వచ్చేవాడు. చూసేవాడు. అంచనా వేసుకునే వాడు. ఏ ఒక్క చిత్రం దగ్గరా వాడు ఎక్కువ సేపు ఉండేవాడు కాడు. ఒకసారి తను స్వయంగా ఏదైనా చిత్రం వేద్దామని వాడు అనుకుంటున్నట్లు నాకు అనిపించింది. వాడికి నేను కొన్ని కుంచెలు, రంగులు, ఒక అట్ట యిచ్చాను. వాడు గదిలో తలుపు బిడాయించుకొని చిత్రం వేయడం మొదలుపెట్టాడు.

"ఆ రోజు ఆదివారం. నా మనోస్థితి హుషారుగా వుంది. తను వేస్తున్నదేమిటో చూపించ మని నేను వాణ్ణి అడిగాను. కాని చస్తే చూపించనని అన్నాడు! నేను గది తలుపు దగ్గరకి వెళ్లినప్పుడల్లా, వాడు 'కొంచెం ఆగు, పూర్తిచేశాక చూపిస్తాన్లే...' అని అరిచి చెప్పేవాడు.

"వాడు ఏది వేసినా, ఎలా వేసినా సరే మెచ్చుకుంటాననీ, తద్వారా వాడి ఆసక్తిని స్థిరపరుస్తాననీ నేను నిర్ణయించుకున్నాను.

"సాష విజయోత్సాహంతో గదిలోంచి బయటకి వచ్చినప్పటి దృశ్యం నాకిప్పటికీ ఎంతో స్పష్టంగా గుర్తుంది. నేను పడక కుర్చీలో కూర్చుని వున్నాను. వాడు తన చిత్రాన్ని నా ముందుంచి, టేబిల్ లైటుకోసం పరుగున వెళ్లాడు. వాడా లైటు వెలిగించి, కాంతి తన చిత్రంమీదకి పడేలా తిప్పి పట్టుకున్నాడు.

"నా కంట పడినదాన్ని చూసి నేను కలవరపడ్డాను. నాకు గాద్గద్యం కలిగింది. నాకు గాభరా కలిగింది...

"తెల్లటి, నగిషీల శవపేటిక చిత్రం అది. దానికి పొడుచుకు వచ్చిన మూలలు, మూత, అడుగు చెక్క, అలంకరణలు వున్నాయి. అలాంటి శవపేటికని నేను నా జీవితంలో అంతకు ముందెప్పుడూ చూడలేదు. కాని మనిషి అంతిమ స్థావరం సరిగ్గా అలాగే వుండాలని మాత్రం తేలిగ్గా ఊహించుకోగలిగాను. అంచుల వెంట ఎనిమిది భిన్నభిన్న వర్ణాల భరిణలో, గుండ్రటి గుబ్బలో వున్నాయి. ఈ భరిణలు ముందున్నవాటి కంటె వెనక్కి వెళ్లే కొద్దీ చిన్నవయాయి. ఈ శవపేటిక అంతమైన చోట అవి మరీ చిన్నగా వున్నాయి..."

మకారొవ్ యిలా కొనసాగించాడు: "నేనిప్పుడు వెనక్కి తిరిగి, అప్పటి నా మానసిక స్థితిని అంచనా వేసుకోగలను: అంతర్వ్యాకులం కంగారుతో కూడిన నిస్పృహలోకి మారు తోంది. కొన్ని భయంకరమైన అసంగతమైన ఊహలు మనస్సులో చెలరేగాయి... నాకు వాణ్ణి యిలా అడగాలని అనిపించింది: 'నువ్వెందుకు యీ పని చేశావ్? మీ బామ్మ యిటీవలే పోయింది. మనందరికీ అశనిపాతం వంటి యీ దుర్ఘటనని గురించి మన కుటుంబంలో ఎవరూ నేరుగా ప్రస్తావించకుండా జాగ్రత్తపడుతున్నారు. అయినా ఆ స్మృతి మన ఆలో

చనల్లోంచి తొలగడం లేదు, గాలిలో కదలాడుతూనే వుంది...' మరో రకం ఊహలు కూడా నా మనస్సులో చోటుచేసుకున్నాయి: సాష ఒకసారి, తమాషాగానే అనుకోండి, తనకి బతుకంటే విసుగుపుట్టేసింది అన్నాడు. 'బహుశా యీ శవపేటిక వాడి భయంకరమైన ఆలోచనల ఫలితమేమో...' అనిపించింది.

"నా గాభరాని పసిగట్టినట్లు, వాడు 'నాన్నా, యింతకీ బొమ్మ ఎలా వుంది?' అన్నాడు.

"నేను అంతకు ముందే చేసుకున్న నిర్ణయం ప్రకారం 'రంగులు విభ్రాంతి గొలిపేటంత అందంగా వున్నాయి...' అన్నాను.

" 'కాని, నీకింకా దీంట్లో నచ్చనిదేదో వున్నట్లు నాకు అనిపిస్తోంది' అన్నాడు సాష.

" 'చిత్రంలో అంశం ఆశాభావంతో కూడిందని చెప్పడం కష్టమేమో' అంటూ గొణిగాను, చిరునవ్వు నవ్వేందుకు బలవంతాన ప్రయత్నిస్తూ. ఇంకేదైనా చిత్రించేందుకు ప్రయత్నించవచ్చు కదా? నీ రంగులు అపూర్వంగా వున్నాయి' అని జోడించాను.

"సాష తన గదిలోకి పోయి ఓ అరగంటలో "బీటిల్సు" గాయకుల్లో ఒకని చిత్తరువు తెచ్చి నాకు చూపించాడు. రంగుల ఎంపిక అపూర్వంగా వుంది. అలాంటి వర్ణ సమ్మేళనాన్ని అంతకు ముందెప్పుడూ నేను చూడలేదు. భూమిక చిక్కటి బచ్చలిపండు రంగులో వుంది. ముఖం ఉజ్వలమైన దబ్బపండు రంగులో వుంది. అది మునిణి ఆకుల పసుపు కాక, కొంత తెలుపుతో కూడిన మెత్తని, వెచ్చని పసుపు వన్నె. జుట్టు నీలి నలుపులో, మధ్యమధ్య ఇటుక రంగు చారికలతో వుంది. దుస్తులు కొన్ని నీలి నీడలతో కూడిన ఎరుపు రంగులో వున్నాయి.

" 'చాలా చక్కటి ప్రయత్నం, నువ్వు అసాధారణమైన చిత్రాలు వెయ్యగలవని అనిపిస్తోంది. ఇంతకీ, యీ చిత్తరువు అద్భుతంగా వుంది....' " అన్నాను.

"నేనీ మాట అంటున్నప్పుడు శవపేటిక చిత్రం గురించిన ఆలోచన యింకా నా మనస్సులో మెదుల్తూనే వుంది. వాడీ సంగతి అర్థంచేసుకున్నాడు. చిత్తరువును గురించిన నా యీ పొగడ్త అంతా వాడి దృష్టిని మళ్లించేందుకేననీ, ముందు చిత్రం విషయం తొక్కిపట్టేందుకేననీ వాడు గ్రహించాడు... బహుశా దానికి నిరసనగానో, లేక బహుశా మరే యితర కారణంగానో వాడు తన మొదటి చిత్రం గురించి తప్పకుండా మాట్లాడడం మొదలుపెడతాడని నాకు ఖాయంగా తెలుసు. మరి నిజానికి సరిగ్గా అదే జరిగింది. వాడు యిలా అన్నాడు:

" 'నీకు తెలుసా నాన్నా, నాకు మొదటి చిత్రమే నచ్చింది. తెలుసా, నేను దానికి ఏం పేరు పెట్టానో?'

"వాడెక్కడ నిష్కర్షగా మాట్లాడుతాడో అని తెగ భయపడుతూ 'లేదురా' అన్నాను.

"వాడు యిలా సమాధానం యిచ్చాడు:

" 'నేను దానికి 'జీవించేందుకు జీవించాలి' అని శీర్షిక పెట్టాను.'

" 'చాలా తాత్వికంగా వుంది... ఆ శీర్షికకి అర్థం ఏమిటి, నీ దృష్టిలో?'

" 'అది వివరించి చెప్పడం నాకు కష్టం. కాని జీవితం చాలా అద్భుతమైనది. మరణం దాని అందాన్నీ, నిత్యత్వాన్నీ నొక్కిచెప్పుతుంది, అంతే...' అని వాడు సమాధానం చెప్పాడు.

"అయినా కూడా, నేనా సాయంత్రం ఆ చిత్రం గురించి చర్చించలేకపోయాను. సర్రియలిజం గురించిన వాడి సంభాషణలు నాకు గుర్తుకొచ్చాయి. సాష ఆ ధోరణి గురించి నన్ను ప్రశ్నించనారంభించాడు. చిత్రకళలోని అన్ని ధోరణుల్లోకీ నాకు అంగీకారయోగ్యం కానిది యీ సర్రియలిజమే. దాని ఆత్మలోపం చూస్తే నాకు రోత. నేనా విషయం వాడికి చెప్పాను. కొన్ని రోజుల తర్వాత వాడు సాల్వడార్ డాలీ చిత్రాల ఆల్బమ్ ఒకటి తీసుకొచ్చాడు. మేమిద్దరం కలిసి, ఆ చిత్రాలను నిశితంగా పరిశీలించనారంభించాం. డాలీ చిత్రాలంటే నాకెందుకు ఇష్టం లేదు? నేను నా అభిప్రాయాన్ని సాధ్యమైనంతవరకు సమర్థించుకున్నాను: వీటిలో ప్రతీదీ నిర్వీర్యంచేయబడింది, ప్రతీదీ మృత్యువును స్ఫురింపజేస్తుంది, ప్రతీదీ ప్రళయాన్ని సూచిస్తుంది. బీభత్సం: పుర్రెలు, పాములు, సిలువకు దిగకొట్టబడ్డ రూపాలు, అన్నీ క్షేత్రగణితీయ కచ్చితత్వంతో చిత్రించబడ్డాయి... సాష నా అంచనాతో ఏకీభవించాడు. అయితేనేం, నన్నిలా ప్రశ్నించాడు:

" 'కాని డాలీ టెక్నిక్‌లో ఆరితేరినవాడు, కాదా?..'

" 'టెక్నిక్ అపూర్వంగా ఉందన్న విషయం నేను కాదనలేను. కాని అది కళాత్మకంగా కంటె ఎక్కువ ఫొటోగ్రాఫిక్‌గా వుంది. అన్నిటి కంటె ముఖ్యంగా యీ డాలీ దయాపరుడు కాడు.'

" 'కాని యీ డాలీని బూర్జువా ప్రపంచపు రోత నంతనీ చిత్రించే కళాకారుడిగా ఎందుకు పరిగణించకూడదు?' అని సాష మరో దృక్పథంనుంచి చూసేందుకు ప్రయత్నిస్తూ ప్రశ్నించాడు...

" 'ఔను, అతన్ని అలా అర్థంచేసుకోవచ్చు' అన్నాను నేను. 'కాని కళలో వికృతమైనదాన్ని చిత్రించడంలో కూడా, ఒక రకమైన వెచ్చదనం తొంగి చూడాలి. ఏ మూలనైనా ఆశా లేశమైనా వుండాలి. బ్రాడ్‌బరీ రాసిన 'ఫారెన్‌హీట్ 451' అనే నవల నీకు జ్ఞాపకం వుందా? నాగరికత తుడిచిపెట్టుకుపోయింది. కాని ఎక్కడో ఒక ఆశా కిరణం వుంది: యీ ఉన్మత్త నగరంలో ఆస్ఫాల్టు రోడ్డుమీద ఓ చిన్న మొక్క మొలిచింది... కళలో కూడా అలాగే యిలాంటి ఆశా కిరణాలు, చిరుమొలకలు వుండాలి... బహుశా నా దృక్పథం పాతబడిపోయిందేమో?'

" 'అబ్బే, నువ్వు చెప్పింది రైటే అయివుంటుంది' అన్నాడు సాష.

"వాడు నాతో ఏకీభవించినందుకు నేను సంతోషించాను.

"ఆ మరుసటి రోజున వాడు డాలీని గురించి మళ్ళీ మాట్లాడటం మొదలెట్టాడు. వాడు సంభాషణని తన సొంత చిత్రంమీదకి తేవాలని కోరుతున్నట్లు నాకు అనిపించింది.

" 'చిరుమొలకలకి నేను వ్యతిరేకం కాదు' అన్నాడు వాడు. 'కాని, అలాంటి ప్రమా

ణమంటూ ఎందుకు వుండాలి? డాలీ ప్రతిభకి మనే హక్కు ఎందుకుండకూడదు? పాబ్లో పికాసో వేసిన 'గుయెర్నికా' చిత్రం మటుకు ప్రపంచంలోని క్రౌర్యానికి యిదే మాదిరి నిరసన తెలిపే చిత్రం కాదూ? డాలీకీ, పికాసోకీ కొన్ని అంశాల్లో పోలిక లేదూ?'

''నేను చెయ్యలేకపోతున్నదల్లా ఒక్కటే'' అన్నాడు మకారొవ్ (అది నేను కూడా ఏకీభవించిన విషయం) ''అది మా అబ్బాయి తను కోరినట్లు ఆలోచించకుండా నిరోధించడం. వాడు తన ఆలోచనా క్రమంలో వివిధ ఆధారాలనుంచి గ్రహించిన భావనలను, పోలికలను ఉపయోగిస్తాడు. వాడు డాలీని గురించి ఎవరి దగ్గరో విని వుంటాడనడం స్పష్టం. వాడు డాలీని మరెవరి కళ్లతోనో చూశాడు. మరెవరి అభిప్రాయాలో వాడి బుర్రలో నాటుకున్నాయి. వాడు యిలా అన్నాడు: 'నీకు తెలుసా నాన్నా, మీ మోనెట్లు, వాన్ గోగ్‌లు, సెరోవ్‌లు పాతబడిపోయి చాలా కాలం అయింది. వాళ్ల ఆలోచన కూడా రేపిన్, రెంబ్రాంట్, రఫయేల్‌ల ఆలోచన మాదిరిగానే ప్రాథమికమైనది. కొత్త కళ భిన్నంగా వుండాలి.'

'' 'అబ్‌స్ట్రాక్షనిజమా?'

'' 'అబ్‌స్ట్రాక్షనిజం కూడా పాత చింతకాయపచ్చడే' అని సమాధాన మిచ్చాడు సాష. 'పరమ చెత్త. కళ మూడు అంశాల మూలంగా కళ అవుతుంది: ఆలోచన, విషయాంశం, రంగులు. సాల్వడార్ డాలీ చిత్రించగలిగిన విషయాంశాలను చిత్రించే టెక్నిక్‌ను నేనెన్నడూ సంతరించుకోలేను గనుక నేను చిత్రాలు వెయ్యను, వెయ్యబోను.'

''నేను వాదించలేదు.

'' 'నువ్వేమీ చెప్పవేం?' అని అడిగాడు సాష.

''నేను చెప్పగలిగింది ఏమీ లేకపోయింది. నేను నా ఆలోచనలను కూడదీసుకోవడం కాదు యిక్కడ సమస్య. అన్నీ సింహావలోకనం చేసుకోవాలి, విషయాలను బేరీజు వేసుకోవాలి. వాదనలను ఎంపిక చేసుకోవాలి. నేను ఎవరిని సవాలు చేయాలో, ఆ తెరవెనుక ప్రత్యర్థులను చూడాలి.

'' 'నా వాదాన్ని ఖండించవా?' నా కొడుకు జగడానికి ఎదురుచూస్తున్నట్లుంది.

''నేను వాడి పట్టుదలని పసిగట్టగలిగాను. వాడు నా ఖండనలకోసం ఎదురుచూస్తూ, అవి బయటకి రాగానే వాటిని చీల్చిచెండాడి, నన్నొక మూలకి నెట్టాలని ఉగ్గబట్టుకు కూర్చున్నట్లు నాకు బోధపడింది. అందుకే నేను వెనక్కి తగ్గాను. సద్భావంతోనే, ఏ హేళన భావం లేకుండానే తిరోగమించాను.

'' 'అబ్బే, నీ వాదన సరిగానే ఉందేమో అనిపిస్తోంది' అని నేను సమాధానమిచ్చాను. అంతలోనే వాడి ఉద్రిక్తత సడలినట్లు, వాడు వెనుకంజ వేసేందుకు సిద్ధపడుతున్నట్లు నేను గమనించాను.

''వాడు చిత్రించిన శవపేటిక కచ్చితంగా కాకతాళీయమైనది కాదనీ, వాడి ప్రస్తుత మనోస్థితికి ప్రతిబింబమనీ నేను గ్రహించాను. తన స్నేహితుడొకడు కంటిలో ఓ పెద్ద

కన్నీటి చుక్కతో ముఖంలో ఒక భాగమే చిత్రించినట్లు వాడు చెప్పిన విషయం నాకు జ్ఞాపకం వచ్చింది. మరొకడు ఆరుద్ర పురుగుతో బాటు రెండు అపురూప పుష్పాలనీ, వాటి పక్కన ఒక పెద్ద మోటరు కారు వీలునీ చిత్రించినట్లు వాడు చెప్పిన విషయం కూడా గుర్తొచ్చింది.

"నేనింక ఆ విషయం సాగదియ్యనారంభించలేదు. వాడు అడిగిన ప్రశ్నలకి అనువైన తరుణంలో జవాబిచ్చే హక్కుని నాకు అట్టేపెట్టుకున్నాను. అయినా కూడా, వాడి అవకతవక వాదన పై పెంకుని ప్రయత్నపూర్వకంగా భగ్నంచేసేందుకుగాను ఒక వివరణ యిచ్చేందుకు సాహసించాను.

" 'చూశావొరేయ్, దీంట్లో యేదీ కొత్తది లేదు' అన్నాను. 'సర్రియలిజంలో ఆసక్తికరమైనదేదైనా ఎప్పుడైనా ఉండవచ్చు. నీకో చిత్రం చూపించమంటావా? కావాలంటే నీ బల్ల ఎదుట గోడమీద వేలాడదీసుకునేందుకు నేను దాని కాపీ వేసి యిస్తాను.' కాని నేను వాడికి చూపించబోయే చిత్రం కచ్చితంగా వాడి ఉద్రేకాన్ని తరిమేసి, వాణ్ణి నవ్వేలా చేస్తుందని మాత్రం నాకు తెలుసు. కళమీద వాడి 'తాజా' అభిప్రాయాలకు వ్యతిరేకంగా యిది నా అత్యుత్తమ ఆయుధం అవుతుంది. నేను సాషకి మర్సెల్ డుషాన్ వేసిన చిత్రం చూపించాను. పబ్లిక్ మరుగుదొడ్డిలో ఓ పెద్ద యూరినల్ చిత్రం అది. రంధ్రాలు, తెల్ల పింగాణీ, పొడుగాటి మెడ అన్నీ నిర్దుష్టంగా వున్నాయి. ఏదైనా ఒక వస్తువుకి ఫొటో వంటి కచ్చితత్వానికీ కళకీ ఎలాంటి సాదృశ్యమూ లేదు. సాష యీ అంశాన్ని అర్థంచేసుకున్నాడు.

"నేను చిరునవ్వు నవ్వుతూ 'నీకు నచ్చిందా?' అని అడిగాను.

" 'అంతగా నచ్చలేదు...'

" 'ఈ 'కళాఖండం' పేరిట రెనోయిర్‌నీ, రఫయేల్‌నీ చిత్రకారుల జాబితానుంచి తొలగించగలిగితే?'

" 'నువ్వు నన్ను సరిగా అర్థంచేసుకోలేదు...'

"సరిగ్గా నాకు కావలసిన సమాధానం అదే. ఈ ఆత్మసమర్థనా, యీ ఆత్మరక్షణాత్మక ప్రతిస్పందనా నా విజయానికి నాందీ వాచకాలు. శవపేటిక కథ యింకా ముగియలేదు. కాని ముగింపు తరుణం ఆసన్నమవుతోంది. నూనె ఒలికిన నున్నటి నాపబండమీద అడుగులేస్తున్నట్లు నేను దాన్ని సున్నితంగా సుతారంగా సమీపిస్తున్నాను.

" 'అన్నట్లు' అంటూ నేను యిలా వ్యాఖ్యానించాను: 'అన్యాయమైన పద్ధతి నాకు నచ్చదు. ఆధునిక చిత్రకళలోని అత్యుత్తమ చిత్రాన్ని నేను ఎంచుకోని మాట నిజమే. నేను నీకు 'క్రిములు' అనే చిత్రం చూపించగలను. చాలా సమ్మోహనకరమైన విషయాంశం అది...'

"సాష నవ్వాడు. అయితే అది ఉద్రిక్తతను తొలగించి, విభేదాలను పరిష్కరించే నవ్వు కాదు. ఇది లోపలి భావాన్ని కప్పిపుచ్చుకునే నవ్వు. దాని వెనుక వాడి సొంత, ప్రచ్ఛన్న ప్రపంచం వుంది. నా కొడుకులో ప్రవేశించి, వాణ్ణి ముంచెత్తిన వినాశకరమైన మనోస్థితిలోంచి వాడు

బయటపడేందుకు నేను తోడ్పడగల మార్గం గురించి నేను బుర్ర బద్దలుకొట్టుకున్నాను.

"నా అదృష్టం కలిసివచ్చింది. 'మెట్రొపొలిటన్ మ్యూజియంకి చెందిన నూరు కళాఖండాలు' అనే అమెరికన్ చిత్రకళా ప్రదర్శనకి నాకు రెండు టిక్కెట్లు దొరికాయి.

"ముందు మేము ప్రదర్శనను గురించిన స్థూల అభిప్రాయంకోసం హాలులన్నీ ఒకసారి తిరిగాం. తర్వాత వాడితో యిలా చెప్పాను: 'ఇప్పుడింక అన్ని చిత్రాల్లోనూ నీకు బాగా నచ్చి నవేమిటో చెప్పు. ఆ చిత్రాలు మరింత పరిశీలనగా చూద్దాం...'

"మొదట వాడు నన్ను ఎల్ గ్రెకో దగ్గరకి తీసుకెళ్ళాడు.

" ' 'టొలేడొ దృశ్యం' బాగా ఆధునికమైన చిత్రం' అన్నాడు సాష. 'ఆధునిక చిత్రకళా ప్రదర్శనశాలలో యిలాంటి చిత్రాలు వున్నాయి. ఇది వేసి 375 ఏళ్లు అయింది. ఈయన స్వీయ చిత్తరువుని బాగా అర్థంచేసుకోవచ్చు. ఈయన కూడా నేను ఆలోచిస్తున్న విషయాలే ఆలోచిస్తున్నట్లు నాకు అనిపిస్తోంది. కాని ఈయన నా కంటె చాలా తెలివైనవాడు...' అని జోడించాడు సాష.

"ఆ తర్వాత మేము జాన్ వెర్‌మేయర్ చిత్రం దగ్గరకి వెళ్లాం. సాష దాదాపు యిలా తర్కించ నారంభించాడు:

" 'ఈ రంగులు దాదాపు కొరోట్ వాడే రంగుల్లాగే వున్నాయి. కాని కొరోట్ రంగులు మరింత నల్లగా, రొమాంటిక్‌గా వుంటాయి. వెర్‌మేయర్‌వేమో లేతగా, వెచ్చదనం చిప్పి లుతూ వుంటాయి...'

"మేము ఆ తర్వాత ఫ్రెంచి ఇంప్రెషనిస్టుల చిత్రాలున్న హాలుకి వెళ్లాం. క్లాడ్ మోనెట్, బొన్నార్డ్, స్యురాట్, రెనోయర్‌ల చిత్రాలు సాషకి నచ్చాయి.

"మేము ప్రదర్శనశాలనుంచి బయటకి వచ్చాక సాష యిలా అన్నాడు:

" 'మనం చూసిన చిత్రాలన్నీ మనిషిని నిజంగానే సమర్థిస్తాయి. కాని డాలీ చిత్రాలు నాకు అర్థం కావు. ఆయన వేటిని సమర్థిస్తాడో, వేటిని ఆరాధిస్తాడో నేను అర్థంచేసుకోలేను.'

" 'మరైతే నీ స్నేహితుల్లో కొందరు డాలీ అంటే ఎందుకు యిష్టపడతారు?' అని అడిగాను.

" 'అదొక ఫేషను' అని వాడు సమాధానం చెప్పాడు. నాకు వాడి స్వరంలో నా సొంత స్వరం ప్రతిధ్వని సూచనప్రాయంగా వినవచ్చింది. 'దానికి తోడు అపారమైన ఊహాశక్తి, టెక్నిక్కు. సత్యాన్వేషణ మనోస్థితి...'

" 'ఏం సత్యం?'

" 'ఏదైనా ఫరవా లేదు, ముందువెనకల్లో ఎప్పుడో ఒకప్పుడు అన్నీ తలకిందులవుతాయి. అందుకే డాలీ ప్రపంచ ప్రళయాన్ని చిత్రిస్తాడు... నువ్వేమిటి ఆలోచిస్తున్నావ్?' అని అడిగాడు వాడు.

" 'నీకు తెలుసా, ఎల్ గ్రెకో డాలీ చిత్రాలు చూసి వుంటే, అతని ముఖం ఎలా

వుండివుంటుందో నేను ఊహించుకున్నాను. మధ్య యుగంలో క్రౌర్యం, భయం తాండవించాయి. అయినా కూడా చిరంతన మానవీయమైన కళ వర్ధిల్లింది. మృత్యువులో కాక జీవితంలో విశ్వాసం వుండేది. నీ చిత్రం విషయంలో నాకు నచ్చిందేమిటంటే, 'జీవించేందుకోసం జీవించడం' అనే శీర్షిక.'

" 'నీకు తెలుసా నాన్నా' అంటూ సాష జవాబిచ్చాడు, 'ఈ రోజున ప్రదర్శన చూస్తూండగా నా మనస్సులో పక్వమైన రెండు అంశాలమీద యింటికి వెళ్లాక బొమ్మలు వేస్తాను.' "

మకారొవ్ కొడుకు విషయంలో అసలు జరిగిందేమిటి? ఇక్కడ నేను మీకు మళ్లీ ఒక సారి గుర్తుచెయ్యాలనుకుంటున్నాను. అసలు సంగతి కళ కాదు, మొత్తంగా జీవితంపట్ల ఆ కుర్రాడు ఎలాంటి వైఖరి వహిస్తాడన్నదే. అతని అభిప్రాయాలు ఏమిటి? మానవుడు రూపొందే క్రమం ఎలా సాగుతుంది? బౌద్ధిక ప్రపంచం ఆదర్శప్రాయమైనదనడం నిజమేననుకోండి. కాని అది తనీగా వస్తు దిశోన్ముఖమైన పునాదిమీద నిర్మింపబడుతుంది...

కళపట్ల వైఖరి మానవుడి మొత్తం బౌద్ధిక ప్రపంచ స్వభావాన్ని తెలియజేస్తుంది. ఒక వ్యక్తి కళని ఎలా అంచనా వేస్తాడో; దాన్ని బట్టి యితరులపట్ల అతని వైఖరిని అంచనా వెయ్యవచ్చు. అందుకే నైతిక మానవీయ భావజాలంలో, మానవ విలువలను కాపాడే భావజాలంలో కళని కూడా చేర్చడం చాలా ముఖ్యం.

కుర్రవాడు జీవితంలో తన మౌలిక వైఖరులను స్వయంగా రూపొందించుకోవాలి, మన పని అతనికి సాయంచెయ్యడం మాత్రమే.

ఒక విషయం మటుకు నిజం, సుందరమైనదాని వైపు పిల్లలు మొగ్గు చూపేలా చేసేందుకు పెద్దలకి స్వయంగా ఆ మంచి అభిరుచి వుండాలి. అభిరుచులను పెంపొందించుకుంటే గాని స్వంత అభిరుచులంటూ ఎవరికీ వుండవు. మకారొవ్‌కి యింటి దగ్గర చిత్ర కళకి సంబంధించిన సాహిత్యమూ, చిత్రాల ఆల్బమ్‌లూ వున్నాయి. చిత్రాలపట్ల ఆసక్తి కల్పించి, వాటిలో ఉద్దేశింపబడిన అంశమేమిటో పెద్దవాళ్లు వివరించి చెప్పినప్పుడు, సజీవమైన చిత్రాలను చూసిన పిల్లల్లో ఏ ఒక్కడూ స్పందించకుండా వుండడు. చిత్రాలను చూసినప్పుడూ, వాటి వివరణలను విన్నప్పుడూ పిల్లలు విధిగా ప్రతిస్పందించితీరుతారు. తర్వాత ప్రకృతి చిత్రాల కేసి దృష్టి మరల్చవచ్చు. పిల్లలు రంగులకి సంబంధించిన భాషకి, కుంచె విసురుల ఉపరితలపు ఎగుడుదిగుళ్లకి, ప్రస్ఫుటమైన కాంతికి (దగ్గర్నుంచి చూసినప్పుడు యిదేమిటో అనిపించవచ్చు, కాని నాలుగడుగులు వెనక్కివేసి చూసినప్పుడు అది కచ్చితంగా తెలుస్తుంది), పలు విభిన్న చిత్రణ శైలులకి అలవాటుపడాలి. ఇలా అలవాటుపడే యీ క్రమమే ఒకరి వ్యక్తిగత అభిరుచులు ఏ పునాదిమీద నిర్మింపబడతాయో ఆ పునాదిని రూపొందిస్తాయి. కొందరికి విషాదాన్ని చిత్రించే రెంబ్రాంట్ నచ్చుతాడు. మరి కొందరికి మహా కావ్యాల్లోని అంశాల చిత్రాలు వేసే వస్నెత్సొవ్ నచ్చుతాడు. ఇలాగే మరొకరికి

మరొకరు. ఒక్కొక్కరికి ఒక్కొక్క చిత్రకారుడు నచ్చవచ్చు, లేక కొందరు చిత్రకారులు నచ్చవచ్చు. పిల్లల్లో ప్రతి ఒక్కరూ తమతమ అభిమాన చిత్రకారుల చిత్రాల ప్రతిరూపాలను సేకరించుకుంటే ఉపయోగకరంగా వుంటుంది.

మీ పిల్లల్ని గది లేక ఇంటి లోపలి అలంకరణ గురించి, దుస్తులు, వాల్ పేపరు, చిత్రాల అంద చందాలను గురించి సాధ్యమైనంత తరచుగా అభిప్రాయం అడుగుతూ వుండండి.

పిల్లలు జాగ్రత్తగా పరిశీలించి చూసి అందమైనదానికీ పేలవమైనదానికీ మధ్య తేడాని గుర్తించడం నేర్చుకునేలా చూడండి. వాళ్లనే స్వయంగా దేన్నైనా మెరుగుపరచ నివ్వండి: తిరిగి పెయింటుచెయ్యడం, సరిదిద్దడం, తిరిగి అంటించడం, కొత్త ప్రతిచిత్రాలను వేలాడదీయడం, వగైరా.

పిల్లలు స్వహస్తాలతో ఏదైనా చేస్తే, దాన్ని పదిలం చేయండి. ఖరీదైన ఒక క్రిస్టల్ వాజు కంటె అది ఎక్కువ విలువైనది. మీ పిల్లల చిత్రాలకి ఫ్రేములు కట్టించగలిగితే, అలా కట్టించి, వాటిని గోడలమీద వేలాడదీయండి.

మీ పిల్లల చిత్రాలు చాలా మేటపడితే, వాటికి ఒక షెల్ఫో లేక అల్బమో తయారుచెయ్యండి.

వాటిలో కొన్ని చాలా ఆసక్తికరంగా వున్నట్లు మీకు అనిపిస్తే, ఇంట్లోనే ఓ చిన్న చిత్ర ప్రదర్శనని ఏర్పాటుచేసి పిల్లల్ని సంతోషపెట్టండి. మరీ ఎక్కువ మందిని దానికి ఆహ్వానించకుండా, అది కుటుంబంలో చేసుకునే పండుగగా వుండనివ్వండి.

చాలా మేగజైన్లకి చిత్రకళానుబంధాలు వుంటాయి: ఒక వ్యాసం, ఒక చిత్ర ప్రతికృతీ వేస్తూ వుంటారు. నెలకి ఏ రెండు సార్లో అయినా యీ అనుబంధాలను గురించి మీరు మీ పిల్లలతో మాట్లాడితే, అది మీ పిల్లల అభివృద్ధికి విశేషంగా తోడ్పడుతుంది.

కళ పిల్లలకి శిక్షణ యిస్తుంది, వాళ్లని ఐక్యం చేస్తుంది, మానసికంగా సుసంపన్నమైన సాంఘిక సాంగత్యాన్ని రూపొందిస్తుంది. ఒక పిల్లవాడు ఒక మంచి పుస్తకం చదివితే, వాడు దాన్ని గురించి తన స్నేహితుడికి విధిగా చెప్తాడు. ఒక పిల్లవాడు ఒక మంచి సినిమా చూస్తే, దానిమీద తన అభిప్రాయాలను తన స్నేహితులకి చెప్తాడు. ఏదైనా ఒక చిత్రం ఒక పిల్లవాడికి నచ్చితే, వాడు తన ఆనందాన్ని యితరులతో పంచుకుంటాడు.

ఇతరులతో కలిసి వున్నప్పుడు, ఒక వ్యక్తి తరచు ప్రకృతి సౌందర్యాన్ని, కళా సౌందర్యాన్ని మరింత చక్కగా, మరింత గాఢంగా అనుభూతి చెందుతాడు. నా స్నేహితుల్లో ఒకడు నిర్మొగమాటంగా యిలా చెప్పాడు: "నా పక్కన ఎవళ్లో ఒకళ్లు లేకపోతే, నేను నిజంగానే ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించలేను. నేను దీన్ని ఎవరితోనో ఒకరితో పంచుకోకుండా చస్తే వుండలేను." మొత్తంమీద, యీ అవసరం బహుశా మనిషి స్వభావ సంపన్నతను తెలపక పోవచ్చు గాని, అది పరమ సహజమైనది. అందమైనదాని లోపల సాంఘిక అంశం, సాంఘిక సంబంధాల శక్తి అంశాన్ని కలిగివుంటుంది. అందుకే తమ పిల్లలతో తల్లితండ్రుల సన్నిహిత సాహచర్యం సౌందర్యగ్రహణ విద్య అభివృద్ధికి మరింత సహజమైన పూర్వావసరాలను కల్పి

స్తుంది. సౌందర్యగ్రహణ విద్యలో ఒక స్కూలు ప్రయోగాన్ని గురించి తెలుసుకునేందుకు తల్లితండ్రులు ఆసక్తి చూపవచ్చునని నేను భావిస్తాను. అది తర్వాత చూద్దాం.

## శ్రమశిక్షణ, నైతిక, సౌందర్యగ్రహణ విద్యల ఐక్యత

గ్రామీణ స్కూళ్లలోని శ్రమశిక్షణను పట్టణవాస స్కూళ్లలోని శ్రమశిక్షణతో పోల్చేటప్పుడు, గ్రామీణ స్కూళ్లలో మంచి అవకాశాలు వున్నట్లు తలచబడుతుంది. సౌందర్య గ్రహణ అభివృద్ధి విషయంలో పోల్చేటప్పుడు, పట్టణవాస స్కూళ్లలో ఎక్కువ అవకాశాలు వున్నట్లు పరిగణిస్తారు. నగరాల్లో నిపుణులు, మ్యూజియంలు, థియేటర్లు అందుబాటులో వుండటమే యిందుకు కారణం. అయితే యిది పూర్తిగా నిజమా?

కొన్ని సంవత్సరాల క్రితం సోవియట్ యూనియన్ విద్యా బోధన శాస్త్రాల అకాడెమీకి చెందిన పరిశోధన ఇన్స్టిట్యూట్ దొనేత్స్క ప్రాంతంలోని ప్రెలేస్త్నోయె గ్రామంలో ఒక ప్రయోగం చెయ్యాలని నిర్ణయించుకుంది. పిల్లల సౌందర్యగ్రహణ శక్తి అభివృద్ధికి గ్రామీణ పరిస్థితులు కొన్ని వీళ్లను కల్పిస్తుందని నిరూపించడమే ఈ ప్రయోగ లక్ష్యం.

కళాత్మక విద్య నైతిక విద్యతో, ప్రధానంగా శ్రమశిక్షణతో అనుబంధితమై వుంటుందన్నది ఈ ప్రయోగపు అసాధారణ విషయాల్లో ఒకటి. అంటే, నిర్ధరింపబడుతున్నవి సమరసమైన, సర్వతోముఖమైన వ్యక్తిత్వాన్ని రూపొందించేందుకు అవసరమైన పరిస్థితులన్న మాట.

ఆ ప్రయోగపు ప్రధాన లక్ష్యం చాలా మందికి సాహసికంగా కనిపించింది. అందుకే అది మమ్మల్ని విమోహితుల్ని చేసింది. మేమీ కింది సూత్రంనుంచి బయల్దేరాం: పిల్లలు బౌద్ధికంగా ప్రతిభావంతులు, కానివాళ్లు అని విభజింపబడి వుండరు. అందరు పిల్లలూ చాలా ప్రతిభా సంపన్నులే. వాళ్లలో ప్రతి ఒక్కరూ అసాధారణ సృజనాత్మక సామర్థ్యం ఉన్నవాళ్లే. బాగా సమున్నతమైన శిక్షణ ఫలితం అనివార్యంగా ఒనగూడే పరిస్థితులను కల్పించడమే మా లక్ష్యం. ఇక్కడ అనివార్యంగా అనే మాటని నేను వక్కాణించి చెప్తున్నాను. ప్రధాన లక్ష్యం యిదీ: పిల్లల్లో సుందరమైనదాన్ని చూసి, అనుభూతి చెందవలసిన అవసరాన్ని మనం జాగృతం చేస్తే, పని సంతోషంతో సమైక్యంచేయబడితే, పిల్లల్లో ప్రతి ఒక్కరి ప్రతిభా వెల్లడి అవుతుంది. పిల్లల వ్యక్తిత్వానికి పూర్తి రక్షణ కల్పించబడుతుందన్న హామీ ఈ పరిస్థితుల్లో ఒకటి. నా ఉద్దేశంలో ఈ పరిస్థితి వ్యక్తి స్వాతంత్ర్యం, సృజనాత్మకతా వాతావరణం. కాగా, పురోగామి సాంఘిక సంబంధాల రూపాలకూ, పిల్లల ఆంతరిక శక్తులను విముక్తంచేసేందుకూ దారితీసే మాదిరి సమష్టితత్వం.

చిత్రంలో పిల్లలు తమ వ్యక్తిత్వాన్ని వెల్లడిస్తారు. వాళ్లు తమ "అంతరాత్మని" మిక్కిలి

సంపూర్ణంగా వ్యక్తంచేసే విషయాంశాలనీ, రంగుల్నీ ఎంచుకుంటారు. "ఇది సరి కాదు" అని పెద్దవాళ్లు చెప్పినప్పుడు చిత్రాలు వెయ్యాలన్న తమ ఆకాంక్షను వాళ్లు కోల్పోతారు. వాళ్లలో అనిశ్చితత్వం చోటుచేసుకుంటుంది. అది "నాకు ఏమీ చేత కాదు" అనే ధోరణిగా మారుతుంది. సుందరమైనదానిపట్ల సమస్తాసక్తి అంతరిస్తుంది.

అందుకే మా ప్రయోగంలో పాల్గొన్న డ్రాయింగు టీచరు అలెక్సాండ్ర్ షెవ్‌చేంకొ తన కృషిలో పిల్లల శక్తుల్ని "బంధ విముక్తం చెయ్యడాన్నీ," పిల్లల ఆ శక్తిలో విశ్వాసాన్ని చొప్పించడాన్నీ ప్రధాన విషయంగా పరిగణించాడు. ఈ పని చెయ్యాలంటే, ఆటలు, ఊహాలోక విహారం, సాయిలాపాయిలా వ్యవహారం ప్రవేశపెట్టబడాలి.

అందుకే షెవ్‌చేంకొ తన చిత్రకళా పాఠాల్ని పెన్సిలు డ్రాయింగులతో కాక, ప్రకాశ వంతమైన వాటర్‌కలర్సుతో ప్రారంభించాడు. "పిల్లల్లో రంగులు చూసినప్పుడు కలిగే ఆనందాన్ని, రంగులపట్లా, సృజనాత్మకతా క్రమంపట్లా ఆనందానుభూతిని రేకెత్తించడమే ప్రధాన విషయం" అంటాడు ఆయన. "పిల్లలు ఎప్పుడైతే ఒకసారి ఆనందంలో ముంచెత్త బడతారో, అప్పుడిక వాళ్లు సంశ్లిష్టమైనవాటిపట్ల తమ దృష్టిని సారించి, టెక్నిక్కులను వశంచేసుకుంటారు... తమ సొంత పద్ధతిలో వాళ్లు పెన్సిలునీ, రేఖనీ, డ్రాయింగునీ చేబడతారు..."

ఆయన పిల్లలకి తమ గ్రామాన్ని శ్రద్ధగా పరిశీలించడం, తొలి ఆకుపచ్చని మొలకల స్పర్శానుభూతిని గుర్తుంచుకోవడం, వెచ్చని సూర్య కిరణాల స్పర్శ సుఖం అనుభవించడం, రాత్రి నిశ్శబ్దపు మౌన సంగీతం వినడం, ప్రతి చెట్టులోనూ సజీవాత్మను చూడటం నేర్పు తాడు. అంతే కాదు, ఆనందంతో పరవశించడం నేర్పుతాడు. అత్యంత "భయానక విష యాంశం" సైతం నిజమైన నవ్వును ఉత్పన్నంచెయ్యవచ్చు. ఉదాహరణకు, "అడవిలో ఎంత భయంకరంగా ఉందో" అంటూ వుంటారు పిల్లలు. కాని యిప్పుడింక అంత మరీ భయం కరంగా లేని తోడేళ్లనూ, పందుల్లా కనిపించే ఎలుగుబంట్లనూ చూసి పిల్లలు ఎంతగా నవ్వారో...

పని ప్రధాన లక్ష్యం పిల్లల ఆనందం, వాళ్ల నవ్వు, వాళ్ల ఉత్సాహం దిశగా ఉన్ముఖం చేయబడాలన్న విషయం జాగ్రత్తగా గుర్తుంచుకోండి. వీటికి తోడు జలపాత సదృశమైన ప్రోత్సాహాలు! క్లాసు జరిగేటప్పుడు యీ ప్రేరణ ఉరవడి ప్రతి ఒక్కర్నీ ముంచెత్తి తీరుతుంది. అసలు ఆ చిత్రకళా క్లాసు గుమ్మం దగ్గరే మొదలవుతుంది: "వసంత సమీరాన్ని ఎవరు చిత్రిస్తారు?" అంటూ తరగతి గదిలో అడుగుపెడుతూనే అలెక్సాండ్ర్ షెవ్‌చేంకొ సవాలు చేస్తాడు. ముగ్గురు పిల్లలు బ్లాక్‌బోర్డు దగ్గరకి దూసుకువెళ్తారు.

చాక్ పీసుల టకటక శబ్దంతో బ్లాక్‌బోర్డు ప్రతిధ్వనిస్తుంది. ఒక చిత్రంలో ఇళ్లు వున్నాయి. చిమ్నీతో బాటు పొగని గాలి తోలుకుపోతోంది. మరో చిత్రంలో విల్లో చెట్ల కొమ్మలూ, పోప్లార్ చెట్లూ ఛిన్నాభిన్నమైన మేఘాల్ని విసిరి కొడుతున్నాయి.

టీచరు యిలా అన్నాడు: "ఈ చిత్రాలన్నీ అద్భుతంగా వున్నాయి. అయితే, వీటికి

యింకేం జోడించవచ్చు? ఏ వివరాలు చేర్చవచ్చు? కిటికీలోంచి బయటకి చూడండి!''

...మరో ఎక్సర్‌సైజు. దీన్ని ఊహా శక్తి శిక్షణగా నేను పరిగణిస్తాను. టీచరు బ్లాక్ బోర్డుమీద ఒక వంకర గీత గీస్తాడు. పిల్లలు దాన్ని పొడిగించి దానికి వాళ్లు గుర్తించదగిన ఒక వస్తు రూపం యివ్వాలి. ఈ వంకర గీతనుంచి పిల్లల్లో ఒకరు అకస్మాత్తుగా ఒక కారును సృష్టిస్తే, మరొకరు ఒక మొసలినీ, వేరొకరు ఒక మనిషినీ, యింకొకళ్లు ఒక పాదరక్షనీ సృష్టిస్తారు. తరగతి గదిలో పిల్లలు సందడిగా నవ్వుతూ వుంటారు. తరగతిలో అత్పుత ప్రదర్శితమవుతుంది. పిల్లల్లో ప్రతి ఒక్కరూ దానికి ఏదో ఒకటి చేర్చాలనీ, ఏదో ఒకటి చెప్పాలనీ తహతహలాడతారు. "చూశారా, ఒకే ఒక్క గీత, ఒకే ఒక్క చిన్న గీత ఎంత భావాన్ని వ్యక్తంచెయ్యగలదో. మీలో ప్రతి ఒక్కరూ దాన్ని ఎంత వేర్వేరుగా చూస్తారో'' అంటూ డ్రాయింగు టీచరు ముగిస్తాడు.

"మంచు ఏ రంగులో వుంటుంది?'' అంటూ షెవ్‌చేంకొ కొనసాగిస్తాడు. "నీలం, ఎరుపు, లేత ఎరుపు, అది మెరుస్తుంది!'' అంటూ సమాధానాలు వస్తాయి. "ఇళ్ల పైకప్పులు చూడండి!'' అంటాడు ఆయన. ఆయన ఆ మాట అన్న పద్ధతిలో ఇళ్ల పైకప్పుల కంటె ఎక్కువ అందమైనవి ప్రపంచంలోనే మరేవీ లేవన్న ధ్వని స్ఫురిస్తుంది.

తర్వాత టీచరు మొదటి వాటర్‌కలర్ చిత్రాలు తీస్తాడు. వాటిలో ప్రతి ఒక్కదాంట్లోనూ ఏదో ఒక వ్యక్తిత్వం, పూర్తి అసాధారణత్వం ఆయనకి కనిపిస్తుంది. లోపాలను చూపించినప్పటికీ, పొగడ్త విషయంలో ఆయన పిసినారితనం చూపడు...

నేనిక్కడ విజయవంతమైన ఏవో కొన్ని చెదురుబదురు పరిష్కారాలను పేర్కొనడం లేదు. అపురూపమైన బోధన క్రమంలో రోజుల తరబడి పట్టుదలగా పునఃపునః వినియోగింపబడిన ఒక పద్ధతిని నేనిక్కడ వివరిస్తున్నాను. ఈ పునః పునర్వినియోగం అందర్నీ ఉత్తేజితం చేసి, ఆత్మవిశ్వాసాన్ని కల్పించే పిల్లల శక్తియొక్క సృజనాత్మక క్షేత్రాన్ని ఉత్పన్నంచేస్తుంది. ఉద్దేశపూర్వకంగా "పునఃపునః చేయడం''లో విచక్షణా సూత్రం, శ్రద్ధా సూత్రం వినియోగింపబడతాయి. అలెక్సాండ్ర్ షెవ్‌చేంకొ తన డైరీలో యిలా వివరిస్తాడు:

"పెయింట్ల పెట్టె తీసుకొని వచ్చిన ఒక అమ్మాయి యితర పిల్లలు చిత్రాలు వేస్తున్న గదిలోకి బిడియంగా ప్రవేశిస్తుంది. కాగితంమీద ఆమె తొలి ప్రయత్నాలు – నలుపు, నారింజ రంగులు, ఆకుపచ్చ చుక్కలు, గీతలే. ఆమె కళ్లలో గాభరా, సిగ్గు తొంగిచూస్తున్నాయి: 'నాకు చేతకాదనిపిస్తోంది...' అదిగో సరిగా యిలాంటప్పుడే యీ దుర్బలమైన, కోమలమైన మొలకకి ఆత్మ విశ్వాసం, తనేమైనా చెయ్యగలదన్న స్థైర్యం కల్పించాలి. నేనామె చిత్రాన్ని యితరులకు చూపించి, యిలా అన్నాను: 'చూడండి పిల్లలూ, యిదో దేవతా కథ! ఇదే దేవతా కథలోదో చెప్పుకోండి చూద్దాం?' నా లోలోపల గడ్డకట్టించే భయం కలిగింది. 'వీళ్లకి అర్థం కాకపోతేనో! ఈ పిల్లకి ఎంత ఆఘాతమవుతుంది' అనిపించింది. పిల్లలు నా గాభరాని గమనించి యిలా అరిచారు: 'గొరీనిచ్ రాక్షసి అడవి మీంచి ఎగురుతోంది!', 'ఇవి అడవి

లోని పెద్ద చెట్లు!' చిన్న పిల్లని గాభరా పెట్టేయ్యకూడదు, చిత్రాలు వెయ్యడంలో అతి స్వల్ప సామర్థ్యం వున్నా కూడా ఆమెకి ఆత్మవిశ్వాసం కల్పించాలి. రంగులన్నా, గీతలన్నా ఆమెకి ప్రేమ కలిగించాలి. ఆమెకి సృజనానందాన్ని అనుభూతం చెయ్యాలి. సృజనాత్మక క్రమంలో పొందే ఆనందం ద్వారా మాత్రమే పిల్లలు గీతలకీ, లెక్కిక్కుకీ చేరుకుంటారు."

మా ప్రయోగంలో పిల్లల్లో ప్రతి ఒక్కరూ — అతి బలహీనులుగా, బొత్తిగా గ్రహణ శక్తి లేనివాళ్ళుగా కనిపించేవాళ్ళు సైతం — అందమైనదాన్ని దర్శించగలిగారు, సృజించగలిగారు. ఆ మాదిరి పిల్లవాడొకడు లోపలికి వచ్చి, కూర్చుంటాడు, తన చుట్టూ చూస్తాడు. షెవ్‌చేంకొ తొందర చెయ్యడు. కాని ఆయన ఇలా అనవచ్చు: "చూడు, వాన్య తన చుట్టూ ఎలా శ్రద్ధగా చూస్తున్నాడో. అందమైనదాన్ని చూడగలగడం వుందే — అదప్పుడే చాలా ముందడుగే!" మరి ఆ చిన్న కుర్రాడికి హుషారు కలుగుతుంది, తన సామర్థ్యాలు పరీక్షించుకోవాలని ఆతురపడతాడు. నిజంగానే, కొద్ది కాలానికి వాడు చిత్రాలు చక్కగా వేస్తూ వుంటాడు. ఇదిగో యీ రక్షిత భావమే — పిల్లల్లో ప్రతి ఒక్కరిపట్లా టీచరుకి వున్న యీ శ్రద్ధే — ప్రతి ఒక్కరి సామర్థ్యాల ఆవిష్కరణకి షరతు.

...యూరకి డ్రాయింగులో ఒక ప్రత్యేక పద్ధతి వుంది. వాడికి ఇండియన్ ఇంకుతోనూ, మాజిక్ మార్కర్లతోనూ చిత్రాలు వేయడమంటే మహా యిష్టం. వాడి గీతలు వాడి పెన్ను పరుగులే. వాడి బామ్మ మొదట వాణ్ణి ఆపుచెయ్యాలన్న ప్రయత్నంలో "ఏమిట్రా ఆ తొందర పాటు, కాస్త తాపీగా వెయ్యకూడదూ. చూడు, మిగతా పిల్లలందరూ వాళ్ళ బొమ్మలు ఎలా నెమ్మదిగా వేస్తున్నారో..." అంది. యూర ఆవిడ సలహాని పెడచెవినపెట్టి యిలా అన్నాడు: "అది కాదు బామ్మా, అలెక్సాంద్ర్ ఇవానొవిచ్ నేను నా సొంత శైలిని పెంపొందించు కుంటున్నానని చెప్పారు తెలుసా..."

ఆయన చెప్పింది రైటు. పిల్లల విడివిడి వ్యక్తిత్వాన్నీ, వాళ్ళ అంతరంగపు అత్యుత్తమ అభిముఖ్యాన్నీ పరిగణనలోకి తీసుకోవడం అతి ముఖ్యం.

మరో ఉపాఖ్యానం. పిల్లలు ఆకురాలు కాలాన్ని చిత్రిస్తున్నారు. కుర్రాళ్ళలో నలుగు రికి అకస్మాత్తుగా తమ ప్రకృతి చిత్రాలకి వేర్వేరు ఆకుల పసర్లను రంగులుగా వాడాలన్న భావం స్ఫురించింది. అందుకని వాళ్ళు నిగనిగలాడే ఆకులకోసం శ్రద్ధగా వెతకడం మొదలు పెట్టారు. వాళ్ళలో ఒకడు ముదురు రంగులకోసం వెదికేందుకు చిత్తడినేల దగ్గరకి వెళ్ళాడు. వాడి సహచరులు వాణ్ణి అనుసరించారు. నా వెనక నతాషా కుతూహలంతో కొట్టుకుపోతోంది. ఈ రాకాసి కుర్రాళ్ళు ఎప్పుడూ ఏదో ఒక కొత్త ఆలోచన చేస్తూవుంటారు, ఇప్పుడు వాళ్ళు చేస్తున్నదేమిటో కూపీ తియ్యాలని తహతహలాడింది. టీచరు ఆమెతో "ఓపిక పట్టు, ఇది వాళ్ళ రహస్యం!" అని, చిరునవ్వు నవ్వాడు. కాని నతాషా కళ్ళు మండుతున్నాయి, ఆమెకి ముళ్ళమీద నిలబడినట్లుంది. "నేనింక ఆగలేను" అని, లేచి నిలబడింది. కొద్ది నిమిషాల తర్వాత చిత్తడినేలనుంచి చేతినిండా బురదలా కనిపించేదేదో తెచ్చింది, "ఇంతవరకు ఎవరూ

చెయ్యనిదేదో నేను చెయ్యబోతున్నానోహోయ్!'' అని అంటున్నట్లు ఆమె ఆ బురదని కాగితం మీదకి విసిరింది. ఆమె చేతులు మహా వేగంగా, మహోన్మత్తంగా, ఎంతో సొగసుగా కదల సాగాయి. దానితో ఆమె చుట్టూ వున్న పిల్లలందరూ నోళ్లు తెరుచుకుని చూడసాగారు. నతాషా కాగితంమీద చెట్టు బెరడు ముక్కతో చేసిన కళ్లు, షర్టుమీద ఎర్రటి గుండీలు, ఆకులతో చేసిన బంగారు బెల్టు దర్శనమిచ్చాయి...

పిల్లల సృజనాత్మక ఉత్సాహం జ్వలించే యీ క్షణమే అన్వేషణ, ఆవిష్కరణలపట్ల పిల్లల ఆసక్తినీ, ఆనందాన్నీ ఉత్పన్నంచేస్తుంది. ఈ ఆనందమయ క్షణాలను ఆవాహనచేసే సామర్థ్యం విడి నైపుణ్యాలను నేర్పే డజన్లకొలది పద్ధతుల కంటె ఎంతో ముఖ్యం. ఎందు కంటే, పిల్లల సంతోషకరమైన ప్రేరణ లేనిదే యీ "పట్టి నేర్పడం" అర్థరహితం.

చుట్టూ వున్న పరిస్థితులను, అంటే గ్రామాన్ని, పిల్లల ఇళ్లని, వాళ్ల తల్లితండ్రుల పని చోట్లని మార్చడంతో ముడిపడి వుంది మా ప్రయోగపు రెండవ పార్శ్వం.

షెవ్‌చేంకో, నేనూ డ్రాయింగు పాఠాలకి సంబంధించిన ఒక ప్రాయోగిక కార్యక్రమాన్నీ, దానికి తోడు డ్రాయింగులో, రష్యన్, ఉక్రేనియన్ భాషల్లో, చరిత్రలో, శ్రమశిక్షణలో కచ్చితంగా సృజనాత్మకమైన విషయాంశాలనూ తయారుచేశాం. ఈ సమగ్ర కార్యక్రమాలు (కళ, సాహిత్యం, చరిత్ర, శ్రమశిక్షణ) ఏ పరిస్థితిలో అయితే సౌందర్యగ్రహణాత్మక మెచ్చి కోలు అంశాలు జీవితంపట్ల పిల్లల దృక్పథంలో అంతర్భాగమవుతాయో, పిల్లల బౌద్ధిక విలువలను ధృవీకరించే క్రియాశీల మార్గాల్లో ఒకటీ, పిల్లలకి పనితో పరిచయం చేసే మార్గమూ అవుతాయో ఆ పరిస్థితికి దారితీస్తాయి. అందుకే ఈ కార్యకలాపాలు ఆయా సబ్జెక్టుల టీచర్లని ఐక్యంచేస్తాయి.

ఐదో తరగతి అమ్మాయి గాల్యా జబోరోస్క్యయా షెవ్‌చేంకొ దగ్గరకి ఒకసారి తను వేసిన వాటన్నింట్లోకీ మంచి చిత్రాన్నీ, దాన్ని గురించి తను రాసిన కాంపోజిషన్‌నీ తీసుకొచ్చింది. గాల్యా ఒక ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రంలో ఒక నెల పాటు పనిచేసింది. అందుకే ఆ అమ్మాయి తమ దళ నాయకురాలు లేనా ఆంటీ బొమ్మ వేసింది. ఆ చిత్రంలో లేనా ఆంటీ నదరైన అంద మైన ఎర్ర పూల నీలం రంగు తల రుమాలు కట్టుకొని, ప్రభుత్వ క్షేత్రపు నూర్పిడి యంత్రం దగ్గర నిలబడి వుంది. ఆమె చుట్టూ అప్పుడే నూర్చిన గోధుమ ధాన్యం వుంది. "లేనా ఆంటీకి 40 ఏళ్లు. ఆవిణ్ణి అందరూ గౌరవిస్తారు. ఆవిడ బాగా పనిచేస్తుంది. ఆవిడ ముఖం సొగసుగా వుంటుంది. ఆవిణ్ణి చూస్తేనే తెలిసిపోతుంది ఆవిడ తెలివైనదని. లేనా ఆంటీ అందర్లోకీ మణిపూస!"

పిల్లల చిత్రాలు సమష్టి వ్యవసాయ క్షేత్ర రైతుల మానసిక ప్రపంచంతో కలిసి, వాళ్ల పని దినంలో సజీవమైన భాగం అయ్యాయి. ఇది చాలా ఏళ్ల పాటు శ్రద్ధగా చేసిన కృషి ఫలితం. ఈ కృషిలో శ్రమ, కళల ద్వారా నికరమైన పౌరసత్వానికీ, దేశభక్తిపూరిత విద్యకీ సంబంధించిన మహత్తర భావం పడుగు పేకలుగా అల్లబడింది. ప్రభుత్వ వ్యవసాయ

క్షేత్రపు ఛైర్మన్ కాన్‌స్తంతీన్ లిసాక్ షెవ్‌చేంకొ పాత్రలపట్లా, ఆయన చిత్రకళా స్టూడియో అభివృద్ధిపట్లా చాలా ఏళ్ల పాటు సన్నిహితమైన నిఘావేశాడంటే, అందుకు మంచి కారణమే వుంది. ఆయన స్టూడియోకి వచ్చినప్పుడల్లా "బహుశా రంగులు, కేన్వాసులు, పొరుగు గ్రామంలో చిత్రాల ప్రదర్శన ఏర్పాటుచేసేందుకు వీలుగా కారు వంటివేమైనా కావాలేమో?" అంటూ వుంటాడు.

ఈ కృషి అంతా విద్యా సిద్ధాంతపు అనేక మూలాంశాలకు, ప్రత్యేకించి "సమష్టి" భావనకు సంబంధించిన పూర్తి కొత్త అవగాహనకు దారితీసింది. ఒక్క టేబిలు దగ్గర ఒకటో తరగతి పిల్లలు, మరింత పెద్ద పిల్లలు, టీచర్లు, సమష్టి వ్యవసాయ క్షేత్ర రైతులు వున్నారు. వాళ్లందరికీ ఒక ఉమ్మడి ఆసక్తి వుంది. వాళ్లందర్నీ ఐక్యంచేసే ఒక ఉమ్మడి విషయాంశం వుంది. ఆంబ్యులెన్సు డ్రైవరు నికొలాయ్ కర్వేంకొ ఒక పెయింటింగ్ వేశాడు. దానికి అతను "కమ్మరి కార్ఖానా" అని శీర్షిక పెట్టాడు. పిల్లలకి ఆ బొమ్మ తెగ నచ్చింది. పిల్లల కళా బృందానికి నాయకుడైన సమష్టి క్షేత్ర చిత్రకారుడు నికొలాయ్ జీజ్‌చెంకొ వేసే ప్రతి చిత్రమూ ప్రతి ఒక్కరికీ కన్నుల పండుగ. సాయంత్రం పూటల్లో పిల్లలు చిత్రకళని గురించి పెద్దవాళ్లతో బోలెడు సంగతులు మాట్లాడుతారు. టేబిలుమీద సెరోవ్, ఎల్ గ్రెకో, వాన్ గోగ్, రెనోయర్‌ల చిత్రాల ప్రతికృతులు వున్నాయి. ఈవిధంగా మానసిక విలువలు పిల్లల్నీ, పెద్దల్నీ ఐక్యంచేస్తాయి. సమష్టి స్వయంకృషికి ప్రతి ఒక్కని వ్యక్తిగత సృజనాత్మకతా తోడై పిల్లల నికరమైన సమరస అభివృద్ధికి ప్రేరణను కల్పిస్తుంది.

## సత్‌పౌరత్వ బోధనలో ఓనమాలు

బాల్యానికి విశిష్ట లక్షణాలు గ్రాహ్యత, ఉత్సాహాలు మాత్రమే కావనడం స్పష్టం. నిస్సహాయత, పేచీకోరుతత్వం, ఆలోచనా రాహిత్యం, గప్పాలు కొట్టడం, సామాన్యంగా కుర్రతనం అనబడే లక్షణాలు కూడా వున్నాయి. కౌమార వయస్కులు తమ మానసిక అభివృద్ధిలో వెనకబడి వుంటే, శిశు స్వభావం, సృజనాత్మకత వంటి అద్భుతమైన గుణాలు (యీ మాటల్ని కొందరు మనస్తత్వ శాస్త్రవేత్తలు ఆవిష్కరణ సామర్థ్యాన్ని గురించి వాడినంతగా, వయో పరిమితిని గురించి వాడలేదు) అనివార్యంగా మలిగిపోతాయి, క్షీణించి పోతాయి.

ఈ సందర్భంగా మహత్తర స్పానిష్ సాహితీ వీరుడు డాన్ క్విక్సోట్ నా మనస్సులో మెదులుతున్నాడు. నా దృష్టిలో అలుపుసొలుపుల్లేని అపారమైన బాల్యసహజ శక్తిని విలువ కున్నాడు డాన్ క్విక్సోట్. అతనిది కుర్రతనమా?

డాన్ క్విక్సోట్ అద్భుతమైన శిశు స్వభావానికి మూర్తీభావం అని నాకు అనిపిస్తుంది.

పోరాడాలా, వద్దా అన్న ప్రశ్న అతనికి ఎదురు కాదు. ఏదైనా చెడ్డదైతే, దానిమీద తను పోరాడ వలసిందే అని అతనికి తెలుసు. ఒక వ్యక్తి అంతరాత్మలో డాన్ క్విక్సోట్ జాగృతుడైతే, అది ఆ వ్యక్తి నిస్సహాయతకీ, పసితనానికీ సూచన కాదు. అది ఆ వ్యక్తి పదిలపరుచుకున్న బాల్యానికి, యౌవనానికి, బహిరంగతకి – యేవి లేనిదో మహత్తర నైతిక ఆశయాల ధ్రువీకరణ వుండదో ఆ లక్షణాలకి – మాత్రమే సూచన.

డాన్ క్విక్సోట్ ఎంతో అందంగా, పరిశుద్ధంగా ప్రేమలో పడతాడు! దుల్సీనియా లేని ప్రపంచం అతనికి చాలా చిన్నది. ప్రేమ, సౌందర్యాలు లేనిదే ఏ నిజాయితీ అయిన ఆదర్శమూ వుండజాలదు. బాల్యం ఎప్పుడూ అనివార్యంగా ప్రేమలో పడిన స్థితి. ప్రేమకోసం, స్నేహం కోసం, సాహచర్యంకోసం నిరీక్షణకి సంబంధించిన వేదనతో కూడిన ఆనందం.

ఒక వ్యక్తి భవితవ్యం సమస్తం అతని బాల్యంమీద ఆధారపడి వుంటుందని అంటూ వుంటారు. ఇది నిజమే. అయితే యింత మాత్రాన, ఒకరి బాల్యం క్రూరమైనదైతే, ఆ వ్యక్తి కూడా క్రూరుడవుతాడని దీని అర్థం కాదు. బాల్య జీవితానికీ, వయో జీవితానికీ అలాంటి ప్రత్యక్ష సంబంధం వుండదు.

అయితే దురదృష్టవశాత్తూ, అకాల వృద్ధాప్యం అనే విరోధాభాస మనకి తటస్థపడుతూ వుంటుంది.

బాల్య స్వభావం, సత్వర వయస్కత. బాల్య స్వభావం, అకాల వయస్కత. అకాలమైన, విసుగుపుట్టించే, నిరాశావహమైన, సంయమ తరుణ వృద్ధాప్యం.

"ఒక స్నేహితుణ్ణి కాపాడటమా? అన్యాయానికి వ్యతిరేకంగా పోరాడటమా?" అంటూ తర్కించుకుంటాడు పదో క్లాసువాడు. "కొట్లాటలోకి దిగేటంత మూర్ఖుణ్ణేమీ కాను" అనుకుంటాడు.

ఇలాంటి కుర్రాడిలో అప్పుడే అకాలమైన దుర్భావంతో కూడిన "సత్వర వయస్కత" చోటు చేసుకుందన్న మాట. మరింత సరళంగా చెప్పుకోవాలంటే, లాభనష్టాలు మదింపు వేసుకునే, అవకాశవాద వ్యక్తి పెరుగుతున్నాడన్న మాట.

వేర్వేరు దేశాల్లో మనుషులు వేర్వేరు విధాలుగా పెరుగుతారు. అయితే ప్రపంచపు అన్ని మూలల్లో కూడా పెరగడం అన్నది సిసలైన వ్యక్తి అవడం, దానికి దారితీసే మార్గాలు ప్రతి ఒక్క సందర్భంలోనూ అపూర్వంగానే వుంటాయి.

...వాళ్ల బోడిగుళ్లు ఎండలో తెల్ల పుచ్చకాయల్లా మెరుస్తున్నాయి. "దీర్ఘ కేశ వ్యతిరేకులు" అందరూ 15 ఏళ్ల వయస్సువాళ్లు. వాళ్లు తమ జుట్లు నున్నగా గొరిగించుకున్న దానికి పాక్షిక కారణం సాహసం, మరో పాక్షిక కారణం ఓ కొత్త ధోరణిని ప్రవేశపెట్టే ప్రయత్నం. వాళ్లు తమ బోడిగుళ్లతో వాతావరణాన్ని సవాలుచేస్తున్నారు. "మాకు దీర్ఘ కేశాలు వున్నప్పుడు మమ్మల్ని ఈసడించారు. ఇప్పుడు మాకు అసలు జుట్టే లేదు గనుక మమ్మల్ని పిచ్చివాళ్లు అంటున్నారు!" అని వాదిస్తున్నారు.

వాళ్ల ముఖాలు కూడా అత్యంత వేదనాభరితంగా వున్నాయి.

నా మటుకు నేను కౌమార వయస్కుల జుట్టు పొడవునే అతి ముఖ్య విషయంగా పరిగణించను. అయితే నేను బోడిగుండును సైతం అంతగా పట్టించుకోను... ఈ "అయితే" దగ్గర నేను ఆపుచేస్తాను.

అంతర్జాతీయ యువ పయనీర్ శిబిరంలో ఫ్రాన్సు, అమెరికా, ఆస్ట్రేలియా, జపాను, పశ్చిమ జర్మనీ, వగైరా దేశాలనుంచి వచ్చిన పిల్లల్ని నేను కలుసుకున్నాను. ఈ పిల్లలు ఆ శిబిరంలో సోవియట్ బాలబాలికలతో కలిసి తమ సెలవలు గడుపుతున్నారు.

ఆ పిల్లల జుట్లు భిన్నభిన్నంగా వున్నాయి. అమెరికన్ మార్క్ మాక్‌ఫర్ట్ "బ్రష్ కట్" (పొట్టి జుట్టు)కీ నొవొసిబిర్స్కనుంచి వచ్చిన సెర్యోజ అలెక్సేయెవ్ పొడుగు జుట్టుకీ మధ్య వేర్వేరు పొడవుల జుట్లు కలిగిన వాళ్లు వున్నారు. అయితే, వాళ్ల మధ్య ఉమ్మడి అంశాలు కూడా బోలెడు వున్నాయి: వాళ్లది శాంతికోసం పోరాడుతున్న తరుణ వయస్కుల బృందం. వీళ్లందరూ ప్రగతిశీల యువజన సంఘాల సభ్యులు. వాళ్లు ఏక రీతిగా ఆలోచిస్తున్నారు.

వాళ్లందరిలో బాల్య స్వభావమూ — వాళ్లందరికీ ఆటలన్నా, వాదించుకోవడమన్నా, ఏటవాలుగా వున్న కొండలు ఎక్కడమన్నా, అంతులేని పోటీల్లో పాల్గోవడమన్నా యిష్టం, — పౌర దృష్టీ సమ్మిళితమై వున్నాయి. "నా తుపాకి విసిరేస్తాను... నేనింక యుద్ధ విద్య నేర్చుకోను..." అన్న గేయాన్ని అమెరికన్ పిల్లలు అద్భుతంగా పాడారు. సెవస్తోపోల్‌లోని "విజయ దిన వందనం!" అనే పర్వదినం గురించి వాళ్లు మహోత్తేజంగా వర్ణిస్తూంటే వినవలసిందే! నాజీజానికి వ్యతిరేకంగా జరిగిన దేశభక్తియుత మహా యుద్ధంలో నేలకొరిగినవాళ్ల సంస్మరణార్థం అక్కడ పుష్ప మాలలు సముద్రంలో విడవబడతాయి.

కౌమార వయస్కులకి ఏ బరువు బాధ్యతలూ, బాధలూ, వేదనలూ వుండవనడం నిజం కాదు. వాళ్ల సంవేదనలు చిత్తశుద్ధితో కూడినవి, వాళ్లు ఆరాటపడతారు, వేదన చెందుతారు. ఇవి లేనిదే సిసలైన వ్యక్తి అయ్యే క్రమం వుండజాలదు. కన్నీళ్లు — ఎంత బాధాకరమైనవైనా సరే — ఆత్మని శుద్ధి చేయగలవు. ముఖ్యాంశం యేమిటంటే, కుంగిపోకపోవడం, ద్వేషం పెంచుకోకపోవడం. "సరేలే, నా తడాఖా ఏమిటో మీకు చూపించకపోనులే!" అనే బెదిరింపు ద్వేషంగా మారకపోవడం ముఖ్యం. ఒకరి ఆవేశాన్ని దయ అదుపులో పెట్టగలదన్న విషయాన్ని పెద్దవాళ్లు పిల్లలకి నేర్పడం కీలకమైన విషయం.

రీగాలో ఒక సెకండరీ స్కూల్లోని టీచర్లతోనూ, విద్యార్థులతోనూ నేను జరిపిన సంభాషణలు, చర్చల మూలంగా కొన్ని ఆసక్తికరమైన నిర్ధారణలు లభించాయి. మనుషుల ఆనందానికి సంబంధించిన రెండు సూత్రాలను మేము కనిపెట్టామని అనుకున్నాం. వీటిలో ఒకటి "స్వ" (యూరపియన్ మనస్తత్వ శాస్త్రంలోనూ యీ పదం వాడుకలో ఉంది, మనం దాన్ని యిలాగే పిలిచాం). వ్యక్తి మానసిక, శారీరక శక్తి స్వయం సాధన అవీ, స్వయం

వ్యక్తీకరణ అనీ, స్వయం వాస్తవీకరణ అనీ, ఆత్మ చైతన్యం, స్వయం శిక్షణ, స్వయం కార్యాచరణ అనీ దీని అర్థం. వ్యక్తి సర్వతోముఖాభివృద్ధే సోషలిస్టు సమాజంలో పిల్లల పెంపకపు లక్ష్యం. అందుకనే, వ్యక్తి సామర్థ్యాలన్నింటి వ్యక్తీకరణ సమస్య అతి ముఖ్యం. సరిగా యీ "స్వయం వ్యక్తీకరణ"లోనే సంగీతంలో, చిత్రకళలో, సాహిత్యంలో, పనిలో, సైన్సులో, క్రీడల్లో మగ్నతలో నికరమైన స్వేచ్ఛా, అభిరుచులూ, విశిష్టతలూ వ్యక్తమవుతాయి.

సహభాగస్వామ్యం, సహకారం, సానుభూతి, జాలి, సహకృషి, సంఘీభావం లేనిదే ప్రతిభని లేక స్వయం వాస్తవీకరణని ఆవిష్కృతం చేయడమన్నది వుండదు (సరిగా యీ విషయంలోనే సోవియట్ మనస్తత్వ శాస్త్రం బూర్జువా మనస్తత్వ శాస్త్రంతో విభేదిస్తుంది).

రీగాలో నావితా కూక్ల అనే చాలా ఆసక్తికరమైన ఒక వ్యక్తిని నేను కలుసుకున్నాను. ఆవిడ చరిత్ర టీచరు. ఆవిడ స్కూల్లో ఒక "రాజకీయ క్లబ్బు"ను ఏర్పాటుచేసింది.

వ్యక్తి రాజకీయ వ్యక్తిత్వం — పరిణతికి ప్రధాన సూచికల్లో యిదొకటి — రెండు స్థాయిల్లో రూపొందుతుంది. క్రమబద్ధమైన పాఠ్య ప్రణాళిక ఒకటి వుంటుంది. ఈ స్థాయిలో అన్నీ — నేర్చుకోవడం, సమాధానాలు చెప్పడం — ఒక పథకం ప్రకారం జరుగుతాయి. పోతే రెండవ స్థాయి వుంది. ఈ స్థాయిలో సీనియర్ విద్యార్థులు సమావేశమై ఆయా విషయాలు చర్చిస్తారు, యితర మూలాధారాలనుంచి సేకరించిన సమాచారం జోడిస్తారు. వాళ్లు ప్రసిద్ధ వ్యక్తుల్ని గురించి జ్ఞాపకంచేసుకుంటారు. రాజకీయాలను గురించి, ప్రజల భవితవ్యాలను గురించి, చరిత్రలో స్వయంగా తమ మగ్నతను గురించి సుదీర్ఘ చర్చలు జరుగుతాయి. ఇదిగో ఈ స్థాయిలోనే పాఠ్యేతర విషయాలు దొర్లుతాయి. అన్నప్పుడూ యితరులకి చెప్పని అంశాలు, తాతో, బామ్మో చెప్పిన అత్యంత సన్నిహితమూ, మిక్కిలి ప్రియమూ, లేక అత్యంత విషాదకరమూ అయిన ఘటనల వివరాలు బయటకి వస్తాయి. ఈ రెండు స్థాయిలనీ మేళవించడం ముఖ్యం.

రీగా "రాజకీయ క్లబ్బు" యీ రెండింటినీ మేళవించింది. సాంఘిక విషయాలను అంచనా వేయడం పిల్లలకి నేర్పబడుతోంది. ఈ అంచనా అన్నప్పుడూ సరిగా వుండకపోవచ్చు. అయితే అది వాళ్ల సొంత అభిప్రాయం. వాళ్లు ఆలోచించి, చర్చించి చేరుకున్న అభిప్రాయం. వాళ్ల అంచనాలను గౌరవించవచ్చు — అది ధ్యానానికి చిహ్నం, అందుచేత పరిణతికి చిహ్నం.

పిల్లలు వేర్వేరు దేశాల్లో వేర్వేరు పద్ధతుల్లో పరిణతులవుతారు. "నేను నిజంగా పెద్దవాడినయానా?" అన్న ప్రశ్నకు ప్రతి ఒక పిల్లవాడూ తనకి తాను సమాధానం చెప్పుకుంటాడు. "ఔను, మీరు పెద్దవాళ్లే — మీరు చెప్పేదానికీ చేసేదానికీ మధ్య సంబంధంలో అనుస్యూతి వుంటోంది, మీరు ఒకరిపట్ల మరొకరు దయతో కూడిన సంబంధాలు కలిగివున్నారు, మీరు తల్లితండ్రులపట్ల, టీచర్లపట్ల, ప్రపంచ భవితవ్యంపట్ల మంచి అవగాహన కలిగివున్నారు" అని తల్లితండ్రులు ధ్రువీకరించేందుకు సిద్ధంగా వుండాలి.

# ఆదర్శాలను గురించి

పదహారేళ్ల వయస్సులో ప్రవేశించబోతున్న మీ పిల్లలకి ఏమి సంభవిస్తోందో మీకు తెలుసా?

ఎంతో ఆకస్మికంగా ప్రజ్వలించి, అంత ఆకస్మికంగానే జాడ లేకుండా అంతరించిపోయే వాళ్ల రహస్య అనుభవాలు మీకు తెలుసా?

మీ అబ్బాయిని అనుదినం "నువ్వొట్టి సోమరిపోతువి! నువ్వు బుద్ధి తెచ్చుకో! నిన్ను నువ్వు అదుపులో పెట్టుకో!" అంటూ తిట్టిపోసేటప్పుడు, మీ అంతరాత్మ వేదనకి గురి కాదా?

"మా అబ్బాయి (లేక అమ్మాయి) అలాంటి పని ఎన్నడూ చెయ్యరు" అని మీరు చెప్పింది సరైనదేనని మీకు గట్టి నమ్మకం వుందా?

ఏ కౌమార వయస్కుడి జీవితంలోనైనా కొన్ని కీలకమైన క్షణాలు వున్నాయి. ఆ క్షణాల మీద వాడి జీవితంలో చాలా మటుకు ఆధారపడుతుంది. కొన్ని సందర్భాల్లో యీ కీలక క్షణాలు యితోధిక పరిణతికి పునాది, షరతులు అవుతాయి. మరి కొన్ని సందర్భాల్లో యిందుకు భిన్నంగా అవినీతికరమైన అనుభవం పొందడానికి దారితీయవచ్చు.

నికరమైన బోధన శాస్త్రానికి వున్న శక్తి ఏమిటంటే, ప్రతికూల క్షణాలు సైతం శిక్షణకి ఉపయోగించబడతాయి. దీర్ఘ కాల క్రమంలో అవి పిల్లల పెంపకానికీ, వ్యక్తిత్వాభివృద్ధికీ ఒక లక్షణంగా వినియోగపడతాయి.

బోధన శాస్త్రీయ ఆదర్శం ప్రకారం పిల్లలకి సంబంధించిన పెద్ద విషయాల్లోనే కాక, చిన్న విషయాల్లో కూడా శ్రద్ధ సూత్రాన్ని పాటించాలి. శిక్షించడం కంటె, ఎక్కువగా ప్రోత్సహించడం మేలు.

తల్లితండ్రుల దృష్టిలో ఏదేమైనా సరే తమ పిల్లలే అత్యుత్తములు, అత్యంత ప్రీతి పాత్రులు. కొంత అతిశయంగా వున్న యీ అంచనాకి ప్రకృతే కారణం. ఈ అంచనా మూలంగా పిల్లలకి కుటుంబంలో రక్షణ లభిస్తుంది. పిల్లలు ఏమి చేసినా తల్లితండ్రులు వాళ్లని ససేమిరా క్షమించాలని నేను చెప్పను. పిల్లల దిగులును అర్థంచేసుకునేందుకూ, దానిలో పాలుపంచుకునేందుకూ తల్లితండ్రులు సిద్ధంగా వుండాలని మాత్రమే నేను చెప్తాను. తన పిల్లల మానసిక, శారీరక సామర్థ్యాలను తల్లి విశ్వసించేటంతగా మరెవ్వరూ విశ్వసించలేరు. ఈ విశ్వాసమే ఆశ. అది అంతులేని ప్రేమ. ఈ విశ్వాసం క్రియాశీల భాగస్వామ్యం. మరి అదే రక్షణ.

బోధన శాస్త్ర ఆదర్శాల దృఢత్వం పెంపకం క్రమంలో సంతరిచుకోబడిన నైతిక ధోరణుల రాజీ లేని స్వభావంమీద ఆధారపడి వుంటుంది.

ఒకరి దగ్గర తీసుకోవడం కంటె ఒకరికి ఇవ్వడం గొప్పది, మరొకరికి మంచి చెయ్యడం కంటె ఎక్కువ ఆనందం లేదు అనే జీవిత సారాంశాన్ని బోధించి, పిల్లలకి నిరంతరాయంగా నైతిక ప్రమాణాలను గుర్తుచేస్తూ వుంటే, వాళ్ళు నీతిబాహ్యమైన పనులు చెయ్యలేరు.

పిల్లల పెంపకపు లక్ష్యాలకీ సాధనాలకీ మధ్య సామరస్యాన్ని సరిగా నిర్ధారణ చెయ్యడమే నైతిక ప్రమాణాలకు బోధన శాస్త్ర ఆదర్శంతో ఆనుగుణ్యత కల్పించడం. పిల్లలకి మనం "దయగా వుండండి!" అని చెప్పి, వాళ్ల లెంపలు వాయించడం వల్ల ప్రయోజనం ఏమీ ఉండదు. లక్ష్యాలకీ సాధనాలకీ మధ్య ఏ మాత్రం పొసగమి వున్నా, అది అనివార్యంగా ప్రతికూల ఫలితాలకు దారితీస్తుంది. ఉత్తమోత్తమమైన మధ్యే మార్గాన్ని నిర్ధారణ చేసేందుకు తల్లితండ్రులకు అంత్యమితులు తెలిసివుండాలి. సాధారణంగా చాలా మంది తల్లితండ్రులు ఈ విషయంలో పొరపడుతూ వుంటారు.

మీ పిల్లల్ని లోపరహితులుగా పరిగణించకండి. అది హానిదాయకమే కాకుండా, ప్రమాదకరం కూడా. ఆదర్శీకరణ వాస్తవ చిత్రంనుంచి పక్కకి మరలిస్తుంది. వాస్తవిక భావనలకు బదులు కొన్ని సందర్భాల్లో తల్లితండ్రులు తమ పిల్లల్ని అతిగా ఆదర్శీకరిస్తూ వుంటారు. అలాంటి సందర్భాల్లో ఆ పిల్లలకి సైతం తమ తల్లుల, తండ్రుల అమాయకత్వం హాస్యాస్పదంగా అనిపిస్తుంది.

మీ పిల్లల కొన్ని లక్షణాలను లేక కొన్ని ప్రవర్తనల తీరును వాళ్ల బహుముఖమైన సంబంధాలకు బదలాయించినదాని ఫలితమే ఈ ఆదర్శీకరణ. కుక్కలు, పిల్లులు, పశులు, వగైరాలపట్ల ఒకరి వైఖరికి తన తోటి మనుషులపట్ల అతని వైఖరి పూర్తిగా భిన్నమైనది. ఒక పిల్లవాడు జంతువులను ప్రేమించవచ్చు, వాటిని హింసించకపోవచ్చు. అంత మాత్రాన తోటి మనుషుల పట్ల వాడు దయగా వుంటాడని అర్థం కాదు.

మీ పిల్లలు జంతువులను ప్రేమిస్తే, మహా బాగే. అయితే, వాళ్ళు తమ బొమ్మలనో లేక స్నేహితులనో కంటె తమ కుక్క పిల్లల్నో, పిల్లి కూనలనో ఎక్కువ శ్రద్ధగా చూస్తే, దీన్ని గురించి మీరు తీవ్రంగా ఆలోచించవలసిందే.

ఆడపిల్లల పెంపకం విషయంలో "అతి స్వేచ్ఛ" సమస్య మగపిల్లలదానితో పోలిస్తే భిన్నమైనది.

అతి స్వేచ్ఛ యథేచ్ఛా ప్రవర్తనకి దారితీసినప్పుడు అదెప్పుడూ నష్టదాయకమే అవుతుంది. ఆడపిల్లల విషయంలో ఈ యథేచ్ఛా ప్రవర్తన సామాన్యంగా ముప్పుకే దారితీస్తుంది.

ఆడపిల్లల పెంపకంలో ఈ "అతి స్వేచ్ఛ – యథేచ్ఛా ప్రవర్తన"తో ముడిపడి వున్న సాంఘిక కారణాలను పరిశీలించేందుకు ప్రయత్నిస్తాను.

సోవియట్ యూనియన్‌లో స్త్రీ జన విముక్తి సాంఘిక ధోరణి స్కూళ్లని కూడా ఆవరించింది. ఆడపిల్లలు మగపిల్లల మాదిరిగానే సమానమైన విద్య పొందుతారు, దాదాపు వాళ్ల మాదిరి పెంపకమే పొందుతారు: వాళ్లకీ వీళ్లకీ ఒకే మాదిరి సాంఘిక బాధ్యతలు,

వైరుధ్యాలను పరిష్కరించుకునే ఒకే సాధనాలు, ఒకే పని అనుభవం, ఒకే శారీరక, మాన సిక లక్షణాలు వుంటాయి.

అమ్మాయిలు సాంప్రదాయికంగా అబ్బాయిలు వినియోగిస్తూవచ్చిన పద్ధతులను వినియోగించి తమ వ్యక్తిత్వాన్ని తాము ధ్రువీకరించుకోవడం అతి సహజమైన విషయం. రోజూ చూసే టి.వి., సినిమాలు, చదివే పుస్తకాలు, వినే రేడియో ఇరవయ్యో శతాబ్దపు ఆదర్శ ప్రాయమైన కౌమార వయస్కురాలికి సంబంధించిన విడి వివరాలను, లక్షణాలను టెక్నాలజీ, క్రీడలు, పనుల ప్రపంచపు సుడిగుండంలో తిరిగే కౌమార వయస్కులైన అబ్బాయిలకి మాదిరిగానే అమ్మాయిల మనసుల్లో మూర్తి కట్టిస్తాయి: వాళ్ల దుస్తులు కూడా అబ్బా యిల దుస్తుల్లాగే – జీన్సు, మొద్దు జాకెట్లు – వుంటాయి. వాళ్ల అబ్బాయిల్లాగే జుట్లు పొట్టిగా వుంచుకుంటారు. వాళ్ల తీరుతెన్నులు చురుకుగా, క్లుప్తంగా వుంటాయి. మరి బలం సంగతి చెప్పనే అక్కర్లేదు! సంశ్లిష్టమైన, నిర్ణయాత్మకమైన పరిస్థితిలో అమ్మాయిలు చిత్తస్థైర్యం కోల్పోరు. వాళ్లు సాహసం చేసేందుకు సిద్ధపడతారు. వాళ్లు నిర్భయంగా వుంటారు. వాళ్ల పళ్లు బిగపట్టి వుంటాయి! పెదవులు బిగిసి వుంటాయి. వాళ్ల చుబుకాలు శుద్ధ యిచ్ఛా శక్తికి చిహ్నాలుగా వుంటాయి! కొన్నికొన్ని విషయాల్లో అమ్మా యిలు ఎప్పుడూ మరింత బలంగా, మరింత తెలివిగా, అబ్బాయిల కంటె మరింత వివేకవంతు లుగా ఉంటారన్న విషయం మరచిపోకూడదు.

అమ్మాయిల్ని చేయనిచ్చే కొన్ని పనులు తరచు వాళ్లని మోటుదేలుస్తాయి, వాళ్ల సున్నితత్వాన్ని చెరిపివేస్తాయి. యువతికి లేక స్త్రీకి చెందిన ఏ అందమైన "స్త్రీ సహజమైన దుర్బలత్వం"లోనైతే ఆమె నికరమైన బలం వుంటుందో ఆ "అబలాత్వాన్ని" అలాంటి పనులు చెరిపివేస్తాయి.

స్కూల్లో పెంపకం ఏక కాలంలో "ఉమ్మడిగా," "వేరుగా" కూడా వుండాలి. శ్రమ లోనూ, సుదీర్ఘమైన వినోద పాదయాత్రల్లోనూ అమ్మాయిలకీ, అబ్బాయిలకీ ఎత్తే బరువులు భిన్నభిన్నంగా వుండాలి. అలా అని 19వ శతాబ్ది నాటి స్త్రీ "అబలాత్వ" ఆదర్శానికి తిరిగి వెళ్లనక్కర్లేదు. కాని స్త్రీకి "కులీనవర్గపు" – అలా పిలవడం అనుమతించదగినదైతే – పెంపకం విధాయకమైనది. ఈ పెంపకం మగపిల్లల్లో ఆడపిల్లలపట్ల ధర్మవీర వైఖరి అభివృద్ధికి సమాంతరంగా సాగాలి.

పిల్లల మధ్య స్వయం వ్యక్తిత్వ స్థాపన సాధనాలు అమ్మాయిలకీ, అబ్బాయిలకీ భిన్న భిన్నంగా వుండాలి.

పిల్లల్ని స్వయంగా తమ విషయాలను తామే తేల్చుకోనివ్వండి అని మనం అన్నప్పుడు, మనం ఒక మాదిరి ఘర్షణను అనుమతిస్తున్నామన్న మాట. ఆ వ్యవహారం ముష్టి యుద్ధా నికి సైతం దారితియ్యవచ్చు. అబ్బాయిల విషయంలో యీ కొట్లాటలు దాదాపు సామాన్య విషయమే. వాళ్లు కోపగించుకుంటారు. పందెపు కోడిపుంజుల్లా ఒకళ్ల పీకలు ఒకళ్లు పట్టు

కుంటారు. ఓ ఐదు నిమిషాలు పోయాక వాళ్ళు అప్పుడే శాంతంగా కబుర్లు చెప్పుకొంటూ వుంటారు.

మామూలు వయోజన నైతికతకి భిన్నమైనది బాల్యంలో చాలా వుంటుంది. పిల్లలకి తమ చర్యలమీద సాపేక్షంగా చాలా తక్కువ అదుపు వుంటుంది. పిల్లవాడు ఎంత చిన్నవాడైతే, అతను తన భావాలను అంత ఎక్కువ "పచ్చి"గా వ్యక్తంచేస్తాడు. వాడు పెద్ద వాళ్ళని కొట్టవచ్చు, స్నేహితుడిమీద ఉమ్మివేయవచ్చు, వాణ్ణి కింద పడగొట్టవచ్చు, అలా చేసి తను కొట్టిన దెబ్బ "విజయవంతమైతే," పకపక నవ్వవచ్చు. వాడు అర్థం తెలియక పోయినా ఒక బూతు మాట విసరడం, వగైరాలు చేయవచ్చు. అయితే ఈ విడి అల్లర్లను బట్టి పిల్లల సాధారణ నైతిక స్థితిని అంచనా కట్టేందుకు వీల్లేదు. అల్లరి పిల్లవాడి ప్రవర్తనలో బాల్య స్వభావానుగుణమైన అతి స్వేచ్ఛలో ఒక మాదిరి ఆకర్షణీయమైన అంశాలు వుంటాయి. పిల్లలు తమ సహవయస్కుల మధ్య వైరుధ్యాల పరిష్కారం ద్వారా సాంఘికీకరణకి సంబంధించిన అనేక దశల గుండా గడుస్తారు. ఈ దశలనూ, పిల్లలు పరిసరాలకి ప్రతివర్తించే అనురూప మార్గాలనూ దాటవేయడం అసంభవమనడం స్పష్టం.

పిల్లల మధ్య కొట్లాట అన్నది సహజసిద్ధ విషయం అన్న భావం పాఠకుల్లో వుండటం నాకు ఎంత మాత్రం ఇష్టం లేదు. అబ్బాయిల మధ్య, అంత కంటె ఎక్కువగా అమ్మాయిల మధ్య కొట్లాటలు సంభవించని పద్ధతిలో పిల్లల్ని మనం పెంచాలని నేను భావిస్తాను. కొందరు తల్లితండ్రులు తమ కూతురు తనని తాను రక్షించుకోగలిగితే (అవసరమైతే పిడికిళ్లతో), అప్పుడిక క్రియాశీలమైన వ్యక్తి అభివృద్ధిచెందుతున్నట్లు పరిగణిస్తారు. ఎంత మాత్రం కాదు! ఒక వ్యక్తి ఏకైక నైతిక బలం మంచి చెయ్యడంలోనూ, నికరమైన నైతికతా ప్రమాణాలను నైతిక సాధనాల ద్వారా వక్కాణించడంలోనూ వుంటుంది.

స్త్రీల ఆత్మ శక్తి అపూర్వమైనది. ఈ సహజసిద్ధమైన సౌందర్యం కౌమార వయస్కురాలైన అమ్మాయిలో ముందే వుంటుంది. అది ఆమె కదలికల్లో, ప్రవర్తనలో, చూపులో, గణనీయంగా ఆకర్షణీయమైన పట్టుదలలో, పరిశుద్ధతలో, ఒక రకమైన మార్దవత్వంలో, ఒకానొక స్థాయిలో పూర్తి సమగ్రతలో, భిన్నత్వంలో వ్యక్తమవుతుంది. ఆమె భావోద్వేగపు వెల్లువలో మునిగివున్నప్పుడు, అదెంత సర్వశక్తివంతంగా వుంటుందంటే, దానికి అదే మాదిరి భావోద్వేగపు వెల్లువతో ప్రతిస్పందించకుండా వుండటం కష్ట సాధ్యం. ఆమె కష్టాన్ని భరించినప్పుడు ఎంత ధైర్యంగా భరిస్తుందంటే, దుఃఖాన్ని భరించే ఆ సామర్థ్య శిఖరాలను తను స్వయంగా అందుకోవాలని అనుకోకుండా ఎవరూ వుండలేరు. ఆమె అంతర్వివేకాన్ని చూసినప్పుడు ఆమెకి నమ్మశక్యం కానంతటి యీ ఓపిక ఎక్కణ్ణుంచి వచ్చిందబ్బా, అనుకుంటారు. ఆమె నవ్వినప్పుడు ఆమె చుట్టూ వున్నది ప్రతీదీ కాంతివంతమవుతుంది.

ఆమె కౌమార వయస్కుల సాంఘిక సంబంధాన్ని ఉదాత్తం చేస్తుంది. మగపిల్లలు యీ విషయాన్ని తప్పక అనుభూతం చేసుకుంటారు. తమకి తెలియకుండానే దానికి చాలా అధిక విలువ యిస్తారు.

ఒక అమ్మాయి పనిచేసిందంటే, ఆమె మగాళ్లకి ఏమీ తీసిపోదు. సామాన్యంగా ఆమె సంతోషంగా పనిచేస్తుంది. ఆమె తనకి నచ్చిన పని మాత్రమే కాదు, ఏ పనినైనా సరే యిష్టంగా చేస్తుంది. గదిని శుభ్రంచేయడం వంటి సామాన్యమైన ఏ పనినైనా చెయ్యమంటే, సుదీర్ఘ వినోద పాద యాత్రకి వెళ్లినప్పుడు నాస్తాకి ఏదైనా తయారుచేయమంటే, అమ్మాయి తనకి సహజసిద్ధమైన ఏదో ఒక కొత్తదాన్ని జతచేస్తుంది.

గతంలోనైనా పనిచేయకపోవడం, చురుకుగా ఉండకపోవడం, ఏవైనా ఆటల్లో పాల్గొనకపోవడమే ఆదర్శంగా వుండేదన్న భావన పొరపాటు. రష్యాలో ప్రభువర్గంవాళ్లు సైతం శారీరక అభివృద్ధిని అమ్మాయిల పెంపకపు ప్రథమ, ప్రధాన లక్ష్యాల్లో ఒకటిగా పరిగణించేవారు. చిన్న వయస్సునుంచీ గుర్రపుస్వారీ విస్తృతంగా నేర్పబడుతూ వుండేది. దరిమిలా స్కేటింగు, స్లెడ్జింగు, క్రమబద్ధమైన డాన్సింగు వ్యాయామాలు శరీర వ్యాయామాలంత కఠినంగానూ వుండేవి. ఈ కార్యకలాపాలకి మధ్యమధ్య తాజా గాలిలో వాహ్యాళులు, వేసవిలోనూ, శీతాకాలంలోనూ గ్రామాలకు రాకపోకలు, ఎంబ్రాయిడరీ హూప్ దగ్గరో, సంగీత పరికరం దగ్గరో లయబద్ధమైన కదలికలు వుండేవి. వీటన్నింటి దృష్ట్యా మానసిక, శారీరక సంసిద్ధతల ఐక్యతను చిత్రించుకోవడం ఏమంత కష్టం కాదు. ప్రభు కుటుంబాలకు చెందిన రష్యన్ విప్లవకారిణుల సాహసం గురించిన గాథలెన్నో ప్రచలితంగా వున్నాయి. వాళ్లు అద్భుతమైన శారీరక శిక్షణ పొందడం మాత్రమే కాకుండా, యీ శారీరక అభివృద్ధికి గొప్ప పట్టుదల, స్వీయ శక్తిమీద విశ్వాసమూ జోడైనట్లు పురాపత్రాల్లో రుజువులు వున్నాయి.

ఆధునిక కౌమార వయస్కులైన అమ్మాయిల ముఖాలను జాగ్రత్తగా పరిశీలించి చూస్తే (ప్రత్యేకించి పనిలో, చదువులో, ఆటల్లో నిమగ్నమై వున్నప్పుడు), వాళ్ల నిస్స్వార్థతలో, ఉదాత్తతలో, సున్నిత మనస్కతలో, అసాధారణ దయాపరత్వంలో శతాబ్దాలుగా వికసిస్తూ వచ్చిన స్త్రీత్వ భావాన్ని అతి చిన్న వివరంలో సైతం దాదాపు ఎలాంటి ప్రయత్నమూ లేకుండానే దర్శించవచ్చు.

ఆదర్శవంతమైన కౌమార వయస్కురాలైన అమ్మాయిని గురించి మాట్లాడేటప్పుడు క్రీడలను, వ్యాయామ శిక్షణను మనం మినహాయించం. నికరమైన స్త్రీజన సహజమైన సౌందర్యంలో యీకింది మూడు అంశాలు కలిసి వుంటాయి: ఆరోగ్యం; భావి మాత జీవితేచ్ఛ; భావి గృహయజమానురాలి, ప్రేమమయి అయిన భార్య క్రియాశీల మానసిక శక్తి.

## పిల్లల ప్రేమ

"విశృంఖల స్వేచ్ఛ" సమస్య స్వేచ్ఛా సమస్య మాత్రమే కాక, కట్టుబాట్ల సమస్య కూడా. అత్యంత సున్నితమైన సమస్యను – పిల్లలు ప్రేమలో పడటాన్ని, కౌమార వయ

స్కూలు అనుభూతి చెందే ప్రేమ భావాలను — పరిశీలించడం సముచితంగా వుంటుంది.

"వయోజన ప్రేమ" నమూనాని పిల్లల సంబంధాలకి మనం బదిలీ చెయ్యకూడదు.

ఇటీవలి సంవత్సరాల్లో పిల్లల ప్రేమని గురించిన రెండు అభిప్రాయాలు ఉత్పన్నమయ్యాయి. మొదటి అభిప్రాయంవాళ్ళు పిల్లల ప్రేమని సముత్సాహంగా సమర్థించారు, దాని విషయంలో జాగ్రత్తగా వ్యవహరించాలని వాదిస్తారు. తొలి ప్రేమని గురించిన పుస్తకాలు, సినిమాలు వెలువడ్డాయి. వీటిలో సాధారణ భావం అయిన ప్రేమ పిల్లల్ని ఉత్తేజితం చేస్తుంది, ఆనందపరుస్తుంది.

కాగా పిల్లలు ప్రేమలో పడటం హానికరమన్నది రెండవ అభిప్రాయం. ఈ అభిప్రాయంవాళ్ళు పిల్లలు స్కూల్లో బాగా చదువుకోవాలి, ప్రేమ గీమ పనికి రాదు అంటారు. ప్రతి ఒకరూ ప్రేమలో పడితే, ఏం జరుగుతుంది? అందుకని అనుసరించవలసిన పద్ధతులు — నిరసన, హేళన, చివాట్లు!

అయితే, యిక్కడొక చిత్రమైన విషయం తలెత్తుతుంది.

విషయం తమ సొంత పిల్లలకి సంబంధించినదైనప్పుడు మొదటి అభిప్రాయంవాళ్ళు, అంటే పిల్లల ప్రేమని సమర్థించేవాళ్ళు, యిలా అంటారు: "అబ్బే, మా పిల్ల ప్రేమలో పడటం నాకు యిష్టం లేదు."

వాళ్ళ వాదనలు ఏమిటి? కొంత అస్పష్టంగా, నాతి తీవ్రంగా ఉన్నప్పటికీ యీ వాదనలన్నింట్లోనూ ఒక ఉమ్మడి అంశమూ, రాజీ లేని ధోరణీ పూసల్లో దారంలా కనిపిస్తాయి.

నేనొకసారి ఒక తల్లితో జరిపిన సంభాషణని యిక్కడ పేర్కొంటాను:

"మీ అమ్మాయంటే యితరులు ఇష్టపడటం మీకు గిట్టదా?"

"అబ్బే, అదేం లేదు. తన కూతుర్ని దాని చుట్టూ వున్నవాళ్ళు యిష్టపడటం గిట్టని తల్లి ఎవరైనా వుంటుందా? ఉదాహరణకి, నా పరిచితులు మా అమ్మాయిని (దానికి పదమూడేళ్ళు) మెచ్చుకోవడం, అది అందంగా వుందనడం నాకు చాలా ఆనందదాయకంగా వుంటుంది."

"మరి మగాళ్ళు? వాళ్ళు మీ అమ్మాయిలో ఏదైనా ప్రత్యేక లక్షణాన్ని గమనిస్తారా? లేక వాళ్ళు యథాలాపంగా 'ఓహ్! ఈ అమ్మాయి ఎంత ఆకర్షణీయంగా వుందో...' అంటూ వుంటారా?"

"లేకేం, కొన్ని సార్లు వాళ్ళు దాని అందమైన కళ్ళనీ, దాని ఒత్తు జుట్టునీ, జుట్టు రంగునీ, దాని శరీర పటిమనీ, సౌందర్యాన్నీ గమనిస్తారు... దీంట్లో ఏమైనా సెబ్బర వుందా?"

"అబ్బే, అదేం లేదు... మరి మీ అమ్మాయికి ఆ పొగడ్తలు నచ్చాయా?"

"నమ్మలేనంత ఎక్కువగా నచ్చేవి. మాకు వేసవి సెలవలు వచ్చినప్పుడు మా అమ్మాయి నన్నెప్పుడూ డాన్సులకి లాక్కుపోయేది. తనని ఎన్ని సార్లు డాన్సుకి ఆహ్వానించారన్నదాంట్లోనే తప్ప, అసలు దానికి డాన్సుల్లో కాదు ఆసక్తి. తను అందరికీ నచ్చినట్లు ఎప్పుడైతే దానికి నమ్మకం

కలిగిందో, అప్పుడింక దాని మనస్సు శాంతించింది. అదింక డాన్సులకి అసలు వెళ్లనే లేదు.''

''దీని అర్థం మీ అమ్మాయికి అబ్బాయిల వైఖరిపట్ల పట్టకపోవడం లేదన్న మాట.''

''పట్టకపోవడం అన్నది సరైన మాట కాదు... ఇతరులకి తన సాన్నిధ్యం ఆహ్లాదకరమైనదిగా కనిపించాలని అదెప్పుడూ అనుకోవాలి. ఒక అమ్మాయి నలుగురికీ యిష్టురాలవడం దానికి మంచిది. దాని సమక్షంలో ప్రతి ఒక్కరూ ఆహ్లాదం, ఉపశమనం పొందాలి. కాని అదెప్పుడూ, స్వల్ప విషయాల్లో సైతం బాల్య విరుద్ధమైన సంవేదనలు కలిగించకూడదు.''

''మీకు భయం, కలవరం కలిగించే ఆ విషయం యేమిటి?''

''నాకు భయం కలిగించేది యేమీ లేదు. మా అమ్మాయి మరీ తొందర్లో ప్రేమలో పడటం నాకు యిష్టం లేదు. ఎవరేమి చెప్పినా, ప్రగాఢ సంవేదనలు పనినుంచి, చదువు నుంచి మనిషి దృష్టిని ఎప్పుడూ మళ్లిస్తాయి. ప్రేమ పిల్లని అకాలంగా ప్రపంచంనుంచి మూసివేయవచ్చు. మా అమ్మాయి మరీ తొందర్లో సంకుచితమైన 'ప్రేమ జంట'లో యిరుక్కుపోవడం నాకు యిష్టం లేదు.''

''కాని మీ అమ్మాయి తరుణ ప్రేమకి సంబంధించిన ఆనందమయ సరళ అనుభూతి చెందడం మీకు యిష్టం లేదా?''

''తరుణ ప్రేమా? దానికి నాకేమీ అభ్యంతరం లేదు. అన్నట్లు, అదెప్పుడూ ఒక రకం ప్రేమలోనే వుంటోంది. అది ఫిజిక్సు టీచరుతో ప్రేమలో పడి, అస్తమానం ఆయన్ని గురించే మాట్లాడుతుంది. అబ్బో, అదెలా మాట్లాడుతుందనుకున్నారు: ఆరాధనా భావంతో, కళ్లలో సంతోషం తొణికిసలాడుతూండగా మాట్లాడుతుంది! లేకపోతే పొరుగు స్కూల్లోని అబ్బాయితో ప్రేమలో పడుతుంది. అది చేసేదల్లా ఆ కుర్రాణ్ణి గురించి 'ఆ అబ్బాయి గిటారు ఎంత అద్భుతంగా వాయిస్తాడనుకున్నావ్! ఆ అబ్బాయి ఎంత అందంగా ఉంటాడో!' అంటూ తెగ కబుర్లు చెప్తుంది. ఈ మధ్య ఒక రోజున దాని క్లాస్‌మేటు దాన్ని సినిమాకి ఆహ్వానించాడు. ఆ కుర్రాడు కొంచెం అసహజంగా ప్రవర్తించడం, తన ముందు నత్తులు కొట్టడం, తనకి పెన్నులు యివ్వడం, తనకి నోట్సు రాసిపెట్టడం, వీటన్నింటినీ బట్టి ఆ అబ్బాయి తనంటే ప్రేమలో పడ్డట్లు అది నిర్ణయించుకుంది. మూడు రోజుల తర్వాత అతను అలా తనపట్ల శ్రద్ధ చూపడం నిలిపేసే సరికి మా కాత్యా నన్ను 'ఎందుకు నాకా అబ్బాయి ఫోన్ చేయడమైనా లేదు?' అని అడిగింది. నేను దానికి ఆ అబ్బాయి బిజీగా వుండివుంటాడనీ, ఆ అబ్బాయి చేసింది సరైన పనేననీ, అతను సీరియస్ తరహా అబ్బాయి అనీ వివరించి చెప్పాను. అప్పుడు కాత్యా చల్లబడింది.''

''మీరు యిదంతా సహజమైనదనీ, అనుమతించ తగిందేననీ అనుకుంటున్నారా?''

''తప్పకుండాను! అదేమీ కాన్వెంటులో చదవడం లేదు, మామూలు స్కూల్లో చదువుతోంది గాని!''

"సరే యిప్పుడింక అసలు సంగతికి వద్దాం. ఆ సంబంధాల్లో ప్రధానంగా ఏమిటి మీకు కలవరం కలిగిస్తోంది?"

"ప్రధానంగానా?" అంటూ ఆ తల్లి కొంచెం ఆలోచించింది. ఆమెకి మిక్కిలి కలవరపాటు కలిగించిందేమిటో ఆమెకి తెలుసుననీ, కాని దాన్ని గురించి ఆమె మాట్లాడ కోరడం లేదనీ నేను గ్రహించగలిగాను. అందుకు కారణం ఆమె సిగ్గుపడటం కాదు. తన భావాన్ని తప్పుగా వ్యక్తంచేస్తానేమోనని ఆమె భయపడింది. మరింత స్పష్టంగా చెప్పుకోవాలంటే, తన నిర్ణయం మరీ పాక్షికంగా కనిపిస్తుందేమోనని ఆమె భయపడుతోంది. "మీకు తెలుసా, నేనేం చెప్పినా కూడా, దాన్ని తప్పుగా అర్థంచేసుకుంటారు. అది సున్నిత విషయం... అయితే మొత్తంమీద నేను అన్నింట్లోకీ ఎక్కువ భయపడిన విషయం ఏమిటంటే, మా అమ్మాయి ఎవరో ఒక్క వ్యక్తికి బంధితురాలవడం నాకు యిష్టం లేదు. అది దారుణం!"

"కాని ఆమె యీ రోజున ఒకరితో, రేపు మరొకరితో వుండటం మీకు కలవరం కలిగించదా?"

"మీరు నన్ను సరిగా అర్థంచేసుకోలేదు..."

"కాని 'యీ రోజున ఒకరితో, రేపు మరొకరితో' అన్నప్పుడు, దానికి నేను చెడ్డ అర్థమేమీ ఆపాదించడం లేదు."

"మీరు నన్ను అర్థంచేసుకోవాలి. నేను మా అమ్మాయి పూర్తిగా అభివృద్ధిచెందాలని కోరుకుంటున్నాను."

మనం యీ తల్లి సలహాని అనుసరించి కొన్ని సూత్రీకరణలు చేద్దాం. పిల్లల ప్రవర్తన వాళ్ల వయస్సుకి అనుగుణంగా వుండాలి – అన్నదే యిక్కడ కీలకాంశం. మనం పిల్లలు ప్రేమలో పడటం గురించి మాట్లాడినప్పుడు, మన మనస్సులో వున్నది పిల్లల భావోద్వేగాలు, పిల్లల మగ్నత, మరో వ్యక్తితో, అంటే అమ్మాయైతే అబ్బాయితో, అబ్బాయైతే అమ్మాయితో ఒక నిర్దిష్టమైన మానసిక, విషయాసక్త సాంగత్యం ద్వారా ఆనందాన్ని అనుభవించే పిల్లల అవసరం. పిల్లల ప్రేమని నేను చైతన్యపూరితమైన లైంగిక ప్రసక్తియేమీ లేని భావోద్విగ్న స్థితి అని నిర్వచిస్తాను. ఈ ప్రేమ స్థితి ఓర చూపుల్లో, లేఖల్లో, నోట్సుల్లో, కలిసి సినిమాలకి, థియేటర్లకి లేక స్కేటింగ్ రింకులకి పోవడంలో వ్యక్తమవుతుంది. అతను లేక ఆమె క్లిష్ట పరిస్థితిలో వున్నప్పుడు, ఒకరు మరొకరికి సహాయం చేసేందుకు యిది సంసిద్ధత కూడా. ఇది మరొకరి భావోద్విగ్న స్థితిని గురించి వినే, దాన్ని గ్రహించే సామర్థ్యం.

ఈ మాదిరి సాంఘిక సంబంధం – దాన్ని ప్రేరేపించేందుకు ఎవరూ ప్రత్యేక శ్రద్ధ తీసుకోనక్కర్లేదు – ఉపయోగకరం. ఈ మాదిరి సాహచర్యం దానికదిగా రావాలి.

మరి అది రాకపోతేనో?

ఇదిగో మరో తల్లితో మరో సంభాషణ.

"మా అమ్మాయి విషయంలో ఏం చెయ్యాలో నాకు బొత్తిగా పాలుపోవడం లేదు.

అది తెగ బాధపడిపోతోంది, మహా వేదన పడిపోతోంది. తనని డాన్సుకి ఎవరూ ఆహ్వానించక పోవడంతో సాయంత్రం పూట పూటంతా అది గోడ దగ్గర నిలబడి నిరీక్షిస్తూనే గడుపుతోంది. డ్రెస్సు విషయంలో అది యితరులకేమీ తీసిపోదు, చూపులకైనా బాగానే వుంటుంది..."

"మరైతే మీ అమ్మాయి విషయంలో మీ దిగులు ఏమిటి? ఆమె ముచ్చటైన పిల్ల, స్కూల్లో బాగా చదువుతుంది."

"అది నిజమే. కాని దాని మనస్సులో అక్కసు పేరుకుంటోంది. అది అంతగా నవ్వడం లేదు. ముభావంగా వుంటోంది. ఏదన్నా భయపడుతోంది..."

"మగపిల్లలు ఆమె అంటే ఇష్టపడకపోవడమే యిందుకు కారణమని మీరు అనుకుంటున్నారా?"

"తల్లినైన నేనే, అదెంత క్షోభపడుతోందో అర్థంచేసుకోగలను... ఈ క్షోభ దానికి ఎంత హానికరమో నేను అనుభూతి చెందగలను."

అంటే, సాంఘిక సంబంధం ఏర్పడలేదన్న మాట. ఈ సందర్భంలో (యీ విషయం ఆ తల్లికి తెలియదు) క్లాసులో ఆ అమ్మాయి యితరుల ఇష్టాన్ని చూరగొనకపోవడానికి కారణం కుటుంబంలో దొరకవచ్చు. దీనికి చాలా సాదా వివరణ వుంది: ఆ అమ్మాయికి చాలా ఖరీదైన దుస్తులు కొన్నారు గాని, అవి ఫేషనబుల్ దుస్తులు కావు. ఆమె ఆ దుస్తుల్లో ఆధునికంగా కనిపించలేదు, బెరుకు లేకుండా సాయిలాపాయిలాగా ఉండలేకపోయింది. ఆమె తల్లి తండ్రులు యీ విషయం గమనించలేకపోయారు, ఆ అమ్మాయి ఏమి చెప్పేందుకూ భయపడింది.

తల్లులు తమ కూతుళ్ల బాహ్య రూపం విషయం పట్టించుకోవాలా? కూతుళ్ల దుస్తులు సౌకర్యంగా, ఆధునికంగా వుండేలా చూడాలా? అన్నింటి కంటె ముఖ్యంగా అమ్మాయి తన దుస్తుల విషయంలో తృప్తి చెందేలా చూడాలా? తప్పకుండా అలా చూడాలి. తమ సంగతి తాము చూసుకోవడం, తమ దుస్తుల సంగతి తాము చూసుకోవడం, శుభ్రంగా, నీటుగా వుండటం, మంచి మర్యాదలు, స్త్రీత్వం, వగైరాలను నేర్పడం అన్నది అమ్మాయిల పెంపకంలో అంతర్భాగం.

తమ కూతుళ్లంటే అమ్మాయిలు మాత్రమే కాకుండా, అబ్బాయిలు కూడా యిష్టపడేలా చూడాలని తల్లులు ఆలోచించాలా? అందుకు శ్రద్ధ వహించాలా? తప్పకుండా శ్రద్ధ వహించాలి. తమ స్కూలు వయస్సు అమ్మాయిల "వయోజన" ప్రేమ విషయంలో తల్లులు శంకలు కలిగి వుండాలా? తప్పకుండా కలిగి వుండాలి.

ఎందుకని? పిల్లల జీవితపు అనుభూతుల రంగంలోకి "వయోజన నమూనా"ని బదిలీ చేయడం అసహజం కనుక. మరి రోమియో, జూలియట్ సంగతేమిటని చాలా మంది అడుగుతూ వుంటారు. సంగతేమిటంటే, రోమియో, జూలియట్ల మధ్య ప్రేమని షేక్స్పియర్ కౌమార వయస్కుల తాత్కాలిక మోహంగా కాక, మహత్తరమైన, మనోజ్ఞమైన

వయోజన ప్రేమగా చిత్రించాడు. దానిలో ఒక వయోజన నమూనా రూపొందించబడింది. కాగా దానికీ, యిక్కడ మన చర్చకీ ఎలాంటి సంబంధమూ లేదు.

పిల్లల జీవితంలోని యీ "ద్విముఖ" కష్టాన్ని అర్థంచేసుకునేందుకు ప్రయత్నించండి. పిల్లల జీవితం వయోజనుల జీవితం కంటె చాలా ఎక్కువ సంశ్లిష్టమైనది. ప్రపంచంలో మిక్కిలి దీర్ఘమైన పని దినం పిల్లలదే. అది 14 గంటలదాకా వుంటుంది. రెండో కష్టం పిల్లల సొంత పెరుగుదలతో ముడిపడి వుంది, ఇది కష్టమైనది. పిల్లలు నిరంతరాయంగా తమ శరీరాలకు అనువుగా తమని తాము సరిపుచ్చుకోవాలి, యింతకు ముందు అనుభూతం కాని, తమని తాము బిగ్గరగా చాటి చెప్పుకొనే కొత్త వాంఛలను కనిపెట్టాలి. ఈ ఆంతరిక పెరుగుదలకి, మెదడు, హృదయం, నాడీ వ్యవస్థల పరివర్తనకి ఎవరూ అలవాటు పడలేరు. ఎందుకంటే, ఏ ఒక్కటీ పునరావృతం కాదు. పిల్లల అంతరంగంలో నూతన శక్తి పేరుకుంటుంది, బయటకి వచ్చేందుకు దానికి మార్గం కావాలి. అది బయటపడేందుకు అనుమతించకపోతే, దురదృష్టకరమైనది ఏదైనా ఖాయంగా సంభవిస్తుంది. కోర్కెలు, అవసరాలు నిరంతరాయంగా అణచివేయబడితే, అదెప్పుడూ ఆంతరిక సంఘర్షణలకు దారి తీస్తుంది.

పిల్లల జీవితానికి సంబంధించిన అతి క్లిష్ట సమస్యల్లో వాళ్ల భావోద్వేగాల అభివృద్ధి ఒకటి. పిల్లలకి సంవేదన చెందడం నేర్పడానికి సంబంధించిన కొన్ని పార్శ్వాలను నేనిక్కడ పరిశీలిస్తాను.

అందరు పిల్లలూ ఆంతరిక "లైంగిక విస్ఫోటనం," "లైంగిక పరిణతి"కి సంబంధించి సంశ్లిష్ట క్రమం గుండా గడుస్తారు. అధిక కాముకులైన పిల్లలు వున్నారనడం స్పష్టం. వాళ్ల కామేచ్ఛని నిరంతరాయంగా ఇతర వ్యాపకాల్లోకి మళ్లిస్తూ వుండాలి. ఇందుకుగాను పిల్లల భావోద్విగ్న జీవితాన్ని సానుకూల భావోద్వేగాలతో నింపాలి.

పిల్లల్ని కార్యకలాపాలకు అభిముఖుల్ని చేస్తేనే సరిపోదు. అత్యధిక ఆనందాన్ని, కొంత తన్మయత్వాన్ని సైతం చేకూర్చే కార్యకలాపాల దిశగా వాళ్లని నడపడం అవసరం. ఇది థియేటర్‌కి, మ్యూజియంలకి, జూకి వెళ్లడం. ఊరుబయట నడకలు, తాజా గాలిలో గంతులెయ్యడం, వ్యవసాయ క్షేత్రంలో, సొంత తోటలో లేక కుటీరంలో పనిచేయడం యిలాంటివే. క్రీడల్లో పాల్గొనడం, గ్రంథపఠనం, లేక టి.వి. చూడటం యిలాంటివే.

పిల్లల సావాసాలు తల్లితండ్రులు నిరంతరం శ్రద్ధ తీసుకోవలసిన ఒక అంశం. తరుణ వయస్కుల యీ క్లిష్ట దశలో మిమ్మల్ని మీరు యిలా ప్రశ్నించుకోవాలి: మీ కొడుకు లేక కూతురు ఎవరితో స్నేహం చేస్తున్నారు? వాళ్లు వీళ్లతో కాక యితరులతో ఎందుకు స్నేహం చెయ్యలేదు? మీ అబ్బాయి తన స్నేహితులతో ఎందుకు కలహించాడు? వాళ్లలాగో ఒక లాగ సరిపెట్టుకోలేరా? దీని అత్యుత్తమ పరిష్కార మార్గం ఏమిటి? ఎవరైనా తన కొడుకుతో యీ విషయం ఎలా ప్రస్తావించాలి? తన మేనకోడలినో లేక కూతురు వున్న — ఆమె

చక్కటి అమ్మాయైతే – ఒక స్నేహితుణ్ణో యింటికి పిలిస్తే? లేక మీ కొడుకుని వాళ్ల యింటికి తీసుకెళ్లవచ్చునేమో? మీ అబ్బాయిని పువ్వులు కొని తీసుకురమ్మని సలహా యివ్వ వచ్చునేమో? ఈ సంశ్లిష్ట దశలో మీ అబ్బాయికి ఏ సహాయం చేసినా, అదెంత చిన్నదైనా సరే, అది అతనికి గొప్పగా తోడ్పడుతుంది. ఒక కౌమార వయస్కుడు ఒక్క సారి ఒక అమ్మా యిని కలుసుకుంటే చాలు, అతను కొన్ని నెలల పాటు సంపూర్ణ భావోత్తేజిత జీవితం గడు పుతాడు.

తను కలుసుకున్న ఒక అబ్బాయంటే యిష్టం కలిగిన అమ్మాయి (ఈ యిష్టం పర స్పరమైనదైతే) చాలా కాలం పాటు అద్భుతమైన సమ్మోహిత స్థితిలో బతుకుతుంది. ఆమె మరింత శ్రద్ధాళువవుతుంది, తన స్కూలు పాఠాలు మరింత సంతోషంగా చదువుతుంది. ఆమె మొత్తం జీవితమే కొత్త అర్థాన్ని సంతరించుకుంటుంది. పెద్దవాళ్లకి కంటె పిల్లలకి పరస్పర సానుభూతి ఎక్కువగా అవసరం. పిల్లల విషయంలో ప్రేమలో వుండే స్థితి మానవ జీవితపు అందమైన అద్భుతం. అది మనిషి మొత్తం జీవిత భవితవ్యాన్ని ప్రభావితం చేస్తుంది.

స్వాప్నికమైన ప్రేమను అనుభూతి చెందనిదే పిల్లలు ఆశ, విశ్వాసం, సంతోషం, సుఖం లేని పెద్దవాళ్ల మాదిరిగానే కృశించిపోతారు.

పిల్లలకి తమ స్నేహితులపట్ల ఏమి భావాలు వున్నాయో పెద్దలు వాళ్లతో మాట్లాడాలి.

బోధనశాస్త్రం పిల్లల్లో పరిశ్రమతత్వం, మానవుడిపట్ల ప్రేమ అనే రెండు ప్రధాన నైతిక గుణాలను ప్రోత్సహించాలి.

ఈ సందర్భంగా ఒక రకమైన అనిర్దిష్టమైన సరళీకరణ ధోరణి అత్యంత ప్రమాద కరం. దాన్ని అనుమతించరాదు. మానవుడిపట్ల సాధారణ ప్రేమ కాక, వాన్య, పేత్య, లేనా, కాత్యా, దాషా ఆంటీ, లేక కోల్య అంకుల్ వంటి నిర్దిష్ట వ్యక్తిపట్ల ప్రేమ అవసరం. వాళ్లలో ఏ ఒక్కరిపట్లనో లేక అందరిపట్లనో గౌరవం కాక, వాళ్ల జీవితాల్లో క్రియాశీల భాగస్వామ్యం అవసరం. అమ్మాయి లేక అబ్బాయి స్టౌ అంటించడంలో తోడ్పడడం, ఒక ముల్లు ఊడదియ్య డం, అవసర వస్తువు తెచ్చిపెట్టడం, ఏదైనా ఒక వస్తువును తను నిరాకరించుకోవడం, ఎవరో ఒక స్నేహితునిపట్ల శ్రద్ధ చూపడం – యిలాగ పిల్లల భావాలు ఎంత ఎక్కువ నిర్దిష్ట మైతే అంత మెరుగు. మంచి పనుల్లో యిలాంటి నిర్దిష్టతే వాళ్ల సరైన భావోద్విగ్న అభివృద్ధికి తోడ్పడుతుంది.

ఈకింది సరళీకరణ కూడా పొరపాటే అవుతుంది. ఒక పిల్లవాడు మరో వ్యక్తిని హృదయ పూర్వకంగా ప్రేమించవచ్చు. అనుక్షణం అతన్ని గురించే ఆలోచించవచ్చు, అతని రహ స్యాలు కాపాడవచ్చు, ఆ వ్యక్తి ఆధారంగా తన ప్రవర్తనని రూపొందించుకోవచ్చు – అయినా కూడా ఆ వ్యక్తికి తన సంబంధాన్ని ఏ విధంగానూ వ్యక్తంచేయకపోవచ్చు. మరింత కచ్చి తంగా చెప్పాలంటే, ప్రేమించినవారిపట్ల యీ దృక్పథమే నేనింతకు ముందు పేర్కొన్న

నిర్దిష్టతయొక్క అపూర్వ వ్యక్తీకరణ. ఈ నిర్దిష్టత వెనక ఆ వ్యక్తి పేరిట ఏమి చేసేందుకైనా సరే సంసిద్ధత వుంటుంది.

నేను యింకో విషయంలో మిమ్మల్ని హెచ్చరించదలుచుకున్నాను. మరే విషయంలోనూ మనస్సు మగ్నంచేయలేని, మరే విషయాన్నీ ఆలోచించలేని మేరకి ఏ భావమైనా పిల్లల్ని ఆవహించినట్లయితే, అది ప్రమాదకరమైనది. ఒకరిపట్ల ప్రేమ పరిశ్రమతత్వం వంటి కీలకమైన ఏ మంచి లక్షణపు (చదువుకి, ఇంటి చాకిరికి, ఆర్గనైజేషనుకి, నిర్మాణానికి, లేక కళకి సంబంధించిన పిల్లల కార్యకలాపాల) అభివృద్ధినైనా దెబ్బతీస్తే, ఆ ప్రేమ అనివార్యంగా పిల్లలు దిగజారిపోయేందుకు దారితీస్తుంది.

ఒక అబ్బాయిపట్ల ఒక అమ్మాయి ప్రేమ ఆమె ఆంతరిక శక్తిని శోషింపజేసి, ఆమెని వాస్తవికతనుంచి దూరంచేస్తే, అది అనివార్యంగా చెడు చేస్తుంది. ప్రేమ అంటే మరింత మెరుగ్గా పని చెయ్యడం అన్నది పాత ఆలోచనకి సంబంధించిన సూత్రం కాదు. పిల్లల ప్రేమని కాపాడి, వాళ్లకి న్యాయవిహితమైన హక్కును కల్పించగల, కల్పించే బోధన శాస్త్ర సూత్రం యిదే.

మరో ముఖ్య వివరం: పిల్లలు ఎలా ప్రేమిస్తారో — మనస్సుతోనో, హృదయంతోనో — తెలుసుకోవాలి. పిల్లల హృదయాలు అనుభవం కలిగినవి కావు. అందుకనే, పిల్లలకి వాళ్ల సంవేదనలను విశ్లేషించుకోవడం ఎలాగో నేర్పడం చాలా ముఖ్యం.

సంవేదనలను విశ్లేషించడం ద్వారా మీరు వాటిని చంపివేయగలరన్నది నిజమేననుకోండి. కాని దీనిలో బోధన శాస్త్ర సారాంశం లేదు. పిల్లలకి ప్రతి ఒక్కటీ నేర్వాలనుకుంటూ వుంటారు. అందుకే తల్లో లేక తండ్రో పిల్లల్ని యీకింది విధంగా ప్రశ్నిస్తారు: అతన్ని గురించి లేక ఆమె గురించి నీకు మిక్కిలి బాగా నచ్చింది ఏమిటి? అతనిలో లేక ఆమెలో నీకు కనిపించిన మిక్కిలి మంచిది ఏమిటి? అలాంటి పరిస్థితిలో అతను లేక ఆమె ఎలా వ్యవహరించివుండేవాళ్లు? అతనికి లేక ఆమెకి నువ్వు సహాయం చెయ్యగలవా? అతను లేక ఆమె నీకు ఎందుకు సాయం చెయ్యలేదు? పిల్లలకి యీ ప్రశ్నలన్నీ అత్యవసరం. వాళ్లు వాటిని తప్పించుకోజూస్తే, మీరు సరిపెట్టుకోకండి. ఈ అంశం చాలా సున్నితమైనదనడం నిజమేననుకోండి, అత్యంత విశ్వసనీయమైన సంబంధాలు అంతకు ముందే ఏర్పడివుంటే తప్ప, మీరు దాన్ని ఉల్లంఘించలేరు. అయితే అప్పుడు సైతం, మనం చాలా జాగ్రత్తగా వుండాలి. అలాంటి సంభాషణల్లో పిల్లలు ఎప్పుడూ ఒక రకమైన బిడియం పడతారు. ఈ మాదిరి బిడియాన్ని ఎంత మాత్రం నాశనం చెయ్యకూడదు. అయినా కూడా మనం మధ్యమధ్య యీ సంశ్లిష్ట విషయానికి రావాలి. ఈ అంశం ఎప్పుడూ చర్చనీయమైనదే. పిల్లలకి పెద్దవాళ్ల సలహా ఎప్పుడూ అవసరమే.

అమ్మాయి అబ్బాయితో తొలి సమావేశం నిర్ణయించుకుంది. ఆమె జీవితంలో యిదో గొప్ప ఘటన. తల్లితండ్రులు ఆ పిల్ల ఆ మహత్తరానందం పొందేందుకు సాయం చేసితీరాలి.

తొలి సమావేశానికీ, మామూలు ఆహ్వానానికీ మధ్య భేదమేమిటో తెలుసుకోవడం ఆమెకి నేర్పాలి. ఈ సందర్భంలో వివిధ సంబంధాల అభివృద్ధికి ఆ అమ్మాయిని సన్నద్ధం చేయాలి. ఈ కారణంగా, అతి చిన్న వివరాలను సైతం (ఉదాహరణకు, అతను నిన్నెలా ఆహ్వానించాడు? అతను ఎవరు? అతను అంటే నీకు ఇష్టమా? అతను తర్వాత నీతో ఏమన్నాడు?) చతురమైన పరిశీలన ఒక తల్లికి ఒక్క రాయితో రెండు మిక్కిలి అవసరమైన పిట్టల్ని కొట్టేందుకు — తన కూతురితో మరింత స్థిరమైన సంబంధాలు నెలకొల్పుకునేందుకు, ఆమెకి సకాలంలో సరైన సలహా యిచ్చేందుకు —తోడ్పడుతుంది.

సరే తర్వాత ఏ కారణంగా అయితేనేం, ఆ తేదీన ఆ సమావేశం జరగలేదు. ఆ అమ్మాయి కన్నీళ్లు కారుస్తూ యింటికి వచ్చింది: ఆమె నలభై నిమిషాల పాటు నిర్ణీత స్థలం దగ్గర నిరీక్షించింది... అదిగో అలాంటప్పుడే పెద్దవాళ్లు పిల్లలకి బాసటగా నిలబడాలి. మీరు పని చోట వుంటే, మీరు యింటికి వచ్చేదాకా మీకోసం యింటి దగ్గర వేచి వుండమనీ, మీరు వచ్చాక కలిసి చర్చించవచ్చుననీ, వగైరా చెప్పండి. మీరు మీ పిల్లని కలుసుకున్నాక జరగని సమావేశం గురించిన పరిస్థితులన్నింటినీ వివరించి చెప్పండి. అందుకు సదృశమైన యితర ఘటనలను గురించి ఆమెకి చెప్పండి. మాటల సందర్భంగా తరచు మనుషులు స్థల, కాలాల విషయంలో పొరపడుతూ వుంటారని సూచించండి. ఆ క్లిష్ట పరిస్థితిలోంచి హుందాగా బయటపడేందుకు మీ అమ్మాయికి తోడ్పడండి.

ప్రధానమైన అన్ని యిబ్బందులూ, దుర్ఘటనాలూ ఏదో ఒక విధంగా పిల్లలు "వ్యక్తిగతంగా స్థిరపడకపోవడం"నుంచి ఉత్పన్నమవుతాయని మీరు గ్రహించాలి.

పిల్లల సంవేదనలకు, వెల్లువలా పొంగే యీ అనుభవాల గుప్త అగ్ని పర్వతానికి సంబంధించిన యీ సుందర ప్రపంచాన్ని ఎవరూ సీరియస్‌గా అధ్యయనం చేయలేదు. బోధకులు సాహిత్యంమీదా, సినిమాలమీదా ఆధారపడి, పిల్లల సంవేదనల ప్రపంచాన్ని పట్టించుకోరు.

తల్లితండ్రుల అనుభవం పిల్లల సంవేదనలకి ఎలాంటి ప్రత్యేక ప్రాముఖ్యమూ యివ్వదు. ప్రతి ఒకళ్లూ యిలాంటిదే ఏదో ఒక అనుభవం పొందే వుంటారని వాళ్లు అనవచ్చు. ఇదంతా జీవితంలో ఒక భాగం, దీన్ని గురించి మరీ అంతగా గుంజాటన పడిపోకూడదు అనవచ్చు.

మామూలుగా అయితే, యీ వైఖరి చాలా హేతుబద్ధమైనదే: పిల్లల జీవితపు వ్యక్తిగత రంగంలో తల్లితండ్రులు జోక్యంచేసుకోకపోవడం కౌమార వయస్కులకి పూర్తి రక్షణ వాతావరణాన్ని కల్పిస్తుంది. అయితే రక్షణకి సంబంధించిన గతితర్కంలో పిల్లల అంతరాంతరాల్లోకి "చొరబడటం," అసమంజసమైన వైఫల్యాలనుంచి వాళ్లని కాపాడటం, వాళ్లని తీవ్ర వేదననుంచి విముక్తం చేయడం, అర్థంకాని, అసాధారణమైన, కొత్త విషయాలు తెలియజెప్పడం యిమిడి వుంటాయి... ఏ కారణంగానైనా మీ అమ్మాయి లేక అబ్బాయి ఆ విషయం గురించి మాట్లాడేందుకు యిష్టపడకపోతే, పట్టుపట్టకండి, వాళ్లని ప్రశ్నించడం, వగైరాలు చేయకండి. తమ వ్యక్తిగత జీవితం "తమదేననీ," ఆ జీవితానికి తమకి

న్యాయమైన హక్కు వుందనీ, తమ రహస్యాలను తాము మాత్రమే, తమకి అత్యంత సన్నిహితులైనవాళ్లకి మాత్రమే వెల్లడించవచ్చుననీ పిల్లలు అర్థంచేసుకోవాలి. మొత్తంమీద, యీ మాదిరి పరిస్థితుల్లో తల్లితండ్రుల ప్రవర్తనని నిర్ణయించేది సాన్నిహిత్య స్థాయే. అప్పటికి తల్లితండ్రులకీ పిల్లలకీ మధ్య సంబంధాలు బెడిసి వుంటే, పిల్లలతో ఏ ఆంతరంగిక సంభాషణా సాధ్యం కాదు. అందుకనే, పెద్దవాళ్లూ పిల్లలూ, తమ మధ్య ఎలాంటి ఘర్షణ తలెత్తినా కూడా, అంతకు పూర్వం తమ మధ్య వున్న పరస్పర విశ్వాసాన్ని కాపాడుకోవాలి. "మా అమ్మకీ నాకూ మధ్య ఏదో ప్రత్యేకమైన అనుబంధం వుంది, యితర అన్నింటి కంటె అది ప్రియతమమైనది..." అన్న విషయాన్ని అబ్బాయి లేక అమ్మాయి గ్రహించాలి. తమ సంబంధపు యీ పవిత్ర పార్శ్వాన్ని గురించి తల్లి లేక తండ్రి మధ్యమధ్య పిల్లలకి గుర్తుచేస్తూ వుండాలి. "మనం ఎంతగానైనా వాదించుకోవచ్చు, ఏదో ఒక కారణంగా ఒకళ్లమీద ఒకళ్లం కోపగించుకోవచ్చు, కాని మన మధ్య తల్లితండ్రులకీ పిల్లలకీ మధ్య వుండే బాంధవ్యం మాత్రమే కాకుండా, మానసిక అనుబంధాలు కూడా వున్నాయి. వాటి మూలంగా పరస్పరం ఒకళ్ల దగ్గర్నుంచి మరొకళ్లం విధిగా యిచ్చి పుచ్చుకోవాలి, అవసరమైనప్పుడు పరస్పరం చేయూతనిచ్చుకోవాలి..." అన్న విషయం జ్ఞప్తికి తెస్తూ వుండాలి.

ఒక్క ముక్కలో చెప్పాలంటే, పిల్లల్ని మీకు బాగా సన్నిహితుల్ని చేసుకోవాలి: వాళ్ల మానసిక ప్రపంచపు అభివృద్ధిని ప్రభావితంచేసే సంభావ్యతని రూఢంచేసేది యిదొక్కటే. ఈవిధంగా, నేనింతకు ముందు పేర్కొన్న "జోక్యంచేసుకునే" ఎత్తుగడలు పిల్లల వ్యక్తిగత జీవితాల్లో బేజోక్యపు తర్కాన్ని – పిల్లల సార్వభౌమ హక్కులకి ఎప్పుడూ ప్రథమ స్థానం వుండాలన్న తర్కాన్ని – తోసిపుచ్చవు.

కొందరు బోధకులు పిల్లల జీవితాల్లో జోక్యం కల్పించుకోరాదన్న వైఖరి ఆధారంగా యిలా వాదిస్తూ వుంటారు: పిల్లల మొత్తం జీవితానికి సంబంధించిన నియమాలను (ప్రధానంగా పనికి సంబంధించిన నియమాలను) సక్రమంగా ఏర్పాటుచెయ్యండి, అప్పుడిక అన్నీ సజావుగా సర్దుకుంటాయి. అయితే నేను వాళ్లతో ఏకీభవించను. అన్నీ సరిగా వాళ్లు చెప్పినట్లే జరగవు. భావావేశాల ప్రపంచంలో సద్యోజనితంగా ఏదీ జరగదు. స్కూలు పని లేక యితర పనులు ఎంత సంశ్లిష్టమో, హృదయానికి, మెదడుకి, ఆత్మకి సంబంధించిన పని కూడా అంత కష్టభూయిష్టమైనది.

మీ పిల్లలకి ప్రేమించడం నేర్పితే, మీరు వాళ్లకి అన్నీ నేర్పినట్లే! ఈ సూత్రం ఆశ్చర్యం కొలపవచ్చు. కాని నేనందుకు రుజువు సమకూర్చేందుకు సిద్ధంగా వున్నాను. మరొకరిపట్ల ఒకరి ప్రేమ ప్రేమించినవారికి ఆనందం కలిగిస్తే, ప్రతి ఒక్కరి సృజనాత్మక కార్యకలాపాల అభివృద్ధికి అదొక షరతు అయితే, స్వీయాభివృద్ధికీ, తన మానసిక, శారీరక శక్తి సమీకరణకీ అదొక అంశం అయితే, అప్పుడది సంపూర్ణమైనదీ, నిజాయితీ అయినదీ అవుతుంది. ఈ ఆత్మావిష్కారం జరగకపోతే, ఆ భావం "మెదడును మొద్దుబారజేస్తే," ఒక వ్యక్తిలో

వున్న అత్యుత్తమమైనదాన్ని నశింపజేస్తే, ఒక అవకతవక పొరపాటు జరిగిందన్న మాట, దాన్ని సరిదిద్దడం అవసరమన్న మాట...

సున్నితమూ, అతి ముఖ్యమూ అయిన యీ సమస్యపట్ల నా వైఖరి అతి హేతుబద్ధమైనదిగా కనిపించవచ్చు, కాని దీనికి మరే యితర (అంటే, బోధన శాస్త్ర) వైఖరీ వుండజాలదు.

ప్రేమని నేను సృజనాత్మక కార్యకలాపాలతో, పనితో ముడిపెడతాను. మరి యిలా ముడి పెట్టడం సహేతుకమైనది. తన పనిపట్ల ప్రేమ అన్నది గొప్ప విషయం. అయితే, పని వ్యక్తిగత సంబంధాలతో మేళవింపబడకపోతే, యీ శ్రమకి విలువ ఏమిటి? పిల్లలు పనిలో మానవానందపు పరిపూర్ణతని – అతడు లేక ఆమె ఎవరైనప్పటికీ, తండ్రా లేక తల్లా, బామ్మా లేక పిన్నా, సహచరుడా లేక సన్నిహిత స్నేహితుడా, స్కూల్లో టీచరా లేక మొత్తం తరగతా అన్నదానితో ప్రసక్తి లేకుండా – యితరులపట్ల తమ ప్రేమ సంపూర్ణతని దర్శించవచ్చు. మానవుడు తనకోసం తాను బతుకుతూ యితరులకోసం కూడా బతుకుతాడు అన్నదే మానవ అస్తిత్వపు పరమార్థం.

మనం యీ అంశాన్ని కలిసి మరో సారి విశ్లేషిద్దాం. పిల్లలు తమ అత్యుత్తమ సంవేదనలను వ్యక్తంచేసే అనుభవాన్ని సంతరించుకోవడం అన్నది లక్ష్యం. వాళ్ల సమరస అభివృద్ధికి వాళ్ళ భావోద్విగ్న సంస్కృతి అనుభవాన్ని సంచయనం చేసుకోవడం అవసరం. ఇతరులపట్ల సత్సంవేదనలు లేనివాళ్ళు ఎవరూ బాగా కష్టించి పనిచేసేవాళ్లు కాలేరు, మంచి గృహస్థులు కాలేరు, నాయకులు కాలేరు, తమతమ దేశాల సత్పౌరులు కాలేరు. పిల్లల ప్రేమానుభవం పిల్లల పెంపకానికి సంబంధించిన బృహత్ సమస్యలకు విరుద్ధమైనది కాదు.

మరి సాధనాల సంగతేమిటి?

సాధనాలు మరింత సంశ్లిష్టమైనవి. ఈ ఆంతరంగికమైన, చక్కని క్రమాలను రూపొందించేందుకు మనం ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలా? ప్రత్యేక శ్రద్ధ తీసుకోనక్కర్లేదు. కాని పిల్లలు తమ ఆత్మ చలనాలను మదింపువేసుకునేందుకు మనం విధిగా సాయంచెయ్యాలి. ఈ ఆత్మ చలనాలు ఎప్పుడూ ఉపరితలంమీదనే వుంటాయి.

మీ అబ్బాయో, అమ్మాయో ఎప్పుడూ వ్యాకులపడుతూ వుంటే, అతిగా ఉద్రిక్తులై వుంటే, లేక బురదగొడ్డులా మందకొడిగా పడి నిద్రపోతూ వుంటే, అతను లేక ఆమె ఏదో ఒక భావోద్వేగంతో సతమతమవుతున్నారనీ, దాన్ని పరిష్కరించుకోవడంలో వాళ్లకి తోడ్పాటు అవసరమనీ మీరు గ్రహించాలి.

పిల్లలు ఆకస్మికంగా ఉద్రేకపూరితమైన తిరుగుబాటు ధోరణిలో వుండి, పెద్దవాళ్ల ఆదేశాలను తిరస్కరించ నారంభిస్తే, ఎక్కడో, దేంట్లోనో వాళ్లు విఫలురయ్యారనీ, వాళ్లకి "వ్యక్తిగత అస్థిరత" ఎదురవుతోందనీ మీరు అర్థంచేసుకోవాలి.

పిల్లలు మీ సలహానో లేక విజ్ఞప్తులనో వినకపోతే, మొత్తంగావే ఎవరి మాటనీ, దేన్నీ

వినకపోతే, వాళ్లేదో భావోద్వేగాన్ని అనుభూతి చెందుతున్నారనీ, ఆ భావోద్వేగం గొప్ప ఆనందంగా గాని, గొప్ప దురదృష్టంగా గాని మారవచ్చుననీ మీరు గ్రహించాలి.

పిల్లల సంవేదనలు పెద్దవాళ్లవాటి కంటె మరింత ప్రమాదకరమైనవి. పిల్లలు అకస్మాత్తుగా ఉధృతమైన అనుభవపు తుపాను సదృశమైన అజ్ఞాత సుడిగుండంలో పడి పోతూ వుంటారు. ఈర్ష్యని, అవమానాలని, అలయింపజేసే నిరీక్షణా మాధుర్యాన్ని, సమస్తం యిచ్చేసేందుకు, సమస్తం చేసేందుకు, సర్వం సాధించేందుకు సంసిద్ధతని, భయంకరమైన సరిదిద్దరాని తిరస్కారణని పిల్లలు మొట్టమొదటి సారి అనుభవిస్తారు. వీటిలో చాలా మటుకు అనుకోనివి, అర్థంచేసుకునేందుకు అలవికానివి, అనివార్యమైనవి, వెనక్కి తగ్గేందుకు సాధ్యం కానివి.

మనిషి ప్రధాన లక్షణాల్లో సమష్టితత్వం ఒకటైతే, యితరులపట్ల ప్రేమ దాని పునాది.

వ్యక్తిగత వైఫల్యం సామాన్యంగా బోలెడు శక్తిని, పగ సాధింపును — ఎవరికి వ్యతిరేకంగానో ఎవరికీ తెలియదు — ఉత్పన్నంచేస్తుంది. ఆర్ద్రతకి అవసరం చెడుగును ఉమిసే అంధకార బంధురమైన అగాధంగా మారవచ్చు. అది సంవేదనల ప్రమాదకర, అనవసర క్రీడ!

ఇందుకు చికిత్సాపూర్వక చర్యలు అవసరం. అయితే అందుకు ఉన్నదల్లా, నికరమైన మానవ భావోద్వేగాన్ని అనుభూతం చేసుకోవడం ఎలాగో పిల్లలకి నేర్పడమనే చర్య ఒక్కటే. ప్రేమ దయార్ద్రతని నేర్పడం, ఎన్ని యిబ్బందులూ, కష్టాలూ వున్నా కూడా మానవులు నిలుపుకోగలిగిన ఆ అమూల్య వరాన్ని పోషించుకోవడం, నిలుపుకోవడం ఎలాగో వాళ్లకి నేర్పడమే!

శారీరక అందం సైతం సమష్టితత్వానికి అనుకూలంగా, ప్రతికూలంగా కూడా పని చెయ్యవచ్చు.

అందమైన అమ్మాయిల్ని ప్రత్యేక పద్ధతిలో తీర్చిదిద్దాలని భావించే అనేక మంది బోధకులను నేను కలుసుకున్నాను. పిల్లలతో ఏ మాత్రం సంబంధం వున్నవాళ్లకైనా కూడా అందమైన పిల్లలకి ఎన్ని వీళ్లు వుంటాయో తెలుసు. తిరస్కరింపబడినప్పుడు కలిగే విషాదం వాళ్లకి దాదాపు తెలియదు. వాళ్లెప్పుడూ కూడా తమ స్నేహితుల్ని, సహచరుల్ని లేక సావాసుల్ని ఎంచుకోగలుగుతారు. ఏదైనా ఒక సమష్టిలోని ఒక అందమైన అమ్మాయి (ఆమె తెలివైనదీ, దయామయీ అయితే) ఆ పిల్లల బృందాన్ని కలిసికట్టుగా ఉంచగలుగుతుంది.

అయితే అదే అమ్మాయి తెలివైనదే గాని ప్రత్యేకించి దయామయురాలు కాకపోతే, ఆమె కొన్ని సందర్భాల్లో ఆ సమష్టిలోకి మహా వినాశకరమైన శక్తిని ప్రవేశపెట్టవచ్చు. అప్పుడు అనుభవశూన్యుడైన బోధకుడికి ఆమె గుప్త ప్రభావాన్ని ఎదుర్కోవడం కష్టం అవు

తుంది. అదెన్నడూ ఉపరితలంమీద కాక చాప కింద నీరులా వుండటమే యిందుకు కారణం. సంవేదనలను గురించిన చర్చలు, వాదోపవాదాలు, లేక వట్టినే సంభాషణలు అదిగో అలాంటి చోటనే ముఖ్యంగా అవసరం.

కార్యకలాపాలు, కార్యకలాపాలు మాత్రమే మానవ వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుతాయని నేనింతకు ముందే చెప్పాను. అయితే "కార్యకలాపాలకి" సంబంధించిన భావనలో నైతిక ప్రమాణాల దిశగానూ, శ్రమలో, ప్రేమలో, చదువులో, క్రీడల్లో, కళల్లో, విజ్ఞాన శాస్త్రంలో మహత్తర నైతిక ఆదర్శాల గ్రహింపు దిశగానూ సన్నిహిత సాహచర్యాలు కూడా విధిగా యిమిడివుండాలి.

## ఆత్మచైతన్యం ఎలా ఏర్పడుతుంది

సంబంధాల రెండు రంగాలను గురించి – వస్తు ప్రపంచం (చదువు, శ్రమ, కళ) పట్ల పిల్లల వైఖరి, సమస్త జీవజాలంపట్ల, ప్రధానంగా మనిషిపట్ల పిల్లల వైఖరి గురించి – బోధన శాస్త్రం చాలా చెబుతుంది.

అయితే మూడో రంగం ఒకటి వుంది. పిల్లల పెంపకంలో యీ మూడో రంగం – పెరుగుతున్న వ్యక్తికి తనపట్ల తనకి వున్న వైఖరి, అంటే తన వ్యక్తిత్వం గురించిన జ్ఞానం – తరచు పరిగణనలోకి తీసుకోబడదు.

ఈ ఆత్మ చైతన్యం దేనితో మొదలవుతుంది? దాని హద్దులు ఏమిటి? ఏ ఘటనల్లో అవి ప్రదర్శితమవుతాయి? ఎవరైనా యీ అపూర్వ మానవ "స్వయం"ని – స్వయం క్రమశిక్షణ, స్వాధీనత, స్వయం వ్యక్తిత్వం, ఆత్మగౌరవం, స్వయం అంచనా, స్వయం శిక్షణ, స్వయం నియంత్రణ, స్వయం పరిపూర్ణతలని – ఎలా అభివృద్ధి చెయ్యాలి?

మనస్తత్వ శాస్త్రజ్ఞులు స్వయం అంచనా క్రమంగా అభివృద్ధి చెందుతుందనీ, బహుశా అది తన సొంత శరీరపు పరిమితుల గుర్తింపుతో ప్రారంభమవుతుందనీ పేర్కొంటారు. తరువాత పిల్లలు సాంఘిక పరాధీనతల, హక్కుల, విధుల, ప్రమాణాల, విధి నిషేధాల వ్యవస్థలో తమని తాము చూసుకుంటారు... 13–15 ఏళ్ల వయస్సులో "సొంత శరీరపు పరిమితులు" పిల్లలకి తదితర వేయిన్నొక్క సమస్యలంతగా ముఖ్యమైనవి.

మన పెద్దవాళ్లం సందిగ్ధావస్థలనే ఊబిలో చిక్కుకొని వుంటాం. మన పిల్లల అభివృద్ధి, చదువు, వగైరాల్లో వాళ్లకి మనం ఎలా సహాయం చెయ్యగలం అని సతమతమవుతూ వుంటాం. వాళ్లేమో తమ ఎత్తు, బరువు, ముఖ చాయ వంటి పూర్తి భిన్నమైన విషయాలను గురించి సతమతమవుతూ వుంటారు.

పిల్లల్లో తమ రూపం గురించి పట్టించుకోనివాళ్లు ఏ ఒక్కరూ వుండరు. చిత్రంగా

కనిపించవచ్చునేమో గాని, స్వయం అంచనా వాళ్ల సంవేదనల్లో చాలా వాటినీ, తత్పర్యవసానంగా వాళ్ల సాధారణ మానసిక, బౌద్ధిక అభివృద్ధినీ నిర్ణయిస్తుంది.

కౌమార వయస్కుల ఆత్మచైతన్య అభివృద్ధికి సంబంధించిన కొన్ని పార్శ్వాలను పేర్కొనేందుకూ, ప్రతి ఒక విడి సందర్భంలోనూ మనం ఎలా వ్యవహరించాలో ఆ మార్గాలను గురించి ఆలోచించేందుకూ ప్రయత్నిద్దాం.

మొదటిది. పొడవు సమస్య

ఒక ఏడవ తరగతి అమ్మాయి తను 171 సెంటిమీటర్ల పొడవు వున్నందుకు బాధపడుతుంది. క్లాసంతటికీ ఆమే పొడుగు. ఆమె బ్లాక్‌బోర్డు దగ్గరకి వెళ్లి వంగుంటుంది. ఆమె తన కాళ్లు వంచుతుంది. ఆమె భుజాలను కుదిస్తుంది. అది ఎప్పుడూ పరమ బాధగా వుంటుంది. అందుకే బ్లాక్‌బోర్డు దగ్గరకి వెళ్లి ప్రశ్నలకు సమాధానాలు చెప్పేందుకు ఆమె నిరాకరిస్తుంది. మరోసారి అవమానం కంటె ఫెయిల్ మార్కే మేలు అనుకుంటుంది. "గడక్కర!" అంటూ తన సమవయస్కులు అనే మాట ఆమె మనస్సులో నాటుకుపోయింది. "నువ్వెందుకు అంత వంగిపోతావ్?" అంటూ వుంటుంది టీచరు. "అలా వంగకే, నిటారుగా నిలబడు, చూడు నీకెంత చక్కటి ఆకారం వుందో" అని వాళ్ల అమ్మ ఆప్యాయంగా చెప్తూ వుంటుంది.

వీటన్నింటికీ తోడు ఆమెకి తన కంటె బాగా పొట్టివాడైన ఒక అబ్బాయంటే యిష్టం. కావాలని కొన్నట్లు, వాళ్ల అమ్మ ఆమెకి హైహీల్సు షూలు కొంటుంది. లోహీల్సు షూలు యిప్పుడింకెవరూ వేసుకోవడం లేదంటుంది. వాళ్ల అమ్మ హైహీల్సు షూలు వేసుకుంటే, అమ్మాయిలు మరింత సొగసుగా, మరింత పొందికగా కనిపిస్తారని నచ్చజెప్పేందుకు గంటల తరబడి ప్రయత్నిస్తుంది. ఆమె తండ్రి ప్రామాణికమైన నిర్దుష్ట శరీరంలో కాళ్లు మొండెం కంటె దాదాపు మూడు రెట్లు పొడుగు వుంటాయనీ, కాళ్లు నేరుగా భుజాల నుంచి పెరుగుతాయనే సిద్ధాంతం అదే పనిగా వల్లిస్తాడు... ఈ సంభాషణలన్నీ ఆ అమ్మాయి మనస్సును చిరాకుపరచి, గాయపరుస్తాయి, ఆమెను ఎవ్వరూ అర్థంచేసుకోరు, ఆమె రాత్రి పూట కన్నీరు మున్నీరుగా ఎలా ఏడుస్తుందో ఎవరికీ తెలియదు.

నిశితమైన ఘర్షణలు సాగుతూ వుంటాయి.

కూతురు: "పాదరక్షల మరమ్మతు కొట్టుకి వెళ్లి హీల్సు పొట్టి చేయించుకుంటాను..."

తల్లి: "నీకేమైనా పిచ్చెత్తిందేమిటే, బంగారం లాంటి కొత్త షూలు పాడుచేస్తానంటావేమిటి!.."

కూతురు: "నేనీ షూలు స్కూలుకి వేసుకెళ్లను."

తల్లి: "బడుద్ధాయిలా మాట్లాడకు. వెంటనే బట్టలేసుకుని బయటకి పో."

కూతురు: "చెప్పాను కదా నేను వెళ్లనని, అంతే, నేను వెళ్లను."

తల్లి: "ఎంత పొగరే, నన్నే ఎదిరిస్తున్నావ్?"

కూతురు: "చెప్పిందేదీ అర్థంచేసుకోకపోతే, యింక నీతో ఎలా మాట్లాడాలి?"

అలాంటి ప్రతి సన్నివేశంలోనూ ఆ అమ్మాయి అంతరంగంలో రెండు పొరలు వున్నాయన్న విషయం గమనించండి. ఉపరితలంలో వున్నది కనీసం ఆ అమ్మాయికి సన్నిహితులైన వాళ్లకి తెలుసు. ఆమె పొడవు విపరీతమైన భారమన్న సంగతి ఆమె తల్లికి తెలుసు. ఆమె దాని ప్రాముఖ్యాన్ని ఎలాగో తక్కువ చేసేందుకు ప్రయత్నిస్తుంది. దానిదేముంది, స్వల్ప విషయం, దానిలో ప్రత్యేకత ఏమీ లేదు, అలాంటిదానికోసం ఆదుర్దాపడటం ఎందుకు అంటుంది. కాని ఆ తల్లికి తన కూతురు అంతరంగంలోని రెండో పొర, అంటే ఆమె సొంత శరీరానికి సంబంధించిన ఆమె దృష్టి, ఆమె స్వయం అంచనా తెలియవు. తన కూతురి గుప్త బాల్యోచిత భయాలు, ఆకాంక్షలు, ఆమె ఊహ ఆమె "యిక్కట్టు"ని ఆకాశ ప్రమాణంగా పెంచడం – యివేవీ ఆ తల్లికి అర్థం కావు. ఈ "యిక్కట్టు" ఒకరి ప్రవర్తనకి ఒక మాదిరి నియంత్రణకర్త, నిరంతరాయమైన ఆలోచనలకి, పోలికలకి, సాదృశ్యాలకి, అనుభవాలకి సంబంధించిన అంశం అవుతుంది. ఆ అమ్మాయి గంటల తరబడి యిలా ఆలోచిస్తూ, మదింపు వేస్తూ గడుపుతుంది: "నేను ఏడాదికి కనీసం రెండు సెంటిమీటర్లు ఎదిగినా (యిప్పటిదాకా ఏడాదికి యీ పెరుగుదల 4 సెంటిమీటర్లు!), యిప్పణ్ణుంచి తొమ్మిదేళ్లలో నా పొడుగు మరో 18 సెంటిమీటర్లు పెరుగుతుంది. నేను మొత్తం దాదాపు 190 సెంటిమీటర్లు వుంటాను. పెరుగుదల ఏడాదికి 3 సెంటిమీటర్లైతే, నేను రెండు మీటర్లు మించిపోతాను." ఆ అమ్మాయి యింకా యిలా కూడా అనుకొని వుంటుంది: "పొడుగు ఎదగకుండా ఆపే టాబ్లెట్లు వుండవచ్చు." ఈ విషయం తన తల్లికి వివరించి చెప్పేందుకు ఆమె ప్రయత్నించింది. కాని ఆ తల్లి అసలు ఆ విషయం పట్టించుకోనే లేదు. "రేపు క్లాసులో పిల్లలు నన్ను చూసి మళ్లీ నవ్వుతారు. క్లాసు పార్టీ జరుగుతుంది. నన్ను డాన్సుకి ఎవరూ ఆహ్వానించరు... అంతా యింత దిక్కుమాలినట్లుంటే నాకెందుకు యీ మంచి మార్కులు, తగలేసుకునేందుకా? ఈ పొడుగుతో యిలా చావాల్సిందేనా?.."

ఆమె బాత్‌రూములోని అద్దం ముందు గంటల తరబడి యిలా అనుకొంటూ గడుపుతుంది: "ఓయ్ నాయనోయ్, యీ రాకాసి చేతులేమిటి, నా మోకాళ్ల కంటె కిందకి వున్నాయి! మామూలు అమ్మాయిలకి ఎవళ్లకైనా యిలా మోకాళ్ల కిందదాకా చేతులు వుంటాయా? చేతుల విషయంలో యింత గొడవ వుండదు. మోచేతులు మడిస్తే చాలు చేతులు పొట్టిగా కనిపిస్తాయి. నా మెడ కొంగ మెడ (అబ్బాయిలు ఆమెకి జిరాఫీ అని పేరు పెట్టారు!), కాని దీన్ని ఎలాగో ఒక లాగ మరుగుపరచవచ్చు. నా తల కాస్త కుంచిస్తే సరిపోతుంది, లేకపోతే నా కాలరు పైకెత్తితే అది ఎవరికీ కనిపించదు. కాని కర్మ, నా కాళ్లని ఎక్కడ దాచుకుని చచ్చేది!.. తన పక్కన నిలబడినప్పుడు అబ్బాయిలు మునివేళ్లమీద నిలబడటం, సాగడం, ఫుట్‌పాత్‌మీద తన సరసన నడిచేటప్పుడు బాగా ఎత్తుగా ఉన్న చోట నడిచేందుకు ప్రయత్నించడం, ఆమె తమ కంటె పొడుగ్గా వుండటం యితరులు గమనించకుండా వుండేందుకు

గాను సాధ్యమైనంత తొందరగా కూర్చునేందుకు ప్రయత్నించవలసిరావడం దారుణం..."
ఆమె తల్లికి యివేవీ తెలియవు. ఎవరికీ తెలియవు.

పిల్లలు ప్రతిరూపాల్లో ఆలోచించుకుంటారు. వాళ్ల ఆత్మ చైతన్యం వస్తు నిష్ఠంగా, ప్రతిరూప నిష్ఠంగా వుంటుంది. పిల్లలు తమ మానవ పరిసరాల్లో తమ స్వయం ప్రతి రూపం ఏర్పడిన పద్ధతిలో తమని తాము చూసుకుంటారు. ఈ ప్రతిరూపానికి ప్రతి కూల చాయలు వుంటే, వాళ్లని గురించిన వాళ్ల దృష్టిలో బొత్తిగా అనాకర్షణీయమైన అతిశయం, వికృతం చేయబడిన వివరాలు చోటుచేసుకుంటాయి. వికృత నమూనాకి సంబం ధించిన తమ సొంత భావనలతో చిత్రించుకోబడిన యీ "స్వయం అంచనా" తనతో బాటు శారీరకమైన బాధని కలిగిస్తుంది. అందుకే మనం యిక్కడ మాట్లాడేది అవకతవకగా ఉండ టం గురించి కాక స్వయం అంచనాకి సంబంధించిన ప్రగాఢ క్రమాలను గురించి. "శరీర పరిమాణాలు" కాక, పిల్లల స్వయం అంచనాలో సామాన్యంగా సాంఘిక అన్వయం మిళి తమై వుండటమే ప్రధానాంశమనడం స్పష్టం. ఇతర పిల్లలు తమని ఎలా చూస్తారో, తమని తాము కూడా అలాగే చూస్తామని పిల్లలు అనుకుంటారు. లేకపోతే, ఆ అమ్మాయికి తన ఆకారం సరిగా లేదన్న భావం ఎక్కణ్ణుంచి వచ్చింది? పిల్లల పరిసరాల్లో ప్రమాణం గురించిన వాళ్ల సొంత ప్రమాణం అలవరచుకోబడుతుంది. ఈ నమూనాకి అతీతంగా వున్న ప్రతీదీ సామాన్యంగా ఎగతాళికీ, హాస్యానికీ గురి అవుతుంది. కాస్త పొడుగ్గా వుంటే "గడక్కర"; కాస్త లావుగా వుంటే "డరోతీ" లేకపోతే "పీపా." ఎగతాళి పేర్లతో పిలిస్తే మగపిల్లలు పలుకుతారు. ఒక్కొక్క సారి తమని తామే ఎగతాళి చేసుకుంటూ వుంటారు. నిజానికి సమస్యని దాటవేసేందుకు యిదొక పద్ధతి. ప్రతి ఒక్కరూ తన సొంత పద్ధతిని ఎంచుకుంటారు. పైకి కోపం, ఉడుకుబోతుతనం ప్రదర్శిస్తే, పిల్లలు మరింత ఏడిపి స్తారు! "నేను దుబ్బగా వున్నాను – బియ్యపు బస్తా లాగ!" అని తనే అంటే, ఎదటివాళ్ల నోటి మాట పడిపోతుంది. "బొండాం!" అనో, "పీపా!" అనో విన్నప్పుడల్లా పిల్లలకి తమ మనస్సునంతనీ చింతాక్రాంతం చేసిన తమ "స్వయం ప్రతిరూపం" గుర్తుకొస్తుంది. ఆడ పిల్లలు అలాంటి లావుపాటి మగపిల్లల్ని చూసి నవ్వుతారు. ఒకసారి టీచరు కూడా చిరు నవ్వు నవ్వింది, అంతలోనే సర్దుకుని "తప్పు, అలా అనకూడదు!" అంటూ క్లాసుని మంద లించింది.

పిల్లలు ఒకళ్ల తర్వాత ఒకళ్లు "అబ్బే, వీడేం అనుకోడు! కదురా బొండాం, నువ్వేం ఉడుక్కోవు, ఔనా?" అంటారు. లావు కుర్రాడు నవ్వేసి, "నేనెందుకు ఉడుక్కో వాలి?" అంటాడు. కాని వాడి అంతరంగంలో తీవ్రమైన వేదన చెలరేగుతుంది. ఇంకేదో, ఎక్కడో ఆశాలేశం వుండివుండకపోతే, వాడు ఏ నీళ్లలోనో దూకి చచ్చిపోయినా చచ్చిపోగలడు.

ఆశ: సుదూరాన భిన్నమైన మరో "స్వయం ప్రతిరూపం" చూసుకుంటాడు. ఆ

కుర్రాడే, కాని వాడు పూర్తి భిన్నంగా వుంటాడు: దిట్టంగా, అన్ని అంగాలూ సజావుగా, మంచి బలంగా...

ఆశ అన్నది పెంపకంలో, మరింత సరిగ్గా చెప్పాలంటే, స్వయం పెంపకంలో ఒక ఆవశ్యకతగా వుండాలి.

ఇంటి దగ్గర రక్షణ వాతావరణం విధిగా కల్పించాలనడం స్పష్టం. పెద్దవాళ్లు తమ పిల్లలకి విధిగా సహచరులు అవాలి. "ఏమిటి, నీ హీల్సు తగ్గించాలంటావా? చూద్దాం వుండు! తగ్గిస్తే ఎంత కలిసివస్తుందో చూద్దాం. పొడుగు పూరాగా మూడు సెంటిమీటర్లు తగ్గిపోతుంది. భలే."

కూతురి మానసిక సాన్నిహిత్యం కంటె మూడు సెంటిమీటర్ల హీలు ఎక్కువ విలువైనదా? దాన్ని పొట్టిచెయ్యడం అదనపు బాదరబందీ, గొడవే అనుకోండి! కాని ఆ అమ్మాయి ఆశకి దగ్గరకొచ్చేందుకు మరో మార్గం ఏముంది? ఆ అమ్మాయి ఆశని చూడగలిగిన, ఆమె పాదరక్షల మరమ్మతు ఖానాకి పరుగున వెళ్లి అనవసరమైన ఎత్తుని "తెగ్గొట్టించుకో" గలిగిన, ఆమె కళ్ల ముందు మరింత ఆకర్షణీయమైన "స్వయం ప్రతిరూపం" ఏర్పడిన క్షణం ఎంత మహత్తరమైనది.

ఇవిగో ఆ కొత్త షూలు. ఆ అదనపు మూడు సెంటిమీటర్లు అసలెప్పుడూ లేనేలేవేమో అనిపిస్తోంది.

తల్లి: "నీకు మంచి ఆలోచన వచ్చిందే. ఇప్పుడంతా కొత్తగా వుంది!"

కూతురు: "యిప్పుడు బాగున్నాయి!"

తల్లి: "నీకు మంచి అభిరుచి వుంది. తొడుక్కుని నడిస్తే యిప్పుడెలా వుంది?"

కూతురు: "భలేగా వుంది!"

తండ్రితో, బామ్మతో, తాతతో కూడా యిలాంటి సంభాషణలే జరిగితే, చాలా మంచిది. కొత్త "స్వయం ప్రతిరూపాన్ని" పటిష్ఠంచేసే క్రమం సుదీర్ఘమైనది. ఆ అమ్మాయికి తన పొడవులో విషాదకరమైనదేమీ లేదన్న నమ్మకం కలగాలి. అంతే కాదు ఎత్తుగా వుండటంలో ఎన్నో వీళ్లు వున్నాయని కూడా ఆమెకి చెప్పాలి. అవసర పరిస్థితిలో యీ వీళ్లు తనకి "వినియోగపడతాయని" చెప్పాలి. పొడుగైన అమ్మాయికి వాలీబాల్, బాస్కెట్‌బాల్ ఆటలు చాలా ఆసక్తికరంగా వుంటాయి. ఆ పిల్లలో కొత్త ఆకాంక్షలు మొలకెత్తుతాయి. ఒక పొడుగాటి అమ్మాయి తను పొడుగైన యితర అమ్మాయిల మధ్య ఉన్నప్పుడు, పూర్తి భిన్నంగా అనుభూతి చెందనారంభిస్తుంది, తన కొత్త "స్వయం ప్రతిరూపానికి" సంబంధించిన వివరాలను పూర్తి భిన్నంగా గ్రహించనారంభిస్తుంది.

<u>రెండవ పరిస్థితి. దీనిలో పిల్లల బాహ్య రూపానికీ, వాళ్ల వ్యక్తిత్వపు నైతిక రూపధారణకీ మధ్య ప్రత్యక్ష సంబంధం వుంటుంది.</u>

14–15 ఏళ్ల వయస్సులో, ప్రత్యేకించి ఆడపిల్లలకి, ఒక మంచి పుస్తకం కంటె

ఒక అద్దం ఎంతో ఎక్కువ ముఖ్యమైనది కావచ్చు. తనని గురించిన తన "స్వయం అంచనా" సాగుతూ వుంటుంది. అంతకు పూర్వం "స్వయం ప్రతిరూపపు" రేఖలు చేతులు, కాళ్లు, తల వంటి సాధారణ లక్షణాలుగా గ్రహించబడగా, యిప్పుడవి బాగా సవివరంగా గ్రహించబడతాయి: కళ్లు, చెవులు, నోరు, దేహ చాయ, కనుబొమలు, జుట్టు, శిరో చాలనం, నవ్వు, చిరునవ్వు, కనిపించీ కనిపించని పెదవుల కదలిక, అరమోడ్పు కళ్లు, అవి మరింత మూసుకోవడం... ఒక్కొక్క సారి ఓ కొత్త ముఖం... ప్రతి ఒక్క సారీ ఓ కొత్త ముఖం — ఓ కొత్త లక్షణం, యిదంతా పరమ ఆసక్తికరంగా వుంటుంది. ఈ స్వీయాన్వేషణలో గంటలు, వారాలు, నెలలు, సంవత్సరాలు గడిచిపోతాయి. ఏదో ఒకటి మారుతుంది, ఏదో ఒకటి తీర్చి దిద్దబడుతుంది. ఒకరి చెవులు పొడుచుకొని వుంటాయి, అందుకని జుట్టు పొడుగ్గా పెంచుకోవాలి. పలచటి పెదవుల్ని దారంలా సాగదియ్యకూడదు. నిరంతరం ముఖంమీద చిరునవ్వు వుండేవాళ్లు మధ్యమధ్య కొంచెం ముఖం చిట్లిస్తూ వుండటం నేర్చుకోవాలి (ఎవళ్లు చూసినా ఎప్పుడూ "ఎందుకలా నవ్వుతావ్?" అంటూ వుంటారు. "నన్నేం చెయ్యమంటావ్, అది నా ముఖం తీరు" అని చెప్పిచెప్పి నాకు విసుగెత్తిపోయింది).

ఇకపోతే కొందరు కుంగిపోతూ, ప్రమాణాలను అందుకునేందుకు ప్రయత్నిస్తూ వుంటారు. ఆశ్చర్యం కొలిపేటంత చక్కటి అమ్మాయిలు, అబ్బాయిలు తాము వికారంగా వున్నామని నమ్ముతూ వుంటారు. తమ రూపం తమ సొంత ప్రమాణాలకు దీటుగా లేకపోవడమే యిందుకు కారణం. మరైతే వాళ్లకి యీ ప్రమాణాలు ఎక్కణ్ణుంచి వచ్చాయి? సినిమాలు, పిక్చర్ పోస్ట్‌కార్డులు, డ్రాయింగుల్నించి. ఇంకా ఎక్కణ్ణుంచి? ఆ ప్రమాణాలతో పరిచయం వున్న సీనియర్ విద్యార్థుల్నించి. ఎలా నవ్వాలో, తల ఎలా పెట్టాలో, తమ జుట్టు ఎలా దువ్వుకోవాలో, మర్యాదమన్ననలు వాళ్లకి తెలుసు.

కౌమార వయస్కులు సమకాలీన సౌందర్యపు బాహ్య పార్శ్వాలను మాత్రమే స్వీకరించినట్లయితే, నైతిక పొరపాట్లు అనివార్యమవుతాయి.

ఒకసారి ఒక తండ్రి తన కొడుక్కి ఒక పనివాడిని గురించి యిలా చెప్పాడు:

"అతనికి దిగ్భ్రాంతి గొలిపేటంతటి అందమైన ముఖం వుంది. అతని ముఖంలో తెలివితేటలు కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి. అతనిది ఆలోచనాశీలి ముఖం" (అయితే అతని శరీరం అంత తీరువగా వుండదు. అతను అంత ఎక్కువ పొడుగు కాదు).

"అతనిలో ఏమి అందం వుంది?" అంటూ సాశ్చర్యంగా అడిగాడు కొడుకు.

"అతని కదలికల్లోని వైభవం నీకు కనిపించడం లేదూ? అతని కృతనిశ్చితమైన కళ్లు, తెలివి ఉట్టిపడే చూపు. అబ్బ, ఎంత బలమో! సిసలైన పురుష సౌందర్యం!"

సిసలైన పురుష సమరసతా ప్రమాణం గురించి అబ్బాయిలకి చెప్పాలి. మేధా సంపద, బలం, దయ ముఖంలో ఉట్టిపడే మనిషి ఎప్పుడూ అందమైనవాడన్న విషయాన్ని పిల్లలు

అర్థంచేసుకునేలా ప్రయత్నించండి. పిల్లలు తమని తాము తీర్చిదిద్దుకునేటప్పుడు యీ ఆలోచన వాళ్లకి కొత్త కీలక సూత్రంగా వుండేలా చూడండి.

ఇక మూడవ పరిస్థితి. మీ పిల్లలు తమని గురించి తాము ఏమనుకుంటారో అర్థం చేసుకునేందుకు ప్రయత్నించండి!

సాంఘిక మనస్తత్వ శాస్త్రవేత్తల్లో సుమారు యీకింది ఆలోచనా ధోరణి నాకు కనిపించింది: చాలా సందర్భాల్లో 'స్వయం అంచనా' (తనని గురించిన ప్రధానమైన ఆలోచనలు) ఒకరి సంవేదనలతో ముడిపడి వుంటుంది. ఒక వ్యక్తి తనని తాను గౌరవించుకోవచ్చు, తక్కువగా చూసుకోవచ్చు. యితరుల్ని తక్కువగా చూసినప్పుడు లేక గౌరవించినప్పుడు వాళ్లపట్ల వ్యక్తి ఎలాంటి సంవేదన పొందుతాడో, తనపట్ల తాను కూడా అలాంటి సంవేదననే పొందుతాడు.

పిల్లలు తాము గౌరవించనివాళ్లతో తమ సద్యోజనిత భావాల కారణంగా ఎలా ప్రవర్తిస్తారో ఊహించుకునేందుకు ప్రయత్నించండి. వాళ్లు చెప్పే పని ఒక్కదాన్ని కూడా పిల్లలు మనస్ఫూర్తిగా చెయ్యరు. పెద్దవాళ్లు యిచ్చే సలహాల్లో లేక చేసే అభ్యర్థనల్లో అధికాంశాన్ని పెడచెవిన పెడతారు. అంతే కాదు వాటిని అపహాస్యం చేస్తారు. పిల్లలు తాము అసహ్యించుకునే పెద్దవాళ్లు సీరియస్ విషయాలు, మంచి విషయాలు చెప్పినా కూడా, వాళ్లని ప్రతికూలంగానే చూస్తారు.

సరిగా యిందుకు తలకిందులుగా కూడా జరుగుతూ వుంటుంది. పిల్లలకి ఎవరిపట్లనైనా గౌరవం వుంటే, వాళ్ల అభ్యర్థనల్లో చాలామటుకు విధిగా నిర్వర్తిస్తారు.

పిల్లలు తమని తాము తక్కువగా చూసుకునే పరిస్థితిని యిప్పుడు చూద్దాం. వీళ్లు తమ శారీరక రూపంపట్ల అసంతృప్తిగా వుంటారు. వీళ్లు మొత్తంమీద తమ గుణాలపట్ల అసంతృప్తిగా, తమకి తాము భారంగా వుంటారు. ఈ మాదిరి ఆత్మప్రతికూలతత్వం చాలా తరచుగా తటస్థపడుతూ వుంటుంది. ఈ ప్రతికూలతత్వం తమపట్ల తాము తృప్తి చెందకపోవడం అన్న సానుకూల గుణం అనే కత్తివాదరనుంచి ఉత్పన్నమవుతుంది. మనం పిల్లల్ని తరచు స్వార్థపరులనీ, ఎంత సేపూ తమకోసం వస్తువులు పోగుచేసుకునేందుకే వాళ్లు ప్రయత్నిస్తున్నారనీ తిడుతూ వుంటాం. అయితే యీ ప్రతికూల లక్షణాల వెనక ఆ పిల్లల పెంపకంలో మన పొరపాట్ల ఫలితాలని చూడం. కొన్ని కర్తవ్యాల నిర్వహణను పిల్లలకి నేర్పకపోవడమే వాళ్లు స్వార్థపరులయ్యేందుకు తరచు కారణం. ఏళ్ల తరబడి సోమరిగా ఉండేందుకు అలవాటుపడిన పిల్లలు తమ సామర్థ్యాలను వెల్లడించరు.

కర్తవ్య నిర్వహణ నేర్పే పెంపకం పెద్దల్నీ, పిల్లల్నీ మరింత సన్నిహితంచేయడం, ఓర్మికీ, దయకీ, పరహితేచ్ఛకీ అది నికరమైన పరీక్ష కావడం చాలా ముఖ్యం.

చాలా తరచు కౌమార వయస్కులూ, యువతీయువకులూ తమ ఆలోచనల్నీ, అను

భూతుల్నీ ఫోక్తుపరచుకోలేరు. అయితే, వాళ్ల స్వయం అంచనా ఆ పిల్లల్ని గురించి యితరుల అంచనాల, వ్యాఖ్యల ప్రాతిపదికమీద ఏర్పడుతుంది.

"నేనెలా కనిపిస్తాను?" అనే ప్రశ్న అడగడం కౌమార వయస్కులకి కష్టం. అతను అందుకు సిగ్గుపడతాడు. నవ్వుతారేమోనని బెదురుతాడు. ఏ కారణంగానో తెలియదు గాని, పెద్దవాళ్లు తమ పిల్లల యోగ్యతలను గురించి మాట్లాడరు. తరచు వాళ్లు పిల్లల లోపాలను గురించే మాట్లాడతారు: "నువ్వెప్పుడూ యీ తప్పు చేస్తూనే వుంటావు. మిగతావాళ్లని చూడు, వాళ్లెప్పుడూ యిలా ప్రవర్తించరు," వగైరా అంటూ సతాయిస్తూ వుంటారు. ఈ ప్రతికూల అంచనాల ప్రాతిపదికమీద వ్యక్తిత్వపు ఒక ప్రతికూల నమూనా గుదికూర్చ బడుతుంది. ఈ నమూనాని పిల్లలు తరచు అసహ్యించుకుంటారు. అయితే, యీ అస హ్యం ఆ పిల్లలకే పరిమితం కాదు. ఇదొక క్రియాశీల సంవేదన కనుక, యిది ఏదో ఒక విధంగా ఆ పిల్లలకి జీవితంలో తటస్థపడినవాళ్లకి వ్యతిరేకంగా మళ్లుతుంది. వీళ్లు తమని తాము తక్కువగా చూసుకుంటారు కనుక, వీళ్లు తమకి మిక్కిలి సన్నిహితులైనవాళ్లతో సహా యితరుల్ని అసహ్యించుకోనారంభిస్తారు. ఈవిధంగా తమని గురించిన తమ ప్రతికూల అవగాహన ప్రతికూల నైతిక లక్షణాలకు దారితీస్తుంది. ఈ ప్రతికూల నైతిక లక్షణాలు తమ చుట్టూ వున్నవాళ్లపట్ల సంబంధాల్లో ప్రస్ఫుటమవుతాయి.

మన పిల్లల యోగ్యతలను గురించి చెప్పేందుకు మనం ఎందుకు భయపడాలి? బహుశా వాళ్లలో ఎక్కడ అతిశయం, ఆత్మసంతృప్తి పెరిగిపోతాయేమోనని భయమా?

అయితే అలాంటి సందర్భాల్లో యిందుకు పిల్లల్లో వివిధ శక్తుల మధ్య సాగుతున్న ఘర్షణని గురించి మాట్లాడటం అనే రాజీ మార్గాన్ని అనుసరించవచ్చు.

చిన్న వయస్సులో వ్యతిరేకించడానికి గల శక్తి నిర్మాణాత్మకమూ, వినాశకరమూ కూడా కావచ్చు. కౌమార వయస్కుల్ని యీ ప్రమాదానికి వ్యతిరేకంగా కాపాడవలసి వుంటుంది.

ఇలాంటి పరిస్థితిలో సంభాషణ యీకింది వైఖరి తీసుకోకుండా వుండటం కష్టమైన విషయం:

"సరే నువ్వు అందర్నీ తీసిపారేస్తున్నావు, మరి నీ సంగతేమిటి? నీకు మిగిలినవాళ్లని విమర్శించే నైతిక హక్కు వుందేమో ఆలోచించుకున్నావా?" మనం తప్పకుండా యీ వైఖరి తీసుకోవచ్చు. కాని యీ వైఖరి అత్యంత ఫలదాయకంగా వుంటుందా అన్నది అనుమా నాస్పదమే. ఆ కౌమార వయస్కుల్లో తలెత్తిన ఒక విలువైన లక్షణాన్ని — నైతిక మెరుగుదల దిశగా ఉన్ముఖమైన రాజీలేని తత్వాన్ని — యీ రకమైన విమర్శ చిదిమెయ్యవచ్చు. పిల్లల అతిశాయితల్లో ఎప్పుడూ రెండు ప్రారంభాలు, రెండు ప్రబలాంశాలు వుంటాయి. వాటిలో ఒకటి జీవశక్తి, విమర్శ, జీవితంపట్ల, స్వయంగా తమపట్ల నిశిత దృష్టి, తమపట్లా, యితరులపట్లా తీవ్ర చర్యలకు, విధి నిషేధాలకు అభిముఖ్యాలతో సమ్మిళితమై వుంటుంది.

రెండవదాని వ్యతిరేకతత్వం మొదటిదానిలోని విలువైనదాన్నంతనీ భస్మంచేసెయ్యగలు

గుతుంది. ఇక్కడ సమస్య యీ రెండింటికీ మధ్య సమతులనం కాదు, మొదటి ప్రబలాంశపు తిరుగులేని ప్రాముఖ్యం. బోధకుడి కర్తవ్యం మొదటి ప్రారంభాంశాన్ని దాని పూర్తి పరిమితికి అభివృద్ధిచేయడం. అప్పుడు పిల్లలు యితరులపైనా, తమపైన తామూ పెట్టుకునే అధికతర విధినిషేధాలు వాస్తవికంగా పూర్తిచెయ్యబడతాయి. ఈ కారణంగా, బోధకులకి రిస్కు తీసుకునే హక్కు లేదు. వాళ్లకి ఒకే ప్రత్యామ్నాయం వుంది: కౌమార వయస్కులకి వుండే చాలా సమస్యలకి దారితీసే సుదృఢ భావోద్విగ్న మానసిక స్థితి తనని తాను వ్యక్తం చేసుకోగలగడాన్ని ఖాయం చెయ్యడమే అది.

ఇలాంటి సందర్భంలో ఈ మాదిరి సంభాషణ జరపవచ్చు:

"మొత్తంమీద నువ్వు యితరులమీద ఉన్నత విధినిషేధాలు పెడుతున్నావు. అది మంచిదే, కాని అది మరీ అంత తేలిక కాదు. బహుశా అది నీకే కష్టం కావచ్చు."

"బహుశా నిన్ను నువ్వే చాలా విషయాల్లో అసహ్యించుకుంటున్నట్లున్నావు. ఈ అసహ్యం నీకున్న మంచివాటిని — హేతుబద్ధతనీ, ఆఖరికి నీ సామర్థ్యాలనీ — నాశనంచేస్తోంది. నీలో వున్న అత్యుత్తమమైనవాటన్నింటినీ నువ్వే నాశనంచేసుకుంటే, నువ్వు నీ ఆదర్శాన్ని ఎలా చేరుకుంటావు?"

తదుపరి సంభాషణల్లో మనిషి అపరిమిత పాటవాలను గురించీ, స్వయం క్రమశిక్షణ, స్వయం క్రమబద్ధీకరణ సమస్యలను గురించీ, ఆదర్శాన్ని చేరుకునే మార్గాలను గురించీ మీరు ప్రస్తావించవచ్చు.

నాలుగవ పరిస్థితి. పిల్లలు పెద్దవాళ్లయాక వాళ్లు మిమ్మల్ని ఏ విషయంలో నిందించగలుగుతారో దాన్ని గురించి ఆలోచించండి.

ఉన్నత స్థాయి ఆత్మచైతన్యం వుండాలన్నప్పుడు ఉన్నత స్థాయి ఆత్మజ్ఞానం అనబడేది వుండటం అవసరం. పిల్లలు అన్నీ అర్థంచేసుకుంటారు, లేక మరింత కచ్చితంగా చెప్పాలంటే, వాళ్లకి చాలా విషయాలను గురించి సరైన అభిప్రాయం వుంటుంది, కాని అనేక కారణాల మూలంగా తమ యీ ఊహలు సరైనవని గ్రహించలేరు — యిలాంటి పరిస్థితి మనకి తరచు తటస్థపడుతూ వుంటుంది. క్రమబద్ధమైన పని అలవాట్లు లేకపోవడమే యిందుకు కారణం.

కాగా, యిక్కడ సమస్య పిల్లలచేత — ప్రత్యేకించి తమని గురించే — నిరంతరం పని చేయించడం ఎలా?

...రెండు వారాల పాటు ఒక కౌమార వయస్కుడు దాదాపు ఏమీ చెయ్యడు. స్కూలు నుంచి యింటికి వస్తాడు, కాలం వృథా చేసేస్తాడు. వాడు ఏదో పని మొదలుపెడతాడు, దాన్ని మధ్యలో వదిలేసి మరోటి మొదలుపెడతాడు. వాడు తన స్కూలు హోమ్‌వర్కు తప్ప యింకేదైనా చేస్తాడు. వాడు అందుకు రకరకాల సాకులు చెప్తాడు. వాడు తనకి తల నొప్పి వచ్చిందనో, కడుపు నొప్పిపెడుతోందనో, అదీ కాకపోతే తనకి హోమ్‌వర్కు యివ్వనే లేదనో —

యిలా అత్యంత వాస్తవికంగా కనిపించే సాకులు చెప్తాడు. చివరకి అతి ముఖ్యమైన సాకుగా "నాకేమీ నాసి మార్కులు రావడం లేదు!" అని చెప్తాడు.

పిల్లలు అలసిపోయినప్పుడు, స్కూలు చదువు భారం కూర్చుని చదివేందుకు అసామర్థ్యంగా పరిణమించినప్పుడు — యిది సోమరితనంగా పెంపొందే ధోరణి కనిపిస్తుంది. ఇది అతి భయంకరమైనది. సోమరితనానికి అలవాటు తోడైనప్పుడు, అది పిల్లల జీవితకాలం పొడవునా ఒక మహమ్మారిలా వెన్నంటుతుంది. ఎప్పుడో ఒకప్పుడు అలాంటి పిల్లలు పరిశ్రమచేసే పిల్లలతో సాంగత్యంలోకి రాక మానరు. అప్పుడు తమ పెద్దవాళ్ళని, అంటే తల్లితండ్రుల్ని తమకి భయభక్తులు చెప్పి తగినంత శ్రద్ధగా చదివించనందుకు నిందించక మానరు. కాగా ఆ పిల్లలకి యీ విషయం యిప్పుడే చెప్పాలి. ఏ డొంకతిరుగుడూ లేకుండా యిప్పుడే స్పష్టంగా "మిమ్మల్ని ఒత్తిడిచేసి మీచేత పనులు చేయించలేదని మీరు తర్వాత మమ్మల్ని నిందించి ప్రయోజనం లేదు. మీ సోమరితనం మూలంగా మీరు తర్వాత బాధపడటం నాకు యిష్టం లేదు. అందుకే మీరు లేచి పనులు చేసుకోవాలి" అని మీరు చెప్పాలి.

ఈ విషయంలో మీరు సడలింపు చూపకుండా గట్టిగా పట్టుపట్టాలి. జీవితంలో కొన్ని నియమాలు వున్నాయనీ, వాటిని తాము ఎలాంటి మినహాయింపులూ లేకుండా పాటించి తీరాలనీ పిల్లలు తెలుసుకోవాలి. రోజువారీ పని పద్ధతి అన్నది వీటిలో ఒకటి. ఈ ప్రపంచంలో జీవించేందుకూ, తన శక్తిసామర్థ్యాలను సఫలీకృతం చేసుకునేందుకూ ఆహార, నిద్రల మాదిరిగానే శ్రమ కూడా అవసరం. నైతికతతో, రకరకాల ఉత్పాదకతతోనూ, మానవ సంతోషంతోనూ కలిసిన శ్రమ వ్యక్తి సర్వతోముఖ, సమరస అభివృద్ధికి మూలాధారం.

* * *

ఇంతకు ముందు చెప్పినదానికి సమీక్షాప్రాయంగా యీనాటి తల్లితండ్రులు పరిష్కారంకోసం వెతుకుతున్న ఒక సమస్యను నేను తిరిగి ప్రస్తావిస్తున్నాను. ఆధునిక కుటుంబానికి బోధన, మనస్తత్వ శాస్త్రాలకు సంబంధించిన సమాచారమూ, సిఫారసులూ, సూచనలూ, సలహాలూ కొల్లలుగా అందుతున్నాయి: వీటిని ఆధునిక కుటుంబాలు ఎలా వినియోగించుకోవాలి?

తల్లితండ్రులు యీ సమాచార ఉల్బణాన్ని చూసి భయపడకూడదని నా ఉద్దేశం. శాస్త్రీయ బోధన విజ్ఞానం ఎప్పుడూ యితర విజ్ఞాన శాస్త్రాల్లో నేర్చుకున్న అంశాలన్నింటి సంయోగంగా వుంటూవస్తోంది. దాని గుణాత్మక స్థాయి యీ సమీకృత విజ్ఞాన శాస్త్రాల స్థాయిమీద ఆధారపడుతుంది. ఎందుకంటే, యీ ఏకీకరణ ద్వారానే బోధన శాస్త్రం వ్యక్తికీ, మొత్తంగా మానవ జాతికీ అన్వర్తిస్తుంది.

చాలా పుస్తకాల్లోని సిఫారసులతోబాటు బోధకుడి పాత్రలో కనిపించే ఆధునిక మానవుడు ఏదో ఒక విధంగా తన సొంత బోధన శాస్త్రీయ ప్రతిభలను — తన స్వీయ సంస్కృతిని,

వ్యక్తిగత అనుభవాన్ని, వివేకాన్ని — ఉపయోగిస్తాడు. ఇవి లేనిదే బోధన శాస్త్ర కళ ఉండజాలదని ప్రత్యేకించి చెప్పనక్కర్లేదు. ఈ సాహిత్యాన్ని పఠించేటప్పుడు తల్లితండ్రులు తమ జీవితానుభవాన్ని — తమ అనుభవంలోకి వచ్చి, తాము అర్థంచేసుకున్న, కుటుంబపు, సమాజపు పూర్వ చరిత్ర ధ్రువీకరించిన ప్రత్యక్ష జ్ఞానాన్ని — ఎన్నడూ తీసిపారెయ్యకూడదు. ఈ జీవితానుభవం బోధకుడి వ్యక్తిగత బోధన శాస్త్ర లక్షణంతో కూడివుంటుంది. ఇదిగో సరిగ్గా దీన్నే తల్లితండ్రులు విశ్వసించాలి.

ఈ విషయంలో రష్యన్ మహా బోధన శాస్త్రవేత్త కె. ఉషీన్‌స్కీ భావాలు పూర్తిగా సముచితమైనవి. సంప్రదాయాలు, జనంలో ప్రచలితంగా వున్న వివేకమే అత్యుత్తమ బోధకుడని ఆయన ఎప్పుడూ వక్కాణించి చెప్తూండేవాడు. మనం మన తండ్రుల, తల్లుల, తాతల, బామ్మల యీ వివేకాన్ని మన బోధన శాస్త్ర కృషిలో ప్రవేశపెట్టాలి. జనసముదాయ వివేకపు ప్రధానాంశాలు ఏమిటి? శ్రమ, నిజాయితీ, కష్టాలకు కుంగిపోకపోవడం, ఇతరుల సంవేదనల్లో పాలుపంచుకునే సామర్థ్యం — యివన్నీ విశ్వ సంస్కృతికి సంబంధించిన మిక్కిలి గొప్ప విలువలు. ఈ గొప్ప విలువలకి మనం వారసులం.

పాఠకులకు మనవి

ఈ పుస్తకం గురించీ, దీని అనువాదాన్ని గురించీ, కూర్పును గురించీ మీ అభిప్రాయాలను "ప్రగతి" ప్రచురణాలయానికి తెలుపండి.

చిరునామా:

Progress Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR, 119841